FOR PRIVATE CIRCULATION ONLY.

శ్రీ

# శృంగారనైషధము.

మహాకవి శ్రీనాథ ప్రణీతము.

శ్రీయుత రేబాల లక్ష్మీనరసా రెడ్డిగారి

ప్రేరణచే

1806

*****

వేదము - వేంకటరాయశాస్త్రిచేత

సంకషావ్యాఖ్యాసమేతముగా ముద్రితము.

COMPLETE EDITION.

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల

4, మల్లికేశ్వరవీథి, మదరాసు.

1913.

 [వెల రు. 6-0-0

ఉ. వ్రాసితి మున్ ప్రతాపుకథఁ బండితమాన్యుల గుండె సీరుగా;
వ్రాసితి వెన్క నయ్యుషవివాహము సిద్ధ సుధా ప్రవాహము
వేసర కిప్డు నైషధము విప్పి నిధుల్ నెఱచూఱ లిచ్చితిన్;
జేసెద నింకఁ దత్పరత సేవలు చూడి కుడుత్త దేవికిన్.

# విఖ్యాపనము.

ఆంధ్రమహాకవితల్లజుండైన శ్రీనాథామాత్యుని శృంగారనైషధము యొక్క ప్రాశస్త్యమునుగూర్చి గతసంవత్సరారంభములో నెల్లూరిలో శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజాగారి హైస్కూలులో నేను ఉపన్యసించితిని. ఆయుపన్యాసమును వినుటకు విక్రమసింహపురీహారవతంసు లగు

## శ్రీయుత రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు

విజయంచేసి విని తత్ప్రబంధప్రౌఢికి కర మానందించిరి.

అనంతరము మన్మిత్త్రులు శ్రీయుతులు - గునుపాటి యేనాదిరెడ్డిగారును, ఎఱగుడిపాటి వేంకటాచలము పంతులు బి. ఏ., బి. ఎల్. గారును, దొడ్లా వేంకటరామరెడ్డిగారును, తూములూరి శివరామయ్య బి. ఎ., బి. ఎల్. గారును ఆప్రబంధమునకు వ్యాఖ్యానమును సమంజసముద్రణమును నాచేత సమకూర్పింప నుత్సాహము వహించి నన్ను కృతజ్ఞతాబద్ధుం గావించుచు, శ్రీరెడ్డిగారు వారి యుత్సాహమును తామందుకొన్నవారై, ఆమిత్త్రులయుద్దేశ్యమును నెఱవేర్చుటకైన మదీయోద్యమమును ఆకలించి, నిజాస్థానికి నన్ను ఆహ్వానించి గోష్ఠిగావించి, తద్గ్రంథముద్రణాద్యర్థము వలయు సర్వధనమును రూప్యద్విసహస్రీపరిమితమును పరమాదరసత్కారపూర్వకముగా నా కొసంగిరి.

నేనును రెడ్డిగారి యాస్థానియందు ఉత్పన్నమైన మహాప్రబంధమునకు రెడ్డిగారి యాస్థానియందే వ్యాఖ్య యుత్పన్నమగుచున్నది గదా యని పరమాహ్లాదముం జెంది యథామతి ఈ వ్యాఖ్యను రచియించి వారి కందించినాఁడను.

సీ. అంభోనిధి శయాన హర్మ్య దీపార్చి యై
యొందాఁక నా లక్ష్మి యొసఁగుచుండు,
శంభు మాకంద సంసక్త వాసంతి యై
యొందాఁక నాగౌరి యొసఁగుచుండు,
పద్మ జానన పద్మ వన రాజహంసి యై
యొందాఁక న్నా వాణి యొసఁగుచుండు,

ఆదిపూరుష కల్ప కారామ వీథి నైె
యెందాఁక నాత్రేయి యెసఁగు చుండు,

తే. వసుధ నందాఁక రేబాల వంశవార్ధి
సోమ, లక్ష్మీనరసరెడ్డి, సుకృతధామ,
యాయు రారోగ్య భోగ్య భా గ్యాభిరామ,
కీర్తిభామ నినుం గూడి కేరుఁ గాత.

సీ. నీవు నెల్లూరికి నెఱి నిచ్చు పురసౌధ
మచటికే చని కదా యరయవలయు;
నీవు ప్రతిష్ఠించు నెఱ యగ్రహారంబు
లచటికే చని కదా యరయవలయు;
నీవు సేయుచునుండు నిఖి లార్థ సత్త్రంబు
నచటికే చని కదా యరయవలయు;
నీ విచ్చు దేవ భూదేవ మాన్యంబుల
నచటికే చని కదా యరయవలయు;

తే. అత్తెఱంగు గాక నీపొత్త మవనిఁ దిరిగి
నాట బాటను బేటను వీటఁ గోటఁ
దివిరి చాటించు నీకీర్తి డవిణ గొట్టి,
నరస, లక్ష్మీనరస, సాధు సంఘ శిరస.

వేదము వేంకటరాయశాస్త్రి.

# శృంగారనైషధము.

## అవతారిక.

'సంసార విషవృక్షస్య ద్వే ఫలే అమృతోపమే
కావ్యామృతరసాస్వాదః సల్లాపః సజ్జనైః సహ.'
'నైషధం విద్వదౌషధమ్'

అను నాభాణకము జగద్విదితము గదా. మఱి శ్రీనాథుని శృంగారనైషధమునకు మూల మయిన యీ విద్వదౌషధమును రచించిన

### శ్రీహర్ష పండితునిఁగూర్చి ప్రశంసాలేశము.

శ్రీహర్ష కవి మామల్లదేవీ శ్రీహీరపండితుల పుత్త్రుఁ డనియు, కావ్యకుబ్జేశ్వరునివలన తాంబూల ద్వయమును ఆసనమునుం బొందుచుండె ననియు, అతని నైషధమువలననే తెలియుచున్నది. అతని చరితము క్రీ. శ. 1347 వ సంవత్సరమున రాజశేఖరసూరిచే రచింపఁబడిన ప్రబంధకోశమున నిట్లున్నది.—

"వారాణసియందు గోవిందచంద్రుఁ డని రాజు ఏలుచుండెను. అతని కుమారుఁడు విజయచంద్రుఁడు, అతని కుమారుఁడు జయంతచంద్రుఁడు. జయంతచంద్రుఁడు ఏడువందలయోజనముల భూమిని జయించెను. అతనికుమారుఁడు మేఘచంద్రుఁడు. ఆతఁడు మహాజేత. అతనిదాసి గోమతి యనునది ఆఱువదివేల గుఱ్ఱపుఁబౌజును నడపి శత్రుచక్రములం గంపింపఁజేయుచుండెను. జయంత చంద్రుని యాస్థానియందు పలువురు విద్వాంసు లుండిరి. అందు శ్రీహీరుఁ డొక్కఁడు. ఆయనను ఒకప్పుడు రాజసభలో మఱియొకపండితుఁడు ఓడించెను. ఆయవమానముచే శ్రీహీరుఁ డాతనిపై వైర మూని యుండెను.

"మృత్యు వాసన్న మైనప్పుడు శ్రీహీరుఁడు శ్రీహర్షునిఁ జెంతకుం బిలిచి 'వత్సా, ఆపండితునికి నేను రాజుమ్రోల ఓడితిని. ఆదుఃఖము నన్ను బాధించుచున్నది. నాపుత్త్రుఁడవేని, వానిని నీవు రాజసభలో జయింపుము.' అని యాదేశించెను. వల్లెయని శ్రీహర్షుఁడు పలికెను. శ్రీహీరుఁడు స్వర్గస్థుఁ డాయెను. శ్రీహర్షుఁడు పరదేశముల కేఁగి పలువు రొజ్జలకడ త్వరలోనే తర్క వ్యాకరణాలంకార సంగీత గణిత జ్యోతిష మంత్రాది సకల విద్యలను సమగ్రముగ నేర్చెను. సద్గురూపదిష్ట మయిన చింతామణిమంత్రమును గంగాతీరమందు వత్సరకాలము సాధించెను. శారదాదేవి ప్రత్యక్షమై అమోఘవాగాదివరము లొసంగెను. అంతటినుండి ఆతఁడు రాజగోష్ఠులలో మెలంగుచు అలౌకిక ప్రతిభోత్పన్నము లయిన ప్రస్తావములు సేయుచుండెను. వాని నెవ్వరును గ్రహింపఁజాలకుండిరి అంతట లోకగోచరముగాని యయ్యతివిద్యచేత సయితము ఖిన్నుఁడయ్యె, వెండియు భారతీదేవిని ప్రత్యక్షీకరించుకొని 'అమ్మా, అతిప్రజ్ఞయు నాకు చెఱుపే అయినది. ఇతరులకు బోధపడునట్టి వాక్కును నాకిమ్ము.' అని వేఁడెను. దేవి 'అట్టయిన అర్ధరాత్రమున తలను నీటితో తడుపుకొని

పెరుఁగుం ద్రావుము, పిమ్మట నిద్రింపుము, కఫాంశ మవతరించుటచేత నించుక బుద్ధిజాడ్యమును పొందుము.' అని వచించెను. ఆతఁ డట్లే చేసి బోధ్యవాక్కాయెను. ఖండనఖండఖాద్యాది గ్రంథ ములను పరశ్శతములను రచించి కృతార్థుఁ డై కాశికి పోయెను.

" నగరసమీపమందు నిలిచి 'నేను చదివి వచ్చితిని' అని జయంతచంద్రునికి వార్త పంపెను. రాజు గుణస్నేహపరాయణుఁడు హీరుని జయించిన పండితునిం దోడ్కొని చాతుర్వర్ణ్యపౌరజన సమేతుఁ డై పురిచెంతకు ఎదురు వచ్చి శ్రీహర్షునికి నమస్కార మాచరించెను. శ్రీహర్షుఁడు రాజు నిట్లు స్తుతించి, శ్లోకార్థమును వివరించెను.—

' గోవిన్దనన్దనతయా చ వపుఃశ్రియా చ
మాస్మిన్ నృపే కురుత కామధియం తరుణ్యః
అస్త్రీకరోతి జగతాం విజయే స్మరః స్త్రీ
రస్త్రీ జనః పున రనేన విధీయతే స్త్రీ.'

సభవా రెల్ల సంతోషించిరి. అంతట శ్రీహర్ష పండితుఁడు తనతండ్రివైరితో వాదార్థమై హెచ్చ రించెను...అంతలకు ఆ వాది 'దేవా, వాదిసింహమా, భారతీసిద్ధుఁడవు, నీకు సముఁ డెవఁడు? అధికుఁడు లేఁ డని వేఱ చెప్పవలయునా?' అని యుత్తరము చెప్పెను. శ్రీహర్షుఁడు అంతట నిష్కోపుఁ డాయెను. రాజు ఇరువురకును చెలిమిం గావించి శ్రీహర్షుని ఇంటికిఁ గొనిపోయి లక్షల కొలఁది సువర్ణము లిచ్చి నిశ్చింతుం జేసెను.

" ఒకనాఁడు రాజు సభలో శ్రీహర్షుని 'వాదీంద్రుఁడా, ప్రబంధరత్నము నొకదానిని నిర్మిం పుము.' అని యడిగెను. అంతట కవీంద్రుఁడు దివ్యరసంబును మహాగూఢ వ్యంగ్యభావ సమంచితంబు నైన నైషధమహాకావ్యమును రచించి రాజునకు చూపెను. రాజనియె:—'ఈకావ్యము కర ముత్కృష్టముగా నున్నది. మఱి నీవు కాశ్మీరదేశమునకుం బోయి అచటి పండితులకుఁ జూపుము, అచట పీఠమందు సాక్షాత్తుగా వెలసియున్న శారదాదేవిచేత నుంపుము. ఆదేవి తనచేత నుంచిన పొల్లుప్రబంధమును దూరముగా విసరివైచును, సారమును శిరఃకంపసంజ్ఞచే అంగీకరించును, దివి నుండి విరులవాన గురియును గదా.' అని.

" శ్రీహర్షుఁడు కాశ్మీరమునకుం బోయి కబ్బమును పండితులకుం జూపెను, సరస్వతిచేతి యందును ఉంచెను. అంత సరస్వతి ప్రబంధమును విసరివైచెను. శ్రీహర్షుఁ డడిగెను:—' ఏమి? నీకు ముదిమిచే మది దప్పినదా? నా ప్రబంధమును సయితము ఇతరుల ప్రబంధమునుం బోలె తిర స్కరించెదవు?' భారతి పల్కెను:—'ఓయి నీవు ఒరులమర్మమును వెల్లడించువాఁడవు. పదు నొకండవ సర్గలో నన్ను విష్ణుపత్నింగా ప్రకటించి, లోకరూఢ మయిన నా కన్యాత్వమును పోఁగొట్టినవాఁడ వైతివి; మఱచితివా? దానంజేసి నేను నీపుస్తకమును పాఱవైచితిని.' అని. వాగ్దేవిమాటను విని శ్రీహర్షుఁ డనియె:—' నీవు ఒకానొక యవతారమందు నారాయణునిం బతిగా చేసికొంటివి, పురాణములయందు కూడ విష్ణుపత్ని వని చెప్పఁబడియున్నావు. అట్టినీవు నిజము నకు అలిగెదవా? అలిగినం గళంకము తొలంగునా?' అంతట వాగ్దేవి స్వయముగా ఆగ్రంథమును అందుకొని అంగీకరించి, పండితమండలిలో దానిం బొగడెను. అంతట శ్రీహర్షుఁడు ఆ పండితులను ' నాగ్రంథమును మీరాజునకు మాధవసేనునకు చూపుఁడు, ఈగ్రంథము శుద్ధ మని

జయంతచంద్రునకు కమ్మ వ్రాసి యుండు.' అని కోరెను. పండితులు భారతీసమ్మతిని ఎఱింగియు జాబు నియ్యరు, గ్రంథమును రాజునకుం జూపరు. శ్రీహర్షుఁడు పెక్కు నెలలు వేచియుండెను. బత్తెము అయి పోయినది, ఎడ్లను కూడ అమ్ముకొనెను, పరివారము సన్నగిల్లినది.

"ఒకనాఁడు నదీతీరమున గుడిలో బావికడ ఏకాంతమున నాతఁడు రుద్రజపముం గావించుచుండఁగా, వేఱువేఱిండ్లచేటిక లిరువురు బావి నీళ్లకై వచ్చి, తోడుకొనుటలో ముందువెనుకలం గూర్చి చిరము సాంగోపాంగముగా జగడమాడి మొత్తులాడిరి. అనంతరము అయ్యిరువురును రాజకులమునకుం బోయి మొఱ యిడుకొనిరి. రాజు సాక్షిని తెమ్మనెను. 'అచ్చట నొక్క బ్రాహ్మణుఁడు జపము చేసికొనుచున్నాఁడు.' అని చేటికలు విన్నవించిరి. రాజభటులు పోయి శ్రీహర్షుం దోడ్కొని వచ్చిరి. రాజు ఆచేడెల నయానయముల నడుగఁగా, శ్రీహర్షుఁడు గీర్వాణ భాషలో 'దేవా, నేను వైదేశికుఁడను, వీరి దేశభాషను నే నెఱుంగను, వీరినోట వచ్చిన యాశబ్దములను మాత్రము ఎఱుఁగుదును.' అని చెప్పెను. 'అటు లయిన ఆమాటలనే చెప్పుము,' అని రా జడిగెను. వారిమాటలను విన్నవానిని విన్నట్లు సర్వమును శ్రీహర్షుఁడు క్రమము దప్పక అప్పగించెను. అంతట ఆప్రజ్ఞకును ఆధారణకును రాజు ఆశ్చర్యపడి దాసికలకు నిగ్రహానుగ్రహములు న్యాయ్యముగాఁ గావించి, శ్రీహర్షుని 'అయ్యా, నీ వెవరవు? శిరోమణివిగా వర్ధిల్లుము.' అని యడిగెను. శ్రీహర్షుఁడు తనవృత్తాంతముం దెలిపి, 'రాజా, నీ పండితులు గావించిన దౌర్జన్యముచేత నీపురంబునం గష్టపడుచున్నాను.' అని ఎఱింగించెను. అంతట రాజు పండితులను రావించి 'ఓమూర్ఖులారా, ఈమహాత్మునియందు చెలిమి వహింపుఁడు. మీ యొక్కొక్కని యింటికిం గొనిపోయి సత్కరింపుఁడు.' అని యానతిచ్చెను. వా రట్లే కావించి యాతనిని రాజసభకుం దెచ్చి రాజుచేత సత్కరింపించి, ఆతఁడు కోరినలేఖముతో కాశికిం బంపిరి. శ్రీహర్షుఁడు జయంత చంద్రునికి లేఖము నర్పించెను. అతఁడు సంతసించెను. లోకములో నైషధకావ్యము ప్రచారముం బొందెను.

"ఈలోపల జయంతచంద్రుని ప్రధానశ్రేష్ఠుఁడు పద్మాకరుఁ డనువాఁడు అణహిల్లపురమునకుం బోయెను. అట నూరి బయట చెఱువుకడ చాకిరేవులో ఆఱవేసి యున్న చీరపయి మొగలిపూవుమీఁదం బోలె తేంట్లు ముసరుకొని యుండం గాంచి, ఆ వలువం దాల్చు చెలువ పద్మినీజాతి ది యని యూహించి, రజకుని, ఆచీర యెవరిదో ఆమెను తనకుం జూపుమని యడిగెను. రజకుఁడు సాయంకాలమున చీరం గొనిపోయి శాలాపతి యనువాని భార్యకు వితంతువునకు సూహవదేవి యను నామెకు ఇచ్చి, ఆమెను సురూపను యువతిని పద్మాకరునికిం జూపెను. పద్మాకరుఁడు కుమారపాలరాజువలన ఆమెను వశపఱుచుకొని తెచ్చి జయంతచంద్రునికి ఉంపుడుకత్తెం గావించెను. విదుషియు గర్వితురాలు నగుసూహవదేవి 'కలాభారతి' యని ప్రసిద్ధి గాంచెను. శ్రీహర్షుఁడు 'నరభారతి' యని ప్రఖ్యాతుఁడై యుండెను. ఆతని కీర్తిని మత్సరముచేత ఆమె యోర్వకుండెను. ఒకనాఁడు ఆమె సత్కారపూర్వకముగా ఆతనిని రావించి 'నీ వెవరవు?' అని యడిగెను. 'నేను కలాసర్వజ్ఞుఁడను.' అని శ్రీహర్షుఁడు ఉత్తరము చెప్పెను. 'అట్లయిన నాకు పైజారుజోడు కుట్టి తెమ్ము' అని యుంపుడురాణి నుడివెను. భావ మేమనఁగా, చర్మకారకృత్యము గాన, బ్రాహ్మణుఁడయినందున తెలియ దన్నచో అజ్ఞుఁ డగును, చెప్పుకొన్న సర్వజ్ఞత్వము తప్పును, అని. శ్రీహర్షుఁడు అందుల కంగీకరించి ఇంటికేఁగి పోఁకపొత్తులతో ముచ్చెలు కుట్టి సాయంకాలమున తెచ్చి, తిరుగుడు పడుచున్న కన్నులతో దూరముగా నిలిచి, దొరసానిని పిలిచి, మాదిగవాని చొప్పున ముచ్చెలు

తొడిగించెను. 'నీళ్లు చల్లింపుఁడు, నేను మాదిగవాఁడను.' అని చెప్పి వెడలి పోయి, ఆరాణి యొక్క దుచ్చేష్టను రాజున కెఱింగించి సన్న్యసించి గంగాతీరము నాశ్రయించెను."

ఈతనింగూర్చి యీయైతిహ్యముం జెప్పుదురు. — శ్రీమ జ్జగద్గురు శంకరాచార్య శిష్యులు ఈయనతో వాదింపఁబోయినప్పుడు ఈయన పసిఁడిచేరుల తూఁగుటుయ్యాల యూఁగుచుండెను. తమ్ముం గని దిగక మిక్కిలి ఎత్తుగా ఊఁగుచునే యున్నందున, వారు, 'అత్యుచ్ఛ్రియః పతనహేతుః' అని శ్లేషగా అధిక్షేపించిరి. ఇతఁడు 'ధ్రువే అవ్యాప్తిః' అని వచించెను. వారు 'ప్రళయే త స్యాపి పతన సంభవః' అని మాఱు వల్కిరి. అంతనీతఁడు 'తదా సర్వేషాం పతన మేవ' అని వారిని నిరుత్తరులం గావించెను.

ఈయన క్రీ. శ. 12 వ శతాబ్దియం దుండె నని ఏతదాశ్రయుఁ డయిన జయంతచంద్రుని దానశాసనముల కాలమువలనం దేటపడుచున్నది.

రత్నావళీ ప్రియదర్శికా నాగానందకర్త యని పేర్కొనంబడిన శ్రీహర్షుఁడు ఒకానొక రాజని అందలి ప్రస్తావనలయందే యుండుటచేత, అతఁ డితఁడు కాఁడని స్పష్టము ; గ్రంథముల శైలిచేత స్పష్టతరము.

ఈతఁడు స్థైర్యవిచారణము, విజయప్రశస్తి, ఖండన ఖండఖాద్యము, గౌడోర్వీశకులప్రశస్తి, అర్ణవ వర్ణనము, ఛన్దః ప్రశస్తి, శివశక్తి సిద్ధి, నవసాహసాంకచరిత చంపువు, ఇంకనుం బెక్కు గ్రంథములను రచించెను.

ఇట్టి యీమహనీయుని యీనైషధమునకు వ్యాఖ్యాతలు 23 రని గ్రంథములవలన తెలియ వచ్చుచున్నది. అందు నారాయణ మల్లినాథుల వ్యాఖ్యలు ఇప్పుడు ముద్రితములై దొరకుచున్నవి. కడమ వ్యాఖ్యాతలలో శ్రీనాథుఁ డని ఒకఁడు పేర్కొనంబడి యున్నాఁడు. ఆశ్రీనాథుఁడు శృంగారనైషధకారుఁడే ఏమో ? ఇతఁడే అనుటకు ఈ యాంధ్రీకరణాభిమానము కొంత సాధకము; కాని ఇతని గ్రంథములం జెప్పుచో ఇతఁడు గాని ఇతరులు గాని ఆవ్యాఖ్యానముం బేర్కొనమి కొంత బాధకము.

## శ్రీనాథప్రశంస.

---

శ్రీనాథకవి కొండవీటివాఁడు, పాకనాటి నియోగి, భారద్వాజ సగోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, శైవుఁడు, పద్మపురాణ సంగ్రహకర్త యగు పద్మనాభామాత్యుని పౌత్త్రుఁడు, భీమాంబా మారయామాత్యుల యాత్మజుఁడు.

'కర్ణాటదేశ కటక పద్మవనహేళి' — ఆకాలమున కర్ణాటకరాజధాని యైన విద్యానగరమును హరిహరరాయఁడు ఏలుచుండె ననియు శ్రీనాథుఁడు అట కేఁగి యారాజును దర్శించె ననియు కొన్ని నిదర్శనములవలన తెలియనగుచున్నది. 'పద్మ హేళి' యనుటచే ఆరాజునకు ప్రియాగంతుకుఁ డనియు అతనిచేత సత్కృతుఁ డనియు తెలియనయ్యెడిని.

'కల్లా యుంచితి, కోక సుట్టితి, మహాకూర్పాసము న్దొడ్గితిన్,
వెల్లుల్లిన్ దిలపిష్టముల్ బిసికితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ,

* జల్లా యంబలి త్రావితిన్, రుచులు దోసం బంచఁ బోనాడితిన్,
దల్లీ, కన్నడ రాజ్యలక్ష్మి, దయలేదా? నేను శ్రీనాథుఁడన్.'

అను వీథినాటక పద్యములోని మొఱ్ఱచేతను ఇతఁడు కన్నడ రాజధానిలో రాజదర్శనార్థము వచ్చి వేచియున్న వైదేశికుఁడని తెలియ నగుచున్నది. 'లోకజనని' యైన లక్ష్మిని 'తల్లీ' యని సంబోధించుట యభిజన నిశ్చాయకము గానేరదు.—

సీ. 'దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాలఁ,
బలుకుఁదోడై తాంధ్రభాషా మహాకావ్య నైషధగ్రంథ సందర్భమునకుఁ,
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క,
జంద్రచూడక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద,
తే. మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద । రావు సింగమహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు । సరససద్గుణనికురుంబ శారదాంబ.—

సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెనుగదా పురవీథి నెదురెండఁ బొగడదండ,
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా నగరివాకిటనుండు నల్లగుండు,
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ దగిలియుండెనుగదా నిగళయుగము,
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత వియ్యమందెనుగదా వెదురుగొడియ,
తే. కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము । బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు,
బొడ్డుపల్లెను గొడ్డేటి మోస*పోతి । నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు?
సీ. కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి, రత్నాంబరంబు లే రాయఁడిచ్చుఁ?
కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేఁగి, దినవెచ్చ మే రాజు తీర్పఁగలఁడు?
రంభఁ గూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు, కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి, మఱి హేమ పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు?
తే. భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ, । గలియుగంబున నిఁకనుండఁ గష్ట, మనుచు,
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ । నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.'

అను నీ చాటువులచేతను, కాశీఖండములో,

సీ. 'చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర,
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి,
సంతరించితి నిండుజవ్వనంబునయందు హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకునిమహిమఁ,
తే. బ్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ । గాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెద గర్ణాటదేశకటక । పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

సీ. వచియింతు వేములవాడభీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు దిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని త్రోవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు;

తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు । చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ,
యిపుడు చెప్పఁదొడంగినయీప్రబంధ । మంకితము సేయు వీరభద్రయ్యపేర'.—

అను నీపద్యములచేతను, నైషధము 1 ఆ. 12, 13, 14 చేతను, ఇతనిప్రభావము కొంత తెలియును.

ఇతఁడు మరుత్తరాట్చరిత్ర, శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము, శృంగారనైషధము, భీమఖండము, కాశీఖండము, హరవిలాసము, అను గ్రంథములను రచించెను. పల్నాటివీరచరిత్రము పేలవమును సదోషంబును అగుటంబట్టి అది ఇతనిది కాదని కొందఱు వచింతురు. ఇతఁడే దానిని జంగాలును దాసరులును పాడుటకు అనుకూలముగా వీరరసకథారసమాత్రోద్బోధకముగాను తత్ప్రతికూలమయిన సాహిత్యాలంకారపాండిత్యమును అందు చూపకయు రచించియుండఁబోలు ననియు, దోషములు లేఖకాది ప్రమాదజనితములు కానోపు ననియు, కొందఱు తలంతురు. ఇతని దని ప్రకటిత మగు వీథీనాటకము ఇతని దని పలువురు నమ్ముట లేదు.

ఇతఁడు వేంకటగిరిసంస్థానాధిపతులైన సర్వజ్ఞ సింగమనాయనివారిని దర్శించినట్లును, అపుడు నాయనివారు 'గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ' అనుపదములను ఉంచి భాగతార్థము వచ్చునట్లు పద్యము చెప్పు మనఁగా—

తే. 'ఓయి ధృతరాష్ట్ర, నీకొడుకు కుత్తగోల; । కొండవిధ మాలముండఁ గృష్ణుండు కాచి
పాండుసూనుల గెల్పించు నండయగుచు । నురమునను బూలదండ రే కొత్తకుండ.'

అని చెప్పినట్లును ఐతిహ్య మున్నది. ఇతఁడు రాజమహేంద్రపురము నేలిన వేమారెడ్డిగారి యాశ్రితుఁడని కాశీఖండమువలనను, కొండవీటిరెడ్ల యాస్థానకవి యని యితరనిదర్శనములవలనను దెలియనగుచున్నది. వేమారెడ్డిగారితోడి యితని ప్రథమసమావేశముం గూర్చి యీయైతిహ్యముం జెప్పుదురు. రాజును ఈతఁడు

'అనవేమ మహీపాల స్వస్త్యస్తు తవ బాహవే
ఆహవే రిపుదోర్దణ్డ చన్ద్రమణ్డల రాహవే.'

అని యాశీర్వదించెను. వేమమహీపాలుఁడు ఇతనికి 4 వేల వరహాలు ఇమ్మని మంత్రి కానతిచ్చెను. అంతట నీతఁడు 'మే మిచ్చినదే మా కిచ్చుటయందు అతిశయ మేమున్నది?' అని యడిగెను. రెడ్డిగారు 5 వేలు ఇమ్మనిరి. కవి 'దేవుఁడే ఇచ్చియున్నాఁడు, మీ రీయనేల?' అని అయిదు వ్రేళ్లు చూపెను. ప్రభువు 6 వేలు ఇమ్మనెను. ఇతఁడు 'మేము ఆఱువేల నియోగులము కాము' అనెను. ప్రభువు 7 వేలిమ్మనెను. 'రోదనసంఖ్య తగదు' అని కవి యాక్షేపించెను. రెడ్డిగారు 8 వేలాజ్ఞాపించిరి. కవి గ్రహించెను. ఇతఁడు క్రీ. శ. 14 వ శతాబ్దితుదను 15 వ శతాబ్దిపూర్వార్ధమునను ఉండె నని చరిత్రాన్వేషులు తలంచుచున్నారు.

శ్రీనాథుఁడు మహాకవి, సర్వతంత్ర స్వతంత్రుఁడు, నాచన సోముని విధమువాఁడు. పెద్దనగారు మనుచరిత్రలోను ముక్కుతిమ్మనార్యుఁడు 'చిగురువిలుకాని జాతర' పద్యములోను (745 పు. చూ.) శృంగారనైషధ ఫక్కి నవలంబించుట విదితము. ఇతఁడు (1 ఆ. 11) లో 'మృదుమధుర ... కవీశ్వరులును' అనువాక్యముచేత తనకవనము మృదు మధుర మని సూచించినాఁడు.

మ. 'మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూల మై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహా

మహులై సోముఁడు, భాస్కరుండు వెలయింపఁగా, సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.'

అని ఇతనిని ఆంధ్రోక్తిం బ్రోచిన వానినిగా రామరాజభూషణకవి వసుచరిత్రములో ప్రశంసించినాఁడు.

ఇతఁడు భీమేశ్వరపురాణములో

'ప్రౌఢి పరికింప సంస్కృతభాషయండ్రు, । పలుకు నుడికారమున నాంధ్రభాషయండ్రు,
ఎవ్వరే మన్న నండ్రు, నాకేమి కొఱఁత? । నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.'

అని చెప్పుకొనుటం జూడఁగా ఇతఁడు ఆంధ్రసంస్కృతశబ్ద మిశ్రణమందును లాఁతిమెఱుఁగుల యందును కర్ణాటభాషాకావ్య మర్యాదల ననుసరించె నని తోఁచుచున్నది.

ఇతఁడు ప్రాజ్ఞుఁడయ్యును యౌవనమందు కామపరతంత్రుఁడై విశృంఖలవర్తనుఁడుగా నుండెనఁట. నిక్కము పరమేశ్వరున కెఱుక. కవనములలో నన్నెనో ఒక్క శృంగారమేగాక ఎల్ల రసములును ఆయాప్రకరణములందు దీపించుచున్నవి.

మఱియు 'దీనారటంకాలఁ దీర్థమాడినవాఁ' డయ్యును డబ్బు దాఁచికొని లిబ్బికట్టుకొనలేదని యీతనిపద్యములలోనే యగపడుచున్నది. ఆత్మీయాఖండ ప్రతిభా విశ్వాసి యై యీతఁడు కాలపై పరీక్ష్యముల నెదురుచూచికోలేదని తోఁచుచున్నది.

## శృంగారనైషధ విమర్శ లేశము.

శ్రీనాథుఁడు శృంగారనైషధమును రాజమహేంద్రవరము నేలిన వేమారెడ్డి మంత్రి మామిడి సింగనార్యునకు అంకితము చేసెను. ఈసింగనమంత్రిపూర్వులలో చిటిపెద్దన నెల్లూర నేలినట్టు ఆ.22 లోను, 'నెల్లూరి పెదతూర్కన' యని 8 ఆ. 202 లోను కలదు.

ఈయాంధ్రీకరణము ఏతన్మూలమువోలె నారికేళపాకమున నున్నది. ఆంధ్రభారతాదులకన్న మూలమునకు కరము చేరువుగాను, ఇప్పటి సంస్కృతనాటకాంధ్రీకరణములంత చేర్పుగాకయు నున్నది.

"శ్రీనాథుఁడు:—ఇతఁ డొకప్రశస్తకవి. . . . ఇతఁడు వ్రాసినకావ్యములయందు నైషధము శృంగారప్రధానమై యుండుటగాక యీతని యితరకావ్యములకంటె . . . సంస్కృతపద భూయిష్ఠమై ప్రౌఢమై యున్నయది." అని సీతారామాచార్యులవారు.

అలసాని పెద్దనగారి మనుచరిత్రంగూర్చి సీతారామాచార్యాభిప్రాయము.—"పూర్వకవితాధోరణి ననుసరించి యుండుటంజేసి కొన్ని యెడల నైషధ మార్కండేయ పురాణములయందలి వాక్యములకును నిందలి వాక్యములకును సుంత యేనియు భేద మగపడక యుండును."

విద్వ దౌషధము నాంధ్రీకరించుటయందు శ్రీనాథుఁ డవలంబించినపద్ధతిని అతఁడే శృంగారనైషధమున నుపసంహారమందు ఇట్లు వర్ణించినాఁడు.— "మామల్లదేవీనందనుండును...నగు భట్టహర్ష కవీశ్వరుండు కవికులాదృష్టాధ్వ పాంథుం డొనర్చిన నైషధశృంగారకావ్యం బాంధ్రభాషావిశేషంబున నశేష మనీషి హృదయంగమంబుగా ... శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబునం జెప్పఁబడిన యీభాషా

నైషధకావ్యంబు ... ... విలసిల్లు నాచంద్రతారార్కంబు.'' — ఈప్రతిజ్ఞ నీతఁ డెట్లు నిర్వ హించెనో ఇంచుక విమర్శించెద.—

మూ. 'నిపీయ యస్య క్షితిరక్షిణః కథా స్తథాఽద్రియన్తే న బుధా స్సుధా మపి,
నలః సితచ్ఛత్త్రితకీర్తిమణ్డలః స రాశి రాసీ న్మహసాం మహోజ్జ్వలః. 1 - 1
రసైః కథా యస్య సుధావధీరిణీ నలః స భూజాని రభూ ద్గుణాద్భుతః
సువర్ణదణ్డైకసితాతపత్త్రిత జ్వలత్ప్రతాపావళికీర్తిమణ్డలః.' 1 - 2

ఇట మూలకారుఁడు వస్తునిర్దేశమును రెండుమాఱులు కావించినాఁడు. అందులకు మల్లినాథ సూరి సమాధానము వెదక వలసి వచ్చినది. శ్రీనాథుఁడు ఆ బెడద రానీయక (23 పు. 46) ఒకమాఱే వస్తువును నిర్దేశించినాఁడు.

మూ. 'అ ధావలమ్బ్య క్షణ మేకపాదికాం తదా నిదద్రా వుపపల్వలం ఖగః
స తిర్యగావర్జితకన్ధరః శిరః పిధాయ పక్షేణ రతిక్లమాలసః. 1 - 121
సనాళ మాత్మాననిర్జితప్రభం హ్రియా నతం కాఞ్చన మమ్బుజన్మ కిమ్ ?
అబుద్ధ తం విద్రుమదణ్డమణ్డితం స పీత మమ్భఃప్రభుచామర న్ను కిమ్ ?' 1 - 122

(62 పు. 100) ఇందు 'నవప్రసూతి ర్వరటా తపస్వినీ' అను వక్ష్యమాణ శ్లోకోక్తిని విరోధించు నని 'రతిక్లమాలసః' అనువిశేషణమును త్యజించుట లోనగు స్వాతంత్ర్యమును, స్వభావోక్తి సొంపుసెంపును, గాన నగు. 'ఆత్మాననిర్జితప్రభం హ్రియా నతమ్,' అను విశేషణములు అకించిత్కరము లని త్యక్తములుగాఁ దోఁచెడిని.

మూ. 'మదేకపుత్త్రా జననీ జరాతురా, నవప్రసూతి ర్వరటా తపస్వినీ,
గతి స్తయో రేష జన, స్త మర్దయ న్నహో విధే త్వాం కరుణా రుణద్ధి నో.' 1 - 135

(66 పు. 109) ఈ తెనుఁగువిస్తరమందలి రసభావస్వభావోక్తుల నరయవలయును. మఱియు నిందు హంస ముందు భార్యను తలంచుట యను పామరమర్యాద నవలంబింపక తల్లిని తలంచి యేని హృదయమందు కరుణారసము నుత్పాదించుటకై యాత్మసాధుత్వమును తెలుపుకొన్న నేర్పును, రాజును దూరక విధిని దూరిన నేర్పును, పరికింపఁదగును.

(72 పు. 5) గీతార్థము మూలమును మించి యున్నది. స్వభావోక్తి మహితమై యున్నది.

మూ. 'తరు మూరుయుగేన సున్దరీ కిము రమ్భాం పరిణాహినా పరమ్
తరుణీ మపి జిష్ణు రేవ తాం ధనదాపత్యతపఃఫలస్తనీమ్.' 2 - 37

మూలములో (81 పు. 19) 'ధనదాపత్య తపః ఫలస్తనీమ్' అనువిశేషణము రంభానలకూబరులకు మాత్రమే అన్వయించుచున్నది. అట్లే వ్యాఖ్యాతలభావ మై యున్నది. ఈ తెనుంగున అరఁటికింగూడ నన్వయింపవలసినట్లుగా రచితమై బహువచనాంతముగాను ఉన్నది. దానంజేసి అరఁటి పక్షమున దాతల (లేక ధనికుల) బాలుర పూర్వజన్మ తపస్సునకు ఫల మైన స్తనములవంటి ఫలములు గల దానిని అని యర్థము కాఁగలదు.

మూ. 'సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వ మనాయి సా దృశో స్సదసత్సంశయగోచరోదరీ.' 2 - 40

(82, 83 పు. 20, 21) ఇందు శబ్దానుసరణమును. ఇర్థమాఱు నెఱవేర్చికొన్నాఁడు.

మూ. 'విషమో మలయాహిమణ్డలీ విషఫూత్కారమయో మ యోహితః
బత కాలకళత్రదిగ్భవః పవన స్తద్విరహాన లైధసా.' 2 - 57

(89 పు. 32) మూలమున 'కాలకళత్రదిక్' అనఁగా 'దక్షిణపుదిక్కు' అన్న మొగ్గను ప్రథమ పాదముగా విరియించి శృంగారముం బోషించినాఁడు. కళత్ర దిక్కనఁగా కళత్రములవలననుండి యని యర్థముగా చమత్కరించినాఁడు.

మూ. 'అశ్రాన్త శ్రుతిపాఠ పూత రస నావిర్భూత భూరి స్తవా
జిహ్మ బ్రహ్మ ముఖౌఘ విఘ్నిత నవ స్వర్గ క్రియా కేళినా
పూర్వం గాధితనూజ సామిఘటితా ముక్తా ను మన్దాకినీ
యత్ప్రాసాదదుకూలవల్లి రనిలాన్దోళై రఖేల ద్దివి.' 2 - 102

(98 పు. 41) ఇందు శబ్దానుసారమును పరమావధిం బొందెంచినాఁడు. సంస్కృతమూలమును ఉన్నది యున్నట్లుగా యతిప్రాసాదుల కయిన యలంతి మార్పులుమాత్రము చేసికొని తెనుఁగునం బెట్టికొన్న యీ యనువాదమునకు, 'అందు నత్తలో ? యవ్వి యెటుంగ మన్న, నహాహా ! యని నవ్వె బకంబు లన్నియుౝ.' అను న్యాయంబున, కొఱంతఁ బల్కువారుం గలరు.

మూ. 'వృథాఽర్పయన్తీ మపథే పదం త్వాం మరుల్లలత్పల్లవ పాణికమ్పైః
ఆలీవ పశ్య ప్రతిషేధ తీయం కపోతహుంకారగిరా వనాళిః.' 3 - 14

(104 పు. 48) మూలమందలి 'కపోత'మును ఇందు 'వనప్రియ'ముగా మార్చినాఁడు. 'ఆళి' గావున కపోతస్వరమునకన్న కోకిలస్వరమే మే లని యట్లు కావించినట్లు తోఁచెడిని.

మూ. 'సహస్ర పత్త్రాసన పత్త్రిహంస వంశస్య పత్త్రాణి పతత్త్రిణః స్మః,
అస్మాదృశాం చాటువచోమృతాని స్వర్లోకలోకేతర దుర్లభాని. 3 - 16
స్వర్గాపగా హేమమృణాళినీనాం నాళామృణాళాగ్రభుజో భజామః,
అన్నానురూపాం తనురూపబుద్ధిం కార్యం నిదానాద్ధి గుణా నధీతే. 3 - 17
మధ్యే శ్రుతీనాం ప్రతివేశినీనాం సరస్వతీ వాసవతీ ముఖే నః.'

(105 పు. 49) ఈ ఫక్కిక ననుసరించి పెద్దన్నగారు మనుచరిత్రములో 'చిన్ని వెన్నెల కందువెన్ను దన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టు మాకు' ఇత్యాదిసీసమును రచించినారు.

మూ. 'సువర్ణశైలా దవతీర్య తూర్ణం స్వర్వాహినీ వారి కణావకీర్ణైః
తం వీజయామః స్మరకేళిశాలే పక్షై ర్నృపం చామరబద్ధ సఖ్యైః.' 3 - 22

(106 పు. 51) ఇందు 'స్మరకేళికాలే' అనునట్టిరచనను నవలిపోరు తోఁపించున దగుటచే ప్రకృత కార్యవిరుద్ధమై విరస మగు నని 'వైశాఖ వేళలందు' అని మార్చినాఁడు. నలునిఁ గడిందనకుం గల చనవుం దెలుపుకొనుట రెంటను సమానమే.

(107 పు. 52) ఇట మాతృకలో దిక్కులు నదులుగాను, యశస్సు వానియొడ్లను ఒరసికొను చున్నట్లును, వర్ణనము. దుహితృకలో యశస్సే ప్రవాహముగాను దానిగట్లు దిగ్గజగండస్థలకంఖ స్థలములుగాను వర్ణన. ఈమార్పు అత్యంతహృదయంగమ మని చెప్పవలయునా ?

మూ. 'విధిం వధూసృష్టి మపృచ్ఛ మేవ తద్యానయుగ్యో నలకేళియోగ్యామ్,
త్వన్నామవర్ణా ఇవ కర్ణపీతా మయాఽస్య సంక్రీడతి చక్రచక్రే.' 3_50

(110 పు. 58) ఇందలి యుపప్రలోభనోచిత రచనావైదగ్ధిని పరికింపఁ దగును.

మూ. 'త్వచ్చేతసః స్థైర్యవిపర్యయం తు సంభావ్య భావ్యస్మి త మజ్ఞ ఏవ,
లక్ష్యేహి బాలాహృది లోలశీలే దరాపరాద్ధేషు రపి స్మరః స్యాత్.' 3_70

(114 పు. 67) 'అంబుతరంగలోలముల్' అను నుపమ కడుం జతురము, అమూలకము.

మూ. 'మనసి సన్తమివ ప్రియ మీక్షితుం నయనయోః స్పృహయాన్త రుపేతయోః
గ్రహణశక్తి రభూ దిదమీయయో రపి న సమ్ముఖవాస్తుని వస్తుని.' 4_12

(141 పు. 113) ఇందు ప్రథమపాదము తప్ప కడమ యెల్ల శ్రీనాథునికల్పనయే.

మూ. 'త్వ మభిధేహి విధుం సఖి మద్గిరా కి మిద మీదృ గధిక్రియతే త్వయా
న గణితం యది జన్మ పయోనిధౌ హరశిరఃస్థితిభూ రపి విస్మృతా.' 4_50

(154 పు. 129) ద్వితీయతృతీయపాదములు శ్రీనాథుని స్వతంత్రరచన.

మూ. 'అన్తఃసన్తోషబాష్పైః స్థగయతి న దృశౌ స్తాభి రాకర్ణయిష్యన్,
నాఙ్గే నానస్తిలోమ్నా రచయతి పులకశ్రేణి మానన్దకన్దామ్,
న క్షోణీభఙ్గభీరుః కలయతి చ శిరఃకమ్పనం, తన్న విద్మః
శృణ్వన్నేతస్య కీర్తీః కథ మురగపతిః ప్రీతి మావిష్కరోతి.' 12_39

(437 పు. 137) ఇచట చతుర్థపాద మించుమించుగా శ్రీనాథునికల్పన.

మూ. 'అస్తివామ్యభర మస్తికౌతుకం సాస్తిఘర్మజల మస్తివేపథు
అస్తిభీతి రత మస్తివాఞ్ఛితం ప్రాప దస్తిసుఖ మస్తిపీడనమ్.' 18_62

(626 పు. 177) దీనికి పెంపు. ఇది వరువడిగా 'సహసానఖంపచ' సీసమును పెద్దనగారు రచించిరి. అది వరువడిగా బిల్హణీయకారుఁడు ఒకసీసము రచించెను గాని నేర్పు చాల లేదు.

(722 పు. 154) ఇందు 'తలఁకు' 'నవీన' అని మూలాధికము లయిన పదములచే మూలమునకు ప్రాణము పోసినాఁడు.

మూ. 'అస్తాచలేఽస్మి న్నికషోపలాభే సంధ్యాకషోల్లేఖపరీక్షితో యః
విక్రీయ తం హేళిహిరణ్యపిణ్డం తారావరాటా నియ మాదిత ద్యౌః.' 22_13

(725 పు. 159) మూలములో 'ద్యౌః' అను స్త్రీలింగముచే మూఢురా లని ధ్వనితము. అది యిట 'వేడుక' గా మార్పఁబడినది. మార్పుచే తారల బహుత్వము ధ్వనితము. మూఢురాలికి బదులు ఛాందసుని బ్రహ్మను పెట్టినాఁడు.

(726, పు. 161) ఇదంతయు శ్రీనాథుని కల్పన.

మూ. 'పూరం విధు ర్వర్ధయితుం పయోధేః శఙ్కేఽయ మేణాఙ్కమణీః కియన్తి!
పయాంసి దోగ్ధి ప్రియవిప్రయోగే సశోక కోకీ నయనే కియన్తి!' 22_61

(730 పు. 168) ఇందు తొలి రెండుపాదములు దక్క శేష మెల్ల శ్రీనాథునికల్పన.

మూ. 'పశ్యోచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే తత్కాలికుల్యాఽమ్బుని బిమ్బ మిన్దోః
చిరం నిమజ్జ్యైష సతః ప్రియస్య భ్రమేణ య చ్చుమ్బతి రాజహంసీ.' 22_122

(741 పు. 191) ఇందు 'గగన మధ్యోపస్థితుణ్' అనువిశేషణము శ్రీనాథుఁడు మూలమునకుఁ బోసినప్రాణము గగనమధ్యోపస్థితుఁడు గానిచోఁ బ్రతిబింబము చుంబనమునకు అందదు.

శ్రీనాథుఁడు విడిచిపెట్టినవి కొన్ని.

మూ. 'అస్మి త్కిల శ్రోత్రసుధాం విధాయ రమ్భా చిరం భా మతులాం నలస్య
తత్రానురక్తా త మనాప్య భేజే తన్నామగన్ధా న్నలకూబరం సా.' 3_26

(108 పు. 54) ఇట అయిదింట నీ యొకటిని మాత్రము రంభను గుఱించినదానిని తెనిఁగించి, అనౌచిత్యభీతిచే కడమ నాల్గింటిని ఆంధ్రీకరింపలేదు. వానియందు నలునిమీఁది శచీ సతీ వాణీ లక్ష్ముల చాపలమును మూలకారుఁడు సూచించినాఁడు. అందొకటి యుదాహరణార్థము.—

'సాఽపీశ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్ ప్రసహ్య చేతో హరతోఽర్ధశమ్భుః
అభూ దపర్ణాఽఙ్గులిరుద్ధకర్ణా కదా న కణ్డూయనకైతవేన.' 3_29

రెండవది అశక్య మగుకతన నీక్రింది రెండింటిని ఆంధ్రీకరింపలేదు.

'పర్యఙ్కతాపన్న సరస్వదఙ్కాం లఙ్కాం పురీ మ ప్యభిలాషి చిత్తమ్
కుత్రాపిచే ద్వస్తుని తే ప్రయాతి, త దప్యవేహి స్వశయే శయాళు. 3_66
ఇ తీరితా పత్త్రిరథేన తేన హ్రీణా చ హృష్టా చ బభాణ భైమీ,
చేతో నలఙ్కామయతే మదీయం నాన్యత్ర కుత్రాపి చ సాభిలాషమ్.' 3_67

అయి దర్థములు గల యీ శ్లోకమును తెలిఁగింపలేదు.

'దేవః పతి ర్విదుషి నైషధరాజగత్యా నిర్ణీయతే న కిము న వ్రియతే భవత్యా, 13_34
నాయ న్నలః ఖలు త వాతి మహా నలాభో, య ద్యేన ముజ్ఝసి వరః కతరః పున స్తే?

ఏలొకో ఈక్రింది రెంటిని ఆంధ్రీకరింపలేదు.

మూ. 'కన్యాన్తఃపురశోధనాయ యదధీకారా న్న దోషా నృపం
ద్వౌ మన్త్రిప్రవర శ్చ తుల్య మగదఙ్కార శ్చ తా వూచతుః.—
దేవాకర్ణయ సుశ్రుతేన చరక స్యోక్తేన జానేఽఖిలం
స్యా దస్యా నలదం వినా న దళనే తాపస్య కోఽపి క్షమః.' 4_116

'శ్వ స్తస్యాః ప్రియ మాప్తు ముద్ధురధియో ధారాః సృజన్త్యా ముహుః
స్రోతస్న్రమకపోలపాళిపులకై ర్వేతస్వతీ ర్యక్షుణః,
చత్వారః ప్రహరాః స్మరార్తిభి రభూ త్సా యత్ర సా దుఃక్షపా,
త త్తస్యాం కృపయాఽఖిలేవ విధినా రాత్రి స్త్రియామా కృతా.' 10_158

662 పు. 27, 663 పు. 28, 666 పు. 29 యు మఱికొన్నియు అనూలక ప్రాయములు కలవు.

లక్షణానుసరణము.

ఇతఁడు లక్షణసేతూల్లంఘనప్రవణుఁడు గాఁడు. అఖండయతి, రేఫఱకారసాంకర్యము, క్త్వార్థకేకారసంధి, ముత్తున చాపు పత్వము, రామి, కొట్టుక తిట్టుక అనురీతిని కొనికి కాదేశమును, నైషధమందు లేవు. ఇ త్త్వసంధ్యాభాసములలో కొన్ని యచ్చుదప్పులు, ఇతరములకు సమాధానము

వ్యాఖ్యలో వ్రాయఁబడినది. సార్ధబిందుక నిరర్ధబిందుక ప్రాసము ఒకచో (7 ఆ. 42) గానఁబడు చున్నది. కాని 'చీఁకటి శబ్దము' సార్ధబిందుక మని పండితులు కొందఱు అంగీకరించుట లేదు.

అఖండయతి భ్రమ.—(64 పు. 102) లో తృతీయపాదమును అఖండయతిప్రియులు కొందఱు మార్చికొని ప్రమాణీకరించికొనిరి.

మూ. 'నిధాయ మూర్తిం కపటేన వామనీం స్వయం బలిధ్వంసివిడమ్బినీ మయమ్

ఉపేతపార్శ్వశ్చరణేన మౌనినా నృపః పతఙ్గం సమధత్త పాణినా.'

'ఉపేతపార్శ్వః చరణేన మౌనినా' అను మూలమునకు 'నడిచి పట్టె' అను ననుకూల పాఠము ఒక ప్రాఁతవ్రాఁతప్రతియందున్నది. 'సమధత్త'యందలి యుపసర్గ యొక్క ప్రయోజనము 'ద్వయ' శబ్దముచే ఘటించినది.

'పరిత్రుటత్సదా । సారవసారవార్మిభవసారవరాంబుపృషత్కదంబముల్.'

అనుభాగములో అఖండయతి భ్రమ వలవదు వ్యా. చూ.

కుషష్ఠికి పూర్వము ఉత్తునకు నగాగమము ఇందు కొన్నిచోట్ల లేదు.

## సర్వంకషావ్యాఖ్య.

ఈగ్రంథములో పదములను విడఁబఱిచి ముద్రించితిని; వాక్యావాంతరవాక్యాదిచిహ్నములను సమకూర్చితిని, స్థూలాంకములతో సంస్కృతనైషధసర్గల శ్లోకములను సూచించితిని.

ఈవ్యాఖ్యను రచియించుటకై పూర్వముద్రణములో ఇంచుమించుగా 2000 తప్పులను దిద్ద వలసి వచ్చినది. అందు రమారమి 1100 అనుబంధమున సూచించియున్నాఁడను. దిద్దుటకు ఊహయు సంస్కృతమూలంబును అలవడిన తాళపత్త్రిపుస్తకంబులును కావ్యాంతర సంవాదాదికంబులును సాధనములు. వ్యాఖ్య రచించుటకన్న పాఠనిర్ణయము చేసికొనుట కడు నెక్కుడు పని యైనది. పెద్దలకు పరితోషార్థమును పరీక్షార్థమును విద్యార్థులకు బోధనార్థమును సవరణల కెల్ల ఉపపత్తిని చూపితిని. అంతియగాక ఎల్లవారును తమతమ యిచ్చమెయి పాఠస్వీకరణము చేసికొందురు గాక యని పూర్వపాఠములను అచ్చుఁదప్పు లని నాతలఁచినవానిని సయితము వ్యాఖ్యలోను అనుబంధముల లోను చూపినాఁడను.

తప్పులకును దిద్దుపాట్లకును ఒకచిన్నియుదాహరణ మొసంగెద. బల్లారిలో కవిపండిత సంఘసమ్మేళనములో విద్వద్గోష్ఠిలో పండితు లొకరు గుత్తినుండివచ్చిన యాచార్యులుగారు అర్థము వచింపుఁ డని కడమపండితుల మ్రోల (435 పు. 135)పద్యమును అప్పటికి బజాఱుపుస్తకములో నున్న పాఠమును పఠించిరి. ఆపాఠము - పూర్వార్ధము -

'రతిక్రీడా హంస మోహ గ్రహణ శశి భృశ ప్రార్థ నోన్నిద్ర తారా

పతి యై దుఃఖించు సత్యప్రస్రుమరనిజదృగ్బాష్పధారాగతుండుం'

ఇతరు లందఱును దీనిని త్యజించినంతట శ్రీ దండిగుంట సూర్యనారాయణశాస్త్రులు నన్నడుగుఁ డని యాపండితులను హెచ్చరింపఁగా వారు నన్నడిగిరి. నే నంతట ఆయాచార్యులుగారివలన ఒకసారి పద్యమును విని, మఱియొకమాఱు అప్పగించి సరిచూచుకొని, ప్రకరణాదిజ్ఞానమును గ్రంథోప లబ్ధియు లేక ఊహామాత్రముచే 'రతిఁగ్రీడా' అనిసవరించి యర్థము చెప్పం దొడంగితిని. ఆచార్యులు గారు "స్థితస్య గతి శ్చిన్తనీయా" అని సవరణను ఆఁపఁజూచిరి. 'సవరింపక యే యర్థము సమకూడదు

గ్రహింతిము, ప్రకృతము సవరించి వివరించెద, వినుఁడు' అని నే నడుగఁగా, అందఱు నంగీకరించిరి. అంతట 'రతిక్రీడా,' 'గ్రహాణ,' 'శశి,' 'ప్రార్థనో,' 'సత్య,' 'తుండుఙ' అనునక్షరములను క్రమముగా 'రతిఁగ్రీడా,' 'గ్రహిళ,' 'శిశు,' 'ప్రార్థితో,' 'సద్యః,' 'తేందు' అని మార్చుచు అర్థము వాక్రుచ్చితిని. క్రమక్రమముగా సవరణలకు ఎల్లరు అభిముఖులై 'సద్యః' అనుసవరణ వినఁగానే 'వితండావాదమదవేదండకంఠీరవ' కావ్యకర్తలు రాజమహేంద్రవరమునుండి ఆసంఘమునకు వచ్చిన శ్రీ చిలంబి ఆదినారాయణప్పనాయఁడుగారు బళిబళి యని సాధువాదముం బలికిరి. అంతట ఎల్ల వారును సవరణలు సరి యని యలరి, సద్యఃస్ఫూర్తితో నన్ని సవరణలు ఒక్కుమ్మడిం గావించి యర్థవల్లిని కొనసాగించినందులకు అభినందించిరి. ఇందులకు ఆ సూర్యనారాయణశాస్త్రిగారును శ్రీ కోవూరి సుబ్బరామయ్యగారును పూండ్ల రామకృష్ణయ్యగారును ఇంక ననేకులును సాక్షులు. పిమ్మట మదరాసుచేరి ఆపద్యమునకు మూలమైన యీక్రింది సంస్కృతనైషధశ్లోకమునకు ఆసవరణలు సరిపడుటం గని సంతసించితిని.—

మూ. 'ఏతద్భీతారినారీ గిరిబిలవిగళద్వాసరా నిస్సరన్తీ  
స్వక్రీడాహంస మోహా గ్రహిళ శిశు భృశ ప్రార్థితోన్నిద్రచన్ద్రా  
ఆక్రన్ద ద్భూరి య త్ర స్న యనజలమిళ చ్చన్ద్రహంసానుబిమ్బ  
ప్రత్యాసత్తి ప్రహృష్య త్తనయవిహసితై రాశ్వసీ న్న శ్వసీ చ్చ.' 12_28

సవరణలను తత్ప్రసక్తిని ఎఱుంగమిచేతనేని వేఱుకారణముననేని క్రించులు డించి పలుకుదురని యెంచి ప్రామాణికులకొఱకు ఉక్తబల్లారిసభావృత్తాంతమును విన్నవించుకొంటిని.

నాకు దొరకిన వ్రాఁతప్రతులలో శ్రేష్ఠ మయినవియు పరస్పరము భేదములు కలవియు రెండు. ఒకటి శ్రీ శ్రీ పి ఠా పు ర ము రా జా గారు నాకు ఎరవు దయచేసినారు. రెండవది నెల్లూరుజిల్లాలో శ్రీ వ ర గ లి రం గా రె డ్డి గా రి యొద్దనుండి శ్రీ కో వూ రి సు బ్బ రా మ య్య గా రు నాకుం దెప్పించి యిచ్చినారు. ఈరెంటివలనను నాకు కరము ఉపకారమయినది. ఇవి సవరణలు నేను చేసికొన్న యనంతరము దొరకినవి. వీనికి నాసవరణలు పెక్కులు సరిపడినవి. కొన్ని సవరణలు వీనివలననే చేయఁబడినవి. ఈవ్రాఁతపుస్తకములను నాకు పెక్కు నెలలు ఎర విచ్చినందులకు పై మువ్వురకును నా కృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను.

వ్యాఖ్యానములో నిఘంట్వాది ప్రమాణములను కొన్నిటిని విద్యార్థుల సౌకర్యముకై మరల మరల నుదాహరించితిని.

ఆంధ్రశారదకును శ్రీనాథమహాకవికీర్తికిని నేను జేసికొన్న యీ యూడిగమును సమగ్రముగా నవధరింప నవకాశము లేని పెద్దలు ఈక్రింది కతిపయపద్యముల వ్యాఖ్య నేనియు పాఠాంతర పూర్వముద్రణదోష సమాకలన పూర్వకముగా చిత్తగించి నన్ను ధన్యుం గావింతురుగావుత మని విన్నవించుకొను చున్నాఁడను.—

| పుట. | పద్యము. | ముఖ్యపదములు. | పుట. | పద్యము. | ముఖ్యపదము. | పుట. | పద్యము. | ముఖ్యపదము. |
|---|---|---|---|---|---|---|---|---|
| 10 | 16 | పట్టర్క | 145 | 118 | ... | 177 | 25 | గరంబుగ |
| 98 | 42 | ... | 154 | 129 | సవభుగ్ | 216 | 101 | జోగు |
| 107 | 52 | కూలములతో | 170 | 9 | వీరకరీశ | 334 | 83 | రసౌరస |
| 183 | 97 | ... | 172 | 14 | నాఘదలు | 355 | 135 | యమకంబు |

| పుట. | పద్యము. | ముఖ్యపదము. | పుట. | పద్యము. | ముఖ్యపదము. | పుట. | పద్యము. | ముఖ్యపదము. |
|---|---|---|---|---|---|---|---|---|
| 397 | 66 | ఫాణిత | 576 | 79 | క్షౌద్ర | 658 | 19 | ... |
| 401 | 77 | జగంబు | 580 | 86 | ... | 663 | 28 | మేథీ |
| 417 | 104 | శిరాకాండ | | 87 | ... | 706 | 128 | హృన్మోహ |
| 431 | 125 | మార్తురకని | 591 | 111 | ... | 710 | 132 | కర్పూరి |
| 467 | 182 | వ్యాఖ్య | 592 | 114 | ... | 717 | 146 | నినంసా |
| 489 | 38 | గన్నెరాకమ్ము | 604 | 132 | ... | 720 | 153 | గ్రామటికా |
| 520 | 99 | కేళిఁగేళి | 610 | 146 | ధ్రువలు | 741 | 191 | నిజాధినాథు |
| 527 | 144 | మేఁకమేఁకన | 619 | 164 | తళిమ | 744 | 196 | హార్యక్షీ |
| 536 | 136 | వశస్తోక | 628 | 182 | నబల | 574 | 198 | ... |
| 574 | 76 | బండికిఁ | 644 | 6 | ... | 749 | 201 | చేఁదుమందు |

మఱికొంచెము తీఱుపాటున్నచో పండితవరేణ్యులు ఈక్రింది పద్యముల వ్యాఖ్యం గూడ పైవానింబోలె పూర్వముద్రణపాఠాది సమేతముగా పరికింతురుగావుత మని కోరుచున్నాను:—

1 ఆ. 2, 59, 76, 100.

2 ఆ. 5, 12, 30, 31, 94, 103, 112, 128.

3 ఆ. 10, 63, 68, 88, 130, 154, 165, 173, 176, 185, 193, 197, 202, 205.

4 ఆ. 13, 25, 35, 40, 45, 60, 62.

5 ఆ. 64, 67, 96, 119, 120, 149, 180.

6 ఆ. 6, 30, 50, 51, 55, 67, 77, 92, 133, 141.

7 ఆ. 11, 19, 30, 41, 54, 70, 73, 81, 85, 93, 114, 123, 124, 125, 129, 177, 183, 186, 193, 196, 197.

8 ఆ. 3, 11, 14, 24, 30, 111, 113, 138, 141, 150, 158, 160, 163, 168, 180, 181, 194.

ఈవ్యాఖ్యలో మదీయాజ్ఞతాప్రమాదాదివశంబునం బొసంగిన దోసంగులను సరసులు సవరించి నన్ను మన్నింతురుగాక యని నాప్రార్థన.

# శృంగారనైషధము.

## వ్యాఖ్యయందు ఉద్ధరింపఁబడిన గ్రంథములు.

---

అగ్ని పురాణము
అజయనిఘంటువు
అనర్ఘరాఘవనాటకము
అప్పకవీయము
అభిధానరత్నమాల
అమరకోశము
,, పై భరత వ్యాఖ్య
,, క్షీరస్వామి ,,
,, రామాశ్రమి ,,
10 అమరుకము
అలంకారసారసంగ్రహము
అశ్వశాస్త్రము
ఆంధ్రభారతము
ఆంధ్రశబ్దచింతామణి
ఆఖ్యాతచంద్రిక
ఆగమము
ఆముక్తమాల్యద
ఆర్యాసప్తశతి
ఉత్తరరామచరితనాటకము
20 ఉషానాటకము
ఋతుసంహారము
కంసవధనాటకము
కమలినీకలహంసిక
కర్ణసుందరి
కర్ణాటకభారతము
కర్పూరమంజరి
కల్కిపురాణము
కవికల్పద్రుమము
కవికల్పలత
30 కాదంబరి
కామందకము
కాళికాపురాణము
కావ్యకల్పలత
కావ్యప్రకాశము
కావ్యాదర్శము
కావ్యానుశాసనము
కావ్యాలంకారచూడామణి
కావ్యాలంకారసూత్రము
కాశీఖండము
40 కుమారసంభవము
కువలయానందము
కూర్మపురాణము
కెన్నెడీగారి మరాటీనిఘంటువు
గరుడపురాణము
గాథాసప్తశతి
గీతగోవిందము
గురుబాలప్రబోధిక
ఘటకర్పరకావ్యము
చంద్రాలోకము
50 చాణక్యనీతిశాస్త్రము
జటాధరనిఘంటువు
జానకీహరణము
జ్యోతిశ్శాస్త్రము
తర్కకౌముది
తర్కభాష
తార్కికరక్ష
త్రికాండశేషము
దశకుమారచరితము
దేవీపురాణము
60 ధరణి
ధాతుపాఠము
నరసభూపాలీయము
నాగానందనాటకము
నాటవాటప్రహసనము
నానార్థరత్నమాల
నారదీయము
నారసింహపురాణము
నైషధము
,, పై మల్లినాథ వ్యాఖ్య
70 ,, నారాయణ ,,
పంచతంత్రము
పంచబ్రహ్మోపనిషత్తు
పతంజలిచరితము
పతాక
పరాశరవచనము
,, స్మృతి
పద్మపురాణము
పాతంజలయోగసూత్రవృత్తి
పారిజాతాపహరణము
80 పురుషసూక్తము
పుష్పబాణవిలాసము
ప్రతాపరుద్రీయము
,, నాటకము
ప్రియదర్శిక
ప్రౌఢవ్యాకరణము
ఫజ్ లిఅలీగారి పారసీనిఘంటువు
బాలభారతము
బాలరామాయణ నాటకము
బాలవ్యాకరణము
90 బిల్హణీయము (సం॥)
బృహత్సంహిత
బోధాయనస్మృతి
బ్రహ్మవైవర్తము
బ్రౌణ్యనిఘంటువు
భగవద్గీత
,, పై శ్రీధరస్వామిటీక

భట్టికావ్యము
భరతసూత్రము
భర్తృహరిసుభాషితము
100 భాగవతము(సంస్కృతము)
,, పై శ్రీధరీయము
భారవి
భావప్రకాశము
భోజచంపువు
భోజప్రబంధము
మంత్రప్రశ్నము
,, పైహారదత్తభాష్యము
మత్స్యపురాణము
మదనపాలనిఘంటువు
110 మనుచరిత్ర
మనుస్మృతి
మల్లికామారుతము
మహానాటకము
మహాభారతము (సం.)
మహావీరచరిత
మహాసంకల్పము
మాఘకావ్యము [ము)
మాధవి (రాధాకాంతధృత
మార్కండేయపురాణము
120 మాలతీమాధవము
మాళవికాగ్నిమిత్త్రము
ముద్రారాక్షసము
ముహూర్తదీపిక
మృచ్ఛకటి
మేఘసందేశము
మేదినీనిఘంటువు
మోల్సువోర్తుగారి మరాటీ
నిఘంటువు
యాదవనిఘంటువు
యామళము
130 యుక్తికల్పతరువు
రంభామంజరి
రఘువంశము
,, పై చారిత్రవర్ధనవ్యా.
రతిరహస్యము
రత్నపరీక్ష
రత్నావళి
రభసనిఘంటువు
రసగంగాధరము
రసమంజరి
140 రాజనిఘంటువు
రాధాకాంతీయము
రామరహస్యోపనిషత్తు
రామాయణము (సం.)
లటకమేళకము
లీలావతి
లోచనము (అభినవగుప్తుని)
వసిష్ఠస్మృతి
వసుచరిత్ర
వాగ్భటము
150 వాచస్పతి
వాత్స్యాయనశాస్త్రము
విక్రమాంకదేవచరితము
విక్రమార్కచరిత(జక్కన)
విక్రమోర్వశీయము
విద్వన్మోదతరంగిణి
విశ్వగుణాదర్శము
విశ్వప్రకాశనిఘంటువు
విష్ణుపురాణము
వేమనపద్యములు
160 వైకృతదీపిక
వైజయంతీనిఘంటువు
వ్యాసవచనము
శబ్దరత్నాకరము [ధృతము)
శబ్దరత్నావళి (రాధాకాంత
శబ్దార్థచింతామణి (తాటి
కొండ తిమ్మారెడ్డిగారి)
శాకుంతలము (సం.)
శార్ఙ్గధరపద్ధతి
శాశ్వతనిఘంటువు
శుక్రనీతిసారము
170 శృంగారదీపిక
శ్రుతి
సంగీతదామోదరము
,, రత్నాకరము
సరస్వతీకంఠాభరణము
సర్వదర్శనసంగ్రహము
సాహిత్యదర్పణము
,, రత్నాకరము
సుభాషితావళి
సూర్యసిద్ధాంతము
180 సౌందర్యలహరి
స్కాందపురాణము
హమ్మీరవిజయము
హరివంశము
హర్షచరితము
హలాయుధనిఘంటువు
హరిశ్చంద్రద్విపద
హారావళి
హితోపదేశము
హేమచంద్రనిఘంటువు
190 ,, దేశీనామమాల

[ఇంకనుం గొన్ని గ్రంథములనుండి యుదాహరణములు కలవు]

# శృంగారనైషధము.

## శుద్ధిపత్రిము.

[ఈతప్పులను పుస్తకములో ముందుగా దిద్దుకొనుట మంచిది.]

| పుట. | పద్యము. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 18 | 35 | చిచిత్త | చిత్త |
| 21 | 40(వ్యా.) | భామా | సలలిత=శృంగారచేష్టలుగల - భామా |
| 43 | 78 (7) | సాయంతన | సాయం |
| 57 | 97 (3) | వాజ్యంబున | వ్యాజంబున |
| 62 | 100 | వికలిత | విలులిత |
| | | (వ్యా.)విక... | విలు... |
| | | వికలిత | విలులిత |
| 65 | 106 | బొంతిది | బొందితి |
| 70 | గద్యము. | శ్రీనాథభట్ట | శ్రీనాథ |
| 72 | 5 | విదిర్చు | విదుర్చు |
| 93 | 37 (*a*) | సంచారరం | సంచారం |
| 107 | 52(వ్యా.) | కుంభ | గండస్థలకుంభ |
| 112 | 63 | పబ...బును | దుర్ల...బును |
| | | దుర్ల...బును | ప్రబ...బును |
| 117 | 74 | పందంబు | పదంబు |
| 120 | 81 | సేని యుఖుగో | సేనియు ఖగో |
| 128 | 90 | ఁదగ | వెడ |
| 134 | 99 | నించె | నూన్చె |
| 136 | 101 | విక్షేప | విక్షేపభేద |
| 141 | 113 | ముసరు | మొకరి |
| 146 | 119 | ఊఁగఁబాఱె | ఊఁగఁబాఱెఁ |
| | | సోఁకినఁ బలు | వెక్కన పలు |
| 148 | 120 | దళపలాశ | దళ |
| 155 | 130(వ్యా.) | సమనః | సుమనః |
| 159 | 138(వ్యా.) | చిచ్చియు | చచ్చియు |
| 162 | 141(వ్యా.) | కొరకో | కోరకో |
| 164 | 145(వ్యా.) | 'స్యాజలాప | 'స్యొజ్జలాప |
| 169 | 6(వ్యా.) | చొత్పెంచెక్ | చొత్తెంచెక్ |
| 170 | 9(వ్యా.) | శ్టిష్ట | శ్లిష్ట |
| | 10 | గవింపగ | గవింపఁగ |
| 174. | 18 | ప్రార్థివ | పార్థివ |

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 177 | 25 | హూతికేలి | కేలిహూతి |
| 180 | 32(వ్యా.) | విరసి | విసరి |
| 192 | 57(వ్యా.) | మననస్తం | మనస్తం |
| 195 | 66(వ్యా.) | యుక్తై | యుక్తే |
| 205 | 82(వ్యా.) | అదృశ్య | అదృశ్యు |
| 208 | 88(వ్యా.) | అవేశ | ఆవేశ |
| | 89 | నేత్రి | నేత్ర |
| 210 | 93 | బాటు | బాటి |
| 220 | 108 | బాటలం | పాటలం |
| 224 | 116 | మదిఁబొంగ | మతిపొంగ |
| 240 | 140 | సోఁగ | సోగ |
| 256 | 165 | బహిస్త్వక్ | దళత్వక్ |
| | | కలాపంబులో | కలాపంబుతో |
| 262 | 173 | నవ్వుతో | నవ్వులో |
| 282 | 202 | భంబుఁబొందె | భంబునొందెఁ |
| | | పవడంబు | బవడంబు |
| | | ఉత్తవ | ఉత్తమ |
| 292 | 5(వ్యా.) | అస్తసోయం | అస్తస్తోయం |
| | | మాక్షిలిః | మాఝిలిః |
| 293 | 8 | గృత్తార్థుల | గృత్తార్ధల |
| 296 | 12 | మానోత్కర్షా | మానోత్కర్షా |
| 337 | 87(వ్యా.) | వల్లవ | పల్లవ |
| 341 | 96 | దేవతలకు | దేవపతికి |
| | 97 | అంతకయ | అంతకుని |
| | (వ్యా.) | ,, | ,, |
| 347 | 117 | వేకాతంబున | వేకాంతంబున |
| | 119 | చుండిరి. | చుండె. |
| 349 | 125 | సమ్మరములఁ | సమ్మర్దమున |
| | (వ్యా.) | వెను...లక్ | వెను...నక్ |
| 351 | 130 | నేగుదెంచి | నేఁగుదెంచి |
| 357 | 138(*b*) | నిష్పాదక | నిష్పాదకం |
| 367 | 8 (వ్యా.) | యానంబునక్ | యాన |
| 368 | 9 | చిత్తమిడిచి | చిట్టమిడిచి |

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 378 | 29 | బులంచు | బులకించె |
| 387 | 50 | కాంతి | తనుకాంతి |
| 395 | 63 | వేష్టి | వేష్ట |
| 404 | 82 | పట్లను | పట్టుల |
| | (వ్యా.) | ట్లజ్ | ట్టులజ్ |
| 412 | 96 (వ్యా.) | మ.అ. | అమ. |
| 426 | 119 | యరిఁగి | యరిగి |
| 431 | 125 | యాతని | యీతని |
| 433 | 126 | కలవాల | కరవాల |
| 437 | 137(వ్యా.) | బారతర | దాగతర |
| 448 | 155(వ్యా.) | ముఖ్య...యశ్వ | అశ్వ |
| 456 | 161 | బహిర్నిగ్గ | బహిర్నిర్గ |
| 489 | 38 | కిచ్చె | కిచ్చి |
| 505 | 69 | భూపాల | దిక్పాల |
| 508 | 73 | యద్దివికి | తా దివికి |
| | | బోయినం | బోయెనేఁ |
| 519 | 94 | మోళిపుఁగటా | మోళిముకటా |
| 520 | 98 | మలఁచి | మలిచి |
| 540 | 146(వ్యా.) | అలంకరింప | అతకరింప |
| 541 | 1 | పదాజ్జ | పదాబ్జ |
| | 9 | పతిదేవతా | పతిదేవతా |
| 554 | 36 | చిత్తములోన | చిత్తములోనఁ |
| 555 | 38 | ప్ర. మ. | మ. ప్ర. |
| 556 | 41 | నెవ్వీగు | నెవ్వీఁగు |
| 558 | 19(వ్యా.) | న్నతరస్యామ్ | న్యతరస్యామ్ |
| 560 | 47(వ్యా.) | వఫప్రాసమె | వఫమైత్రియె |
| 569 | 64 | కుంతనంబు | గుంతనంబు |
| 570 | 65 | డాంబికు | డాంభికు |
| 574 | 75 | బుటు | పుట్టు |
| | 76 | జుట్టుకొని | జుట్టుకొన |
| 576 | 79 | నాఁడుదు | నాడుదురు |
| 580 | 88 | నాఁడియు | నాడియు |
| 584 | 93 | పాడపు | పాడవు |
| 585 | 96 (వ్యా.) | గురురీఢా | గురు...రీఢా |
| | | తరరీఢా | తర...రీఢా |
| | 96 | ప్రభావావ | ప్రభాలోప |

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 595 | 122 | దేవ | శైవ |
| 596 | 123 | విల్లంగ | విల్లంగఁ |
| 597 | 124 | రములఁజూచి | రములుసూచి |
| 598 | 125(వ్యా.) | మేథ | మేధ |
| 602 | 130 | యొదిగి | యొదిఁగి |
| 606 | 138 | కుంతకులు | గుంతకులు |
| 607 | 140 | క్లప్త | క్లృప్త |
| 616 | 160 | వ్యంకజంపు | వ్యంజకంపు |
| 618 | 162 | కంటె గతి | కంటెఁ గతి |
| 636 | 194 | బంచప్రాణు | బంచబాణు |
| 642 | 4 | జానసముననల్ | జాననముననల్ |
| 647 | 11 | మనోజ | మనోవి |
| 650 | 13 | చక్కటినింత | చక్కటికింత |
| | | చరులలో | చఱులలో |
| | | దశు | దీశు |
| 667 | 31 | మెలర్ప | మెలర్పఁ |
| 671 | 39 | బువ్వుఁబోడి | బువ్వుఁబోఁడి |
| | 40 | పూఁబోడి | పూఁబోఁడి |
| 673 | 44 | విశ్వాసుఁడ | విశ్వాస్యుఁడ |
| 674 | 47 | చిగురు | చివురు |
| | | నెపము | నెవము |
| 675 | 50 | చిలుకల | ఁజిలుకల |
| | 51 | బారఁగ | బాఱఁగ |
| 680 | 71 | గొందారమల్ | గొందామరల్ |
| 687 | 90 | యుచ్చైస్స్వర | యుచ్చైశ్స్వర |
| 699 | 112(వ్యా.) | పీఁటయందు | పీఁటలందు |
| 700 | 116 | భూర్భువస్వ | భూర్భువస్స్వ |
| 716 | 145 | శిరసునందు | శిరసునందుఁ |
| 724 | 156 | బసపాడె | బసుపాడె |
| | 158 | నభస్థలిం | నభస్స్థలిం |
| 730 | 168 | విరిహా | విరహా |
| 734 | 177 | పంకంబుతో | పంకంబులో |
| 740 | 188(వ్యా.) | దోన | దోనల్ |
| 746 | 198(వ్యా.) | సాహారములతో | సాహారముతో |
| | 199 | సుధాహార | సుధాసార |
| 749 | 202 | పుణ్యశ్లోకుండు | ఁబుణ్యశ్లోకుండు |

# శృంగార నైషధము.

## విషయసూచిక.

### ప్రథమాశ్వాసము.



### ద్వితీయాశ్వాసము.



### తృతీయాశ్వాసము.



### చతుర్థాశ్వాసము.



### పంచమాశ్వాసము.

శ్రీ

# శృంగారనైషధము.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాస్తుత్యాదికము.

శా. శ్రీ రామా కుచమండలీ మృగమద శ్రీగంధ సంవాసిత
స్ఫారోదార భుజాంతరుండు ధరణీ సంశ్లేష సంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా పాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడి పెద్దమంత్రిసుతు సింగామాత్యచూడామణిన్. 1

శ్రీరామా ... రుండు—శ్రీరామా = లక్ష్మీదేవియొక్క - కుచ మండలీ = వర్తులవలయిన స్తనములయొక్క - మృగమద=కస్తూరిచేతను - శ్రీగంధ=శ్రేష్ఠచందనముచేతను - సంవాసిత=పరిమళించునట్లు చేయఁబడిన - స్ఫార=విశాలమయిన - ఉదార=ఉన్నతమైన-భుజాంతరుండు=వక్షముకలవాఁడును, ధరణీ...ణుండు-ధరణీ=భూదేవియొక్క - సంశ్లేష=కౌఁగిలింతలయొక్క - సంభావనా=ఆదరమునందు - పారీణుండు=తుదముట్టినవాఁడును, కరుణాపాథోధి - కరుణా = దయకు - పాథోధి=సముద్రుఁడును, అయిన, పద్మాక్షుఁడు = పుండరీకాక్షుఁడు - అనఁగా - నారాయణుఁడు, మామిడి పెద్దమంత్రి సుతున్ =మామిడిపెద్దన్నయను మంత్రియొక్క కుమారుఁ డగు, సింగ అమాత్య చూడామణిన్=సింగయ్య యనెడు మంత్రి శ్రేష్ఠుని, ఇంపు ఆరన్=ఆనందము ఒప్పునట్లుగా, కృతార్థున్=ధన్యునిఁగా, చేయున్ = చేయును గాక.

తా.—శ్రీదేవీ భూదేవులతోఁ గూడుకొని కృతార్థుఁడై యున్న కరుణాశాలి శ్రీనారాయణుఁడు సింగమంత్రిని తనవలెనే శ్రీభూసంపన్నునిం గృతార్థునిం జేయుఁగాక.

'మండలీ' (వృత్తములు) అనుటచే స్తనములనుండి ఆలింగనముచే అంటుకొన్న చిహ్నము లని తెలియవచ్చుచున్నది. 'పారీణుండు' అనుటచే భూభర్తృత్వము (ఇతరులకు స్వల్పకాలము—శ్రీహరికి అట్లు గాక) శాశ్వత మని తెలియ నగుచున్నది.

కావ్యాదిని శ్రీకారము సర్వదోషంబుల నడంచి సర్వశుభంబుల నిచ్చును:—

'వేదముల కెల్ల నోంకార మాది యైన | కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది;
గానఁ గవి వరు లెల్లను దానిఁ దక్క | నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల.'

'పదపడి శ్రీకారము కృతి | మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును | గదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్.' అప్పకవి.

కావ్యాదియందలి మగణము శుభప్రద మనుటకు అప్పకవి:—

'అథర్వవేదముఖం బగుమగణంబు వసుమతీదేవతాకంబు గాన శివప్రదంబు.'—

కృత్యాదియందలి మగణసగణయోగము ధనప్రద మనుటకు అప్పకవి:—

'భువనముల కెల్ల నాధారభూత మైన । జగతి యధిదైవతంబుగాఁ జనుమగణము
తమకుఁ గారణ మగుటచే దానిఁ గూడి।ధన మొసఁగు నేడు సని పల్కె శ్రాతన్జ్ఞ.'

మ. కనకక్షోణిధరంబు కార్ముకము గాఁ గద్రూతనూజుండు శిం
జిని గా మాధవుఁ డమ్ము గాఁ బురము లక్షీణైక దోశ్శక్తిఁ గా
ల్చిన జో దీశ్వరుఁ డిచ్చుఁ గాత జయలక్ష్మీ సుస్థిరైశ్వర్య శో
భనముల్ పెద్దయసింగమంత్రికి జగత్ప్రఖ్యాత సత్కీర్తికిన్. 2

కనక క్షోణిధరంబు = బంగారు కొండ - అనఁగా మేరుపర్వతము, కార్ముకము గాన్ = విల్లు కాఁగా, కద్రూ తనూజుండు - కద్రూ = (నాగులతల్లియైన) కద్రువయొక్క—తనూజుండు = కుమారుఁడయిన వాసుకి, శింజిని గాన్ = అల్లెత్రాడు కాఁగా, మాధవుఁడు = నారాయణుఁడు, అమ్ము గాన్ = బాణము కాఁగా, అక్షీ...క్తిన్ - అక్షీణ = తఱుఁగని - ఏక = ముఖ్యమయిన - దోః = బాహువులయొక్క - శక్తిన్ = బలముచేత, పురములు = (అసురల వైనమూఁడు) పట్టణములను, కాల్చిన - జోదు = యోధుఁడు, (అయిన), ఈశ్వరుఁడు = శివుఁడు, జ...కిన్ - జగత్ = లోకములో - ప్రఖ్యాత = మిక్కిలి చెప్పఁబడిన - సత్ కీర్తికిన్ = మంచి యశస్సు కలవాఁ డైన, పెద్దయసింగమంత్రికిన్, జయ...నముల్ - జయ లక్ష్మీ = గెలుపు సిరిని - సుస్థిర = మిక్కిలి నిలుకడ కలిగిన - ఐశ్వర్య = సంపదను - శోభనముల్ = శుభములను, ఇచ్చుఁ గాతన్ = ఇచ్చునుగాక.

[పూర్వ మొకప్పుడు దేవతలకు ఓడి యసురులు మయుని శరణుఁ జొచ్చిరి. మయుఁడు వారికి మూఁడుపట్టణములను ఆకాశమున అదృశ్యముగా సంచరించువానిని వేఱువేఱ బంగారముతోను వెండితోను ఇనుముతోను చేసి యిచ్చెను. అసురులు ఆపట్టణములచేఁ బోయి దేవాదులను బాధించుచుండఁగా దేవాదులప్రార్థనచే శివుఁడు వానిని పద్యోక్త ప్రకారమున దహించివైచెను.]

తా.—పటిష్ఠ మయిన యాయుధములతోను బాహుబలముతోను త్రిపురాసురులను నాశ మొందించిన యీశ్వరునియొక్క కరుణచేత సింగనమంత్రియు పటిష్ఠాయుధ బాహుబలములచేత తనశత్రువులను నాశ మొందించి మిక్కిలి స్థిరముగా సంపదలను శుభములను పొందునుగాక.—ఇతని చాపంబును శివచాపతుల్యము గావుత మనియు హృదయము.

ఉ. హాటకగర్భుచేతఁ గమలాసనుచేఁ జతు రాస్య కంఠ శృం
గాటక వీథికా కృత విగాహ చతుశ్శ్రుతిచేత దేవతా
కోటి కిరీట సంఘటిత కోమల పాదసరోజుచే జగ
న్నాటకసూత్రిచేతఁ గృతినాథుఁడు గాంచుఁ జిరాయురున్నతుల్. 3

హాటక గర్భుచేతన్ = బంగారు బొజ్జగలవాఁడును, కమల ఆసనుచేన్ = తామరపువ్వు పీఠముగాఁగలవాఁడును, చతు...శ్రుతిచేతన్ - చతుః = నాలుగయిన - ఆస్య = ముఖములయొక్క - కంఠ = గొంతులనెడు - శృంగాటక వీథికా = చదుకముయొక్క దారులయందు - కృత = చేయఁబడిన - విగాహ = ప్రవేశముగల - చతుః = నాలుగయిన - శ్రుతిచేతన్ = వేదములుగలవాఁడును,

దేవ...రోజుచేన్ — దేవతా=వేల్పులయొక్క - కోటి=కోటులచే - కిరీట=(తమ)కిరీటములతో - సంఘటిత=కూర్పఁబడిన - కోమల పాద సరోజుచేన్ = మృదువులయిన యడుగుఁ దామరలుగలవాఁడును, జగత్ నాటక సూత్రిచేతన్ = లోకములయొక్క (ధర్మ యనెడు) నాటకమునకు సూత్రధారుఁడును, (అగు), బ్రహ్మదేవునిచేత, కృతినాథుఁడు=ఈకావ్యముయొక్క (అనఁగా దీనిని చేయించిన) ప్రభువు (మామిడిసింగమంత్రి), చిరా...తుల్—చిర = దీర్ఘకాలపు - ఆయుః = జీవితకాలమును - ఉన్నతుల్ = ఉచ్ఛ్రియములను, కాంచున్ = పొందునుగాక.

తా.— బ్రహ్మకు బొజ్జ బంగారము, పీఠము కమలము, నాలుగుగొంతులయందును నాలుగు వేదములును ఏకకాలమునందే పలుకుచుండును, కోటానఁగోట్లు దేవతలు తమకిరీటములు ఆయన పాదపద్మములకు సోఁకునట్లుగా నమస్కరింతురు, ఆయన లోకములను నడిపించుచుండును; అట్టి యాదేవుఁడు సింగమంత్రికి దీర్ఘాయు విచ్చుఁగాక.

చతు...వీథికా, జగ...సూత్రి - ఇట రంజనార్థారోపములచే రూపకాలంకారము :—

‘ రూపకము రక్తికై త । ద్రూపతఁ దదభేదతఁ బరరూపమును సమా
రోపింపఁ బ్రకృతమున, సు । ప్రాపము విష యోన తోరు తానుభ యోక్తిన్.’ అలం. సా. సం.

కిరీట ... రోజుచే - సంఘటనరూప ప్రకృతకార్యార్థమై అప్రకృతసరోజములు ప్రకృత పాదాత్మతాపరిణతి నపేక్షించుటవలనఁ బరిణామము:—‘కోమల’ యను సామాన్యప్రయోగము ఉపమిత సమాస బాధకము:—

‘ ప్రకృతక్రియోపయుక్తికిఁ । బ్రకృతాత్మత విషయి కోరఁ బరిణామ మగున్;
సకి లేప మనువు నానుడ్వి । సకి నన్నుఁ బ్రసన్న నేత్ర జలజములఁ గనెన్.’ అలం. సా. సం.

శా. జే జే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజ ప్రౌఢ కృపావలంబుని గటప్రస్యంది దానాంబునిం
బూజాతత్పర దేవదానవ కదంబున్ బాల కేళీ కళా
రాజత్కౌతుక రంజి తోరగపతిప్రాలంబు హేరంబునిన్. 4

నిర్వ్యాజ ప్రౌఢ కృపా అవలంబునిన్=కారణములేని నిండు కరుణను వహించువాఁడును; కట ప్రస్యంది దాన అంబునిన్=చెక్కిళ్లయందు కాఱుచున్న మదజలము గలవాఁడును, పూజా తత్పర దేవ దానవ కదంబున్=పూజయందు ఆసక్తులయిన సురలయు అసురులయు సమూహములు కలవాఁడును, బాల...ప్రాలంబున్-బాల=బుడుతయొక్క—కేళీ=ఆటలయొక్క — కళా=విలాసములచేత—రాజత్ = ప్రకాశించుచున్న - కౌతుక=వేడుకచేత - రంజిత=సంతోషపెట్టఁబడిన - ఉరగ పతి ప్రాలంబున్=(నాగరాజహారుఁడైన) శివుఁడు కలవాఁడును, (అగు) - హేరంబునిన్= విఘ్నేశ్వరుని, ఇష్ట ఫల సంసిద్ధుల్=కోరిన ప్రయోజనములయొక్క యీడేఱుటలను, మదిన్= మనస్సులో, కోరి, జే జే = జయ జయ, అంచున్ భజింతున్.

హేరంబునిఁ గొలువని వారికి దేవతలకైనను ఉద్యమములు నెఱవేఱవు. కావున దేవతలు కూడ ఈతని సేవింతురు. ఈయన సహజకరుణాశాలి గావున భక్తులకోరికలను నెఱవేర్చును. ఈతఁడు చెక్కిళ్లయందు దానధార లురల బాలక్రీడలు సేయుచుండంగాంచి పాంపపేరులవాఁడు ఈతని తండ్రి శివుఁడు ఆనందించును. అట్టియీ దేవుని నా తొడఁగిన గ్రంథరచనను నిర్విఘ్నముగా నెఱవేర్పు మని ప్రార్థించుచున్నాను.—మంచి యవస్థచే విశేషించుట మంచిసిద్ధి కొఱకు.

నిర్వ్యాజ...బునిజ - ఏతత్సమాసార్థము తా భజించుటకును దేవతలు పూజించుటకును హేతువైనందున పదార్థహేతుక కావ్యలింగాలంకారము:—

'నీక మగుఁ గావ్యలింగము । హేతువు పదవాక్యములకు నింగిత మైనన్ ;
వే తొలఁగు సాఁదుధుండను;। జేతోభవ యడఁతు నిన్ను శివుఁ డెద నాకున్.' అలం. సా. సం.

కట...బునిజ - స్వభావోక్త్యలంకారము:—

'పన్నిన జాత్యాదికసం । పన్నస్వభావం బగున్ స్వభావోక్తి ; చెవుల్
తిన్నగ జిక్కఁబొడిచికొని । కన్నులు సుడివడఁగ నన్నుఁ గనియె మృగంబుల్.' అలం. సా. సం.

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు, చెలికత్తె జిలువారు పలుకుఁజిలుక,
శృంగార కుసుమంబు చిన్ని చుక్కలరాజు, పసిఁడి కిన్నెరవీణ పలుకుఁదోడు,
నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు, తళుకుటద్దంబు సత్కవులమనసు,
వేదాదివిద్యలు విహరణస్థలమ్ములు, చక్కనిరాయంచ యెక్కిరింత,

తే. యెపుడు నేదేవి, కాదేవి యిందు కుంద । చంద్ర చందన మందారసార వర్ణ
శారదాదేవి మామక స్వాంతవీథి । నిందువేడుక విహరించుచుండుఁ గాత. 5

ఎపుడున్, ఏ దేవికిజ=ఏ సరస్వతీదేవికి, సింహాసనము, చారు...బు=చారు=అందమయిన-సిత = అవసితమైన - అనఁగా సమాప్తమైన - నిండార విరిసిన యనుట - పుండరీకంబు = తెల్లదామరయో [పుండరీకశబ్దము కమలమాత్రవాచక మను భరతధృత వ్యాడివాక్యముచే - సిత=తెల్లని-పుండరీకంబు=కమలము-అని యర్థము చెప్పుకొనవచ్చును; ఒండె, అమరుఁడు 'గుణే శుక్లాదయః' అనుటచే, సితశబ్దము గుణమందును వర్తించును గాన-చారు = అందమయిన - సిత=ధావళ్యము గల - అనఁగా దేదీప్యమాన మనోరమ ధావళ్యముగల - పుండరీకంబు = తెల్లదామర - అని యేని చెప్పవచ్చును.] చెలికత్తె, జిలువు ఆరు పలుకుఁ జిలుక = (జిలుఁగు) మృదుత్వము ఒప్పు మాటల చిలుకయో;

శృంగార కుసుమంబు = సింగారముకొఱకైన (అనఁగా సింగారముకై శిరమునందు ధరింపఁబడునట్టి) పువ్వు, చిన్ని చుక్కలరాజు=లేఁత చంద్రుఁడో, పలుకుఁ దోడు = మాట చెలి, పసిఁడి కిన్నెర వీణ = వీణావిశేషమయిన బంగారు కిన్నెరయో;

కేళిగృహములు = ఆటయిండ్లు, నలు...మ్ములు - నలువ=బ్రహ్మయొక్క — నెమ్మోముఁదమ్ములు = తామరలవంటి సుందర ముఖములో (నెఱి+మోము = నెమ్మోము), తళుకు టద్దంబు = నిగనిగలుగల యద్దము, సత్ కవుల మనము = మంచికవులయొక్క చిత్తమో;

విహరణ స్థలములు=విహార ప్రదేశములు, వేద. ఆది విద్యలు — వేద=వేదము - ఆది = మొదలుగాఁగల - విద్యలు = చతుర్దశవిద్యలో - (వీనివివరము పిమ్మట వచ్చును.) ఎక్కిరింత = వాహనము, చక్కని - రాయంచ=రాజహంసయో;

ఇందు...ర్ణ — ఇందు = చంద్రుఁడు - కుంద=మొల్లలు - చంద్ర=కర్పూరము - చందన=గంధము - మందార = దేవతరుపుష్పము — వీనియొక్క=సార=శ్రేష్ఠాంశమువంటి - వర్ణ=వన్నెగల, ఆ(దేవి) శారదాదేవి=ఆ సరస్వతీదేవి, మా...థిన్-మామక=నాదయిన-స్వాంత=హృదయ

మనెడు - వీథిఁ=వీథిలో, నిండువేడుకఁ విహరించుచుండుఁగాక.—వీథి ననుటచే—వీథిలో నిర్యంత్రణముగా యథేచ్ఛముగా సంచరించినట్లు నాహృదయములో సంచరించుఁగాక - అనఁగా - నాకు అఖండ విద్యా ప్రతిభా కవనముల ననుగ్రహించుఁగాక - అని భా.

స్వాంత (స్వ + అంత)—దీనికి నిత్యసమాసయతి స్వరవ్యంజనముల కుభయమునకుం జెల్లును. సింహాసనత్వాద్యారోపములు ప్రకృతక్రియార్థము కానందున పరిణామము కాదనియు రూపకమాత్రమ యనియు వలువురమతము. ఇందు...కర్ణ - ఉపమ :—

'ఉపమ యగు రెంట సాదృ। శ్యపుసిరి వాచ్యముగ; ముఖము శశివలె వెలుఁగున్.' అలం సా. సం.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి. 6

ఆ ది క వి స్తు తి.

సీ. వ్యాస వాల్మీకి సంయమి వాక్సుధాంభోధి। లోలోర్మిపంక్తుల నోలలాడి,
భట్టబాణ మయూర భారతీసందర్భ। సౌభాగ్యగరిమంబు సంగ్రహించి,
భాస సౌమిల్లిక ప్రతిభా సమున్మేష। హేలావిశేషంబు నిచ్చగించి,
మాఘభారవివచోమకరందనిష్యంద।మాధుర్యమునకు సమ్మదము నొంది,

తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి। రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి,
ధీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ। శంభుదాసునిఁ గర మర్థి సన్నుతించి. 7

వ్యాస...పంక్తులఁ=వ్యాస = వ్యాసులవారును - వాల్మీకి = వాల్మీకియు - అనెడి - సంయమి=మునులయొక్క - వాక్=పలుకుల నెడి - సుధాంభోధి (సుధా + అంభోధి) = అమృత సముద్రము యొక్క - లోల=చంచలములయిన - ఊర్మి=అలలయొక్క - పంక్తులఁ = వరుసల యందు, ఓలలాడి=మునిఁగి, [అనఁగా వ్యాసరచితములయిన పురాణములను వాల్మీకి కృత మయిన రామాయణమును సమగ్రముగా అవగాహనము చేసికొని;]

భట్ట...మంబుఁ=బాణభట్టునియొక్కయు మయూరునియొక్కయు కవన రచనయొక్క సొంపుయొక్క పెంపును, సంగ్రహించి = అలవరించుకొని, [బాణుఁడు కాదంబరీ హర్షచరిత్రలను వ్రాసినవాఁడు, మయూరుఁడు సూర్యశతకకర్త;]

భాస...షంబుఁ - భాస = భాసునియొక్కయు - సౌమిల్లిక = సౌమిల్లియొక్కయు - ప్రతిభా = తీవ్రప్రజ్ఞయొక్క - హేలా విశేషంబుఁ = అసామాన్యమయిన విలాసమును, ఇచ్చగించి=మెచ్చి, [వీ రిరువురు సంస్కృతమున నాటకములు వ్రాసినవారు;]

మాఘ...ర్యమునకుఁ - మాఘ = మాఘునియొక్కయు - భారవి = భారవియొక్కయు- [మాఘుఁడు శిశుపాలవధము రచించినవాఁడు - భారవి కిరాతార్జునీయకర్త] - వచః = కవన మనెడు - మకరంద=తేనెయొక్క - నిష్యంద = ఓడికయొక్క - మాధుర్యమునకుఁ=తీపునకు, సమ్మదముఁ = ఆనందమును, ...

రాజశేఖరుఁ = రాజశేఖరకవిని, కవిరాజుఁ=కవిరాజకవిని, [రాజశేఖరుఁడు బాలరామాయణ నాటకమును వ్రాసినవాఁడు, కవిరాజు 'రాఘవపాండవీయ మను సంస్కృతద్వ్యర్థికావ్యము రచించినవాఁడు;] ప్రస్తుతించి = పొగడి, ధీరమతిఁ - ధీర = ప్రజ్ఞకలదైన - మతిఁ =

మదిగలవాఁ డయిన, నన్నపార్యునిన్ = (ఆంధ్రభారతములో ఆదిపర్వము అరణ్యపర్వములో అర్ధ కభాగమును రచించినవాఁడయిన) నన్నయభట్టును, తిక్కయజ్వన్ = తిక్కనసోమయాజిని, శంభుదాసునిన్=ఎఱ్ఱాప్రగడను, కరము అర్థిన్= మిక్కిలి అక్కఱతో, సన్నుతించి = పొగడి.

వాక్సుధాంభోధీత్యాది — వచోమకరందేత్యాది — రూపకాలంకారము.

పై కవులలో కొందఱు ఇట్లు కొనియాడఁబడియున్నారు:—

భాసుఁడు.—'సూత్రధారకృతారమ్భై ర్నాటకై ర్బహుభూమికైః ।
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ.' హర్షచరితము.

[శ్రీహర్ష మహారాజ రచితములుగా ప్రసిద్ధము లైన రత్నావళీ ప్రియదర్శి కాది నాటకములను చేసినవాఁడు ఇతఁడే యని కొందఱు వచింతురు; కావ్యప్రకాశలో 'కావ్యం యశసేఽర్థకృతే' అను శ్లోకమును వివరించుచు 'శ్రీహర్షా దేరివ భాసకాదీనా మర్థః' అని మమ్మటభట్టు తెలిపి యుండుట అందులకు గమక మని వ్రాయుదురు.]

సౌమిల్లి.—' భాసక సౌమిల్లి కవిపుత్త్రాదీనాం ప్రథితయశసాం ప్రబన్ధేషు సత్సు కాళిదాసకృతే
నూతనే వస్తుని కుతో బహుమానః?'— మాళవిక.

కవిరాజు.—' సుబన్ధు ర్బాణభట్టశ్చ కవిరాజ స్తృతీయకః ।
వక్రోక్తినిపుణా హ్యేతే చతుర్థో విద్యతే న వా.'

వ. నవరసభావానుబంధబంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపం దలంచి, కౌతూహ లాధీన మానసుండ నై, త న్మహాప్రబంధ ప్రారంభంబునకుం దగిన పుణ్యశ్లోక పురాతన మహారాజచరిత్రం బెయ్యది యొకో యని వితర్కించుచున్న సమయంబున. 8

నవ రస భావ అనుబంధ బంధురంబు గాన్ = తొమ్మిది రసములయు భావంబులయు కూర్పు చేత అంద మగునట్లుగా, ... ప్రబంధంబు = కావ్యమును, ... కౌతూహలాధీనమానసుండను - కౌతూహల = కోరికకు - అధీన=వశమయిన - మానసుండను = మనస్సుగలవాఁడను, ... పుణ్య శ్లోక - పుణ్య=పవిత్రమైన - శ్లోక = కీర్తిగలవాఁడైన - పురాతన=పూర్వకాలపు... వితర్కించు చున్న=ఆలోచించుచున్న,...

[శృంగార వీర కరుణాద్భుత హాస్య భయానక బీభత్స రౌద్ర శాంతములు నవరసములు; వానికి రత్యాదులు తొమ్మిది స్థాయిభావములు. స్తంభ ప్రళయాదులు ఎనిమిది సాత్త్వికభావములు; నిర్వేదావేగాదులు ముప్పదిమూఁడు వ్యభిచారిభావములు. — వీనిస్వరూపమును సాహిత్యదర్పణా ద్యలంకారశాస్త్రగ్రంథములవలనం దెలియునది.]

## కృతిపతిప్రశంస.

సీ. తనకృపాణము సముద్ధత వైరి శుద్ధాంత। తాటంకముల కెగ్గు దలఁచుచుండఁ,
దనబాహుపీఠంబు ధరణిభృల్లోకమ। రాహిాసామజంబులకు విశ్రాంతి యొసఁగఁ,
దనకీర్తి న ర్తకి ఘనతర బ్రహ్మాండ। భవనభూముల గొండ్లిఁ బరిఢవిల్లఁ,
ధనదానమహిమ సంతాన చింతారత్న। జీమూత సురభుల సిగ్గుపఱుపఁ,

తే. బరఁగు శ్రీవేమమండలేశ్వరునిమంత్రి। యహితదుర్మంత్రివదనముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద। మంత్రిపెద్దన సింగనామాత్యవరుఁడు.

తన - కృపాణము = కత్తి, సము...లకుఁ = సముద్ధత = మిక్కిలిగర్వించిన - వైరి = శత్రువులయొక్క - శుద్ధాంత = అంతఃపురస్త్రీలయొక్క - తాటంకములకుఁ = చెవికమ్మలకు, ఎగ్గు = చెఱుపును ... తలఁచుచుండఁ = చేయ సంకల్పించుచుండఁగా [ 'తాటఙ్కధారణం స్త్రీణాం భర్తు రాయుష్యవర్ధనమ్' అనువచనముంబట్టి పతివత్నులే తాటంకములను ధరింతురు గావున—తాటంకములు ధరించు యోగ్యతను ఆస్త్రీలకు పోఁగొట్ట నుంకించుట అనఁగా వారిభర్తలను పరిమార్ప నుద్యోగించుట అని భా. సంబంధాతిశయోక్తి ; లక్షణము వ్యాఖ్యలో పిమ్మట వచ్చును.]

తన బాహు పీఠంబు = (భూదేవికి) సింహాసనమువంటిదైన తన భుజము, ధర.... లకుఁ- ధరణిభృత్ = (ఏడు కుల) పర్వతములకును - కమఠ = (ఆది) కూర్మమునకును - అహి=పాముసకు (అనఁగా అనంతునికిని) - సామజంబులకుఁ = (అష్ట దిశా) గజములకును, విశ్రాంతి = విరామమును, ఒసఁగఁ = ఈయఁగా [కులపర్వతాదులు భూమిని మోచునవి; ఆభారమును ఇపుడు సింగమంత్రి తన బుజమున మోచుచుంటంజేసి. వానికి విశ్రాంతి కలిగె నని యర్థము.—భూమిని చక్కఁగా పరిపాలించుచున్నాఁ డని భా. సంబంధాతిశయోక్తియు.]

తన - కీర్తి-నర్తకి=కీర్తియనెడి దొమ్మరది, ఘనతర...భూములఁ - ఘనతర=మిక్కిలి గొప్పవైన - బ్రహ్మాండ = బ్రహ్మాండమనెడు - భవన = లోఁగిటియొక్క - భూములఁ = అంతస్తులయందు, గొండ్లిఁ=ఆటచే, పరిఢవిల్లఁ = వెలయఁగా [ఊర్ధ్వలోకములు ఏడింటను అధోలోకములు ఏడింటను ఆతని యశస్సు వ్యాపించి యున్న దని భా. రూపకము, సంబంధాతిశయోక్తియు. నర్తకి యన దొమ్మరదియు ననుటకు:—

'భువి భ్రమిత్వాఽనవలమ్బ మమ్బరే విహర్తుమభ్యాస పరంపరాపరా
అహో మహావంశ మముం సమాశ్రితా సకౌతుకం నృత్యతి కీర్తినర్తకీ.' నైషధము:

ఇందులకు తెల్లఁగు ఈగ్రంథములో 5 ఆ. 118 పద్యము.]

తన-దాన మహిమ = ఈవియొక్క ప్రభావము, సంతా...భులఁ-సంతాన = దేవవృక్షములను - చింతారత్న=చింతామణిని - జీమూత = మేఘమును - సురభులఁ=కామధేనువును, సిగ్గు పటుపఁ=సిగ్గు పడునట్లు చేయఁగా [వానికన్న దాత యని భా. ఉపమ.]

పరఁగు శ్రీ వేమ మండలేశ్వరుని మంత్రి = (పరఁగు=) ఒప్పుచున్న (మంత్రికి విశేషణము) శ్రీ మంతుఁ డయిన వేమ భూపాలుని మంత్రి, అహిత...నుఁడు - అహిత = శత్రువులయొక్క - దుర్మంత్రి=చెడుమంత్రులయొక్క - వదన=నోళ్లకు - ముద్రా=బంధనముయొక్క - అవతార= ఆవిర్భావముగునట్టి - శాసనుఁడు=ఆజ్ఞగలవాఁడు [ఇతనియాజ్ఞకు ఎదురు చెప్పలేక వైరిమంత్రులు నోరు మూసికొని యుందు రని భా.], రాయ...విభుఁడు = రాజులనెడి వేశ్యలకు విటుఁడు అనెడి బిరుదుగలవాఁడును - పెద్దనమంత్రికుమారుఁడును - అయిన సింగనమంత్రి యనుప్రభువు.

తా. శత్రురాజజేతయు ప్రజారక్షకుండును కీర్తిమంతుఁడును మహాదాతయు శ్రీ వేమారెడ్డి గారి మంత్రియు మంత్రిశ్రేష్ఠుండును అయిన సింగనమంత్రి.

శా. పంచాంగ స్థిర మంత్ర రక్షణ కళా ప్రౌఢుండు బాలా మనః
పాంచాలుండు విరించి వంశ జలధి ప్రాలేయభానుండు దో

శ్చంచ చ్చాప కృపాణ లబ్ధ విజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీ మౌక్తిక కీర్తి పెద్దవిభు సింగం డొక్కనాఁ డిమ్ములన్. 10

పంచా...ండు – పంచాంగ = [సహాయులు సాధనోపాయములు దేశకాల విభాగము వినిపాతప్రతీకారము సిద్ధి అనెడి] యయి దంగములచేత - స్థిర = నిశ్చలమయిన - మంత్ర = ఆలోచనయొక్క - రక్షణ = కాపాడుటయొక్క - కళా = విద్యయందు - ప్రౌఢుండు = గడితేరినవాఁడు, బాలా మనః పాంచాలుండు = జవరాండ్రయొక్క చిత్తమునకు పాంచాలనాయకుఁడు [వాత్స్యాయనశాస్త్రమందు స్త్రీలలో పద్మినీజాతి యెట్లో అట్లే పురుషులలో పాంచాలజాతి శ్రేష్ఠముగాఁ జెప్పఁబడినది; జవరాండ్రు ఇతనిం గామింతు రని తా. మదనాధిక సుందరుఁ డని భా.], విరిం...నుండు–విరించి వంశ = బ్రహ్మవంశ మనెడి - జలధి = సముద్రమునకు - ప్రాలేయభానుండు= చంద్రుఁడు[బ్రాహ్మణజాత్యుద్భవుండును తనయభ్యుదయముచేత బ్రాహ్మణుల నుప్పొంగించువాఁడును అనుట], దో...ర్యుండు – దోః = బాహువునందు - చంచత్ =చలించుచున్న - చాప = వింటిచేతను - కృపాణ=కత్తిచేతను - లబ్ధ=పొందఁబడిన - విజయ=గెలుపుయొక్క - ఐశ్వర్యుండు = సంపదగలవాఁడు, దిక్కా ... ర్తి–దిక్ =దిక్కులనెడి - కామినీ=చెలువలయొక్క - కాంచీ=మొలనూళ్లయందలి - మౌక్తిక = ముత్తెములయిన - కీర్తి=యశస్సుకలవాఁడు, ఇమ్ములన్ = సుఖముగా.

తా.— మంత్రపరుఁడు సుందరుఁడు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణపోషకుఁడు జేత కీర్తిమంతుఁడును అయిన సింగనమంత్రి ఒకనాఁడు సుఖముగా.

సింగండు విరించి...భానుండు - దిక్కా...కీర్తి - ఈరెంటను రూపక మలంకారము.

వ. మృదు మధుర చిత్ర విస్తర కవితావిలాస వాగీశ్వరు లగుకవీశ్వరులును, పతంజలి కణా దాక్షచరణ పక్షిలాది శాస్త్రసిద్ధాంత కమలవనహంసు లగు విద్వాంసులును, భరత మతంగ దత్తిల కోహ లాంజనేయ ప్రణీత సంగీత విద్యా రహస్య విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతు లగుకళావంతులును, శక్తిత్రయ చతురుపాయ షాడ్గుణ్య ప్రయోగ యోగ్య విచారు లగురాయబారులును, నిఖిలపురాణేతిహాస సంహితా తాత్పర్యపర్యాలోచనా ధురంధర ధిషణా సముత్సాహు లగుపౌరాణిక సమూహంబును బరివేష్టింపం గొలు వుండి సకల విద్యాపారీణుండు సరస సాహిత్య గోష్ఠీ వినోద ప్రసంగంబున. 11

మృదు...రులు=మృదు=సులువును - మధుర=ఇంపును - అయిన - చిత్ర = శబ్ద చిత్రము అర్థ చిత్రము ననునిరుదెఱఁగుల రచనయొక్క — విస్తర = విరివిగలిగినట్టి - కవితా = కవనము యొక్క - విలాస=క్రీడయందు - వాగీశ్వరులు = బ్రహ్మలు (రూపకము)...పతంజలి=పాణినీయ వ్యాకరణమునకు మహాభాష్యము చేసినవాఁడు - కణాదుఁడు = (గింజలను భక్షించువాఁడు) వైశేషికశాస్త్రకర్త - అక్షచరణుఁడు = పాదమందు ఇంద్రియము (కన్ను) కల గౌతముఁడు న్యాయశాస్త్రకర్త–

'పన్నగధరున కేర్పడ సరకాలఁ । గన్ను నూపినయట్టి గౌతముఁ డుండ.' హరిశ్చంద్రద్విపద.

పక్షిల (స్వామి)=గౌతములవారిన్యాయసూత్రములకు భాష్యము చేసిన వాత్స్యాయనముని–ఆది...

లుసు - ఆది = లోనగువారియొక్క - శాస్త్ర = శాస్త్రములయొక్క - సిద్ధాంత=నిర్ణీతార్థము లనెడి - కమల వన = తామర తంపరకు - హంసులు=హంసలు - ఆయాశాస్త్రములలో నిరంతరము మునుఁగుచు తేలుచు క్రీడించుచుండు మహావిద్వాంసు లనుట (రూపకాలంకారము) ... భరతుఁడు మతంగుఁడు దత్తిలుఁడు కోహళుఁడు ఆంజనేయుఁడు - వీరు సంగీతశాస్త్రకర్తలు. ప్రణీ ... స్వాంతులు — ప్రణీత=రచింపఁబడిన - సంగీతవిద్యా = పాటవిద్దెయొక్క - రహస్య = మర్మముల యొక్క - విజ్ఞాన = నేర్పుచే - వైజ్ఞానిక = సంస్కారము పొందినది - అనఁగా నేర్పు గలిగినట్టిది- అయిన - స్వాంతులు = హృదయము గలవారు...కళావంతులు = సంగీతాది చతుష్షష్టికళలు గల వారు. శక్తి...చారులు - శక్తిత్రయ=ప్రభావ మంత్రోత్సాహము లనెడి మూఁడు శక్తులయు - చతురుపాయ = సామ దాన భేద దండము లనెడి నాలుగుపాయములయు - షాడ్గుణ్య=సంధి విగ్రహ యా నాసన ద్వైధీభావ సమాశ్రయము లనెడి యాఱుగుణములయు - ప్రయోగ=వినియోగమునకు- యోగ్య=అనుకూలమయిన - విచారులు = ఆలోచనముకలవారు. నిఖిల...హంబు - నిఖిల=సకలమయిన - పురాణ=సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితము లనెడి యైదులక్షణములు గలవై వ్యాసాదిప్రణీతము లయిన బ్రాహ్మపాద్మాదులయు - ఇతిహాస = పూర్వము జరిగినచరిత్రము లగు భారతాదులయు - సంహితా=గ్రంథములయొక్క - తాత్పర్య=అభిప్రాయముయొక్క - పర్యాలోచనా=విమర్శయొక్క - ధురంధర=భారమును వహించునట్టి - ధిషణా=బుద్ధియొక్క - సముత్సాహంబు =ప్రయత్నముకలది, ...పౌరాణిక=పురాణ మెఱింగినవారియొక్క, ... పరివేష్టింపన్ = చుట్టుకొనియుండఁగా, కొలువు ఉండి=సభ తీరి, ... పారీణుండు = తుదముట్టినవాఁడు (సింగనమంత్రి), సర...బునన్ - సరస=శృంగారాదినవరసములతోఁ గూడుకొన్నదయిన - సాహిత్య = కవనముకొఱకైన - గోష్ఠీ = కూటమియందలి - వినోద = వేడుకయొక్క - ప్రసంగంబునన్ = సంబంధములో.

శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచార భీమాంబకున్
గారా మైనతనూజు నన్నఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. 12

తా.—శ్రీనాథుఁడు భారద్వాజగోత్రమువాఁడు ఆపస్తంబసూత్రుఁడు విద్యలకు బ్రహ్మ యైన మారయ్యకును పతివ్రతాశిరోమణి యైన భీమమ్మకును ప్రియపుత్త్రుఁడు పాపరహితుఁడు. అట్టియా శ్రీనాథ (ఆఖ్యన్=) నామధేయుని సింగనమంత్రి పిలిచి సత్కరించి గౌరవముతో మిక్కిలియర్థవంతము లయిన మాటల నేర్పు మీఱ (నిట్లని వక్కాణించెను.) [విద్యా...డు-రూపకము.]

ఇందు 'విద్యారాజీవభవుండు' 'పుణ్యాచార' అనుతావుల 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాష నగు' అను బాలవ్యాకరణ సూత్రమునం జెప్పినట్లు ప్రథమ వచ్చినది; 'పుణ్యా...బకున్'-సమాసముగాఁ గొనుచో అవిమృష్ట విధేయాంశతా దోషము కలుగును. 'ప్రౌఢిమ!— ముగ్ధిమ ప్రౌఢిమ ఇత్యాదులయందు ఇమనిచ్ప్రత్యయము మృగ్య మని వామనోక్తి.

శా. బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్వాస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత

బ్రహ్మాండాది మహాపురాణ చయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళా నిధానమవు నీభాగ్యంబు సామాన్యమే! 13

బ్రా...వు - బ్రాహ్మీ=సరస్వతిచేత - దత్త=ఇయ్యఁబడిన - వర=కోరినకోరికయొక్క - ప్రసాదుఁడవు=అనుగ్రహము కలవాఁడవు, ఉరు...డవు - ఉరు=గొప్పదయిన-ప్రజ్ఞావిశేష = ప్రతిభాతిశయముయొక్క - ఉదయ = ఆవిర్భావముచేత - అజిహ్మ = కుటిలముగాని (అనఁగా సరళమయిన)-స్వాంతుఁడవు=చిత్తముగలవాఁడవు, ఈశ్వర అర్చన కళా శీలుండవు=శివ పూజా క్రియా నిరతుఁడవు, అభ్య...మవు = పూజితములును బ్రహ్మాండపురాణము ఆదిగాఁ గలవియు నైన గొప్ప పురాణముల (చయ=) సమూహముయొక్క యభిప్రాయ మయిన యర్థముచేత నిశ్చయింపఁబడిన బ్రహ్మజ్ఞాన మనెడి విద్యకు నిక్షేప మయినవాఁడవు,...భాగ్యము = అదృష్టము,...

తా.—ఓ శ్రీనాథపండితుఁడా నీవు సరస్వతివలన వరము పొందినవాఁడవు, ప్రతిభావంతుఁడవు, శివోపాసకుఁడవు; సకల పురాణ రహస్య మయిన బ్రహ్మజ్ఞానమువలన బ్రహ్మానంద మనుభవించుచున్నాఁడవు; నీయదృష్టము ఇతరులకు లేదు.

సామాన్యము నే అసామాన్య మనుట భేదకాతిశయోక్త్యలంకారము:—

"సాధారణ మగుదానిక। సాధారణతోక్తి భేదకాతిశయోక్తిః." అలం. సా. సం.

క. జగము నుతింపఁగఁ జెప్పితి। ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ। మగునారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్. 14

తా.—నాయొక్క (అనుంగు=)ప్రియుఁ డయిన పెద్దన్న యయిన ప్రెగడయ్యకు (నిగమ=) వేదములయొక్క సారసంగ్రహమయిన యారాధ్య (శైవులలోని పూజ్యులకు ఆరాధ్యు లని వారి వ్యవహారము - వారి) చరితము మొదలుగాఁగల పెక్కు (కృతుల్=) గ్రంథములను లోకులు కొనియాడు నట్లుగా అంకితము చేసితివి.

వ. కావున నాకు నొక్క ప్రబంధంబు పుణ్యశ్లోక పురాతన రాజర్షి చరితానుబంధ బంధురంబుగా రచియింపు. మందును— 15

పుణ్య శ్లోక=పావనమయిన కీర్తిగల—పురాతన = తొంటి—రాజర్షి = రాచఋషియొక్క — చరిత=చరిత్రముయొక్క — అనుబంధ=వర్ణనచేత — బంధురంబు గాన్=రమణీయ మగునట్లు.

సీ. కవిరాజ రాజి శేఖర హీర ముకుటంబు। శ్రీహీర కలశాబ్ధి శిశిరకరుఁడు.
మామల్లదేవీ కుమారరత్నంబు చిం। తామణిమంత్ర చింతన పరుండు
కవికులాదృష్టాధ్వ గమనాధ్వనీనుండు। కాశ్మీరనృపసభా కమల హేళి
ఖండనగ్రంథ సంగ్రంథ కర్కశ బుద్ధి। షట్తర్కమర్మైక చక్రవర్తి
గీ. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున। నెద్ది రచియించె బుధలోకహితముపొంతె,
నట్టినైషధసత్కావ్య మాంధ్రభాష। ననఘ యొనరింపు నాపేర నంకితముగ. 16

అనఘ=ఓయిపాపరహితుఁడా, కవి...ంబు—కవిరాజ=కవిశ్రేష్ఠుల—రాజి=వరుసయొక్క—శేఖర=సిగదండయైన హీరముకుటంబు=వజ్రకిరీటము, శ్రీ...ఁడు - శ్రీహీర=శ్రీహీరుఁ డనెడి —

కలశాబ్ధి = పాలసముద్రమునకు - శిశిరకరుఁడు = చంద్రుఁడు, మా...బు = మామల్లదేవియొక్క యుత్తమపుత్త్రుఁడు ('రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి'), చిం...డు=చింతామణి యను మంత్రముయొక్క భావనయందు ఆసక్తుఁడు, కవి...నుండు - కవి కుల = కవుల సమూహములచేత - అదృష్ట = చూడఁబడినవి కాని - అధ్వ = మార్గములయందు - గమన = నడక గల - అధ్వనీనుండు = బాటసారి, కాశ్మీ...హేళి=కాశ్మీర (దేశపు) రాజుయొక్క సభ యనెడి కమలమునకు సూర్యుఁడు, ఖండ... బుద్ధి—ఖండన = ఖండనఖండఖాద్య మనెడి - గ్రంథ = గ్రంథముయొక్క - సంగ్రంథ - కూర్పుట యందు - కర్కశ = దిట్టనయిన - బుద్ధి = తెలివిగలవాఁడు, షట్... ర్తి - షట్ = ఆఱయిన - తర్క = పదార్థములయొక్క - మర్మ = రహస్యములకు - చక్రవర్తి = స్వతంత్రప్రభువు, (ఇట్టివాఁడయిన), భట్ట హర్షుండు=శ్రీ హర్ష పండితుఁడు - బుధ...షాంకై=పండితసమూహము యొక్క మేలునకై, ప్రౌఢ వాక్ పాటవమునన్=నేర్పుగల వాక్కులయొక్క సామర్థ్యముచేత- ఎద్ది = ఏ నైషధకావ్యమును, రచించెనో, దానిని నా పేర నంకితముగా తెనిఁగింపుము.

తా.—కవిశ్రేష్ఠుఁడు, మామల్లదేవీ శ్రీ హర్షుల కుమారుఁడు, చింతామణీమంత్రసిద్ధుఁడు, ఇతరకవు లెవ్వరును కననినూతనమార్గముల కవనము చెప్పినవాఁడు, కాశ్మీరరాజుసభలో వెలింగిన వాఁడు, ఖండనఖండఖాద్య మను గ్రంథమును రచించినవాఁడు, తర్కశాస్త్రమందు అసమానుఁడు, అయిన శ్రీ హర్ష పండితుఁడు సంస్కృతభాషలో రచించిన నైషధకావ్యమును మాకు అంకితముగా నాంధ్రీకరింపుము.

విశేషములు.— ఖండనగ్రంథమునకు ఖండనఖండఖాద్య మని నిండుపేరు. ఖాద్య మనఁగా కజ్జము(మిఠాయి)- ఖండ మనఁగా కలకండ-ఖండఖాద్య మనఁగా కలకండతోడి మిఠాయి - ఖండన మనెడి కలకండమిఠాయి యని గ్రంథనామార్థము. షట్తర్కము లనఁగా షడ్దర్శనము లని ఆధునికులు కొందఱు తలంచిరి ; పూర్వులచే ఈరెండును వేఱ్వే అని తెల్పఁబడియున్నవి : కవికల్పలతలో—

'షడ్వ్రజకోణ త్రిశిరో నేత్ర తర్కాఙ్గ దర్శనమ్ । చక్రవర్తి మహాసేనవద నర్తు గుణా రసాః.'

'తర్క్యన్తే ఇతి తర్కాః పదార్థాః'— తర్కదీపిక:— తర్కింపఁబడునవి గావునఁ పదార్థములు తర్కము లనఁబడును-అని యర్థము. 'ధర్మవిశేషప్రసూతా ద్ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమ వాయానాం పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిశ్రేయసమ్' అని వైశేషిక సూత్రము.—'కాశ్మీరనృపసభా' - ఇచట సభాశబ్దమునకు పూర్వపదము రాజవిశేషవాచకము గాన 'సభారాజామనుష్యపూర్వా' అను సూత్రము పట్టనందువలన నపుంసకత్వము రాలేదు.

ఆ॥ 'శ్రీహీరకులవార్ధి శిశిరకరుఁడు' అను పాఠమున - శ్రీహీరకులమనెడి సముద్రమునకు చంద్రుఁ డని యర్థము ; కులమున కెల్ల కీర్తి తెచ్చినవాఁ డని యభిప్రాయ మైన నగుఁగాని శ్రీహీర శబ్దము పితృనామమో కులనామమో తేటపడదు; తండ్రి యెవఁడో తెలుపుట ఆవశ్యకము.

అ॥ సీస ప్రథమ తృతీయపాదములందును 'షట్... ర్తి' అనుదానను రూపకాలంకారము,

చ. పనివడి నారికేళ ఫలపాకమునం జవి యైన భట్టహ
ర్షని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద ఱయ్యలా
నని కొనియాడ నేర. రది యట్టిద; లేజవరాలు చెక్కుఁగీ
టిన వస వల్చుబాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే? 17

'నారికేళఫలపాకము'-ద్రాక్షాపాకము నారికేళపాకము అని కవనమునకు పాకములు రెండు.

' ద్రాక్షాపాకో భవేత్సోఽయం బహిరన్తఃస్ఫురద్రసః
బహిః ఖరో నారికేళ పాక స్త్వన్తర్మృదు ర్భవేత్.' సాహిత్యరత్నాకరము.

నారికేళపాకము బయటికి కఠినముగాను లోపల మృదువుగాను ఉండు నని లక్షణవాక్యార్థము. కవితా అనుగుంభములు=కవన రచనలను. ఔను అని = చక్కఁగా నున్నవి అని. కొనియాడక = పొగడుటకు. లేజ... నే— లేఁతప్రాయపు సుందరి చెక్కిలి మీటినయెడల నోట వసవాసన గొట్టు (అనఁగా—మిక్కిలిపసివాఁ డయిన) శిశువు హృదయములో కామోన్మాదమును పొందునా ?— మూర్ఖులు మెచ్చనిమాత్రాన ప్రబంధప్రాశస్త్యమునకు కొఱఁత గలుగ దని భా.— మూర్ఖులు సత్కావ్యములను నిందించుట 'శుష్కస్తనీకంచుకన్యాయంబు'న ; ఆన్యాయంబునకు వివృతి:—

' విపులహృదయాభియోగే । ఖిద్యతి కావ్యే జడో న మౌర్ఖ్యే స్వే;
నిన్దతి కఞ్చుక మేవ । ప్రాయః శుష్కస్తనీ నారీ.'

దృష్టాంతాలంకారము:—'కృతి దృష్టాంతము బింబ । ప్రతిబింబతఁ; గీర్తి నీదె ప్రభ చంద్రునిదే.'

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలం బొసంగి జాంబూనదాంబరాభరణంబులు గట్ట నిచ్చి వీడ్కొలిపిన; నేను నమ్మహాప్రధానునిం గృతినాయకుం జేసి నైషధకావ్యంబు చెప్పందొడంగితిఁ. దత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. 18

జాంబూనద=బంగారపు - అంబర=వస్త్రములను - ఆభరణంబులు=తొడవులను. వీడ్కొలిపినక=పంపఁగా. ప్రధానునిక=మంత్రిని. తొడంగితిక = ఆరంభించితిని. తదీయ=ఆసింగన మంత్రియొక్క. అవతారంబు=పుట్టుకను.

ఈ నైషధమునకు 'శృంగార'విశేషణము—ఇందు ప్రణయదూత్యము ఆదిగా వివాహానంతర సంభోగ మంతముగా శృంగారరసప్రధాన మయిన కథాభాగము మాత్రమే వర్ణిత మగుటచేత కలిగినది. ఏతన్మూలమును 'నైషధశృంగార' మని శ్రీనాథుఁడే గ్రంథాంతమున పేర్కొని యున్నాఁడు.

శా. ఘోరం బైన తపోవిశేషమున సద్యోజాత వక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్షఁ గొనియెన్, సప్తర్షులం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ, గనియెం ద్రయ్యర్థ సంఘాతమున్,
భారద్వాజ మహామునీంద్రుఁ డగదే భక్తిం బ్రశంసింపఁగన్. 19

(భారద్వాజమహాముని), ఘోరంబు ఐన తపో విశేషమునక=గొప్ప దయిన తపోఽతిశయముచేత (అనఁగా తాను గొప్పతపస్సు చేసి అందులకు వరముగా), గౌరీవల్లభుచేతక = శివునిచేత, సద్యోజాతవక్త్రంబునక= (శివునికి సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అని అయిదుముఖములు — అందు) సద్యోజాతమనెడి (ప్రధాన) ముఖముచేత, దీక్షక = శైవదీక్షను, కనియెక=పొందెను; సప్తర్షులందుక=కశ్యపాదు లైన యేడుగురు సత్యవచసులలో— వా రెవ్వ రన—

' కశ్యపోఽత్రి ర్భరద్వాజో విశ్వామిత్త్రో శ్చ గౌతమః
జమదగ్ని ర్వసిష్ఠ శ్చ స ప్తైతే ఋషయః స్మృతాః.'

...తారావీథిక్ = నక్షత్రమార్గమును (సప్తర్షి చక్రము చరించుచున్నట్టి పరివహావాయుస్కంధముననుట), ...త్ర...ముక్ - త్రయీ = వేదములయొక్క - అర్థ = అభిధేయములయొక్క - సంఘాతముక్ = రాశిని, కనియెక్ = చూచెను....ప్రశంసింపఁగఁక్ = పొగడుట.

ఉ. ఆమునినాథు నన్వయమునం దుదయించెఁ బయఃపయోనిధిక్
యామవతీ కళత్రుఁ డుదయం బయినట్లుగఁ గల్పవృక్షచిం
తామణికామధేను సమ దాన నిరూఢుఁడు విద్విషత్తమ
స్తోమదివాకరుండు పెదతూర్కనమంత్రి కులాగ్రగణ్యుఁ డై. 20

అన్వయమునందుక్ = వంశమునందు. పయః పయోనిధిక్ = పాల సముద్రమునందు - యామవతీ కళత్రుఁడు = రాత్రి భార్యగాఁగలవాఁడు (చంద్రుఁడు) - పయః...నట్లు - వంశమున కెల్ల తని వియు కీర్తియు కలుగునట్లు అని భా. దాన నిరూఢుఁడు = దానమునందు స్థిరమయినవాఁడు. విద్వి...రుండు - విద్విషత్ = శత్రువుల నెడి - తమః = చీఁకట్లయొక్క - స్తోమ = సమూహములకు - దివాకరుండు = సూర్యుఁడు.

తా.— పెదతూర్కన యను మహామంత్రి భారద్వాజమునివంశములోఁ బుట్టినవాఁడు.

వ. తత్సంతాన క్రమంబున. 21

మ. కుటిలారాతి వరూథినీ ధవశిరః కుట్టాక ధాటీ మహా
పటహ ధ్వాన విపాట్యమాన దశ దిగ్భాగుండు త్రైలోక్య సం
పుట పేటీ పరిపూర్ణ కీర్తిమయ కర్పూర ప్రకాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసి యై. 22

కుటి...గుండు - కుటిల = కుత్సితులయిన - అరాతి = శత్రువులయొక్క - వరూథినీ = సేనలయొక్క - ధవ = నాయకులయొక్క - శిరః = తలల - కుట్టాక = కొట్టునవైన - ధాటీ = దాడులయందలి - మహా పటహ = గొప్ప తప్పెటలయొక్క - ధ్వాన = ధ్వనులచేత - విపాట్యమాన = చీల్పఁబడుచున్న - దశ = పదియైన - దిక్ = దిక్కులయొక్క - భాగుండు = ప్రదేశములు గలవాఁడు, త్రై...డుండు - త్రైలోక్య = మూఁడులోకముల నెడి - సంపుటపేటీ = దొంతిపెట్టెలయందు - పరిపూర్ణ = నిండిన - కీర్తిమయ = కీర్తిరూపమైన (అనఁగా కీర్తి యనెడి) - కర్పూర ప్రకాండుండు = శ్రేష్ఠమైన కర్పూరముకలవాఁడు, (అయిన), శ్రీ చిటిపెద్దప్రభుఁడు, విక్రమపురీ = (విక్రమసింహాపురమనెడి యపరనామముగల) నెల్లూరియొక్క - సింహాసన అధ్యాసి = సింగపుఁబీట నెక్కినవాఁడై, ఒప్పెను.

తా.— సకల దిగ్జేతయు మహాకీర్తియు నైన చిటిపెద్దప్రభువు నెల్లూరిలో రాజ్య మేలెను. నెల్లూరే యన గ్రంథాంతమందలి పెద్దవచనములోని ప్రస్తావంబును నిదర్శనము.

'విపాట్యమాన'— అను క్తవిషయ స్వరూపోత్ప్రేక్ష - వాచకము లేమిచే గమ్య:—

' ఫలతను హేతుత వస్తుత । నలరెడుసంభావనంబు లగు నుత్ప్రేక్షల్ ;
తొలిరెండును సదసద్విష । యలు కథితాకథితవిషయ యంతిమయు నగుక్.' అలం. సా. సం.

త్రైలోక్య ... పేటీ ... కీర్తి కర్పూర' — రూపకము.

క. ఆ చిటిపెద్ద ప్రభునకు। వాచస్పతి సదృశ నీతివైభవలక్ష్మీ
వైచిత్రి కధికవిమల శి। వాచారఘనుండు మామిడన్న జనించెన్. .... 23

వాచ...త్రికిన్ - వాచస్పతి=బృహస్పతితో - సదృశ=సమానమయిన - నీతి=నయవిద్య యొక్క - వైభవ=మహిమయొక్క - లక్ష్మీ=సిరియొక్క - వైచిత్రికిన్ = నానాప్రకారత కలవానికి—బహువిధనీతిప్రయోగసమర్థున కనుట (ఉపమాలంకారము), శివా...ఘనుండు=శివప్రియ మైన యాచారముచేత గొప్పవాఁడు.

ఉ. స్వామిహితంబునన్, సమద శాత్రవ భంజనశక్తి, బంధుర
క్షా మహనీయ సంపద, వసంత సమాగమ ఫుల్ల మల్లికా
స్తోమ తుషార పాండుర యశో గరిమంబున, ధర్మశీలతన్,
మామిడిమంత్రిఁ బోల మఱి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్. 24

సమ...క్తిన్ - సమద=మదముగల - శాత్రవ=శత్రువులయొక్క (శత్రువులను) - భంజన పగులఁగొట్టెడు - శక్తిన్=సామర్థ్యమందును, బంధు...దన్=బంధువులను రక్షించుటచేత పూజ నీయమయిన ధైశ్వర్యమందును, వసం...బునన్ - వసంత=(పుష్పవృద్ధికి ప్రధానమును తమబుతు వును ఐన) యామనియొక్క - సమాగమ = రాకచేత - ఫుల్ల=వికసించిన - మల్లికా = మల్లెల యొక్క - స్తోమ = సమూహమువలెను - తుషార = మంచువలెను - పాండుర = తెల్లనయిన - యశః= కీర్తియొక్క - గరిమంబునన్ = గొప్పతనమునందును...వసుంధరా స్థలిన్=భూతలమందు ...

తా.—మామిడన్న దొరకు మేలు చేయువాఁడు శత్రుసంహర్త బంధురక్షకుఁడు ఐశ్వర్యవం తుఁడు కీర్తిమంతుఁడు ధర్మాచారతత్పరుఁడు.—మల్లికాదిసాదృశ్యముచే నుపమాలంకారము. సాటి లేరనుట అసంబంధాతిశయోక్తి.

గీ. అతనియర్ధాంగలక్ష్మి యక్కాంబ గనియె। నాత్మజుల వేదమూర్తుల నబ్ధినిభుల
వెలయ శ్రీపెద్దనామాత్య వీరభద్ర। మారనప్రభు నామన మంత్రివరుల. 25

అర్ధాంగలక్ష్మి=భార్య (పురుషునిదేహమందు సగము భార్యగావున అట్లు పేర్కొనుట)

'లోకే వేదే చ శాస్త్రే చ ధర్మశాస్త్రేషు చైవ హి ।
శరీరార్ధం స్మృతా జాయా పుణ్యాపుణ్యఫలే సమే.'

అబ్ధినిభులన్=సముద్రతుల్యులను.—వీరు నలువురు, వేదములు నాలుగు, సముద్రములును నాలుగు, కావున సంఖ్యాసామ్యముచేతనుంగూడ ఉపమలు శోభిల్లుచున్నవి.

సీ. అనవద్య హృద్య విద్యా బుద్ధి సంసిద్ధి । బిసరుహాసను నుద్ది పెద్దవిభుఁడు;
భద్ర నిర్నిద్ర వాఙ్ముద్రా సముద్వృత్తిఁ । గద్రూభవుఁడు వీరభద్రమంత్రి;
మేరుభూధర సార ధీరతా గుణ హారి । వైరి శైల బలారి మారశౌరి;
స్వామిభక్తిహిమ త్రైకభావ వైభవ భూమి । భామినీ రతిరాజు నామరాజు;

గీ. మామిడీశ్వరసాగరామరకుజంబు। లక్కమాంబికా శుక్తి రత్నాంకురములు
వంశపావను లర్థార్థివాంఛితార్థ। దానధుర్యులు స్మార్తధర్మ పరులు. 26

అన...ద్ధిన్ - అనవద్య=నిర్దోషమయిన - హృద్య=మనోహరమయిన - విద్యా=విద్యల యొక్కయు - బుద్ధి=తెలివియొక్కయు - సంసిద్ధిన్=కలిమియందు, బిస...ద్ది - బిసరుహా=కమ

లము - ఆసన = పీఠముగాఁగలవాఁడయిన బ్రహ్మదేవునియొక్క - ఉద్ది=సాటి. [ఉపమాలంకారము.]

భద్ర...త్తిన్ - భద్ర=మంగళకరమయిన - నిర్నిద్ర=జాగరూకమయిన - వాక్ = మాట యొక్క - ముద్రా=ప్రకారముయొక్క - సముద్వృత్తిన్ = ప్రచారమందు, కద్రూభవుఁడు= నాగుఁడు - శేషాహి యనుట, (శేషాహికి వేయి నోళ్లు - వీరభద్రమంత్రి ఒకనోటితోనే వేయినోళ్లు ఉన్నట్లు భాషింపఁగలవాఁడు - అనఁగా - మహావాగ్మి యని భా.) [రూపకాలంకారము.]

మార శౌరి=శ్రీకృష్ణునివంటివాఁ డగు మారనమంత్రి(శూరుఁ డనువాని గోత్రాపత్యము శౌరి), మేరు...హారి - మేరుభూధర=మేరుపర్వతముయొక్క - సార=స్థిరాంశముయొక్క - ధీరతా= ధైర్య మనెడు - గుణ=గుణముచేత - హారి = మనోహరుఁడును, వైరి శైలబలారి = శత్రువు లనెడి - శైల=కొండలకు - బలారి=ఇంద్రుఁడును [ఇంద్రుఁడు కొండలకు ఱెక్కలు తెగఁగొట్టినట్లు ఇతఁడు వైరులకు భంగపాటు సేయువాఁ డని భా. ఇంద్రుఁడు బలాసురుని కొట్టినాఁడు గాన ఇంద్రునికి బలారి (బలుని శత్రువు) అని పేరయినది.] వైరిశైల బలారి—రూపకము. మేరుభూధరమువంటి అనునర్థమున ఉపమ, మేరుభూధరముయొక్క అను నర్థమున ఒకదానిగుణమును మఱియొకదానికి చెప్పుటచేత పదార్థవృత్తినిదర్శన:—

'అన్యంబున సామాన్యము । నన్యమున విధింపఁ దాల్చు నరవిందరుచిన్
గన్యవదన మనువిధమున । నన్య నిదర్శన దగున్ బదార్థగత యనన్.' అలం. సా. సం.

నామరాజు = నామనమంత్రి (రా జని గౌరవార్థము అను ప్రయుక్తము); స్వా...మి - స్వామి=దొరయందు - భక్తి=అనురాగముయొక్కయు - హిత = (దొరయొక్క) మేలునందు - ఏకభావ=ప్రధానాభిప్రాయముయొక్కయు - వైభవ = మహిమకు - భూమి=చోటయినవాఁడు, భామినీ రతిరాజు=భామలకు మన్మథుఁడు [రూపకాలంకారము.]

(వీరు), మామి...బులు - మామిడీశ్వర=మామిడిప్రభువ నెడి - సాగర=సముద్రముయొక్క - అమరకుజంబులు=కల్పవృక్షములు [రూపకము], అక్క...ములు - అక్కమాంబికా = అక్కమ్మ యనెడి - శుక్తి=ముత్తెపుఁజిప్పయొక్క - రత్న అంకురములు=ముత్యాల మొలకలు [రూపకము], వంశపావనులు=వంశమును పవిత్రముచేయువారు, అ...లు - అర్థ=ధనములచేత - అర్థి=కోర్కి గలవారియొక్క (ధనము కోరినయాచకులయొక్క) - వాంఛిత=కోరిన - అర్థ=ధనములయొక్క - దాన = ఈవియందు - శౌండులు = నిపుణులు, సౌ...రులు - సౌభ్రాత్ర = మంచితోఁబుట్టుఁ తనముయొక్క - ధర్మ=న్యాయము - పరులు=ప్రధానముగాఁగలవారు.

తా.—పెద్దయ్య మహావిద్వాంసుఁడును బుద్ధిమంతుఁడును, వీరభద్రయ్య మహావాగ్మి, మారయ్య మహాధీరుఁడును జేతయు, నామన్న స్వామిహితభక్తుఁడును సుందరుఁడును. నలువురును అక్కమ్మకును మామిడన్నకును పుత్త్రులు సదాచారులు దాతలు ఒద్దిక గలిగినయన్నదమ్ములు.

మ. అన తారాతి వసుంధరారమణ సప్తాంగాపహారక్రియా
ఘన సంరంభ విజృంభమాణ పటు దోఃఖడ్గా ద్వితీయార్జునుం
డన వేమాధిపరాజ్యభార భరణ వ్యాపార దక్షుండు పె
ద్దనమంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్! 27

అన...నుండు - అనత=వంగని - అరాతి వసుంధరా రమణ=శత్రు భూపాలురయొక్క - సప్తాంగ=(రాజు, మంత్రి, మిత్త్రుఁడు, బొక్కసము, దేశము, దుర్గము, దండు అనెడి) యే

డంగములయొక్క - అపహార = అపహరించుటయనెడి - క్రియా=పనియందు - ఘన=గొప్పదైన - సంరంభ=పూనికచేత - విజృంభమాణ = ఏచుచున్న - పటు=బల్లిదమైన - దోః = బాహువు యొక్క - ఖర్జూ=దురదచేత - ద్వితీయ = రెండవ - అర్జునుండు = పార్థుఁడు [రూపకము] ; అన... జ్ఞుండు - అనవేమాధిప=అనవేమరాజుయొక్క - రాజ్యభార భరణ=రాజ్యభారమును వహించుట యనెడి-వ్యాపార=పనియందు-దక్షుండు=నేర్పరి...ఏ తన్మాత్రుఁడే=ఈపాటి(యాపాటి)వాఁడా! [భేదకాతిశయోక్త్యలంకారము.]

తా.—పెద్దనమంత్రికి అర్జునునికిం బోలె లోఁగని శత్రురాజుల సప్తాంగములను హరించుటకు చేతులు దురద గొనుచుండును. ఆయన వేమారెడ్డిగారికి మంత్రిగా నుండి వారిరాజ్యభారమును చక్కఁగా వహించెను.

ఇచట నాలవపాదమందు 'పెద్ద+అన' అని ఛేద మున్నను 'దా' కే యతి చెల్లినది:—

'అప్ప యయ్య యన్న యర సవ్వ య మ్మక్క। యాయి యనుపదంబు లదుకుసంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ। వళులనంగ నూఁదఁబడక యైన.' అప్పకవి.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటి పెద్ద ధృతిన్, భుజంగమ
స్వామికి మేలుచేయి పటువాగ్విభవంబున, బుద్ధిసంపదం
దామరచూలికి న్సరి, ప్రధానులుదక్కినవారు సాటియే
మామిడివీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్? 28

ప్రధానులు...ధరన్ = మంత్రిశ్రేష్ఠుఁ డయిన మామిడివీరయ్యకు భూలోకములో కడమ మంత్రులు సాటిగారు. ఏల యన, ఆతఁడు, ధృతిన్=స్థైర్యమునందు, హేమ ధరాధరేంద్రమునకున్ = బంగారు పర్వతశ్రేష్ఠమునకు, ఎక్కటి = మిక్కిలి, పెద్ద = అధికుఁడు, వాక్ విభవంబునన్=మాటయొక్క సంపదయందు, భుజంగమస్వామికిన్=పాఁపఱేనికి-అనఁగా శేషాహికి, మేలుచేయి=మించినవాఁడు,...తామరచూలికిన్=బ్రహ్మదేవునికి....[ఉపమలు.]

ఉ. సత్యవచో నిరూఢుఁడు నిశాకరశేఖర భక్తి భావనా
సాత్యవతేయుఁ డుద్భట భుజాబల విక్రమ కేళి విక్రమా
దిత్యుఁడు కార్య ఖడ్గ సముదీర్ణుఁడు మామిడిమంత్రిమారనా
మాత్యుఁడు; వానిఁ బోల వశమా ధరణీధవ మంత్రికోటికిన్ ? 29

మా...డు=మామిడిమంత్రికుమారుఁ డయిన మారనమంత్రి, స...ఁడు - సత్య=నిజమయిన - వచః=మాటయందు - నిరూఢుఁడు=నెలకొన్నవాఁడు, నిశా...ఁడు - నిశాకరశేఖర=చంద్రుఁడు సిగదండగాఁ గల వాఁడయిన శివునియందలి - భక్తి భావనా = భక్తితోడి ధ్యానమునందు - సాత్యవతేయుఁడు = వ్యాసుఁడు, ఉద్భ...ఁడు ఉద్భట=మితి మీఱిన - భుజాబలవిక్రమకేళిన్= బాహుశక్తిపరాక్రమములక్రీడయందు- విక్రమాదిత్యుఁడు=హిందూదేశమునకు మ్లేచ్ఛులను రానీయక జయించిన విక్రమాదిత్యుఁ డనెడి యుజ్జయినీపతి, కా...ర్ణుఁడు - కార్య = మంత్రాలోచనయందును - ఖడ్గ = యుద్ధమందును-సముదీర్ణుఁడు = నెగ్గినవాఁడు, ధర...కిన్ - ధరణీధవ=రాజుల యొక్క - కోటికిన్ = సమూహమునకు. [రూపకములు కలవు.]

తా.—మారనమంత్రి సత్యవచనుఁడు శివభక్తాగ్రేసరుఁడు మహావీరుఁడు నయజ్ఞుఁడు, మేటి జోదు; ఏమంత్రియు నాతనికి సాటి గాఁడు.

నాలవపాదమున ప్లుతయతి; అందులకు అప్పకవి:—

'పలుకుల తలఁ గలప్రాలకు । వల నగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వలులుగఁ జెప్పినఁ గావ్యం । బుల నది కాకుస్వరంబుఁ బ్లుతయతియు నగున్.'

శా. స్వామిద్రోహర గండ లాంఛనునకున్ సంగ్రామ గాండీవికిన్
వేమక్ష్మాపతి రాజ్యభార కలనా విఖ్యాత ధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజ నిటలాంత ర్న్యస్త భాగ్యాక్షర
స్తోమాపాకరణ ప్రవీణునకు మంత్రు ల్సాటియే యెవ్వరున్ ? 30

స్వా...కున్ — స్వామి=ప్రభువునకు - ద్రోహర = ద్రోహముచేయువారియొక్క - గండ= మగఁడు - అనెడి - లాంఛనునకున్=బిరుదుగలవాఁడును, సం...కిన్=సంగ్రామ యుద్ధములో - గాండీవికిన్=అర్జునుఁడును, వే...కిన్ — వేమక్ష్మాపతి=వేమరాజుయొక్క—రాజ్య భార కలనా= రాజ్య భారముయొక్క మోఁతయందు - విఖ్యాత=కొనియాడఁబడిన-ధీ=బుద్ధియొక్క - శక్తికిన్= సామర్థ్యము కలవాఁడును, అన్య...కున్ — అన్యరాజ = ఇతరరాజులయొక్క - నిటలాంతః= లలాటములోపల - న్యస్త=ఉంపఁబడిన - భాగ్య=ఐశ్వర్యముయొక్క - అక్షర=వర్ణములయొక్క— అపాకరణ=తుడిచివేయుటయందు - ప్రవీణునకున్=నేర్పుగలవాఁడును,(అయిన), నామామాత్యున కున్=నామనమంత్రికి, మంత్రుల్ ఎవ్వరున్ సాటియే ...

ఉ. తమ్ములు దన్ను మువ్వురును దైవముఁగాఁ గురుఁగా మహానిధా
నమ్ముఁగ దాతఁగాఁ దమమనంబుల భావన సేసి కొల్వ, భా
గ్యమ్ముల కెల్ల నెల్ల యయి కాంచెఁ బ్రసిద్ధి నృప ప్రధాన ర
త్నమ్మగుమంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాముకైవడిన్. 31

మహానిధానమ్ము = గొప్పనిక్షేపము. ఎల్ల=హద్దు. ఉదాత్త మతిన్ = గొప్ప మనస్సుచేత ('ఉదాత్తో దాతృ మహతో ర్హృద్యే చ స్వరభి ద్యపి' హేమ.) కైవడిన్ = వలె.

సీ. గౌతమ గోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ । పరమ సంయమి సూత్రపావనుండు
గారాపుఁబౌత్త్రుండు గంధవారణుఁ డగు । శ్రీ కేత నామాత్య శేఖరునకు
పేమణిహనుమంత బిరుదాంకు లగురాచ । వారికి నెయ్యంపు వరసుతుండు
చౌహత్త మల్లుండు దోహత్త నారాయ । ణుండు ఖండియరాయ చండబిరుద

తే. మంత్రి యల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకు నత్యంత గరిమఁ
దల్లియును దండ్రియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహ మయ్యె. 32

విఖ్యాతుఁడు=ప్రసిద్ధుఁడు - పరమసంయమి=మహామునియొక్క - సూత్ర=కర్మవ్యవస్థచేత- పావనుండు=పవిత్రమయినవాఁడు. గంధవారణుఁడు—బిరుదు-(మదపుటేనుఁ గని యర్థము.) అమాత్య

శేఖరునకున్ = మంత్రిశ్రేష్ఠునికి. పేప...కులు=పేపణిహనుమంత యని బిరుదు (అంకము=) గుర్తు కలవారు (పేపణి యనఁగా సన్నెకల్లు - హనుమంతుఁడు సన్నెకంటిమీఁద పచ్చడి నూఱిన ట్లెట్లు నూఱునో శత్రువులను అట్లు నూఱెడువాఁడు అని బిరుదార్థముగా నుండనోపు.) సెయ్యంపు = గారాబంపు - వరసుతుండు = వరముచేఁ గలిగిన కుమారుఁడు. చౌహత్తమల్లుండు - బిరుదు - (నాలుగు భుజముల జెట్టి - చతుర్భుజుఁ డయిన నారాయణునితో తుల్యుఁ డని భా.) దోహత్త నారాయణుండు-బిరుదు - (చేతులు రెండే అయినను నాలుగుచేతులు గల నారాయణునంత వీరుఁ డని భా.) ఖం...బిరుద - ఖండియరాయ=ఖండియరాయఁ డని (ఆ పేర నొక మహావీరుఁ డుండెను. అంతవాఁ డను నభిప్రాయముతో ఇతనికి ఆ బిరుదు చెప్పుట) - చండబిరుద = భయంకర మయిన బిరుదుగల, ...మహిత పుణ్య=కొనియాడఁబడిన పుణ్యములు గలది, ... అత్యంతగరిమన్ = అమిత మయిన గౌరవముతో,...ఉద్వాహము=పెండ్లి,...

ఈ పెద్దనమంత్రి తెల్లమ్మను పెండ్లియాడెను. ఆమెకు తండ్రి అల్లాడరాజు, తల్లి అన్నమ్మ, తాత పేపణిహనుమంతుఁడు, ముత్తాత కేతన మంత్రి.

మ. వనితారత్నము తెల్లమాంబికకు శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందనుల్ విమల విద్యా భారతీ వల్లభుల్
వినతాసూను సమాన విక్రమనిధుల్ వీరుండు వేమాహ్వయుం
డును శ్రీపెగ్గడ దండనాథ తిలకుండున్ సింగనామాత్యుఁడున్. 33

వనితారత్నము=రత్నమువంటి స్త్రీ యగు. శ్రీవత్సాంక తుల్యుండు=నారాయణునితో సమానుఁడయిన (నారాయణుని వక్షమం దున్న మచ్చకు శ్రీవత్స మని పేరు, కావున ఆయనకు శ్రీవత్సాంకుఁ డని నామము.) నందనుల్=కొమరులు. విమల విద్యా భారతీవల్లభుల్=శుద్ధమయిన విద్యయందు బ్రహ్మలు. విన...ధుల్-(వినత యని గరుత్మంతుని తల్లి పేరు) - వినతా సూను=వినత కొడుకయిన గరుత్మంతునితో - సమాన=తుల్యమయిన-విక్రమ=పరాక్రమమునకు - నిధుల్=నిక్షేపము లయినవారు. వేమాహ్వయుండున్ - వేమ = వేముఁ డను - ఆహ్వయుండున్ = పేరుగలవాఁడును. దండ నాథ తిలకుండున్=సేనా పతి శ్రేష్ఠుఁడును.

వ. అం దగ్రజుండు. 34

అగ్రజుండు=మొదటఁ బుట్టినవాఁడు - అనఁగా పెద్దవాఁడయిన వేమనమంత్రి.

సీ. కాలకంఠ కఠోర కంఠహుంకారంబు । చెవులు సోఁకనినాఁటిచిచ్చిత్తభవుఁడు,
కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబు । తనువు నాటనినాఁటి వనధిరాజు,
క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య । వికృతిఁ గ్రుంగనినాఁటి వింధ్యశిఖరి,
వీరభద్రోదార ఘోర వీరావేశ । విహతిఁ గందనినాఁటి తుహినకరుఁడు,
తే. చక్కఁదనమున గాంభీర్యసారమునను । బ్రకటధైర్య కళాకలాపములయందు
దండనాయక చూడావతంస మైన । మంత్రిమామిడి వేమనామాత్యుఁ డెలమి.

దండనాయక చూడా అవతంసము = సేనా పతులకు సిగపువ్వు (సేనానాయకశ్రేష్ఠుఁడు), అయిన - మం...డు = మామిడి మంత్రికొడుకు వేమనమంత్రి, ఎలమిన్ = విశ్వాసముతో, చక్కఁ

దనమునన్, కాల...భవుఁడు=నీలకంఠుఁ డయినశివునియొక్క భయంకర మయిన కంఠహుంకారము చెవులకుఁ దగులని నాఁటి మన్మథుఁడు; గాంభీర్య సారమునన్=లోఁతుయొక్క స్థిరాంశమందు, కుపి...రాజు = కోపగించిన శ్రీరామునియొక్క గొప్ప కఠోర బాణము దేహమునకు తగులనినాఁటి సంద్రముల ఱేఁడు; ప్రకటస్థైర్య = ప్రస్ఫుటమయిన ధీరతయందు, క్రుద్ధ...రి = కోపించిన యగస్త్యుని బొమ తీవయొక్క వంకరయొక్క వికారముచేత క్రుంగనినాఁటి వింధ్య పర్వతము; కళాకలాపములయందున్ = విద్యలయొక్క సమూహములయందు, వీర...రుఁడు = వీరభద్రునియొక్క గొప్పదియు భయంకరమును (అయిన) (వీర+ఆవేశ) వీరముయొక్క పూనికయొక్క దెబ్బచేత కమలనినాఁటిచంద్రుఁడు, అయి యున్నాఁడు - అని క్రియను చెప్పుకోవలయును.

తా.—వేమనమంత్రి వరుసగా హర రా మాగస్త్య వీరభద్రులచేత భంగ మొందని మన్మథ సముద్ర వింధ్య చంద్రులవలె సుందరుఁడు గంభీరుఁడు ధీరుఁడు కళావంతుఁడును.

ఇందు పెద్ద పాదములయందు అధికాభేదరూపకము, పెద్దపాదములకును తొలి రెండు గీతపాదములయందలి విషయములకును యథాసంఖ్యాలంకారము.

మ. తగుఁ గైవార మొనర్ప విక్రమ కళా ధౌరేయతా శాలి శ్రీ
ప్రెగడన్న ధ్వజినీశుఁ డంబునిధి గంభీరుండు శుంభ ద్ద్విష
న్నగర ద్వార కవాట పాటన విధాన ప్రౌఢ బా హార్గళా
యుగళుం డాహవ సవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కునన్. 36

విక్రమ కళా ధౌరేయతా శాలి=పరాక్రమ విలాసముయొక్క - భారవాహిత్వముచేత నొప్పారుచున్న వాఁడును, అంబునిధి గంభీరుండు = సముద్రమువలె లోఁతయినవాఁడును, శుంభ... గళుండు=(శుంభత్=)ప్రకాశించుచున్న (ద్విషత్=) శత్రువులయొక్క పట్టణముల దర్వాజాలయొక్క తలుపులయొక్క పగల్చుటయను పనియందు సమర్థమయిన (అర్గళా=) గడియమ్రాఁకుల వంటి (బాహా=)భుజములయొక్క జంటకలవాఁడును, ఆహవ సవ్యసాచి=యుద్ధమందు అర్జునుండును [కుడిచేతితో మాత్రమేగాక ఎడమచేతితోఁగూడ బాణప్రయోగముచేయువాఁడు గావున అర్జునునికి సవ్యసాచి యని పేరు గలిగినది - సవ్య=సవ్యముతో - అనఁగా ఎడమ (చేతి)తో - సాచి=ప్రయోగించువాఁడు,] (అయిన), ప్రెగడన్న - ధ్వజినీ+ఈశుఁడు = దండనాథుఁడు, ఒక్కండు, పేరుక్కునన్=మహాబలవిషయమై, ధరలోన్, కైవారము ఒనర్పఁగాన్ తగున్=స్తుతి చేయ నర్హుఁడు.

తా.—పరాక్రమవంతుఁడు గంభీరుఁడు శత్రుపురభేదకుఁడు యుద్ధదక్షుఁడు నగు ప్రెగడన దండనాథుఁడు ఒకఁడే బలము విషయములో పొగడ నర్హుఁడు.

సీ. గగన కల్లోలినీ కల్లోల మాలికా। హల్లీసకములతో నవఘళించి,
చరమ సంధ్యా కాల సంఫుల్ల మల్లికా। స్తబక పంక్తులతోడ సరస మాడి,
శర దాగ మారంభ సంపూర్ణ పూర్ణిమా। విమల చంద్రికలతో వియ్య మంది,
బిసరుహాసన వధూ పృథు పయోధర భార। హారవల్లరులతో నసఁగి పెనఁగి,
తే. వెలయు నెవ్వాని యభిరామ విమల కీర్తి,
యతఁడు త్రిభువనరాయ వేశ్యాభుజంగ

కదనగాండీవి జగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివవరుఁడు. 37

ఎవ్వాని యభిరామ(=మనోహర) విమలకీర్తి, గగ...తోడన్=ఆకాశ నది యొక్క-(మందాకినియొక్క- యనుట) పెద్దయలల ('అ థోర్మిషు మహ త్స్వుల్లోలకల్లోలా' అమ.) వరుసయొక్క-మండలనృత్యముతో, అవఘళించి=ఎదిరించి;

చర...తోడన్=కడపటి సంజ వేళయందు వికసించిన మల్లె గుత్తుల వరుసలతో, సరసమాడి=చతురవచనములు పలికి;

శర...తోడన్=(శరత్=)పంటకారుయొక్క- (ఆగమ=) రాకయొక్క- ప్రథమదశయందలి నిండు పున్నమయొక్క- యచ్చంపు వెన్నెలలతో, వియ్యము అంది=సంబంధము చేసి;

బిస...తోడన్=బ్రహ్మయొక్క- (బిసరుహ=కమలము - ఆసన=పీఠముగాఁగలవాఁడు) భార్య (యయిన సరస్వతి)యొక్క- గొప్ప పాలిండ్లయొక్క- (పయః=పాలయొక్క- - ధర=మోపరులు) (భార=) బరువుమీఁది (వలుఁద పాలిండ్లమీఁది) పేరుల పేటలతో, అనఁగిపెనఁగి=కలసి మెలసి;

వెలయున్=ప్రకాశించునో (కీర్తి కర్త), త్రిభు...తుండు --త్రిభువన=మూఁడులోకములందును - 'రాయ వేశ్యా భుజంగ'=రాజులనెడి వేశ్యలకు విటుఁడు- 'కదన గాండీవి' =యుద్ధములో అర్జునుఁడు - 'జగనొబ్బగండఁడు'=జగదేకవీరుఁడు - అనెడి - బిరుద = సామర్థ్యసూచక విశేషణములచేత - శాశ్వతుండు=స్థిరమయినవాఁడు, అతఁడు సింగన సచివ వరుఁడు=ఆ సింగన మంత్రిశ్రేష్ఠుఁడు, ఒప్పున్=మహోన్నత దశయందు ఉండెను - ఉన్నాఁడు- ఉండఁగలఁడు.

తా.—రాజులను జయించిన మహావీరుఁడు సింగనమంత్రి గంగాతరంగ మల్లికాసమూహ శారదరాకాచంద్రికా వాణీపయోధరహారములకు సాటియైన శాశ్వతకీర్తితో విరాజిల్లుచున్నాఁడు.

వి.—హల్లీసక మనఁగా మండలాకారముగా స్త్రీలు కావించు నృత్యము:—

'మణ్డలేన తు య న్నృత్యం హల్లీసక మితి స్మృతమ్
ఏక స్తత్ర తు నేతా స్యా ద్గోపస్త్రీణాం హరి ర్యథా.' హేమచంద్రుఁడు.

'మాలికా' శబ్దము స్త్రీలింగ మగుటచేత మాలికలకు స్త్రీనృత్యము చెప్పుట; 'కల్లోలములం' జెప్పుటచే కీర్తి గొప్ప దని భా. 'మందాకిని'ం జెప్పుటచే ఆకీర్తి స్వర్గపర్యంతము వ్యాపించిన దని భా. 'చరమ...ఫుల్ల' సరి యయినకాలమందు వికసించినట్టిది, వాడుటకు కాలము కలుగనిది అని భా. అట్లయిన సొంపు అధికము గదా. 'శరత్కాలము'నందు వెన్నెలకు దీప్తి యెక్కువ,'తదారంభ'మందు మునుపటికిని అప్పటికిని భేదము స్ఫుటముగా తెలియును. 'పృథు' 'భార'—ఇవియు కీర్తియొక్క-యాధిక్యమును సూచించుటకు. 'కుచభారములపై హారము' లనుట ధావళ్యాతిశయార్థము.

అవఘళించి, సరసమాడి, వియ్యమంది, అనఁగిపెనఁగి -! ఇవి ఉపమావాచకములు.

బిరుదమును (బిరుదును) గుఱించి అప్పకవి—

'క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెడు । భీకరోక్తులు బిరుదులై పెక్కు- దనరు. ...
'అతి భుజవిక్ర మోద్భటము లై రిపుకర్ణకఠోరకంబు లై
యతులిత వీరవాక్కు- లయి యాదిమ పార్థివ లాంఛనంబు లై
ప్రతిపద నూతనంబు లయి భాసిలు సూక్తులు గూర్చి స్వస్తి వా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరుదావళి సార్వవిభక్తికంబుగాన్.'

'బిరుశబ్దంబు విరోధో । త్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రద విధులన్
బిరుదము లనఁ జనుఁ;వానిన । ధర బిరుదావళి యొనర్పఁ దగునంద్రు బుధుల్.' విన్నకోట పెద్దన.
'బిరు' అనఁగా (మహారాష్ట్రభాషయందు) విరోధము - దానిని ఇచ్చునది 'బిరుదము' అని వ్యుత్పత్త్యర్థము. ఈ పెద్దన చెప్పిన 'విరోధము' అప్పకవి చెప్పిన 'రిపుకర్ణకఠోరక' తయందుఁ గానిపించుచున్నది. మనకు గోచరించిన బిరుదములు ప్రాయికముగా కన్నడ భాషామిశ్రములుగా నున్నవి; 'మహారాష్ట్రభాష' యనుట యుపలక్షకము.

మ. అరు దార న్వివిధాగ్రహారములతో నాందోళికా చ్ఛత్రచా
మర కల్యాణ కళాచి కాది బహు సమ్మా నార్హచిహ్నంబు లా
దర మొప్పారఁగ వేమభూవరునిచేతం గాంచె సామ్రాజ్య సం
భరణ ప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయ ప్రాగల్భ్య గర్వోన్నతిన్. 38

సామ్రా...ఁడు - సామ్రాజ్య=మండలాధిపత్యముయొక్క - సంభరణ = రక్షణమందు - ప్రౌఢుఁడు=నేర్పరి, అయిన, అమాత్యసింగఁడు = సింగనామాత్యుఁడు, నయ...తన్ - నయ = నీతియొక్క - ప్రాగల్భ్య=పాటవముయొక్క - గర్వ=దర్పముయొక్క - ఉన్నతిన్=అతిశయము చేత,అరుదు ఆరన్=అపూర్వముగా, ఆదరము ఒప్పారఁగన్, వేమభూవరునిచేతన్=వేమరాజువలన, వివిధాగ్రహారములతోన్, ఆందో...ంబులు-అందోళికా=అందళము - ఛత్త్ర=గొడుగు-చామర= వీచోపులు - కల్యాణ కళాచికా=బంగారు తమ్మపడిగము - ఆది=మొదలు గాఁగల - బహు= పెక్కులయిన - సమ్మానార్హ=గౌరవము ప్రయోజనముగాఁ గలవైన - చిహ్నంబులు = గుర్తులను, కాంచెన్=పొందెను.

తా.—వేమారెడ్డి సింగనమంత్రియొక్క నీతిప్రౌఢికి ఆశ్చర్యపడి, ఆతనికి తన సామ్రాజ్యమును కాపాడినందులకు బహుమానముగా ప్రీతి పూర్వకముగా ఆందోళికాది సమ్మానచిహ్నములు పెక్కు లొసంగెను.

వ. ఈదృగ్విధ గుణాలంకారుం డైన యమ్మహాప్రధాన శేఖరునకు. 39

ఈదృ...డైన=ఇట్టి విధముగల గుణములు అలంకారముగాఁ గలవాఁడైన - ప్రధానశేఖరునకున్=మంత్రి శ్రేష్ఠునికి.

## షష్ఠ్యంతములు.

[షష్ఠ్యంతములు=షష్ఠీవిభక్తి అంతమందుఁ గలవి.—మంత్రికి విశేషణములు.]

క. శ్రీమంతున కావర్జిత । సామంతున కహిత హృదయ జలజాత వనీ
హేమంతునకును సలలిత । భామా కంతునకు సచివ భాస్వంతునకున్. 40

శ్రీమంతునకున్=సిరిగలవానికి, ఆవ...కున్ - ఆవర్జిత=వశీకరింపఁబడిన-సామంతునకున్= సామంతరాజులుగలవానికి, అహి...కున్ - అహిత = శత్రువులయొక్క - హృదయ = మానసమనెడు - జలజాత=కమలముల - వనీ=తంపరయొక్క - హేమంతునకున్ = హేమంత ర్తువయినవానికి [హేమంతము కమలములను నాశముచేసినట్లు సింగనమంత్రి శత్రుహృదయములను క్షోభింపఁజేయు నని భా.], భామా కంతునకున్ = స్త్రీలకు మన్మథుఁ డయినవానికి, సచివ భాస్వంతునకున్= మంత్రులలో సూర్యుని వంటివానికి.

క. కుకుర కురు చోళ కేరళ। శక మరు కర్ణాట లాట సౌవీర నృప
ప్రకర సభాభరణ మహా। సుకవిజ నానీక వినుత శుభ చరితునకున్. 41

కుకుర...కున్ - కుకుర...సౌవీర=కుకురాదులు దేశములు - ఆదేశముల - నృప=రాజుల యొక్క - సభా ఆభరణ=సభలకు అలంకారములయిన - మహా...కున్—మహాత్ = గొప్ప—సుకవి జన = మంచికవులయొక్క - అనీక = సంఘములచేత - వినుత = కొనియాడఁబడిన - శుభ చరితు నకున్=మంచి నడవడి కలవానికి.

క. చెంచిమల చూరకారున। కంచిత కరుణా తరంగి తాపాంగునకున్
జంచలనయనా కల కిల। కించిత లీలా వికాస కేళీ రతికిన్. 42

చెంచిమల చూరకారునకున్=చెంచిదుర్గమును కొల్లపెట్టినవానికి, అంచి...కున్—అంచిత= ఒప్పుచున్న - కరుణా=కనికరముచేత - తరంగిత=అలలెత్తిన - అపాంగునకున్=కడకంటి చూపు గలవానికి, చం...కిన్ - చంచలనయనా = చపలాక్షులయొక్క - కల=అవ్యక్తమధురమయిన - కిలకించిత = రోషాశ్రుహర్ష భీత్యాదుల సంకరముయొక్క - లీలా=విలాసముయొక్క - వికాస = అభివ్యక్తిగలిగిన - కేళీ=క్రీడయందు - రతికిన్=ఆసక్తి గలవానికి.

క. హాటకగిరిధీరున కరి। తాటంకవతీ కపోల తల కరి మకరీ
పాటచ్చర కఠిన ధను। ర్జ్యా టంకారునకు మన్మథాకారునకున్. 43

హాట...కున్ - హాటకగిరి=బంగారుపర్వతమువలె-ధీరునకున్=ధైర్యముకలవానికి, అరి... నకున్ - అరి=శత్రువులయొక్క - తాటంకవతీ = భార్యలయొక్క - కపోలతల = గండస్థలముల యందలి - కరి మకరీ=ఏనుఁగువంటివియు మొసలివంటియు నయిన పత్త్రరేఖలకు - పాటచ్చర= దొంగ యైనట్టి - కఠిన=కఠోరమయిన - ధనుః = వింటియొక్క - జ్యా=నారియొక్క-టంకారు నకున్=టంకారము గలవానికి. (ఇతనివింటినారిమ్రోఁత విన్నమాత్రాన శత్రువులు గుండె బ్రద్దలయి చత్తురని భా.)...

క. శ్రీమహిత పెద్దసుతునకు। వేమ క్షితిపాల రాజ్య విభవ కళా ర
క్షామణికి సింగసచివ। గ్రామణికిం బాండ్యరాజగజ కేసరికిన్. 44

శ్రీ మహిత పెద్దసుతునకున్=సిరిచేత పూజితుఁడయిన పెద్దనయొక్క కుమారునకు...క్షితి పాల=రాజ. విభవ—ఐశ్వర్య - కళా = విలాసముయొక్క - రక్షా=కాపుదలయొక్క (ఐశ్వర్య విలాసమును రక్షించునట్టి) - మణికిన్ = రత్నమయినవానికి...గ్రామణికిన్ = శ్రేష్ఠునికి, పాండ్యరాజనెడి యేనుఁగునకు సింహమయిన వానికి.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన యిమ్మహా ప్రబంధంబునకుం గథానాయకుండు. 45

అభ్యుదయ పరంపరా అభివృద్ధి గాన్=శ్రేయములయొక్క వరుసయొక్క పెంపు కలుగు నట్లుగా. కథానాయకుండు = కథయొక్క ప్రధానపురుషుఁడు (నలమహారాజు) (పిమ్మట చెప్పఁబడును).

శ్రీ

# శృంగార నైషధము.

నల మహారాజ వర్ణనము.

సీ. తపనీయ దండైక ధవళాతపత్రితో । ద్దండ తేజః కీర్తి మండలుండు (I-1,2)
నిర్మల నిజ కథానిమిషకల్లోలినీ । క్షాళితాఖిల జగత్కల్మషుండు (3)
వితత నవద్వయ ద్వీప నానా జయ । శ్రీ వధూటీ సమాశ్లిష్ట భుజుఁడు (4)
నిఖిల విద్యా నటీ నృత్యరంగ స్థలా । యతనాయమాన జిహ్వాంచలుండు (5)

తే. ప్రస్తుతింపంగఁ దగు సముద్భట కఠోర
చటుల గుణ టంక్రియా ఘన స్తనిత ఘోష (7)
చాప నీరద భవ శరాసార శమిత
బలవదహిత తేజో దవానలుఁడు నలుఁడు. 46

తపనీ...లుండు - తపనీయ=బంగారముయొక్క - దండ=కామయు-ఏక=ముఖ్యమయిన-ధవళ=తెల్లని - ఆతపత్రిత=గొడుగునుం గా చేయఁబడిన - ఉద్దండ తేజః=నిట్టనిగిడియున్న పరాక్రమమును - కీర్తిమండలుండు = కీర్తిచక్రమును కలవాఁడు;— ఇట ఉద్దండతామండలత్వములం జెప్పుట నిలువైన కామగాను గుండ్రముగా విస్తరిల్లినగొడుగువస్త్రముగాను ఆరోపించుటకు- తేజస్సు ఎఱుపనియు కీర్తి తెలుపనియు కవిసమయము -

‘ శుక్లత్వం కీర్తిహాసాద్యౌ, కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు,
ప్రతాపే రక్తతోష్ణత్వే, రక్తత్వం క్రోధరాగయోః.’ కావ్యకల్పలత.

రాజులగొడుగు బంగారపుఁగామయు తెల్లవస్త్రమును గలిగి యుండును.

‘ జనాయ శుద్ధాన్తచరాయ శంసతే కుమారజన్మామృతసమ్మితాక్షరమ్
అదేయ మాసీత్ త్రయ మేవ భూపతేః శశిప్రభం ఛత్త్రి ముభే చ చామరే.’ రఘు.

‘ నిచితం తు హంసపక్షైః । కృకవాకు మయూర సారసానాం చ
దౌకూలేన నవేన తు । సమగ్రతశ్ఛాదితం శుక్లమ్
ముక్తాఫలై రుపచితం । ప్రలమ్బమాలావిలం స్ఫటికమూలమ్
షడ్ఢస్తశుద్ధహైమం । నవపర్వనగై కదణ్డం చ
దణ్డార్ధవిస్తృతం తత్ । సమవృత్తం రత్నభూషిత ముదగ్రమ్
నృపతేస్త దాతపత్రం । కల్యాణకరం విజయదం చ.’ బృహత్సంహిత.

నలుఁడు ఏకచ్ఛత్రాధిపతి గావునను, ఆఛత్రమును తేజఃకీర్తులనుగా చెప్పుటచేతను, ఇట్టి తేజఃకీర్తులు గలరాజులు మఱి లే రని భా.— యథాక్రమ రూపకాలంకారములు గలవు.

నిర్మల...షుండు - నిర్మల = నిర్దోష మయిన (స్వచ్ఛ మయిన అని మందాకినీపరము)- నిజ = తన దైన - కథా = చరిత్ర మనెడి - అనిమిష కల్లోలినీ = దేవ నదిచేత - క్షాళిత = కడుగఁబడిన - అఖిలజగత్ = సకలలోకములయొక్క -యు - కల్మషుండు = పాపముకలవాఁడు;— ఏ ప్రకారము దేవనది మూఁడులోకములలోను ప్రవహించి వానిని పవిత్రీకరించుచున్నదో ఆ ప్రకారమే ఇతని పుణ్యచరిత్రమును మూఁడులోకములందును వ్యాపించి వానిని పవిత్రీకరించుచున్న దని భా.— రూపకము.— నలకీర్తనము కలినాశనము—

'కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్.' భార.

వితత...జుఁడు - వితత=వ్యాప్తములయిన - నవ ద్వయ ద్వీప=తొమ్మిది రెండ్లు (అనఁగా పదునెనిమిది) దీవులయొక్క - నానా=సకల మయిన - జయ = గెలుపుల - శ్రీ = లక్ష్ము లనెడి - వధూటీ=కామినులచేత - సమాశ్లిష్ట=కౌఁగిలించుకొనఁబడిన - భుజుఁడు = బాహువులు కలవాఁడు; బాహుబలముచేత అష్టాదశద్వీపములను జయించినాఁ డని భా. ద్వీపములకు అష్టాదశ సంఖ్యయు కవిప్రసిద్ధ మై యున్నది.—

'సంగ్రామ నిర్విష్ట సహస్ర బాహు రష్టాదశ ద్వీప నిఖాత యూపః
అనన్యసాధారణ రాజశబ్దో బభూవ యోగీ కిల కార్తవీర్యః.' రఘువు.
'అష్టాదశ ద్వీప విద్యా పురాణ స్మృతి ధాన్యకమ్.' కవికల్పలత.
'అష్టాద శాస్త్రై ర్దృష్ట సుధీః స విద్యా స్త్వష్టాదశద్వీపన్నృపాః విజిగ్యే.' కావ్యకల్పలత.

నిఖిల...లుండు - నిఖిలవిద్యా = ఎల్లవిద్యలనెడి — నటీ=నట్టువకత్తెలకు - నృత్యరంగ = ఆట రంగమయిన -స్థల = ప్రదేశము గల దైన - ఆయతనాయమాన = దేవాలయము వలె నొప్పుచున్న — జిహ్వా = నాలుకయొక్క - అంచలుండు = తుద కలవాఁడు ; సకలవిద్యలును జిహ్వాగ్రమం దున్నవనియు, అతనిజిహ్వయందు ఉండుటచేత విద్యలు ధన్య మైన వనియు, తా.—రూపకానుప్రాణితోపమ.

సము...లుఁడు — సముద్భట=ఉద్దండమయిన - కఠోర = దారుణమయిన - చటుల=చలించుచున్న - గుణ=అల్లెత్రాటియొక్క - టంక్రియా=టంకార మనెడి - ఘన=గొప్ప దయిన - స్తనిత ఘోష=ఉఱుముమ్రోఁత గల దైన - చాప=విల్లనెడి - నీరద=మేఘమునుండి - భవ=పుట్టిన - శర=బాణములనెడి — శర = నీటియొక్క ('శర స్తు తేజనే బాణే దధ్యగ్రే నా శరం జలే' మేది.)— ఆసార=జడిచేత - శమిత=ఆర్పఁబడిన - బలవత్=బల్లిదు లయిన - అహిత=శత్రువుల - తేజః=పరాక్రమ మనెడి - దవానలుఁడు = దావాగ్ని కలవాఁడు (బాణవర్షము గురిసి శత్రువుల నోడించినవాఁ డని భా.), (అగు), నలుఁడు = నలమహారాజు, ప్రస్తుతింపఁగఁ దగుక్ = పొగడఁదగినవాఁడు.—రూపకాలంకారము.

**చ. అలయు కధీతి బోధములు నాచరణంబుఁ బ్రచారణంబుఁ గాఁ**
**గలుగు నుపాధిభేధముల గాఢమతి న్నిగమాదు లైన వి** **(I-4)**

ద్యలు పదునాలుగింటికి నతం డొనరించెఁ జతుర్దశత్వముం;
దెలియఁగ లేము కారణము దీనికి నెమ్మెయిఁ జర్చ చేసినన్. 47

అతండు = ఆనలమహారాజు, నిగ...టికిన్ = (నిగమ = ) వేదము మొదలుగాఁగలవైన పదునాలుగు విద్యలకును, అలయక = వేసరిలియక, గాఢమతిన్ = దృఢమయిన బుద్ధిచేత, అధీతి= చదువుటయు, బోధమున్ = అర్థము నెఱుంగుటయు, ఆచరణంబున్ = ఆచరించుటయు, ప్రచారణంబున్ కాన్ = ఆచరింపించుటయును అని, కలు...లన్ — కలుగు = ఉన్నట్టి - ఉపాధి భేదములన్ = దశలయొక్క ప్రకారములచేతను, చతుర్దశత్వమున్ = పదునాలుగింటితనమును (నాలుగు దశలు కలిగి యుండుటను అని యర్థాంతరము), ఒనరించెన్ = కావించెను; ఎమ్మెయిన్ = ఏప్రకారముగా, చర్చ = విచారము ('చర్చా చిన్తా స్థాసకయో శ్చర్చికాయాం చ యోషితి' మేది.), చేసినన్ |= చేసినప్పటికిని, దీనికిన్ = ఈ చతుర్దశత్వసంపాదనకు, కారణమున్, తెలియఁగ లేము = తెలియ లేకున్నాము.

చతుర్దశవిద్య లెవ్వి యన:—ఋక్కు యజుస్సు సామము అథర్వము అను నాలుగు వేదములు, శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము అనెడి యాఱు వేదాంగములు, మీమాంస న్యాయము పురాణము ధర్మశాస్త్రము, అనునవియు.

'అఙ్గాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ.'
'శిక్షా వ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా
కల్ప శ్చేతి ష డఙ్గాని వేద స్యాహు ర్మనీషిణః.'

తా.—ఆరాజు పదునాలుగు విద్యలను చదివి అర్థ మెఱింగి ఆచరించి ఆచరింపించెను.

ఇట చతుర్దశవిద్యలకు సిద్ధ మయి యున్న చతుర్దశత్వమునే ఈతఁడు కలిగించుట పిష్టపేషణముగా నున్న దని ఒకవిరోధము, చతుర్దశవిద్యలకును నాలు గావృత్తులచేత షట్పంచాశత్త్వము (ఏఁబదియాఱింటితనము) కలుగవలసి యుండఁగా చతుర్దశత్వమే (పదునాలుగింటితనమే) కలిగించె ననుట మఱియొక విరోధము, ఈయన కలిగించిన చతుర్దశత్వము నాలుగుదశలు కలవై యుండుట యను నర్థముచే ఆవిరోధములకు, పరిహార మయినది, కావున విరోధాభాసాలంకారము.

తే. అతనివిద్య జిహ్వానటి శ్రుతివిధమున
నంగ గుణమున నష్టాదశాత్మ యగుచు, (1-5)
విస్తరిల్లె నవ ద్వయ ద్వీప పృథగ
శేష భూ జయలక్ష్మి జిగీషఁ బోలె. 48

జిహ్వా నటి = నాలుకయందలి యాటకత్తె (నాలుకచే గ్రహణీయ అనియు), (అయిన), అతని విద్య = నలుని వంటవిద్య, నవ...బోలెన్ — నవ = తొమ్మిదింటియొక్క - ద్వయ = కవలైన - ద్వీప = దీవులయొక్క - పృథక్ = వేఱ్వేఱయిన - అశేష = సమస్తమయిన - భూ = భూమియొక్క - జయ లక్ష్మి = జయ శ్రీలయొక్క (జయశ్రీలను) - జిగీషన్ బోలెన్ = గెలువ నిచ్చచేతనో యనునట్లు, శ్రుతివిధమునన్ = వేదమువలె, అంగగుణమునన్ - అంగ = అంగభూతములయిన షడ్రసములయొక్క -

('అఙ్గం గాత్రే ప్రతీకోపాయయోః పుంభూమ్ని నీవృతి
క్లీబైకత్వే త్వప్రధానే త్రిష్వఙ్గవతి చాన్తికే.' మేది.) -

గుణమునన్ = (ఎక్కువ తక్కువ సమము అనెడి మూఁడు విధములయిన) ధర్మముచేత (శ్రుతి పక్షమున అథర్వవేదము కడమ మూఁటిలో నంతర్భూత మగుటచే ఋగ్యజుస్సామము లని శ్రుతి మూఁడు గావున అందొక్కొక్కటియు ఆఱేసియంగములచే విశేషింపఁబడుటచే శ్రుతి పదునెనిమి దగును), అష్టాదశాత్మ = పదునెనిమిది స్వరూపములు గలది ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.), అగుచున్, విస్తరిల్లెన్ = విరివిఁ జెందెను.

తా.— ఈ నలమహారాజు సూదవిద్యయందు ప్రవీణుఁడు. ఆవిద్య షడ్రసములచేతను, ఒక్కొక్కరసమునకు ఎక్కువ తక్కువ సమత అను మూఁడేసిగుణములచేతను, పదునెనిమిదిస్వరూపముల విరివి చెందెను. ఆచెందుట ఇతని వేదవిద్య యెట్లు పదునెనిమిదిరూపములం జెంది యుండెనో అట్లే యుండెను. మఱియు నట్లు పదునెనిమిది యగుట పదునెనిమిది ద్వీపముల జయశ్రీలను ఇతని నాశ్రయించియున్నవానిని ఒక్కొక్కదానిని ఒక్కొక్కస్వరూపముచేత జయించుటకా యను నట్లుండెను.— జయమందే గాక శ్రుతివిద్యయందును సూదవిద్యయందును సమర్థుఁ డని భావము.

షడ్రసములు - తీపు, ఒగరు, కారము, చేఁదు, ఉప్పు, పులుసు. వేదములు - ఋగ్యజుస్సామములు; అథర్వవేదము అందులో అంతర్భూతము.

'శ్రుతివిధమునన్' - ఉపమాలంకారము. కారణము కాని జయలక్ష్మీజిగీష కారణముగా సంభావింపఁబడినది గాన హేతూత్ప్రేక్షాలంకారము.

'ఫలతను హేతుత వస్తుత । నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్.' అలం. సా. సం.

**తే.** తాఁ ద్రినేత్రుని యపరావతార మగుటఁ
దెలుపు దిక్పాల కాంశావతీర్ణుఁ డతఁడు **(I-6)**
కామ సంచార హరణ ప్రగల్భ మైన
శాస్త్ర మనుపేరి యధికలోచనము కలిమి. **49**

దిక్పా...డు - దిక్పాలక = ('అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః' అను స్మృతివాక్యముంబట్టి) ఇంద్రాది దిక్పాలురయొక్క - అంశ = మాత్రలచేత - అవతీర్ణుఁడు = అవతరించినవాఁడైన - అతఁడు = ఆనలమహారాజు, కామ...కలిమిన్ - కామ = స్వేచ్ఛయొక్క (మన్మథునియొక్క అని యర్థాంతరము) - సంచార = ప్రవృత్తియొక్క (ప్రవృత్తిని) - హరణ = ఆఁపుటయందు - ప్రగల్భము = సమర్థము - అయిన - శాస్త్రము అను పేరి (పేరుగల) - అధిక లోచనము = ఎక్కువకన్ను - కలిమిన్ = ఉండుటచేత, తాను, త్రి...ము - త్రినేత్రుని = ముక్కంటియొక్క - అపర = వేఱు - అవతారము = ఆవిర్భావము - అనఁగా స్వరూపాంతరము, అగుటను, తెలుపును.

తా.— రాజు ఎనమండ్రు దిక్పాలురయొక్క యంశములచేత సృజింపఁబడును; ఆ యెనమండ్రును ఇంద్ర వహ్ని యమ నిరృతి వరుణ వాయు కుబే రేశానులు; కావున నలుఁడు ఈశానావతారముగాఁ గూడ నున్నాఁడు. ఈశానుఁడు త్రిలోచనుఁడు; ఈయనకు మఱి మూఁడవ కన్నే దనఁగా, శాస్త్రము; ఆయనమూఁడవ కన్ను ఎట్లు కామునిప్రచారమును హరించినదో అట్లు ఈయన

మూఁడవ కన్నుగు శాస్త్రము కామముయొక్క స్వేచ్ఛాప్రచారమును హరించుచున్నది.—ఈయనకు ఈశ్వరాంశత్వము అన్నివిధములను సిద్ధించియున్న దని భా. పెద్దకన్ను లున్నను శాస్త్రమే ప్రధాననేత్రముగా నుండెను - శాస్త్రానుగుణవ్యవహారి - అని భా.

'శాస్త్ర మనెడి యధికలోచనము' అని యర్థము గాన రూపకాలంకారము.

చ. కెరలి మహాసివేమ సహకృత్వరి తద్భట కోటి చాతురీ (1-12)
తురి సమరాంగణంబులఁ జతుర్హరి దావరణంబులన్ యశోం
బరముల నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటి నిండుచం
దురు నునుసోగవెన్నెలలతోఁ దులఁ దూఁగెడు తద్గుణంబులన్. 50

మహా...తురి- మహత్ = గొప్పదైన - అసి = క త్తియనెడి - వేమ = నేఁతపలకయొక్క ('పుంసి వేమా వాయదణ్డః' అమ.)—సహకృత్వరి = సహకారిణి (సాయము సేయునది) యైన, తత్ భట కోటి చాతురీ తురి = ఆతనిబంట్ల సమూహాల నేర్పనెడి నాడె [ 'తురీ వయనసాధనవిశేషః' (నేఁత పనిముట్టు) అని మల్లినాథవ్యాఖ్య; 'నిష్పన్నవస్త్రవేష్టనదణ్డః' (నేసినంతలోనే చుట్టి పెట్టుచుండెడి కొయ్య) అని నారాయణీయవ్యాఖ్య; ఆర్యాసప్తశతిలోఁ ప్రయోగము—

'మేదిన్యాం తవ నిపతతి । న పదం బహువల్లభేతి గర్వేణ,
ఆశ్లిష్య కైర్న తరుణై । స్తురీవ వసనై ర్విముక్తాఽసి? ]—

కెరలి = విజృంభించి, చతుః హరిత్ ఆవరణంబులన్=నాలుగు దిక్కులకును కప్పడము లయినట్టి, యశః అంబరములన్ = కీర్తులనెడి వస్త్రములను, సమర అంగణంబులన్ = యుద్ధక్షేత్రముల యందు, పున్నమ...తోన్, తులఁదూగెడు = సమానములయిన - అనఁగా అతివిమలము లయిన - తత్ గుణంబులన్ - తత్ = ఆనలమహారాజుయొక్క - గుణంబులన్ = శౌర్యధైర్యాదిగుణము (లనెడు — గుణంబులన్ = నూలిపోఁగు)లతో

'గుణో మౌర్వ్యా మప్రధానే రూపాదౌ సూద ఇన్ద్రియే
త్యాగే శౌర్యాది సత్త్వాది సన్ధ్యా ద్యావృత్తి రజ్జుషు
శుక్లాదా వపి వట్యాం చ.' మేది.)

బహుభంగులన్ = పెక్కు తీరులుగా, నేయుచుండున్.

ఆ నలమహారాజుయొక్క పెద్దపట్టాకత్తి యనెడి నేఁతపలకకు తోడుసేయునదై యాతని బంటుల నేర్పనెడి నాడె విజృంభించి యుద్ధక్షేత్రమందు నాలుగు దిక్కు లనెడి యంగనలకు కప్పడములుగా కీర్తు లనెడి వస్త్రములను రాకాచంద్ర కిరణములవలె విమలములును దీర్ఘములు నయిన యానలుని శౌర్యధైర్యాది గుణము లనెడి నూలిపోఁగులతో నేయుచుండును.

తా.—నలమహారాజు స్వయముగా కత్తితో పోరుటచేతను, బంట్లచాతుర్యముచేతను, యుద్ధములలో జయమొంది దిగంత విశ్రాంత నిర్మల కీర్తిని పొందెను.

వెన్నెలకు చెప్పినవిశేషణ మంతయు మహత్త్వవైమల్యాతిశయార్థము. 'నును సోగ' అనుట నూలిపోఁగుల సాదృశ్యముకొఱకు.

ఇందు అంతటను ఆరోపము లుండుటచేత రూపకాలంకారము, హరిత్తులందు అంగనాత్వ

మును చెప్పఁకోవలసి యుండుటచేత ఆ రూపకము ఏకదేశవివర్తి; గుణములనెడిగుణము లని శ్లేషించినందున శ్లిష్టరూపకము. 'నిండు...దూఁగాడు' - అనుచోట ఉపమ యున్నది.

[ 'దానాదిప్రభవా కీర్తిః ప్రతాపప్రభవం యశః' అని యశఃకీర్తులకు భేదము చెప్పఁబడి యున్నను, 'యశఃకీర్తిసమన్వితః' ఇత్యాదిప్రయోగములు పెక్కులు గనఁబడుచున్నను, కవులు పలువురు ఆభేదమును పాటించుట లేదు. ఈగ్రంథమందే 'యశోయద స్యాజని సంయుగేషు' అనుటకు ఈ కవి 'బాహాగ్రమునం జనించిన మహాకీర్తిప్రవాహంబు' అని తెనిఁగించినాఁడు.]

తే. తద్దిశాజయ యాత్రోత్థ ధరణిధూళి **(1-8)**
దోఃప్రతాప వైశ్వానర ధూమరేఖ
పాలమున్నీటిలోఁ బడి పంక మయ్యె,
నమృతదీధితిమైఁ జెంది యంక మయ్యె. 51

దోః...రేఖ—దోః - (అతని) బాహువుల - ప్రతాప = తేజస్సనెడి - వైశ్వానర = అగ్నియొక్క - ధూమ రేఖ=పొగ చాలు ఐన, తద్ది...ళి - తత్ = ఆనలుని - దిశాజయ = దిగ్విజయార్థ మయిన - యాత్రా = పయనమందు - ఉత్థ = లేచిన - ధరణి ధూళి = నేల దుమారము, పాలమున్నీటిలోన్ = పాలసముద్రములో, పడి, పంకము = బురద, అయ్యెను, అమృత దీధితి మైన్ = (అమృతము కిరణములందుఁ గల) చంద్రుని దేహమును, చెంది, అంకము = మచ్చ ('కళఙ్కాఙ్కౌ లాఞ్ఛనం చ' అమ.), అయ్యెను.

ఆతనిదాడులయందు లేచిన భూధూళి అతని బాహుపరాక్రమ మనెడియగ్నికి పొగచాలుగా నుండెను. ఆ ధూళి పాలకడలిలోఁ బడి బురద యై అందుఁ బుట్టిన చంద్రునిమేన నంటుకొన్నది. అదియే చంద్రునియందలి యాకళంకము. దీనివలనం గాదేని పాలలోఁ బుట్టిన యాచంద్రునికి కళంకము ఉండదు.—అని తా.—సప్తసాగరపర్యంతము పుడమిని జయించినాఁ డని భా.

ప్రతాపమందు వైశ్వానరత్వమును ధూళియందు తద్ధూమత్వమును ఆరోపించుటచే రూపకము. పంకమందు ఉక్తధూళిత్వమును కళంకమందు తత్పంకత్వమును సంభావించుట ఉత్ప్రేక్షలు.

చ. అరయిక గల్గి భూమి వలయం బఖిలంబును నీతిబాధలం **(1-11)**
బొరయక యుండ నా నృపతి పుంగవుఁ డేలుచు నుండ, నొండుచో
నిరవయి యుండ కుండుటఁ జుమీ యతివర్షము లాశ్రయించెఁ ద
త్పుర నరనాథ యూథ వనితా జనతా నయ నోత్పలంబులన్. 52

ఆ నృపతి పుంగవుండు = ఆ రాజోత్తముఁడు_
( 'స్యు రుత్తరపదే వ్యాఘ్ర పుఙ్గ వర్షభ కుఞ్జరాః
సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః.' అమ.),
అరయిక = విచారణ, కల్గి, భూ...బున్ = భూ మండలము నంతయును, ఈతిబాధలను (ఈతి బాధలు ఆఱు:—

'అతివృష్టి రనావృష్టి ర్మూషకాః శలభాః శుకాః
అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః.')

పొరయక ఉండక్=పొందక యుండునట్లుగా, ఏలుచున్ ఉండఁగాన్, ఒండుచోటు = మఱియేతావును, ఇరవు అయి=స్థిర మయినయునికిపట్టు గా, ఉండనందునఁ జూపి, అతివర్షములు = (ఈతిబాధలలో నొకటి యైన) యతివృష్టులు, తత్...లన్ – తత్ = అతని – పర నరనాథ = శత్రు రాజుల – యూథ = సమూహములయొక్క – వనితా జనతా = అత్యంతానురక్త భార్య ('వనితా జనితాత్యన్తానురాగాయాం చ యోషితి' అమ.) జనసమూహముయొక్క ('జనతా' – సమూహార్థమందు తల్ప్రత్యయము) – నయన ఉత్పలంబులన్ = కనుఁగలువలను, ఆశ్రయించెన్ =అందగొనెను.

నలభూపాలునియొక్క పరిపాలనలో ఈతిబాధలు ఎక్కడను లేకుండ నశింపఁగా, వానిలో నొకటి యైనయతివృష్టి అతని శత్రురాజుల భార్యల నేత్రముల నాశ్రయించినది.—నలుఁడు వైరి రాజుల నెల్ల సంహరించి భూమండలమును నిరీతిగా నేలె నని తా.

'వర్షము లాశ్రయించె' ననుటచే – ఏడ్చి రనియు, 'ఏడ్చి' రనుటచే – తద్భర్తలను (ఆత్మాసన్న రాజులను) నలుఁడు మడియించె ననియు, 'వనిత' లనఁగా అత్యంతానురక్తలు గావున అనురాగాతిశయమే ఆయేడ్పునకుఁ గారణ మనియు, భా.

ఏడ్పును ఈతిబాధలలో నొకటి యైన యతివృష్టిగా సంభావించినందున ఉత్ప్రేక్ష. నయనోత్పలము లనెడిసమాసమున ఉపమ.—తృతీయపాదమందు ప్లుతయతి.

ఉ. కొం డని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీ
కుండుట, దానధారకుఁ బయోనిధు లెల్ల వ్యయింప లేమి, యీ
రెం డపకీర్తులం దల ధరించినవాఁడు ప్రదానశీలుఁ డా (1-16)
తం డిరువాయగా ముడిచిఁ దార్చిన వెంద్రుక లన్మిషంబునన్. 53

కొండు అని = పుచ్చుకొండి యని, వేడ్కతోన్ = ప్రీతితో, పసిఁడికొండన్ = మేరుపర్వతమును, ధన అర్థులకున్ ఎల్లన్ =ధనమును యాచించువారి కందఱకును, పంచి ఈక ఉండుట= పంచి పెట్టమియు, దాన ధారకున్ = దానము సేయునపుడు పుచ్చుకొనువాని చేత ఇచ్చువాఁడు పోయునట్టి జలధారగా, పయోనిధులు ఎల్లన్ = సముద్రముల నన్నిటిని, వ్యయింప లేమిన్ = వ్యయము చేయ లే కుండుట – అనఁగా అంతటిజలవ్యయము కావలసినంతదానములు చేయ లేమియు, (అనెడి)—ఈ రెం డపకీర్తులను, ప్రదానశీలుఁడు – ప్రదాన = ఇచ్చుటయే – శీలుఁడు=స్వభావముగాఁ గలవాఁ డయిన, ఆతండు = ఆరాజు, ఇరు వాయగాన్ = రెండు పాయలుగా, ముడిచికొన్, తార్చిన ( = కూర్చిన) వెంద్రుకలు అనెడి మిషచేత, తలయందు ధరించినాఁడు.

ఆరాజు యాచకులకు మేరుపర్వతము తప్ప తక్కిన బంగార మంతయు నిచ్చెను, దానధారకు సముద్రములు తప్ప తక్కిన జల మెల్లను వ్యయపఱిచెను. అంతటితో అర్థిజనాశాపూర్తి అయినది. అంత నాతఁడు పసిఁడికొండను పంచిపెట్టమియు, సముద్రమును దానధారకై యుపయోగింపమియు, ననురెం డపకీర్తులే, పాపటకు ఇరుప్రక్కలకును ముడికై తార్చుకు తన తలవెంద్రుకల రెండుపాయలుగా, తన తలమీఁద వచ్చి కూర్చున్నట్లు భావించెను. తా నెంతదానము చేసినను అతనికి తృప్తి కాలే దని భా. ఉత్తరదేశస్థులు నడుమ పాపట తీరిచి జుట్టును రెండుపాయలుగా విడిచి ముడిచికొందురు. తలవెంద్రుకలయందు నైల్యముచేత అపకీర్తిత్వము ఆరోపితము; అపకీర్తి నలుపని

కవిసమయము - ('శుక్లత్వం కీర్తి హాసాదౌ కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు' కావ్యకల్పలత.) 'మిష' యన్నందున కైతవాపహ్నుత్యలంకారము.

'ఇరువాయ' — 'ద్విపున కేకవచనంబు ప్రాయకంబుగానగు' బా. వ్యా. సమా. (18) అన్మిషంబునన్ = అనుమిషంబునన్—అనుకొనులకు ఇట్లు ఉత్వలోపంబు ప్రయోగంబులం జూపబ్డెడి. 'సార్వభౌముఁడ హరిశ్చంద్రుఁ డన్వాఁడ' హరి. ద్వి. 'ఇరులుకొన్నాత్రిక్రుపందిరులవిరుల.' ఆముక్త. 'ధరించినవాఁడు.'—ఇంచుగాగమమునకు స్వరయతి లేదు.

చ. నియమ విచిత్ర భంగి మహనీయుఁడు భూమివిభుండు మిత్త్రిజే
తయును నమిత్త్రిజేతయుఁ బ్రతాపగుణంబున, నీతిఁ జారదృ (1-13)
ష్టియును విచారదృష్టియు, నటే! పరిపంథిమహీశులట్ల త
ద్భయమున భేత్తృతాగుణము వాసెను కాక విరుద్ధధర్మముల్. 54

నియ...ఁడు...ండు—నియమ = ఏర్పాట్లయొక్క - విచిత్ర = అద్భుత మయిన - భంగి = ప్రకారముచేత - మహనీయుఁడు = పూజ్యుఁ డయిన - భూమివిభుండు = ఆరాజు, ప్రతాపగుణంబునన్ = తేజస్సనెడు గుణముచేత, మిత్త్రిజేతయున్ = సూర్యుని జయించువాఁడును, అమిత్త్రిజేతయున్ = సూర్యుని జయించువాఁడు కానివాఁడును (శత్రువులను జయించువాఁడును), నీతిన్ = నీతిచేత, చార దృష్టియున్ = వేగులవాండ్రు చూపుగాఁగలవాఁడును, వి చార దృష్టియున్ - చారు లనెడి చూపు లేనివాఁడును (విచార = ఆలోచనయే - దృష్టియున్ = చూపుగాఁగలవాఁడును), (అయియున్నాఁడు.) అటే = ఆశ్చర్యము! తత్ భయమునన్ = అతనివలని భయముచేత, విరుద్ధ ధర్మముల్ = ఒండొకటికి విరుద్ధము లయిన గుణములు, పరిపంథి మహీశులట్ల = వైరి రాజులవలెనే, భేత్తృతా గుణము = ఒండొకటితో బెడిసియుండుట యనెడి స్వభావమును, పాసెనో కాక = వదలుకొనెను గావలయు.

ఆరాజు మిత్త్రిజేతయు అమిత్త్రిజేతయు, చారదృష్టియు విచారదృష్టియు; దానం జూడఁగా, ఆతనిభయముచే విరోధిరాజులు వోలె విరోధి ధర్మములు కూడ విరోధము మానుకొన్నవి గావలయును.—నలమహారాజు సూర్యునికన్న తేజస్వి, శత్రువులను జయించినవాఁడు, నీతిమంతుఁడు, చారదృష్టికలవాఁడు, ఆలోచనపరుఁడు. ఆతని యేలుబడిలో ఆతనికి వెఱచి రాజులు వైరములు మాని ఒద్దిక కలిగి మెలఁగుచుండిరి.— అని తా.

మిత్త్రిజేత అయ్యును మిత్త్రిజేత కామియు, చారదృష్టి యయ్యును చారదృష్టి కామియు, విరోధములు; వానికి శత్రుజేత ఆలోచనపరుఁడు అనునర్థాంతరములచేత పరిహారము; కావున విరోధాభాసాలంకారము.—'పరిపంథిమహీశులట్ల'.—ఉపమ. చతుర్థపాదమున ఉత్ప్రేక్ష.

'తోలుత నగపడి విరోధ మ। వల నన్యార్థాకలనమువలన నడఁగినన్,
బొలుచు విరోధాభాసము; । చెలఁగు శివుం డయ్యు నితఁడు శ్రీపతి యై నాన్.' అలం.సా.సం.

'అటే'—అటు + ఏ అని ప్రశ్లేష యున్నను కాకుయతిగా వ్యంజనయతి వచ్చినది.

'విరుద్ధ—ధర్మముల్'—కడపటియుకారలోపమునకు - 'పదాంతంబు లై యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' బా. వ్యా. ప్రకీ. (16)

మ. ధర నేకాంఘ్రి కనిష్ఠి కాంగుళమ యాధారంబు గా నిల్చి, ని
ర్భరలీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్విత్వముం (1-7)

బొరసెం; దక్కినవార లెవ్వరు తపంబుల్ సేయ! రమ్మేదినీ
శ్వరు సామ్రాజ్యమునందు ధర్మము చతుష్పాదంబులం గ్రాలఁగన్! 55

కృతవేళన్ = కృతయుగమందు, ఆ - మేదినీశ్వరు సామ్రాజ్యమునందున్ = రాజుయొక్క - యేలుబడిలో -

'యే నేష్టం రాజసూయేన, మణ్డల స్యేశ్వర శ్చ యః,
శాస్తి య శ్చాజ్ఞయా రాజ్ఞః, స సమ్రా డితి కథ్యతే.' అమ.

ధర్మము, చతుష్పాదంబులన్ = (ధర్మము వృషభరూపమున నుండును గాన) నాల్గు కాళ్లమీఁదను (నాలుగు నాలవభాగములచేత ననియు - 'పాదా రశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' అమ.), క్రాలఁగన్ = ఒప్పుచున్నందున, సెట్టన = చేయునదిలేక, నిర్భర లీలన్ = నిబ్బరమయిన ప్రకారముతో, అధర్మంబున్ = అధర్మము సయితము, ధరన్ = నేలమీఁద, ఏకా...య - ఏక = ఒక - అంఘ్రి = పాదముయొక్క - కనిష్ఠికా = చిటికెనవ్రేలియొక్క - అంగుళము అ = ఎనిమిది యవల ప్రమాణము మాత్రమే, ('యవోదరై రఙ్గుళ మష్టసంఖ్యైః' లీలావతి), ఆధారంబుగాన్ = నిలువరముగా, నిలిచి, తపస్విత్వమున్ = తాపసత్వమును (దీనభావమును అని యర్థాంతరము - 'మునిదీనౌ తపస్వినౌ' అమ.) - పొరసెన్ = పొందెను. తక్కి...యరు - ఎల్లవారును తపస్సులు చేసి రనుట.

ధర్మము నాలుగుపాదములమీఁద నిలిచిన దనుటచే చక్కఁగా స్థిరపడిన దనియు, అధర్మము చిటికెనవ్రేల నంగుళప్రమాణభాగము పైని మాత్రమే నిలిచిన దనుటచే కొంచెకొంచెము అట నట నుండెడి ననియు, భా. వృషభమునకు చిటికెనవ్రే లేమి? యనిన, కాలియెడమ డెక్కయే కనిష్ఠిక యని యుపచారము. ఒంటికాలికనిష్ఠికపై నిలుచుట కఠోరతరతపశ్చరణ ప్రకారము. ఇతని శాసనముచేత అధర్మము కూడ ధర్మ మాచరింపం దొడంగె నని భా.

ఇచట 'అధర్మమే తపస్సు చేయఁగా ఇతరులు చేయ కుందురా?' అని కైముత్యన్యాయముచే అర్థము సిద్ధించుచున్నది గావున కావ్యార్థాపత్తి అలంకారము:—

'కైముత్యముచే నన్యా । ర్థామననము కావ్యపూర్వకార్థాపత్తిన్;
నీమోవి బంధుజీవము । నే మోడుచు, నన్యజీవ మెడపుట యరుదే!' అలం. సా. సం.

క. ఆరాజు విజయలక్ష్మికి । నీరాజన మాచరించు నిర్దగ్ధదిగం (I-I0)
తారాతి రాజ నగరీ । దారుణ వైశ్వానర ప్రదక్షిణ శిఖలన్. 56

ఆరాజు, విజయలక్ష్మికిన్, నిర్ద...శిఖలన్ = నిర్దగ్ధ = మిక్కిలి కాల్పఁబడినవైన - దిక్ అంత అరాతి రాజ నగరీ = దిక్కుల తుదలయందలి శత్రు ('అభిఘాతి ప రారాతి ప్రత్యర్థి పరిపన్థినః' అమ.) రాజుల పట్టణములయొక్క - దారుణ = భయంకరములయిన - వైశ్వానర ప్రదక్షిణ శిఖలన్ = అగ్నియొక్క ('అగ్ని ర్వైశ్వానరో వహ్నిః' అమ.) ప్రదక్షిణజ్వాలలచేత ('వహ్నే ర్ద్వయో ర్జ్వాలకీలా వర్చి ర్హేతిః శిఖా స్త్రియామ్' అమ.) రాసీజనము ఆచరించున్ = ఆరతి ఎత్తును.

దిగ్విజయయాత్రయందు ఆ రాజు లోఁగని శత్రువుల పురములను కాల్పించుచు, తూర్పు దక్షిణము పడమర ఉత్తరము అనుక్రమమున దిగ్విజయయాత్ర చేయఁగా, ఆమంటలు ఆవరుసనే లేచుట అతఁడు విజయలక్ష్మికి ప్రదక్షిణముగా ఆరతి యిచ్చుట వోలె నుండెను.—ఎదిరించిన వైరుల యూళ్లను తగులఁ బెట్టించె నని భా. ప్రదక్షిణత మంగళార్థము.

అగ్నిశిఖలయందు నీరాజనత్వసంభావన వాచకము లేనందున గమ్యోత్ప్రేక్షాలంకారము; దానికి, నగరులయందు కర్పూర వర్తిత్వారోపము గమ్యమై యున్నందున ఏకదేశ వివర్తి రూపకము అంగమై యున్నది.

చ. ఇతఁడు దరిద్రుఁడౌ ననుచు నేర్పడ నర్థిలలాటపట్టికన్ (1-15)
శతధృతి వ్రాసినట్టి లిపి జాల మనర్థము గాని యట్లుగా,
వితరణ ఖేలనా విభవ విభ్రమ నిర్జిత కల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రునిఁ జేయు నాతనిన్. 57

వితర...డు - వితరణ = ఈవి యనెడి - ఖేలనా = ఆటయొక్క - విభవ = అతిశయము యొక్క - విభ్రమ = విలాసముచేత - నిర్జిత=గెలువఁబడిన - కల్ప భూరుహుండు = కల్పవృక్షము కలవాఁడు, అతఁడు, అర్థి లలాట పట్టికన్ = యాచకుని నొసటి పలకయందు, ఇతఁడు దరిద్రుఁడు ఔను అనుచున్, శతధృతి = బ్రహ్మ ('శతానన్దః శతధృతి ర్ద్రుహిణోఽబ్జో విరిఞ్చనః' అమ.), ఏర్పడన్ = నిశ్చయముగా, వ్రాసినట్టి - లిపి జాలము = వ్రాఁతసమూహము, అనర్థము = అర్థము లేనిది (అబద్ధము) - కాని యట్లుగాన్ = కాకుండునట్లు గానే, అతనిన్ = ఆయాచకునిని, దరిద్రతా గుణమునందున్ = పేదఱిక మనెడి ధర్మములో, దరిద్రునిన్ = పేదనుగా, చేయును.

కల్పవృక్షముకన్న దాత యైనయారాజు యాచకునినొసట బ్రహ్మ వ్రాసిన లేమిలిపిని వానికి ధన మిచ్చుటచేత అబద్ధము చేసియు, వానిని లేమియందు దరిద్రునిఁగా - అనఁగా లేమి లేని వానినిగా కావించి ఆయర్థముచేత బ్రహ్మలిపికి అసత్యత రానీయక నిలిపినవాఁ డాయెను. బ్రహ్మ వ్రాఁతను గూడ అన్యథాకరింప సమర్థుఁ డని భా.

రాజునకు అట్టి యన్యథాకరణముతో సంబంధము లేకున్నను సంబంధము ఉన్నట్టు చెప్పుట వలన సంబంధాతిశయోక్త్యలంకారము. అతిశయోక్తి సప్తవిధములు—

చ. 'అమర (1) నిగీర్ణియుక్త మగునధ్యవసాయ (2) మయోగమందు యో
గము, (3) మఱి యోగమం దయుతి, (4) కార్యనిమిత్తములన్ విరుద్ధపుం
గ్రమము, (5) క్రమంబు లేమియును, (6) గారణసంకథకే ఫలంపు జ
న్మ, మతిశయోక్తిసప్తకము నాణెము, (7) భేద మభేదమం దిడన్.' అలం. సా. సం.

తే. 'అతనికీర్తిప్రతాపంబు లవనిఁ గలుగ (I-14)
నేల యివి?' యంచు మదిలోన నెపుడు దలఁచు,
నపుడు పరివేష మిషమున నబ్జసూర్య
మండలముల విధాత్రుండు గుండలించు. 58

విధాత్రుండు = బ్రహ్మ, అతని (నలుని) కీర్తిప్రతాపంబులు, అవనిన్=భూమిలో, కలుగన్= ఉండఁగా, ఇవి = ఈ చంద్రసూర్యబింబములు, ఏల అంచున్ = నిష్ప్రయోజనము లని, మదిలోనన్ = మనస్సులో, ఎపుడు తలఁచునో, అపుడు, అబ్జ (=చంద్ర) సూర్య మండలములను, పరివేష మిషమునన్ = గాలిగుడియొక్క ('పరివేష స్తు పరిధిః' అమ.) మిషచేత ('మిషం వ్యాజే స్పర్ధనే నా' మేది.), కుండలించున్ = సున్న చుట్టును.

'అతని' మొదలుకొని 'ఇవి' వఱకు బ్రహ్మదేవుఁడు తలపోయుట. 'ఎపుడు' 'అపుడు' అనుట గాలిగుడి శాశ్వతము గాదు గావున; 'కుండలించుట'—వ్రాఁతయందు పొరఁబాటున ఎక్కువగా పడిన యక్షరంబులను అనావశ్యక మని తెలుపుటకై చేయుదురే ఆవిధముగా నని భా. కీర్తి చల్లఁగా తెల్లఁగా నుండు ననియు, ప్రతాపము ఎఱ్ఱఁగా వేఁడిగా నుండు ననియు, కవిసమయము.

ఇందు కుండలించినట్లు సంభావించినందున ఉత్ప్రేక్ష. దానికి 'మిష' యనుటచే కైతవాపహ్నుతి అంగముగా నున్నది. కీర్తి ప్రతాపముల వరుసనే చంద్ర సూర్య మండలములను తత్తత్సమములను చెప్పినందున యథాసంఖ్యాలంకారము. ఉపమానములయిన చంద్రసూర్యులకు వృథాత్వము చెప్పినందున ప్రతీపాలంకారమును అంగముగా నున్నది:—

'(1) ఇతరమున కుపమసేఁత ప్ర। కృత, (2) మితరోపమితలబ్ధి నితరంపుఁ దిర
స్కృతి,(3) యుపమాన వృథాత్వము,। ప్రతీపములు (4) పెఱకు నుపమ ప్రకృతిగ లేమిన్.'

**వ. (1)** అన్నలుండు నళినబాంధవుండునుం బోలెఁ బ్రతిదినంబును నభ్యుదయంబు నొందుచుఁ, గ్రమంబున శైశవంబు నతిక్రమించి, **(2)** యౌవనారంభంబున నరి దుర్గ లుంఠ నావసరంబులం బోలె లోహార్గళ దీర్ఘ పీనతయును గోపుర ద్వార కవాట దుర్ధర్ష తిరఃప్రసారితయును బాహావక్షంబులచేత బందీగ్రాహంబు గ్రహించి, **(3)** రోమకోటి కపటంబున హాటకగర్భుండు పాటించి లిఖించిన సుగుణ గణనా రేఖలవయవంబులం బొలుపార, **(4)** సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబంబు విడంబింపం జాలు నెమ్మొగంబునకుం గళంకాలంకారశంక నంకురింపఁ జేయం జాలు కోమల శ్మశ్రురాజి విరాజిల్ల, గండు మెఱసి, రెండవ కుసుమకోదండుండునుం బోలె విలాసినీ మండలికిం గన్నులపండువై వెండియు. 59

(1) నళిన బాంధవుండునుం బోలెన్ = తామరల చుట్టము ( = సూర్యుని) వలె [ఉపమాలంకారము], ... అభ్యుదయంబున్ = మేలును (సూర్యపరముగా - ఉదయించుటను), 'ప్రతి... నొందుచున్' - సాధారణధర్మము శ్లిష్టము; శైశవంబున్ = (శిశుత్వమును) బాల్యమును, అతిక్రమించి = దాఁటి; (1-17)

(2) యౌవన ఆరంభంబునన్ = జవ్వనము రాఁగానే, అరి ... బోలెన్ - అరి = శత్రువులయొక్క - దుర్గ = కోటలయొక్క - లుంఠన = కొల్లయొక్క - అవసరంబులం బోలెన్ = సమయంబులందో యనునట్లుగా, లో ... యును - లోహ = ఇనుప - అర్గళ = గడియదూలములయొక్క - దీర్ఘ పీనతయును = నిడుదతనమును వలుఁదతనమును, గోపు ... యును - గోపుర = గవనులయొక్క - ద్వార = వాకిండ్లయొక్క - కవాట = తలుపులయొక్క - దుర్ధర్ష(తా) = చెనక రామియు - తిరః = అడ్డుగా - ప్రసారితయును = విస్తరిల్లినవై యుండుటను, బాహా వక్షంబులచేతన్ = బాహువులచేతను ఱొమ్ముచేతను, బందీ గ్రాహంబు = బందిని (ఖయిదిని — 'ప్రగ్రహోపగ్రహౌ బన్ద్యామ్' అమ.) పట్టినట్లు గా - గ్రహించి=పట్టి; (1-22)

ఈవాక్యమందలి 'పోలెన్' అను నుత్ప్రేక్షావాచకమును 'గ్రహించి' యనుక్రియతో చేర్చుకొనిన నర్థము సరిపడును; 'గ్రహించినవాఁడుంబోలె నొప్పుచు' అని కల్పించుకొనవలయును.

బాహువులు గవనుల యినుపగడియలవలె దీర్ఘములుగాను వలములుగాను ఉన్నవి; ఱొమ్ము గవనుతలుపులవలె చెనకరానిదిగాను విశాలముగాను ఉన్నది. [‘ఆరాజు శత్రువులదుర్గములను కొల్లగొనునప్పుడు వానియందలి స్త్రీలనుమాత్రమే గాక, బాహువులచేత వానిగవనుల యినుపగడియదూలముల దీర్ఘత్వ స్థూలత్వములను గూడను, ఱొమ్ముచే ఆగవనులతలుపులయొక్క యప్రధృష్యత్వ విశాలత్వములను గూడను, ఖైదు పట్టి తెచ్చినాఁడో యను నట్లు దీర్ఘ పీన బాహుఁడును దుర్ధర్ష తిర్యక్ప్రసారి వక్షుఁడునుంగా నుండెను;’ అని సంభావించినందున ఉత్ప్రేక్షాలంకారము; బందీగ్రాహంబు; అర్గళ కవాటములకు బాహావక్షములతో యథాసంఖ్యాలంకారము.]

బందీగ్రాహంబు = ణముల్ ప్రత్యయాంతము. ఈకవి ఏతత్ప్రత్యయాంతమును తెలుఁగునం బ్రయోగించుట కలదు:—‘శయనోత్థాయము భోజరాజతనయా’ (8 ఆ.3)చూ. అందులకు మూలము:— ‘ ప్రథమ శకునం శయ్యోత్థాయం త వాస్తు విదర్భజా ’ (22 – 2) వ్యా.— “శయ్యోత్థాయమ్ – ‘అపాదనే పరీప్సాయామ్’ ఇతి ణముల్ – పరీప్సా త్వరా.’’

(3) రోమ కోటి కపటంబునన్ = వెండ్రుకల కోటులయొక్క మిషచేత, హాటక గర్భుండు= (బంగారు బొజ్జవాఁడు) బ్రహ్మ, పాటించి = పూని, లిఖించిన = వ్రాసిన – సు గుణ గణనా రేఖలు = మంచి గుణముల లెక్కయొక్క గీఱలు – అవయవంబులన్ పొలుపారన్ = అంగంబులందు ఒప్పుచుండఁగా [సుగుణంబులు గణనాతీతంబు లని భా. వానిలెక్కను బ్రహ్మ రోమకోటిమిషమున వ్రాసె ననుట సాపహ్నవోత్ప్రేక్ష. మనుష్యదేహమందు 3 కోట్ల 50 లక్షలు వెండ్రుకలుండును; ‘తిస్రః కోట్యోఽర్ధకోటీ చ యాని లోమాని మానుషే’ అని స్మృతి.] ... (1-21)

(4) పూర్ణిమా చంద్ర బింబంబున్ = పున్నమ చంద్రుని మండలమును, విడంబింపన్ = వెక్కిరించుటకు – చాలు = సమర్థమయిన – నెమ్మొగంబునకున్ = (నెఱి మొగము = నెమ్మొగము) అందమయిన వదనమునకు, కళంక అలంకార శంకన్ = భూషణమైన మచ్చయనెడు తలంపును, అంకురింపఁజేయంజాలు = పుట్టింపఁగల – కోమల శ్మశ్రు రాజి = నూనూఁగు మీసాల వరుస, విరాజిల్లన్ = ప్రకాశింపఁగా [ఉపమాలంకారము. ‘విడంబించు’ ‘శంక సంకురింపఁ జేయు’ — ఉపమావాచకములు.] గండుమెఱసి = బలిష్ఠుఁడై, కుసుమకోదండుండు = పూవిల్తుఁడు=మదనుఁడు ...విలాసినీ మండలికిన్ = కాములుల సమూహమునకు; [ఉత్ప్రేక్ష. ఇందు—‘కోటి కపటా’ది వాక్య భాగమందు ‘ట, ంబ, ంక, ండ,’ ఇత్యాది వ్యంజనావృత్తులు వృత్త్యనుప్రాసములు; ‘గుణ గణ,’ ‘పూర్ణపూర్ణి’ – ఛేకానుప్రాసములు; ‘రాజి విరాజిల్లన్’ — వృత్త్యనుప్రాసము.

తే. దాస్య మొనరించు విధుఁ డేత దాస్యమునకుఁ, (1-20)
బల్లవము లేత దంఘ్రి సంప ల్లవములు,
జలరుహములకుఁ దచ్ఛయ చ్ఛాయ దాయ,
యనఁగ నతఁ డొప్పె నవ యావ నాగమమున. 60

విధుఁడు=చంద్రుఁడు, ఏతత్ ఆస్యమునకున్ = ఈతని ముఖమునకు, దాస్యము ఒనరించున్ = సేవ చేయును; పల్లవములు = చిగుళ్లు, ఏతత్ అంఘ్రి సంపత్ లవములు = ఈతని పాదముల సొంపుయొక్క లేశములు; జలరుహములకున్ = కమలములకు, తత్ శయ ఛాయ = ఆతని చేతియొక్క కాంతి, దాయ = శత్రువు; అనఁగన్ = అనునట్లుగా, అతఁడు, నవ యావన ఆగమము

నన్ = క్రొత్త జవ్వనముయొక్క రాకయందు (జవ్వనము వచ్చిన క్రొత్తలో), ఒప్పెను.

ఉత్ప్రేక్షాలంకారము; 'అనఁగ' తద్వాచకము. 'దాస్యము' 'దాస్యము', 'పల్లవములు' 'పల్లవములు'—యమకములు. తుదిపాదమునందలి 'న'వర్ణావృత్తి వృత్త్యనుప్రాసము; 'నాఁగ నతఁ డొప్పె' అని పఠించినను వృత్త్యనుప్రాసమే. 'ఛాయ దాయ' అంత్యానుప్రాసము.

వ. అయ్యవసరంబున. 61

తే. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు, (I-30)

వాని మార్పునఁ బేర్కొని మానవతియు,

వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ

నప్పళింపని సతియు, లేదయ్యె నెచట. 62

ఎచటన్,... వనజ ముఖి = కమలమువంటి ముఖముగల స్త్రీ - సుందరి యనుట, మార్పునన్ = పొరఁబాటున, వానిన్ = నలుని, పేర్కొని = పేరుపెట్టి పిలువని (తనమగఁడు లో నగువారిని పొరఁబాటున 'నలా,' 'నలరాజా,' అని పిలువనట్టి) - మానవతి = మానిని, వానిఁగా... సతి = తనపతిని నలునిఁగా తనమనస్సులో భావన చేసి కూడుటకు (అప్పళింపని = ) యత్నింపని పతివ్రత ('సతీ సాధ్వీ పతివ్రతా' అమ. పతివ్రతలకుఁ గూడ అతనిసౌందర్యము మోహకముగా నుండె నని భా. సతి గావున వరుని ధిక్కరింపక ఈతనిభావనచేత ఆతనినే కవయుట.)

'పేర్కొని'— 'ముజ్జు పరంబగునపుడు కొళ్బంబు కొనునకు బహుళంబుగా నగు.' (బా. వ్యా. క్రి. 60), 'కన్గొఁ జాల కుజ్జృంభిత స్తనయుగ్మంబు' వసుచరిత్ర.

లేని స్వప్నదర్శనాది సంబంధములను చెప్పుటచేత సంబంధాతిశయోక్తులు.

చ. దరహసితావధీరిత సుధాకరబింబము నేత్రనిర్జితాం (1-23)

బురుహము నైనయానిషధ భూవరు నుల్లసితాననంబుతో

సరి మఱి యొండు గల్గమికి సంశయ మేటికిఁ దద్ద్వయీవిజి

త్వరకమనీయవస్తురహితం బగునట్టి చరాచరంబునన్? 63

దరహసిత అవధీరిత సుధాకర బింబమున్ = మందహాసముచేత తిరస్కరింపఁబడినట్టి యమృతకిరణుని (చంద్రుని) మండలము కలదియు, నేత్ర నిర్జిత అంబురుహమున్ = కన్నులచే గెలువఁబడిన కమలములు గలదియును, ఐన - ఆ నిషధ భూవరు (= రాజుయొక్క) - ఉల్లసిత ఆననంబుతోన్ = వికాసవంతమయిన ముఖముతో, తద్ద్వ...రంబునన్ - తత్ = ఆ - ద్వయీ = రెంటియొక్క - అనఁగా చంద్రకమలములయొక్క - విజిత్వర = జేత యయిన - కమనీయ = సుందరమయిన - వస్తు = పదార్థముచేత - రహితంబు = కొఱవడినది - అగునట్టి - చరాచరంబునన్ = ప్రపంచములో ('చరాచరం జగ్గమే స్యాద్ దిఙ్గవిష్టపయో రపి' హేమ.), సరి...టికిన్ = సాటి ఇంకొకటి లేనందులకు సందేహ మేల.

లోకములో చంద్రకమలములకంటె సుందరవస్తువు లేదు; వానిలో నలునిముఖము లేనగవుచేత చంద్రుని తిరస్కరించినది, కమలమును కన్నులచే జయించినది, కాన ఆముఖమునకు సాటి ఆమొగమేగాని మఱి యొకటి లేమి నిశ్చయము.— 'లేనగవుచేత తిరస్కరించె' ననుటలో తానుగా పని వీడక తనచిన్న లెంకచేత అవమానింపించినట్లు అని భా. 'నేత్రములచే' అనుట తనయొక్క యొక

యంశముచేత అని భా. తిరస్కరించుటలో లేనగవుచేతను చూపుచేతను తిరస్కరించుట బొత్తిగా సరకుసేయమిని తెలుపును.

ఇచట చంద్రారవిందజయాదికము విశేషణగత మయి సాటి లేమికి హేతు వై యున్నం దున పదార్థహేతుక మయిన కావ్యలింగాలంకారము:—

'నీత మగుఁ గావ్యలింగము। హేతువు పదవాక్యములకు నింగిత మైనన్;
వే తొలఁగు సాయుధుండను। జేతోభవ, యడఁతు నిన్ను, శివుఁ డెద నాకున్.'

క. తలవెండ్రుక లెగఁగట్టెడు। కొలఁదిన యానృపకుమారకుఁడు కడిమిమెయిన్
నలుదెసలఁ గరుల గండ। స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్.(1-19)

ఆ - నృప (రాజ) కుమారకుఁడు, తలవెండ్రుకలు ఎగఁ గట్టెడు కొలఁదిన్ అ = జుట్టును పైకెత్తి కట్టుకొనెడి వయస్సులోనే - అతిబాల్యములోనే అనుట, కడిమి మెయిన్ = పరాక్రమముచేత, నలుదెసలన్ = నాలుగుదిక్కులయందును, కరుల...లన్ = ఏనుఁగులయొక్క కపోల ప్రదేశము లనెడి పలకలమీఁద, జయ శాసనముల్ = గెలుపు బిరుదులను, లిఖించెన్ = వ్రాసెను.

దేశములయందు ('నలుదెసలన్'—'నలుగురూ మెచ్చుకోవద్దా?' 'నలుగురూరా వద్దా?' అను నిట్టి వాడుకప్రకారము 'పెక్కు' 'సకల' అను నర్థమునందు 'నలు' అని ప్రయోగము; అష్టదిక్కుల యందు నని పర్యవసానము; దిగంతములనుగూడ జయించె నని భా. దిగ్గజముల చెక్కిళ్లయందలి జయశాసనములు దానధారచే మఱుఁగుపడును. కామరూపులును కామగాములు నైన దిగ్గజముల గండములను గాయములుగా చెక్కవలయు నన్న కిట్టువేయుటకైన రెడ్లనుం బోలె పట్టి కట్టి కొట్టి నేలకు నెట్టి గోతిలో ఆకంఠము పాఁతి చెక్కవలయును. అత్యుక్తిని సయితము మించి యున్నది. 'గిరుల' అని యుండిన శ్లేశ ముండదు; ఆపక్షమున - గండములు = స్థూలశిలలు; ఉ. 'వర్తుల కుచగండశైలములు దోఁప' వసుచరిత్ర (2-46). కొండలమీఁది జయశాసనములకు పురాణోక్తి:—

'ఉదీచీం దిశ మాక్రమ్య పాణ్డవః పరమధార్మికః
ప్రాప్య మేరుగిరిం తత్ర లిలేఖ బిరుదాన్ స్వకాన్.'

సంబంధాతిశయోక్త్యలంకారము. 'కరుల'పాఠమందు అత్యుక్త్యలంకారము.

తే. తరుణ పాథోరుహాధో విధానమునను,
ధరణినాథ కిరీటాగ్ర ధానమునను,
నూర్ధ్వ మయ్యెడు నిది యంచునో విధాత
తత్పదం బూర్ధ్వరేఖాంకితంబు సేసె! (1-18) 65

విధాత = బ్రహ్మ, తత్ పదంబు = ఆతని పాదమును, ఇది = ఈపాదము, తరు...నున్ - తరుణ = లేఁతలయిన - పాథోరుహ = కమలములయొక్క (= కమలములను) - అధోవిధాన మునను = క్రిందుపఱుచుటచేతను, ధర...ననున్ - ధరణినాథ = రాజులయొక్క - కిరీట = మకుటములయొక్క - అగ్ర = మీఁదిభాగమునందు - ధానమునను = ఉంచుటచేతను, ఊర్ధ్వము = పైది, అయ్యెడున్ = కాఁగలదు, అంచు నో క్కొ = అని తలంచి కాఁబోలు, ఊర్ధ్వరేఖా = నిలువు గీఁతచే - అంకితము = గుర్తింపఁబడినదానినిగా, చేసెను.—'తరుణ' - అనుట సౌకుమార్య వ్యతిరేకయుమునకు అనుకూల నిలువుగీఁత కలవాఁడు సర్వాధికుఁ డగు నని సాముద్రికశాస్త్రము.—

ఉత్ప్రేక్షాలంకారము - 'అంచునోక్కొ' తద్వాచకము. 'అధానమునను' 'ధానమునను' - యమకము.

తే. అప్పుడు లీలావినిర్జితానంగుఁ డైన (I-26)
యతనిఁ గనియును వినియుఁ జిత్తానురక్తి
స్వర్గ మర్త్య పాతాళ విష్టపములందు
విబుధ నర భోగి కాంతలు వివశ లైరి. 66

లీలా. వినిర్జిత అనంగుఁడు = లీలచే (అవలీలగా అనుట - ఒండె - విలాసములచే) గెలువఁబడిన మన్మథుఁడు కలవాఁడు. చిత్త అనురక్తిన్ = మనస్సుయొక్క యిచ్చచేత. మర్త్య— మరణ శీలురు గాన మనుష్యులు మర్త్యులు - అట్టివారు కలదిగాన వారిలోకము మర్త్యము (అర్శ ఆద్యచ్ప్రత్యయము). విష్టపములందున్ = లోకములలో, విబు...తలు = సురలయొక్కయు నరులయొక్కయు నాగులయొక్కయు నింతులు. వివశలు=స్వవశము తప్పినవారు - మదనపరవశలు.

వినిర్జిత - ఉపమావాచకము కావున 'లీలా ...ఁడు' - ఉపమ; లేని వివశతాసంబంధమును జెప్పుటచేత సంబంధాతిశయోక్తి; ఉత్తరార్ధమున యథాసంఖ్యాలంకారంబును.

ఉ. అప్పుడు వాల్ప కప్పుడమిఱేని మనోహరమూర్తి నిచ్చలుం (1-27)
దప్పక చూచి చూచి విబుధప్రమదల్ ప్రమదంబు లాత్మలం
జిప్పిలుచుండ నెద్ది పరిశీలన సేసిరొ యట్టియబ్బసం
బిప్పుడు వారు చూపుదు రపేతనిమేషము లైనచూపులన్. 67

ఆ పుడమి ఱేని = ఆ భూ పతియొక్క (రాజుయొక్క) ... మూర్తిన్ = ఆకారమును, నిచ్చలున్ = సర్వదా ... విబుధ ప్రమదలు = వేల్పు జవరాండ్రు, ప్రమదంబులు = హర్షములు, ఆత్మలన్ = హృదయములనుండి, చిప్పిలుచుండన్ = పైకి ఉబుకుచుండఁగా, ఎద్ది = ఏయబ్బసమును - ఱెప్పవాల్పమి యను నేయభ్యాసమును, పరిశీలన చేసిరొ = అలవరించికొనిరో, అట్టి అబ్బసంబు = ఆ యలవాటును, ఇప్పుడున్ = ఇప్పటికిని, వారు = ఆవేల్పుజవరాండ్రు, అపేత ...లన్ - అపేత = పోయిన - నిమేషములు = ఱెప్పపాటుకలవి - అనఁగా ఱెప్పపాటు లేనివి - అయిన - చూపులన్ = చూపులచేత, చూపుదురు = తెలియఁబఱుతురు.

స్వాభావిక మయిన యనిమేషత్వమునకు నలదర్శనాభ్యాసమును హేతువుగా సంభావించుటచేత హేతూత్ప్రేక్ష, వ్యంజకము లేనందున గమ్య. 'ప్రమద ప్రమద— యమకము.

తాలవపాదమందు 'అపేత' అన్నచోట 'అప+ఇత' అని భేదముగాన ఉపసర్గయతి స్వరయతిని పెట్టఁబడినది.

తే. తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్ష (1-28)
ణమున ధన్యత్వమును నధన్యతయుఁ బొంది
యభిమతానభిమత మైన యక్షియుగముఁ
దాల్చుఁ జక్షుశ్శ్రవః స్త్రీకదంబకంబు. 68

చక్షుః ... కంబు - చక్షుఃశ్రవః స్త్రీ = పాఁప చెలువలయొక్క (చక్షుః = కన్నులే- శ్రవః = చెవులుగాఁగలవి - పాములు - పాములకు కన్నులే చెవులు, తెలిసినం గనఁబడును, మూసిన

వినఁబడును) - కదంబకంబు = సమూహము, తద్ ... నక్ - తద్ = ఆనలునియొక్క - గుణ= సౌందర్యాది గుణములయొక్క (గుణములను) ఆకర్ణనంబునక్ = వినుటవలన, ధన్యత్వమును = కృతార్థతను, తత్ అనిరీక్షణమునక్ = ఆతనియొక్క (ఆతనిని) చూడమివలన, అధన్యతయుక్ = అకృతార్థతను, పొంది = చెందినదై (చెందిన దగుటచేత నని భా. కర్త అక్షియుగము), అభి... గముక్ - అభిమత = ప్రియమును - అనభిమతము = అప్రియమును - ఐనట్టి - అక్షియుగముక్ = కనుఁగవను, తాల్చుక్ = ధరించియుండును.

తా:— పాతాళలోకమం దుండువా రగునాగకన్యలు తమకన్నులను భూలోకమందున్న యారాజును కానక చెడినందులకు మనస్సులో నిందించుచు, ఆకన్నులనే అతనిగుణములను విని ధన్యము లయినందులకు స్తుతించుచు, ఉందురు.

ఇట అభిమతానభిమతత్వ సంబంధము లేకున్నను చెప్పినందున సంబంధాతిశయోక్తి; అందులకు యథాసంఖ్యాలంకారము అంగముగా నున్నది.

చ. మొలచినకూర్మిఁ గన్నుఁగవ మోడ్చిన యప్పు డజస్రభావనా (1-29)
బలమున నానృపాలకునిఁ బాయక చూతురు మర్త్యభామ; లా
యలికులనీలవేణులకు నమ్మెయి నవ్విభుఁ జూచువేళలన్
గలుగవు పో నిమేష పరికల్పనఁ బుట్టెడు నంతరాయముల్. 69

మర్త్యభామలు = మనుష్యస్త్రీలు, మొలచిన కూర్మిక్ = జనించిన యనురాగముచేత - (అనురాగమువలని యానందపారవశ్యముచేత నని భా.), కన్నుఁగవక్ = రెండుకన్నులను, మోడ్చిన యప్పుడు = మూసిన సమయమందు, అనృపాలకునిక్ = ఆనలమహారాజును, అజ... నక్ - అజస్ర = నిరంతరమయిన - భావనా = ధ్యానముయొక్క - బలమునక్ = పటిమచేతను, పాయక చూతురు=తప్పక చూచుచునే యుందురు, అమ్మెయిక్ = అట్లు చూచుచునే ఉండుటవలన, ఆ విభుఁ జూచువేళలయందు, ఆ అలి కుల నీల వేణులకుక్ = తుమ్మెదల మొత్తమువంటి నల్లని జడలు గలవా రయిన యా (మనుష్య) స్త్రీలకు, నిమే... ముల్ - నిమేష = ఱెప్పపాటు యొక్క - పరికల్పనక్ = వ్యాపారమువలన - పుట్టెడు = జనించునట్టి - అంతరాయముల్ - విఘ్నములు - కలుగవు పో =సంభవింపవుసుమా.

'దేవతాస్త్రీలకు ఱెప్పపాటు లేదు గావున, నలుని చూచునప్పుడు వారికి దర్శనవిఘ్నము లేదు; మనుష్యస్త్రీల కన్ననో ఱెప్పపాటుమూలమున నడుమనడుమ దర్శనమునకు విఘ్నము కలుగదా ?' యనిన, వీరికిని కలుగదు; అది యెట్లనిన, నిరంతర నలధ్యానప్రభావముచేత ఆకనుమూఁత సమయములందుఁ గూడ వీరికి నలుఁడు కానిపించుచునే యుండును; కావున అతనిం జూచుటయందు వీరికి దేవాంగనలకన్న కొఱఁత యేమియు లేదని భా.

నిమేషసమయమందు లేని దర్శనసంబంధమును చెప్పుటచేత సంబంధాతిశయోక్తి.

'మొలచినకూర్మి'—దీనికి 'పొలు పొనఁగూడి' అని అచ్చులోను, 'పొలు పొగిఁ జూచి' అని వ్రాఁతలోను పాఠాంతరములు ఉన్నవి. శ్రీనాథుఁడు ఉ ఊ ఒ ఓలం గూడిన పఫబభ లకు అట్టి మాటతో యతి పెట్టు నను మతమువారు పయివ్రాఁతపాఠమును గ్రహించుపక్షమున, చూచుటచేత కూర్మి గలిగె నని గమ్య మగును.

సీ. కోరి లీలాగేహకుడ్యభాగంబుల
  వ్రాయుదు రమ్మహీశ్వరుని మూర్తి,
వ్రాసి కన్యాత్వగౌరవము వీసరవోవ
  దర్శింతు రనురాగ తరళ దృష్టి,
దర్శించి యతనికే దగుదునో తగనో యం
  చించుకించుక సంశయింతు రాత్మ,
సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించు ట
  ద్దము లెత్తి చూతురు తమ్ముఁ దారు,
తే. రాజకన్యలు జగతి నాక్రమమునందుఁ (1-31)
  గందు వారలనిట్టూర్పు గాడ్పువేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
  బరఁగు దమయంతిచేతి దర్పణము దక్క. 70

జగతిన్ = లోకములో, రాజకన్యలు, కోరి ... మూర్తిన్ - ఆసతో ఆరాజునాకారమును ఆటయింటి గోడభాగములలో (గోడమీఁద కొన్నిచోట్ల) (చిత్తరువు) వ్రాయుదురు; వ్రాసి, కన్యా ... దృష్టిన్ = కన్నెతనపుబెట్టు (వీసరవోవన్ =) వెలితిపడునట్లుగా మరులుచేత మెఱయుచున్న చూపుతో చూతురు; ... కర అంబుజములన్ = కమలములవంటివైన (తమ) చేతులయందు, క్రొమ్మించుటద్దములు = క్రొత్త తళుకుటద్దములను (క్రొత్తవానిని తళుకు గలవానిని ఉపయోగించుట నిర్మలత్వాతిశయముకొఱకును తమమొగము అందు చక్కఁగా తమకు అగపడుటకును), ... చూతురు = చూచుకొందురు (అట్లు చూచుకొనుట గోడమీఁది నలప్రతిమకు తాను తగునో తగదో యను సంశయమును తీర్చుకొనుటకు;)

ఆక్రమమునందున్ = అట్లు అద్దముచూచుకొను వరుసలో, చారు...దక్కన్ - చారు = సుందరమును - మోహన=మైమఱపు గలిగించునదియు నైన - మూర్తి = ఆకారము గలది - అనఁగన్=అనునట్లుగా - పరఁగు = ఒప్పునదయిన - దమయంతి చేతి (లోని) - దర్పణము = అద్దము - తక్కన్ = తప్ప, వారల...వేఁడిన్ = ఆరాజకన్యల నిట్టూర్పుగాలియొక్క వేఁడిమికి, ముకురములు = ( వారిచేతి ) యద్దములు, కందున్ = మలినము లగును.— రాజకన్యకలు గోడమీఁది నలప్రతిమకును అద్దములోని తమప్రతిబింబమునకును తారతమ్యము చూచికొనునప్పుడు, ఆరాజకన్యలలో కడమవారు ఎంతటిసుందరీమణు లైనను అతనిసౌందర్యమునకు తమసౌందర్యము ఈడుగానందున అతనికి తాము తగ మని యెఱింగి వెతఁ జెందు చుండఁగా, దమయంతిమాత్రము తా నతనికి తగుదు నని యెఱింగి సంతసించు నని భా.— వెతచేత ఊర్పు వేఁడి యై నిడుద యై అద్దమునకు తగిలి దానిని మలినీకరించును.

జగతిలోని రాజకన్య లందఱకును ఇట్టి వృత్తముతో సంబంధము లేకున్నను ఉన్నట్లు చెప్పినందున సంబంధాతిశయోక్తి,— 'దమయంతి తా నతనికి తగుదు నని తలఁచును, ఇతరులు తగ మని తలంతురు,' అనెడి గమ్యమును 'ఆమెముకురము కందదు - వారిముకురములు కందును,' అని రమణీయ భంగ్యంతరముచేత చెప్పినందున పర్యాయోక్తాలంకారము ; అది అయ్యతిశయోక్తికి అంగముగా నున్నది.

'(1) తనర వివక్షితరూపం। బునకన్నన్ రుచిరరూపమున గమ్యము వా
కొనుటయు, (2) మిష నిష్ప్రాప్తియు। నని పర్యాయోక్తయుగళి మలరున్ గృతులన్.'

వ. ఇవ్విధంబున ననన్య రూప లావణ్య రేఖా విలాస భాసమాన యగు భీమనందన యా నరేంద్ర బృందారకునియందు డెందంబు నిలుపుటయును. 71

అనన్య...మాన - అనన్య = ఇతరులకు లేని - రూప = సౌందర్యముయొక్క - లావణ్య = దేహకాంతియొక్కయు (లావణ్య మనఁగా ముత్తెములయందుఁగల తళుకువంటి దేహకాంతి -

'ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మి వాన్తరే
ప్రతిభాతి య దఙ్గేషు త ల్లావణ్య మి హోచ్యతే.')

రేఖా = తీరుచేతను - విలాస = శృంగారచేష్టలచేతను - భాసమాన = ప్రకాశించుచున్నట్టిది, ... భీమ నందన = భీమరాజు కూఁతు రయిన దమయంతి, ఆ నరేంద్ర బృందారకునియందు = ఆ రాజోత్తమునియందు, డెందంబు = మనస్సును, నిలుపుటయును = నిలిపినయనంతరము.

తే. అప్పు డనలావరుద్ధత నారఁ గూరి (I-32)
బాణపురమును బోని యా భైమిమనముఁ
బుష్పబాణాసనుఁడు భోగభోజి యైన
వరవయోవిశేషంబు వార్వముగఁ దఱిసె. 72

పుష్పబాణాసనుఁడు = పూవిల్తుఁడు, అప్పుడు = దమయంతి నలునియందు డెందము నిలిపినప్పుడు, అనల అవరుద్ధతన్ = నిప్పుచే చుట్టఁబడియుండుటను (అప్పుడ = ఆసమయమందే - నల అవరుద్ధతన్ = నలునిచేత ఆక్రమింపఁబడియుండుటను - అని దమయంతీ మనఃపర మయిన యన్వయము), ఆరన్ = చక్కఁగా - కూరి = పొంది, బాణపురమును = బాణాసురుని పట్టణమయిన శోణితపురమును - పోని ఆ భైమి మనమున్ = పోలినట్టి యా దమయంతి మనస్సును, భోగ భోజి - భోగ = పాముల దేహములయొక్క ('భోగః సుఖే స్త్ర్యాదిభృతా వహే శ్చ ఫణ కాయయోః' అమ.) - భోజి = మేఁతరి - [దమయంతీపక్షమున - భోగ = సుఖములయొక్క (సుఖములను) భోజి = అనుభవించునది] - ఐన - వర...ంబు - వర = శ్రేష్ఠమయిన - వయః విశేషంబు = పక్షి విశేషము - అనఁగా గరుడుఁడు (దమయంతీ పక్షమున- వర=శ్రేష్ఠమయిన - వయః విశేషంబు=ఒకానొక ప్రాయము - యౌవనము), వార్వముగన్ = గుఱ్ఱముగా, తఱిసెన్ = చొచ్చెను.

బాణాసురుని రాజధాని యైనశోణితపురమునకు అగ్నిప్రాకారము కలదు. అనిరుద్ధుఁడు బాణతనయ యైనయుషకొఱకు ఆపురిం జేరి అందు చెఱలో పడి యున్నప్పుడు అతనిని విడిపించుటకై శ్రీకృష్ణులవారు బలరామునితోను మన్మథావతారమైన ప్రద్యుమ్నునితోను గూడ గరుడారూఢులై ఆపురమునం బ్రవేశించిరి. ఆకథ నిట ననుసంధించికొనవలయును. మదనుఁడు పూర్వము తాను నిప్పుప్రాకారముచే చుట్టఁబడి యున్న శోణితపురమును నాగాశనుఁ డైన గరుత్మంతునిచేత ఎట్లు చొచ్చెనో అట్లే ఇప్పుడు నలరాజాక్రాంత మయిన యాదమయంతీహృదయమును భోగము లనుభవించున దైన యౌవనముచేత ప్రవేశించెను.—యౌవనము రాఁగా దమయంతి నలునిపై మదనానురాగము వహించె నని భా.

శ్లేషానుప్రాణిత మయిన యుపమాలంకారము; అందులకు 'వార్వముగ' నను రూపక మంగము.

## —* దమయంతి నలునియం దనురక్త యగుట. *—

వ. దమయంతియు శ్రవణ ప్రీతి వాసనావశంబునం బ్రబలిదిన ప్రవర్ధమానం బగు మనోనురాగంబు నిరూఢం బై యుండ. 73

శ్రవణ ప్రీతి వాసనా వశంబునన్ = వినుకలిచేతనయిన కూర్మియొక్క సంబంధమునకు అధీనతవలన,...ప్రవర్ధమానంబు = పెరుగుచున్నట్టిది, ... నిరూఢంబు = స్థిరపడినట్టిది ('నిగూఢ' అని పా.— ఇతరులకు తెలియనిది అని యర్థము.)

మ. జనకుం గొల్వఁగ వచ్చినప్పుడు త దాస్థానంబులోఁ బాఠకుల్ (1-34)
వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ కీర్తించుచోఁ
వనితారత్నము వీరసేనతనయున్ వర్ణింపఁగా నున్నత
స్తనభారంబు కెలంకులన్ నినుచుఁ జంచల్లీల రోమాంచముల్. 74

వనితారత్నము=ఉత్తమ స్త్రీ (యైన యాదమయంతి) - జనకున్ = తండ్రిని(భీమరాజును), కొల్వఁగన్ = సేవించుకొనుటకై, వచ్చి నప్పుడు = అతనిసభకు తాను పోయిన సమయమందు, తత్ ఆస్థానంబులోన్ = ఆతని సభలో, పాఠకుల్ = బట్టులు, వినుతప్రౌఢిన్ - వినుత = పొగడ్త కెక్కిన - ప్రౌఢిన్ = నేర్పుతో, వేఱు వేఱ = ఒక రొకరినిగా, వసుంధరా అధిపతులన్ = భూ విభులను, కీర్తించు చోన్ = పొగడునట్టి వరుసలో, వీరసేన తనయున్ = వీరసేన (రాజు) కుమారుఁడయిన నలమహారాజును, (ఆబట్టులు) వర్ణింపఁగా, ఉన్నత...లన్ - ఉన్నత = నిక్కైన - స్తన భార = వలుద కుచముల - కెలంకులన్ = పార్శ్వములయందు, చంచత్ లీలన్ = అతిశయించుచున్న విలాసముతో, రోమాంచముల్ = పులకములను, నినుచున్ = నిండించును (నిండుగా వహించు ననుట.)

దమయంతి తండ్రిని సేవించుటకై యాతనియాస్థానమునకుం బోయి యున్న తఱి నచట వందులు వచ్చి నానారాజుల గుణాతిశయములను పాడుచుండఁగా వినుచుండును. ఆవరుసలో వారు నలునిపొగడ్తలం బాడినప్పుడుమాత్రము స్తనభార మందంతటను క్రిక్కిఱియ పులకలు వహించును.— పులకలు గలుగుట అనురాగ మతిరేకించుటచేత. నలునియురంబును గ్రమ్ముటకై కుచములు పురపురలాడు నని భా.

ఇచట రోమాంచ మను సాత్త్వికభావము చెప్పఁబడినది:—

'సత్త్వ మన మనోవృత్తి, తజ్జం బులైన। భావములు సాత్త్వికను లష్ట భావితములు,
స్తంభ రోమాంచ బాష్ప వైస్వర్య కంప। విలయ వైవర్ణ్య ఘర్మ సంజ్ఞలఁ దనర్చు.' విన్న.

తే. మహిమ హిమవేళలందు నమ్మానవతికి (1-41)
మాసరము లయ్యెఁ దలఁపంగ వాసరములు;
పొడవు గలిగి తపర్తు సంపూర్తియందు
నంచి తాయామవతు లయ్యె యామవతులు. 75.

తలఁపంగన్=ఆలోచింపఁగా, ఆ మానవతికిన్=ఆ మానినికి, హిమవేళలందున్ = ఘంచు కాలములయందును (హేమంత ర్తువునందు సయితము), వాసరములు = పగళులు, మహిమన్ =

అధికముగా, మాసరములు = దీర్ఘములు, అయ్యెన్ = అయినవి. (అట్లే), తప ఋతు సంపూర్తి యందున్ = నిండు వేసంగిలో సైతము, యామవతులు = రాత్రులు, పొడవు గలిగి = దైర్ఘ్యము పొందినవై, అంచి...లు - అంచిత = అతిశయించిన - ఆయామవతులు = నిడివి కలవి, అయ్యెన్.

చలికాలమందు పగలు తక్కువ, వేసవిలో రాత్రి తక్కువ. ఆమెకు నిరంతర నలచింతచేత ఆపగళ్లు ఎప్పటికిని ముగియకయు, అట్లే నిరంతర చింతాజాగరములచేత ఆరాత్రులు ఎప్పటికిని తెల్లవాఱకయు బాధ కలిగించుచుండినవి.

రేలుం బవళ్లును వాస్తవపరిమాణముకన్న ఎక్కువ యగుట విరోధము; ఆమెకు చింతా జాగర కారణంబులచే నట్లు తోఁచిన వని సమాధానము; కావున విరోధాభాసాలంకారము.

'మాసరములు - వాసరములు' - అంత్యానుప్రాసము; 'ప ర్తి - పూ ర్తి' - వృత్త్యనుప్రాసము; 'యామవతులు - యామవతులు' — యమకము; 'మహి మహి' — ఛేకానుప్రాసము:

'అడర నెడ లేక రెండు రెం డక్షరంబు । లెనయు నియమంబు ఛేక మౌ.' నరస.

సీ. సఖులుఁ దాఁ బుష్పాస్త్రి సామ్రాజ్యపదవికి (I-36)
నభిషేక మొనరించు నవనినాథు,
నలనామధేయ మైనతృణంబు వినఁబడ్డ (I-35)
నధిపతి పే ర్వెన్న యట్ల యలరు,
నిషధదేశపు విప్రనికరంబుఁ బూజించి (I-37)
యలయక ప్రియుసుద్ది యడుగఁ దలఁచు,
నభ్యాసవశమునఁ బ్రాణేశ్వరునిమీఁది
యించుగీతములు వాయించు వీణ,
తే. నేర్పు గలచిత్రకరులచే నిలయభిత్తి (I-38)
భువన మోహ నాకారతఁ బొలుపు మిగుల
మగని మగువను వ్రాయించి మదిఁ దలంచు
నిషధరాజును దన్నుఁగా నీరజాక్షి. 76

నీరజ అక్షి = తామరస నేత్ర (దమయంతి), సఖులున్ తాన్ = చెలికత్తెలును తానును, పుష్పా...కిన్ - పుష్పాస్త్రి = మన్మథునియొక్క - సామ్రాజ్య = దొరతనముయొక్క - పదవికిన్ = విభవమునకు, అవనినాథున్ అభిషేకము ఒనరించున్ = నలునకు పట్టాభిషేకము చేయును; నల నామధేయము = నల అను పేరుగలది (అనఁగా రెల్లుగడ్డి - దానికి నల మని పేరు - 'నలః పోటగళే రాజ్ఞి' అమ.), ... అధిపతి పేరు = నలునినామమును...నిషధ మని నలుని దేశము పేరు...విప్ర నికరంబున్ = బ్రాహ్మణ సమూహమును...ప్రియు సుద్ది = ప్రియుని వృత్తాంతమును, ... ఇంచు గీతములు = మనోహరము లయిన పాటలను, వీణన్ = వీణమీఁద, వాయించున్, అభ్యాస వశమునన్ = అలవాటునకు లోనగుటచేత [అనఁగా - అతనిమీఁదిగీతములు వాయించు సంకల్పము లేకయే - అట్లనుటచే. అతనిచింతయే నిరంతరము మనస్సు నాక్రమించియున్న దని భా.]

చిత్రకరులచేతన్ = ముచ్చివాండ్రచేత, నిలయ భిత్తిన్ = ఇంటి గోడయందు, భువన మోహన ఆకారతన్ = లోకమును వశము దప్పించునట్టి రూపము కలవాౖరె, పొలుపు మిగులన్ = సొంపు మీఱ, మగనిన్ = భర్తను, మగువనున్ = భార్యను.—'యించు - యించు' - వృత్త్యనుప్రాసము.

'అలయక' - పా. అలవోకన్ = స్వేచ్ఛగా. 'పొలుపు మిగులు' అను పాఠమున ఆవిశేషణము 'మగువ'కు అధ్యాహార్యము. 'తాఁ' - తానును = తాన్ న్ - రెండవ 'న్' సముచ్చయార్థకము; అది స్థిరముగాన మొదటి 'న్' లోపింపఁగా 'తాన్' మిగిలినది; మరల సంధికార్యముచే 'తాఁ' అయినది.

ఉ. 'పువ్విలుకానితోడ సరి పోలెడు చక్కనివాఁడు భూమిలో (I-36)
నెవ్వఁడు చెప్పఁడా?' యనుచు నిష్టవయస్యలఁగూర్చి యాత్మలో
నువ్విళులూరుచుం బలుకు; 'నొప్పులకుప్ప, నలుండు గాక యొం
డెవ్వఁ?' డనంగ మెచ్చుఁ దరళేక్షణ, నెయ్యము లియ్య మెట్టిదో! 77

తరళేక్షణ = చంచలాక్షి (యైన దమయంతి), పువ్విలుకానితోడన్ = మన్మథునితో, ... ఇష్టవయస్యలన్ = నెచ్చెలులను, ...ఉవ్విళులూరుచున్ = ఆత్రపడుచు, పలుకున్ = అడుగును, ఒప్పుల కుప్ప = ఓసి సౌందర్య రాశీ (అని దమయంతీ సంబోధనము),...ఒండు = మఱియొకఁడు, ...అనఁగన్ = అని వారు ఉత్తరము చెప్పిన, మెచ్చున్ = వారిని మెచ్చుకొనును, నెయ్యము లియ్యము = (ఆదమయంతియొక్క) అనురాగముయొక్క తదేకాయనత్వము - అనఁగా - ఆతనియందే లీనమై యుండుట, ఎట్టిదో = ఎంత దృఢ మయినదో - చెప్ప నలవి గాని దని భా.

వ. మఱియు (1) మనోరథ పరంపరా సంవరణ ప్రసూన దామంబున న మ్మహీపతిం బతిఁగా వరియించియుం; (2) ద్విభాగశేషంబు లగువిభావరీసమయంబుల నిమీలితంబైన నేత్రయుగ్మంబును బాహ్యేంద్రియ మౌన ముద్రాభిముద్రితంబైన యంతఃకరణంబును మొఱంగి నిద్రచే సమానీతుండైన యా రాజ మనోజాతుతో నెంతయుం దడవు మంతనం బుండియు; (3) నిరంతర స్మరణసరణి ధారావాహికావగాహంబున నెడనెడం బొడచూపు నప్పుడమిఱేనిం గనుంగొని, లజ్జాసాధ్వసభ్రమంబులు మనంబులో ముప్పిరిగొనం బ్రమోదించియు; (4) నవైద్వదర్శి నిర్భర మదనశర శలాకా శంకు సంకలిత వేదనా దూయమాన మానస యై వి జృంభిత మనోభవ భుజావష్టంభంబు లగు హిమారంభంబులును, (5) గాలాగరు కళంకిత కామినీ కంఠమూలంబు లగుశిశిర కాలంబులును, (6) గలకంఠ కామినీ కంఠ కోమల కుహూంకార కోలాహల కరంబిత కకుబంతంబు లగువసంతంబులును, (7) సాయంతన సమయ సంఫుల్ల మల్లి కామోద మేదుర సమీర ణోఘంబు లగు నిదాఘంబులును, (8) విరహిజన హృదయ భయంకర స్తనిత సందోహంబు లగు జలధరాగమంబులును, (9) సకలజన మనోవికాసమయంబు లగు శారదసమ

—* నలుఁడు దమయంతియం దనురక్తుఁ డగుట. *—

యంబులును, గడవు చుండె. నవ్వేళ (10) జలధివేలా వలయిత వసుంధరా భువన మండ లాఖండలుం డగు నలుండును విమల నిజకీర్తి మౌక్తిక మాలికా సంతానంబులకు నంత ర్ఘటనా గుణంబులుంబోలెఁ బొలుచు నక్కాంతా లలామంబు గుణంబులు జనపరంపరవలన వినియె. నాసమయంబున. 78

(1) మనో...బునన్—(మనోరథ =) కోరికలయొక్క వరుసయనెడి పతివరణార్థమైన పువ్వుమాలచేత, ఆ - మహీపతిన్ = రాజును, పతిఁగా వరించి = పతిని చేసికొని (అనఁగా కోరికల పెంపున స్వయంవరసభలో తాను పూమాలను ఆరాజుకంఠమున వైచి యాతనిని వరించినట్లు సంకల్పించుకొని;) (1-39)

(2) త్రి భాగ శేషంబులు = మూఁడవ భాగము మిగతగాఁ గలవి, (అనఁగా మూఁట రెండు పాళ్లు గడచి మూఁడవపాలు మిగిలి యుండఁగా — అంతవఱకు నిద్ర పట్టలే దనియు భా.) నిమీలితంబు = మూయఁబడి నట్టిది, ఐన - నేత్ర యుగ్మంబును = కనుఁగవను, బాహ్యా ... బును - బాహ్య ఇంద్రియ=వెలుపలి యింద్రియములయొక్క (అనఁగా త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణముల యొక్క) - మౌన ముద్రా = నిర్వ్యాపారత యనెడి సీకాచేత - ముద్రితంబు = సీకా వేయఁబడినది (కట్టి వైవఁబడినది) - ఐన - అంతఃకరణంబున్ = హృదయమును, మొఱంగి = వంచించి (కర్త నిద్ర), నిద్రచే - సమానీతుం డైన = తేఁబడిన (కలలో కలసికొనిన) - ఆరాజ మనోజాతుతోన్ = మన్మథునివంటివాఁ డయిన యారాజుతో, ఎంతయున్ తడవు = చాల సేపు, మంతనంబు ఉండియు = ఏకాంతమునందు వర్తించియు, [నిద్రయందు నిపుణదూతికావృత్తాంతము స్ఫురించుచున్నది గావున సమాసోక్త్యలంకారము.] (1-40)

(3) నిరం...బునన్ - నిరంతర = విరామము లేని - స్మరణ = జ్ఞప్తి (తలపోయుట) యొక్క - సరణి = మార్గముయొక్క - ధారా వాహికా = సంతత ప్రవాహమందు - అవగాహంబునన్ = స్నానమాడుటవలన, ఎడ నెడన్ = ఎల్లప్రక్కలయందును, పొడ...గొని = కనఁబడెడి యారాజును చూచి, లజ్జా సాధ్వస భ్రమంబులు = సిగ్గును భయంబును భ్రాంతియు, ... ముప్పిరి గొనన్ =(మూఁడు పిరులు వేసిన త్రాటివలె) మిక్కిలి బలీయములు కాఁగా, ప్రమోదించియున్ = సంతోషించియు; [దమయంతికి నలుఁ డెల్లెడలం గనఁబడుట విశేషాలంకార భేదము.—

‘ (1) ప్రాకట మగు నాధారము । లే కాధేయంబు రాజిలినను విశేషం;
(2) బేక మనేకగతంబున్; । (3) స్తోకారంభమున నన్యదుర్ఘటకృతియున్.
(1) పోకార్చును జీఁకటి దీ । పాకరములు భానుకరము లాతఁడు క్రుంకన్;
(2) ఆకొమను గందు నెల్లెడ; । (3) నా కబ్బె సురేంద్ర దర్శనము నినుఁ గనుటన్.’

(4) ఆ - వైదర్భి = విదర్భరాజపుత్రి (దమయంతి); నిర్భర...నస - నిర్భర = భరింపరాని - మదన = మన్మథుని - శర శలాకా = అంప కోల లనెడి - శంకు = మేకులచేత - సంకలిత = కలిగింపఁబడిన - వేదనా = బాధచేత - దూయమాన = పీడింపఁబడుచున్న - మానస = హృదయము కలది, ఐ, విజృ ... బులు - విజృంభిత = చెలరేఁగినదైన - మనోభవ = మదనుని - భుజా అవష్టంభంబులు = బాహు బలము కలవి - అగు - హిమ ఆరంభంబులును = మంచు (హేమంత ఋతువు) యొక్క యావిర్భావంబులను; (హేమంత శిశిరములలో రాత్రులు దీర్ఘములై

విరహులకు దుస్సహము లగును.) — 'మాన మాన' — ఛేకము. 'స్తంభంబులు - రంభంబులు' - అంత్యానుప్రాసము.

(5) కాలా ... బులును - కాల అగరు = నల్ల యగలుచేత (రూ. అగురు)- కళంకిత = అంకితము లయిన - కంఠములయొక్క - మూలంబులు = మొదళ్లు గలవి - అగు - శిశిరకాలంబులును = చలికాలములను; (చలికాలములో చలిబాధ శమించుటకై స్త్రీలు కంఠమునకు నల్లయగరు గంధముం బూసికొందురు.) — అంత్యానుప్రాసము.

(6) కల...బులుఁ - కలకంఠ కామినీ = కోయిల కోమలుల - కంఠ = గొంతుల యొక్క - కోమల = మృదువయిన - కుహూకార = కుహూ కుహూ అను శబ్దములయొక్క - కోలాహల = గొల్లుచేత - కరంబిత = మేళనముం బొందిన - కకుప్ = దిక్కులయొక్క - అంతంబులు = తుదలు గలవి - అగు - వసంతంబులును = ఆమనులను; (వసంత ర్తువునందు కోకిలకూఁతలు సంభవించి అత్యంత విరహోద్దీపనము సేయును.) — అంత్యానుప్రాసము.

(7) సాయం... బులును - సాయం సమయ = సంజ వేళందు - సంఫుల్ల = నిండార విరిసిన - మల్లికా = మల్లెలయొక్క - ఆమోద = పరిమళముచేత - మేదుర = దట్టములయిన - సమీరణ = వాయువుల - ఓఘంబులు = సమూహములు గలవి - అగు - నిదాఘంబులును = వేసంగులును; [మల్లెలు సాయంకాలమందు పూచుట ప్రసిద్ధము; (1 ఆ. 37) చూ. సందెమల్లెలనెడి నామంబును ప్రసిద్ధము; ఆమల్లెలు మిక్కిలి విరహోద్దీపకములు. (రూపకము; అంత్యానుప్రాసము.)]

(8) విరహి... బులును - విరహిజన = వియోగిజనుల - హృదయ = ఎడఁదలకు - భయంకర = వెఱపు గొలుపునట్టి - స్తనిత = ఉఱుములయొక్క - సందోహంబులు = సమూహములు గలవి - అగు - జలధర అనేహంబులు = మేఘ కాలంబులను; — అంత్యానుప్రాసము.

(9) సక... బులును - సకల జన = ఎల్లజనులయొక్కయు - మనః = హృదయముల యొక్క - వికాస మయంబులు = ఉల్లాసముతో నిండియుండు నవి - అగు - శారద సమయంబులును = శరత్సంబంధమయిన కాలములను; కడపుచుఁ ఉండెఁ — ఆయాదినములు కడచుటకై మిక్కిలి ప్రయత్నములు చేసె నని ప్రేరణార్థప్రయోగభావము. — యమకము.

(10) ఆవేళఁ = ఆసమయమందు, జలధి...డు - జలధి - సముద్రముయొక్క - వేలా = చెలియలికట్టచేత - వలయిత = సంజాతవలయ మయిన - అనఁగా - చుట్టుకొనఁబడిన దైన - వసుంధరా భువన మండల = భూలోక వలయమునకు - ఆఖండలుండు = ఇంద్రుఁడు (భూలోకమున కెల్ల ఏలిక యని భా.) ... విమ ... లకుఁ - విమల = స్వచ్ఛములయిన - నిజ = తనదైన - కీర్తి మౌక్తిక = కీర్తియనెడు ముత్తెముల - మాలికా = దండల - సంతానంబులకుఁ = సమూహములకు, అం...బోలెఁ - అంతః = లోపలి - ఘటనా = కూర్పుయొక్క - గుణంబులం బోలెఁ = దారంబులో యనునట్లుగా - పొలుచు = ఒప్పుచున్న - అక్కాంతా లలామంబు గుణంబులు = ఆసుందరీ తిలకముయొక్క (సౌందర్యాది) గుణములను (ఆమెగుణములచే ఇతనికీర్తి మిక్కిలి నిలుకడం జెంది శోభించు నని భా.), జన పరంపరవలనఁ = ఒకని పిమ్మట ఒకఁడుగా పలువురవలన ;... 'విమల... గుణంబులు' - రూపక మంగముగాఁగల యుత్ప్రేక్ష. (1-42)

శా. ఆ వామాక్షి మనోహరాకృతి యమోఘాస్త్రంబు గా భూవరుఁ
లావణ్యాధికు నచ్ఛలంబుమెయి గెల్వం బూని యిందిందిర (1-43)

జ్యావల్లీ కిణ కర్కశం బయిన హస్తం బుద్ధతిం జాఁపి వే
పూవుందూపులజోదు పుచ్చుకొనియెం బుండ్రేక్షుకోదండమున్. 79

పూవుం దూఁపుల జోదు = పూవు టమ్ముల యోధుఁడు, లావణ్య అధికున్ =సౌందర్యముచే (తనకన్న) హెచ్చువాఁడయిన, భూవరున్ = నలమహారాజును, అచ్చలంబుమెయిన్ = ఆగ్రహముతో (లావణ్యాధికుఁ డనెడి యీసుచేత—అని యేని),గెల్వం బూని=జయింప నెంచి, ఆ...బు ఆ వామాక్షి = సుందరనేత్రయైన యాదమయంతియొక్క - మనోహర ఆకృతి = రమణీయమైన రూపు - అమోఘ అస్త్రంబు = వ్యర్థముకాని బాణము - కాన్ = కాఁగా (అనఁగా జయము తప్పనట్టి బాణముగా ఆమెరూపమును గొని), పుండ్రేక్షు (పుండ్ర ఇక్షు) కోదండమున్=నల్లయెఱ్ఱ చెఱకు వింటిని, ఇందిం...స్తంబు - ఇందిందిర = తుమ్మెదలనెడి - జ్యావల్లీ = తీఁగవంటి యల్లెత్రాటి - కిణ = కాయలచేత - కర్కశంబు = కఠినము - అయిన - హస్తంబు = చేతిని, ఉద్ధతిన్= గర్వముతో, చాఁపి = నిగిడించి, వే = శీఘ్రముగా, పుచ్చికొనియెన్= గ్రహించెను. ('పుండ్ర' స్వారస్యమును 7 ఆ. 12 లో చూ.)

నలమహారాజు మదనునికన్న సుందరుఁడు, అందుకై ఆయనమీఁద మదనుఁడు పగ పట్టియుండెను. ఆపగ తీర్చుకొనుటకు మదనునికి సమయము దొరకకుండినది; నలుఁడు దమయంతీ గుణాతిశయములను విన్నంతట, మదనుఁడు తనకు అదే సమయ మని తన యితరాయుధములకు లోఁగనట్టి యానలుని జయించుటకై ఆదమయంతియొక్క రూపమునే ఓటు లేని యస్త్రముగా అతనిమీఁద ప్రయోగించువాఁడై తుమ్మెదనారి దెబ్బలచేతఁ గాయలు కాచియున్న తనచేయి చాఁచి నల్లయెఱ్ఱచెఱకు వింటిని అందుకొనెను.—'అస్త్రము' 'పూవుందూపులజోదు' అనుటచే వీరులు బ్రహ్మాస్త్రము లోనగు నస్త్రమంత్రములతో మంత్రించి దేని నేని బాణముగా ప్రయోగించి నట్లు మదనుఁడు ఆమెరూపముచే మంత్రించి పూబాణముం బ్రయోగించుట అని భా.— నలుఁడు దమయంతియందు మరులు వహించె నని తాత్పర్యము.

గెల్వం బూనుట ఉత్ప్రేక్షితము. నలుని లావణ్యాధికత్వము చలమునకు కారణపరము కావున పదార్థహేతుక కావ్యలింగాలంకారము. ఆ చలంబుమెయిన్ = ఆ పగచేత నని యన్వయించు పక్షమున కావ్యలింగము లేదు - హేతూత్ప్రేక్ష యగును.

క. శ్రవణావతంస మయ్యెను। ధవళాయతనేత్రగుణము ధరణీపతికిన్; (1-44)
శ్రవణావతంస మయ్యెను। బువువింటిగుణంబు నపుడ పుష్పాస్త్రునకున్. 80

ధరణీపతికిన్ = నలరాజునకు, ధవ...ణము - ధవళ=తెల్లని - ఆయత = వాలికలయిన - నేత్ర = కన్నులుగలదైన యా దమయంతియొక్క - గుణము = సౌందర్యాది గుణము, శ్ర...ము - శ్రవణ = చెవికి - అవతంసము=ఆభరణము - అయ్యెన్ - (వినఁబడి మనోహరత్వముచే ప్రీతి గలిగించినది), అపుడ = తత్క్షణమే (అవిలంబితముగా) - పుష్పాస్త్రునకున్ = పూవుటమ్ములవానికి, పువువింటి - గుణంబున్ = అల్లెత్రాడుకూడ - శ్రవణావతంస మయ్యెన్ = కర్ణాభరణ మాయెను [మదనుఁడు చెవివఱకు అల్లెత్రాటిని ఈడ్చి నలునిపై బాణములను ప్రయోగించె ననుట. చెవివఱకును అల్లెను ఈడ్చుటచే బాణము మిక్కిలి గాటముగా నాటి కడుంగడు నొప్పి కలిగించును - ఎక్కువ యనురాగము పుట్టించి ఎక్కువ విరహతాపముం గొలిపె ననుట.] — 'గుణంబున్' అనుచో నున్న 'న్' శబ్దము పూర్వవాక్యార్థసముచ్చాయకము.

ఇచట ఉత్తరవాక్యార్థమునకు పూర్వవాక్యార్థము హేతువు గావున వాక్యార్థహేతుక మయిన కావ్యలింగాలంకారము. 'శ్రవణావతంస మయ్యెను'—అనెడి ధర్మవాచకావృత్తిచేత ఆవృత్తి దీపకము:—

'ఆవృత్తి దీపకము లన । నా వర్ణ్యంబులకె ధర్మ మన్యంబులకే
యావృత్తి చేసి చెప్పం । గా (1) వచనము (2) నర్థమును (3) యుగళమును, నా ఱొ.
(1) వర్షము కార్మొగు లయ్యెన్। వర్షము రాతిరియు నయ్యె; (2) వనజిని యడలెన్
ధర్షణి ప్రియుఁ గై బడలెన్। (3) హర్షించె శిఖావళములు హర్షించెఁ గరుల్.' అలం.

ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్ (I-45)
భావజుఁ డప్పు డున్మదనబాణము తియ్యనివింటఁ గూర్చుచోఁ
గేవలసాహసంబు మదిఁ గీల్కొనఁ జేసియు ముంచెఁ దాఁ ద్రిలో
కీవిజయార్జితంబు లగు కీర్తిభరంబులు సంశయాంబుధిన్. 81

అప్పుడు, భావజుఁడు = మన్మథుఁడు, మహాధృతిశాలిన్ - మహత్ = గొప్పదయిన - ధృతి = స్థైర్యముచేత - శాలిన్ = శోభించుచున్నవాఁడయిన (అజయ్యుఁ డయిన యని భా.), ఆ వసుధాధినాథునిన్ = ఆ రాజును, జయించు తెంపునన్ = జయింపవలయు నన్న తెగువచేత, తియ్యనివింటన్ = చెఱకువిల్లున, ఉన్మదన బాణమున్ = మరులువెత్తింపఁ గలిగించునట్టి యలుఁగును, కూర్చుచోన్=సంధించుటయందు, కేవల సాహసంబున్=సాహసమును మాత్రమే, మదిన్ = మనస్సులో, కీల్కొనఁ జేసియున్ = దృఢముగా పెట్టుకొని, (త్రి...లన్ - త్రిలోకీ - మూఁడు లోకముల మొత్తముయొక్క - విజయ=గెలుపుచేత - అర్జితంబులు=గడింపఁబడినవి - అగు-కీర్తి భరంబులు = కీర్తిరాసులను, సంశయ అంబుధిన్ = సందేహమనెడి సముద్రములో - ముంచెన్.

ఉన్మదనబాణము—మదనుని పంచబాణములలో నొకటి.—అవి ఎవ్వి యనిన:—

'ఉన్మాదన స్తాపన శ్చ శోషణః స్తమ్భన స్తథా
సమ్మోహన శ్చ కామస్య పఞ్చ బాణాః ప్రకీర్తితాః.'

ప్రకారాంతరమున:—

'అరవిన్ద మశోకం చ చూతం చ నవమల్లికా
నీలోత్పలం చ పఞ్చ స్యుః పఞ్చబాణస్య సాయకాః.'

ఈ పూములకుల కృత్యము లిట్లు చెప్పఁబడినవి:—

'కూ డుడిగించు నశోకము, । వాడించును మల్లెవిరి, వివర్ణత సేయున్
జూడఁగఁ జూతము, తలఁపుల్ । జోడించును దమ్మి చంపఁజూచున్ గలువల్.'

ఆరాజు మహాస్థైర్యశాలి యగుటచేత దుర్జయుఁ డయినందున అతని జయింప సాహసించి మన్మథుఁడు తన ముల్లోకముల గెలుపుకీర్తి ఈయెత్తుకడతో మునిఁగిపోవు నేమో అని భయపడ సాగెను.—అంత సాహస మేల యన, 'సాహసే లక్ష్మీః' అని సూక్తి; కీర్తిని కూడ సందేహము పాలుచేసికో నేల యన, అతని సౌందర్యాతిశయముకై అతనిమీఁది పగ యంత దుస్సహముగా నుండె నని భా. నలుఁడు మహాధీరుఁడు సులువుగా మదనవశంవదుఁడు గాఁ డని తా.

మదనునికి కీర్తినాశ సంశయము లే కున్నను చెప్పఁబడినది గావున సంబంధాతిశయోక్తి. 'సంశయాంబుధి' - రూపకము.

తే. అతనుఁ డఁట జోదు! పూమొగ్గ యఁట శరంబు! (I-46)
చించినది యఁట తద్ధైర్య కంచుకంబు!
నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచి యున్న
ధాతమదియెత్తికోలు తుదిఁ దాఁక కున్నె! 82

జోదు=యోధుఁడు - అతనుఁ డఁట=దేహము లేనివాఁ డఁట (కేవలము అసమర్థుఁ డనుట), శరంబు=బాణము - పూమొగ్గ యఁట (మిక్కిలి మృదు వగుటచే చించి చొచ్చుటకు కేవలము అపటువు అనుట), చించినది, తత్= ఆతని - ధైర్య = దిట్టతన మనెడు - కంచుకంబు అఁట= కవచ మఁట - [అఁట శబ్దము మూఁటను అసంభావ్యతను (నమ్మరామిని) తెలుపుచున్నది.] నలు ...యున్న - ధాత = బ్రహ్మయొక్క - మది = మనస్సులోని - ఎత్తికోలు = ప్రయత్నము - తుదిఁ దాఁకక ఉన్నె = నెఱవేఱక యుండునా.

ఒడలు లేనివాఁడు పూఁదూపులతో కవచమును భేదించుట విరోధము, అది విధిసంకల్ప మగుటచే అవిరోధము తోఁచినందున విరోధాభాసాలంకారము. దానికి 'ధైర్యకంచుక' మనుచో రూపకము అంగము. 'అతను' 'పూమొగ్గ' శబ్దములకు అసమర్థతయును, 'కంచుక' శబ్దమునకు, అభేద్యతయును అభిప్రాయములు గావున పరికరాంకురాలంకారము:—

' అకరణినే విశేష్యము। సాకూతము గాఁగఁ బరికరాంకుర మలరున్;
ఓకమల, యెట్లు గెలుచును । నాకు సుమాయుధుఁడు దాఁ బినాకాయుధునిన్ ?' అలం.

ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతి యంచిత ధైర్యకంచుకం (I-46)
బయ్యతనుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ,
దొయ్యలి రాజనందనునితోడన గూర్పఁ దలంచుచున్న యా
దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకుటఁ గానఁగ నయ్యె నయ్యెడన్. 83

కవి పూర్వపద్యాభిప్రాయమునే మరల చెప్పుచున్నాఁడు:— అయ్యెడన్ = ఆ నలదమ యంతీవిషయమున, ఎయ్యది కారణంబుగన్= ఏకారణముచేత, ఆ అతనుండు = దేహము లేనివాఁ డైన యా మన్మథుఁడు, అలరు అమ్ములచేన్ = పూఁదూపులతో, మహీ ...కంబు మహీపతి= రాజుయొక్క - అంచిత = ఉత్తమమయిన - ధైర్య కంచుకంబు = ధైర్య మనెడి కవచమును, చించెన్ = చీల్చెనో, అది కారణంబుగాన్ = ఆ కారణముచేతనే, తొయ్యలిన్ = ఆకోమలిని, రాజనందనునితోడన ( - తోడనే ) ... దయ్యము నెత్తికోలు = దైవముయొక్క ప్రయత్నము, తుదిఁ దాఁకుట = నెఱవేఱుట, కానఁగ నయ్యెన్ = తెలియ వచ్చెను.

విధిసంకల్పము అట్లున్నందున ఆరాజు మదనునికి లోఁబడెను గాని మదనమాత్రుని ప్రయ త్నమే అయినయెడల లోఁబడి యుండఁ డని భా.

ఉ. ఏసవిరిన్ విరించి నెకయేటునఁ దామరపాన్పుపైఁ బడం (I-47)
ద్రోసినజోదు మన్మథుఁడు దుర్వహ నూత్న వియోగ వేద నా
యాసిత మైన రాజహృదయాబ్జము గాడఁగ నేసె నెంతయుం
గాసిలి తేఁటిత్రెక్క గఱి గట్టినపుష్పశిలీముఖంబులన్. 84

ఏస విరిన్ = ప్రక్కవాటయిన పువ్వుతో, విరించిన్ = బ్రహ్మయంతవానిని, ఒక— ఏటున్ = దెబ్బతో (బ్రహ్మను ఎదురుగా లక్ష్యీకరింపక లీలగా ప్రక్కవాటుగా పూవుతో ఒకయేటు వేసి ఆమాత్రానకే), తామర పాన్పుపైన్ = (శైత్యోపచారార్థము) తామర శయ్యమీఁద, పడం ద్రోసిన జోదు (= యోధుఁడు) మన్మథుఁడు, దుర్వ ... ము - దుర్వహ = భరింపరాని- నూత్న = క్రొత్త - వియోగ వేదనా = విరహ దుఃఖముచేత - ఆయాసితము = పీడింపఁబడినది, ఐన - రాజు హృదయ అబ్జము = ఆని మనః పద్మమును, ఎంతయున్ గాసిలన్ = మిక్కిలి ఆయాసపడునట్లుగా, తేఁటి... బులన్ - తేఁటి ( = తుమ్మెద ) ఱెక్క - గతి = (బాణపు) ఱెక్కగా - కట్టిన - పుష్ప శిలీముఖంబులన్ = పూ బాణములతో, కాఁడఁగన్ ఏసెన్ = నాటునట్లు వేసెను.

'ఏసవిరి' తో బ్రహ్మకు అంత పాటు కలిగించె ననుటచే అత్యంతసమర్థుఁ డని భా. బ్రహ్మ కమలాసనుఁ డగుట విరహతాపశాంత్యర్థము తామరసెజ్జం బడుటగా కవిప్రౌఢోక్తి. 'విరి' 'బ్రహ్మ' పదములకు అసారతా దుర్జయతలు అభిప్రాయములు. 'నూత్న' విరహము దుస్సహతరము. మేఘములో 'ఇత్థంభూతాం ప్రథమవిరహే తా మహం తర్కయామి' అనుచో 'ప్రథమ' శబ్దముచే కాళిదాసు ఈయర్థమునే సూచించినాఁడు. దుర్జయుఁ డయిన దేవుని అంత సులువుగా అట్టి పాటులం బడవైచిన జోదు పూర్వోక్త ద్వేషముచేత ఆరాజును ఆయాసితుని సూటిగా తగులుటకై ఱెక్కలు కట్టినట్టిబాణములతో పింజపింజ గాఁడఁగ నేసిన ఎంత గాసిలునో చెప్పవలయునా? బ్రహ్మను కాముఁడు తన యన్నగారనియు ఎదురుగా కొట్టమి. మదనుఁడు క్రించుఁదనంబు వహించి బ్రహ్మను తత్పుత్త్రి యైన సరస్వతిపై మరులు గొలిపిన కథ నిట ననుసంధింపవలయును.

పరికరాంకురము. 'విరి న్విరిం'—ఛేకానుప్రాసము.

తే. లలన లజ్జా సరి ద్దుర్గ లంఘనమున (I-48)
రాజుహృదయంబుఁ జొచ్చిన క్రమముఁ జూడఁ
దరుణి మారంభ పరికల్పితంబు లైన
వలుద కుచకుంభముల ప్రభావమునఁ జూవె. 85

లలన = (స్త్రీ) దమయంతి, లజ్జా...నన్ - లజ్జా = (నలుని) వ్రీడ యనెడి - సరిత్ దుర్గ = ఏటిలోని కోటయొక్క (కోటను)- లంఘనమునన్ = దాఁటుటచేత (దాఁటి), రాజు హృదయంబున్ = ఆని మనస్సును...తరు...బులు - తరుణిమ = యౌవనముయొక్క - ఆరంభ = ప్రాదుర్భావముచేత - పరికల్పితంబులు = చేయఁబడినవి, ఐన - వలుద ... చూవె = లావయిన చనుగిండుల మహిమచేతఁ జుమా.— దమయంతీ కుచకుంభ విభ్రమమును విని నలుఁడు లజ్జ మాని ఆమెయందు వలపు వహించె నని భా.— ఉత్ప్రేక్షాలంకారము, దానికి రూపకము అంగము.

సీ. జాగరోద్భూత దృగ్రాగంబు మాణిక్య కర్ణకుండల దీప్తిఁ గప్పిపుచ్చు;
రాజకార్య పరంపరా ఖేద మిషమున నిట్టూర్పుగాడ్పుల నిహ్నవించు,
ఘనసార బహుళ చందన విలేపనమున నాపాండుభావంబు నపలపించు,
దోరంతర న్యస్త తారహారంబుల నంతఃపరితాప మపనయించు,

తే. మాననీయ శశాంక కోమలము లైన (1-49)
యామినీ సమయములుఁ బర్యంకములును
సాక్షులుగ నొంచువలవంత జనవిభుండు
కన్నెకూర్మి ప్రకాశంబు గాక యుండ. 86

జనవిభుండు = (నలమహా)రాజు, మాన ... ముల్ - మాననీయ = శ్లాఘనీయుఁడయిన - శశాంక = చంద్రునిచేత (చంద్రునివలె అని పర్యంకపరము) - కోమలములు = రమణీయములు - ఐన - యామినీసమయములున్ = రాత్రివేళలును, పర్యంకములును = పాన్పులును, సాక్షులు గన్ = ద్రష్టలుగా, నొంచు = (తన్ను) బాధించుచున్న [పా. ఒందు = (తాను) పడుచున్న] వలవంతన్ = మదనవేదనయందు, కన్నె కూర్మి = దమయంతి (మీఁది) ప్రేమ (లేక - తొలి వలపు), ప్రకాశంబు గాక యుండన్ = బయటఁ బడ కుండుటకుఁ గాను;

జాగ...బున్ - జాగర = మేలుకొనుటచే (నిద్ర పోమిచేత) - ఉద్భూత = పొడమిన - దృక్ రాగంబున్ = కన్నుల యెఱుపును, మాణిక్య కర్ణ కుండల దీప్తిన్ = కెంపుల చెవి పోఁగుల కాంతిచేత, కప్పి పుచ్చున్ = కమ్మివైచును;

నిట్టూర్పు గాడ్పులన్ = (విరహఖేదోత్పన్నము లయిన) దీర్ఘ నిశ్వాసములను, రాజ ... నన్= రాచకార్యములయొక్క - పరంపరా = తెంపులేమిచేతనైన - ఖేద=దుఃఖము యొక్క - మిషమునన్ = వ్యాజముచేత, నిహ్నవించున్ = డాఁగురించును;

ఆ పాండు భావంబున్ = (దేహ) మంతట నున్న (విరహ) పాండిమను, ఘన...మునన్ - ఘనసార= కర్పూరముచేత అధికమయిన (ఎక్కువగా కర్పూరము కలిగియున్న) చందనముయొక్క పూఁతచేత - అపలపించున్ = దాఁచును;

అంతః పరితాపము=లోని వేఁడిని (అంతశ్శబ్దమునకు మనస్సుకూడ అర్థముగాన - మనస్సు లోని తాపము నని యేని చెప్పవచ్చును), దోః ...బులన్ - దోరంతర = వక్షమునందు - న్యస్త = ధరింపఁబడిన - తార = శుద్ధములయినముత్త్యాల - హారంబులన్ = పేరులచేత - అపనయించున్= పోఁగొట్టుకొనును.

ఆరాజు దమయంతిమీఁది యనురాగమును లజ్జాతిశయముచేత ఎవరికిని తెలియనీకుండ విరహ బాధపడుచుండెను. ఆబాధకు చంద్రునిచే కోమలము లయిన రాత్రులును, చంద్రునివలె కోమలము లయిన (తెల్లని వలిప దుప్పట్లు పఱచిన) పాన్పులును, దప్ప వేఱు సాక్షులు లేరు. అతఁడు చెప్ప కున్నను సన్నిధానవర్తులు చిహ్నములనుబట్టి వలవంతను ఊహింపలేకపోయిరా యనిన, వారిని అతఁడు ఏమార్చుచుండెను. ఎట్లనఁగా?— జాగరమువలని కంటికెంపును మాణిక్యాధికములయిన కుండలములనే తాల్చుటచేత తదీయమాణిక్యముల కెంపు గాను, విరహనిశ్వాసములను రాజకార్య ఖేదాతిశయ నిశ్వాసములుగాను, విరహపాండిమను చందనమందలి కర్పూరాధికతవలని రక్తశోష పాండిమగాను, లోని తాపమును ముత్తెపుఁబేరులచే తొలఁగించుకొనుటచేత లేనేలేనట్లుగాను, వారు తలంచునట్లుగా టక్కు సేయుచుండెను. లజ్జ అంత బెట్టిద మని భా.

వ్యాజోక్త్యలంకారము:—

'అయథార్థకారణోక్తిన్ । నయ మగు నాకారగోపనము వ్యాజోక్తిన్;
మెయి గీఱె మావిఁ గఱచెను । బ్రియపడి యీచిలుక నేల పెంచితివె సఖీ!' అలం.

రాజు నోటిచే వంచింప లేదే, వ్యాజోక్తి యెట్లగును? అని ప్రశ్నయేని, ఉక్తి శబ్దము లక్ష్య లక్షణనామములయందు వ్యాపారమాత్రోపలక్షణము :— ‘లక్షణే లక్ష్యనామ్ని చోక్తిగ్రహణ మాకారస్య గోపనార్థం హేత్వన్తర ప్రత్యాయక వ్యాపారమాత్రోపలక్షణమ్.’ అని కువలయా.

## —* నలుఁడు ఉపవనవిహారంబున కరుగుట. *—

వ. (1) ఇవ్విధంబున నసంవరం బైన శంబరవైరివిక్రమంబు క్రమక్రమంబు నం బరిస్ఫుటం బగుచుండ వియోగ వేదనా చిహ్నంబులు నిహ్నవింపం గొలందిగాక చీకాకుపడి యాకార రేఖా వినిర్భర్త్సిత మత్స్యలాంఛనుం డగు నా రాజ కుమారుం డొక్కనాఁ డారామ వీక్షావిహారంబునం గాలక్షేపంబు సేయువాఁడై (2) ప్రభంజనాధ్యేయజవంబును జంచల ఖురాంచల క్షోదిత క్షోణీ మండలంబును (3) నిగాళగ దేవమణి దీప్తిచ్ఛటా పటల శంకావహ కృకాటికా ధవళ కేసర కేశ రశ్మి సంచయంబును (4) వల్గు వల్గానుషక్త వదనతా విడంబిత వక్త్రస్థ భుజగ వైనతేయంబును (5) జలాచల ప్రోథ తానుమీయమాన నిజ వేగ దర్ప ప్రశంసా ప్రవచ నోపన్యాసంబును నై (6) సింధుజంబును శీతమహా స్సహోదరంబును నగుట రెండవ యుచ్చైశ్శ్రవంబునుం బోలిన యాపవాహ్యంబు నారోహించి. 87

(1) అసంవరంబు = దాఁపఁటకము లేనట్టిది (దాఁప శక్యము గానిది). ... శంబరవైరి విక్రమంబు=శంబరాసురుని గొంగ యయిన మన్మథుని పరాక్రమము. ... వియోగ వేదనా = విరహ బాధయొక్క. ... నిహ్నవింపన్ = దాఁచుటకు, కొలఁది = శక్యము. (1-53)

ఆకా... డు - ఆకార = రూపముయొక్క - రేఖా = విలాసములచేత - వినిర్భర్త్సిత= బెదరింపఁబడిన (చీకొట్టఁబడిన) - మత్స్యలాంఛనుఁడు = మీనకేతనుఁడు (మన్మథుఁడు) కలవాఁడు (ఉపమ)....ఆరామ వీక్షా విహారంబునన్=తోఁటయొక్క దర్శన మనెడి క్రీడచేత. ...(1-55)

(2) ప్రభంజన అధ్యేయ జవంబును = గాలికి నేర్వఁదగిన వేగము గలదియు [సంబంధాతిశయోక్తి. (I-67)] చంచ ... బును — కదలుచున్న (ఖుర=) గొరిజలయొక్క - (అంచల=) అంచులచేత నుగ్గుసేయఁబడిన నేలయొక్క ప్రదేశము గలదియు (స్వభావోక్తి). (1-57)

(3) నిగాళ...బును-(నిగాళ=) గొంతు సమీపమును - గ = పొందియున్న-దేవమణి = దేవమణి యను పేర గుఱ్ఱపు గొంతులోనుండు సుడి యనెడి - దేవమణి = కౌస్తుభముయొక్క - దీప్తి= వెలుఁగులయొక్క - ఛటా = వరుసల - పటల = మొత్తములనెడి - శంకా = సందేహమును - ఆవహ = కలిగించు - కృకాటికా = మెడమీఁది గుంటయొక్క - ధవళ = తెల్లని - కేసర కేశ = జూలు వెండ్రుకలయొక్క - రశ్మి = కిరణములయొక్క - సంచయంబును= సమూహముగలదియు (ఆ గుఱ్ఱమునకు మెడలో క్రిందివైపున దేవమణి యను సుడి శుభ మైనది కలదు.

‘ఘంటాబన్ధసమీపస్థో నిగాళః కీర్తితో బుధైః
తస్మిన్ దేవమణి ర్నామ రోమజః శుభకృన్మతః.’ అశ్వశాస్త్రము.

మెడమీఁది తెల్లనిజూలు ఆదేవమణినుండి లోపలిదారిగా పయికి మెడమీఁద నుండు కృకాటిక యనెడి గుంటలోనికి వచ్చి అందుండి వ్యాపించిన కిరణపరంపర లను శంకను కలిగించుచుండె నని భా.— ['దేవమణి' యనుచో శ్లిష్టరూపకము; కడమ యుత్ప్రేక్ష.] (1-58)

(4) వల్గు...బును - వల్గు = సుందర మయిన - వల్గా = వాగెతో - అనుషక్త = కూడు కొన్న - వదనతా = నోరుగలదై యుండుటచేత - విడంబిత = సరిపోలఁబడినవాఁడును - వక్త్రస్థ భుజగ = నోట నున్న పాము గలవాఁడు నైన - వైనతేయంబును = గరుత్మంతుఁడు గలదియు (వాగెను నోట కఱచుకొని యున్న యా గుఱ్ఱము పామును నోటఁ గఱచుకొనియున్న గరుత్మంతుని వలె నున్న దనుట. ఉపమాలంకారము. సుందర మనుటచే మహారాజుది గాన బంగారపుఁబనియు రత్నాలపనియు కలది యని భా. పాములు కూడ కొన్ని సుందరముగానే యుండును.) (1-63)

(5) చలా...బును - చలాచల = చంచలమయిన - ప్రోథతా= ముట్టె గల దగుటచేత - అనుమీయమాన = ఊహింపఁబడుచున్న - నిజ = తన దైన - వేగ = వడియొక్క - దర్ప = గర్వముయొక్క - ప్రశంసా=స్తుతియొక్క - ప్రవచన = చెప్పుటయొక్క - ఉపన్యాసంబును= వాఙ్ముఖము కలదియు (అది ముక్కుఁగొనను కదలించు చుండుటను చూడఁగా తనవడిని రాజు మ్రోల పొగడుకొనుచున్నదా అనున ట్లుండె ననుట;—ఉత్ప్రేక్ష.) (1-60)

(6) సింధు జంబును = సింధుదేశజాతంబును (సముద్రజాత మని ఉచ్చైఃశ్రవః పరము), శీత మహః సహోదరంబును - చలి వెలుఁగునకు (చంద్రునికి) తోఁబుట్టువును (సమానకాంతి యన్న రాజాశ్వపరము - వాస్తవముగా చంద్రునితోఁ గూడ పాలసముద్రములో పుట్టిన దని ఉచ్చైఃశ్రవః పరము.) ఉచ్చైఃశ్రవంబని ఇంద్రునిగుఱ్ఱమునకు పేరు. ('రెండవ యుచ్చైఃశ్రవంబునుంబోలిన'— ఉత్ప్రేక్షాలంకారము.) ఔపవాహ్యంబున్ = (రా జెక్కెడి) గుఱ్ఱమును, ఆరోహించి = ఎక్కి (పా. ఆరోహణంబు చేసి.) (1-64)

అనంతరము ఆరాజు విరహతాపమును ఇంట నోర్వలేక వినోదార్థము ఆరామమునకు ఉత్తమ మైన గుఱ్ఱము నెక్కి తరలె నని సారము.

తే. ప్రమద నిష్పందతర నేత్ర పద్ము లగుచుఁ (1-66)
పౌరజనులు విలోకింపఁ, బ్రకటలీల,
సముచితానల్ప పరివార సహితుఁ డగుచు,
నవనినాథ సుతుండు వాహ్యాళి వెడలె. 88

పౌర జనులు = పురసంబంధి మనుష్యులు, ప్రమ...లు - ప్రమద = సంతోషముచేత - నిష్పందతర = బొత్తిగా చలింపనట్టి (చలింపమి సమృద్ధదర్శనమునకొఱకు) - నేత్రపద్మలు = పద్మములవంటి నేత్రములు కలవారు, అగుచున్, విలోకింపన్ = చూచుచుండఁగా, అవనినాథ సుతుండు = రాజకుమారుఁ డయిన నలుఁడు, ప్రకట లీలన్ = ప్రస్ఫుట మయిన విలాసముతో, సము... డు - సముచిత = తగిన - అనల్ప = విస్తారమయిన - పరివార = పరిజనముతో - సహితుఁడు = కూడుకొన్నవాఁడు, అగుచున్, వాహ్యాళి వెడలెన్ = స్వారి వెంచేసెను.

వ. తత్ప్రదేశంబున. 89

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించు వసుంధరా స్థలీ (1-73)
సీమనె యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా
భూమివిభుండు; దద్భ్రమలు నేఁ డెడ త్రెవ్వక యభ్యసించు వా
త్యామయ చక్ర చంక్రమ విహారములన్ సుడిగాడ్పు లీడ్చుచున్. 90

ఆ భూమి విభుండు = ఆ నల మహారాజు, గొడుగు నీడను - వహించు వసుంధరా స్థలీ సీమనె = తాల్చియున్న భూ తల భాగమందే, తురగోత్తమంబున్ ఎక్కి = ఉత్తమాశ్వము పైని ఉండి, నేమము ఎలర్పఁగాన్ = నియమము తప్పకుండ, విచిత్ర గతిన్ = అద్భుత ప్రకారముగా, ఆడెన్ = నర్తించెను (వింతవింతగా నియమము తప్పకుండ గొడుగునీడకు వెలిగా జరగనీ కుండ గుఱ్ఱముచే నర్తనము చేయించె ననుట); తత్ భ్రమములు నేఁ = ఆ తిరుగుడులను జూమా, సుడిగాడ్పులు, ఈడ్చుచున్ = విస్తరించుచు, ఎడ త్రెవ్వక = సర్వదా, వాత్యా ... లన్ = వాత్యా మయ = వాయుసమూహ రూపమయిన - చక్ర చంక్రమ = మండల గతియొక్క - విహారములన్ = సంచారములచేత, అభ్యసించున్ = అలవాటు చేసికొనుచున్నవి.

తా.—ఆ నలమహారాజు ఒకచోట గొడుగునీడ పడినమేర దాఁటనీయక తన గుఱ్ఱమును నానాద్భుత చక్రనృత్యము లాడించెను. సుడిగాడ్పులు ఆ భ్రమములను ఇప్పటికిని గిరగిర తిరిగెడి సుడులచేత విస్తరించి సర్వదా నేర్చుకొనుచున్నవి సుమా. 'ఎడ త్రెవ్వక'— ఎంత నేర్చినను గాలికి ఆభ్రమములు అంత చక్కఁగా రా వని భా.— ఉత్ప్రేక్షాలంకారము.

వ. ఇవ్విధంబునఁ గొంతతడ వతిజవన చతుర తురగ నర్తన క్రీడా డోలాయమాన మణికుండల మరీచి మండలీ నీరాజిత గండస్థలుం డై వాహ్యాళి విహారంబు సలిపి, వలయు నమాత్యులం బరివారంబును నచ్చోటన యుండ నియమించి, యొక్కరుండునుం బాదచారి యై, ఘనచ్ఛాయంబునుం బ్రవాళరాగచ్ఛురితంబును నగు విలాసకాననంబుం బయోనిధానంబు నంబుజాతుండునుం బోలెఁ బ్రవేశించి. 91

... తడవు = సేపు, ...అతి...లుండు - అతి జవన = మిక్కిలి వడిగలదియు - చతుర = నేర్పరియు (నయిన) - తురగ = గుఱ్ఱముయొక్క - నర్తన క్రీడా = నట్టువ యాటచేత - డోలాయమాన = ఊఁగులాడుచున్న - మణికుండల = రత్నాలపోఁగులయొక్క - మరీచి మండలీ = వెలుఁగుల మొత్తముచేత - నీరాజిత = ఆరతి యీఁబడిన - గండ మండలుండు = కపోల బింబములు కలవాఁడు - ఐ (మణికుండలకాంతి తనచెక్కిళ్లకు ఆరతివోలె నొప్పునట్లుగా కొంతసేపు గుఱ్ఱమును చక్రనృత్య మాడించి - గిరగిర తిరుగునప్పుడు కుండలకాంతియు గిరగిర తిరుగును గాన నీరాజన మెత్తుటవలె నుండును. రూపకము.), వాహ్యాళి విహారంబు = స్వారి వినోదమును, సలిపి = జరిపి, వలయు = పిమ్మట నింటికి పోవునప్పుడు తనతో రావలసిన - అమాత్యులన్ = మంత్రులను, ... నియమించి = ఆజ్ఞాపించి, ... పాద చారి = కాలినో నడుచువాఁడు, ... ఘనచ్ఛాయంబును - ఘన = దట్టమయిన - ఛాయంబును = నీడకలదియు (సముద్రపక్షమున - ఘన = మేఘముయొక్క - ఛాయంబును = కాంతివంటి కాంతిగలదియు), ప్రవా...బును — ప్రవాళ = చిగుళ్లయొక్క - రాగ = ఎఱుపుచేత - ఛురితంబును = కప్పఁబడినదియు (సముద్రపక్షము

న - ప్రవాళ = పగడములయొక్క...) అగు - విలాస కాననంబున్ = కేళీ వనమును (సముద్ర పరముగా - వబ౹ యభేదముచేత - బిల ఆసక = (బొక్కలో నుండునవైన) సర్పములకు - అన నంబున్ =(ప్రాణనమును), పయోనిధానంబున్ = సముద్రమును, అంబుజాక్షుండునుం బోలెన్ = నారాయణుని వలె, ప్రవేశించి;(సముద్రమందు మబ్బువన్నెయు పగడములును పాములును ఉండును; అందు హరి శయనించును.—ఉపమాలంకారము - సాధారణ ధర్మము శ్లేషోత్థాపితము.) (1-74)

—* నలుని యుపవనవిహారము. *—

తే. పత్త్రములమీఁద మూఁగిన భ్రమరకులము (1.78)
హర విసర్జన జనిత దుర్యశముఁ బోలఁ,
గమియ విచ్చిన గేదంగి కన్నెపువ్వుఁ,
గాతుకము పల్లవింపంగఁ గాంచె విభుఁడు. 92

విభుఁడు = రాజు, పత్త్రములమీఁదన్ = రేకులమీఁద, మూఁగిన — భ్రమర కులము = తుమ్మెదల గుంపు, హర...మున్ - హర = శివుని - విసర్జన=పరిహారముచేత - జనిత = పుట్టిన - దుర్యశమున్ = అపకీర్తిని, పోలన్ = అనుకరించుచుండఁగా, కమియన్ = దట్టముగా, విచ్చిన గేదంగి కన్నె పువ్వున్ = విరిసిన బంగారు మొగలియొక్క తొలి పుష్పమును, కౌతుకము పల్లవింపంగన్ = కోరిక లీరిక లెత్తఁగా, కాంచెన్.

శివపూజకు మొగలి నిషిద్ధము. గొప్పవారిచే విసర్జింపఁబడినవారికి అపకీర్తి సిద్ధము. శివుఁడు త్యజించినందున మొగలికి అపకీర్తి సిద్ధము. మొగలి వికసింపఁగా దానిపరిమళమునకై దానిరేకుల పై మూఁగిన తుమ్మెదలు దాని నెత్తిమీఁద వచ్చి కదిసినట్టి యాయపకీర్తియో యనునట్లు ఒప్పు చుండెను. చిరకాలము లేక లేక లభించుట లోనగు కారణములచేత ఋతువునందలి తొలిపూవు (లేక - చెట్టుయొక్క తొలిపూవుగాని) శ్రేష్ఠముగాను ప్రియముగాను ఉండును గాన, అట్టి యాపూవును రాజు ప్రియపడి చూచెను.— భ్రమరములు మూఁగుట పరిమళసమృద్ధిచేత.

పూర్వార్థమందు ఉత్ప్రేక్షాలంకారము; లోకసామాన్య మయిన యపకీర్తితోఁ బోల్చిన యెడల నుపమ యగును, అట్లు చేయక దానియపకీర్తిగానే సంభావించినందున ఉత్ప్రేక్ష యైనది.

వ. విరహిజన హృదయచ్ఛేదన క్రియా క్రకచంబులు వియోగి మర్మ విదారణ వ్యాపార కర్ణి నారాచంబులు పాంథజన హృదీక సూచక శలాకలు నగు కనక కేతకీ జాతంబులఁ జేరం జనుదెంచి. 93

కేతకీ కుసుమ వర్ణనము.— విరహి ...బులు - విరహి జన - విరహిణులును విరహులును (ఏకశేషవృత్తి) అగు జనుల - హృదయ = ఎదల - ఛేదన = కోఁతయనెడు - క్రియా = పనికి - క్రకచంబులు = అంపములు [హృదయమును కోసిన వెంటనే మృతి కలుగును, కాన ప్రాణహారము లని యర్థము. అత్యంత మదనోద్దీపకము లగుటచే సంభోగము కలుగనిచో మారకము లని భా... రేకునకు ఓరపాడుగనను గలముండ్లచే అంపపుఁబోలిక.— రూపకాలంకారము. (1-80)

వియో ... బులు - వియోగి = విరహిణులయొక్కయు విరహులయొక్కయు - మర్మ = ఆయువుపట్లయొక్క - విదారణ = చీల్చుట యను - వ్యాపార = క్రియకు - కర్ణి నారాచం.

బులు = కొంకిబాణములు. [కొంకిబాణమున అలుఁగునుండి వెనుకకు కొంకివలె నొక వాఁడికత్తి దిగి యుండుటచేత, ఆబాణము దేహమునం జొచ్చునప్పుడు అలుఁగుచేత చేయునట్టి ఖండనము గాక కొంకిచేతం గూడ అధికముగా ఖండనము సేయును, దానిని దేహమునుండి పెకలించునప్పుడు ఆకొంకిమూలమున అది బయిటికి ఊడి రాదు, బలాత్కారమునం దివిచినచో మరల దేహమును విస్తారముగా కోసికొనుచు వచ్చును - అట్టి బాణమును ఆయువుపట్టున నాటిన అనంతరావస్థ చెప్పవలయునా ? భావము పైవిశేషణంబునంబోలె. మొగలిరేకునంచునం గలముండ్లనుబట్టి కొంకి బాణముతో పోలిక.—రూపకాలంకారము.] (I-79)

పాంథ...కలు—పాంథజన=విరహిజనులయొక్క - హృషీక = ఇంద్రియములయొక్క - సూచక = కుట్టునవైన - శలాకలన్ = దబ్బనములు - ( మొగలిపూవుయొక్క స్వరూపము సూక్ష్మాగ్ర మగుటచే కంటిని పొడుచునట్లును, పరిమళము ఘ్రాణేంద్రియమును పొడుచునట్లును, ఉండె నని దిక్ప్రదర్శనము;—రూపకాలంకారము.) అగు, కేతకీ జాతంబులన్ చేరన్ = గేదంగి సమూహముల చెంతకు, చనుదెంచి = పోయి. (I-80)

చ. 'చిలుపని కమ్మఁదేనియలు చిప్పిలి హస్తము లస్తకంబునన్ (I-81)
నిలువక జీరువాఱునెడ, నీయతిసాంద్రపరాగము ల్గదా
యలరులవింటిజోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ
గలిగెడు!' నంచు వే కనలు గైకొని దూఱె విభుండు కేతకిన్. 94

విభుండు = (ఆ)రాజు, ('చిలుపని...కలిగెడున్' - ఇది నలునివాక్యము) - అలరుల వింటి జోదునకున్= మదనునికి, చిలుపని - కొంచెకొంచెము లయిన - కమ్మ = పరిమళవంతము లయిన-తేనియలు = మకరందములు, చిప్పిలి = పై కుబుకుటచేత, హస్తము=(మదనుని) చేయి, (జిడ్డయి), లస్తకంబునన్ = (వింటినడిమి) పిడికిటిపట్టున, నిలుఁవక, జీరు వాఱు నెడన్ = జాఱి పోవు నప్పుడు అప్పటి కప్పటికిన్ = నడుమ నడుమ, (విల్లు జాఱిపో కుండునట్లుగా చేతికి), అప్పళించుకోన్ = అద్దుకొనుటకు, నీ అతి సాంద్ర పరాగములు గదా = నీయొక్క ( అనఁగా గేదంగియొక్క ) మిక్కిలి దట్టము లయిన ధూళులు గదా, కలిగెడున్ = దొరకును, అంచున్= అని, వే = శీఘ్రము గా, కనలు కైకొని = కోపము వహించి, కేతకిన్ = గేదంగిపూవును, దూఱెన్ = నిందించెను.

తా. లోకములో ఎవఁడేని చేతికి చెమటచేత ఏదేని వస్తువు పట్టీక జాఱిపోవునప్పుడు చేతికి మన్ను పూసికొని చెమట యార్చుకొని పట్టు చేకూర్చుకొని ఆవస్తువును పోనీయక పట్టుకొనును.అట్లే మన్మథుఁడు వియోగులపై బాణము వేయుచో అతని విల్లును అమ్ములును పువ్వు లగుటచేత వాని లోని మకరందము వెలి కుఱికి వింటిని పిడికిట నిలువనీయక జాఱఁజేయుచున్నప్పుడు, ఆ జాఱుడు తప్పించుటకు సాధన మేమియు లేదేని ఆతఁడు బాణము వేయుట మానును, దానంజేసి విరహులు బ్రదుకుదురు; ఆపాటియూఱట విరహులకు కలుగనీయక ఈగేదంగిపూధూళి ఆతనికి దొరకి చేతికి అద్దుకొనుటకు ఉపయోగపడుటచే ఆతఁడు ఆవింటిజాఱుడుం బాపుకొని బాణము వేసి విరహులను వెండియు వేఁటాడి మారించును. అందులకు అట్లు సాధన మైనందున తాను వియోగి యైనందునను నలుఁడు గేదంగిపూవును కోపముతో దూఱెను.—కొంతసంవాదము నిందుం గన నగును:—

' అట్టివేసవి బెడిదంపువెట్టకతన । హస్తము చెమర్చి సారెకు లస్తకంబు
దుసికిలఁగఁ గాదె సవరింప కుసుమ కాశ । పుష్పబాణుని చెఱకువి ల్విడమిఁ బడియె.'ఆము.

'అతిసాంద్ర' - అనుట మొగలికి ధూళి మెండు గావున. [మూలములో 'ఇతి క్రుధాఽక్రుశ్యత తేన కేతకమ్' అనియున్నది. అందులకు సరిగా 'కనలు గైకొని దూఱె' నని శ్రీనాథుఁడు రచించి యుండ నోపు. 'కనలు' ను 'కనులు'గా మార్చినవారు తదనుగుణముగా 'దూఱె' ను 'చూచె' గా మార్చిరి గావలయు. 'సహస్రనేత్రములఁ' అనఁగా 'కన్నులను విస్తరించుకొని' చూచె ననుటచే కోపము నిశ్చయపడదు, ప్రీతియుం దానిచే సూచితము కాఁదగును.]

మ. దమయంతీస్తనకుంభ విభ్రమముఁ బొందం గోరుటన్ ధూమపా (1-82)
నముఁ గావించు నధోముఖంబు లగు నానాకుంభముల్ వోలె ధూ
పములన్ దోహద మాచరింపఁగఁ గడుం బక్వంబు లై యున్న దా
డిమముల్ సూచి నృపాలకుండు మదిఁ బాటించెన్ మహౌత్సుక్యమున్.

నృపాలకుండు = రాజు, దమయంతీ స్తన కుంభ విభ్రమమున్ = దమయంతియొక్క చనుఁ గుండలయొక్క విలాసమును, పొందన్ కోరుటన్ = పొందుటకు అభిలషించినవై నందున, ధూమ పానము కావించుచున్ = పొగను త్రాగుచు, అధోముఖంబులు = తలక్రిందైనవి, అగు నానా కుంభములు పోలెన్ = పెక్కు కుండలో యనునట్లుగా, ధూపములన్ = పొగలచేత, దోహదము = పుష్పఫలాద్యుత్పాదనక్రియను, ఆచరింపఁగన్ = (తోఁటమాలియలు) చేసినందున, కడున్ = మిక్కిలి (లేక - పెద్దవిగా), పక్వంబులై = పండినవై, ఉన్న - దాడిమముల్ = దానిమ్మపండ్లను, చూచి, మదిన్ = మనస్సులో, మహౌత్సుక్యమున్ - మహత్ = గొప్ప - ఔత్సుక్యమున్ = వేడుకను, పాటించెన్ = వహించెను.

తా. సురపదాది మహాఫలకాంక్షచే కొందఱు చెట్టుకొమ్మనుండి తలక్రిందుగా వ్రేలుచు పొగం ద్రావుచు తపసింతురు. అట్టి తపస్సునకు శంబూకుఁ డొకయుదాహరణము. తోఁటమాలెలు దాడిమవృక్షమునకు తాటికాయలంతలేసి కాయలు కాచుటకై ఒకవిధ మయిన పొగను పట్టింతురు. నలమహారాజు ఆతోఁటలో అట్టిపొగ క్రమ్మి తలక్రిందుగా చెట్టుకొమ్మలనుండి వ్రేలుచున్న పెద్ద పెద్ద దానిమ్మపండ్లను, దమయంతీస్తనవిభ్రమముం బొందుటకై చెట్టుకొమ్మలనుండి తలక్రిందుగా వ్రేలుచు పొగ ద్రాగుచు తపసించుచున్న కుండలనుంబోలెఁ గాంచి వినోదపడెను.— శంబూకకథ:—

'అథ ధూమాభితామ్రాక్షం వృక్షశాఖావలమ్బినం
దదర్శ కఞ్చి దైక్ష్వాక స్తపస్యన్త మధోముఖమ్. రఘు. (15-49)
పృష్టనామాన్వయో రాజ్ఞా స కి లాచష్ట ధూమపః
ఆత్మానం శమ్బుకం నామ శూద్రం సురపదార్థినమ్.' ,, (15-50)

దోహద మనఁగా తరుగుల్మలతాదులకు అకాలమందు నేర్పరులు సేయునట్టి పుష్పాద్యుత్పాదకమైనక్రియయు అట్టి ద్రవ్యంబును:— అందు దానిమ్మకు ఇట్లు:—

'తరు గుల్మ లతాదీనా మకాలే కుశలైః కృతం
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యా త్తు తత్క్రియా.'

'మేషామిషామ్బుసంసేక స్తత్కౌశామిషధూపనమ్
శ్రేయా నయం ప్రయోగః స్యా ద్దాడి మీఫలవృద్ధయే.
మత్స్యశ్యత్రిఫలాలేపై ర్మాంసై రాజావికోద్భవైః

లేపితా ధూపితా సూతే ఫలం తాళీవ దాడిమీ.
అవిక్వాథేన సంసిక్తా ధూపితా తప్తరోమభిః
ఫలాని దాడిమీ సూతే సుబహూని పృథూని చ.'

ఉత్ప్రేక్షాలంకారము.

తే. మన్మథుం డేయు కింశుక మార్గణములు (I-83)
చన్నుఁగవ నాటుటయుఁ బాంథ సతియుఁ బోలెఁ
బాఱు తెంచి కీరంబులు పండ్లు గఱవ
వణఁకు దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క. 96

భూవరుఁడు = రాజు, కీరంబులు = చిలుకలు, పాఱుతెంచి = వేగముగా వచ్చి, పండ్లు గఱవన్ = ఫలములను కొట్టఁగా (కోపముచే పటపట పండ్లు కొఱుకఁగా అనియు), మన్మథుండు, ఏయు - కింశుక మార్గణములు = మోదుగుఁబూవు బాణములు, చన్నుఁగవన్, నాటుటయున్ = నాటఁగా, పాంథ సతియుఁ బోలెన్ = విరహిణి యెట్లు వడఁకునో అట్లు, వణఁకు = కంపిల్లు చున్న - దాడిమిన్ = దానిమ్మచెట్టును, వేడ్కన్ = వేడుకతో, చూచెను.

తా. చిలుకలు లటుక్కున వచ్చి పైవ్రాలి పండ్లను కఱవఁగా వణఁకుచున్న దానిమ్మను మన్మథుఁడు మోదుగుఁబూవుబాణములతో స్తనములమీఁద గుఱి పెట్టి కాఁడ నేయఁగా వణఁకు చున్న వియోగినింబోలెఁ గాంచి రాజు వినోద మొందెను.—ఉపమాలంకారము.

మోదుగమొగ్గలు చిలుకముక్కులవలె నుండును. శుకసామ్యముచేతనే మోదుగునకు 'కింశుక' నామము. చిలుకముక్కుమాత్రమే బాణ మయినచో కడమచిలుకదేహ మేమి యనఁగా, బాణము నకుం గట్టఁబడు పక్షి ఱెక్కలును కింశుకములోఁడి యాకులును. 'గాసిలఁ దేఁటిఱెక్కగఱి గట్టిన పుష్పశిలీముఖంబులన్' అని యుండలేదా? మదనునిబాణములు చన్నులం గాఁడుట యెట్లు? వానినే గుఱిసేసి యేయునా? అనిన, — హృదయమును గుఱి సేసి యేయఁగా,

'మదగజరాజకుంభముల మచ్చరికించు చురోజకుంభముల్
కదిసి కలంతమేరయును గైకొనియున్నవి యెల్లవారికిన్ । విదితముగాఁగ.'

అనుటచే హృదయ మంతయు స్తనములు ఆక్రమించి యున్నవి గాన వానికే ఆబాణములు తగులును.

వ. (1) మఱియు, మందానిల పరిస్పందంబునం గందళితంబులైన మకరంద బిందు నిష్యందంబులు చిందించు గుఱివెంద పూఁ బందిరులును, (2) వలరాచ రాచవారికి వనదేవత లొనర్చు నీరాజన ప్రదీపాంకురంబులుం బోని కోమల కోరకంబులం గరంబు సొంపారు సంపెంగలును, (3) మదనచాప విముక్తంబులై మొదలం గ్రోలిన భవశరీర భస్మాంగరాగంబు పరాగ వ్యాజ్యంబున వెడలం గ్రాయుచున్న సురపొన్నలును, (4) రోలంబ నికురుంబంబులకుఁ బానగోష్ఠీ స్థానంబు లగు వికస్వర స్థలకమలినీ కదంబంబులును, (5) కలకంఠ కంఠ హుంకారంబులం బాంథులకు భయంబు నాపాదింపం జాలు క్రొమ్మావి మోక చాలును, (6) ధూమకేతు మండలంబులుం బోలె విరహిజనుల గుండియ లవియించుచుఁ జంచరీక పరంపరా

శేఖరంబు లై సొంపారు చాంపేయంబులును, (7) వలయాకారంబునం బరిభ్రమించు భ్రమరంబుల సంగతిం గేసరరేణు విస్ఫులింగంబు లెగయ శాణోత్తేజన ప్రకారంబు నంగీకరించుచు ననంగునకుం బ్రధానశాణంబు లగు నాగకేసరంబులును, (8) మృదుల పవమాన సంపాత కంపమాన కిసలయ కంటక ప్రక్షతంబు లై మదన ముద్రాభిముద్రితంబు లగు వారాంగనాజనంబుల వట్రువ పాలిండ్లకుం జుట్టంబు లై తోరంబు లగు మారేడుఁబండ్లును, (9) నిఖిల యువ ద్వయీ చిత్త నిమజ్జనోచితంబు లగు సజ్జకపు పూమొగ్గలను బ్రవాళగర్భ గహ్వరంబులందు వహించుచు నించువిలుకాని తూణీరంబులకుం బోల్పం బట్టయినట్టి కలిగొట్టుఁ బొదలును, (10) నొండొండ చంద్రఖండంబుల వెడలం గ్రక్కు రాహుమండలంబులుం బోలెఁ గుటిల సిత కుట్మలంబులు ప్రేలం గాఢాంధకారంబునం గాఱుకొను మునిద్రుమంబులును, గనుంగొనుచుఁ; (11) బోషిత రాజకీరంబులు కయివారంబులు సేయఁ, బ్రోదికోయిలలు మంగళగానం బొనర్పఁ, గొలంకుల కెలంకులను బావుల క్రేవలను నికుంజ క్రోడంబుల నీడలను విశ్రమించుచుఁ, బ్రసవ మృదు గంధ పశ్యతోహారంబు లగు గంధవాహంబుల రాకలు విహారశ్రాంతి నపనయింప; (12) వికట ఘటీయంత్ర సలిల ధారా సారణీ మార్గంబులఁ డెక్కెంబునకుం జక్కని గండుమీను వెదకు మీనకేతుండునుం బోలె నుద్యానం బెల్లఁ గ్రుమ్మరి యగ్రభాగంబున. 97

(1) ...మంద అనిల పరిస్పందంబునన్ = మెల్లని గాలియొక్క చలనముచేత, కందళితంబులు = మోసు లెత్తినవి, ఐన - మకరంద బిందు నిష్యందంబులు = తేనె బొట్టుల యొడికలను, చిందించు=కురియుచున్న ... (1-85)

(2) వలరాచ రాచవారికి = మదనుఁ డను రాజునకు, ... ఒనర్చు నీరాజన ప్రదీప అంకురంబులుం బోని = చేయునట్టి యారతి దివ్వె మొగ్గలం బోలిన - కోమల కోరకంబులన్ = మృదువులయిన మొగ్గలచేత, కరంబు = మిక్కిలి, ... [ఉత్ప్రేక్షాలంకారము.] (1-86)

(3) మదన చాప విముక్తంబులు= మన్మథ ధనుః ప్రేరితంబులు, ఐ, మొదలన్=పూర్వము మదనుఁడు శివునిమీఁదికి ప్రయోగించినప్పుడు, క్రోలిన = త్రాగిన - భవ శరీర భస్మ అంగరాగంబు= శివుని దేహముయొక్క విబూది యనెడు మైపూఁతను, పరాగ వ్యాజంబునన్ = పుప్పొడి మిషచేత, వెడలన్ గ్రాయుచున్న = వెలికి పోవునట్లు ఉమియుచున్న - సురపొన్నలును = సురపొన్న పువ్వులును [సాపహ్నవోత్ప్రేక్షాలంకారము.] (1-87)

(4) రోలంబ నికురుంబంబులకున్ =తుమ్మెదల సమూహములకు, పాన గోష్ఠీ స్థానంబులు= త్రాగుడుయొక్క కూటపుఁ దావులు, అగు - వికస్వర స్థల కమలినీ కదంబంబులును = వికసించిన మెట్టఁదామర సమూహములును [వికసింపఁగానే. మకరందసమృద్ధిచేత తుమ్మెదలగుంపులు మూఁగినవని భా.] (I-88)

(5) కలకంఠ= కోయిలలయొక్క - కంఠ హుంకారంబులచేత, పాంథులకుక్ = వియోగులకు (తెరువరులకు అని వాచ్యార్థము), భయంబును, ఆపాదింపక్ = కలిగించుటకు - చాలు= సమర్థమయిన - క్రొ మ్మావి మోక చాలును = క్రొత్త మామిడి గున్నలయొక్క బారును.

మావిపూవు మదనబాణము, కోకిల మదనునిబంటు ; ఈరెంటిచేరికను చెప్పుటచేత అత్యంత మదనోద్దీపనము అభిప్రాయము. కోకిలలతోడి మావిచాలు మదనుని సేనానివేశమువలె నుండె నని భా.—రెండును వసంతర్తువునందు ప్రసిద్ధములు. **(1-89)**

(6) ధూమకేతు మండలంబులుం బోలెక్ = తోఁకచుక్కల ('అగ్న్యుత్పాతౌ ధూమకేతూ' అమ.) సమూహములో యనునట్లుగా, ... అవియించుచుక్ = పగిలించుచు, చంచరీక పరంపరా శేఖరంబులు = తుమ్మెదల చాలు సిగదండగాఁగలవి, ఐ, ... చాంపేయంబులును = నాగకేసరములును - లేక - సంపెంగలును. [నాగకేసరము అని మల్లినాథవ్యాఖ్య, సంపెంగ అని ఇతరుల వ్యాఖ్య; సంపెంగలపై తుమ్మెదలు వ్రాలవు. ఈక్రింది వాక్యములం గన నగును.—

'నానానూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నెల్ల దటంచు గంధఫలి బల్కాఁకం దపం బంది యో
షా నాసాకృతిఁ బూని సర్వసుమన స్సౌరభ్య సంవాస మై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్.' వసు.

'చర న్వనాన్తే నవమఞ్జరీషు । స షట్పదో గన్ధఫలీం న జిఘ్రతి;
సా కిం న రమ్యా స చ కిం న రన్తా । బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.'

కావున సంపెంగ యనువాఖ్యయందు వచ్చిపడి చచ్చినట్టి వని చెప్పవలయును.]

'ఉక్తవిపరీతరూపో న శుభకరో ధూమకేతు రుత్పన్నః
ఇన్ద్రాయుధానుకారీ విశేషతో ద్విత్రిచూళో వా.'

ఇత్యాది ప్రమాణములంబట్టి తోఁకచుక్కలు అనిష్టసూచకములు గాన తద్దర్శనముచే దిగులు గల్గినట్లు తుమ్మెదలు గ్రమ్మిన నాగకేసరములం జూడఁగా వియోగులకు గుండె దిగులు మనును అని భా.—ఉత్ప్రేక్షాలంకారము. **(1-91)**

(7) వలయ ఆకారంబునక్ = మండలరూపముగా - పరిభ్రమించు - గిరగిరతిరుగుచున్న - భ్రమరంబుల సంగతిక్ = తుమ్మెదల కూడికచేత, కేసర రేణు విస్ఫులింగంబులు = పుప్పొడి నలుసు లనెడి మిడుఁగురులు, ఎగయక్ = ఎగయుచుండుటచేత, బాణ ఉత్తేజన ప్రకారంబుక్ = సాయకములయొక్క నూఱుటయొక్క విధానమును, అంగీకరించుచుక్ = వహించుచు, అనంగునకుక్ = మన్మథునికి, ప్రధాన శాణంబులు = మేటి సానలు.—రూపకము. **(I-92)**

[ఇట '...శాణోత్తేజనప్రకారంబు నంగీకరించు ననంగునకుం బ్రధానబాణంబు లగు నారంగంబులును' అని బజాఱుపుస్తకముల పాఠము. నారంగపుష్పము మదనునికి ప్రధానబాణ మనుట అవిదితము; వాక్యము ననన్వితము; మూలముం గన నగు:—

'గళత్పరాగం భ్రమిభఙ్గిభిః పతత్ ప్రసక్త భృఙ్గావళి నాగకేసరమ్
స మార నారాచ నిఘర్షణ స్ఖల జ్జ్వల త్కణం శాణమివ వ్యలోకయత్.'

(8)మృదుల పవమాన సంపాత కంపమాన కిసలయ కంటక ప్రక్షతంబులు=మెల్లని వాయువుయొక్క సోఁకుటచేత అల్లలనాడుచున్న యాకులయొక్క ముండ్లచేత గాయపడినవి, ఐ, మద...

లు — మదన ముద్రా=మదనుని చిహ్న (ము లయిన నఖక్షత) ములచే - అభిముద్రితంబులు = అంకితములు, ఐన - వార అంగనా జనంబుల=భోగపు సాగసరులయొక్క - వట్రువ పాలిండ్లకుఁ జుట్టంబులై = గుండ్రని స్తనములం బోలినవై (ఉపమ), తోరంబులు = పెద్దవి, ... [పణ్యస్త్రీయందు విటులకు నఖక్షతి దంతక్షతి కర ణాదిక స్వేచ్ఛావిహారము గలుగును కావునను, కులాంగనయందు అట్టిచిన్నెలచే అత్తలు ఆఁడుబిడ్డలు లోనగువారివలన మహానర్థము సంభవించుటచేత అట్టి విహారము సంభవింపదు గావునను, వారనారీకుచము ఉపమానముగాఁ జెప్పఁబడినది. మూలములో 'దోర'పం డని యున్నది, పండునకు చందన (మువంటి) సౌరభము కూడ చెప్పఁబడి యున్నది. ఆసౌరభముకై ఆదోరతనము వలసియున్నది. ఇందు రెండును త్యక్తములు. మూలముం గన నగు:—

'మరు ల్లల త్పల్లవ కణ్టకైః క్షతం। సముచ్చర చ్చన్దన సార సౌరభమ్
స వారనారీ కుచ సంచి తోపమం। దదర్శ మాలూరఫలం పచేళిమమ్.'] **(I-94)**

(9)నిఖిల...బులు - నిఖిల=సమస్తమైన - యువ ద్వయీ = ప్రాయపు స్త్రీపురుష యుగ్మములయొక్క - చిత్త = మనంబులందు - నిమజ్జన = కాఁడుటకు - ఉచితంబులు = తగినవి, అగు-సజ్జకపు = మనోజ్ఞములై - పూమొగ్గలను, ప్రవాళ = చిగుళులతోడి (పాదిపక్షమున - ప్రవాళ= పగడములయొక్క - అనఁగా పగడములు తాపించిన) గర్భ గహ్వరంబులందుఁ = లోపలి సందులయందు, వహించుచుఁ, ఇంచు విలుకాని = చెఱకు వింటివాని (మదనుని) - తూణీరంబులకుఁ = అమ్ములపొదులకు, పోల్పఁ=పోల్చుటకు, పట్టు అయిన=స్థాన మయిన (అర్హమయిన)- కలిగొట్టుఁ 'బోదలును' [మూలములో 'స పాటలాయాః స్తబకం ప్రకమ్పితః' అని 'గుత్తులు' చెప్పఁబడినవి. కలిగొట్టుఁబోదలు మదనునియమ్ములపొదులవలెను పొదులలోపలి యెఱ్ఱనిచిగుళ్లు పొదులలోపల తాపించిన పగడములవలెను పూమొగ్గలు బాణములవలెను ఉన్న వనుట.—ఉపమ.] **(1-95)**

(10)ఒండొండ=ప్రత్యేకముగా, చంద్ర ఖండంబులు=(మ్రింగిన) చంద్రుని కళలను, వెడలంగక్కు-(చున్న) - రాహు మండలంబులుం బోలెఁ = రాహువుల చుట్టలో యనునట్లుగా (చుట్టచుట్టుకొని యున్నట్టి రాహువులో యనునట్లుగా), కుటిల సిత కుట్మలంబులు = వంకర లైన తెల్లని మొగ్గలు, ప్రేలఁ = వ్రేలాడుచుండఁగా, గాఢ అంధకారంబునఁ=దట్టంపుఁ జీఁకటిచే - కారుకొను=నలుపెక్కి-యున్న - మునిద్రుమంబులును = అవిసెచెట్లును;—ఒక రాహువు ఒక చెట్టు, అది చిరకాలమునుండి మ్రింగి యున్న చంద్రుల ఖండంబులు దాని మొగ్గలు.—ఉత్ప్రేక్ష. **(1-96)**

(11)పోషిత రాజ కీరంబులు = పెంపుడు రాచిలుకలు, కైవారంబులు = స్తోత్రములు, చేయఁ = చేయుచుండఁగా **(1-103)**; ప్రోది = పెంపుడు... కొలంకుల కెలంకులను = డిగ్గియల పార్శ్వములయందును, బావుల క్రేవలను = వాపికల చెంతలయందును, నికుంజ క్రోడంబుల = పొదల లోపలి - నీడల (యందు)ను, విశ్రమించుచుఁ = ఊఱడిల్లుచు ;

ప్రసవ మృదు గంధపశ్యతోహారంబులు = పువ్వులయొక్క కోమలమయిన పరిమళముయొక్క పచ్చెపుదొంగలు, అగు-గంధవాహంబుల = వాయువులయొక్క - రాకలు, విహార శ్రాంతిఁ = విహరించుటచేత నయిన యలయికను, అపనయింపఁ = పోఁగొట్టఁగా; **(1-106)**

(12) వికట ఘటీయంత్ర సలిల ధారా సారణీ మార్గంబులఁ=రమ్యములయిన యేతములయొక్క నీటి పాఱుదలయొక్క కాలువల దారులలో ('స్వల్పనద్యాం చ సారణీ' మేది.), టెక్కెంబునకుఁ = ధ్వజమునకై, చక్కని - గండుమీనుఁ = మగచేపను, వెదకు - మీనకేతనుండునుంబోలెఁ = మన్మథుండో యను నట్లుగా [ఉత్ప్రేక్షాలంకారము]; **(1-105)**

ఉద్యానంబు ఎల్లన్ = అటతోఁటయంం దంతటను, క్రమ్మరి = సంచరించి, అగ్ర భాగంబునన్ = ఎదుటి ప్రదేశమందు.—క్రియ ['కాంచె' నని పైపద్యములో వచ్చును.]

సీ. శేష పుచ్ఛ చ్ఛాయఁ జెలువారు బిసములు (1-108)
తన్మగ్న సురదంతి దంతములుగ,
నిండార విరిసిన పుండరీక శ్రేణి (1-110, 113)
యామినీ రమణ రే ఖాళి గాఁగ,
ప్రతిబింబి తోపాంత బహుల పాదపములు (1-116)
గర్భస్థ శైల సంఘములు గాఁగ,
నేక దేశంబున నిందీవరంబులు (1-118)
కాలకూట మయూఖ ఖండములుగ,

తే. బాలశైవాల వల్లరీ జాలకంబు (1-119)
బాడబానల భవ ధూమ పంక్తి గాఁగ,
వారిరాశియుఁ బోలె గంభీర మైన
ఘన తటాకంబుఁ గాంచె న జ్జనవిభుండు. (1-120) 98

ఆ జనవిభుండు = ఆ రాజు, శేష పుచ్ఛ ఛాయన్ = అనంతునియొక్క తోఁకయొక్క వన్నెతో, చెలు వారు బిసములు = సొం పారు తామరతూండ్లు, తత్ మగ్న = వారిరాశిలో మునిఁగియున్న (పా. అంతర్మగ్న = లోన మునిఁగియున్న) - సురదంతి దంతములు కాన్ = దేవ గజములయొక్క (ఐరావతము తమ్ములయొక్క) దంతములు కాఁగా;

నిండారన్ = పూర్ణముగా, విరిసిన పుండరీక శ్రేణి = వికసించిన తెల్లదామరల వరుస, యామినీ రమణ రేఖా ఆళి కాఁగన్ = నిశా పతులయొక్క (చంద్రులయొక్క యనుట) స్వరూప ముల వరుస కాఁగా;

ప్రతిబింబిత ఉపాంత బహుళ పాదపములు = (నీట) ప్రతిఫలించిన సమీపమందలి పెక్కు చెట్లు (అనఁగా చెట్ల ప్రతిబింబములు), గర్భ స్థ శైల సంఘములు కాఁగన్ = కడుపులో నున్న కొండల సమూహములు కాఁగా;

ఏక దేశంబునన్ = ఒక చోట, ఇందీవరంబులు = నల్లగలువలు, కాలకూట మయూఖ ఖండములు కాన్ = కాలకూట (మనెడి విషము)యొక్క కాంతుల భాగములు కాఁగా;

బాల శైవాల వల్లరీ జాలకంబు = లేఁత నాఁచుఁ దీఁగల సమూహము, బాడబ అనల భవ ధూమ పంక్తి కాఁగన్ = బాడబ మనెడి నిప్పునుండి పుట్టిన పొగలయొక్క వరుస కాఁగా, వారి రాశియున్ బోలెన్ = సముద్రమో యనునట్లుగా, గంభీరము = లోఁతు, అయిన - ఘన తటా కంబున్ = గొప్ప చెఱువును, కాంచెను.

ఈపద్యమున తొలి యాఱు పాదములందును రూపకాలంకారము, తదనుప్రాణితమై కడమ రెంటను ఉత్ప్రేక్షాలంకారము. 'శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారు బిసములు' అన్నచోట బిసములకు శేషపుచ్ఛచ్ఛాయ లేనందున తత్సదృశచ్ఛాయ యాక్షిప్తము గావున పదార్థగత నిదర్శనః—

'అన్యంబునసామాన్యము । నన్యమున విధింపఁ దాల్చు నరవిందరుచిన్
గన్యవదన మనువిధమున । నన్య నిదర్శన దగుం బదార్థగత యనన్. అలం. సా. సం.

వ. కాంచి యొక్కింత తడవు మనంబునం గొనియాడుచుం దిమి తిమింగిల ఝులీ కుళీర మత్స్య కచ్ఛప మకర నికర సంచార తరళ తరంగ మాలికా డోలి కాధిరోహ లీలా వ్యాలోల కలహంస సంస దాలాప కోలాహల ముఖరిత దిశా భాగంబైన యమ్మహాతటాకంబు తీర ప్రదేశంబున. 99

... తడవు = సేపు...తిమి...గంబు - తిమి = నూఱుయోజనముల పొడుగు గల చేఁప లు - తిమింగిల = తిమింగిలములు - అవి తిమిని మ్రింగును.—

'అస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన విస్తరః,
య స్తం గిరతి మత్స్య స్తు తతః ప్రోక్త స్తిమిఙ్గిలః,
తిమిఙ్గిలగిలోఽప్యస్తి తద్గిలోఽప్యస్తి రాఘవః.'

ఝులీ = పెంటి తాఁబేళ్లు - కుళీర = ఎండ్రకాయలు - మత్స్య = చేఁపలు - కచ్ఛప = తాఁబేళ్లు - మకర = మొసళ్లు - (వీనియొక్క) - నికర = సమూహములయొక్క - సంచార = తిరుగుటచేత - తరల తర = మిక్కిలి చంచల మయిన - తరంగ = అలలయొక్క - మాలికా = పంక్తులనెడు - డోలికా = ఉయ్యేలలయొక్క - అధిరోహ = ఎక్కుట యనెడు - లీలా = కేళి యందు - వ్యాలోల = అత్యంతాసక్తము లయిన - హంస = అంచలయొక్క - సంసత్ = కూటువులయొక్క - ఆలాప = పలుకులయొక్క - కోలాహల = గొల్లుచేత - ముఖరిత = మ్రోఁత గలవి గాఁ జేయఁబడిన - దిశా = దిక్కులయొక్క - భాగంబు = ప్రదేశములు గలది, ... తీరప్రదేశంబునన్ = ఒడ్డుదగ్గఱను.—పెదపెద్ద మత్స్యములు పెక్కులు లోపల సంచరించుటచేత ఎక్కువగా తెరలుచున్న యలలపై ఉయ్యేలలూఁగు హంసల కోలాహలముచేత దిక్కులు పిక్కటిల్లుచున్న వనుట. తిమితిమింగిల సంచారసంబంధము లేనిదే చెప్పఁబడియెను గాన సంబంధాతిశయోక్తి. తరంగమాలికాడోలికా - రూపకాలంకారము. తిమితిమి - ఛేకము. వృత్త్యనుప్రాసములు కలవు.

సీ. వికలిత జంబాల పులిన భాగమున ను
ద్దండ పద్మాతపత్రంబునీడఁ,
గమల కాండ కఠోర కంట కాంకుర పంక్తి
నొయ్యనఁ గంధరం బొరసికొనుచు,
నొంటికాలనె నిల్చి, యూర్మిమారుతములఁ (1-121)
జిగురుఱెక్కలఱేకు లెగయుచుండ,
విరళమై పక్షతి ద్వితయంబు వెడ జాఱఁ,
జంచు లోకించు కాకుంచితము గ,
తే. వరుణరాజున కిడిన చామరము వోలెఁ (1-122)
బొడవు మిగిలిన పొందమ్మి పువ్వుఁ బోలె

నిబిడ నిద్రాభిముద్రిత నేత్ర మైన (1-12)
రాజహంసంబుఁ గాంచె నా రాజసుతుఁడు. 100

ఆరాజసుతుఁడు (నలుఁడు), విక...మునన్ = వికలిత = తొలఁగింపఁబడిన - జంబాల= బురద గలిగిన (అనఁగా బురదలేని) - పులిన = ఇసుకతిన్నె యొక్క - భాగమునన్ = ఒకప్రదేశమందు, సద్దం...డన్ - ఉద్దండ = పైకి నిగిడిన కాఁడ గల - పద్మ - తామర యనెడి - ఆతపత్త్రంబు = గొడుగుయొక్క - నీడన్ =నీడలో;

కమల కాండ కఠోర కంటక అంకుర పంక్తిన్ = తామరయొక్క కాఁడయొక్క కఱకు ముండ్ల మొసుల వరుసయందు (వరుసమీఁద), ఒయ్యనన్ = మెల్లఁగా, కంధరంబు = మెడను, ఒరసికొనుచున్ = రాచుకొనుచు;

ఒంటికాలనె = ఒకకాలిమీఁదమాత్రము, ... ఊర్మి మారుతములన్ = అలలయొక్క వాయువులచేత, చిగురు టెక్కల రేకలు = చిగుళ్లవంటి (చిగుళ్లవలె కోమలము లయిన యనుట) టెక్కలలోని (సన్న) యీఁకలు,...

పక్షతి ద్వితయంబు = టెక్కమొదళ్ల జంట (రెండు టెక్కల మొదళ్లను), విరళ మై = వదులుగా, వెడ=ఇంచుక, జాఱన్ = క్రిందికి జరుగఁగా, చంచులు = నోరు, ఒకించుక = కొంచెము, ఆకుంచితముగన్ = ముణుఁచుకోఁబడఁగా;

వరుణరాజునకున్ = వరుణదేవుఁ డనెడిరాజునకు (వరుణుఁడు జలాధిదేవత; తటాకమునఁ గాన నతనిం జెప్పుట), ఇడిన = పెట్టిన - చామరమువోలెన్ =జల్లియో యనునట్లును, పాడవు = ఔన్నత్యము, మిగిలిన = అతిశయించిన - పొందమ్మి పూవువోలెన్= (తటాకమందు బంగారపుఁ దామర మొలచినదో యనునట్లుగాను), నిబి...ము - నిబిడ = గట్టిగా - నిద్రా = నిద్రచేత - అభిముద్రిత = మూయఁబడిన - నేత్రము = కన్నులుకలది, ఐన - రాజహంసంబున్ = రాయంచను, కాంచెను.

'పద్మాతపత్త్రంబు' - రూపకాలంకారము. 'వరుణ...వోలె', 'పాడవు...వోలె' - ఉత్ప్రేక్షాలంకారములు. కడమ పద్య మెల్ల స్వభావోక్త్యలంకారము.

' పన్నిన। జాత్యాదికసం । పన్నస్వాభావ్యమును స్వభావోక్తి; చెవుల్
తిన్నఁగ టెక్కఁబొడిచికొని। కన్నులు సుడివడఁగ నన్నుఁ గనియె మృగంబుల్.' అలం.

[ 'వికలిత' — పూర్వముద్రణముల పా. 'విలసిత' ( = సొంపొందిన - జంబాల = బురద గలిగిన అని యర్థము;) - బురద యున్నచో రాజు పోయి పట్టఁడు గావున ఈపాఠము అప్రశస్తము. 'పొందమ్మి' యనుటకు 'వెలిదమ్మి' యనునది యపపాఠము; మూలములో 'కాఞ్చన మమ్బుజన్మ' యని యున్నది. కావున నే 'విరళ మై' అనుటకు 'విశదమై' అను పా. అనుచితము - 'విశదశ్వేత పాణ్డురాః' అమ.]

క. కాంచనపక్షుం బగురా। యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
వంచించి పట్టుకొనియెద। నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్.

కాంచన పక్షంబు = బంగారపు టెక్కలు గలది. దైవ ఘటనకున్ - విధియొక్క కూర్పునకు. దైవ... గాన్ - ఈహంసవలననే సఫల మగు నీపెండ్లిరాయబారము జరుగ వలసినట్లు బ్రహ్మసంకల్పము, నలుఁడు దీనిం బట్టఁ దలంచుట అందులకు అనుకూలము, అని భా. (1-129)

—* నలుఁడు హంసను బట్టుట. *—

తే. వామనుం డైన కైటభవైరి విధము (I-124)
నభినయించు క్రమంబున నధిప సుతుఁడు
నడఁకి నడఁకి యల్లల్లన నడిచి పట్టెఁ
బాణి పద్మ ద్వయంబునఁ బసిఁడియంచ. 102

అధిప సుతుఁడు = రాజ కుమారుఁడు, వామనుండు = పొట్టివాఁడు(వామనావతారుఁడు) ఐన - కైటభవైరివిధముఁ = నారాయణునిప్రకారమును, అభినయించు క్రమంబునఁ = అనుకరించు నట్లుగా (నేలకు తగ్గి యనుట),నడఁకి నడఁకి =వణఁకి వణఁకి, అల్లల్లనఁ = మెల మెల్లఁగా (నిశ్శబ్దముగా ననుట), నడిచి, పాణిపద్మ ద్వయంబునఁ = తామరలవంటి తనరెండుచేతుల మధ్యను, పసిఁడి యంచఁ=ఆ బంగారుహంసను, పట్టెను.—ఉత్ప్రేక్షయు స్వభావోక్తియు నలంకారములు.

వ. (1) ఇట్లు నిషధరాజుచేతం బట్టువడి బిట్టు మేల్కాంచి య క్కాంచన హంసంబు కంచు గీసిన తెఱంగున నెలుంగించుచు, నెగయ నుంకించుచుఁ, జంచు పుటంబునం బాణి పల్లవంబులు గఱచుచుఁ, జరణంబులు గింజుకొనుచు, నఖంబుల నొత్తుచు, నలుదిక్కులుం జూచుచు, నెద్దియుం జేయునది లేక చీకాకు పడుచుండ; (2) నప్పాటన సంభ్రమ సముత్పత త్పతగకులం బై కమల షండంబు గలగుండు వడియెఁ; గూలంబులం గులాయంబులనుండి పుండరీక వనలక్ష్మీ చరణ నూపుర క్రేంకారంబుల ననుకరించుచుఁ గారండవ బక క్రౌంచ రథాంగ కోయష్టి కాదులు విహాయసంబున నెగసి కూయం దొడంగె. నప్పుడు. 103

(1) ... బిట్టు = చక్కఁగా, మేల్కాంచి=మేలుకొని, ... ఆ - కాంచన హంసంబు = బంగారపు హంస, కంచు గీసిన తెఱంగునఁ - కంచుగంట యంచుచుట్టును కోడుపుతో గీచిన కీచు మని మ్రోయును - అప్రకారముగా హంస కూసిన దని భా. [ఉపమాలంకారము], ఎలుంగించుచుఁ = కూయుచు, ... ఉంకించుచుఁ = యత్నించుచు, చంచు పుటంబునఁ = ముక్కుడొప్పతో, పాణి పల్లవంబులు = చిగుళ్లవంటి (రాజు) చేతులను, ... చరణంబులఁ=కాళ్లతో, ... నఖంబులఁ = గోళ్లతో, ... చీకాకు = శ్రమ ... [ 'అక్కాంచనహంసంబు ... చీకాకుపడుచుండ'- స్వభావోక్తి.] (I-125)

(2) అప్పాటఁ అ = ఆవిధమున నే, సంభ్రమ సముత్పతత్ పతగ కులంబు = వేగిరపాటుచేత ఎగిరిపోవుచున్న పక్షి సమూహము కలది, ఐ, కమల షండంబు = తామర తంపర, కలగుండు పడియెఁ = కలఁత పొందెను. కూలంబులఁ = గట్లయందు, కులాయంబులనుండి = గూండ్లనుండి, పుండరీక వన లక్ష్మీ చరణ నూపుర క్రేంకారంబులఁ=తామర షండముయొక్క శ్రీయొక్క పాదముల యందెల రవళిని, అనుకరించుచుఁ = దానివలెఁ గూయుచు, కారం ... దులు - కారండవ = కన్నె లేడులు - బక = కొంగలు - క్రౌంచ = క్రౌంచములు - రథాంగ = చక్రవాకములు - కోయష్టిక = చీఁకుఁగొక్కెర - ఆదులు = లోనగు నవి, విహాయసంబునకుఁ = మింటికి, ఎగసి.

పుండరీకవన లక్ష్మియు ఎగిరి పోయెనో యనియు నభిప్రాయము గావున, పుండరీకవన శోభ లక్ష్మి గాను ఈపక్షులే తదీయ నూపురములు గాను, వీని కూఁతయే వాని రవళిగాను సంభావింపఁ బడినందున, 'అనుకరించుచు' అని ఉపమావాచక మున్నను ఉత్ప్రేక్షాలంకారము. **(I-127)**

తే. 'జాతరూప చ్ఛద చ్ఛటా జాత రూప **(I-129)**
లక్ష్మి యిం తొప్పునే మరాళమున!' కనుచు,
నద్భుతం బంది తనుఁ జూచు నధిపసుతున
కిట్లనె మనుజ భాషల హేమ ఖగము. 104

జాత ... లక్ష్మి - జాతరూప = బంగారపు - ఛద = ఈఁకల - ఛటా - సమూహముచేత - జాత = పుట్టిన - రూప లక్ష్మి = సౌందర్య శోభ, మరాళమునకున్ = హంసకు, ఇంత - ఒప్పునే = శోభిల్లునా (ఆహా ! ఎంత మనోహరముగా నున్నది!) ... హేమ ఖగము = బంగారు పక్షి, మనుజ భాషలన్ = నర వాక్కులతో, ... ['జాతరూప ... జాపరూప' అను ద్విరుక్తి యమకము.]

క. "ఱెక్కలకొనలం గలిగిన। యిక్కాంచన మాసపడియె దే నృప? నీ కే
యక్కఱ దీనం దీరెడు। నక్కట నీహార లేశ మబ్ధికిఁ బోలెన్? 105

చతుర్థపాద మనన్వితముగా నున్నది. 'లేశము' అనుపదమును 'కణికన్' అనియేని, 'అబ్ధికిన్' అనుపదమును 'అబ్ధియున్' అనియేని మార్చవలయును. రెండవమార్పున వ్యవహితాన్వయదోషము, తొలిమార్పు పెద్దది.

రెండవమార్పుతో అర్థము:—నృప = ఓరాజా, నీహారలేశము = మంచుబొట్టును, అబ్ధియుఁ బోలెన్ = సముద్రుఁడువోలె, ఱెక్కలకొనలం గలిగిన - యిక్కాంచనము = ఈబంగారమును, ఆసపడియెదే = కోరెదవా, అక్కట = అయ్యో, దీనన్ = ఈయించుక బంగారముచేత, నీకున్, ఏ యక్కఱ తీఱెడున్ (ఏదియు తీఱదు అనుట).—ఉపమ.

మొదటిమార్పుతో అర్థము:—ఓనృప, ఱెక్కలకొనలం గలిగిన యిక్కాంచన మాసపడియెదే? అయ్యో, అబ్ధికిన్ = సముద్రునికి నీహారకణికన్ బోలెన్ = చిన్న మంచుబొట్టుచేతనుం బలె, నీకు దీన నేయక్కఱ తీఱెడును?—ఉపమాలంకారము. **(I-130)**

మ. "ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నునికి? యింత యే
మఱుదునె! నిన్ను విశ్వజన మాన్యుఁడ వం చెద విశ్వసించి యి **(I-131)**
త్తఱి సుఖనిద్రఁ బొంతిది వృథామతి, నెట్టన యాత్మ నమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు చిత్తమునన్ బగవారి నేనియున్. 106

ఎఱు...నికి = నీవు సమీపమున ఇక్కడ నక్కడ (ఉనికిన్ =) ఉండుటను (ఉన్నావని) యెఱుఁగనా? విశ్వ జన మాన్యుఁడవు = సకల ప్రాణులకును పూజనీయుఁడవు (అనఁగా నీయంత మంచివాఁడు మఱి లేఁడు - నీవు నాకు ఏమాత్రము కీడు చేయవు), అంచున్, ఎదన్ = హృదయములో, విశ్వసించి = నమ్మి, ఇత్తఱిన్ = ఈ సమయమందు, వృథామతిన్ = తెలియని వాఁడనై (నిష్ప్రయోజనమయిన తలంపుతో అని 'చెఱుపఁదలంచు'టకు విశేషణముగా నేని కొన వచ్చును), నెట్టన = అనివార్యముగా, ఆత్మన్ = మనస్సులో, ... ఘనులు = గొప్పవారు

నమ్మినవానిని శత్రువు నయినను (గొప్పవారు చెఱుప రని భా. నమ్మినవానిం జెఱుచుట మహాఘోర పాతకము.

'మిత్త్రద్రోహీ కృతఘ్నశ్చ యశ్చ విశ్వాసఘాతకః;
సర్వే తే నరకం యాన్తి యావ దాదిత్యతారకమ్.'

ఈరాజు చెఱుపఁగూడదని విశేషము, ఘనులు చెఱుప రనుట సామాన్యము, సామాన్య విశేషముల రెంటినిం జెప్పినందున అర్థాంతరన్యాసాలంకారము:—

'భాషింపఁగ సామాన్యవి। శేషము లర్థాంతరాఖ్య చెన్ను వహించుఁ.' అలం. సా. సం.

ఉ." హింసయ నీకు వేడ్క యగు నేని, కృపాశ్రయ మైన యీసరో (I-132)
హంసముఁ జంప నేల? కలవా తరువాత వసుంధ రాధి పో
త్తంస, విజృంభమాణ భుజ దర్ప నిరంకుశ సాహస క్రియా
మాంసల చిత్తవృత్తు లయి మత్తిలి యుండు నరాతి భూపతుల్ ? 107

ధరాధిప ఉత్తంస = ఓ రాజశేఖరుఁడా, హింసయ = నొంచుటయే, ... కృపా ఆశ్రయము = కరుణాపాత్రము, ... సరో హంసముఁ = కొలని యంచను, ... తరువాతఁ = అవతల, విజృం ... లు - విజృంభమాణ = పేర్చుచున్న - భుజ దర్ప = బాహు బలముచేత- నిరంకుశ = అడ్డులేని - సాహస క్రియా = తెగువ పనులచేత - మాంసల = పొగరుకొనిన - చిత్త వృత్తులు=మనోవ్యాపారము కలవారు, అయి, మత్తిలి = మదించి, ఉండెడి - అరాతి భూపతుల్ = శత్రు రాజులు, కలవా=లేరా (ఎందరేని కలరు, వారిని నొంచుట న్యాయ్యము, నన్ను నొంచుట తగదు, అని భా.)—లవా - రువా, ధ - ధి, భ - భు, త్త - త్తు - త్తి, తి - తు—వృత్త్యను ప్రాసములు. అనుప్రాసార్థము ర ల ల క భేదకల్పన న్యాయ్యము.—'విజృ...అరాతి'—ఈ విశేష మెల్ల దండార్హ తాభిప్రాయగర్భము గాన పరికరాలంకారము.

వ. ఫల కుసుమ మూల మాత్రంబున శరీరయాత్ర నడపుచు మునులుం బోలె సలిలంబులలోనం దపంబు సేయుచున్నవారము. మామీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగునె? యదియునుం గాక. (I-133) 108

ఫల కుసుమ మూల మాత్రంబునఁ = పండ్లతోను పువ్వులతోను వేళ్లతోను మాత్రమే, శరీర యాత్రఁ = దేహధారణమును, ... సలిలంబులలోనఁ = నీళ్లలోపల (మునులును నీటియందుండి తపసింతురు.) [ఉపమాలంకారము.] దండ నీతిఁ = దండోపాయమును.—

'అదణ్డ్యాఁ దణ్డయ న్రాజా దణ్డ్యాం శ్చై వా ప్యదణ్డయఁ
అయశో మహ దాప్నోతి నిరయం చాభిగచ్ఛతి.'

సీ." తల్లి మదేకపుత్త్రిక, పెద్ద, కన్నులు (I-135)
గాన విప్పదు; మూఁడుకాళ్ల ముసలి;
యిల్లాలు గడు సాధ్వి, యేమియు నెఱుఁగదు,
పరమ పాతివ్రత్య భవ్య చరిత;
వెనుక ముందర లేరు నెన రైనచుట్టాలు,
లేవడి యొంతేని జీవనంబు;

గానక కన్న సంతానంబు శిశువులు,
జీవనస్థితి కేన తావలంబు;
తే. కృపఁ దలంపఁగదయ్య యో నృపవరేణ్య,
యభయ మీవయ్య యో తుహినాంశు వంశ,
కావఁగదవయ్య యర్థార్థి కల్పశాఖి,
నిగ్రహింపకువయ్య యో నిషధరాజ. 109

...మత్ ఏక పుత్త్రిక = నేను ఒక్కఁడనే పుత్త్రుఁడుగాఁగలది (వేఱు కుమారులు లేరు, నే నొక్కఁడనే శుశ్రూషించి అన్న మిడి కాచువాఁడను అనుట), ఇప్పుడు = ఈముసలితనములో, కానవు = చూడవు (గ్రుడ్డివి అయిన వనుట), మూఁడుకాళ్లముసలి (మూఁడవకాలు కఱ్ఱ - కఱ్ఱ పట్టుకొని సంచరించు ననుట - పండువృద్ధు అనునర్థమున లోకోక్తి - ఆమెకు నాతోడ్పాటు విశేషముగా వలసియున్న దనుట.) ఇల్లాలు = పెండ్లాము, కడుఁజ = మిక్కిలి - సాధ్వి = యోగ్యురాలు, ఏమియు నెఱుఁగదు = గడుసుదిగాదు, పరమ పాతివ్రత్య భవ్య చరిత = ఉత్కృష్టమైన పతిభక్తిచేత మంగళ మయిన నడువడి కలది (నాతో అనుమరణము సేయునేగాని నాపిమ్మట జీవింపదు.)

సెనరు అయిన = అనురాగము గల - (ఆప్తబంధువులు లేరనుటచే నాతల్లిని కాచువారేని నాభార్యను మరణ వ్యవసాయమునుండి మాన్పు వారేని లేరనుట.) ... జీవనంబు = బ్రదుకు, ఎంతేని లేవడి = మిక్కిలి పేదఱికము. శిశువులు = మాబిడ్డలు, కానక కన్న సంతానంబు = లేక లేక పుట్టినవారు (వారి కెట్టికడగండ్లు కలుగునో యని దుఃఖ మగుచున్న దనుట.) జీవన స్థితికిఁజ=బ్రదుకుఁ దెరువునకు, ఏన = నేనే, తావలంబు = ఆధారమను (నేను లేనిచో వారందఱు మడియుదు రనుట.)

నృప వరేణ్య = నరులను పాలించువారిలో నుత్తముఁడా (ఈ సంబోధనచే కృపతో నీవు పాలింపవలయుఁగాని చంపఁ దగ దని భా.), కృపఁజ = దయను, ... తుహినాంశు వంశ = ఓ చంద్రవంశమువాఁడా (చంద్రుఁడు తన కళలనే ఇతరులకు భోజనార్థ మిచ్చువాఁడు - ఆతని వంశమువాఁడవు నీవును అతనివలెనే పోషింపవలయు ననుట.) అర్థా ... ఖి – అర్థ=ప్రయోజనములను – అర్థి = యాచించువారికి - కల్పశాఖి = కల్పవృక్షమా (ఎల్లవారికి అడిగిన దానిని ఇచ్చువాఁడవు గాన నేను నాప్రాణమును వేఁడుచున్నాను నాకు దాని నిమ్ము అనుట - కావఁగదవయ్య అనఁగా శాఖివి గావున ఫలింపుము అనియు హృదయము.) నిగ్రహింపకుము = దండింపకుము (చంపకు మనుట).

హంసయొక్క వాక్యముల కన్నిటికిని తన్ను విడిచిపెట్టవలసినందులకు హేతువు అర్థము గాన సీసపాదములందు వాక్యార్థహేతుకమును గీతపాదములందు పదార్థహేతుకమును కావ్యలింగ మలంకారము.

'మదేకపుత్త్రిక'—ఇట పుత్త్రికశబ్దముతో సమాసము; కాదేని 'మదేకపుత్త్రిక' అగును, యతి చెడును. 'తలంపఁగదయ్య' 'కావఁగదవయ్య'–ప్రార్థనంబునం దన్పత్య యాంత క్రియల మీఁదఁ గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు.' ప్రౌ. వ్యా. క్రి. 9.

'ఈవయ్య '— 'నిగ్రహింపకువయ్య' - ఇట సంప్రార్థనంబున మజ్జునకు ' అయ్య ' అనుప్రయుక్తము కాఁగా ఏకవచనమున వుజి వచ్చినది. బా. వ్యా. క్రి. 34.

వ. అక్కటకటా! దైవంబ, నీకంటెకిం బేలగింజయుం బెద్ద యయ్యెనే! జననీ, ముదిసి ముప్పుఁగాలంబున సుత శోక సాగరం బెబ్భంగి నీఁదఁగలదానవు! ప్రాణేశ్వరి, యేచందంబున మద్విరహ వేదనా దవానలంబునఁ దరికొనియెదవు! సఖులార, యే ప్రకారంబునం బుటపాక ప్రతీకాశం బైన కరుణరసంబునఁ బుర పురం బొక్కెదరు! బిడ్డలార, యేలాగున నతిక్షుత్పిపాసాకులంబు లై కులాయ కూలంబులం గులగులం గూసెద!'' రని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం; గృపాళుం డై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి 'రాజహంసంబ, పొమ్ము, సుఖం బుండు.' మని విడిచి పుచ్చె. నవంతరంబ. 110

...దైవంబ=విధీ, పేలగింజయుం పెద్ద యయ్యెనే=స్వల్పవస్తువ నైన నేనును మహాపదార్థంబుగాఁ గాన వచ్చితినా?—ఇచట ప్రస్తుత మయిన విధినేత్రముంగూర్చి వర్ణింపవలసిన తన వృత్తాంతమును పేలగింజవృత్తాంత మనెడి ప్రతిబింబముచే చెప్పినందున లలితాలంకారము:—

' వచనీయ ప్రతిబింబము । రచియింపఁగఁ బ్రకృతమునఁ బరఁగు లలిత మనఁ;
విచికిలగంధిరో సేతువు । రచియించెద వీవు గతశరమ్మున కనఁగాఁ.' అలం. సా.సం.

... జననీ = తల్లీ...ముదిసి = ముసలిదాన వై, ముప్పు = ఆపత్తుయొక్క... సుత శోక సాగరంబు = పుత్త్రి దుఃఖ సముద్రమును (రూపకము), ఎబ్భంగిఁ = ఏప్రకారముగా.

[ఎబ్భంగి అనుచో సంధివశమున భకారమునకు ద్విత్వము వచ్చుట ఆంధ్రభాషా మర్యాదగా నున్నది; కాని ప్రథమ భకారమునకు బకారము వచ్చునా? యనిన, 'ఝలాం జ శ్ఝశి' అను సంస్కృతమర్యాద నిట నుపయోగించుట పలుకారణములచేత సమంజసముగా నగపడినందున అట్లు చేయుట యైనది. (8 ఆ. 125 లో ' అగ్భోరాహి 'ం గూర్చిన టీకను చూ.) విస్తరభయముచే ఆచర్చ నిచ్చుట ప్రదర్శింపలేదు.]

ఏచందంబునఁ = ఏయుపాయంబున, మత్ విరహ వేదనా దవ అనలంబునఁ= నాతోడి వియోగముచేత నైన బాధ యనెడి కారుచిచ్చులో (రూపకము), దరికొనియెదవు = కాలెదవు?... పుటపాక ప్రతీకాశంబు = మూసిన నిప్పులోని వంటతో సమానము (పుటములో వేడి యెక్కువ—ఉపమ), ఐన-కరుణరసంబునఁ= శోకరసమునందు, పురపురఁ పొక్కెదరు=మిక్కిలి దుఃఖించెదరు....అతి క్షుత్ పిపాసా ఆకులంబులు= అమితమయిన యాఁకటిచేతను దప్పిచేతను కలంగిన వారలు, కులాయ కూలంబులఁ= గూఁటి యంచులయందు (అంచులకు వచ్చుట తండ్రి యగు దీనిని ఎదురుచూచుటకు.) ... విలాపంబు = పరిదేవనము,...దృక్ గోళకంబులఁ= కంటి గ్రుడ్లనుండి, ...గోలుగోలునఁ = విశేషముగా (ఈపదము ఏడ్పునకు చెప్పఁబడును). కృపాళుండై = కనికరము గలవాఁడై, ... హస్తపల్లవంబులు = చిగుళ్లవంటి చేతులు, వదలి = సడలించి, ... పుచ్చెఁ = పంపెను.

శా. భారద్వాజ పవిత్ర గోత్ర, విమ లాప స్తంబ సత్సూత్ర, వి
ద్యా రాజార్ధ కిరీట, రాజ హిత కా ర్యారంభ నిర్ధారణా
ధౌరంధర్య కళా యుగంధర, సమిద్గాండీవి, శ్రీఖండ క
ర్పూర క్షోద విపాండు నిర్మల యశః పూర్ణ క్షమామండలా. 111

భారద్వాజ పవిత్ర గోత్ర = భారద్వాజుని పావన గోత్రము వాఁడా, విమల ఆపస్తంబ సత్ సూత్ర = పవిత్రమయిన యాపస్తంబుని మంచి సూత్రము గలవాఁడా, విద్యా రాజ అర్ధ కిరీట=విద్యలయందు చంద్ర ఖండ మకుటుఁడా (శివుఁడా—సర్వజ్ఞుఁడా యనుట), రాజ హిత కార్య ఆరంభ నిర్ధారణా ధౌరంధర్య కళా యుగంధర = ఏలికొలకు (వేమారెడ్డికొలకు) మేలయిన పనుల యుద్యమముయొక్కయు నిశ్చయించుటయొక్కయు భారవాహిత్వముయొక్క విద్యయందు యుగంధరుఁడా (వత్సరాజుమంత్రి యైన యుగంధరునంతవాఁడా యనుట), సమిత్ గాండీవి = యుద్ధములో అర్జునుఁడా, శ్రీ...లా = మంచిగందము కప్పురంపుఁ బొడుము (వీనివలె) తెల్లని స్వచ్ఛమయిన కీర్తిచేత నిండిన భూవలయము కలవాఁడా.— ఉత్తమజ న్మాచార విద్యా నీతి పరాక్రమ యశ స్సమృద్ధులు గలవాఁడా యనుట.

ఇందు 'విద్యా...డీవి'—రూపకపరంపర యగుటచేత మాలారూపకము. 'శ్రీఖండ...మండలా' - ఉపమాలంకారము.

క. కేళాదిరాయ, యభినవ । లీలా మకరాంక, చంద్ర లేఖాంకుర చూ
డాలంకార పదాంబురు । హా లింగన సుఖిత నిర్మలాంతఃకరణా. 112

కేళాదిరాయ = కేళాదిరాయనియంతటి వీరుఁడా యని యర్థము. [మయిసూరుదేశములో 'కెళది' యని యిప్పుడు నొక పూర్వకాల రాజ్యస్థానము కలదు; అదియే 'కేళాది' గావలయు; దాని యేలిక యొకఁడు మహావీరుఁడుగా నుండినందున 'కేళాదిరాయ' శబ్దము వీరబిరుద మైన దని యూహింపఁ దగియున్నది.] అభి...రాంక - అభినవ = నూతనుఁ డైన - లీలా మకరాంక = విలాస ప్రధానుఁడయిన మన్మథుఁడా, చంద్ర...రణా - చంద్ర లేఖా = చంద్ర కళయొక్క - అంకుర = మొలకయే - చూడా అలంకార = మౌళి భూషణముగాఁగలవాఁ డయిన శివుని యొక్క - పద అంబురుహ = చరణ కమలములయొక్క - ఆలింగన = కౌఁగిలింతచేత - సుఖిత = సుఖముగలదైన - నిర్మల = నిర్దోష మయిన - అంతఃకరణా = మనస్సుకలవాఁడా.—వీరుఁడా, తులితమారుఁడా, వీరశైవుఁడా, అని భా.—'కేళా...రాంక' - రూపకములు. 'పదాంబురుహ' - రూపకమేనియు ఉపమయేనియు.

మాలిని.

జరఠ కమఠ రాజ స్తబ్ధరోమ ప్రధాన
ద్విరసన పతి భూభృద్ దిగ్గజ గ్రామ భూమ
స్థిరతర ధృత సంప ద్దేహ బాహాగ్రపీఠీ
పరిచయ సుఖ లక్ష్మీ పక్ష్మల క్షోణిచక్రా. 113

జర...చక్రా - జరఠ కమఠ రాజ = ముసలి తాఁబేటి ఱేఁడు (ఆదికూర్మము) - స్తబ్ధ రోమ ప్రధాన = పంది మన్నీఁడు (ఆదివరాహము) - ద్విరసన పతి=చిలువ దొర (అనంతుఁడు) - భూభృత్ = (కుల) పర్వతములయు - దిక్ గజ = దెసల యేనుఁగులయొక్కయు - గ్రామ = సమూహము (ఏడు కొండలు ఎనిమిది యేనుఁగులు ననుట) - వీనియొక్క - భూమ=బహుత్వము చేత (అనఁగా ఈచెప్పఁబడిన పలువురచేత) - అస్థిరతర = కడుంగదలికతో (అనఁగా మోయ లేక బడలిన సవారిబోయీలవలె వారు భూమికి కుదుపు గలిగించుచుండి రని భా.) - ధృత = మోయఁబడినదై - సంపద్ గేహ = సంపదలకు ఇల్లయిన - బాహా అగ్ర పీఠ = (తన = సింగన యొక్క) బాహువుయొక్క శిరమనెడి ఆసనముయొక్క - పరిచయ = అనుభవముయొక్క - సుఖ లక్ష్మి = సు ఖాతిశయముచేత - పక్ష్మల = దట్టమయిన - క్షోణిచక్రా = భూమండలము గలవాఁడా.—పలువురైన కమఠాదులచేత చిరకాలము కుదుపుకుదుపుగా మోయఁబడిన భూమి యిపుడు ఆ యలయికను సంపత్సమృద్ధ మయిన యితని బాహాగ్రపీఠమందు కూర్చుండి తీర్చుకొని సుఖముగా నున్న దని భా.—దేశమును చక్కఁగా పరిపాలించుచున్నాఁడనుట.—అతిశయోక్త్యలంకారము.

గద్యము. ఇది శ్రీమత్ కమలనాభ పౌత్త్ర మారయామాత్య పుత్త్ర సకల విద్యా సనాథ శ్రీనాథభట్ట ప్రణీతం బైన శృంగార నైషధకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

ఇది శ్రీమంతు డయిన కమలనాభునికి మనుమఁడును మారయమంత్రికి కొడుకును సకల విద్యలతోఁగూడుకొన్నవాఁడును అగు శ్రీనాథునిచే రచింపఁబడిన దయి శృంగారరసప్రధానమయి నిషధరాజుంగూర్చిన కావ్యంబునందు మొదటి కథాంశవ్యవచ్ఛేదము.—శృంగార ప్రాధాన్యము ఎట్లన, నలుని వివాహానంతర ప్రథమ సంభోగశృంగారమే అంతముగా ఈగ్రంథము రచింపఁ బడినది, ఆతని రాజ్య భ్రంశాదికము లిందు లేవు.

శ్రీ

# శృంగారనైషధము.

## ద్వితీయాశ్వాసము.

—*హంస విడు పొంది కృతజ్ఞతం జూపుట.*—

క. శ్రీ రాజరాజవేమ। క్ష్మారమణ కృపా కటాక్ష సంవర్ధిత ల
క్ష్మీ రక్షిత బుధ లోక, యు। దార గుణాధార, సింగ నామాత్య మణీ. 1

శ్రీ...లోక = శోభాయుక్తుఁడును రాజాధిరాజును (అయిన) వేమ భూపాలుని కరుణతోడి కడకంటిచూపుచేత పెంపఁబడిన సంపదచేత పోషింపఁబడిన విద్వాంసుల సమూహము కలవాఁడా, ఉదార గుణ ఆధార=గొప్ప గుణములకు ఆశ్రయ మయినవాఁడా, సింగన అమాత్య మణీ = మంత్రిసత్తముఁడ వైన సింగన్నా.—ఉపసర్గయతి స్వరవ్యంజనములకు ఉభయమునకుం జెల్లును గాన చతుర్థపాదమందు (ఉత్ + ఆగ...సింగన + అమాత్య) స్వరయతి.

వ. అవధరింపుము. 2

అవధరింపుము = చిత్తగింపుము.

తే. అట్లు పురుషోత్తముం డైన యతనివలన (2-1)
ముక్తి గాంచిన యాద్విజ ముఖ్యుఁ డెలమి
డెందమునకును వాక్కున కందరాని
యధికతర మైన యానంద మనుభవించె. 3

అట్లు, పురుష ఉత్తముండు = నర వరేణ్యుఁడు (నారాయణుఁ డనియు), అయిన-అతని వలనన్ = ఆనలమహారాజువలన, ముక్తిన్ = విడుదలను (సంసారమోక్షము ననియు), కాంచిన = పొందిన - ఆ - ద్విజ ముఖ్యుఁడు = పక్షి పుంగవుఁడు (హంస) (బ్రాహ్మణోత్తముఁ డనియు), డెందమునకున్ = హృదయమునకును - వాక్కునకున్ = మాటకును - అందన్ = అందుకొనుటకు (భావించుటకును వచించుటకును), రాని = శక్యము గానట్టి - అధికతర మైన యానందము = పరమానందమును (బ్రహ్మానందము ననియు), అనుభవించెన్.

నారాయణునివలన సంసారవిముక్తిం బొందిన బ్రాహ్మణోత్తముఁడు భావనాతీతంబును అనిర్వచనీయంబును అగు బ్రహ్మానందంబుం బొందునట్లు నలునిచేత విడుపొందిన యాహంసయు అట్టి పరమానందంబుం బొందెను.

ఇట అపవర్గప్రాప్త విప్రపుంగ వార్థము ధ్వనిమాత్రమే గాని యలంకారము గా దని ప్రాచీలనుమతము. ప్రకృతాప్రకృత గోచర శ్లేషాలంకార మని అప్పయ్య దీక్షితాదుల మతము:—

'ప్రకృతాప్రకృతోభయ వా । చక నానార్థపద విన్యసన మగు శ్లేషక్ ;
సుకవులకు సరసులయెడక్ । గుకవులసంగతిని గాదె కొమ రధిక మగుక్.' అలం.

క. చుట్టంబులుఁ జెలులుం దన (2-5)
చుట్టుఁ దిరిగి యుండ, ముదము సొం పెసలారక్,
నెట్టి పడి, చచ్చి క్రమ్మఱఁ
బుట్టినచందమున హంసము దటాకములోక్. 4

ముదము = సంతోషము (ముచ్ఛబ్దము). సొంపు ఎసలారక్ = అతిశయింపఁగా. నెట్టిపడి= త్రోసికొనిపడి (హంస కర్త). క్రమ్మఱక్ = మరల. క్రమఱఁ బుట్టిన చందమునక్ - అంత సంతస ముతో నని భా.— ఉత్ప్రేక్షాలంకారము.

సీ. చిక్కించికొనియున్న చెక్కుమొత్తముతోడి (2-2)
యొడలు జాడించి నెవ్వడి విదిర్చుఁ,
జేదోయి యొత్తునఁజేసి నెత్తురు లైన ”
యవయవంబులు నోర సవర చేయుఁ,
గుటిల చంచూపుట కోటి కుట్టనములఁ (2-4)
దను కీటముల నిరోధంబు మాన్చుఁ,
దొడరు జుంజుఱు మేని దుర్వికారంబునఁ (2-5)
బులుఁగుఁ జుట్టాల బిట్టులియఁ జేయు,

తే. నూర్మిపంక్తుల నుయ్యాల లూఁగి యాడుఁ,
దివుటఁ దియ్యని తమ్మిపూఁదేనె గ్రోలుఁ,
బ్రమదమున నాఁచుఁదీఁగె జొంపములఁ దూఱు,
నరుగుఁ గేళీకులాయ శుద్ధాంతములకు. 5

ఒడలు = దేహమును, నెవ్వడిక్ = నిండువేగముతో (నెఱ+వడి - బా. వ్యా. సం. 38 చూ.), విదిర్చుక్ = విదిలించుకొనును.

చేదోయి = నలుని రెండుచేతులయొక్క - ఒత్తునఁజేసి = ఒత్తుడుచేత. అవయవంబులు = అంగములను, నోరక్ = నోటితో, సవర చేయుక్ = సవరించుకొనును.

కుటి...లక్ - కుటిల = వంకరలైన - చంచూ = ముక్కుయొక్క - పుట = డొప్పల - కోటి = కొనలయొక్క - కుట్టనములన్ = పోటులచేత, తను...బుక్ - తను = చిన్నవయిన - కీటముల = పురుగులయొక్క - నిరోధంబుక్ = (కాటుచేత నయిన) బాధను, మాన్చుక్=పోఁగొట్టు కొనును.

తొడ...నక్ - తొడరు = కలిగినట్టి - జుంజుఱు = చింపిరి (రేఁగిన అనుట) - మేని = దేహముయొక్క - దుర్వికారంబునక్ = చెడుమార్పుచేత, పులుఁగుఁ జుట్టాలక్ = తన బంధువు

లగు పత్రులను, బిట్టు = మిక్కిలి, ఉలియఁగ = వాపోవునట్లుగా - చేయును (దీని యీవికృతిం గాంచి చుట్టపుఁబిట్టలు దిగులుపడి కరము వాపోయిన వని భా.)

ఉర్మి పంక్తులఁగ = అలల బారులయందు... తివుటఁగ = కోరికతో ... తమ్మి = తామరల - పూఁదేనెఁగ = మకరందమును (పూవు + తేనె - ప్రాఁతాది లోప నుగాగమంబులు), గ్రోలుఁగ = త్రాగును, ప్రమదమునఁగ=హర్షముతో, నాఁచుఁ దీవ జొంపములఁగ = నాఁచుఁ దీఁగల గుబురులలో ... కేళీ కులాయ శుద్ధాంతములకుఁగ = (చెట్లమీఁది) ఆట (తావు లయిన) గూండ్లనెడి యంతఃపురములకు, అరుగుఁగ = పోవును.—స్వభావోక్త్యలంకారము.

'అలుకఁజేయు' అను పాఠ మసంగతము. 'ఉలియఁజేయు' ననునది మూలానుగుణము.

'అయ మేత్య తడాగనీడజై ర్లఘు పర్యవ్రియ తాథ శజ్కి తైః,
ఉదడీయత వైకృతా త్కరగ్రహజా దస్య వికస్వరస్వరైః.'

వ. ఇవ్విధంబునం గొంతదడవు క్రీడించి యానీడోద్భవంబు భవార్చనా యోగ్యంబును రుద్రాక్ష మధువ్రత పరీవృతంబును బహు శైవ లక్ష్మతా సమన్వితంబును నగుటఁ బద్మంబునుం బోని నిషధరాజు హస్తంబునకుఁ గ్రమ్మఱ నరుగుదెంచె (2-6). నమ్మహాభుజుండును భుజంబు సాఁచి యమ్మానసౌకంబు మన్నించి యిమిడ్చికొని యుండె. నప్పుడు. 6

తడవు = సేపు. నీడ ఉద్భవంబు = పక్షి (గూఁటిపుట్టు వని అవయవార్థము), భవ అర్చనా యోగ్యంబును = శివ పూజకు అర్హంబును (ఈవిశేషణము పద్మమునకును సమానము), రుద్రా... బును - రుద్రాక్ష మధువ్రత = తుమ్మెదలవంటి రుద్రాక్షలచేత (రుద్రాక్షములవంటి తుమ్మెదలచేత అని పద్మపరము) - పరీవృతంబును = చుట్టఁబడినదియు, బహు...బును- బహు = పెక్కులయిన- శైవ = శివభక్తులయొక్క - లక్ష్మతా = చిహ్నములు గలదగుటతో [బహు శైవల క్ష్మతా = మెండు నాఁచు గల (క్ష్మా =) ప్రదేశముగలదై యుండుటతో అని పద్మపరము] - సమన్వితంబును = కూడుకొన్నదియు (రాజుచేతిలో శివభక్తచిహ్నములు పెక్కులు కలవు, పద్మమును మిక్కుటంపు నాఁచుతోడి ప్రదేశము గలదై యుండును) ... హస్తంబునకుఁ గ్రమ్మఱ నరుగు దెంచెఁగ = మరల వచ్చిహస్తంబున వ్రాలినది. [శ్లేషానుప్రాణిత మయిన యుపమాలంకారము.] మహాభుజుండు=దీర్ఘ బాహుఁడు - ఆజానుబాహుఁ డనుట - అది పృథివీశలక్షణములలో నొకటి:—

'కరికరసదృశౌ వృత్తౌ। వాజాన్వవలమ్బినౌ సమౌ పీనౌ
బాహూ పృథివీశానా। మధమానాం రోమశౌ హ్రస్వౌ.' బృహత్సంహిత.

ఆ - మానసౌకంబుఁగ = హంసను (మానస = మానస సరస్సు - ఓకః = నిలయముగాఁ గలది - అని యవయవార్థము).

తే. ఇష్టమానస మయిన యాహేమఖగము (2-8)
నలునిమానస మానంద జలధియందుఁ
గర్ణ శష్కులి కలశంబుఁ గౌఁగిలించి
యీఁదఁ జేయుచు మృదుభాష నిట్టు లనియె. 7

ఇష్టమానసము - ఇష్ట = ప్రియమయిన - మానసము = మానససరస్సుకలది (మనస్సుకలది యనియు - మనఃప్రీతిం బొందినట్టిది యనుట) - ఐన - ఆహేమఖగము = ఆబంగారుపక్షి, నలుని - మానసమును = మనస్సును, ఆనంద - జలధియందు = సముద్రమందు, కర్ణ...ంబుగ్ - కర్ణ శష్కులి = చక్కిలమువంటి దైన చెవియనెడు - కలశంబుగ్ = కుండను, కౌఁగిలించి = పట్టుకొని, ఈఁదఁజేయుచుగ్=ఈఁదించుచు ... — ఈఁదినకొలఁది సముద్రములో ఈఁత తనివి అనుభూత మయి నట్లు, విన్న కొలఁది ఆనందము అధికముగా అనుభూత మాయె నని భా.—

తా.—హంస సంతోషించి నలునికి అత్యంత సంతోషకరముగా ఈ వక్ష్యమాణవృత్తాంతమును వినిపించెను.

తనమానసమునకు మహానందముం గావించినాఁడుగాన అతని మానసమునకు తానును మహానందముం గావించె నని హృదయము. ఇష్టమానసము కాఁబట్టి (నలుని) మానసమునకు ప్రీతి కావించిన దని శ్లేషోత్థాపిత మయిన పదార్థహేతుకకావ్యలింగాలంకారము. శష్కులివంటికర్ణము కర్ణశష్కులి - ఉపమాలంకారము, కర్ణశష్కులి యనెడి కలశము - రూపకము, అని రెంటికిని సంసృష్టి; 'ఆనంద జలధి' - రూపకము.

వ. దేవా, యవధరింపుము. ధర్మశాస్త్ర మర్మ పారగు లైన పెద్దలు 'దుర్బల స్వకుల జిఘాంసువు లైన ఝషంబులను నిజ నీడ ద్రుమ పీడా కరంబు లైన నీడజంబులను ననవద్య తృణ హింసా నృశంసంబు లగు మృగంబులను మృగయావినోదంబుల వధించి మహీధవుండు కిల్బిషంబునఁ బొందం' డని చెప్పుదు. రిప్పట్టునం బట్టు వడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదు నన నేర్తునే? నైనను నీకు నొక్కప్రియంబు చేసెద. నయాచితోపపన్నం బైన హితంబు పరిహరింపం బని లేదు. నిఖిల భువన నాయకుండ వైన నీకు మము బోంట్లు సేయు నుపకారం బపేక్షణీయంబు గాకుండుట యెఱుంగుదు. నైనను గృతజ్ఞతాగుణ లేశంబు క్లేశపఱుచుచున్నయది. సన్నంబు దొడ్డ యనువిశేషంబు విచారింపక హస్తకల్పజనాంతరం బయిన దైవంబు ప్రశస్తి విమర్శించి నాచేయు ప్రయోజనం బంగీకరింపుము. 8

దేవా = రాజా, అవధరింపుము = చిత్తగింపుము, ధర్మశాస్త్ర మర్మ పార గులు = స్మృతుల రహస్యముయొక్క తుదను ముట్టినవారు, అయిన - పెద్దలు = జ్ఞానులు, దుర్బల...వులు = బలహీనము లయిన తమజాతిజంతువులను చంపఁగోరునవి, ఐన - ఝషంబులను = చేపలను (పెద్దచేపలు చిన్నచేఁపలను తినును కాన నిట్లు చెప్పుట),నిజ...బులను = తమవైన గూఁటిచెట్లకు చెఱుపు సేయునవి అయిన పక్షులను, అనవ...బులను = నిర్దోషమయిన గడ్డియొక్క బాధనముచే ఘాతుకములగు లేళ్లను, మృగయా వినోదంబులగ్ వేఁట = వేడుకలయందు, వధించి = చంపి, మహీధవుండు = రాజు, కిల్బిషంబునం బొందండు = పాపము ననుభవింపఁడు - అని చెప్పుదురు - పెద్దలు కర్త.—ఇట నీటను మింటను నేలను గల జంతువులు చెప్పఁబడినవి. విశేషణములు వధ్యతాహేతువు అర్థముగాన పదార్థహేతుక కావ్యలింగాలంకారము. (2-10)

అయాచిత ఉపపన్నంబు = యాచింపఁబడనిదై లభించినట్టిది, ... హేతంబు = ...
పరిహరింపఁగ బనిలేదు = వదలుట సరిగాదు - 'అయాచిత ముపగ్రాహ్య మపి దుష్కృత కర్మణః'
అని స్మృతి. (2-12)

... నిఖిల భువన నాయకుండవు = సకల లోక నాథుఁడవు (లోకమున కంతయు పతి వనుట).
మముబోంట్లు = నాబోఁటివారు. అపేక్షణీయంబు = కోరఁదగినది. [ఇట నిఖిలభువననాయకుఁడ
వను విశేషణమునకు అనపేక్షణీయతా హేతువు అర్థముగాన పదార్థ హేతుకము కావ్యలింగము.]
... కృతజ్ఞతా గుణ లేశంబు = కృతజ్ఞత (అనఁగా చేసిన మేలును ఎఱుంగుట) అనెడి గుణము
యొక్క కణము, క్లేశపఱుచుచున్న యది = బాధించుచున్నది. (2-13)

సన్నంబు = కొలఁదిది, దొడ్డ = గొప్పది. (2-14)

... హస్తకల్పజనాంతరంబు - హస్త కల్ప = ఇంచుకతక్కువ దగు చేయి యయిన - జన
అంతరంబు = అన్యప్రాణి కలది - ఐన - దైవంబు ప్రశస్తిఁగ = విధియొక్క మహిమను, (అనఁ
గా - నేను చేసెడు ప్రియమును విధియే నీ కిచ్చుచున్నాఁడు, ఆతనికి సొంతచేతికన్న కొంచెము
తక్కువ యయిన చేయిని నేను. నేను అనెడి తన మాఱుచేతితో విధియే ఆప్రియమును నీ కిచ్చు
చున్నాఁడని యెఱుంగుము.—ఈమేలు సామాన్యుఁడ నయిన నావలన వచ్చిన దని భావింప
వలదు, విధివలన వచ్చిన దనియే భావింపుము - తప్పక గ్రహింపవలసినదియు తప్పక ఫలించునదియు
నని భా.—కరకల్ప జనాంతరంబు - ఉపమాలంకారము.) (2-12)

## —* హంస దమయంతిని వర్ణించుట. *—

సీ. ప్రత్యర్థి సార్థ సార్థక నామధేయుండు (2-16)
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ;
నారాజు త్రిదివంబు నమరేంద్రుఁడును బోలెఁ ,,
దేజంబున విదర్భ దేశ మేలు;
దమనాహ్వయుం డైన తపసి సద్వరమునఁ (2-17)
గాంచె నాతఁడు కన్యకాలలామ;
సర్వ లోకాంగనా సౌభాగ్య గరిమంబు (2-18)
దమియించు కతమున దానినామ

తే. మభ్రిభారతి దమయంతి యనుచు నొడివెఁ;
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ,
యబ్జసూతికి నైన శక్యంబు గాదు,
పలుకుఁబూఁబోఁడి కైనను నలవి గాదు.



ప్రత్య ... డు - ప్రత్యర్థి = శత్రువులయొక్క - సార్థ = సమూహమునకు - సార్థక
అర్థసహిత మయిన - భీముఁ డనఁగా భయంకరుఁడు అను నర్థముగల దైన) - నామధేయుఁడు=

పేరుగలవాఁడు, భీముఁడు అనఁగన్ = భీముఁడు అను పేర, భూమీశ్వరుండు = రాజు, ఒప్పున్ = కలఁడు.—ఇచట నిరుక్త్యలంకారము కలదు:—

'యోగముచే నామములకు। బాగుగ నన్యార్థకల్పి పరఁగు నిరుక్తిన్;
ఈగతి వేఁపుదు వీవు వి। యోగుల దోషాకరాఖ్య యొప్పదె నీకున్?' అలం.

ఆరాజు... = స్వర్గమును దేవేంద్రుఁ డెట్లేలుచున్నాఁడో ఆభీమరాజు అట్లే ప్రతాపముచేత విదర్భదేశమును ఏలుచున్నాఁడు;—'అమరేంద్ర' సాదృశ్యము చెప్పుటచే అఖండ విభవ భోగసంపన్నుండై అమృతభోజను లయిన దేవతల యంత సుఖులుగా తనప్రజ లుండునట్లు పాలించుచున్నాఁ డనియు; 'తేజము'ను చెప్పుటచే ఇంద్రుఁడు అసురులను రూపు మాపినట్లు ఈతఁడు తన వైరులను తాను రూపుమాపుచున్నాఁ డనియు భా.—ఉపమాలంకారము.

ఆతఁడు = ఆభీమరాజు, దమన ఆహ్వయుండు=దమనుఁ డను పేరుగలవాఁడు, అయిన - తపసి సత్ వరమునన్ = మునియొక్క మంచి వరముచేత, కన్యకా లలామన్ = కన్యా తిలకమును - (ఉత్కృష్టకన్య ననుట), కాంచెన్ = పడసెను.—కన్యకాలలామ - ఉపమాలంకారము.

సర్వ...మునన్ = సకల లోక (అంగనా=)సుందరస్త్రీలయొక్క సౌందర్యముయొక్క పెంపును దండించు కారణముచేత (అనఁగా - ఆమె సౌందర్యము ఎల్లలోకములలోని యితర సుందరీమణుల సౌందర్యాతిశయమును దండించునట్టిది గావున)...

అభ్ర భారతి = ఆకాశవాణి, దమయంతి = (దండించుచున్నట్టిది)...నొడివెన్ = పలికెను. పైఁజెప్పిన కారణముచే ఆకాశవాణి ఆకన్యకు 'దండించునది' అని యర్థముగా 'దమయంతి' యను పేరు పెట్టెను.) తత్ గుణంబులు = ఆకన్యయొక్క సౌందర్య వైదుష్యాది గుణములు,... అబ్జసూతికిన్ = తామర చూలికి (బ్రహ్మకు)... [బ్రహ్మకును సరస్వతికిని శక్య మయినదానిసే శక్యము గా దనుట అసంబంధాతిశయోక్తి.]

తే. విదుషి యాయింతి దలఁ దాల్చు వెంద్రుకలకు (2-20)
నహహా! యెబ్భంగి సాటి సేయంగ వచ్చుఁ
బసువుచేతఁ బురస్కృతిఁ బడయ లేక
చాపలంబున వర్తించు చామరములు! 10

'మానవా వళితో వర్ణ్యా దేవా శ్చరణతః పునః' అను కవిసంప్రదాయముం బట్టి దమయంతిని తలవెంద్రుకలు మొదలుగా వర్ణించుచున్నాఁడు:—

విదుషి = పండితురాలయిన - ఆ - ఇంతి = స్త్రీ, తలఁ దాల్చు = శిరమున ధరించిన (నైల్యాదిగుణోత్కర్షముంబట్టి శిరమున వహించి గౌరవించినట్టి యని వ్యంగ్యము), ... పశువుచేత = పసరమయిన (తెలివి చాలని దైన - అని వ్యంగ్యము) సవరపు మృగముచేత (సయితము), పురస్కృతిన్ = ముం దిడుకొనుటను (గౌరవమును - సవరము అమృగముయొక్క తోఁక యగుటచే పశ్చాద్భాగమున నుండును గాన ఇట్లు చెప్పుట), చాపలంబునన్ = కదలికతో (తారతమ్యజ్ఞానహీనతతో), వర్తించు (నట్టి) - చామరములు = సవరములను, అహహా = ఆశ్చర్యము, ఎబ్భం... వచ్చున్ = ఎంతమాత్రముగాని సాటి సేయఁ దగదు.—నీచులచేత సయితము తిరస్కృతు లయిన వారికి గొప్పవారిచే సత్కృతు లయిన వారితో సాటి యెట్లు కలుగును? అని భా.—తలఁదాల్చుటయు పురస్కరింపమియు సాటి లేమికి హేతువులు గాన కావ్యలింగము.

క. ఖుర కండూయన మిషమున। హరిణంబులు సాంత్వనంబు నాపాదించున్
దరుణివిలోచనములచేఁ। బరిభూతము లైన తమ చపల దృష్టులకున్. 11

హరిణంబులు = లేళ్లు, తరుణి విలోచనములచేన్ = (ఆ) జవరాలి కన్నులచేత, పరిభూతములు = పరాజితములు, ఐన – తమ చపల దృష్టులకున్ = చంచలము లైన (తెలివి సాలక ఆ సాటిం గోరినవైన అని వ్యంగ్యము) తమ కన్నులకు, ఖుర కండూయన మిషమునన్ = గొరిజలతోడ గ్రోఁకుట యనెడు మిషచేత, సాంత్వనంబున్ = ఓదార్పును, ఆపాదించున్ = చేయును. బలాధికులతో సాటికి పోయి దెబ్బలు తిని వచ్చిన బాలకులను మాతాపిత్రాది స్వజనులు ఒడలు తడవి బుజ్జగించి ఓదార్చినట్లు అని భా. దమయంతి నేత్రములు హరిణనేత్రములకన్న సుందరము లని భా. 'మిష' మనుటచేత – గొరిజలతోఁ గ్రోఁకికొనుట ఓదార్చుటకైన తడవుటయేగాని దురద తీఱుటకై గ్రోఁకికొనుట గాదు అని భా.—సాపహ్నవోత్ప్రేక్ష. (2-21)

క. లలనకనుదోయిముందట। నలవఱి నలినంబు మలిన మయ్యెను; హరిణం
బులు పూరి మేయఁదొణఁగెను;।గలితద్యుతిఖంజ మయ్యె ఖంజనకులమున్.

లలన= ఆసుందరియొక్క... నలినంబు = కమలము, అలవు (లేక – అలవి) అఱి = సొంపు చెడి, మలినము = (ఓడినందున) కాంతిహీనము ... హరిణంబులు = లేళ్లు – పూరి = గడ్డిని ... (గడ్డి మేయుట పరాజితతా శరణార్థితాసూచకంబును), ఖంజన కులమున్ = కాటుకపిట్టల సమూహంబును, కలిత ద్యుతి ఖంజము = కలిగిన కాంతిచే కుంటిది – అనఁగా కాంతి కొఱవడినట్టిది (= ద్యుతి హీనము) ... (2-23)

మలిన పదార్థమునకును నళినమునకును ఎంతటి వార కలదో నళినమునకును ఆమె కనుదోయికిని అంతటివార కలదని భా. ఇశ్లే ఖంజనద్యుతిఖంజతోక్తియందును భావము నెఱుఁగ వలయును.

ఇచట (సూర్యునిముందఱ చంద్రుఁడు వెలవెలఁ బోయినట్లు) కనుదోయిముందఱ నళినము మలిన మాయె నని కవి చెప్పినాఁడు. మలినతా సంబంధము లేనిదే చెప్పఁబడినందున, సంబంధాతిశయోక్తి, ఖంజన ద్యుతి ఖంజ తోక్తియందును, అశ్లే సంబంధాతిశయోక్తి. సహజ మైన పూరి మేఁతకు కనుదోయివలని పరాజయమును కారణముగా సంభావించినందున హేతూత్ప్రేక్ష. మూఁటను ప్రస్తుతనయనప్రశంసావహముగా అప్రస్తుత మయిన తదీయకార్యమును నిబంధించినందున కార్యనిబంధనాప్రస్తుతప్రశంసాలంకారము:—

'సమము విశేషము సామా। న్యము కృతి కారణ మవర్ణ్యమై వర్ణితమై
గమియింప నితరముఁ బ్రకా। శము నై దప్రస్తుతప్రశంసలు గాంచున్.' అలం.

(2-25)

తే. రాజబింబంబునందు సారము హరించి
చేయఁబోలు విధాత యీ చెలువమోము;
నడిమి రంధ్రంబునందుఁ గానంగ వచ్చు
ఖని ఖ నీలిమ యది నిదర్శనము గాదె! 13

విధాత = బ్రహ్మ, రాజ బింబబునందున్ = చంద్రమండలమునందలి, సారమున్ = శ్రేష్ఠాంశమును, హరించి = కైకొని (అశ్రేష్ఠాంశముతో నసుట) ఆచెలువమోమున్, చేయఁబోలుఁజీ = చేసి

నాఁడుగావలయు, (అందులకు ఏమి తార్కాణ మనఁగా), నడిమి రంధ్రింబునందుఁ = (సారముక్కై లోఁతుగా మఱియు లోఁతుగా గనిని త్రవ్వుచునే పోఁగా - ఫ్రూసలలోని బెజ్జమువలె ఇటునుండి అటు బింబముపాడుగునను ఏర్పడినట్టి) నడిమి సారంగములో, కానంగవచ్చు = కనఁబడుచున్న - ఖని ఖ నీలిమ అది = గనియొక్క (గనికి అవలివైపున నున్న) యాకాశముయొక్క యా నలుపు, నిదర్శనము గాదె = తార్కాణము గాదా.

ఇచట—దమయంతీ వదననిర్మాణమునకై రాజబింబసార హరణమును మఱియు కళంకమందు ఖనిఖనీలిమయు ఉత్ప్రేక్షితములు. మఱియు, నిచట అప్రాకరణిక మయిన యిందుబింబమందుఁ జెప్పఁబడిన దమయంతీ వదననిర్మాణార్థ సారాంశహరణ మను కారణముచే దానికార్య మయిన దమయంతీవదన గత లోకోత్తర సౌందర్యవిశేషము తెలియవచ్చుచున్నది గాన, నిది కారణ నిబంధ నాప్రస్తుత ప్రశంసయు.

క. ప్రవిలేపన పాండురమును । నవ లాంఛన గోమ యాంచనము నగు రాకా
ధవళాంశు మండలము విధి । నివాళిసేయును లతాంగి నెమ్మొగమునకుఁ.

విధి = బ్రహ్మ, ప్ర...మును - ప్రవిలేపన=పిండికలిపిన నీటిచేతనుంబోలె-పాండురముఁ= తెల్లనిదియు, (తనకాంతి యనెడు సున్నపునీళ్లచే తెలుపయిన దనియు భా.), నవ...నము - నవ= నూతనమయిన అనఁగా మునుపటికంటె ఉత్కటమయిన - లాంఛన=కళంకమనెడి - గోమయ = ఆవుపేఁడతోడి - అంచనముఁ = కూడిక గలదియు, అగు - రాకా ... ముఁ - రాకా = నిండు పున్నమనాఁటి - ధవళ అంశు = (తెల్ల కిరణములవానియొక్క) చంద్రునియొక్క - మండల ముఁ = బింబమును, లతా...కుఁ - లతా = తీఁగవంటి - అంగి = దేహముకలదైన యా దమ యంతియొక్క - నెమ్మొగమునకుఁ = నెఱి = సుందరమయిన - మొగమునకుఁ = ముఖమునకు, నివాళి సేయుఁ = ఆరతి యిచ్చును. **(2-26)**

లోకములో దృష్టిదోషపరిహారార్థము మూకుటికి సున్నముపూసి లోపల పేఁడపెట్టి అందులో దీపము ఉంచి, ఆమూకుటితో నివాళింతురు. అట్లె బ్రహ్మదేవుఁడు దమయంతీ వదనమునకు దృష్టిదోష పరిహారార్థము చుట్టును ధవళప్రభ యనెడి సున్నపుఁబూఁతయు నడుమ కళంక మనెడి గోమయపిండంబును కిరణంబు లనెడి దీపశిఖయుం గలయట్టి నిండు జాబిల్లిబిల్లిక యను మూకుటితో నివాళించుచున్నాఁడు. ఆకాశమున చంద్రమండల సంచారము ఆరతి త్రిప్పుటవలె నున్నదనియు హృదయము.—రూపకానుప్రాణితోత్ప్రేక్ష.— ముఖము చంద్రునికన్న అత్యుత్కృష్ట మని భా.

సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన **(2-28)**
రతి మన్మథుల విండ్లు రమణి బొమలు,
కాంతి నిర్ఝర మీఁదు కామ యౌవనముల **(2-31)**
కుంభప్లవము లింతి కుచయుగంబు;
నడు మింత యని కేలఁ దొడికి పట్టిన ధాత **(2-34)**
యంగుళిరేఖ లబ్జాస్యవళులు,
యువ మనో మృగరాజిఁ దవిలింపఁ దీర్చిన
మదనవాగురు లిందువదన కురులు,

తే. బాల్య తారుణ్య సీమా విభాగమునకు (2-30)
నజుఁడు వ్రాసిన రేఖ తన్వంగియారు,
భానువరమునఁ బడసిన పంకజముల (2-38)
యపర జన్మంబు పూఁబోడి యడుగు లధిప. 15

అధిప = ఓరాజా, రమణి బొమలు = దమయంతి కనుబొమ్మలు, జగములు = లోకములను, ఒక్కుమ్మడిఁ = ఏకకాలమందే, సాధింపఁ = జయించుటకై, ఎత్తిన = (బాణప్రయోగముకై ఎక్కుపెట్టి) పట్టియున్న-రతి మన్మథుల (యిరువురయు రెండు) విండ్లు; [మూఁడు-లోకములను - లేక - పదునాలుగు లోకముల జనులను ఇద్దఱట్లు సాధింతు రనిన, అన్నిలోకముల స్త్రీలను ఒకరును అన్నిలోకముల పురుషులను ఒకరును సాధింతు రని యెఱుంగవలయు. వా రిరువురు శృంగారి శేఖరులు గాన వారిధనువులు కడమవిలాసుల ధనువులకన్న నందములుగా నుండును, వానినిగా చెప్పుటచేత దమయంతిబొమలు లోకోత్తర సౌందర్య సంపన్నము లని భా. సర్వజన మదనోద్దీపకము లనియు భా. దమయంతిబొమలు స్త్రీలకును మదనోద్దీపకములా యనిన శ్రీ రాముల వారిని మునులు వలచి కృష్ణావతారమున వారికి భార్య లయి రను కథలో రాములవారు పురుషులు వలవఁదగిన పురుషుఁ డయినట్లు, దమయంతి స్త్రీలు వలవం దగిన స్త్రీ యని గ్రహింపవలయును.]

ఇంతి కుచయుగంబు = దమయంతి చనుంగవ, కాంతి...ములు = కాంతి యనెడి ప్రవాహమున ఈఁదుచున్న మన్మథునియొక్కయు జవ్వనముయొక్కయు కుండ తెప్పలు (ఇంత లావణ్యంబును ఈ వలుదకుచంబులును మదన యౌవనముల యుదయమునకు పూర్వము లే వనియు దానితో వచ్చిన వనియు, చెఱి యొకకుండ యనియు హృదయము; 'ఈఁదు' అనుటచే లావణ్యకుచములచేత మదన యౌవనోదయము తెలియ నగుచున్న దనియు హృదయము.)

అబ్జ+ఆస్య వళులు = కమల ముఖియొక్క తఱులు, నడుము=అవలగ్నము, ఇంత యని= ఇంత (అనఁగా పిడికిటి) పరిమాణము కలది అని, కేలఁ = చేతితో, తొడికి = ఒడిసి, పట్టిన - ధాత = బ్రహ్మయొక్క - అంగుళి రేఖలు = వ్రేళ్లనడిమి గీఱలు (నడుము మిగుల సన్న మగుటచేత పిడికిట నిముడునదియే యని నిశ్చయార్థము బ్రహ్మ నాలుగువ్రేళ్లతో పట్టుకొనఁగా వ్రేళ్లసందులలో నుబికిన భాగములే మూఁడువళు లయిన వని భా. సృజించినవాఁడు గావున ధాత వలగ్న పరిమాణ సామంజస్య పరీక్షార్థమై పిడికిటం బట్టి చూచుకొన్నాఁడు.)

ఇందు వదన కురులు = చంద్ర ముఖియొక్క తలవెండ్రుకలు, యువ మనః మృగ రాజిఁ= యౌవనవంతులయొక్క మనస్సు లనెడి లేళ్ల సముదాయమును, తవిలింపఁ = చిక్కించుటకు, తీర్చిన మదన వాగురలు = పన్నిన మన్మథుని యురులు (వేఁటకాని యురులలో లేళ్లు దగుల్కొను నట్లు ఈకురులలో యౌవనవంతుల మనస్సులు తగులుకొనుచున్న వనుట. అతి మదనోద్దీపకములు గానున్న వని భా.)

తన్వంగి యారు — తను = సన్నని - అంగి = మేనుకలదైన యాదమయంతియొక్క - ఆరు =నూఁగారు, బాల్య తారుణ్య సీమా విభాగమునకుఁ - శైశవముయొక్కయు జవ్వనముయొక్కయు హద్దుచేత విభజనమునకై, అజుఁడు = బ్రహ్మ, వ్రాసిన రేఖ= గీచిన గీఱ; (ఈరేఖ వ్రాయక పూర్వము బాల్యము, దీనిని వ్రాసిన పిమ్మట యౌవనము అని కాలవిషయమైన హద్దును ఏర్పరించె ననుట,

ఇందువలన తారుణ్యారంభంబున రేఖను వ్రాసినప్పుడే బాల్యాంతము తెలియునుగాని పిమ్మట తెలియదు గావునను, విభాగము తెలియుటకై వ్రాసినాఁ డనుటచే ఇప్పుడే వ్రాసినాఁ డని ఏర్పడుచున్నది; కావున నాయిక వయస్సంధియం దున్న దని భా.)

పూఁబోఁడి యడుగులు, భానువరమునన్ = సూర్యునివరముచేత, పడసిన పంకజముల యపర జన్మంబు=పొందిన తామరల వేఱుపుట్టువు;(తామరలు సూర్యునిఁగూర్చి తపస్సుచేయుట సూర్యుఁడు దేవుఁడు మాత్రమే గాక వానికి బాంధవుఁడు కూడ నగుటచేత తప్పక ఎంతటివరము నైనను ఇచ్చునని. పంకజములకును ఆమె యడుగులకును అంతటి వార యున్న దని భా.)

ఇందు అంతటను గమ్యోత్ప్రేక్షాలంకారములు స్పష్టములు.

క. జలదుర్గస్థ మృణాళా। వలి జిత్కమనీయ బాహు వల్లరి యగు నా
జలజానన నీకుం దగుఁ;। బలుకులు వే యేల యధిక బలశౌర్య నిధీ? 16

...బల శౌర్య నిధీ = బల పరాక్రమములకు నిక్షేపమ వయిన యోరాజా, జల...ల్లరి - జల దుర్గ= నీటి కోటలో - స్థ = ఉన్నట్టి - మృణాళ = తామరతూండ్లయొక్క - ఆవళి = సమూహమును - జిత్ = జయించునవై - కమనీయ = మనోహరములయిన - బాహు వల్లరి= పూరెమ్మలవంటి బాహువులు గలది (ఆమెబాహువులు నీటిలో నున్న మృణాళములకన్న సుకుమారములనుట; బైటికి తివిసినంతట మృణాళములు వాడం దొడంగును గాన, నీట నున్నవానినే చెప్పుట;) అగు - ఆ - జలజ ఆనన = తామరస వదన - లేక - ఆచంద్ర వదన, నీకున్ - తగున్ = అర్హురాలు. వే పలుకులు ఏల = వేయి మాట లెందులకు - వేయి మాటలు చెప్పినట్లుగా ఈ యొక మాట చెప్పినమాటను గ్రహింపవలయు నని భా. (స్థలదుర్గమందలి శత్రువును జయించుటయే మిక్కిలి కష్ట మయి యుండఁగా జలదుర్గమందలి శత్రువును జయించుట ఎంత కష్టమో చెప్పవలయునా? అట్టి శత్రువును బాహువులతో జయించిన దనుటచేత దమయంతి బలశౌర్యనిధి యని ఫలించుచున్నది. అట్టిబలశౌర్యనిధి యైన యాసుందరి బలశౌర్యనిధికి నీకు తగును జుమా యనుట. 'వివాహ శ్చ వివాద శ్చ సమయో రేవ శోభతే' వివాహమును వివాదమును సమానులకే శోభించు నని సూక్తి. (2-29)

జిత్ - ఇది ఉపమావాచకముగా 'జల ... వల్లరి' అను విశేషణమందు సాదృశ్యము చెప్పఁబడినది గాన ఉపమాలంకారము. ఈవిశేషణముచే ప్రస్తుతధర్మి యయిన దమయంతియందు అప్రస్తుత యుద్ధవీరవృత్తాంతము స్ఫురించుచున్నది గావున సమాసోక్త్యలంకారమును గలదు:—

'ప్రకృతపుఁ గృతి తల్లింగము । ప్రకృత విశేషణము సామ్యపాటవమున న
ప్రకృత వ్యవహారంబుం । బ్రకృతంబునఁ జూపఁగా సమాసోక్తి యగున్.
సకి యదె రాగముతో శశి । వికాసభృత మైంద్రిముఖము వెసఁ జుంబించున్.' అలం.

'జల... వల్లరి,' 'అధికబల శౌర్యనిధీ' అనువిశేషణంబులకు అర్హతాహేతు వర్థము గాన పదార్థహేతుక కావ్యలింగాలంకారమును.

క. హాటకకలశంబులకును। శాటి యగువధూటి మెఱుఁగుఁ బాలిండ్లు నిరా
ఘాట స్ఫురణ ప్రభ యను। నేటికిఁ జక్కవల కవ యయి విరాజిల్లున్. 17

హాటక కలశంబులకున్ = బంగారు గిండులకు, పాటి = సమానములు, అగు - వధూటి= (ఆ) యింతియొక్క - మెఱుఁగుఁ బాలిండ్లు=లావణ్యవంతములయిన స్తనములు, నిరాఘాట స్ఫురణ

ప్రభ = అడ్డులేని ప్రసరణముగలదైన కాంతి, అను నేటికిన్ = అనెడి ప్రవాహమునకు, జక్కవల కవ అయి విరాజిల్లున్ = చక్రవాక మిథునమై ఒప్పుచున్నది. (2-32)

తా.—దేహకాంతి యనెడి యేటికి స్వర్ణ కలశములవంటి పాలిండ్లు జక్కవకవగా నున్నవి. 'హాటక...పాటి...లిండ్లు' - ఉపమాలంకారము. రూపకము స్పష్టము.

తే. వలుదయును వట్రువయుఁ గాఁగ నలినభవుఁడు (2-36)
భీమ భూపాల పుత్త్రికిఁ బిఱుఁదొనర్చె,
నర్కరథ శిల్ప శిక్షఁ బుష్పాస్త్రు తేరు
నేకచక్రంబు సేయ నూహించి యొకొ? 18

నలినభవుఁడు = బ్రహ్మ, అర్క రథ శిల్ప శిక్షన్ = (ఏకచక్ర మయిన) సూర్యుని రథము యొక్క నిర్మాణముయొక్క యభ్యాసముచేత, పుష్పాస్త్రు తేరు న్ = మదనుని రథమును గూడ, ఏకచక్రంబు = ఒంటిచక్రముకలదిగా, చేయన్ = నిర్మించుటకు, ఊహించి యొకొ = సంకల్పించి కాఁబోలు, వలుదయున్ = పీవరమును, వట్రువయున్ = గుండ్రమును, కాఁగన్ = అగునట్లు, భీమభూపాలపుత్త్రికిన్ = దమయంతికి, పిఱుఁదు = నితంబమును, ఒనర్చెన్ = చేసెను.

దమయంతియొక్క వలుద వట్రువ పిఱుఁదు మదనుని కోసము ఇపుడు అపూర్వముగా బ్రహ్మ ఒంటిచక్రపు జైత్రరథముకై చేసిన బండికల్లుగా నున్నది. 'బ్రహ్మ ఒంటిచక్రపుఁదేరు చేయ నెట్లు నేర్చినాఁడు?' అందురేని, పూర్వము సూర్యునికి అట్టిదానిని చేసి నేర్చుకొన్నాఁడు.—ఏ ప్రకారముగా సూర్యుఁడు ఏకచక్రరథ మెక్కి అవ్యాహతముగా విశ్వంబునం దిరుగుచు దీపించుచున్నాఁడో ఆప్రకారముగా దమయంతీ నితంబ రూప మయిన యొంటిచక్రము గలదైన రథ మెక్కి మన్మథుఁడు సకలజగజ్జేతగా విరాజిల్లును అని భా. ఆ నితంబబింబము త్రైలోక్య మోహకముగా నున్న దనుట.—ఉత్ప్రేక్షాలంకారము.

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమునలావణ్యంబునం గేళికా (2-37)
నన సంక్రందన పట్టణ ప్రకట జన్మ స్థానలన్ రంభలన్
ధన దాపత్య తపః ఫల స్తనుల నత్యంతాభిరామాంగులన్
మనుజాధీశ, యధఃకరించుఁ; బొగడన్ మాబోంట్లకున్ శక్యమే ? 19

మనుజాధీశ = ఓనరేంద్రుఁడా, వనజాతే(త+ఈ)క్షణ = తామరలవంటి నేత్రములు కలదైన దమయంతి (కర్త్రి), ఊరు యుగ్మమున లావణ్యంబునన్ = తొడల యుగమునందలి కాంతిచే (అలుక్సమాసము - సప్తమీ తత్పురుషము), కేళి...నలన్ = కేళి కానన = ఉద్యాన వనమునందును - సంక్రందన పట్టణ = అమరావతియందును - ప్రకట = ప్రసిద్ధమైన - జన్మ = పుట్టువును - స్థానలన్ = ఉనికియుఁ గలయట్టియు, ధన...నులన్ - (అరఁటిపక్షమున) ధనద = కుబేరుని - అపత్య=పట్టి యయిన నలకూబరునియొక్క - తపః = తపస్సుయొక్క - ఫల = ప్రయోజనమువంటి - ఫల = పండ్లు - స్తనులన్= స్తనములుగాఁ గలయట్టియు - (అచ్చర పక్షమున) ధనదాపత్య = నలకూబరుని - తపః = తపస్సునకు - ఫల = పండ్లవంటి - ఫల = ప్రయోజనమయిన - స్తనులన్ = స్తనములు గలయట్టియు - అత్యంత అభిరామ అంగులన్ = అతి మనో

హారమయిన దేహము గలయట్టియు, రంభలన్ = అరఁటిని రంభ యనునచ్చరను, అధః కరించున్ = క్రిందు సేయును - మించు ననుట...

తా.—రంభాశబ్దమునకు అరఁటిచెట్టును రంభ యనునప్సరసయు నర్థములు; చెట్టునకు ఉద్యానవనములో పుట్టువు, అప్సరసకు ఇంద్రపట్టణమందు ఉనికి; ఇందు అరఁటి నలకూబరుని తపస్సుయొక్క ప్రయోజనమువంటి (అంత యుత్కృష్టము లనుట) పండ్లే తనకు స్తనములుగాఁ గలది, అచ్చర నలకూబరుని తపస్సుయొక్క ప్రయోజనమే పండ్లయాకారమున తన స్తనములుగాఁ గలది (స్తనములు పండ్లవలె నున్న వనియు వాని యనుభవము నలకూబరునిదే యనియు భా.) అరఁటి అత్యంతాభిరామ మయిన దేహము గలది, అచ్చరయు నట్టిదే; ఈరంభాద్వయమును (అరఁటిని, అచ్చరను) దమయంతి తన యూరుద్వయముచేత జయించినది. ఆయూరుద్వయ సౌందర్యము మాబోంట్లకు వర్ణింప నలవి గాదు.—అట్టి స్తనములతోడి దానిని, ఇట్టిఫలములతోడి దీనిని ఒక్కొక్క తొడతోనే కొట్టి వేసిన దనుట.—యథాసంఖ్యము; ఉపమయు. 'అధఃకరించు'-సామ్యవాచకము.

'స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి
ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిన్దతి ...
తస్య చాను కరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః;
ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః.' దండి.

(2-40)

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానా నదీ
నద కాంతార పురీ శిలోచ్చయుఁడ నై నైకాద్భుత శ్రీజిత
త్రిదివం బైనవిదర్భ దేశమున నారీరత్నముం గాంచితిన్
సదస త్సంశయ గోచరోదరి శర త్సంపూర్ణ చంద్రాననన్. 20

మృదు రీతిన్ = అక్రమమైన విధముగా, ప్రతివాసరంబు = ప్రతిదినము, గమి...డన్-గమి = (గమనార్థకమయిన) 'గమ్' అనుక్రియకు - కర్మీ భూత = కర్మ ఐన (అనఁగా వేనిని గూర్చి పోయితినో అ) నానా = పెక్కు - నదీ = తూర్పునకు పాఱెడునేళ్లు - నద = పడమటికి పాఱెడునేళ్లు - కాంతార = పేరడవులు - పురీ = పట్టణములు - శిలోచ్చయుఁడన్= కొండలుంగలవాఁడను, ఐ, నైకా...బు - నైక = పెక్కు - అద్భుత = వింత - శ్రీ = సంపదలచేత - జిత = జయింపఁబడిన - త్రిదివంబు = స్వర్గముకలది, ఐన - విదర్భదేశమునన్, సత్ అసత్ సంశయ గోచర ఉదరిన్ = కలది లేనిది (కలదో లేదో) అను సందేహమునకు విషయమయిన కడుపుగలదానిని, శరత్ సంపూర్ణచంద్ర ఆననన్ = శరత్కాలపు నిండు చంద్రునివంటి ముఖము కలదానిని, నారీ రత్నమున్ = (ఒక) సుందరీ మణిని, కాంచితిన్.

నేను లీలార్థమై నానానదీనదాదులకుం బోవుటలో స్వర్గమునకన్న సిరి గల దైన విదర్భదేశములో ఒకానొక రమణిమణిని కలదు లే దనుపాటి నడుముదానిని శారద రాకా శశాంక వదనను చూచితిని. శరత్కాలమందు చంద్రునికి ప్రకాశ మెక్కువగాన శరత్తును జెప్పుట. విదర్భదేశము జితత్రిదివము గావున అందలి నారీరత్నమైన దమయంతి జితత్రిదివనారీరత్న యని హృదయము.

'నైక'—(న+ఏక) నఞ్సమాసమున నుభయతి గావున నిట వ్యంజనయతి.

'సద...రి'—సంబంధాతిశయోక్తి; 'శర...ననన్' ఉపమాలంకారము.

'సదసత్సంశయగోచరోదరి' యను మూలపదగుంభనము దెచ్చికొనుటకై యీ పద్యము.
'గమికర్మీకృతనైకనీవృత' అను గుంభనకై యీక్రింది పద్యము:—

మ. కమలేందీవర షండ మండిత లసత్కాసార సేవా రతిన్ (2-40)
గమికర్మీకృత నైక నీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమ పీన స్తని నస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్. 21

కమ...రతిన్ = కమల = తామరలయు - ఇందీవర = నల్లగలువలయు - షండ = గుబురులచే - మండిత = అలంకృతములయి - లసత్ = శోభిల్లుచున్న - కాసార = సరస్సుల- సేవా = అనుభవముయొక్క - రతిన్ = కోరికచేత, గమి...ను - గమి = గమనమునకు - కర్మీకృత = (కర్మ కాక యుండి) కర్మగా చేయఁబడినది అయిన - నైక - పెక్కు - నీవృతుఁడను= దేశములుగలవాఁడను (అనేక దేశములకు పోయినవాఁడను అనుట), ఐ, విదర్భంబునన్ = విదర్భ దేశమందు, పల్లవ పాణిన్ = చిగుళ్లవంటి చేతులుగలదియు, పద్మ నయనన్ = తామరలవంటి కన్నులు గలదియు, రాకా ఇందు బింబ ఆననన్ = నిండుపున్నమనాఁటి చంద్ర మండలమువంటి ముఖము కలదియు, సమ పీన స్తనిన్ = ఒండొంటికి తుల్యములును పుష్టములును అయిన కుచములు గలదియు, అస్తి నాస్తి విచికిత్సా హేతు శాత ఉదరిన్ = కలదు లేదు (అనెడి) సంశయమునకు కారణ మయిన సన్నని కడుపు కలదియు, (అయిన) - రమణిన్ = సుందరిని, కంటిని.

తా.—తామరలుం గలువలుం గల యంద మయిన సరస్సులందు విహరింపఁగోరి, నానాదేశ ములు త్రిమ్మరుచు, విదర్భదేశములో చిగుళ్లవంటి చేతులును, పద్మములవంటి కన్నులును, నిండు పున్నమ నాఁటి చంద్రబింబమువంటి మొగమును, సమానము లయిన నిండుచన్నులును, కనఁబడియుం గనఁబడనంత సన్నపాటి నడుమును, కల యొక రమణిని చూచినాఁడను.

హంసకు కమలాదికము ఆహారమును లోచనాదిప్రీతికరంబు నగు. పల్లవపాణిత్వాదికము ఉత్తమప్రకృతిసూచకము, సౌందర్యోత్కర్ష వర్ణనమును. శోభనాకృతి గావున ('యత్రాకృతి స్తత్ర గుణా వసన్తి' అను సూక్తి ప్రకారముగా) గుణవంతురాలు ననియు అందువలన కోరఁదగినది అనియు భా. 'సమ' స్తని అనుటచే మహాధన భోగ యగు నని భా.

' మధ్యం స్త్రియా స్త్రివళిసార్ధ మ రోమశం చ
వృత్తౌ ఘనా వవిషమౌ కఠినౌ పురోజౌ
రోమాపవర్జిత మురో మృదు చాఙ్గనానాం
గ్రీవా చ కమ్బునిచితాఽర్థ సుఖాని దత్తే.' బృ. సం.

వ. కాంచి, విబుధపుర పురంధ్రీ రామణీయకం బీ రమణీరత్నంబు ముందట నిస్సారంబు పొమ్మనియును, విధాతచిత్తంబున నీమత్తకాశినికిం దగిన యుత్తముఁ డగు వరుం డెవ్వండు గలిగి యున్నవాఁడొకో యనియును, జింతించుచుం గొంత తడవు నివ్వెఱపడి చూచుచుండితి (2-41). ననంతరంబ యనురూప లావణ్య రేఖా సంపన్నుండైన పిన్నవయసురాకొమరు నవలోకింతు నని లోకాలోకపర్యం

తంబుగా నీలోకంబు విశ్వంబునుం బరిభ్రమించి, యుర్వీశ్వరకుమారకుల నెల్లం బూర్వపక్షంబు గావించుచు వచ్చివచ్చి, యిచ్చోట నిన్నుం గనుఁగొని సిద్ధాంతీకరించితి (2-42). సాదృశ్యనిబంధనం బయి పొడమిన సంస్కార బోధంబునఁ జిరకాలావలోకిత యగునట్లుల యిప్పుడు నామనంబునం బొడగాన వచ్చుచున్న యది (2-43). 22

కాంచి = చూచి, విబుధ పురంధ్రీ రామణీయకంబు = దేవ వనితా సౌందర్యము ... మత్తకాశినికిన్ = (మత్తవలె అనఁగా కైపెక్కినదానివలె ప్రకాశించునది - మోహకురాలు అని అవయవార్థము) ఉత్తమస్త్రీకి ... నివ్వెఱపడి - నివ్వెఱ = నివ్వెఱఁగును (అనఁగా పరవశత్వమును) - పడి = పొంది ...

అనురూప లావణ్య రేఖా సంపన్నుండు = తగిన కాంతి పెంపుతో కూడుకొన్నవాఁడు... అవలోకింతున్ = చూచెదంగాక ...లోకాలోక పర్యంతంబుగాన్ = చక్రవాళపర్వతము వఱకు (లోకము నంతటిని చుట్టుకొనియుండు పర్వతము చక్రవాళము - దానివఱకు ననఁగా లోక మంతయు ననుట.) ... విశ్వంబున్ = అఖిలంబును, పరిభ్రమించి = తిరిగి, ఉర్వీశ్వర = రాజ .... పూర్వపక్షంబు గావించుచున్ = తగదని నిశ్చయించుచు (సిద్ధాంతమునకు విరుద్ధమగునది పూర్వపక్షము - దానినిగాఁ జేయుట యనఁగా కానిదని త్రోసి వైచుట), ... సిద్ధాంతీకరించితిన్ = (నీవే తగినవాఁడ వని) నిశ్చయించితిని.

సాదృశ్య నిబంధనంబై - సాదృశ్య = మీయిండొరుల సమత్వము - నిబంధనంబై = కారణముగాఁ గలదై, పొడమిన సంస్కార బోధంబునన్ = పుట్టిన పూర్వవాసనయొక్క మేలుకొనుటచేత (మున్నొకన్నియం గన్న చిత్తవాసన ఇప్పుడు అట్టివానిని నిన్నుఁ గనఁగా నామనంబున స్మృతిస్ఫుటముగా నొప్పుచుండుటచేత ననుట), చిరకాల అవలోకిత = చిరకాలమునకు పూర్వము చూడఁబడినట్టిది... 'సాదృశ్య...చున్నయది' - స్మరణాలంకారము:—

'స్మృతి సందేహము భ్రాంతి స। మతచేతం బుట్టెనేని స్మరణాదు లగున్; [అలం॰
రతిఁ దలఁచు మరుఁడు నినుఁ గన; । సతివో హరిసతివో? భవుఁడు సతి వని బ్రమసెన్.'

క. దమయంతీ కిలకించిత। మమృతాంశు కు లావతంస యలరించు నినున్,
విమలతర తారహారము। రమణీ రమణీయ కుచభరంబును బోలెన్. 23

అమృత అంశు కుల అవతంస = అమృతకిరణుఁ డయిన చంద్రుని వంశమునకు శిరోలంకార మయినవాఁడా, విమలతర తార హారము = మిక్కిలిస్వచ్ఛములయిన ముత్యాల పేరు, రమణీ ...బోలెన్ - రమణీ = సుందరియొక్క - రమణీయ = మనోహరమయిన - కుచభరంబును బోలెన్ = స్తనభారంబును ఎట్లో అట్లుగా, దమయంతీ కిలకించితము = దమయంతియొక్క - కిలకించితము = కిలకించిత మనెడి శృంగార చేష్టితము ['శో కాశ్రు హర్ష భీత్యాదేః సంకరః కిలకిఞ్చిత' ప్రియతమసంగ మాదులవలనం గలిగినట్టిది నవ్వు వట్టియేడ్పు భయము కోపము బడలిక లోనగువాని సంకరము కిలకించి మనంబడును], నినున్, అలరించున్ = శోభిల్లఁజేయును. కుచభారమునకు తారహారము ఎట్లు తగియున్నదో నీకు దమయంతీ కిలకించితము అట్లు తగియుండును అనుట; ఇట అనురూప్యము ఉపమావ్యాదయము. (2-44)

తెలుఁగుపుస్తకములలో మాత్రము 'కిలికించిత' మని కనఁబడునుగాని శౌత్తరాహుల నాగర గ్రంథములందు 'కిలకించిత' మనియే రూపము; ఈపద్యమునకు మూలమయిన శ్లోకములో 'త్వయి వీరవిరాజతే పరం దమయన్తీ కిలకిఞ్చితం కిల' అని యనుప్రాస మందున్నది. దీనినే ఈ రూపమునకు ప్రమాణముగా శౌత్తరాహ నిఘంటుకారులు ఉదాహరించుకొని యున్నారు.

తే. సౌరభము లేనియట్టి పుష్పంబువోలె, (2-45)
గండుఁగోయిల వెలి యైన కానవోలె,
నధిప దమయంతితోడి సఖ్యంబు లేని
నీదు సౌందర్య విభవంబు నిష్ఫలంబు. 24

అధిప = ఓరాజా, ... సౌరభము=పరిమళము, ... గండుఁగోయిల ... మగకోకిల, వెలి యైన = లేనట్టి - కానవోలెన్ = ఉద్యానవనమువలె....పువ్వునకు తావి శోభ గలిగించును, ఆట కానకు కోయిల సొంపును గలిగించును, అట్లే దమయంతి నీకును సొంపును గలిగించును - అనుట. గండుఁగోయిల కూఁత ఖణీ లని కాన నంతయు మ్రోఁగించును, మధురముగాను ఉండును; కావున దానిం జెప్పుట- పువ్వునకు వన్నె లున్నను, ఆరామమునకు పూవులు చిగుళ్లు కాయలు పండ్లు తీవలు నున్నను, తావి లేక అదియు గోయిల లేక ఇదియు ఎట్లు శోభిల్లవో అట్లే నీకు ఎట్టిసౌందర్య భోగభాగ్యము లున్నను దమయంతి లేక నీవు శోభిల్లవు - అనుట. ఉత్తరార్ధమున వినోక్త్యలంకారము:— దానికి పూర్వార్ధమందలి యుపమలు అంగములు.

'ఒకధర్మంబు కలుగమిం । బ్రకృత మరమ్యము వినోక్తి, రమ్యం బొండేన్;
గుకవులు గూడమి నీసభ । వికసిలు; రిపుసభలు సుకవివిరహిత డిందన్.' అలం.

వ. కావున నిఖిల వైమానిక నికాయ కామ్యమాన యైన యమ్మానవతికి నిన్నుం గూర్ప నాకు నేర్పు గల (2-46). దక్కొమ్మ నెమ్మనంబున నిన్నుం దక్కఁ దక్కొరుం బరిగ్రహింప కుండునట్లుగా భవద్గుణంబు ప్రశంసించెద (2-47). నన్నుం బనిగొమ్ము, లెమ్ము, కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురు గాని మాటలం బ్రకటింప (2-48). రని పరిస్ఫుటంబుగాఁ బలికిన. 25

కావునన్ = దమయంతి ఎల్లవిధముల నుత్కృష్టురాలు గావున, అఖిల వైమానిక నికాయ కామ్యమాన = ఎల్లదేవతల సమూహముచేతను వలవఁబడుచున్నట్టిది, అయిన - అమ్మానవతిన్ = ఆమానినిని, ... కొమ్మ = కోమలి, ... నెమ్మనంబునన్ = నిండుమనస్సులో (నెఱ+మనము= నెమ్మనము), ... తక్క = తప్ప, తక్కొరున్ = మఱియొకని,...పరిగ్రహింపక = కైకొనక - భవత్ = నీయొక్క, ... ప్రశంసించెదన్ = పొగడెదను, ... పనిగొమ్ము = పనిపెట్టి పంపుము, ...ఆర్యులు = సజ్జనులు, ... నిజ = తమదైన, ... పరిస్ఫుటంబుగాన్ = స్పష్టముగా...

'నేను నాప్రయోజనమును కార్యముచేఁ దెలిపెదను, మాటలచేఁ జెప్పను' అని తన్నుఁగూర్చిన ప్రస్తుతవిశేష మభిప్రాయ మగునట్లుగా, 'కార్యంబున' ఇత్యాద్యప్రస్తుత సామాన్యముం జెప్పినందున సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంసాలంకారము.

తే. ఆద్విజాధిపువలన సంప్రాప్త మైన (2-49)
వాక్సుధాధారఁ గ్రోలి భూవల్లభుండు

లలితలీలఁ దదుద్గార లవముఁబోలె
మొలకనవ్వు వహించెఁ గెమ్మోవిమీఁద. 26

భూవల్లభుండు = రాజు, ఆ - ద్విజ అధిపువలనన్ = పక్షి పుంగవుఁ డనెడి చంద్రునివలన ('పక్షి వి ప్రాణ్డజా ద్విజాః' అమ. - చంద్రుఁడు బ్రాహ్మణులకు రాజు - 'ద్విజరాజః శశధరో నక్షత్రేశః' అమ. - ఈగ్రంథమందే 8 - వ యాశ్వాసములో 185-వ పద్యముం గనునది), సంప్రాప్తమైన = లభించిన - వాక్ సుధా ధారన్ = వచన మనెడి యమృత ధారను, క్రోలి= తమితోఁ ద్రాగి, లలిత లీలన్ = మనోజ్ఞమయిన విలాసముతో, త ... లెన్ - తత్ = ఆసుధా ధారయొక్క - ఉద్గార = త్రేనుపుయొక్క - లవముఁ బోలెన్ = లేశమునో యను నట్లుగా, కెమ్మోవి (కెంపు మోవి) మీఁదన్ = ఎఱ్ఱని పెదవిపై, మొలక నవ్వున్ = లేఁత హాసమును - వహించెను (మందహాసము చేసె ననుట.) అత్యంత ప్రియ హిత మగుటచే సుధాధార యనుట.

పూర్వార్థమందు రూపకము, ఉత్తరార్థమందు ఉత్ప్రేక్ష.

వ. ఇవ్విధంబున మందస్మితసుందరవదనారవిందుండై కరారవిందంబునం బతంగపుంగవు నంగంబు నివురుచు మృదుభాషణంబుల నిట్లనియె. (2-50) 27

... మందస్మిత = లేఁతనవ్వుచేత ... వదన అరవిందుండు = కమలమువంటి ముఖము కలవాఁడు, ... కర అరవిందంబునన్ = తామరవంటి చేతితో, పతంగ పుంగవు నంగంబు=పక్షిపతంసుని (హంసయొక్క) దేహమును, నివురుచున్ = నిమురుచు ... దేహంబు నిమురుట బుజ్జవము.

సీ. అండజాధీశ, నీ యాకారరేఖతోఁ (2-51)
దులఁ దూఁగ లేవు వస్తువులు జగతి;
నీడోద్భవశ్రేష్ఠ నీదుసౌశీల్యంబు
పలుకుల కందంగఁ గొలఁది గాదు;
పతగపుంగవ నీసుభాషితంబులయట్ల (2-52)
యవయవంబులు సువర్ణాత్మకములు;
పక్షివంశవతంస పక్షపాతము నీకు
గతియంద కాదు సద్వ్రతతియందు;
తే. నధికతాపపరీతాత్ముఁడైననాకు (2-53)
నెట్లు వచ్చితి చలిగాడ్పు నట్లు నీవు!
పూర్వ జన్మ మహాతపః స్ఫురణఁ జేసి,
నీదుసన్నిధి సమకూరె నిధియుఁబోలె. 28

అండజ అధీశ = ఓ పక్షి రాజా, నీ - యాకారరేఖతోన్ = యాకారముయొక్క తీరుతో, జగతిన్ = లోకములో, వస్తువులు = ఇతరపదార్థములు, తులఁదూఁగలేవు = సాటిగావు (హంస బంగారుది గాన, తులలో ఇతరపదార్థములు ఎంత విస్తారమైనను దానితో సమముగా తూఁగ వని వ్యంగ్యము). ఆకారముచే గుణసంపద ఊహ్యము.

నీడ ఉద్భవ శ్రేష్ఠ = (గూటి పుట్టువులలో నుత్తముఁడా) పక్షి వరేణ్యుఁడా, నీదు సౌశీల్యంబు = నీయొక్క మంచి స్వభావము కలిమి (నీ సత్స్వభావ మని భా.) పలుకు ... గాదు= చెప్పఁదరము గాదు.

పతగ పుంగవ = ఓ పక్షి శ్రేష్ఠుఁడా, నీ—సుభాషితంబుల యట్ల = మంచిమాటలే గాక, అవయవంబులున్=(నీ)యంగంబులును, సు వర్ణ ఆత్మకములు=మంచి యక్షరములు స్వరూపముగాఁ గలవి (అని సుభాషితపరము) - బంగారము స్వరూపముగాఁ గలవి (అని అవయవపరము) (మాటలు సువర్ణాత్మకములుగా పలువుర కుండును గాని అంగము నీవలె సువర్ణాత్మకముగా నుండుట ఆశ్చర్యము కావున నీవు లోకాతీతుఁడవు, అనుట);

పక్షి వంశ వతంస = పక్షి కుల శేఖరా, నీకున్, పక్షపాతము=టెక్కలతో ఎగురుట (గతి పరము) (స్నేహానువర్తిత్వము సద్వితతిపరము), గతియంద = గమనమందుమాత్రమే, కాదు = కాక, సత్ వితతియందున్ = సాధువుల సమూహమందుఁగూడ - (కల దని శేషము);

అధి...డు—అధిక = మున్మరమయిన - తాప = విరహజ్వరముచేత - పరీత = చుట్టఁబడిన - ఆత్ముఁడు = దేహముగలవాఁడను, ఐన నాకున్...నీదు సన్నిధి = నీ చేరువ, పూర్వ...సి - పూర్వజన్మ = తొలిపుట్టువునందలి - మహాతపః = గొప్పతపస్సుయొక్క - స్ఫురణన్ జేసి = వ్యాపారముచేత, నిధియుంబోలెన్ = నిధివలె, సమకూరెన్ = కలిగినది.

'తలఁ దూఁగ లేవు' 'పలుకుల కందవు'-ఇచట సంబంధ మున్నను లే దనుటచే అసంబంధాతిశయోక్తి. 'సువర్ణాత్మకములు, పక్షపాతము'—ఈరెంటను శ్లేషాలంకారము. గీతమందు ఉపమలు.

మ. త్రిజగన్మోహ మహౌషధీ లతిక ధాత్రీపాల కన్యావరో (2-54)
ధ జనోత్తంస మణిప్రరోహ మగు నాతన్వంగి వేమాఱునుం
బ్రజ లెల్లన్ వినుతింప విందు మొదలం బక్షీంద్ర; యూహింప న
క్కజ! మీ విప్పుడు సంస్తుతింప నది సాక్షాత్కారముం బొందెడున్. 29

పక్షీంద్ర = ఓవిహంగరాజా (హంసా), త్రి...తిక- త్రిజగత్= మూఁడులోకములకును - మోహ = మరులుగొలుపునట్టి - మహా (హత్ + ఓ) షధీ లతిక = మహిమగల లతావిశేషము, ('అగు' పదముతో నన్వయము), ధాత్రీపాల = రాజుల - కన్యా అవరోధ జన= కన్యాంతఃపుర మందలి-(స్త్రీ) జనులయొక్క—ఉత్తంస మణి ప్రరోహము = శిరోలంకార మగు రత్నంపు మొలక, అగు-ఆతన్వంగిన్ = ఆరమణిని, వే మాఱునున్ వేయి పర్యాయము లైనను (పలుమా అనుట), ప్రజ లెల్లన్, వినుతింపన్= పొగడుచుండఁగా, మొదలన్=పూర్వము, విందున్= వినుచుంటిని, ఊహింపన్ = తలంచుటకు (లేక - ఊహింపని = తలంచుకొన నట్టి), అక్కజము = ఆశ్చర్యముగా, ఈవు = నీవు, ఇప్పుడు, సంస్తుతింపన్ = పొగడఁగా, అది = ఆవర్ణన, సాక్షాత్కారముం పొందెడున్ = ప్రత్యక్షత్వమును పొందుచున్నది. (ఆకన్య నాకనులకు ప్రత్యక్ష మయినట్లున్నది అనుట.)

ఓ విహంగోత్తమా, మూఁడులోకములను మరులు గొలుపునట్టి మహిమగల యోషధీ విశేష మయినట్టిదియు సకల రాజాంతఃపురకన్యలలో నెల్ల మేలుబంతియు నయిన యాదమయంతిని పూర్వము ఎల్లవారును వేనోళ్ల వర్ణించుచుండఁగా వింటినిగాని, ఇప్పుడు నీవు వర్ణింపఁగానే అది ఏమాశ్చర్యమో ఆకన్య కనులకుం బ్రత్యక్ష మయినట్లు తోఁచుచున్నది.— ఈయోషధియందు

తన్నుఁ జూచినమాత్రాననే విన్నమాత్రాననే లోకుల నెల్ల మరులు గొల్పు మహిమవిశేష మున్నది కావున దీనిని మహౌషధీలతిక యనుట.

ఇందు దమయంతియందు ఓషధీత్వారోపముచేత రూపకము. సాక్షాత్కారముం బొందిన దనుటచే భావికము.—'భావికము గతాగామ్య ర్థావిర్భావంబు ప్రోల.' అలం.

తే. స్వహృదయంబును సుహృదుండు సమ్మతింప, (2-55)
నరయువారికి నఖిలంబు నకలుషంబు;
చెంత నైనను సూక్ష్మ మీక్షింపఁ జాల,
దాన నాలంక్రియా మాత్ర మక్షియుగము. 30

దమయంతిని ఇతరులు వర్ణించినప్పుడు తనకు సాక్షాత్కారము కామికిని హంస వర్ణించి నంతట సాక్షాత్కారము అయినందులకును కారణమును చెప్పుచున్నాఁడు.—స్వహృదయంబుఁ = తన మదియు, సుహృదుండుఁ = (తన) చెలికాఁడును, సమ్మతింపఁ = సమాధానపడునట్లుగా, అరయు వారికిఁ = విచారించుకొను జనులకు, అఖిలంబుఁ = సర్వమును, అకలుషంబు = నిస్సంశయము [ఆప్తమిత్త్రుఁడు కని నిజ మెఱింగి వచ్చి హృదయమునకు నచ్చునట్లు చెప్పిన అందు సంశయ ముండదు. మఱి తనకు దేవుఁ డిచ్చిన కన్నులతో చూచి తానే నిశ్చయించుకోరాదా? మిత్త్రుఁ డేల? అతని మాటలవలన ఈ హృదయసమ్మతి యేల? అనిన;] అక్షియుగము = కను దోయి, చెంతఁ = సమీపమందు, అయిననుఁ, సూక్ష్మము = నలు సయిన వస్తువును, ఈక్షింపఁ జాలదు = కనిపట్ట నేరదు; (అటయిన మఱి యది యేల యనిన), ఆనన అలంక్రియామాత్రము = ముఖమునకు కేవలము అలంకారము.

తానే చూచుటకన్నను మిత్త్రుఁడు చూచి చెప్పుటయే యుత్కృష్టము; నా మిత్రుఁ డవు నీవు చూచి చెప్పితివి గావున నాకు సాక్షాత్కార మయినది;—అనుట.

ఇందు తమ యిరువుర వృత్తాంత మగువిశేషము అభిప్రాయముగా 'అరయువారికి' అని సామాన్యమును చెప్పినందున సామాన్యనిబంధన అప్రస్తుతప్రశంసాలంకారము. కన్ను నిస్సంశయముగా చూడ లేమి మిత్త్రునిచేఁ చూడవలసినందులకు కారణము గాన వా. హే. కావ్యలింగమును.

ఉ. తియ్యని తేనెవోలె సుదతీతిలకంబు గుణంబు లుత్సవం (2-56)
బయ్యె శ్రుతిద్వయంబునకు నాదిమకాలమునందు; నిప్పు డా
తొయ్యలి నీవు సమ్మదముతో వినుతింపఁగ మన్మథాగ్నికిం
ధాయ్యయుఁ బోలె నయ్యె నది; ధైర్యము పల్లటిలెన్ ఖగేశ్వరా. 31

ఖగేశ్వరా = పక్షిపుంగవా, ఆదిమ కాలమునందుఁ = పూర్వ కాలమునందు - అనఁగా - ఇతరులు వర్ణించినప్పుడు, సుదతీ తిలకంబు గుణంబులు = సుందరీ లలామయొక్క సౌందర్యాది ధర్మములు, తియ్యని తేనె వోలెఁ = మధురమయిన మధువు నోటికి ఎట్లో అట్లే, శ్రుతి ద్వయంబునకుఁ = వీను దోయికి, ఉత్సవంబు అయ్యెఁ = పండుగ ఆయెను; ఇప్పుడు, నీవు, ఆతొయ్యలిఁ = ఆ జవ్వనిని, సమ్మదముతోఁ = సంతోషముతో, వినుతింపఁగఁ = వర్ణింపఁగా, అది = ఆవర్ణించుట, మన్మథాగ్నికిఁ, ధాయ్యయుఁ బోలెఁ = మండించు మంత్రమువలె, అయ్యెఁ, ధైర్యము = చిత్తదార్ఢ్యము, పల్లటిలెఁ = తూలిపోయినది.

ఓయి విహంగరాజా, పూర్వము ఇతరులవలన విన్న దమయంతీగుణవర్ణన శ్రోత్రమునకు తియ్యనితేనెవలె పండువు గావించినది. ఇప్పుడు ఆప్తుఁడ వయిన నీవు గావించిన తద్గుణవర్ణన ధాయ్యయై మన్మథాగ్నిని మంట చేసినది. అందువలన నాధైర్యము తూలిపోయినది.

వారి వర్ణనవలన పండుగును నీవర్ణనవలన మండుటయు నని వ్యతిరేకాలంకారము ధ్వనించుచున్నది. 'తేనె వోలె' - ఉపమాలంకారము. 'మన్మథాగ్ని' - రూపకము. 'ధాయ్యయుఁబోలె'- తదుజ్జీవితమయిన యుత్ప్రేక్ష. ధైర్యము పల్లటిలుటకు తత్పూర్వవాక్యార్థము కారణము గాన వాక్యార్థహేతుక కావ్యలింగ మలంకారము.

శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభ (2-57)
శ్రీలుంటాకము చంద నాచల తట శ్రీఖండ సంవేష్టిత
వ్యాల స్ఫార ఫణా కఠోర విష నిశ్వా సాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్షీ, సేయు దాక్షిణ్యముల్. 32

పక్షీ = ఓహంసా, కాలాం...కము = యముని యంతఃపుర కామినులయొక్క చను దరుల కస్తూరీ పరిమళ సంపదయొక్క దొంగయు, చంద...బు = గంధపుఁగొండ దరుల గంధపుఁజెట్లను చుట్టుకొనియున్న పాముల విశాలమయిన పడగలయొక్క దారుణమయిన విషముతోడి యూపిరి నిప్పునకు కొలిమితిత్తియు, (నయిన యీ) - దక్షిణ అనిలము = దక్షిణదిక్కు గాలి, నాపయిన్, ఏలా దాక్షిణ్యముల్ చేయున్ = ఏల దయను చూపును.

ఈ దక్షిణపు గాలి యమధర్మరాజును కూడ లక్ష్యపెట్టక, అతని యంతఃపుర కామినులయందే ప్రవేశించి, వారి పాలిండ్లయందలి కస్తూరీ సౌరభాతిశయమును కొల్లగొట్టినది. ఇది సామాన్యపు దొంగ గాదు, మహాసాహసము మాత్రమే గాక అమితనాగరకతయు కలిగిన దొంగ. ఎట్లన, ఈ దొంగ అతిగూఢముగా వారు పైఁటలోపల పాలిండ్లయందు దాఁచికొనియున్న కస్తూరిని వదలి దాని భోగ్యసారమయిన పరిమళమును మాత్రమే హరించినది. అంతటితో నిలువలేదు. పాముల కయినను భయపడ దని చెప్పవలయునా ? మలయాచలమందు చందనవృక్షములను చుట్టుకొనియున్న పాముల దారుణ విష నిశ్వాసాగ్నులను కొలిమితిత్తివోలె ఊఁది మండించి విస్తరిల్లఁ జేసి తెచ్చి నామీఁదఁ జల్లుచున్నది. ఇట్టి కూళకు నాపై కనికర మేల కలుగును ? దీని దాక్షిణ్యము దక్షిణ దిగ్భవత్వరూపమే గాని దయారూపము గాదు.

(' అగ్నిదో గరద శ్చైవ శస్త్రోన్మత్తో ధనాపహః
క్షేత్ర దా రాపహర్తా చ ష డేతే హ్యాతతాయినః.' శు(క్ర.)

గరద మగుటచే ఆతతాయి గదా యీదక్షిణపు గాలి - ('ఆతతాయీ వధోద్యతః' అమ.) ఆతతాయి చంపవచ్చినవాఁడు; వానికి దయ యేమి?—వసంతానిలముయొక్క శైత్యసౌరభ్యములు విరహోద్దీపకము లగుటచే నలునికి ప్రాణహరణములుగా నున్న వనుట.

'కామినీ' - కామినులు అనఁగా కామించినవారు, గావుననే కస్తూరిని ధరించినారు. కస్తూరి యుష్ణ మగుటచే విరహానలతప్తులకు దాని వాసన దుస్సహముగా నుండును. పాములు చందనవృక్షములను చుట్టుకొనియుండుట ప్రసిద్ధము:—

' భోగి వేష్టన మార్గేషు చన్దనానాం సమర్పితం
నాస్రసం త్కరిణాం గ్రైవం త్రిపదీచ్ఛేదినా మపి.'— రఘు.

'సంవేష్టిత' పాఠమున ।చందనవృక్షములు చుట్టుకొనియున్న వని చెప్పుటవలన వివక్షితములు మహోఘటసర్పములు అతిస్థూలములు అనునర్థము ప్రయోజనము. అట్లుగాక, చందనములనే పాములు చుట్టుకొనియున్న వను పక్షమున 'సంవేష్టిత' యను ముద్రణము 'సంవేష్టితృ' అని యుండవలయును. లేదా - ఆహితాగ్న్యాదిసమాసముగా నైన గ్రహింపవలయును. ఫణములు కొలిముల వలె నున్న వని భా. 'నిశ్వాస' - న్యుపసర్గమునకు 'సపక్షోఽద్రి 8 వాచాలీ న్యశ్వసీ త్కల్పవాయువత్.' అని లుజ్కాండములో భట్టి ప్రయోగము:— 'ఏలా...పక్షీ' యనుచో ప్లుతయతి.

విశేషణములకు అర్థము లయిన విశిష్ట లుంఠన విషాగ్నివర్ధనములు దాక్షిణ్యాభావమునకు హేతువులు గావున పదార్థహేతుక కావ్యలింగాలంకారము. విషనిశ్వాసమందు అగ్నిత్వము అనిల మందు తత్ప్రాణింధమత్వము, ఆరోపితంబు లగుట రూపకాలంకారము. ఫణములయందు కొలిమి తనముయొక్క యారోపము శాబ్దమై యుండుటచే ఏకదేశవివర్తి రూపకము.

క. నెలనెల. దప్పక యుండఁగ (2-58)
నెల భాస్కరుఁ జొచ్చుటెల్ల నియమముతోడం
గలహంస వేఁడి వెన్నెల
సోలయక నాయంగకములు సూఁడుటకుఁ జుమీ. 33

కలహంస = ఓరాజహంసా, నెల = చంద్రుఁడు, నెలనెల = ప్రతిమాసంబును, తప్పక ఉండఁగన్ = తప్పనియట్లుగా, భాస్కరున్ చొచ్చుట = (ప్రతియమావాస్యయందును) సూర్యుని యందుఁ బ్రవేశించుట, సోలయక = వెనుదివియక, వేఁడివెన్నెలన్ = వేఁడివెన్నెలతో, నా యంగకములు = కనికరింపఁబడిన వైన నా యవయములను (అనుకమ్పాయాం కః), చూఁడుటకున్ చుమీ = కాల్చుటకుఁ జుమా.

ప్రతియమావాస్యయందును సూర్యచంద్రులు ఏకరాశిగతు లై యుందురు. భూమినుండి సూర్యునికి సూత్రము వేసినచో దానికి చంద్రుఁడు తగిలియుం దగులక యుండును. తగిలినచో సూర్య గ్రహణ మగును. ఈయేకరాశ్యేకసూత్రగతత్వమునే సూర్యునియందు చంద్రుఁడు చొచ్చుట యని కవులు వ్యవహరింతురు.—చంద్రిక లుద్దీపనవిభావము గాన నలుఁడు వానికి తాళ లేకున్నాఁడు.—

అంగకములను జూఁడుట సూర్యసంగమమునకు ఫలము కాకున్నను తత్ఫలముగా సంభావింపఁ బడినందున ఫలోత్ప్రేక్ష:—

ఉ. మోహము దాహముగ్ మదికి మూఁడ్చుచు నున్నవి, పాయ దెప్డు సం
దేహము, మీనకేతనుని దివ్యశరంబులు పువ్వుమొగ్గలో ? (2-59)
యూహ యొనర్పఁగాఁ బిడుగు లో కులిశంబులొ ? యట్ల! భారతీ
వాహకులావతంస, విషవల్లి సముద్భవముల్ ప్రసూనముల్ ! 34

భారతీ వాహ కుల అవతంస = సరస్వతికి వాహన మగు (హంస) కులమునకు శేఖర మైన వాఁడా, మీనకేతనుని దివ్య శరంబులు = మదనునియొక్క యద్భుత బాణములు, మదికిన్ = నా మనస్సునకు, మోహముగ్ = మూర్ఛను, దాహముగ్ = తాపమును, మూఁడ్చుచున్నవి = కలిగించుచున్నవి, (కావున), సందేహము ఎప్డున్ పాయదు=ఒక సంశయము న న్నెప్పుడును వదల కున్నది, (అది యే మనఁగా,) (ఆశరములు) పువ్వు లో = పువ్వు లెట్లగును, ఊహ ఒనర్పఁగాన్=

ఆలోచించి చూడఁగా, (పువ్వులు గావు,) (మఱి యే మన,) పిడుగులో - కులిశంబులో = వజ్రాయుధములో; అట్ల = ఆ తెలిసినది (పిడుగులుం గులిశంబులుం గానిచో వానివంటివి అనఁగా వానిపనినే చేయునట్టివి), విష వల్లి సముద్భవములు ప్రసూనముల్ = విష లతలనుండి పుట్టువు గలవైన పువ్వులు.

తా.—మన్మథబాణములు పూవు లని చెప్పుదురు. పూవు లగునేని ఇవి మోహతాపములను ఎట్లు కలిగించును? కావున నివి పూవు లనుట సంశయాస్పదముగా నున్నది. పూవులు గావేని మఱి ఏ వగునో యని యూహింపఁగా పిడుగులో ఇంద్రునిచేతివజ్రాయుధములో అని తోఁచుచున్నది. అవి యైన మోహదాహములం జేయఁగలవు. కాని అవి వెంటనే మరణమునుంగూడ చేయును, అది జరుగ లేదు, కావున అవియునుం గావు. ఆ! ఆ! తెలిసినది, వెంటనే మరణముం గలిగింపక మోహదాహములను చేయుట విషకార్యము గాన నివి విషలతాపుష్పము లని సిద్ధాంతము.

ఇందు మోహతాపము లనెడి విషకార్యములం బట్టి విషపుష్పత్వము అనుమానింపఁబడినది కావున అనుమానాలంకారము.

‘ అనుమానము సాధ్యము సా। ధనమును మాత్రమె వచింపఁ; దనువున మంటల్
కనుఁగవ నశ్రులు వొడమెను। బనుపడె మదనానలంబు భామినిమేనన్.’ అలం.సా. సం.
(‘మాత్ర’ శబ్దముచే అవయవపంచకములో కడమ మూఁటినిం జెప్పఁగూడ దనుట.)

వ. (*a*) కావునం దీరంబు లేని విరహభార పారావారంబున మునుంగం బాఱుచున్న నాకుం దెప్పగా విరించి నిన్నుఁ గల్పించినాఁడు **(2-60)**. మిముబోంట్లగు పెద్దలగుణంబులు పరార్థప్రవణంబులు గదా **(2-61)**. పొమ్ము, గార్యమ్ము సాధింపుము; పునస్సమాగమం బయ్యెడు **(2-62)**. నీవు వచ్చునంతకు నిచ్చోటన యుండుదుం జుమీ. చూతముగదా నీగమనవేగం. బని పల్కి యన్నిడజంబు వీడుకొల్పి క్రీడావనంబులో నొక్కనికుంజ క్రోడంబు నీడ నన్నరేంద్రుండు చంద్రకాంత శిలాతలంబున విశ్రమించి, రాయంచ పలుకులు మనంబునం దలపోయుచుండె **(2-63)**.

—* హంస దమయంతి కడకు దూత్య మేఁగుట *—

(*b*) గలహంసంబును నలుని వీడ్కొని భూమండల మండనాయితం బైన కుండిన నగరంబున కభిముఖం బై **(2-64)**, ప్రార్థనాసిద్ధిసూచకంబులగు ననుకూల గంధవాహాది నానావిధ శుభ నిమిత్తంబు లనుసంధించుచు **(2-65)**, (*c*) నికష పాషాణ పట్ట నిభం బయిన నభస్స్థలంబునం దనపసిండి తెక్కలొరవెట్టు చందంబున నందంబుగా **(2-69)**, ఝాంకారిత పతత్త్రి ధారా విహారంబుగ గోడివడి డిగ్గునప్పు; డల దిగువ నున్న పతంగంబులు వడవడ వడంకుచు నెంటి కంటఁ గనుంగొన **(2-70)**, నొక్కొక్కమాఱు విధూత పక్షతియును నొక్కొక్కసారి యూర్ధ్వాయన దుర్విభావంబును, నొక్కొక్కమాటు

వితతీకృత నిశ్చల చ్ఛదగుచ్ఛంబును (2-68), నగుచు వనంబులు గడచి, శైలంబులు దాఁటి, నదులు లంఘించి (2-72), చనిచని ముందట. 35

(*a*) తీరంబు = దరి, విరహ భార పారావారంబునన్ = వియోగాతిరేక మనెడి సముద్రములో... (రూపకము) ... పర అర్థప్రవణంబులు=ఇతరుల ప్రయోజనమందు అధీనములు (ఇతరుల పనియే ముఖ్యముగా చూచుకొనునట్టి వనుట), [నీగుణంబు లని విశేష మభిప్రాయముగా మిముబోంట్లని సామాన్యమును చెప్పినందున అప్రస్తుతప్రశంస.] పునః సమాగమంబు = వెండియుం గూడిక - అయ్యెడున్ (మరల తనకడకు రావలసిన దని భా.) ... నీడజంబున్= (గూఁటిపుట్టువును) పక్షిని, వీడుకొల్పి = పంపి, నికుంజ క్రోడంబు నీడన్ = పొద నడిమి నీడలో ...

(*b*) వీడ్కొని = వదలి, ... భూమండల మండనాయితం బయిన = భూమీ వలయంబునకు నలంకారమువలె నొప్పినట్టి [' మండనాయిత ' మనునది ఉపమానమునకు ఆచారార్థకక్యఙ్ పై 'క్త' ప్రత్యయము తోడి రూపము; ఆం. భా. విరాటపర్వములోని 'భద్రాయిత'ము వలె నసమస్తము ; ఉపమ.] కుండిన – మని విదర్భరాజధాని పేరు, అభిముఖంబై = ఎదురై, ప్రార్థనా సిద్ధి సూచకంబులు=కోరికయొక్క యీడేఱుటకు గుర్తులైన, అనుకూల గంధవాహ ఆది = (గంధవాహ మనఁగా గాలి - అనుకూల మనఁగా పయన మేఁగువాఁడు పోవు దిక్కునకే వీచుచున్నట్టిది.) అట్టి గాలి లోనగు ... నిమిత్తంబులు = శకునములను (మూలములో నిండుకుండయు, పండ్లతో నిండిన తీయమామిడియు ననెడి శకునములు చెప్పఁబడినవి), అనుసంధించుచున్ = పరికించుకొనుచు;

(*c*) నికష పాషాణ పట్ట నిభంబు = ఒర గంటి పలక వంటిది - నభస్ స్థలంబునన్ = ఆకాశప్రదేశమందు (నిక...నన్' - ఉపమాలంకారము, ఒరగల్లు నలుపు, ఆకాశంబును నలుపు, దానిచే సామ్యము. 'నభస్స్థలంబున ... అందంబుగాన్' - ఉత్ప్రేక్షాలంకారము), ఝూంకారిత పతత్త్రి ధారా విహారంబుగాన్ = 'ఝూమ్' అను శబ్దము చేయింపఁబడిన ఱెక్కల యంచులయొక్క లీల గలుగునట్లుగా (ఱెక్కలకొనలచే లీలగా 'ఝూమ్' అని శబ్దము చేయించుచు), గోడిపడి = వంపై, ... పతంగంబులు = పక్షులు, ... విధూత పక్షతియున్ = జాడింపఁబడిన ఱెక్కల మొదళ్లు గలదియు,...ఊర్ధ్వ అయన దుర్విభావంబున్ = పైకి పోవుటచేత కానరానిదియు, విత ... బున్ - వితతీ కృత = విస్తృతములుగా చేయఁబడిన (చాఁపఁబడిన) - నిశ్చల = కదలని - ఛద = ఱెక్కలయొక్క - గుచ్ఛంబున్ = గుత్తికలదియు (గుత్తివలె ముణఁగియున్న ఱెక్కలను చాఁపిన దనుట), ... లంఘించి = దాఁటి, ... ('ఝూంకారిత' మొదలు 'అగుచు' వఱకు స్వభావోక్తి.)

## —* కుండినపుర వర్ణనము *—

ఉ. అండజరాజు గాంచె లవణాంబుధి వేష్టిత మేదినీ వధూ (2-73)
కుండల మండనం బయిన కుండినమున్ నిజ కీర్తి కల్పితా
ఖండల పట్టణ ప్రథిత ఖండనమున్ గ్రథకైశికేంద్ర దో
ర్దండ బలాభిగుప్తము నుదగ్ర హిరణ్మయ వప్ర దీప్తమున్. 36

అండజ రాజు = పక్షి విభుఁడు (హంస), లవణ అంబుధి వేష్టిత మేదినీ వధూ కుండల మండనంబు = ఉప్పు సముద్రముచే చుట్టుకొనఁబడిన భూమి యనెడు రమణియొక్క కమ్మ యనెడి యలంకారము, అయిన - కుండినమున్ = కుండినపురమును, నిజ కీర్తి కల్పిత అఖండల పట్టణ ప్రథితఖండనమున్ = తనదైన యశస్సుచేత చేయఁబడిన యింద్రుని పురముయొక్క ప్రసిద్ధియొక్క పరా

జయము కలదానిని, క్రథకైశిక ఇంద్ర దోః దండ బల అభి గుప్తముక్ = విదర్భదేశముయొక్క దొర (యయిన భీముని) యొక్క (దండ =) గుదియలవంటి (దోః =) బాహువులయొక్క శక్తిచేత అంతటను రక్షింపఁబడినదానిని, ఉదగ్ర హిరణ్మయ వప్ర దీప్తముక్ = ఎత్తయిన బంగారపుఁ బ్రాకారముచేత ప్రకాశించుచున్న దానిని, కాంచెక్.

హంస కుండినపురముం గాంచెను, సకల భూమండలమందలి పట్టణములలో నెల్ల ఆపట్టణము ఉత్కృష్ట మయినట్టిది; అది ఇంద్రనగరి యైన యమరావతికన్నను భోగభాగ్యములు గలదని ప్రసిద్ధము; దానిని విదర్భరాజు తనబాహు బలముచే ఏలుచుండెను; దాని చుట్టును ఉన్నత మయిన బంగారు ప్రాకారము వెలుంగు చుండెను.

'లవణాంబుధి వేష్టిత' అను విశేషణముచేత ద్వీపములతోఁ గూడిన సకల మహీమండల మని భా. క్రింది నూపురాద్యాభరణముగాఁ జెప్పక దేహమున కెల్ల ప్రధానమయిన ముఖమునకు శోభ గలిగించునట్టి కర్ణాభరణముగాఁ జెప్పుటచేత భూమిలోని పట్టణములలో నెల్ల మేలు బంతి యని భా. 'అమరావతీ' అనక 'ఆఖండలపట్టణ' అనుటచే దీని యేలిక ఆఖండలునికన్న గొప్పవాఁ డని భా. ఇహలోక పరలోకములలో దీనిని మించిన పురము లే దని భా. 'గుప్తముక్—దీప్తముక్' అనుటలో ఆపురమునకు (రక్షణము) గుప్తి అతని బాహు బలముచేతనే గాని ప్రాకారముచేతఁ గా దనియు, మఱి ప్రాకార మేల యన, బంగా రగుటచేత దీప్తికి (అలంకారార్థము) అనియు, భా. దోర్దండ మనెడి - బల = సేనచేత - అని యర్థము చెప్పు పక్షమున—

'సేనా పరిచ్ఛద స్తస్య ద్వయ మే వార్థ సాధనం
శాస్త్రే ష్వకుణ్ఠితా బుద్ధి ర్మౌర్వీ ధనుషి చాతతా.

అని కాళిదాసు చెప్పిన ప్రకారము, ఆరాజునకు పరివారార్థము దండును, విజయమునకు బాహువును ఉండె నని భా. 'అండజరాజు' అగుటచే పైనుండి పెక్కుపురములను ఒక్కమాఱే చూడఁగలవాఁడు గావున దీనిప్రాశస్త్యమును తారతమ్య పూర్వకముగా ప్రత్యక్షీకరించె నని భా. ఒకయంబుధి నే చెప్పినందున, కడమ యంబుధుల నడిమి భూభాగములు మిగిలి యుండలేదా? అవి దీనికన్న ప్రశస్తము లని భావమా? వాని కన్న నిది ప్రశస్తము కా దని భావమా?' అని శంక వలదు. సముద్రము ఒకటే, అది లవణసముద్రమే, అనుమతమునం జెప్పినమాట యిది :—

'ద్వీపా న్యష్టాద, శాత్ర క్షితి రపి నవభి ర్విస్తృతా స్వాఙ్గఖణ్డైః,
రేకోఽమ్భోధి ర్దిగన్తప్రసృమరసలిలః, ప్రాజ్య మేత త్స్వరాజ్యమ్,
తస్మి న్నప్యాజి కేళీ వ్యతికర విజయోపార్జితే వీరచర్యే
పర్యాప్తం మే న దాతు స్త దిద మితి ధియా వేధసే య శ్చుకోప.'

'మేదినీ ... కుండినముక్' - రూపకము. 'నిజ...ఖండనముక్' - సంబంధాతిశయోక్తి. ద్వితీయపాదమందు 'ండ' బాహుళ్యము వృత్త్యనుప్రాసము; 'డినముక్ ... డనముక్' — 'గుప్తముక్ ... దీప్తముక్' — అంత్యానుప్రాసములు.

వ. (a) అప్పట్టణంబున కరిగి, కనకగిరి వప్ర దీప్ర ప్రాకారంబు లగు ప్రాకారంబులవలనను (2-86), నారసాతల గంభీర సలిల సంచారరంబు లగు పరిఖాకూపారంబులవలనను, ప్రస్ఫుటస్ఫటికోపల విగ్రహంబు లగు గృహంబులవలనను, శశిభిత్తి విమల భిత్తి సముత్సేధంబు లగు సౌధంబులవలనను (2-74), (b) నిర్మదనీల

మణిచ్ఛాయా కల్పితాకాల కాలిక లగు చంద్రశాలికలవలనను (2-75), కేలీవిలోలబాలికా కుచ లికుచ ఘుసృణపంక కషాయితాంభః పూరంబు లగు కాసారంబుల వలనను (2-77), (c) ఘన ఘనాఘన ఘటా కఠోర ఘర్ఘర ధ్వాన గోధూమ ఘరట్టంబు లగు హట్టంబులవలనను (2-85), అనిల చల చ్చేలాంచల దండ తాడనా విహిత హేళిహయాళీ కాలనక్రియా దత్తానూరువిశ్రాంతు లగు ప్రాసాదవైజయంతులవలనను (2-80), (d) నవ వికచ వివిధ కుసుమ వాసనా పేటిక లగు లీలోద్యాన వాటికలవలనను, బటీర కర్పూర కస్తూరికా కుంకుమ సంకుమద హిమాంబు ప్రముఖ నిఖిల పరిమళ వస్తు విస్తార సార భోద్గార సముల్బణంబు లగు నాపణంబులవలనను, (e) భావ హావ విలాస విభ్ర మైక భాజనంబు లగు వనితా జనంబుల వలనను, జవ విజత మరుత్కు రంగంబు లగు తురంగంబులవలనను, అసమ సమర విజయ కారణంబు లగు వారణంబులవలనను నభిరామం బై యక్కలహంసంబునకుఁ గౌతుకం బాపాదించె. వెండియు. 37

(a) కనకగిరి దీప్ర ఆకారంబులు = మేరు పర్వతమువలె దీపించుచున్న స్వరూపము గలవి (ఉన్నతియందును దృఢత్వమందును హిరణ్మయత్వమందును దీప్రతయందును మేరుసామ్యము - ఉపమ), ఆ రసా ... వలన = (ఆరసాతల =) పాతాళమువఱకు (అవ్యయీభావసమాసము - ఆ = వఱకు) లోఁతగు నీటిప్రవాహము కలవయిన (పరిఖా =) కందకములనెడి (అకూపారంబుల వలనను =) సముద్రములవలనను (రూపకము), ప్రస్ఫుట స్ఫటిక ఉపల విగ్రహంబులు=ప్రవ్యక్తము లయిన స్వచ్ఛ శిలల(చేఁ జేయఁబడిన) స్వరూపము గలవి, ... శశి ... వలనను = చంద్రునియొక్క ఖండములవలె నిర్మలములయిన గోడలయొక్క యౌన్నత్యముగలవైన రాజ భవనములవలనను; [సుధ అనఁగా పాలగచ్చు-దానిచే చేయఁబడినదిగాన 'సౌధము'- 'భిత్తి'మును అనఁగా ఖండమును చెప్ప నేల యనఁగా కళంకపరిహారార్థమును పైమాపు లే కుండుటకును - 'సద్యఃకృత్త ద్విరద రదన చ్ఛేద గౌరస్య తస్య' అని కైలాసవర్ణనమందు కాళిదాసుండును, 'అభినవ కరిదన్త చ్ఛేద పాణ్డుః కపోలః' అని మదనపీడిత మాలతీ వర్ణనమందు భవభూతియు, చెప్పిన ఛేదంపు స్వారస్యముంబోలె నిచ్చటను గ్రహింపవలయును. ఇందులకు విస్తరము మన్ముద్రిత మేఘసందేశావతారికయందుం గనవచ్చును-శశిని భిత్తములు చేసిన నవి యెట్లు విమలములుగా నుండునో అట్లు విమలము లయిన యని యుపమానస్వరూపమును కల్పించుకొనుట యభిప్రాయ మయినందున అభూతోపమ - మత భేదమున ఉత్ప్రేక్ష.]

(b) ఇంద్ర...వలనను—ఇంద్రనీల మణి = ఇంద్రనీల రత్నములయొక్క - ఛాయా =కాంతులచేత-కల్పిత=రచింపఁబడిన - అకాల=(నిజ)కాలమునందు కానట్టి (వర్షాకాలమందుమాత్రమే అను కాలనియమము లేని) - కాలికలు = మేఘజాలములు కలవి - అగు - చంద్రశాలికలవలనను = పై మేడలవలనను (ఉత్ప్రేక్షాలంకారము), కేళీ ... వలనను=క్రీడాసక్తలయిన లేజవరాండ్ర (లికుచ=) గజనిమ్మపండ్లవంటి స్తనములయొక్క (ఉపమ) కుంకుమ పూఁతచేత నెఱుపు సేయఁబడిన (అంభః=) నీటియొక్క వెల్లి కలవి - అయిన - సరస్సులవలనను; నీరు తనగుణ మయిన యభాస్వరశుక్లమును విడిచి కుచఘుసృణముయొక్క కషాయగుణమును గ్రహించినందున తద్గుణాలంకారము:—

‘ స్వగుణము విడిచి యొకటి య । న్యగుణంబుం గొనినం దద్గుణాలంకృతి యగు;
మగువకు ముంగఱ యధరపు । జిగిచేతం బడసెఁ గెంపుసింగారంబున్.’   అలం. సా. సం.

(c) ఘన...వలనను=దట్టమయిన (ఘనాఘన=)వర్షించుచున్న మేఘములయొక్క (ఘటా=) సమూహములవలె కఠినమయిన ఘర్ఘరయనెడు ధ్వనులుకల గోధుమల తిరుగండ్లు గలవియయిన బజారులవలనను (వర్షించుచున్న మేఘముల మొత్తము ఆకాశమున ఎట్టి కఠిన ఘర్ఘర గర్జనము సేయుచుండునో అట్టి ఘర్ఘరశబ్దమును బజారులలో గోదుమలు విసరెడి తిరుగండ్లు సేయుచుండినవని భా. ఉపమాలంకారము), అనిల ... వలనను = గాలిచేత కదలుచున్న (చేల =) వస్త్రములయొక్క (అంచల =) కొనలనెడి కఱ్ఱలతో(చబుకులతో)కొట్టుటచేత చేయఁబడినదైన సూర్యుని (హయ=) గుఱ్ఱముల (ఆళీ=) సమూహముయొక్క తోలుటయను పనిచేత (దత్త =) ఇయ్యఁబడిన అనూరుని విశ్రాంతి కలవి యయిన రాజభవనములయొక్క జెండాలవలనను (రాజభవనములు అత్యున్నతములగుటచేత వాని జెండాల వస్త్రముల కొనలు గాలికి కదలి సూర్యుని తేరి గుఱ్ఱములకు కొరడాదెబ్బలుగా తగిలి వానిని తోలుచున్నవనియు, అందుచేత సారథియైన యనూరుఁడు ఆ గుఱ్ఱములను తోలెడిపనిని మాని విశ్రమించె నని యర్థము. ఆమేడలు అత్యంతోన్నతము లని భా.—లేని చేలాంచల దండతాడనాదిక సంబంధము చెప్పఁబడినందున సంబంధాతిశయోక్తి.

(d) నవ ... వలనను = నూతనముగా విరిసిన పలుదెఱంగుల పువ్వుల (వాసనా =) పరిమళము లనెడి (వాసనా =) పరిమళద్రవ్యములయొక్క పెట్టె లయిన (లీలా =) క్రీడార్థమయిన ఆరామముల వరుసలవలనను (రూపకాలంకారము), పటీర ... వలనను = చందనము కప్పురము కస్తురి కుంకుమపువ్వు పునుఁగు పన్నీరు మొదలుగాఁగల నానాసుగంధద్రవ్యముల విరివియొక్క పరిమళముయొక్క క్రక్కుడుచేత నుత్కటములైన యంగళ్లవలనను (అంగళ్లలో ఈచెప్పినవస్తువుల పరిమళములు గుమాయించుచున్న వనుట - ఇందు క్రక్కుడు అనునర్థముగల దైన యుద్గారశబ్దమును ప్రయోగించుట గ్రామ్యతాదోష జుష్టము గాదు, పైగా, గౌణార్థమందున్నందున అతి సుందరము.—

‘ నిష్ఠ్యూ తోద్గీర్ణ వాన్తాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్య కక్షాం విగాహతే.’   దండి.)

(e) భావ ... వలనను = (భావ హావ విలాస విభ్రమములకు లక్షణములు.—
‘ అతి నిర్వికార చేతో । గత వృత్తివిశేష మరయఁగా సత్త్వము; త
త్ప్రతిపాద్య క్రియ భావము । సతతాలంకార కారి చనుఁ దెలియంగన్.
భావమ యించుక వదన । వ్యావళిత వికాస మయిన హావము, శృంగా
రావిర్భావ నివాసము; । భ్రూవల్లీ మందచలనమున నెఱుఁగఁ దగున్.
బిట్టు నిజ ప్రియు నంగన । కట్టెదురం జూచి యంగకంబులమీఁదన్
బుట్టించిన యొయ్యారము । చిట్టాడుట యది విలాస చిహ్నం బరయన్.
కడుఁ గౌతుకాతిశయమునఁ । దొడవులుఁ బూఁతలును దప్పఁ దొడుగుటచేన
య్యొడు సంభ్రమంబు విభ్రమ । మడరుం బ్రియదర్శనాదులం దెల్లపుడున్.’ కా. చూ.)

భావ హావ విలాస విభ్రమము (లనెడి యీ శృంగారచేష్ట)లకు ముఖ్య స్థానము లయిన ... జవ ... వలనను = వేగముచే (వేగవిషయమందు) జయింపఁబడిన గాలియొక్క జింక కల దైన గుఱ్ఱములచేతను (గాలికి జింక వాహనము - ఆపురిగుఱ్ఱములు దానికన్న వడి గల వనుటచే వాయువే

గాతీతవేగము లని భా.—అతిశయోక్తి), అస... వలనను = సాటిలేని యుద్ధములలో గెలుపునకు సాధనము లయిన మదపుశేసుఁగులవలనను, అభిరామంబు = మనోహరము, ... కౌతుకంబు=వేడుకను, ఆపాదించెన్ = కలిగించెను. —ఈ వచనమందు బంగారు ప్రాకారము స్ఫాటికగృహములు ఇంద్రనీలమణి చంద్రశాలలు నిత్యాద్య సంభావ్యమాన విభూతియొక్క వర్ణనము ఉదాత్తాలంకారము.

'ఇతరాంగసత్యచరితము । తతబుద్ధిచరితము రెం డుదాత్తంబు లగున్.' అలం. సా. సం.

తే. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ దిరిగి యుండఁ, (2-95)
బరుల కేరికి గ్రహణ గోచరము గాక,
విషధ రాధీశ భాషిత విషమ భాష్య
ఫక్కికయుఁ బోలె నొప్పె నప్పట్టణంబు. 38

అప్పట్టణంబు, తన చుట్టును, పరిఖ = అగడ్త, గుడివోలెన్ = కుండలీకరణమువలె (పంక్తిలో అపఠనీయము లయిన యక్షరముల చుట్టును గీచి యుండెడి సున్నవలె), తిరిగి ఉండఁగా, పరులకున్ = వైరులకు (భాష్యకారులకన్న నితరులకు। అని కుండలి(గ్రంథపరము) ఏరికిన్, గ్రహణ గోచరము = పట్టుటకు (బోధచేసికొనుటకు అని కుండలి(గ్రంథపరము) విషయము, కాక, విష... బోలెన్= పాఁపరేనిచే (అనంతుని యవతారమయిన పతంజలిచేత) చెప్పఁబడిన దుర్బోధమయిన (గ్రంథ విశేషణము), భాష్యముయొక్క కుండలీగ్రంథమువలె, ఒప్పున్.

పతంజలి కృత మహాభాష్యమందు ఒక భాగమునకు ఫక్కిక యని పేరు. ఫక్కిక యనఁగా తత్త్వనిర్ణయార్థ మైన పూర్వపక్షము. ఆభాగము పతంజలిమునికిఁ దప్ప మఱి యెవ్వరికిని బోధపడదని వరరుచి దానిని కుండలించె నని ప్రసిద్ధి. వైరులకు పట్ట శక్యము గాని యాపురము ఇతరులకు బోధపడనట్టి భాష్య ఫక్కికవలెను, పురమునకు చుట్టు నున్న యగడ్త ఫక్కికచుట్టు నున్న కుండలమువలెను, ఉండెను. కుండలము ఎట్లు ఫక్కిక బోధపడ దని సూచించునో అట్లే పురము పట్ట శక్యము గాని దని పరిఖ సూచించును. 'కుండలము వ్రాఁత సంప్రదాయమును బట్టి సూచించును, పరిఖ యెట్లు సూచించు?' నందురేని తానే దాఁట రాని దగుటచేత. ఆనగరమునకు అట్టి దుస్తరపరిఖ కల దని భా.—ఉపమాలంకారము.

క. నెలపొడుపుల సురనది ని । ర్మలతర తదగార కుట్టిమ స్రవ దిందూ (2-89)
పల తుంది లావ యగుచుం । దెలి వొందుఁ బతివ్రతౌచితీ సంపత్తిన్. 39

సుర నది = వేల్పుటేఱు, నెలపొడుపులన్= చంద్రోదయ (సమయ) ములయందు, నిర్మల ...లావ — నిర్మలతర = తనకన్నను స్వచ్ఛ మయిన — తత్ = ఆకుండినపురముయొక్క - అగార = ఇండ్లయొక్క - కుట్టిమ = నెలకట్టులయందు (=తాతిచప్టానేలలయందు) - స్రవత్ = ఓడుచున్న - ఇందు ఉపల = చంద్ర(కాంత)శిలలచేత - తుందిల = ప్రవృద్ధములయిన - అప= నీరు గలది, అగుచున్, పతి... త్తిన్ - పతివ్రతా = పతివ్రతయొక్క - ఔచితీ = యోగ్యతయొక్క - సంపత్తిన్ = కలిమియందు, తెలివి = జ్ఞానమును (ధావళ్యమును), ఒందును.

'ఆర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా
మృతే మ్రియేత యా పత్యౌ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా.'

అని, పతివ్రతాలక్షణము. దానిం బట్టి భర్త హర్షముచే నుప్పొంగునప్పుడు పతివ్రత యగు భార్యయు అట్లే హర్షముచే నుప్పొంగవలయును. గంగ సముద్రుని భార్య. చంద్రోదయ సమయములయందు సముద్రుఁడు హర్షముచే నుప్పొంగును, చంద్రకాంతములు స్రవించును; కావున ఆసమయములయందు గంగ కుండినపురమందు చంద్రకాంత శిలామయము లయిన నెలకట్టులు స్రవించి పాఱిన జలము తనజలముకన్న స్వచ్ఛ మయినట్టిది తనయందు వచ్చి పడుటచేత తానును తన భర్త యయిన సముద్రునివలెనే ఉప్పొంగినదియు మునుపటికన్న నిర్మలతరంబును అయి, పతివ్రతాధర్మమును తా నిట్లు నిత్యము ఆచరింపవలసినది గదా యని తెలిసికొన్నది.

'తెలివి' - ధావళ్యము హర్షకార్యను. 'జ్ఞానముం బొందు' ననుట స్వయముగా పొంగ నందున. పట్టణము చంద్రకాంతశిలాజలమును పాఱించి పొంగించుట 'ఇఁక నైనం దెలివి దెచ్చుకో, ఈరీతిగా నెల పొడుపులయం దెల్ల నీభర్తవలె పొంగి పతివ్రత వనిపించుకొమ్ము.' అని మిన్నేటి కుపదేశించిన ట్లుండె నని భా.

మందాకినికన్న పట్టణము ఉన్నత మని యర్థము గావున సంబంధాతిశయోక్తి; పతివ్రతాధర్మమందు ఉపదేశము పొందిన ట్లున్న దని సంభావన గావున ఉత్ప్రేక్షాలంకారము; ఇందూపలము లనుటచేత ఉదాత్తాలంకారంబును.

'తెలి వొందు' - ఇత్వసంధులు ఈగ్రంథమందు ఇంకనుం గలవు; దీనిని శబ్దపల్లముగాఁ గొనఁదగును.

తే. క్రుంకఁ బాఱు సహస్రాంశుఁ గూడ లేక (2-90)
వెనుకఁ జిక్కిన జర దంశు వితతి వోలెఁ,
బొలుచు నపరాహ్ణవేళ నప్పురమునందు
భాసు రాలేప కాశ్మీర పణ్య వీథి. 40

అప్పురమునందుఁ, అపరాహ్ణవేళన్ = సాయంకాలములయందు, భాసు ... వీథి - భాసుర = ప్రకాశమాన మయిన - ఆలేప = మైపూఁతయొక్క - కాశ్మీర = కుంకుమపువ్వుయొక్క - పణ్య వీథి = అంగడి వీథి (బజాఱు), క్రుంకఁ బాఱు = వడి వడిగా క్రుంకుచున్న - సహస్ర అంశున్ = వేయికిరణముల వానిని, కూడ లేక = కలసికొని కూడఁ బోలేక, వెనుకన్, చిక్కిన = నిలిచిపోయిన - జర...వోలెన్ - జరత్ = ముది - అంశు = కిరణముల - వితతి వోలెన్ = సమూహము వలె, పొలుచున్ = ఒప్పును.

కుండినపురమందు సాయంకాలములందు మైపూఁత కుంకుమపు వ్యాప్తి బజాఱు ఎట్లు ఉండు ననఁగా, వడివడిగా క్రుంకి పోవుచున్న సూర్యునితోఁ బో లేక వెనుక దిగఁబడిన యాతని ముది కిరణముల సమూహమో యనున ట్లుండును.

ఉక్తవిశేషణవిశిష్ట సూర్యకిరణ సమూహముగా సంభావన గావున ఉత్ప్రేక్షాలంకారము. 'వేయికిరణములు గలవాఁ'డనునర్థముగల 'సహస్రాంశు' శబ్దముచేతను, 'ముసలి కిరణము' లనునర్థము గల 'జర దంశు' శబ్దముచేతను - పెక్కండ్రు పరిజనులతోడ పరాజయ మొంది పలాయమానుఁడై పోవుచున్న రేనితోడ కలసి పరుగెత్త లేక వెనుకఁ జిక్కినవారై, చీఁకటి పడిన నడవ లే మని, ఎక్కడనేని ఒకయూర ప్రొద్దు ఉండఁగానే నిలుచునట్టి, ముసలిపరిజనుల వృత్తాంతము సూర్యుని సాయంకాల కిరణములయందు స్ఫురించుటచేత సమాసోక్త్యలంకారంబునుం గలదు:—

'ప్రకృతపుఁ గృతి తల్లింగము । ప్రకృత విశేషణము సామ్య పాటవమున న
ప్రకృత వ్యవహారంబుం । బ్రకృతంబునఁ జూపఁగా సమాసోక్తి యగున్.
సకి యదె రాగముతో శశి । వికాసభృత మైంద్రి ముఖము వెసఁ జుంబించెన్.' అలం.

శా. వే దాభ్యాస విశేష పూత రస నావిర్భూత భూరి స్తవా (2-102)
సాద బ్రహ్మ ముఖౌఘ విఘ్నిత నవ స్వర్గ క్రియా కేళిచే
నాదిన్ గాధితనూజుచే సగము సేయంబడ్డ మిన్నేఱు ప్రా
సాద స్వచ్ఛ దుకూల కైతవమునం జాలంగ నొప్పుం బురిన్. 41

పురిన్ = ఆపట్టణమందు, వేదా...చేన్ - వేద = (నాలుగు) శ్రుతులయొక్కయు - అభ్యాస విశేష = అలవాటు పెంపుచేత - పూత = పవిత్రమయిన - రసనా = నాలుకలనుండి - ఆవిర్భూత = పొడమిన - భూరి = మిక్కుటమయిన - స్తవ = స్తోత్రములయొక్క (స్తోత్రములను) - ఆసాద = పొందుచున్న వైన (అనఁగా స్తవములు సేయుచున్న వైన) - బ్రహ్మ ముఖ ఓఘ = బ్రహ్మయొక్క నోరుల సమూహముచేత (నాలుగు నోరులచే ననుట) - విఘ్నిత = విఘ్నము కలదిగాఁ జేయఁబడిన - నవ స్వర్గ క్రియా కేళిచేన్ = నూతనమయిన స్వర్గ (త్రిశంకు స్వర్గ) సృష్టి యనెడు యాటకలవాఁ డైన (బ్రహ్మప్రార్థనచే నూతన స్వర్గసృష్టిని మానినట్టి యనుట), గాధి తనూజుచేన్ = గాధిరాజు కుమారుఁడయిన విశ్వామిత్రునిచేత, ఆదిన్=తొలుత (అనఁగా బ్రహ్మ అడ్డపడక ముందు), సగము, సేయంబడ్డ మిన్నేఱు = సృజింపఁబడిన స్వర్గంగ, ప్రా...నన్- ప్రాసాద = రాజభవనముయొక్క - స్వచ్ఛ=నిర్మలమయిన - దుకూల = తెల్లనివస్త్రమనెడి - కైతవమునన్ = మిషచేతను, చాలంగన్ = మిక్కిలి, ఒప్పును.

పూర్వము విశ్వామిత్రుఁడు తన తపోబలముచే త్రిశంకురాజును బొందితో స్వర్గమున కెక్కింపఁగా ఇంద్రుఁడు ఆరాజును క్రిందికి ద్రొబ్బెను. అంతట కోపగించి విశ్వామిత్రుఁడు ఆరాజుకై నూతన స్వర్గ సృష్టి నారంభించెను. అంతట బ్రహ్మ వచ్చి విశ్వామిత్రుని వేఁడుకొని ఆసృష్టిని మానిపించెను. - అను కథ నిట ననుసంధించుకొనవలయును.—అట్లు బ్రహ్మ వచ్చి మానిపించులోపల విశ్వామిత్రుఁడు చేసిన నూతనస్వర్గభాగములోని దైన మందాకినీ భాగమో యనునట్లు ఆపురిలో రాజభవనాగ్రమందలి దుకూలపతాక యొప్పుచున్నది. ప్రాసాదము ఆమందాకినీపథవ్యాప్త మని భా.

'విశేష' మే మన - నాలుగువేదములను ఒక్కమాటే నాలుగునోరులతో నిరంతరముం జెప్పుచుండుట. 'పూత'—పూతములు గావుననే తదుత్పన్న స్తవములు విఘ్నము కావింపఁ గలిగినవి. 'కేళి'—విశ్వామిత్రునికి ఆసృష్టి అత్యంతసుకర మనుట. 'బ్రహ్మ'—'అందఱు దేవత లుండఁగా, బ్రహ్మ పుట్టి యేమి మునిఁగినది? అతఁ డేల వచ్చి మాన్పవలయు?' అనిన, ఆయన పని సృష్టి, అది యన్యునిపా లయిన అతని బ్రహ్మత్వమునకే భంగము గదా, అందుచేత ఆయన వచ్చె ననుట. 'సగము'- పూర్ణమేని భూలోక పాతాళ లోకములకుం దిగవలదా? పతాక దిగదు గదా. 'దుకూల' మనుటచేతనే మందాకినీవర్ణ మయిన ధావళ్యము లభించుటం జేసి, 'స్వచ్ఛ' యనుటకన్న 'ఉల్లోల' యనుట మేలు. ఆపక్షమున అలల సామ్యము కూడ లభించును.—సాపహ్నవోత్ప్రేక్ష.

తే. అమరు హాటకమయ కవాటములతోడ (2-86)
గురుతరం బైన యప్పీటి కోట గవను,

కులిశ ధారకుఁ దప్పి ఱెక్కలును దాను
బయటఁ గొలు వున్న పసిఁడి కొండయును బోలె. 42

ఈపద్యమునకు అక్షరార్థము:—బంగారు ఱెక్కతలుపులతోడ మిగుల గొప్ప దైన యావీటి కోటగోపురము ఎట్లున్న దనఁగా, బంగారుకొండ తానును తన ఱెక్కలును వజ్రాయుధపు వాదరకు తప్పించుకొని వచ్చి ఇట బయట కొలు వున్న దో అనునట్లు ఉన్న ది:—ఇందు శంకితవ్యము మెండుగాఁ గలదు:—తలుపులుమాత్రము బంగార మైనచో 'పెద్దభార్య పతివ్రత' యను న్యాయంబున, 'గవను' బంగారము కా దని యర్థ మగును. ఆపక్షమందు దానికి పసిండికొండ సామ్య మెట్లు ఘటిల్లును? మఱియు, 'ఱెక్కలును' అనుటచేత నే 'కులిశ ధారకు తప్పి'న మాట తెలియు చుండఁగా, విశేషించి, 'కులిశధారా' ప్రస్తావము చేయ నేల? ఈకోట తనకన్న నున్నత మని మేరువు దీనిం గొలువ వచ్చిన దనుపక్షమున, ఇట మేరువునకు ఉపమేయ మేమి? గవనుమాత్రమె యనెడి పక్షమున, గవనుకన్న కోట యున్నత మని యేర్పడును. అట్లును ఉండునా! కోటనే మేరూన్నతముగా వర్ణించుట కవుల సంప్రదాయము. 'మేరూపమానా ద్వప్రస్య తత్తుల్య మహోన్నత్యం వ్యజ్యతే.' అని మాఘవ్యాఖ్యయందు మల్లినాథసూరి. కోట యంతయు బంగారుగా వర్ణించుట కవుల సంప్రదాయము.—

'మధ్యేసముద్రం కకుభః పిశఙ్గీ ర్యా కుర్వతీ కాఞ్చన వప్రభాసా
తురఙ్గ కాన్తా ముఖ హవ్యవాహ జ్వా లేవ భిత్త్వా జల ముల్లలాస.' మాఘము.

'శమనరిపు త్రిపురభి దో । ద్యమవ ద్దోర్వర్జ్య వలయిత స్వర్ణగిరి
భ్రమదం బై కాంచన వ । ప్రము దీప్రం బగుచు నప్పురంబున నొప్పున్.' ఆముక్త.

ఈగ్రంథమందే 36-వ పద్యమందును అనంతర గద్యమందును 'ఉదగ్ర హిరణ్మయ వప్ర దీప్తముకా' అనియు, 'కనకగిరి వప్ర దీప్ర ప్రాకారంబు లగు ప్రాకారంబులవలనను' అనియు, సామాన్యముగా వర్ణన యున్న ది. అది యీ విశేషవర్ణనయందు చప్పఁబడుట యొప్ప కున్న ది. మఱియు, ఏతన్మూల శ్లోకమందు కోట యంతయు బంగారముగాను ఱెక్కలును తలుపులును రత్నమయములుగాను వర్ణింపఁబడినవి.—

'వరణః కనకస్య మానినీం దివ మఙ్కా దమరాద్రి రాగతామ్
ఘన రత్న కవాట పక్షతిః పరిర భ్యానునయ న్నువాస యామ్.'

కావున, ఈపద్యమున శ్రీనాథుని రచన మిగుల మార్పు చెందిన దని యూహించి పద్యమును క్రింది యట్లు మార్చినాఁడ:—

'ఘన మణి కవాటములు గ్రాలుగవనుతోడ । హాటకమయం బయిన వీటికోట దనరుఁ
గులిశధారకుఁ దప్ప ఱెక్కలును దానుఁ । బయటఁ, గొలు వున్న మేరుపర్వతము వోలె.'

గొప్పవైన రత్నపుఁదలుపులు ప్రకాశించుచున్న గవను (పురద్వారము) కల దై యాపట్టణపు (హాటకమయంబు =) బంగారపుఁగోట, ఇంద్రునివజ్రాయుధపు దెబ్బను తప్పించుకొనుటకై, (మైనాకుఁడు సంద్రంబును శరణుఁ జొచ్చినట్లు), ఇంద్రుఁడు భీమునికి వెఱచి తన ఱెక్కలు నఱుకఁడు, తన్నుఁ గొట్టఁడు, అనెడి యాశతో, భీమరాజును శరణుఁ జొచ్చి అతనిం గొలుచుచు, మహాకాయత చేత పురిం జొర నేరక బయటనే ఱెక్కలతో నిలిచియున్న మేరువువలె నుండెను.— అని యర్థము.

ఈపక్షమున గవనును శిఖరవిశేషస్థానీయముగాఁ గొనవచ్చును. మఱి కొండను 'పసిఁడి' అని చెప్పినట్లే ఱెక్కలను 'రత్నము' లని చెప్పుట యుచితము. అటు లేనందున 'మేరుపర్వత మ'నుట మేలు.—ఉత్ప్రేక్షాలంకారము.

(మహాస్రగ్ధర.)

దమయంతీ కేళి ధాత్రీధర శిఖర హరి ద్రత్న భా దర్భ సందో (2-105)
హా మ జాం డాఘాత భగ్న స్యద భవ మద తావా ప్త ల జ్జావనమ్ర
త్వముమై నుత్తాన గామ ర్త్య సురభి వదన నాంతఃస్థ మై లీల నత్యా
ర్థము గోగ్రాస ప్రదాన వ్రత సుకృతము తోరంబుగా వీటి కిచ్చుఁ. 43

దమ ... హము = దమయంతియొక్క క్రీడా శైలముయొక్క శృంగముయొక్క - పచ్చ మణులయొక్క (భా =) కాంతియనెడు దర్భసమూహము, అజా ... మైక - అజ అండ = బ్రహ్మాండముయొక్క (అనఁగా - బ్రహ్మాండము నూర్ధ్వభాగముయొక్క) - ఆఘాత = దెబ్బ చేత - భగ్న = అణఁగిన - స్యద భవ మదతా = వేగమువలనఁ బుట్టిన గర్వము కలిమిచేత - అవాప్త = పొందఁబడిన - లజ్జా = సిగ్గుచేతనైన - అవనమ్రత్వము మైక = వంగుటచేత, ఉత్తాన ... ము — ఉత్తాన = వెదకిలఁబాటుగా - గ = చరించుచున్న - అమర్త్య = దేవతలయొక్క - సురభి = గోవుయొక్క - వదన = నోటి - అంతః = లోపల - స్థము = ఉన్నట్టిది, ఐ, లీలక = సులువుగా, అత్యర్థము = మహాప్రయోజనము గలుగునట్లుగా, తోరంబుగాక = విస్తారముగా, గోగ్రాస ప్రదాన వ్రత సుకృతంబుక = ఆవు మేఁతయొక్క యిచ్చుట యనెడి నోముయొక్క పుణ్యమును, వీటికిక = పట్టణమునకు, ఇచ్చుక.

ఆపురమందు ఇదొకవిశేషము; ఏమనఁగా, దమయంతికి క్రీడాశైల మున్నది గదా, దాని శిఖరము మరకతమయము, దాని కిరణసమూహము లనెడి దర్భమోవులు ఊర్ధ్వముఖముగా ప్రసరించును. వెలుఁగులు వ్యాపించుట మహావేగము గాన, ఇవియు మహావేగముగా వ్యాపించుటలో వీనితలలకు బ్రహ్మాండముయొక్క పైడిప్ప టకీ అని తగిలి, వీనివేగము భగ్నమై, వేగభంగమువలన వేగ గర్వము ఉడిగి లజ్జ పొడమఁగా, ఇవి తల వంచుకొనుటలో, అచట కామధేనువు ఆబ్రహ్మాండమునకు కాళ్లను తగిలించి వీఁపును మనవై పుంచి సంచరించుచుండఁగా దానినోటిలోపలఁ జొచ్చినవి. సామాన్య మయినయావునకు మేఁత యొసంగిననే మహాపుణ్యము, కామధేనువునకు నిత్యవ్రతముగా నొసంగిన నామహాపుణ్యమునకు మితిగలదా? కాన నట్టి యామహాపుణ్యమును ఆనగరమునకు ఆక్రీడా శైలము ఇచ్చుచున్నది. దర్భకు లజ్జ యేమి? అవాస్తవదర్భకు కామధేనువు తనియుట యెట్లు? దాని వలన పుణ్య మెట్లు? అనిన - అంశువులే దర్భ యై: దర్భకే లజ్జ యుండి అది తల వంచినచో దానిని మేసి కామధేనువు తనిసినచో నెంతటి మహాపుణ్యమో అంతటి మహాపుణ్యమువలన ఎంతభోగమో అంతటిభోగములో ఆయూరివా రున్నా రనుట.

గోగ్రాస సుకృతమును వీటి కిచ్చుట సంభావితము గాన ఉత్ప్రేక్ష, వాచకము లేనందున గమ్యోత్ప్రేక్ష. దానికి 'హరిద్రత్న భాదర్భ'యనుచో రూపకము అంగము. 'అజాండాఘాత సురభి వదన ప్రవే' శాదికము అసంబద్ధము గాన సంబంధాతిశయోక్తియు అంగము. మరకత శిఖరముం జెప్పుట యుదాత్తాలంకారము.—క్రీడాశైలశిఖరము మరకతమయ మని మేఘమందునుం గలదు.

'తస్యా స్తీరే రచితశిఖరః పేశలై రిన్ద్రనీలైః
క్రీడాశైలః కనకకదళీ వేష్టన ప్రేక్షణీయః.'

ఈ పద్యమునకు ప్రకారాంతము ఒకటి ఉపలబ్ధ మైనది:—

క. 'పురిఁ గ్రీడా శిఖరి శిఖా । మరకత మణి ఘృణు లజాండ మండలి దాఁకన్,
దరణి రథ హరులు దూర్వాం । కురశంకఁ గడంగ మేఁత గొన నూహించున్.'

వ. ఇట్టి విచిత్ర శోభా వైభవంబులకుం బట్టయినయప్పట్టణంబు గలయం గనుంగొని పతంగపుంగవుండు కన్యాంతఃపుర ప్రదేశంబున నొక్క శృంగారవనంబు లోన సఖీమధ్యంబునఁ దారకామధ్యంబున శీతాంశురేఖయుంబోలె నున్న యా రాజపుత్త్రిని వీక్షించి (2-107), యభ్రమండలంబుననుండి విభ్రమ భ్రమణ రయ వికీర్ణస్వర్ణమయ పర్ణపాళి చ్ఛాయా పటలంబు దిక్కులఁ బిక్కటిల్ల మెఱుంగు మెఱసిన చందంబునం గొఱవి ద్రిప్పినపోల్కి దమయంతీ వదన చంద్ర బింబంబు సేవింపం బనిపూనివచ్చు పరివేష చక్రంబు చాడ్పున వలయాకారంబున నవతరించుచు (2-108), నాకుంచితపక్షమూలంబును నివేశ దేశాతత ధూత పక్షంబునుం గా నక్షణంబ వ్రాలిన (3-1). 44

... పట్టు = చోటు, ... కలయన్ = అంతటను, పతంగపుంగవుండు = పక్షీంద్రుఁడు - హంస, ... తారకా = నక్షత్రముల, ...శీతాంశు రేఖయుం బోలెన్ = చలివెలుఁగు (చంద్ర) కళ వలె, ... అభ్ర మండలంబునుండి = ఆకాశ ప్రదేశమునుండి, ... విభ్రమ ... లంబు = విలాసముతోడి మండలగతియొక్క వేగముచే చాఁపఁబడిన బంగారువికార మయిన ఱెక్కల కొనలయొక్క కాంతి మొత్తము, ... మెఱుంగు = మెఱపుఁదీఁగ, ... వదన= ముఖ... పరివేష చక్రంబు చాడ్పునన్ = గాలిగుడి యనెడు వలయమువలె, ... అవతరించుచున్= దిగుచు, ఆకుంచిత పక్ష మూలంబును = ముడువఁబడిన ఱెక్కల మొదలు గలదియు, నివేశ ... బును=వ్రాలెడుచోట (ఆతత=) చాఁపఁబడినవై ఆడింపఁబడిన ఱెక్కలు గలదియు, అక్షణంబ = అకస్మికముగా.

పోలెన్' — 'చందంబునన్' — 'పోల్కిన్' అను వాచకంబులు గలిగిన వాక్యంబుల నుపమాలంకారము. 'వదన చంద్రబింబంబు' - రూపకము. 'సేవింప వచ్చు పరివేషచక్రంబు చాడ్పునన్' - తదంగక మగున యుత్ప్రేక్ష. 'వలయా ... నుంగా' — స్వభావోక్తి.

—* హంస దూత్యము. *—

ఉ. దుందుభి వాద్య నిస్వనముతోఁ దులఁదూఁగెడు పక్షనాద మం (3-2)
దంద యతర్కి తోపనత మై వినఁబడ్డ, విహారలీలలం
జెంది పరాకునన్ మెలఁగు చిత్తము లుద్దవిడిం గలంగఁగా,
నిందునిభాస్య లప్పుడు సమీక్షణ చేసిరి రాజహంసమున్. 45

అప్పుడు, ఇందు నిభ ఆస్యలు=చంద్ర తుల్య ముఖు లయిన యాదమయంత్యాదులు, దుందుభి వాద్య నిస్వనములోన్ = భేరీ వాద్య ధ్వనితో, తులఁ దూఁగెడు పక్షనాదము = సమ మయిన ఱెక్క చప్పుడు, అందంద = మఱిమఱి (చేరువకు వచ్చు కొలందియు అధికముగా), అతర్కిత ఉపనతము = ఊహింపఁబడనిదిగా (ఆకస్మికముగా) వచ్చినట్టిది, ఐ, వినఁబడ్డన్ = వినఁబడఁగా,

విహార లీలలన్ = కేళీ విలాసములయందు, చెంది = తగిలి, పరాకునన్ = తత్పరతచే, మెలఁగు చిత్తములు = వర్తిల్లుచున్న మనస్సులు, ఉద్దవిడిన్ = మిక్కిలి, కలంగఁగాన్ = కలఁత పడఁగా, రాజహంసమును, సమీక్షణ చేసిరి = చూచిరి.—ఆకస్మికముగా హంస వచ్చి చెంతను ఱెక్కలశబ్దము సేయఁగా, ఆటపరాకున నున్నట్టి యా చెలువలకు ఆకస్మికముగా చెవికడ భేరి వాయించినట్లు కాఁగా వారు కళవళపడి తిరిగి చూచి హంసం గాంచిరి.

'దుందుభి ... నాదము' — ఉపమ; అతర్కితోపనతతయు పరాకున మెలఁగుటయు కలంగుటకు కారణము గాన కావ్యలింగంబును; ఆకస్మికముగా ఏదేని స్ఫుటశబ్దము వినఁబడిన దిగులు వడుట స్వాభావికము గాన స్వభావోక్తియు.

వ. (*a*) అమ్మత్తకాశినులు దమచిత్తంబులు విముక్తతత్తద్విషయగ్రహంబులై యాహంసంబునందుఁ బరబ్రహ్మంబునందునుంబోలె వర్తించుచుండం జూచుచుండిరి **(3-3).** విదర్భరాజపట్టి తనమనంబునఁ బుట్టిన కౌతూహలంబున నమ్మరాళంబుఁ బట్టందలంచి యొయ్యయ్యన కదియ నేతెంచిన **(3-4),** నజ్జాలపాదంబును నబ్బాలతలం బెట్టెంగి మొగసియుం దప్పఁగ్రుంగియు దాఁటుకొనియుఁ దనమీఁద వాలు కేలుదోయియొడుపు దప్పించుకొనియెం **(3-5).** గాంచనపత్త్రిరథగ్రహణలీలావ్యవసాయంబు నిష్ఫలం బైనరాచూలిం జూచి చెలులు కలకలం జేసఱచి నగిరి **(3-6)**. (*b*)'హస్తతలతాళకోలాహలంబునం బులుఁగు బెదరించితిరి, దీన మీకు నేమిలాభం బయ్యె?' నని సఖీజనంబులం గనలి పలుకుచు **(3-7),** మార్తండు ననువర్తించు ఛాయాదేవియుంబోలె నత్తోయజాక్షి మానసౌకంబు వెనుకొని చనియె **(3-8)**. నన్నారీ నివహంబును మేలంపు మాటలకై వడి 'హంసగమన, హంసాభిముఖ యైన యాత్రఁ బెద్దలు నిషేధింతురు సుమీ.' యనుచు మందగతిం బిఱుందన యేతెంచె **(3-9)**. (*c*) నీడోద్భవంబును నచ్చేడియ మందగమన విలాసంబు పరిహాసంబునకై యనుకరించు నదియునుంబోలె ముందటం జరియించుచుం **(3-10),** జేయీఁక యీఁకలు ముడిఁగించుకొని యీఱం బైన యొక్కలతాగారంబు దూఱె **(3-11)**. నట్లు దూఱిన వెలరువాఱి చేయునది లేక నిషేధ జనిత రోష నిరుద్ధాశేష నిజ వయస్యయు నాత్మచ్ఛాయా ద్వితీయయుఁ బ్రస్వేదాంభః కణ విభూషి తాంగియు నిశ్వాస వేగ కంపిత స్తన భారయు నైయూరకుండె. నప్పు డయ్యండజంబు మనుష్యభాషణంబుల నయ్యండజయానతో నిట్లనియె **(3-12).**



(*a*) ఆ మత్తకాశినులు = ఆ హొయలుకత్తియలు,...విము...లై - విముక్త = విడువఁబడిన - తత్తత్ = ఆయా - విషయ = ఉపవనదర్శనీయ వస్తువులయొక్క - గ్రహంబులై = అవబోధము కలవై - బ్రహ్మపక్షమున - విషయ = స్రక్చందనాది భోగ్యవస్తువులయందు - గ్రహంబులై = ఆసక్తికలవై, పరబ్రహ్మంబునందుంబోలెన్ = పరమాత్మయందు ఎట్లో అట్లు, వర్తించుచుండన్ - ఏప్రకారము

యోగులచిత్తములు స్రక్చందనాది భోగ్యవస్తువుల మీఁది యాసంగమును మాని బ్రహ్మమందు వర్తించునో ఆప్రకారమే తమ చిత్తములు శృంగారవనములో దర్శనీయవస్తువులను గ్రహించుట మాని ఆహంసముపై నెలకొనఁగా, చూచుచుండిరి; [ఇంతవఱకు ఉపమాలంకారము]... పట్టి = బిడ్డ,... కౌతూహలంబునన్ = కోరికచే, ... మరాళంబున్ = హంసను, ... ఒయ్యనొయ్యన = మెల్లమెల్లఁగా, కదియన్ = చేర, ఏతెంచినన్ = రాఁగా, ... జాలపాదంబు = హంస (జాలము వంటి పాదములు గలది), ... కాంచన...ంబు = బంగారు పక్షియొక్క (పక్షిని) పట్టుట యను నాటయొక్క ప్రయత్నము, ... రాచూలిన్=రాజకుమారిని,... చే చఱచి=చప్పటలు గొట్టి,...

(b) హస్త తాళ కోలాహలంబునన్= చేతుల చప్పటల గొల్లుచేత, పులుఁగున్ = పక్షిని, ... కనలి = కోపగించి, మార్తండున్ = సూర్యుని, ... ఛాయాదేవియుం బోలెన్ = సూర్యుని భార్యవలె (తత్పరత్వముతో నని భా.) ... తోయజాక్షి = కమలనయన, ... మానస ఓకంబున్= హంసను (మానససరస్సు స్థానముగాఁ గలది గాన ఆపేరు), ['మార్తండు ... చనియె' - ఉపమాలంకారము.] నారీ నివహంబు = స్త్రీల సమూహము, మేలంపు మాటల కైవడిన్ = పరిహాసపు మాటల వలె, హంస గమన = ఓ యంచ యానా, హంస అభిముఖి = హంసనుగూర్చినట్టిది (సూర్యుని కెదురు అనియు), ... యాత్ర = పయనము, ...

'ప్రతిసూర్యం ప్రతిబుధం ప్రత్యఙ్గారక మేవ చ
అపి శక్రసమో రాజా హతసైన్యో నివర్తతే.'

అని జ్యోతిశ్శాస్త్రమందు సూర్యుని కెదు రయిన పయనము నిషేధింపఁబడియున్నది; శ్రమతాపములు తెలిసినవే. [హంస...నిషేధింతురు - శ్లేషాలంకారము.] ... పిఱుందన = వెనుకనే.

(c) నీడోద్భవంబును = పక్షియు, ...అచ్చేడియ = ఆ చెలువ(దమయంతి)యొక్క, ... ('మందగమన - చరియించుచు' - ఉత్ప్రేక్ష.) ... చే యీక = చేతి కందక ... ఈఱంబు = దట్టము (తమవృత్తాంతము చెలులకుం దెలియ కుండుటకు), ... లతా అగారంబు = తీఁగ యిల్లు (తీఁగల గుబురనుట) ...వెలరువాఱి = వెలవెలఁబోయి, నిషే...స్యయున్= తన్ను హంసవెంటఁ బో వల దన్నందువలనం గలిగిన కోపంబుచేత తన సఖుల నెల్ల తనవెంట రా వల దని నివారించినట్టిది యనుట, ... ఆత్మ చ్ఛాయా ద్వితీయ = తన నీడయే (లేక - కాంతియే) తోడుగాఁ గలది - (తో డెవ్వరును లేని దనుట), ప్ర ... గి = చెమట నీటి బొట్టులచే అలంకరింపఁబడిన యవయవములు కలది, ... నిశ్వాస...భార— ఊర్పుల వడిచేత కంపిల్లిన వలుద కుచములు కలది,...అండజంబు = పక్షి ... అండజయానతో = హంసగమనతో.

శా. కాంతా, శైశవచాపలంబున లతా కాంతార వీథిం బరి (3-15)
శ్రాంతిం బొందెద వేల? బేలవె? నను న్శక్యంబె పట్టంగ? నీ
వెంతే దవ్వుగ నేగుదెంచితి గదే యేలమ్మ నీబోటు లం (3-18)
తంతం జిక్కిరి. చిక్కకుండుదురె నీ వాక్షేపముల్ పల్కఁగన్. 47

కాంతా = ఓసుందరీ, శైశవ చాపలంబునన్ = బాల్య చపలత్వముచేత, లతా...థిన్- లతా = తీఁగలయొక్క =(తీఁగలచే)-కాంతార=చొరరానిదైన-వీథిన్=దారిలో, పరిశ్రాంతిన్= అలయికను, ... బేలవె = తెలియనిదానవా, ... ఎంతేని = ఎంతయు (విస్తార మనుట), దవ్వు

గన్ = దూరముగా, ఏఁగుదెంచితి గదే = వచ్చితివి గదవే, ఏల అమ్మ = ఎందుల కమ్మా, ... బోటులు = చెలులు, చిక్కిరి = వెనుకఁబడిరి, ... ఆక్షేపములు = నిందలు.

ఉ. ఆళియుఁ బోలె నిప్పుడు వనాళి యమార్గమునం జరించు ని (3-14)
న్నో లలితాంగి కా దనుచు నున్నది మంద సమీరణాంబునం
గ్రాలు ప్రవాళ మంజరులు గ్రమ కరంబుల విభ్రమంబు గా
బాల రసాల పుష్ప రస పాయి వనప్రియ కంఠ హుంకృతిన్. 43

ఓ లలితాంగి = ఓసుందరమూర్తీ, ఇప్పుడు, ఆళియుఁబోలెన్ = నీచెలి యనునట్లుగా, వన ఆళి = కానన రాజి, అ మార్గమునన్ = కాని దారియందు (తప్పు పనియందును), చరించు నిన్ను, మంద సమీరణంబునన్ = మెల్లని తెమ్మెరచేత, క్రాలు ప్రవాళ మంజరులు = చలించుచున్న చిగురు టెమ్మలు, క్రమ కరంబుల విభ్రమంబు = మనోహరమయిన చేతులయొక్క చలనము, కాన్ = కాఁగా, బాల ... కృతిన్ - బాల రసాల = లే మావియొక్క - పుష్ప రస = పూఁదేనెను - పాయి = త్రాగునట్టి - వనప్రియ = కోకిలయొక్క - కంఠ = కుత్తుకయనెడి - కంఠ = (తన) కుత్తుక యొక్క - హుంకృతిన్ = హుంకారముతో, కా దనుచు నున్నది = నిషేధించుచున్నది.

ఓ శోభనాంగీ కానిమార్గమునందు ఇట్లు చరించుచున్న - అనఁగా - కూడని పని చేయుచున్న - నిన్ను నీ చెలియుం బోలె ఈ వనతరుశ్రేణి వలదని వారించుచున్నది. లోకములో వారించువారు, చేతిని ఎత్తి కుడియెడమలకు కదలింతురు, కంఠములో హుంకారము సేయుదురు. అట్లే ఈ తరుశ్రేణికి గాలిచే కదలుచున్న చిగురుటెమ్మ నివారణ సూచక కంపమాన హస్తంబుగాను, క్రొమ్మావి పూఁదేనె త్రాగి మత్తెక్కిన కోకిలకూఁతె అట్టి హుంకారముగాను, ఉన్నవి.

సమీరణము 'మంద' మేల అన, వసంతర్తువు గాన; మంద మయిననే అటు జరిగిన టెమ్మ వడిగా మరల ఇటు వచ్చుచు మరల నటు జరుగుచు ప్రకృతోపమానతకు తగియుండును. 'క్రమ కరంబు' లేమి యన, ఆళివి గాన. 'పుష్పరసపానము' ఏల యన, దానిచే కంఠము ఖణీ లని మధురస్ఫుట మగును. పద్యములో 'రస'కు బదులుగా 'మధు' ఉండిన మెఱుఁగుగా నుండును. మూలములో కపోతహుంకారము చెప్పఁబడినది. అది పురుషహుంకారమునకు తగినయుపమాన మనియు, ఆళిహుంకారమునకు కోకిల రుతమే అంతకన్న సరి యనియు, తలఁచి, శ్రీనాథుఁ డిట్లు మార్చె నని తోఁచెడిని. కంఠమునకు మధుపానమువలన మాధుర్యము కలుగు నని ఈక్రిందిశ్లోకములవలన స్పష్టపడును.—

'రతిపతి ప్రహితేవ కృత క్రుధః ప్రియతమేషు వధూ రనునాయికాః మాఘము.
వకుళ పుష్ప రసాసవ పేశల ధ్వని రగా న్నిరగా న్మధుపావళిః.'

'మధురయా మధు బోధిత మాధవీ మధు సమృద్ధి సమేధిత మేధయా
మధుకరాఙ్గనయా ముహు రున్మద ధ్వనిభృతా నిభృతాక్షర ముజ్జగే.'

కోకిల మావిపూఁదేనెం ద్రాగుటకు ఋతుసంహారమున :—

'పుంస్కోకిల శ్చూతరసాసవేన మత్తః ప్రియాం చుమ్బతి రాగహృష్టః.'

'ఆళియుఁబోలె - ఉపమ, ఉత్ప్రేక్ష యొండె. 'మంద...విభ్రమంబుగా' - రూపకము. 'వనప్రియ కంఠ మనెడి నిజకంఠము' - అనుచో శ్లిష్టరూపకము.

సీ. నలినసంభవు సాహిణము వారువంబులు (3-16)
కులముసాములు మాకుఁ గువలయాక్షి,
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు (3-17)
భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁణి,
సత్యలోకము దాఁక సకలలోకంబులు (3-19)
నాటపట్టులు మాకు నబ్జవదన,
మధురాక్షరము లైన మామాటలు వినంగ (3-16)
నమృతాంధసులె యోగ్యు లనుపమాంగి,
తే. భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక (3-65)
సమదగజయాన సబ్రహ్మచారి మాకు,
వేద శాస్త్ర పురాణాది విద్య లెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు. 49

హంస తనయందు దమయంతికి అమోఘ మయిన నమ్మకము కలిగించుటకై పీఠిక వేయుచున్నది. —కువలయ అక్షి = కలువవంటి నేత్రములుగల యోదమయంతీ, నలిన సంభవు సాహిణము వారువంబులు = తామరచూలి (బ్రహ్మ) యొక్క తబేలాలోని గుఱ్ఱములు (అతనివాహనము లయిన హంసలు), మాకున్, కులముసాములు = వంశకర్తలు;—దీనిచే కులోత్కర్ష చెప్పఁబడినది.

పువ్వుఁబోఁణి=పువ్వువంటి (అంత కోమల మయిన) మేను గల యోదమయంతీ, చద...డ్లు= ఆకాశ గంగయొక్క పసిఁడి తామరల నాళములు; — దీనిచే ఉత్తమ ప్రకృతిత్వము చెప్పఁబడినది.

అబ్జ వదన = ఓ కమల ముఖీ (లేక చంద్ర ముఖీ - 'అబ్జో ధన్వన్తరౌ చన్ద్రే) శఙ్ఖే ఒబ్జం పద్మసంఖ్యయోః' హేమ.), సత్యలోకము దాఁకన్ = బ్రహ్మకు నివాస మయిన సత్యలోకము వఱకు, సకల లోకంబులున్=చతుర్దశ భువనములును ... ఆట పట్టులు=విహార స్థానములు;— దీని చేత ప్రభావము చెప్పఁబడినది.

అనుపమ అంగి = సాటిలేని మేను (లేక - అవయవములు) గలదానా ('అఙ్గం గాత్రాన్తి కోపాయ ప్రతీకే ష్వప్రధానకే' నానా.), మధుర అక్షరములు = తియ్యని యక్కరములు గలవి... అమృత అంధసులె =అమృతాహారు లైన దేవతలె ... మాటలు అమృతమువంటి వని హృదయము. వాగీశ్వరవాహనములు గావున వాక్పటిమ గలయవి యని యెఱుంగవలయును.

స మద గజయాన = మదపు టేనుఁగు నడకవంటి నడక గలదానా, భారతీదేవి = సరస్వతీ దేవియొక్క ... సబ్రహ్మచారి = సహాధ్యాయి, - వాణీశిష్యుల మని విద్యోత్కర్షం జెప్పుకొనుట; తరుణి=ఓ జవరాలా, నీ యాన = నామాట యబద్ధము కాకుండ నీవు ఏమి యొట్టు పెట్టినను సరియే, (ఆది శబ్దముచే చతుష్షష్టికళలు లో నగునవి గ్రాహ్యములు), ఘంటాపథంబు = రాజమార్గము.

**వ. ఒక్కనాఁడు విధాత వినోదార్థంబు వాహ్యాళి వెడలి మరలి వచ్చునప్పుడు మాకులస్వాము లైన యతని రథరథ్యంబులు శ్రమంబునన్ డీలుపడి యున్నం**

జూచి యేను విమానదండంబు కంఠంబున ధరియించి విరించిచేతం బారితోషికంబు వడసితి (౩-౧౯). నేను దివ్యతిర్యగ్జాతిని; మముబోంట్లు పాశాదికంబులం గట్టువడుదురే, గుణపాశంబులం గాక? భూలోకంబునందు రాజబృందారకులు కొందఱు గలరు, వారితోఁ జెలికారంబు వాటించి యుండుదు, విశేషించి యందు నిషధదేశాధీశ్వరుం డగు నలుం డను రాజుమీఁద మిగులం బక్షపాతంబు గలిగి యుందు (౩-౨౦). 50

విధాత = బ్రహ్మ, వాహ్యాళి = స్వారి, రథ రథ్యంబులు = తేరి వాహనములు,...డీలు పడి=అలసి,... విమాన దండంబు = ఆకాశయానముయొక్క కాఁడిని,... విరించిచేతన్=బ్రహ్మ చేత,...పారితోషికంబు = బహుమానము,... దివ్య తిర్యక్ జాతిని = స్వర్గసంబంధి యైన తిర్యగ్జంతువను (కడుపును నేలవైపు ఉంచుకొని చరించు పశు పక్ష్యాదులకు తిర్యగ్జంతువు లని వ్యవహారము),...పాశ ఆదికంబులన్=త్రాళ్లు లోనగువానిచే,... గుణపాశంబులం గాని=సుగుణము లనెడి త్రాళ్లచేతనే గాని, రాజ బృందారకులు = నృప ముఖ్యులు (సుందరు లైన రాజు లని యేని చెప్పవచ్చును - 'బృన్దారకా రూపి ముఖ్యౌ' అమ.),... చెలికారంబు = స్నేహము,...

తే. కనకశైలంబు డిగ్గి యాకాశ సింధు (౩-౨౨)
సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారు హాటకమయ గరుచ్చామరముల
వీతు నతనికి వైశాఖ వేళలందు. 51

కనక శైలంబు = (తన నివాస మయిన స్వర్గము మేరువునం దుండుటచేత) మేరుపర్వతము నుండి, డిగ్గి = దిగి, ఆకాశ సింధు సలిలములన్ = మిన్నేటి జలములలో, తోఁగి = తడిసి, ... చారు ...ములన్ = అంద మయిన బంగారపు (గరుత్ =) ఱెక్కలనెడి వింజామరలలో, వైశాఖ వేళలందున్=వైశాఖ (మాస) కాలములయందు (వేంద్రపు దినములయందు), వీతున్ = విసరుదును.

దీనిమూలములో 'స్మర కేళి కాలము' చెప్పఁబడినది, అది యీ పెండ్లిరాయబారమందు విరసమని శ్రీనాథుఁడు 'వైశాఖవేళ'గా మార్చినాఁ డని తోఁచుచున్నది. 'ఆకాశ...చల్లనైన'— అతనికి సుఖము గలిగించుటకై పూనికతో ఆవిధముగా చలువ గలిగించుకొని యని భా. 'చారు' - అని తన ఱెక్కలను తానే పొగడుకొనుట అనుచితము గాదా యనిన, వానిని చక్కఁగా విప్పి చామర క్రియకై నలమనోరంజనార్థము మహారాజోపయోగార్హ తార్థము చారువులనుగాఁ జేసి కొని, యని భా.

ఈ వృత్తాంతము మిథ్య యని గతకథాంశమువలన స్పష్టము. ఇట్లు బొంకుట ఉచితమా యనిన.—

'వారిజాక్షులందు వైవాహికములందుఁ । బ్రాణ విత్త మాన భంగమందుఁ
జటుల గోకు లాగ్రజన్మ రక్షణమందుఁ । బొంకవచ్చు; నఘము పొంద దధిప.'

'న ధర్మయుక్తం వచనం హినస్తి । న స్త్రీషు రాజన్ న వివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారేఽప ఞ్చానృతా న్యాహు రపాతకాని.' మహాభారతము.

మ. రణకండూ భర దుస్సహం బయిన యా రాజన్య దేవేంద్రు ద (3-39)
క్షిణ బాహాగ్రమునన్ జనించిన మహాకీర్తిప్రవాహంబు గా
రణ సంక్రాంత గుణానుషంగముననో ప్రస్ఫీత దిఙ్మత్త వా
రణ గండస్థల కుంభ కూలములతో రాయుం దివారాత్రముల్. 52

రణ...ంబు — రణ = యుద్ధంపు - కండూ = దురదయొక్క - భర=పెంపుచేత - దుస్సహంబు= సహింపరానిది (యుద్ధముకొఱకు తీఁటగొని యున్నట్టిది), అయిన, ఆ...నన్ = క్షత్త్రియ శ్రేష్ఠుఁడయిన ('మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్త్రియో విరాట్' అమ.) ఆ నలమహారాజుయొక్క కుడిభుజము తుదయందు, ... కీర్త్తి = జయఖ్యాతి యనెడి - ప్రవాహంబు=ఏఱు,... కారణ...ననో — కారణ = తనకు కారణ మయిన యా బాహువునుండి - సంక్రాంత = తనయందు చేరిన -గుణ=ఆ దురదగుణముయొక్క - అనుషంగమున నో= సంబంధముచేత నేమో, దివా రాత్రముల్ =రేయుం బవలు, ప్ర...తోన్—ప్రస్ఫీత=మిక్కిలి బలిసిన (గొప్ప - 'కుంభ' విశేషణము)— దిక్ మత్త వారణ=దిక్కుల మద గజములయొక్క - కుంభ=కుంభస్థలము లనెడి - కూలములతోన్ = గట్టులతో, రాయున్ = ఒరసికొనును.—ఆతని జయకీర్తి దిగంతములకు వ్యాపించిన దని భా.

యుద్ధములకై దురదగొను చున్న యా మహారాజుయొక్క కుడిభుజము తుదినుండి పుట్టిన మహాకీర్తియేఱు తనకారణ మయిన బాహువుయొక్కయాదురద తనకు సంక్రమించుటచేతనో యన దురద తీర్చుకొనుటకుం బోలె రేయుం బవలు దిగ్గజకుంభస్థలము లనెడి గట్టులతో ఒరసికొనుచున్నది. 'కారణగుణాః కార్యే సంక్రామన్తి' 'కారణముయొక్క గుణములు కార్యమునకు సంక్రమించును' అని న్యాయము. నిండినయేఱులు గట్లను ఒరసికొనుచు ప్రవహించుట ప్రత్యక్షము. దురదను పోఁగొట్టుకొనుటకు దున్నలు లోనగుజంతువులు బండలకును గట్లకును దేహమును రాసికొనుట ప్రసిద్ధమే. 'దివారాత్రములు' అనుటచేత సదా ఆకీర్త్తిని అచటివారు చెప్పుకొందు రని భా.—

ఇందు కీర్త్తిప్రవాహము గాను దిగ్గజకుంభములు కూలములు గాను రూపకము నిబద్ధము. కీర్త్తి ఒరసికొనుటకు నిమిత్తముగా తత్కారణ రణకండూల బాహు సంక్రాంత కండూతి ఉత్ప్రేక్షింపఁ బడినది. ఇందుల మూలము:—

'యశో య దస్యాజని సంయుగేషు కణ్డూల భావం భజతా భుజేన
హేతో ర్గుణా దేవ దిగాపగాళీ కూలఙ్కషత్వ వ్యసనం తదీయమ్.'

మూలములో, కీర్త్తియందు ప్రవాహారోపము లేదు, దిగ్గజప్రస్తావము లేదు, తత్కుంభములకు బదులుగా దిక్కు లనెడి నదుల సమూహముయొక్క గట్లు చెప్పఁబడియున్నవి. అంతకన్న ఈ పద్యము సుబద్ధము.

తే. అతని బాహా పరాక్రమం బభినుతింప, (3-38)
నలవియే పద్మజున కైన నబ్జవదన!
శాత తద్బాణ ధారా భుజంగ భుక్తి
వైరి రాజ వ్రజీ యాను మారుతంబు. 55

అబ్జ వదన = ఓ కమల ముఖీ (లేక - చంద్ర ముఖీ), పద్మజున కైనన్ = బ్రహ్మ కైనను, అతని - బాహా పరాక్రమంబు = భుజ శౌర్యమును, అభినుతింపన్ = పొగడుటకు, అలవియే =

శక్యమా ? వైరి ... ంబు — వైరి రాజ వ్రజీయ = శత్రు రాజ సమూహసంబంధులైన - అసు = ప్రాణనామక మయిన - మారుతంబు = వాయువు, శాత ... భుక్తి — శాత = వాఁడియైన - తత్ = అతని - బాణ = అమ్ములయొక్క - ధారా = వాదర లనెడి - భుజంగ = పాములకు — భుక్తి = ఆహారము (పామునకు వాయు వాహారము, వాయువును పాములు మాపినట్లు ఇతని బాణములు వైరులప్రాణమును మాపును, అని భా.)—రూపకాలంకారము.

చ. వినుకలిఁ గూర్మిఁ జిక్కి పృథివీ భువనంబునకుం డిగంగ నే (3-26)
యనువును లేక రంభ యను నచ్చరలేమ నలుఁ వరింపఁ బూ
నిన తన కోర్కి యొక్కయెయి నిండఁగఁ జేయుటకై భజించెఁ దాఁ
గొనకొని వేల్పులందు నలకూబరుఁ దచ్ఛుభ నామ వాసనన్. 54

రంభ అను - అచ్చర లేమ = అప్సరో వనిత, వినుకలిన్ = వినికిచేత, కూర్మిన్ = అనురాగమందు, చిక్కి = తగులుకొన్నదై, పృథివీ భువనంబునకున్ = భూ లోకమునకు, డిగంగన్ =దిగుటకు, ఏ అనువున్ = ఏ యుపాయమును, లేక, నలున్, వరింపఁ బూనిన (= పొంద నుద్యమించిన)- తనకోర్కిన్, ఒక్కయెయిన్ = ఒకవిధముగా, నిండఁగఁజేయుటకై = తీర్చుకొనుటకై, తాను, కొనకొని = యత్నించి, వేల్పులందున్ = దేవతలయందు, తత్ శుభ నామ వాసనన్ = నల యనియెడు నామంగళ నామధేయ సంబంధముచేత, నలకూబరున్ = కుబేరపుత్త్రుని నలకూబరుఁ డనువానిని, భజించెన్ = ఆశ్రయించెను.

రంభ యనియెడియప్సరసకు నలమహారాజుగుణములు వినఁగా ఆయనపై మరులు కలిగినది; కాని దానిం దీర్చుకొనుటకై స్వర్గమును వదలి భూలోకమునకు వచ్చుటకు సాకు ఏమియు కలుగ దాయెను. అంత రంభ నలునిఁగాకపోయిన ఆ శోభననామధేయముతో సంబంధము కలవానిని నలకూబరుఁ డనియెడి దేవకుమారుని వరించి నలునిమీది తనకోరకను కొంచెము తీర్చుకొనెను. 'నారీషు రమ్భా పురుషేషు విష్ణుః' అను వచనంబున సర్వయోషిన్మతల్లిక యయిన రంభసయితము వలవఁగా కడమ వనితలమాట చెప్పవలయునా? అని నలుని సౌందర్యాతిశయమును తెలుపుట.

రంభ। నలకూబరు వరించుటకు నలానురక్తి కారణము గాదు, అది యిట కారణముగా సంభావింపఁబడినది, గాన, నుత్ప్రేక్ష; వాచకము లేనందున గమ్య.

వ. ఆరాజుకడం జనవు గలిగి వర్తింతు. మఱియును. 55

మ. స్మర వాత్స్యాయన కూచిమార కృత శాస్త్రగ్రంథ సందర్భముల్ (3-42)
పరిశీలించినవాఁడ; దంపతుల కుత్పాదింతు సారస్యముల్;
మురిపం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు న్మేదినీ (3-41)
శ్వర శుద్ధాంత నితంబినీ జనులకున్ సంపూర్ణచంద్రాననా. 56

సంపూర్ణ చంద్రననా = నిండు చందురునివంటి మొమ్ముగల యో దమయంతీ, (నేను), స్మర ... వాఁడన్ = మన్మథుఁడు వాత్స్యాయనముని కూచిమారుఁడు అనువారు రచించిన (కామ) శాస్త్రగ్రంథముల మర్మములను నేర్చినవాఁడను, దంపతులకున్ = భార్యాభర్తలకు, సారస్యముల్ = సరసత్వములను, ఉత్పాదింతున్ = కలిగింతును, మేదినీ ... లకున్ = ఆరాజు

యొక్క రాణీవాసపు (నితంబినీ = అందమయిన పిఱుందులు గల) కాంతల సమూహమునకు, మరి పంబు = నడకకులుకు, ఒప్పంగన్ = శోభిల్లునట్లుగా, మందమంద గమనంబుల్ = మెలమెల్లని నడకలను, నేర్పుదును.

ఇది కూర్మిచే ఆరాజునకు నాచేయునుపకృతి; నీకును అట్టి యుపదేశాదికము సేయఁగల వాఁడను జుమా, యని హెచ్చరిక. మఱియు,

'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ...
ధవళ కుసుమ వాసో వల్లభా పద్మినీ స్యాత్.'

అనుటచేత స్త్రీలకు రాజహంసీగమనము ప్రశస్తంబును పద్మినీసముచితంబును గాన నిట్లు ఉపప్రలోభించుట; తనకు నలునియంతఃపురమందు అనివారిత ప్రవేశ మని తనచనువుం జెప్పుకొనుటయు.

వ. (*a*) భామినీజనంబులకు భావభవ నవ్యాజ్ఞా విశ్వాస ముద్రా నిక్షేప భూమి నై యుండుదు; నన్నుఁ దిర్యగ్జాతి మాత్రంబుగాఁ దలంపవలదు **(3-43)**. విరించి వదన కమల వినిర్గత వివిధ శాస్త్ర వాసనా పూర్ణ కర్ణుండ నైన యేను సామాన్యుండనే **(3-44)**. (*b*) నన్నుం బనిగొమ్ము; ఈశరీరంబు పరోపకారార్థము గదా; పద్మాసనుని శిల్పప్రయాసంబు లక్ష్మీనారాయణులయెడలను గౌరీ వృషభాంకుల పట్టునను బోలె మీయెడఁ బరస్పర యోగ్య సమాగమంబునకుం బొల్పడుం గాక. వేలాతిగ కాంత కాంతా గుణాబ్ధి వేణి వగు నీవు నలుని పాణి పల్లవంబు పరిగ్రహింప నర్హురాలవు. కోమలం బగుమల్లికా ముకుళ దామంబు గర్కశం బగు కుశసూత్రంబునం గట్టఁ బాత్రంబు గాని తెఱంగున నిషధరాజుఁ దక్క వేఱొక్కండు నిన్ను వరియింపం బాత్రుండు గాఁడు **(3-49)**. మఱియు నొక్కవిశేషంబు. 57

(*a*) భామినీ జనంబులకున్ = వనితా నివహములకు, భావ ... నై - భావభవ=మన్మథుని యొక్క - నవ్య = నూతన మయిన - ఆజ్ఞా = ఉత్తరువుయొక్క (అనఁగా నూతన స్మర కేళీ వృత్తాంతమును) - విశ్వాస = (రహస్యము బయటఁ బోదను) నమ్మిక మనెడి - ముద్రా = సీకా తోడి - నిక్షేప = దాఁచుకొనుటకు - భూమి నై = ప్రదేశమనై, యుండుదును (రాణివాస స్త్రీలకు నాయెడం గడు నమ్మికము, వారు తమ తమ క్రొత్త క్రొత్త కామకేళీవృత్తాంతములను నాతోఁ జెప్పుకొందురు అనుట); నన్ను, తిర్యగ్జాతి మాత్రంబుగాన్=సామాన్య మయిన తిర్యక్కుగా (పక్షినిగా), ... విరించి...కర్ణుండను=బ్రహ్మయొక్క ముఖ తామరసమునుండి వెలువడిన నానా శాస్త్రముల సంస్కారముతో నిండిన చెవులుగలవాఁడను, ...

(*b*) పద్మాసనుని శిల్ప ప్రయాసంబు = బ్రహ్మదేవుని సృష్టి శ్రమ (ఇట్టి సుందరులను మిమ్మిరువురం జేసిన శ్రమ యనుట)...గౌరీ వృషభాంకుల పట్టునను = పార్వతీ పరమేశ్వరుల యెడలను,...పరస్పర యోగ్య సమాగమంబునకున్= ఒండొరులకుం దగిన కూటమికి, పొలుపడుంగాక= సన్నద్ధము కావుత (ఇంత కష్టపడి లోకోత్తరగుణవంతుల మి మ్మిరువురం జేసిన బ్రహ్మ మిమ్ము

దంపతులంగా కూర్చుంగాక); వేలా ... వేణివి - వేలా = గట్టును - అతిగ = దాఁటిన - (హద్దు లేని) - కాంత = మనోహరము లైన - కాంతా = వధువుయొక్క - గుణ = గుణములయొక్క - అబ్ధి = సముద్రముయొక్క - వేణివి = ప్రవాహమవు, ... మల్లికా ముకుళ దామంబు = మల్లె మొగ్గల దండను, కర్కశంబు = కఠినము, ... కుశసూత్రంబునన్ = దర్భత్రాటితో, ... పాత్రంబు = అర్హము, ... తెఱంగునన్ = విధమున, ...

'భామినీ ... యుండుదు' - నలునియింట నెల్లవారికిని పరమాప్తుండ ననుట. 'నన్ను ... డనే' - నీకోరునెట్టికార్యమైనను నెఱవేర్ప సమర్థుండ ననుట. 'నన్నుం ... గదా' - నీకోరిక నెఱవేర్ప సిద్ధముగా నున్నా ననుట. లక్ష్మీనారాయణ గౌరీవృషభాం కోపమలచేత నీవును అట్టియన్యోన్యానురక్తితో నలునితో నేకశరీర వై యుండువుగాక యనుట.

'విరిం ... డను'—అసామాన్యతా హేతువు గాన ప. హే. కావ్యలింగము; 'ర్ణ - ర్ణ' - ఛేకానుప్రాసము. 'లక్ష్మి ... గాక'—ఉపమ; 'వేలా...వేణివి' రూపకము; 'కోమ ... గాఁడు' —ఉపమ. 'కాంత కాంతా' - ఛేకానుప్రాము.

మీదాంపత్యము తగియుండుటయేగాక బ్రహ్మనిర్ణయము కూడ నని చెప్పుచున్నది:—

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసను తేరికి వారువంబ నై (3-50)
నడుచుచు 'నుర్విలో నిషధ నాథుని కెవ్వతె యొక్కో భార్య య
య్యెడు?' నని; చక్రఘోషమున నించుకయించుక గాని, యంత యే
ర్పడ విన నైతి; నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ. 58

మానినీ=ఓధీరోదాత్తురాలా, ఒక్కనాఁడు, కమ...బ నై = బ్రహ్మ విమానమునకు గుఱ్ఱమను (వాహనమను) అయి- అనఁగా - బ్రహ్మదేవుని విమానమును వహించి, నడచుచున్, అడిగితిన్ = ప్రశ్న చేసితిని; ఆప్రశ్న 'ఉర్విలో ... య్యెడున్ ?' అనునది ; చక్ర...దోఁచెన్ = అందులకాయన చెప్పిన యుత్తరము చక్రఘోషచే చక్కఁగా వినఁబడలేదు. వినఁబడ్డ కొంచెకొంచెముంబట్టి యూహింపఁగా నిన్నే ఆయన పేర్కొన్నట్లు తోఁచినది.—[కొందఱు నిరవలంబ మయిన యాకాశమందు బండికండ్లకు ఘోష యెక్కడిది యని, 'భీమసేనుఁ' డనుటకు 'భీముఁ' డన్నట్లు 'చక్రాంగ' మనుటకు 'చక్ర' మని లఘునామముగా గ్రహించి, చక్రఘోష మనఁగా చక్రాంగములయొక్క - అనఁగా విమానమును లాగుచున్న యితర హంసలయొక్క - రొదలో అని, యర్థము చెప్పుదురు.]

ఈ హంసోపన్యాసము ఆమెకు పిత్రాది ప్రయత్నముచేత సయితము ఎడలని నలైకానురక్తిం గల్పించుటకు.

ఉ. నిర్ణయ మాన్నృపాలునకు నీకును సంగతి; యెల్లి నేఁటిలోఁ (3-51)
దూర్ణము సేయఁగాఁ గలఁడు తోయజసూతి; తదన్యథా వృథా
దుర్ణయ వృత్తికిన్ మనసు దూర్చినయేని, జగజ్జనాపవా
దార్ణవ ముత్తరించుటకు నాతని కెయ్యది దెప్ప చెప్పుమా ? 59

...సంగతి = కూటమి, నిర్ణయము = నిశ్చితము, (ఎల్లి = రేపు) - ఎల్లిన్ నేఁటిలోన్ = నేఁడో రేపో - త్వరగానే అనుట, తోయజ సూతి=కమల భవుఁడు - బ్రహ్మ, తూర్ణ ము సేయఁగాఁ గలఁడు = (మీకూటమిని) త్వరపఱుచును; (అతఁడు), తద...కిన్ - తత్ - మీకూటమికన్న -

అన్యథా = వేఱువిధమైన - వృథా = వ్యర్థమైన - దుర్ణయవృత్తికిన్ = చెడునీతివర్తనకు, మన... యేని = పాలుపడె నేని (మిమ్ముఁ గూర్పక పోయె నేని యనుట), జగ...ము - జగత్ = లోకముల యందలి - జన=జనులయొక్క - అపవాద=నిందయనెడి - అర్ణవము = సముద్రమును, ఉత్తరింపన్= దాఁటుటకు, ... (ఏవిధమునను ఆ నిందను తప్పించుకోలేఁడని భా. కావున తప్పక మిమ్ముం గూర్చునని హృదయము.)

'జగ...తెప్ప' - రూపకాలంకారము; పద్యమున పూర్వార్ధోక్తమునకు ఉత్తరార్ధోక్తము హేతువు గాన వాక్యార్థహేతుక కావ్యలింగ మలంకారము; దానికి పైరూపక మంగము.

వ. అనిన విని ముహూర్తమాత్రంబు చింతించి యాయింతి శకుంతవల్లభున కిట్లనియె (3-54). 60

ముహూర్త మాత్రంబు = ఇంచుక సేపు (అని లక్ష్యార్థము, పండ్రెండు క్షణములు = ఒకముహూర్తము), చింతించి=ఆలోచించి, శకుంత వల్లభునకున్=పక్షీంద్రుఁడయిన యాహంసకు.

తే. బాల్యమునఁ జేసి యేను జాపలముఁ బూని (3-55)
నిన్ను నాయాసపెట్టితి నిగ్రహమునఁ;
దప్పుఁ జేసితి, లోఁగొమ్ము దయ దలిర్ప, (3-56)
బ్రహ్మ వాహన కుల ముఖ్య, పక్షిరాజ. 61

... బాల్యమునఁజేసి = (నాదైన) పసితనమువలన, చాపలము = లౌల్యము, ... నిగ్రహమునన్ = పట్టఁజూచుటచేత, ... దలిర్పన్ = చిగుర్పఁగా, లోఁగొమ్ము = మన్నింపుము.

'బ్రహ్మ ... రాజ' - నీచులు నేరమిని మన్నింపరు, గొప్పవారు మన్నింతురు, కావున గొప్పతనము సూచించు సంబోధనలు సేయఁబడినవి; కావున పరికరాలంకారము.

సీ. దర్శనీయంబు నీతనువిలాసం బెప్డు, నీమనం బత్యంత నిర్మలంబు, (3-56)
మధురాక్షరములు నీ మహితభాషణములు, కీర్తనీయంబు నీ వర్తనంబు,
ప్రౌఢియుక్తంబు నీప్రతిభావిశేషంబు, కమనీయతరము నీ కల్కితనము,
శ్లాఘనీయంబు నీ సౌహార్దగరిమంబు, ప్రార్థనీయంబు నీ ప్రాభవంబు,

ఆ. మత్స్యమూర్తియైన మధుకైటభారాతి (3-57)
భాతి నీవు భువన పావనుఁడవు;
నిండునెలయుఁ బోలె నేత్రోత్సవంబవై, (3-58)
యున్నవాఁడ; విట్టి యొప్పు గలదె! 62

దమయంతియు కృతజ్ఞతచేతను ఆవర్జనకోఱకును హంసను స్తుతించుచున్నది:—

నీ - తను విలాసంబు=దేహముయొక్క సొంపు (సౌవర్ణత్వాదికము), ఎప్డున్= సర్వదా, దర్శనీయము = చూడఁదగినట్టిది; నీ ... లంబు - పట్టవచ్చిననాకు మేలు సేయం గడంగుటయే ఇందులకుం దార్కాణము; మహిత భాషణములు = పూజ్యమానము లయిన వాక్కులు ('మహ పూజాయామ్' - 'మతిబుద్ధిపూజార్థేభ్యశ్చే'తి వర్తమానే క్తః), మధుర అక్షరములు = (వీనులకు) ఇంపైన వర్ణములు గలవి; వర్తనంబు = నడువడి, కీర్తనీయంబు = స్తుతింపఁదగినది;

ప్రతిభావిశేషంబు = నవనవోన్మేషశాలిప్రజ్ఞ, ప్రౌఢి యుక్తంబు = నేర్పు మెఱసినట్టిది -

'స్మృతి ర్వ్యతీతవిషయా, మతి రాగామిగోచరా,
బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా, ప్రజ్ఞా త్రైకాల్యగోచరా,
ప్రజ్ఞాం నవనవోన్మేష శాలినీం ప్రతిభాం విదుః.'

కల్కితనము = మనోజ్ఞత్వము, కమనీయతరము = మిక్కిలి అభిలషణీయముగా నున్నది ;

సౌహార్ద గరిమంబు = స్నేహాతిశయము, శ్లాఘనీయము = పొగడఁ దగినది ; ప్రాభవంబు = సామర్థ్యము, ప్రార్థనీయంబు = కోరఁదగినది.

నీవు, మత్స్య ... భాతిన్ = మత్స్యావతారుఁడైన మధుకైటభుల (అరాతి =) శత్రువు వలె, ... భువన పావనుఁడవు = నీటిని (లోకముల ననియు - 'భువనం లోక ఖామ్బుషు' హేమ.) పవిత్రము చేయువాఁడవు.

నారాయణుఁడు మధుకైటభులను అర్ణవమందే మడియించినాఁడు, మత్స్యావతారముచేత నీటిని పావనముచేసినాఁడు, సకలలోకపావనుండును. ఇట మధుకైటభ నాశ ప్రస్తావము జలముం బావనము సేయుటను సమర్థించుటకు. మధుకైటభు లనెడునిరువు రసురులు మహార్ణవంబుపయి యోగ నిద్రలో నున్న నారాయణుని గులిమినుండి పుట్టి తన్నాభీకమలంబున నున్న బ్రహ్మను బాధింపం దొడంగిరి. అతనిచే ప్రబోధితుఁడై నారాయణుఁడు వారిని తనయొడమ పిఱిందిమీఁదికి తివిచి తలలు నలిపి చంపివైచెను.—అని పురాణము.—'మత్స్య ... డవు' —'నిండు ... వై' — ఉపమలు.

వ. నామనోరథంబు కంఠపథంబున వర్తించుచున్నయది ; ప్రబలలజ్జాభియోగంబును దుర్లభ జనానురాగంబును సమప్రాధాన్యంబు నధిష్ఠించి యున్నయవి; యందని ప్రాఁకులపండ్లు గోయం దలంచెద; రాజుఁ బాణిగ్రహణంబున వశీకరింపం గోరెద; బాల్యచాపలంబున బేల నై యున్నదాన. నని సాభిప్రాయంబుగాఁ బలికె నప్పుడు (3-59). 63

మనోరథంబు = కోరిక, కంఠ పథంబునన్ = గొంతెనెడి దారిలో, వర్తించుచున్నయది = మెలఁగుచున్నది - (లజ్జచేత బయటికి చెప్పలే కున్నా ననుట) ; ప్రబల లజ్జా అభియోగంబును = బలీయ మయిన సిగ్గు పైకొనుటయు - దుర్లభజన అనురాగంబును = దొరకని పురుషునియందు వలపును, సమప్రాధాన్యమును = తుల్యప్రాముఖ్యంబును, అధిష్ఠించి = అవలంబించి(ఎంత కోరిక కలదో అంత లజ్జయుం గలదు, దానంజేసి బహిరంగముగా కోరికను చెప్పలే కున్నా ననుట); అందని ప్రాఁకుల పండ్లు గోయం దలంచెద = నలమహారాజును దొరకనివానిని పెండ్లిగాఁగోరుచున్నాను [లలితాలంకారము], రాజున్ = చంద్రుని (నలుని అని శ్లేష—'నలరాజు' పా. - అల రాజున్ = ఆచంద్రుని- నలరాజున్ = నలభూపతిని - అని శ్లేష), పాణి గ్రహణంబునన్ = చేతితోఁ బట్టుకొనుటచే (పెండ్లియాడుటచేత అనియు), వశీకరింపన్ = స్వాధీనుని చేసికొనుటకు.

తే. రమణి మందాక్షు మందాక్షురంబు గాఁగఁ (3-61)
బరిమిలోక్తుల నిబ్భంగిఁ బలుకుటయును,
సంశయాళు వై హంస తచ్ఛంసితంబు
హృదయమున నొయ్యఁ జింతించి యిట్లు లనియె. 64

రమణి = సుందరి యైన దమయంతి, ఇబ్భంగిన్ = ఇవ్విధముగా, పరిమిత ఉక్తులన్ = కొలఁదిపాటి మాటలచేత, మం...గన్ – మందాక్షు = సిగ్గుచేత– మంద = సందిగ్ధార్థము లయిన – అక్షరంబు కాఁగన్ = పదములు గలదిగా, పలుకుటయున్ = చెప్పినంతట, హంస, సంశయాళువు = సందేహముగలది, ఐ, తత్ శంసితంబున్ = ఆమెయొక్క మాటను, ...

'మందాక్షు మందాక్షు' (రంబు) – యమకము. తృతీయపాదములో సకారములు వృత్త్యను ప్రాసము. 'హంసవతంసితంబు' అను బజాజుపుస్తకముల పాఠము ప్రామాదికము. దానిచేత శేస ప్రాసవాదులు సంతుష్టిం జెందవచ్చును. ప్రకృతపాఠమే మూలానుగుణము; మూలము:—

'మన్దాక్షు మన్దాక్షుర ముద్ర ముక్త్వా తస్యాం సమాకుఞ్చిత వాచి హంసః
తచ్ఛంసితే కిఞ్చన సంశయాళు ర్గిరా ముఖామ్భోజ మయం యుయోజ.'

వ. ఓ రాజవదన, రాజపాణిగ్రహణంబు దృష్టాంతీకరించి నీ పలికిన సుభాషితంబులకు నర్థం బెయ్యది ? యంతిమవర్ణంబునకు వేదవర్ణంబువోలె నయ్యర్థంబు నావీనులు ప్రవేశింప నర్హంబు గాదె (3-62) ? తిర్యగ్జాతి నై యుండియు, మా యేలిక నాళీకభవునియాన, యేను జన్మించినయది యాదిగా నెన్నండును మృషాభాషణంబులు వలుక; సత్యంబు పలుకుదుం; బలికిన ప్రయోజనంబు సాధింతు (3-64) ; లోకాలోక పర్యంతం బైన ధాత్రీమండలంబునందు నీ వెయ్యది యపేక్షించితి, వప్పదార్థంబు గొని వచ్చి నీకు సమర్పింపం జాలుదుఁ (3-66) ; కందర్పాకారు లైన రాకుమారు లెల్లరు నాకు వశవర్తు లై యుండుదురు; విశేషించి యన్నిషధ భూవల్లభుండు నన్నుం బ్రాణంబుఁగా మన్నించి యుండు. 65

రాజ వదన = చంద్ర ముఖీ, రాజ పాణి గ్రహణంబు= చంద్రుని కేలం బట్టుట, దృష్టాంతీకరించి = దృష్టాంతముగాఁజేసి, ... సు భాషితంబులకున్ = మంచి మాటలకు, ... అంతిమ వర్ణంబునకున్= చతుర్థ జాతికి,... కాదె, [ఉపమ]; ... తిర్యగ్జాతిని=పక్షిని (కడుపు నేలపై పుంచి చరించు జంతువులు తిర్యక్కులు), ఏలిక = దొరయైన – నాళీకభవుని యాన = బ్రహ్మయొక్క యాజ్ఞశుఁ ధప్పినట్లు ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను, ... మృషా = అసత్య,...లోకాలోక=చక్రవాళ, ...ధాత్రీమండలంబునందున్ = భూవలయములో,... ['లోకా...జాలుదు'—సంబంధాతిశయోక్తి]; కందర్ప ఆకారులు=మన్మథుని యాకారమువంటి యాకారము కలవారు (ఉపమ);... ప్రాణంబుగాన్ = అత్యంతానురాగముతో [రూపకము].

సీ. అతఁడు పాణిగ్రహణార్థుండు విను నీకు,
నలినిఁ గూర్పఁగ నేర్తు నతివ యేను;
చిన్న పాపవు నీవు, పితృపరాధీనవు, (3-72)
కార్యనిర్ణయశక్తి గలదె నీకు ?
నావల నిషధరా జఖిలలోకేశ్వరుం, (3-71)
డీవలఁ బరమేష్ఠి హితుఁడ నేను;

సందేహ డోలాధిశాయి నైన ప్రసంగ (3-71)
మిప్పట్టునందు నే నెట్లొనర్తు?

తే. మొదల సంఘటియించినఁ బొంది కార్య
మవల విఘటించె నేని, గౌరవము దప్పి,
ప్రాణమై నన్ను రమ్మొ పో మ్మనునృపాలు
నెదురఁ దల వంచి కొనియుండ నెట్లు నేర్తు? 66

అతివ = ఓపడఁతీ, నీకు అతఁడు పాణిగ్రహణ అర్హుఁడు (వివాహమునకుం దగినవాఁడు); పితృ పరాధీనవు = తల్లిదండ్రులకు వశమై యున్నదానవు. కార్య నిర్ణయ శక్తి = ఒకవేళ నీ తల్లిదండ్రులు ని న్నొరుని కిచ్చుచో వారిమాటను పాటింపక నలుని వరించెద నన్న నీమాటఁ నే నెఱవేర్చుకొనుట సరి యైన పని యని నిర్ణయించుకొను సామర్థ్యము ....

ఆవలన్ = ఒకవంకను, ... ఈవలన్ = ఇంకొకవంకను, నేను, పరమేష్ఠి హితుఁడను = బ్రహ్మదేవునికి ఆప్తుఁడను ('అట్టి గొప్పరాజు కడ, ఇట్టి గొప్పదేవుని యాప్తుఁడను,' అని అనంతర వాక్యముతో నన్వయించును;)

ఇప్పట్టునందున్ = ఈవివాహవిషయములో, సందేహ డోలా అధిశాయి=సంశయమనెడి ఊయెల (రూపకము)పై శయనించినట్టిది (అనఁగా సందేహగ్రస్తము),...ఒనర్తున్ = చేయుదును.

కార్యము = పని, మొదలన్ = ఆదిలో, సంఘటియించినన్ = కూర్పఁగా, పొంది = చక్కఁనగా నగపడి, అవలన్ = తర్వాత, విఘటించె నేని = బెడిసినచో,...ప్రాణము = అత్యంత ప్రియుఁడు.

ఉ. ఇప్పటినీతలంచు తెఱఁ గిట్టిద యౌ; నిటమీఁద నెప్పు డే (3 - 70)
చొప్పున నుండునో? నిజము సుద్ది యెఱుంగము గాని; యుగ్మలీ,
చెప్పెడి దేమి? బాలికల చిత్తము లంబు తరంగ లోలముల్;
తప్పనొ తాఁకునో కుసుమ ధన్వుని యేటులు దైవికంబుగన్? 67

ఇప్పటి నీ తలంచు తెఱఁగు = ఇప్పుడు నీవు నిశ్చయించుకొన్న విధము, ఇట్టిద = నలరాజును చెట్ట పట్టవలయు ననునట్టిదే, ఔన్ = అగును, కాని = అయినను, ఉగ్మలీ = ఓ మగువా,...నిజము సుద్ది = నిజమయిన మంచి మాటను,...చెప్పెడి దేమి=చెప్ప వలయునా?... అంబు తరంగ లోలముల్ = నీటి యలలకై వడి నస్థిరములు, దైవికంబుగన్ = దైవవశముగా, కుసుమ ధన్వుని యేటులు = (నలునికొఱకు చేయఁబడు) పూవిల్తుని బాణప్రయోగములు, తప్పనో తాఁకునో = తప్పిననుం దప్పును తగిలిననుం దగులును - అతిచంచలలక్ష్యము లగుటచేత బాణము తగులు ననెడి నిశ్చయము లేదు - ఇప్పుడు నలునిం గోరితివి, ఇఁక నెవ్వనిం గోరుదువో? అనుట.

'బాలిక' లనుటలో కార్య నిర్ణయ శక్తి లేని బేల లని భా. 'అంబుతరంగలోలము' లనెడి యుపమ మూలములో లేదు. ప్రకృతమున గుణి తప్పుటకు ఈ యుపమ చెప్పఁబడినది. అను క్షణము రూపు మాఱుచుండుటను చెప్పుటకు ఇది కరము సుందర మైన యుపమ.

'సలిలనిధిరివ ప్రతిక్షణం మే భవతి స ఏవ నవో నవోఽయ మక్ష్ణోః.' మాళవిక..

వ. శంకాకళంకితం బయిన యివ్విషయంబునందుఁ బ్రామాణికుండ నై యేను వర్తింప నంగీకరింపం గాని; వేఱొక్కకార్యంబునకు నన్ను నియోగింపుము; దుర్ఘటం బయిన నది సంఘటించెద (3-73). నని పలికిన. నా పతత్త్రిపుంగవునకు ధాత్రీ పురుహూత పుత్త్రి యిట్లనియె (3-74). 68

శంకా కళంకితము = సందేహముచేత మచ్చగలది. ప్రామాణికుండను = ఆప్తుఁడను. నియోగింపుము = పనిగొనుము. పతత్త్రి పుంగవునకుఁ = పక్షి వతంసునికి, ధాత్రీ పురుహూత పుత్త్రి = భూలోక దేవేంద్ర తనయ.

## —* దూత్యసిద్ధి *—

తే. నిషధభూపాలు నొల్లక నృపతి నొరుని (3-75)
నభిలషించెద నేని, హంసాగ్రగణ్య,
యామవతి చంద్రు నొల్లక యన్యు నొకని
నభిలషింపంగ నోంకార మాచరించు. 69

హంస అగ్ర గణ్య = హంసలకు మొదలివాఁడవుగా గణింపఁదగినవాఁడా, ఏఁ, నిషధ భూపాలుఁ = నలుని, ఒల్లక = అభిలషింపక, నృపతిఁ ఒరునిఁ = వేఱొక రాజును, అభిలషించెద నేని = వలతు నేని, యామవతి = రాత్రి, ...ఓంకారము = అంగీకారమును, ఆచరించుఁ = చేయును.—నేను నలుని మాని వేఱొకని వరింప నంగీకరింతు నేని రాత్రియు చంద్రుని మాని వేఱొకనిం గైకొన నంగీకరించును. రెండవది యెట్లు ఘటిల్లదో అట్లే తొలిదియు ఘటిల్ల దనుట.

ఒకటి మిథ్య యని నిరూపించుటకై మఱియొక మిథ్యం గల్పించుట మిథ్యాధ్యవసితి.

'మిథ్యాధ్యవసితి కించి । న్మిథ్యాత్వస్థాపనకు సమీహ దలిర్పఁ
మిథ్యార్థాంతర మల్లుట; । మిథ్యయ హరి నీవు నన్ను మించెద వేనిఁ.' అలం. సా. సం.

తే. అబ్జినీ మాన సానురా గాభివృద్ధి (3-76)
యర్క సంపర్కమునఁ దక్క నగు నె యొంట?
నలునిఁ దక్కంగ నొరుని నేఁ దలఁతు నెట్లు?
విడువు సందేహ మోహంబు విహగరాజ. 70

విహగరాజ = ఓ పక్షిపుంగవా, అబ్జినీ మానస అనురాగ అభివృద్ధి = తామరతీఁగయొక్క (లేక - తామరకొలనియొక్క) మనః ప్రీతి పెంపు, అర్క సంపర్కమునఁ = సూర్యుని సంబంధముచేత, తక్క = తప్ప, ఒంటఁ = మఱియొక కారణమున, అగు నె, సందేహ మోహంబుఁ = సంశయ మనెడి యజ్ఞానమును, విడువుము.—తొలి మూఁడు పాదంబులం బ్రతివస్తూపమాలంకారము:

'ప్రతివస్తూపమ ప్రకృత త । దితరోపగతంబు లయిన యిరువాక్యములఁ
బ్రతపడ సామాన్య మొకఁడే; । దితిజుల హరి సించు, నృపతి దృప్తులఁ ద్రుంచుఁ.' అలం.

సందేహము విడుచుటకు పద్య పూర్వభాగార్థము కారణము గాన వా. హే. కావ్యలింగము.

తే. అనల సంబంధ వాంఛ నాకగున యేని, (3-77)
యనల సంబంధ వాంఛ నాకగున చూవె;
చాలు సందేహ వక్రభాషణము లింకఁ,
దరళ, చక్రాంగ, పాథఃపతంగశక్ర. (3-68)

తరళ = ఓయి సంశయాళూ, చక్రాంగ = హంసా - పాథః పతంగ శక్ర = నీటిపక్షులలో ఇంద్రుఁడా - (లేక - చక్రాం...క్ర = రాజహంసశ్రేష్ఠుఁడా,) అనల సంబంధ వాంఛ = నలుఁడు గానివానితో కూటమియందు కోరిక, ... అనల సంబంధ వాంఛ = అగ్నితో కూటమియందు కోరిక - నిప్పులో పడి మడియం గోరిక.—యమకము; సందేహము మానుటకు పూర్వార్థము కారణము గాన వా. హే. కావ్యలింగము. 71

ఉ. దివ్యఖగేంద్ర, నమ్మవు మదిన్నను; నీయెడ నాకు విప్రలం (3-78)
భవ్యవహారము న్నిలువఁ బట్టఁగ నేమి ఫలం? బశక్యశం
క వ్యభిచారహేతు వనఁ గల్గినమాటయ వేదవాక్యముల్
భవ్యవిచార, కా వనిన; భావన సేయుము యెవ్వి వేదముల్. 72

దివ్య ఖగేంద్ర = స్వర్గసంబంధి యైన యోపక్షిరాజా, ... మదిన్ = మనస్సులో, నీయెడన్, విప్రలంభ వ్యవహారమున్ = వంచనా వ్యాపారమును, ... భవ్య విచార = మంచి పరామర్శ కలవాఁడా, అశక్యశంకవ్యభిచారహేతువు - దేనిం గూర్చి శంక (సందేహము) అశక్యమో అది అశక్యశంకము - (బహువ్రీహి సమాసము) వ్యభిచార మనఁగా తప్పిపోవుట - దాని హేతువు వ్యభిచారహేతువు (షష్ఠీతత్పురుష సమాసము) - ఏమాటకు వ్యభిచారహేతువు అశక్యశంకమో ఆమాట అశక్యశంకవ్యభిచారహేతువు (రెండియు బహువ్రీహి) - ఏమాట తప్పిపోవు నని శంకింప శక్యము గాదో ఆమాట అని భా. ... వేదవాక్యముల్ కావు అనినన్ = వేదములవలె ప్రమాణము కావేని, వేదములు ఎవ్వి (యో), భావన సేయుము = ఆలోచింపుమా (వేదములు అప్రమాణము లగునేని నామాటయు నప్రమాణ మగును, అనుట. నా వాక్యమును వేదవాక్యముం బోలె నమ్మవలసిన దని భా.)—కావ్యలింగము. 'అశక్యశంకవ్యభిచారహేతు వగు మాటయే వేదము' అనుట సామాన్యోక్తి; అది 'అట్టి దయిన నామాటయు వేదమే' అను విశేషమును తెలుపుచున్నది గావున సామాన్య నిబంధనాప్రస్తుతప్రశంసయు.

తే. తండ్రి నిషధాధిపతి కీక తక్కె యొరున (3-79)
కీఁ దలంచెన యే, విహగేంద్ర, వినుము;
దేహ మనలంబునకు నాహుతిగ నొనర్చి,
యతనిఁ బొందంగఁ గందు జన్మాంతరమున. 73

విహగేంద్ర, ... ఈక = ఇయ్యక, ... ఈఁ దలంచెన యేని = ఇయ్యఁ గోరిన యెడల, ... అనలంబునకున్ = నిప్పునకు, దేహము = నాశరీరమును, ... అతనిన్ = నలుని, ... - జన్మాంతరమందు నలునితో సంగమము వరము వేడి అగ్నిం జొచ్చి అవరమున అతనిం బొందెదను. తండ్రి నవలెర

రునికి' అనఁగా 'అనలునికి' ఈఁదలంచుచో ఆయన సంకల్పమునకు భంగము కాకుండ అనలునికే 'అగ్నికే' దేహ మర్పించి నాకోరిన నలునే పొందెదను, అని స్వారస్యము.

ఏని విహగేంద్ర = ఏవిహగేంద్ర - ఈసంధి ఈక్రింది పెద్దనార్యప్రయోగమునం గలదు:—

'ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రత న్నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియము ల్సుఖంబు గను నాయింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ' య టన్నప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.' మను.

శా. త ద్దాసీత్వ పదంబు గైకొని కృతార్థత్వంబునం బొందుదుం, (3-80)
ద ద్దివ్యాంఘ్రి సరోజ వందన విధిం దాత్పర్యముం జెందుదుం,
ద ద్దాక్షిణ్య మపేక్ష సేయుదు మదిం, దత్సేవకుం జొత్తు నేఁ,
ద ద్దోరంతరపీఠిఁ జేరుతుఁ గుచద్వంద్వంబు నీ సత్కృపన్. 74

నీ సత్ కృపన్ = నీ మంచి దయచేత, నేన్, తత్ దాసీత్వ పదంబున్ = ఆతని సేవకురాలితనముయొక్క యధికారమును - కైకొని - అతనికి సేవకురాలనై యనుట, కృతార్థత్వంబునన్ పొందుదున్ = జన్మమును సఫలము చేసికొనియెదను [ఇట 'పొందు' ధాతువు అకర్మకము 'కృతార్థత్వంబునన్' అధికరణత్వవివక్షచే కర్మకు సప్తమి - పొందుదున్ = వర్తిల్లెదను], తత్ ... విధిన్ - తత్ = ఆతని - దివ్య = మనోజ్ఞములయిన - అంఘ్రి సరోజ = పాద కమలములయొక్క - వందన విధిన్ = నమస్కార వ్యాపారమునందు, తాత్పర్యమున్ = ఆసక్తిని, ... దాక్షిణ్యము = దయను, ... తత్ దోః అంతర పీఠిన్ = ఆతని బాహువుల నడుమ (అనఁగా వక్షము) అనెడి పీఁటయందు, కుచద్వంద్వంబున్ = చనుఁగవను, ...

తే. అతనిఁ గోరుదు నే నంతరంగసీమ, (3-81)
నంత చింతామణికిఁ జింత యాచరింపఁ;
బద్మముఖుఁ డైన యతఁడు నాపాలి కనఘ,
పెన్నిధానంబు, మాటలు పెక్కు లేల? 75

అనఘ = పాపరహితుఁడ వయిన యోహంసరాజా, నేను, అంతరంగ సీమన్ = హృదయప్రదేశమందు, ... అంత = అతనిం గోరినంత, చింతామణికిన్ = ఈవిమానికమునకు, చింత ఆచరింపన్ = కోరికను వహింపను (అతనిమీఁద కలంతకోరిక నాకు చింతామణిమీఁద సయితము లేదనుట), పద్మముఖుఁడు (= కమలమువంటి ముఖము కలవాఁడు) - పద్మ = పద్మనిధి - ముఖుఁడు = వదనముగాఁ గలవాఁడు (ఆదిగాఁ గలవాఁ డనియు) - ఆతని ముఖమే నాకు ఒకపద్మనిధి చేయును అనుట - పద్మాది నిధు లన్నియు నతఁడే యనుటయు - నవ నిధులలో పద్మము ముఖ్యమయినదియు.

'నిధి ప్రవర ముఖ్యౌ చ శఙ్ఖ పద్మౌ ధనేశ్వరౌ.' మహాభారతము.

'మహాపద్మశ్చ పద్మశ్చ శఙ్ఖో మకర కచ్ఛపౌ
ముకున్ద కున్ద నీలాశ్చ వరశ్చ నిధయో నవ.'

పెన్నిధానంబు = పెద్దనిధి [ముఖమే పద్మనిధి యైన, కడమ యవయవము లన్నియు అన్నినిధు

లని యూహింపఁదగును, కావున అతఁడు ఆయన్నిటి మొత్త మయిన యొకటే మహానిధి సుమా. మఱియు - పద్మ మనఁగా నొక మహాసంఖ్య -

‘ యథోత్తరం దశగుణం భవే దేకో దశాయుతః
శతం సహస్ర మయుతం లక్ష ప్రయుత కోటయః
అర్బుద మబ్జం ఖర్వం చ నిఖర్వం చ మహామ్బుజమ్...’ హేమ.

పద్మము చింతామణులు ముఖముగాఁ గలవాఁడు అతఁడు నాకు ఒకటే పెద్దనిధానము అనియు అర్థము. అతని ముఖమే నాకు పద్మసంఖ్యాక చింతామణులు అని భా.]—శ్లేషాలంకారము.

తే. వింటిఁ దద్గుణనికరంబు వీను లలరఁ; (3-82)
గంటి నాతని మోహ సంక్రాంతి దిశలఁ;
బోలఁ దలఁచితి నీరంధ్ర బుద్ధిధారఁ;
జాల వలచితి నతని కే; సత్య మిదియ. 76

తత్ గుణ నికరంబున్ = ఆతని గుణముల సముదాయమును, వీనులు అలరన్ = చెవులు తని యునట్లుగా, వింటిని, ఆతనిన్, మోహ సంక్రాంతిన్ = భ్రాంత్యావేశముచే, దిశలం గంటిన్, నీరంధ్ర బుద్ధి ధారన్ = ఎడతెంపులేని బోధన ప్రవాహముచే, (ఆతనిని), పోలన్ = చక్కఁగా, తలఁచితిన్ = ధ్యానించితిని (నిరంతరము వేఱు తలంపుం జొరనీయక అతనిని ధ్యానించితి ననుట), ... అతనికే = మఱి ఎవరికిం గా దనుట (అతనికిన్ - ఏన్ = నేను - అని యేని.)

వినుట, కనుట, తలఁచుట, వలచుటయు క్రమికైకగతములు గాన కారక దీపకము:—
‘ కారకదీపక మగు నొక। కారకముం బొందు పెక్కుక్రమికంబులచేన్.’ అలం. సా. సం.

సీ. ఆతనిఁ గూర్చి నా ప్రాణంబు రక్షింపు; (3-82)
మింతయు నీచేతి; దేమి చెప్ప?
నాశ్రిత సంరక్షణాభ్యర్థితం బైన (3-83)
పరమపుణ్యంబు చేపట్టు మిపుడు;
మిథ్యా విశంక యేమిటికిఁ? బాటింపుమీ ,,
యవలంబనంబు; సేయకు విలంబ;
మనురాగ జలధి వేలాంత ర్వినిర్మగ్నఁ (3-86)
దెప్పవై ననుఁ జేర్పు తీరమునకు;
తే. ధర్మపరులు వరాటికా దానమాత్ర (3-88)
లాభమున నైన మెత్తు రుల్లములలోనఁ;
బ్రాణనాథ ప్రదాన తత్పరుఁడ వైన (3-87)
నిన్ను నే మని మెత్తునో నిర్మలాత్మ! 77

ఓ. నిర్మలాత్మ = ఓయి శుద్ధహృదయుఁడా,...ఆశ్రిత సంరక్షణ అభ్యర్థితంబు = శరణా

గతుల కాపాడుటవలన పొడమినట్టిది ('ఆశ్రుత' యను పాఠమున - ప్రతిజ్ఞను కాపాడుటవలనం బుట్టినట్టి యని యర్థము), ...

మిథ్యా విశంక = వృథా సందేహము, ... అవలంబనంబు = ఆశ్రితరక్షణము, పాటింపు మీ = కావింపుమా; విలంబము = తడవును, ...

అనురాగ జలధి వేలా అంతః వినిర్మగ్నన్ = ప్రేమడి యను సముద్రపుఁ బోటు లోపల మునిఁగిపోయిన, ననున్, తెప్ప వై, తీరమునకున్ = (నలుఁ డనియెడు)గట్టునకు, చేర్పుము;

ధర్మ పరులు ధర్మ = వేదోక్తవిధియే - పరులు = ప్రధానము గాఁ గలవారు (వేదోక్తవిధి ప్రకారము నడచుకొనువారు - న్యాయ్యమార్గవర్తను లనుట), వరా ... నన్ - వరాటికా = గవ్వ యొక్క - దానమాత్ర = ఇచ్చుట మాత్రముయొక్క - లాభమునకున్ ఐనన్ = ప్రాప్తికి సైతము (ఆపాటి స్వల్పోపకారమునకుం గూడ), ఉల్లములలోనన్ = మనస్సులలో, మెత్తురు = కృతజ్ఞత వహింతురు, ప్రాణనాథ ప్రదాన తత్పరుఁడవు = ప్రాణేశ్వరుని ఇచ్చుటయందు ఆసక్తుఁడవు (ఆతని నిచ్చుటచేత నాప్రాణమును నిలుపువాఁడవు), ...

సీసచతుర్థపాదమున రూపకాలంకారము. గీతమందు కావ్యార్థాపత్త్యలంకారము.

'కైముత్యముచే నర్థం। బాముకొనుం గావ్య పూర్వ కార్థాపత్తిన్;
నీమోవి బంధుజీవము। నే మాలుచు నన్యజీవ మెడపుట యరుదే.' అలం. సా. సం.

చ. మనమున లోకపాలు రెన మంద్రుడును మెచ్చఁ దృకరింతుఁ ద (3-89)
క్కిన సురకోటి; రాసుతులఁ గీడ్పడఁ జూచుటఁ జెప్ప నేటికిన్?
గొనకొని యానృపాలునకుఁ గూర్చుటకై శపథంబు చేసెదన్
ననవిలుకాని పాద నలినంబులపై రతిచన్నుదోయిపై. 78

లోక పాలు రెనమంద్రుడును మనమున మెచ్చన్ = అష్టదిక్పాలకులును మనస్సార మెచ్చు నట్లుగా (తృణీకరించుటతోను శపథముచేయుటతోను అన్వయము) ... తక్కిన సుర కోటిన్ = లోకపాలురు గాక కడమ దేవ సమూహమును, తృణీకరింతున్ = సరకు సేయను (వరింప ననుట), రా సుతులన్ = రాజ కుమారులను, కీడ్పడన్ = తిరస్కారముగా, ... కొనకొని = పూనికతో, ఆ నృపాలునకున్ = ఆ నలమహారాజునకు, కూర్చుటకై = అనురక్త నగుటకై, నన...పైన్ = పూవిల్తుని యడుగుఁ దమ్ములమీఁదను రతిచన్నుదోయి మీఁదను, శపథంబు చేసెదన్ =ఒట్టుపెట్టు కొనియెదను (నలుని వరింపనేని ననవిల్తుని పాదములకును రతిచన్నుదోయికిని చెఱుపు గోరిన మహా పాతకమునం బడుదునుగాక యని యొట్టు.)

నలుని వరించినందులకు లోకపాలురు ఏల మెత్తు రనఁగా ('అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః' అను మనూక్తిప్రకారము) వారియంశములచేత నే అతఁడు నిర్మితుఁడు గాన, ఆతని వరించుట వారిని వరించుటయే యని వారు మెత్తురు. మఱి యేనృపుఁ డయినను అట్లే నిర్మితుఁడుగదా యనిన; నృపనామ లగునితరులు నృపాభాసులు, ఆతఁ డొక్కఁడే సరి యయిన నృపుఁడు, అని సమాధానము; కావుననే అతనికి 'నృపాల' పదమును ఇతరులకు 'రాసుత' పదంబును ప్రయుక్తములు. అష్టదిక్పాలురును ఉక్త కారణముచేత నే తక్కిన సురరాజకోటీ తృణీకారమునకు హర్షించుట సిద్ధము.

తక్కినసురలనే తృణీకరింతు ... చెప్ప నేటికిన్?'- ఇందు కావ్యార్థాపత్త్యలంకారము.

క. కార్య మిదకాలయాపన ; (3-91)
స్థైర్యసహము గాదు; చను ముదంచితగతి ; నో
యార్య, భవన్నయధౌరం
ధర్యము చూతముగదా యుదాత్తస్ఫురణన్. 79

ఓ యార్య = ఓయి సాధూ, ఇది=మ మ్మిరువురం గూర్చుట, అకాలయాపనన్=కాల హరణము లేకుండ, కార్యము = నెఱవేర్పవలసినట్టిది; స్థైర్య సహము = విలంబమును ఓర్చునట్టిది, కాదు; ఉదంచిత గతిన్ = ఉత్కృష్ట మైన (=కడు వడిగల) గమనముతో, చనుము = పొమ్ము, ...ఉదాత్త స్ఫురణన్ = ఉత్కృష్టమయిన వినియోగమందు, భవత్ నయ ధౌరంధర్యమున్ = నీ నీతి నిర్వాహమును, చూతముగదా.

'స్థైర్యసహము గాదు' - విలంబింతువేని నాప్రాణములు నిలువవు సుమా యనుట. 'ఉదంచితగతిన్' - పూజ్యమాన గమనముతో ననియు - వర్తమానమందు క్తప్రత్యయము - నాకార్యమునకై పోవునందులకు ని న్నెంతయుం బూజించుచున్నాను, అనఁగా - నీకు నత్యంత కృతజ్ఞురాలనై యుండెద నని భా. 'ఆర్య'ఁడవుగాన ఈయుపకారము సేయుదువు అనుట. నీ నీతిపారీణతను చూడవలయు ననుట ఉబ్బవేయుట; అది ఈమెయొక్క నీతిపారీణత.

స్థైర్యాసహత్వము అకాలయాపనకు కారణము గాన వా. హే. కావ్యలింగము.

ఉదాత్త (ఉత్ + ఆత్త) ఉపసర్గయతి యుభయమునకుం జెల్లును.

తే. అతఁడు శుద్ధాంతగతుఁ డైన యపుడు నీవు (3-92)
నాప్రసంగంబు సేఁత విన్ననువు గాదు ;
భామినీ ముఖ దాక్షిణ్య బలము కలిమి
నితరకాంత నిషేధించు నెవ్వఁ డైన. 80

శుద్ధాంత గతుఁడు = అంతఃపురమును జెందినవాఁడు,...చేఁత = చేయుట, విన్ననువు= నేర్పు, ... ఎవ్వఁ డైనను, భామినీ ముఖ దాక్షిణ్య బలము కలిమిన్= (అంతఃపుర) వనితలయొక్క వదనములయందలి (వదనసౌందర్యమందలి) గౌరవముయొక్క బలాత్కారము ఉండుటచేతను (వారి ముఖసౌందర్యముమీఁది యాసక్తి తన్ను బలాత్కరించుచుండును గావున), ఇతర - కాంతన్ = రమణిని, నిషేధించున్ = వల దనును.

ఉత్తరార్ధార్థము పూర్వార్ధార్థమునకు హేతువుగాన (వాక్యార్థహేతుక) కావ్యలింగము.

ఉ. నాగతి విన్నవించుట యనర్హము సుమ్ము ని జావరోధ సం (3-93)
భోగ నితాంత తృప్తుఁ డగు భూపతికిన్; సలిలంబు దప్పి వ్రేఁ
ద్రాగినవారి కింపగునె తన్పును దియ్యఁదనంబు వాసనా
యోగముఁ గల్గెనేని యుఖగోత్తము, నిర్మల వారి పూరముల్. 81

ఖగోత్తమ = విహంగపుంగవా, నిజ అవరోధ ...డు - స్వకీయ లైన రాణివాసముల పొందుచేత, మిగుల తనిసినవాఁడు, అగు - భూపతికిన్ = రాజునకు, నా - గతిన్ = వృత్తాంతమును,

విన్నవించుట = మనవి సేఁత, అనర్హాము చుమ్ము = తగనిది సుమా, దప్పిపోక్ = నీరువట్టు తీఱు నట్లుగా, సలిలంబు = జలమును, త్రాగినవానికిక్, తన్పుక్ = చలువయు, తియ్యఁదనంబుక్, వాసనా యోగముక్ = తావితోడి కూడికయు, కల్గనేనియుక్, నిర్మలవారి పూరముల్ = స్వచ్ఛోదక సమృద్ధులు, ఇంపు అగునె - కావనుట.— 'నిర్మలవారి'కి చెప్పిన విశేషణములచేత ఆ రాణివాసములకన్న ఒకవేళ నేనే అధికగుణనైనను, అని భా.

'చుమ్ము'నకు ప్రకృతి 'చూడుము'. 'తన్పు' - 'అచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబు' గాన 'తనుపు' నకు 'తన్పు' రూపాంతరము.

'అనర్హా' మనుచో నఞ్సమాసమున రెంటికిని యతి చెల్లును గాన 'నాకు' యతి.

అవరోధ తత్సంభోగ తత్తృప్తభూపతి దమయంతీవృత్తాం తాప్రియత్వములకును — సలిల తత్పాన తత్తృప్తపురుష గుణవన్నిర్మలవా ర్యస్వాదుత్వములకును — బింబప్రతిబింబభావము; కావున దృష్టాంతాలంకారము:—

'కృతి దృష్టాంతము బింబ। ప్రతిబింబతఁ; గీర్తి నీదె; ప్రభ చంద్రునిదే.' అలం.సా.సం.

తే. అధిక రోష కషాయిత స్వాంతుఁ డైన (3-94)
నరపతికి విన్నవింపకు నాయవస్థఁ;
బైత్త్యదోషోదయంబునఁ బరుస నైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదు గాదె? 82

అధిక - రోష కషాయిత స్వాంతుఁడు = కోపముచేత కలుషితమయిన మనస్సు గలవాఁడు, ఐన ... స్థక్, పైత్త్య దోష ఉదయంబునక్=పిత్తమనెడు దోషముయొక్క యుల్బణముచేత -

'వాయుః పిత్తం కఫ శ్చేతి త్రయో దోషాః సమాసతః,
వికృతాఽవికృతా దేహం ఘ్నన్తి తే వర్తయన్తి చ.' వాగ్భటము.

పరుసన = పరుషము, ఐన - జిహ్వకకుక్ = నాలుకకు, పంచదారయుక్ = చక్కెరసైతము, ...

పురుషునికి పిత్తదోషము ఉద్రేకించిన సమయమున పంచదార సయితము నాలుకకు చేఁదగును, అట్లే కోపము రేఁగిన సమయమున కాంతాప్రస్తావము విరస మగును; కావున కుపితావస్థలో నున్న రాజునొద్ద నామాట ప్రస్తావింపకుము;—అనుట.

'పంచదారయు' అనుచోటి సముచ్చయ 'యు' శబ్దముచేత 'నేను ఒకవేళ గుణోత్కృష్టనే అయినను' అనియు ధ్వనితము. పక్షాంతరమున - మధుర తరమయిన పంచదారయే చేఁదు అగు ననఁగా ఇతరరుచు లెంత హేయము లగునో చెప్పవలయునా? అని కైముతికన్యాయముచే గుణవతీప్రస్తావమే కుపితునియెడ విరసతాపాదక మయి యుండఁగా న్యూనగుణ నయిన నా ప్రస్తావము విరస మగు నని చెప్పవలయునా? అని దమయంతియొక్క వినయభూషితవచనముగా నేని గొనవచ్చును.

ఇందును బింబప్రతిబింబభావముచే దృష్టాంతాలంకారము.—స్వాంత (స్వ + అంత) శబ్దమున నిత్యసమాసయతి యుభయమునకుం జెల్లును గాన నిట స్వరమునకు యతి.

ఆ. కదిసి నా తెఱంగు కార్యాంతరాసక్త (3-95)
చిత్తుఁ డైనపతికిఁ జెప్పవలవ;

దనవబోధనిద్ర యవమానముద్రకుఁ
ప్రథమ కారణంబు పక్షిరాజ. 83

ఓపక్షిరాజ, కదిసి = చెంతఁజేరి, (నీవు), కార్యాంతర ఆసక్త చిత్తుఁడు = వేఱుపనియందు తగులుకొన్న మనస్సు గలవాఁడు, అయిన పతికిన్, నా తెలంగున్, చెప్పవలవదు = చెప్పవలదు (చెప్పకు మనుట; ఏల చెప్పఁగూడ దనఁగా) - అన...ద్ర - అనవబోధ = చక్కఁగా తెలిసికొనమి యనెడి - నిద్ర = సుషుప్తి, అవమాన ముద్రకున్ = తిరస్కృతియొక్క యావేశమునకు, ప్రథమ కారణంబు = ముఖ్య హేతువు.

ప్రభువు ఒక పనియందు మనస్సుం దగిలించి యున్నప్పుడు ఆయనతో ఏదేని మనవి చేసినచో, కొలనిద్రలోనివాఁడుంబోలె నాతఁడు విషయమును చక్కఁగా తెలిసికొనక తప్పకుండ తిరస్కారము చేసి పంపును. కావున రాజు అట్టి దశలో ఉన్నప్పుడు నాదశ నాతనితో విన్న వింపకుము; — అనుట. వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారము.

వ. కావున నవరసం బెఱింగి యాత్యంతికాసిద్ధి విలంబిసిద్ధులయందు నీకు నెయ్యది శుభం బై తోఁచు నదియ చూచుకొనునది (3-96). యని యప్పై దలి మదనోన్మాదంబునం జేసి లజ్జాభరం బుజ్జగించి కులకన్యాజనంబులకు నుచితంబులు గాని యతి ప్రౌఢవచనంబులం బలికిన (3-97). 84

... అవసరంబు = సమయము; ఆత్యం...దున్ - ఆత్యంతిక = బొత్తిగా - అసిద్ధి = సిద్ధిలేమి - విలంబి = విలంబముగలదైన - అనఁగా - కాలాంతరమందు కలుగునదైన - సిద్ధులయందున్ = సిద్ధియు - అను నీరెంటియందును (అనఁగా బొత్తిగా సిద్ధిలేకపోవుట ఒకపక్షము- కాలాంతరమందు సిద్ధి కలుగుట మఱియొక పక్షము - ఈ రెంటిలో),... మదన ఉన్మాదంబునం జేసి=మదనునియొక్క (మదనుఁడు కలిగించిన) చిత్తవిభ్రమముచేత,...ఉజ్జగించి=త్యజించి,...

ఉ. ఆ పరమేష్ఠివాహన కులాగ్రణి భీమతనూజ మన్మథా (3-99)
జ్ఞాపరతంత్రతన్ నల వశంవద మానసఁగా నెఱింగి, చం
చూపుట మౌనముద్రఁ దఱిఁ జూచి వినిద్రవివేకశాలియు
ద్యాపన చేసెఁ గన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసముల్. 85

వినిద్రవివేకశాలి = తీక్ష్ణమయిన తెలివిచే నొప్పారుచున్నదియు, (ఆ) పర...ణి - పరమేష్ఠి = బ్రహ్మకు - వాహన = వాహనములయిన హంసలయొక్క - కుల = జాలమునకు - అగ్రణి = మొదటిదియును, (అయిన యా హంస); భీమ తనూజన్ = భీమరాజు కూఁతురయిన దమయంతిని, మన్మథ ఆజ్ఞా పరతంత్రతన్ = మదనునియొక్క యాజ్ఞకు స్వాధీనురాలై యుండుటచేత, నల వశంవద మానసన్ కాన్ = నలునికి అధీనమయిన మనస్సుగలదానినిగా, ఎఱింగి, తఱిన్ = సమయమును, చూచి=కనిపెట్టి, కన్నుఁగొనలందున్ = కనుగొనలయందు - మంద హాసముల్ = చిఱునవ్వులు, తొలంకఁగన్ = తొనఁకుచుండఁగా (మందహాసము పొంగి కన్నుఁగొనలయందును నిండి పైకి ఉబుకుచుండఁగా ననుట), చంచూపుట మౌనముద్రన్ = ముక్కు డిప్పలయొక్క తూష్ణీంభావ నియమమును, ఉద్యాపన చేసెన్ = వదలి పోఁజేసెను.

దమయంతి పలికిన ప్రౌఢవాక్యంబులవలన వివేకశిఖామణి యా రాజహంస, ఆమె కేవల మన్మథాజ్ఞలో నున్నది గాని పిత్రాజ్ఞలోఁ గూడను లే దనియు, మదనాజ్ఞచే తన హృదయమును నలున కర్పించి వైచిన దనియు, నెఱింగి, తాఁ బదులు పలుకుటకు అదియే మంచి సమయ మని కని పట్టినదై, తన రాయబారము నెఱవేఱినందుల సంతోషముచేతను దమయంతీ రంజనార్థంబును తన కన్నుఁగొనలందు మందహాసము దొలంకుచుండఁగా, మౌనము మాని, (యిట్లు పలికెను).

'చేసెన్'—'చేసి' యని క్త్వార్థకముగా నుండినయెడల, 98- లో 'పలికి' అను క్త్వార్థకముతో ఏకకర్తృక మగును. ఈరెంటికిని 'పరమేష్ఠివాహన కులాగ్రణి' కర్త. ప్రతులం దెల్ల 'చేసె' ననియే యున్నది. దాని ప్రకారము ఈ యుపన్యాసములో 'పలికి' లోనగు పెక్కు క్రియాపదములకు కర్త లేకపోవును. 'మందహాసమున్' అనియు పూర్వ ముద్రణములయం దున్నది; ఇందలి సముచ్చయ 'ను' శబ్దంబునకు సుఖాన్వయము లేదు. వ్రాఁతలలో బహువచన మున్నది. దానిచే ఆ కౌటిల్యము తొలఁగి, ఒక్కొక్క కంటను మందహాసము స్ఫుట మాయె నని, సొం పయిన యర్థము లభించుచున్నది. పక్షినోట మాటచే మౌనత్యాగము తెలిసినను మందహాసము తెలియదే యనిన, అందులకే, మందహాసము చంచూపుటమందు తెలిసిన దని చెప్పక కన్నుఁగొనలందు తెలిసిన దనియు, అందును, నూతన ధావళ్యాతిశయము తొలంకుటచే తెలిసిన దనియు సూచించినాఁడు.

హంస తొలుత దమయంతీ ప్రలోభనార్థము నలువిగు ణాతిశయంబును మాత్రము వర్ణించినది, ఇప్పుడు దమయంతి అతనియందు బద్ధానురాగ యని యెఱింగిన దై, అయ్యనురాగంబును అభేద్యముగా దృఢపఱుచుటకును, ఆమెకు సంతుష్టి సేయుటకును, ఆమెయందు నలునికి అత్యంతమయిన ప్రేముడి కల దని వచించుచున్నది. ఆమె యొల్లనిచో నలునికి అవమానం బగు నని, ముందే అతని ప్రేమను ఆమెతో చెప్పలేదు. ఇది రాయబారమందు హంసకుం గల నిపుణతా విశేషమును సూచించుచున్నది. దూతలు ముత్తెఱంగులు:—

'నిసృష్టార్థో మితార్థశ్చ తథా సందేశహారకః
కార్యప్రేష్య స్త్రిధా దూతో దూత్యశ్చాపి తథావిధాః.
ఉభయో ర్భావ మున్నీయ స్వయం వదతి చోత్తరం
సుశ్లిష్టం కురుతే కార్యం నిసృష్టార్థ స్తు స స్మృతః.
మితార్థభాషీ కార్యస్య సిద్ధికారీ మితార్థకః,
యావ ద్భాషిత సందేశహారః సందేశహారకః.' సా. ద.

దీనిచే ఈహంస నిసృష్టార్థదూత యను నుత్తమ దూత యని విశదము.

సీ. విను మింతి; యీయర్థమును ఘటింపఁగఁ జేయఁ (3-100)
బుష్పబాణాంచుం పూఁటకాఁపు;
సమతాభావ లావణ్య సౌందర్య మగుమిథు
నరంబు గూర్పకపోఁడు నలినభవుఁడు;
నినుఁ జేరి నిషధనాథుని యింద్రియములకు (3-101)
నిజదేవభావంబు నివ్వటిల్లుఁ;

గన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మి
మ్మిరువుర దేవి దేవరనుఁ బోలె;

తే. నీవు మారాజుపైఁ గూర్మి నెరయఁ గలిగి,
చిత్త మర సేయ కున్నట్లు చెప్పి తివుడు;
వినుము నీవును, నతని నెమ్మనమునందుఁ (3-105)
గలుగు నీమీఁది ప్రేమంబు నలినవదన. 86

ఇంతి=ఓ చెలువా (దమయంతీ),...ఈ - అర్థమును=ప్రయోజనమును (మీకూటమిని), ... పుష్పనారాచుండు = పూవుటమ్ములవాఁడు (మదనుఁడు), పూఁటకాఁపు = ప్రతిభువు; [పూఁటకాఁపు అనఁగా- ఒకఁడు చేయవలసిన పనిని 'ఆతఁడు చేయనిచో నేను చేసెదను' అని పూనుకొను మఱియొకఁడు (జామీనుదారుఁడు). 'మదనుఁడు పూఁటకాఁ' డనుటచే - ఒకవేళ నేను మిమ్ముఁ గూర్పనేని మదనుఁడు తానే మిమ్ముం గూర్చును; అది యెట్లన - 'పుష్పనారాచ'ములచేత! అని భా.— నారాచముల విశేష మే మనఁగా;

'సర్వలోహా స్తు యే బాణా స్తే నారాచాః ప్రకీర్తితాః
పఞ్చభిః పృథులైః పక్షై ర్యుక్తాః సిధ్యన్తి కస్యచిత్.' శార్ఙ్గధరుఁడు.
'ఏకైకస్య శరస్యైవ చతు ష్పక్షాణి యోజయేత్,
షణ్మాసాత్ సిధ్యతే ముష్టిః, శరాః సంవత్సరేణ తు,
నారాచా స్తస్య సిధ్యన్తి యస్య తుష్టో మహేశ్వరః.' "

అనువచనముచే అవి తెల్లుఫుల్ల లేకుండ అంతయు నినుమే యగు బాణములు, మహావీరులకే గాని యొరులకు సిద్ధింపవు, వానియేటున కెవ్వరును ఆఁగలేరు; ఆ నారాచములవంటి పూబాణములను బ్రయోగించి రాజును శరణార్థి మై నీ కడకుం దఱుమును, నీ సౌందర్య మట్టిది; నీవును నలాధీన వై యున్నావు గావున ఈకూటమి తప్పక ఘటిల్లు; నని నారాచశబ్ద స్వారస్యము.]

నలినభవుఁడు = బ్రహ్మదేవుఁడు, సమ...ము - సమ = సమానములయిన - రూప = ఆకారము - లావణ్య = కాంతి - సౌందర్యము = అందంబును కలది, అగు - మిథునంబున్ = స్త్రీపురుష యుగళమును, కూర్పక పోఁడు = తప్పక కూర్చును; (అది యెట్లు తెలియు ననిన - లోకోత్తర రూప లావణ్యములను మీ కిరువురకు 'సమ' ముగా సృజించుటయే అందులకు సూచకము.)

... చేరి = చేరుటచేత, ... ఇంద్రియములకున్ = చక్షురాదిపంచేంద్రియములకును, నిజ...బు - నిజ = తమ దైన - దేవభూయంబు = దేవత్వము-అనఁగా దేవతా భావము ('దేవః సురే౽మ్బుదే రాజ్ఞి దేవ మాఖ్యాత మిన్ద్రియమ్' అని విశ్వ.), నివ్వటిల్లున్ = నిరూఢమగును; [దేవశబ్దము ఇంద్రియవాచకంబును దేవతావాచకంబునుంగాన నీయొక్క- రూపము ఆతనికి నేత్రామృతంబును, అధరరసము రసనామృతంబును, స్పర్శము త్వగమృతంబును, నీవు పద్మిని వగుటచే నీ వయిన రాజీవగంధము ఘ్రాణామృతంబును, నీ వచనము కర్ణామృతంబును, అగుటచేతను - దేవతలు అమృతాశను లగుటచేతను - ఆతనియింద్రియములు పైఁ జెప్పిన నీ యాయాయమృతంబును గ్రోలుటచేత

తమదైన దేవతాత్వమును స్థాపించుకొనును అని భా. దేవభూయంబు = ఇంద్రియత్వము, నివ్వటిల్లున్ = సఫల మగును, అనియు శ్లేష.]

నేను, మిమ్ము ఇరువురను, దేవిన్ దేవరనున్ బోలెన్ = పార్వతీ పరమేశ్వరులనుం బోలె, కన్నులు, చల్లకాన్ = (చంద్రికాది శీత వస్తు సంయోగంబునంబోలె) సుఖించునట్లుగా - హృదయము ఆనందించునట్లుగా - కన్నులార, కనుఁగొందున్; [ఉపమాలంకారము.]

నీవు, ఇపుడు, ... కూర్మి = ప్రేమ, నెరయన్ = నిండుగా, ... చిత్తము = అంగీకారము, అర సేయక = లోపము చేయక - ఉన్నట్లు (పూర్ణాంగీకారము కలిగియున్నట్లు), చెప్పితి= చెప్పితివి. నలినవదన = ఓపద్మాననా, నీవును వినుము, ... నెమ్మనమునందున్ = నిండుహృదయమునందు, ...

నెమ్మనము = నెఱ + మనము. - సీతారామాచార్యులవారు 'కొన్నియెడల తత్సమపదము పర మగునపుడును ద్విత్వము కానంబడుచున్నది.' అని సూత్రించి, ఉదాహరణములలో ఈశబ్దమును కూడ నొసంగినారు. ఇందలి 'మనము' తత్సమశబ్దము కాదు, 'మన'శ్శబ్దము ప్రాకృతమున 'మణ' శబ్ద మగును, దానికి 'మనము' వికృతి, కావున ప్రాకృతభవము; అట్టి 'మనము' శబ్దముతో 'నెఱ' శబ్దమునకు సమాసమై మద్విత్వము వచ్చినది గాన ఆచార్యులవారి సూత్రము ఈ శబ్దమునకు అపేక్షితముగాదు. ఇట 'మనము' తద్భవమే గాని తత్సమము గా దనుటకు 'నెమ్మనస్సు' 'నెమ్మనసు' అనుప్రయోగము లెటనుం గనఁబడమియు తార్కాణము.

శ్రవణముచేతఁ గాని దర్శనముచేతఁ గాని వలచినవారికి పరస్పరాప్రాప్తిచేతఁ గలుగు నట్టి దశావిశేషము పూర్వరాగ మనఁబడును. పూర్వరాగమందు కామదశలు పది సంభవించును. అవి యెవ్వి యన:—దృక్సంగము, మనస్సంగము సంకల్పము, జాగరము, కృశత, అరతి, హ్రీత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము. అందు సంకల్ప మనఁగా నాయికా (నాయక) విషయ మైన మనోరథము. నలుని సంకల్పావస్థను హంస ఈక్రిందిపద్యమున వర్ణించుచున్నది.

తే. వెలఁది, సంకల్పసోపాన వితతియందు (3-106)
నతఁడు నూడంగ సంచరిం తహరహంబు;
ధరణిపుఁడు దీర్ఘనిశ్వాసభరము నించు,
నద్భుతము గాదె మీచంద మరసి చూడ. 87

వెలఁది = ఓలేమా, సం...దున్ - సంకల్ప = ఆతనిమనోరథములనెడి - సోపాన = మెట్లయొక్క - వితతియందున్ = వరుసయందు, అతఁడు నూడంగన్, అహరహంబు = దినదినము, సంచరింతు = ఎక్కుచుందువు; ధరణిపుఁడు = (ఆ) రాజు, దీర్ఘ నిశ్వాస భరమున్ = నిడుదయూర్పుల మొత్తమును, నించున్ = నిండించును(విడుచును); అరసి = ఆలోచించి, చూడఁగా, మీ - చందము = విధము, అద్భుతము గాదె=ఆశ్చర్యము గాదా.—సోపాన వితానోపమాన స్వారస్య మే మనఁగా - సోపానములు మీఁదుమీఁదుగా నెట్లు ఎగువకు పోవుచుండునో ఆతనికోరికలును ముందుదాని నెల్ల వెనుకటిది మించినది గానే యుండును; కోరికల పరంపగలో ముందు కోరిన భోగముకన్న పిమ్మట కోరినది ఎక్కువదిగానే యుండును అనుట. ఆసంకల్పములయందు ఆమె సంచరించుట యనఁగా ఆసంకల్పము లెల్ల ఆమెతోడి భోగములకే అయి యుండుట. మఱి అద్భుత మే

మనఁగా, అలసినవారే నిట్టూర్పు పుచ్చుట లోకములో న్యాయ్యము; మీయెడల, అట్లుగాక; ఆమె కై క్కి యలసినదానవు నీవై యుండఁగా, అందులకు నిట్టూర్పులు పుచ్చువాఁడు ఆతఁ డగుట యద్భుతము.—నీతోడి సంకల్పభోగంబు లనుభవించుచు, నడుమ నడుమ అవి సంకల్పమాత్రములే అని జ్ఞప్తి కాఁగా, విరహదుఃఖ నిశ్వాసములు విడుచుచున్నాఁ డని భా.— వితతి - ఆహారవాంబు - దీర్ఘ - భరము. - ఈపదములు యర్థపుష్టిని సులువుగా ఊహించుకొనవచ్చును.

కారణ మైన యలయికకును కార్య మయిన నిట్టూర్పునకును భిన్న దేశత్వము న్యాయవిరుద్ధ మైనట్టిది చెప్పఁబడినది గాన నసంగత్యలంకారము :—

'ఫలహేతువులకు భిన్న । స్థలత ప్రసిద్ధిహత గా నసంగతి యమరున్;
జలదములు విషముఁ గ్రోలెం । సొలసిరి పెనుమూర్ఛఁ బథిక సుదతీ జనముల్.' అలం.

అద్భుతమునకు పూర్వత్రిపాదీవాక్యార్థము హేతువు గాన వా. హే. కావ్యలింగము.

తే. హంస తూలికా తల్పంబునందు మేను (1-108)
నేర్చినప్పుడు నేత్ర రాజీవ యుగముఁ
జేరి చుంబించి మోహింపఁ జేయ నతని,
నతివ, నిద్రయు నీవు నే మౌదు రొక్కొ? 88

ఈపద్యమున నలుని జాగరావస్థను వర్ణించుచున్నాఁడు ; జాగర మనఁగా నిదుర లేమి.— అతివ = ఓ కొమ్మా, (ఆరాజు), హంస తూలికా తల్పంబునందున్ = హంసల దూది (వంటి సన్నని యీఁకల) పానుపునందు, మేను చేర్చినప్పుడు = శయనించి నప్పుడు, నిద్రయు నీవును, చేరి = కదిసి (అతనిని కౌఁగిలించి యనుట), నేత్ర రాజీవ యుగమున్ = (ఆతని) కనుఁ దమ్మి దోయిని, చుంబించి = ముద్దుగొని, మోహింపఁ జేయన్ = ఆనందమున ముంపవలసి నందులకు, (అట్లు చేయకుండ), ఏమి ఔదురొక్కొ = ఎక్కడికి పోవుదురో - (చేరక, చుంబింపక, మోహింపఁజేయక యున్నా రనుట.) -నీవు లేమిచేత ఆతనికి నిద్రయు లేక పోయె నని భా.

[మోహింపఁ జేయన్ = మోహింపఁ జేయుచున్నారే, ఏ మౌదురొక్కొ = మీ కిరువురకును (నిద్రకును నీకును) ఎట్టి బంధుత్వమో? సవతులు సుమా యని భా. నిద్రతో కూడనే నీవును వత్తువు, ఆకంటిని నిద్ర చుంబించునప్పుడే, ఈకంటిని నీవు చుంబింతువు, లేదా - రెండుకన్నులను నిద్ర చుంబింపఁగానే దానిం ద్రోచి వానిని నీవు చుంబింతువు - అనఁగా నిద్ర పట్టిన వెంటనే నీ స్వప్న సమాగమము ఆతనికి కలుగును; అని వ్యాఖ్యాంతరము. ఈపక్షమున జాగరావస్థ వర్ణితము కాదు. స్వప్నసమాగమము వర్ణితము. పూర్వరాగమందు మాళవికలో స్వప్నసమాగమవర్ణన:—

'పథి నయనయోః స్థిత్వా స్వప్నే తిరోభవతి క్షణాత్,
సరతి సహసా బాహ్వోర్మధ్యం గతాఽప్యబలా సతీ;
మనసిజరుజా క్లిష్టస్యైవం సమాగమ మాయయా
కథమివ సఖే విస్రబ్ధం స్యాదిమాం ప్రతి మే మనః.']

'మోహింపఁ జేయ రతని' అనుపాఠము జాగరావస్థనే తెలుపును. 'చేతు రనిన' అను పూర్వముద్రణ పాఠమున 'చేతురు' అపశబ్దము, 'చేయుదురు' సాధువు.

వ. (a) బాల! యాలేఖ్యమయ భవన్మూర్తి సౌందర్య సందర్శన లాలసుండును, (b) నశ్రుధారా ధౌత దీర్ఘ లోచనుండును (శ-103), (c) నిశ్వాస పరంపరా సంపాత పరిమ్లాన పాటలాధరుండును, (d) ప్రవాళ శయ్యా శరణ క్రమ శరీరుండును, (e) మదన దాహ జ్వరారంభ కంపిత స్వాంతుండును, నయి, (f) విప్రలంభ వేదనా వికారంబున నకాండ హాసంబును నకారణ భయంబును ననవసర సముత్థాన సంభ్రమంబును నలక్ష్య ప్రేక్షణంబును నప్రతివచన వాగారంభణంబునుం గలిగి, (g) యార్తి ధారా ప్రవాహంబున మూర్ఛాంధకార పంకంబున మునుంగుచున్నవాఁడు; భవత్ప్రాపకంబైన దోషంబునకు వెఱవఁడు, దాస్యంబునకైన లజ్జింపఁడు (శ-110). 89

(a) బాల = ఓపిల్లా, ధరణిపుఁడు (87 చూ.), ఆలే... డును - ఆలేఖ్యమయ = వ్రాఁతప్రతిమ గామన్న - భవత్ = నీయొక్క - మూర్తి = తనువుయొక్క - సౌందర్య = చక్కఁదనముయొక్క - సందర్శన = చూచుటయందు - లాలసుండును = మహాభిలాషము కలవాఁడును ('కామోఽభిలాషస్తర్షశ్చ స మహాన్ లాలసా ద్వయోః' అమ.)

సదృశదర్శన ప్రతికృతిదర్శన స్వప్నదర్శన తదఙ్గస్పృష్టస్పర్శనములు విరహ వినోదములు:—

'వియోగేఽనురాగేవా ప్రియజన సదృశానుభవనం,
తత శ్చిత్రం కర్మ, స్వపనసమయే దర్శన మపి,
తదఙ్గస్పృష్టానా ముపనతవతాం స్పర్శన మపి,
ప్రతీకారోఽనఙ్గవ్యథితమనసాం కోఽపి గదితః.' — పతాక.

ఇట చిత్రలేఖన తద్దర్శనములను చెప్పినాఁడు.

(b) (చిత్తరువులోని నీ సౌందర్యమును చూచిచూచి నీవు ప్రాప్తింపని దుఃఖంబునం జేసి), అశ్రు...డును - అశ్రుధారా = కన్నీటి వెల్లిచేత - ధౌత = కడుగఁబడిన - దీర్ఘలోచనుండును = విశాల నేత్రములు కలవాఁడును - విరహులకు ప్రియజనాలేఖ్యదర్శనముచే బాష్పము లుద్గమించును:

'స్విన్నాఙ్గులి వినివేశో రేఖాప్రాన్తేషు దృశ్యతే మలినః,
అశ్రు చ కపోలపతితం దృశ్య మిదం వర్ణకోచ్ఛ్వాసాత్.' — శాకుంతలము.

'ప్రజాగరాత్ ఖిలీభూత స్తస్యాః స్వప్నే సమాగమః,
బాష్ప స్తు న దదా త్యేనాం ద్రష్టుం చిత్రగతా మపి.' — ,,

'త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైః శిలాయా
మాత్మానం తే చరణపతితం యావ దిచ్ఛామి కర్తుమ్,
అస్రై స్తావ న్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతే మే,
క్రూర స్తస్మి న్నపి న సహతే సంగమం నౌ కృతాన్తః.' — మేఘసందేశము.

ప్రకృతవాక్యమూలము లయిన యీ శ్లోకములం గన నగును:—

'లిఖితం దృష్ట్వా భిత్తివిభూషణం త్వాం నృపః పిబ న్నాదర నిర్నిమేషమ్
చక్షుర్భ్యా మశ్రు ప్లుత మాత్మ... భాగం విధత్తే రచితం త్వయా ను.

పాతు ర్దృశాఽఽలేఖ్యమయీం నృపస్య త్వా మాదరా దస్తనిమీల యాస్తి
మ మేద మిత్యశ్రుణి నేత్రవృత్తేః ప్రీతే ర్నిమేషచ్ఛిదయా వివాదః.'
అశ్రువులచేత లజ్జాత్యాగము సూచితము.

(*c*) (ఉక్తదుఃఖంబుననే) నిశ్వా ... డును - నిశ్వాస = నిట్టూర్పుల - పరంపరా=బారుల - సంపాత = దిట్టమయిన తాఁకుడుచేత - పరిమ్లాన = వాడిన - పాటల = శ్వేతరక్తమయిన (విరహపాండిమచేత ఎఱుపు తగ్గిన) - అధరుండును = మోవికలవాఁడును; [శ్వాసములచే వ్యాధ్యవస్థ కథితము - 'వ్యాధి స్తు దీర్ఘనిశ్వాస పాణ్డుతా కృశతాదయః.']

(*d*) (తాపశాంత్యర్థమై) ప్రవా...డును - ప్రవాళ = చిగుళ్ల - శయ్యా=సెజ్జ - శరణ=రక్షకముగాఁ గల (సెజ్జను శరణుఁజొచ్చిన) - క్రమ = మనోజ్ఞమైన - శరీరుండును ('క్రమ' - అనుటచే సుకుమారదేహుఁడు నీకై యింతగాసిం జెదుచున్నాఁడు, కాన నీ కనికరమునకు పాత్రము సుమా యని జాలిగొల్పుట;)

(*e*) (చిగుళ్లు కామోద్దీపకంబులును కామునికైదువులును అగుటచేత ఆసెజ్జవలన తాపము శమించుటకు బదులుగా అధికమే అగుటవలన), మద ... డును - మదన = మదనకృతమయిన-దాహ = మంటతోడి - జ్వర = జ్వరముయొక్క - ఆరంభ = రాకచే - కంపిత = వణఁకు పొందిన - స్వాంతుండును = హృదయముకలవాడును ; ద్వాదశావస్థల పక్షంబున (మంటచేత సంజ్వరావస్థ చెప్పఁబడినది - చివుళ్లు ఒడలిం గాల్చిన వనుటకు - 'నవకిసలయ తల్పం పుఞ్జి తాఙ్గార కల్పమ్.' పుష్పబాణ. 'నిడుద వేనలినూనెముడి వీడఁ జివురాకుఁబొదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియు కరణి.' మను. ఇత్యాదివర్ణనల నరయునది.)

(*f*) విప్ర...బునన్-(విప్రలంభ) = అయోగ దుఃఖమువలని తెవులుచేత, అకాండ హాసంబును=అవసరమునం గాని నవ్వును ('కాణ్డోఽస్త్రీ దణ్డ బాణార్వ వ ర్గావసర వారిషు' అమ.), అన...బును - అనవసర=అవసరము లేని - సముత్థాన = లేచుటయొక్క - సంభ్రమంబును = వేగిరపాటును (నిష్కారణముగా ఉన్నట్టే ఉండి లేచుట), అల ... బును - అలక్ష్య=గుఱి లేకయే - ప్రేక్షణంబును = చూచుటయు, అప్ర...బును - అప్రతివచన = ప్రత్యుత్తరము లేని - (లేక-కాని) వాక్ ఆరంభణంబునున్ = మాట లాడుటయు (తన్నెవరో ఏమో అడిగినట్లు ఉత్తరములు చెప్పుట, ఉత్తరము చెప్పువారు లేకయే ఎవరినో ఏమో ప్రశ్నలు అడుగుటయు);...[అకాండ హాసాదికములచే ఉన్మాదావస్థ సూచితము.]

(*g*) ఆర్తి ... బునన్ - ఆర్తి = పీడయొక్క - ధారా = పరంపర యనెడి - ప్రవాహంబునన్=ఏటిలో, మూర్ఛా అంధకార పంకంబునన్= అంధకారమువంటిదైన మూర్ఛ యనెడి బురదలో,...(ఇట మూర్ఛావస్థ కంఠోక్తము - రూపకాలంకారము); భవత్ ప్రాపకంబు = నిన్ను పొందించునది, ... 'భవత్ ... లజ్జింపఁడు' - లజ్జాత్యాగావస్థ చెప్పఁబడినది).

చ. మదనుఁడు రెండుచేతులను మార్పడ నేయఁగఁ, దూపు లైదునుం **(8-114)**
బది యయి, వేఱువేఱ పరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ,
దుదిదశ రాజునందుఁ దగఁ దోఁచుచు నున్నది యేను వచ్చుచోఁ;
నది చిగురాకుఁబోఁణి యట నంబర పుష్ప వికాస మయ్యెడిన్. 90

మదనుఁడు, రెండుచేతులన్ = తనరెండుచేతులతోను, మాఱుపడన్ = మార్చి మార్చి (ఎడమచేత విల్లు గొని కుడిచేతను, కుడిచేత విల్లు గొని ఎడమచేతను), ఏయఁగన్ = బాణములను ప్రయోగింపఁగా, తూపులు (= బాణములు) ఐదునున్ పది యయి, వేఱు వేఱ = ప్రత్యేకముగా (అనఁగా ఒక్కొక్కబాణము ఒక్కొక యవస్థఁ జొప్పున), పరిపాటిన్ = వరుసగా, అవస్థలు= మదనావస్థలను పదింటిని (87 చూ) -

> 'దృఙ్మనస్సఙ్గసంకల్పా జాగరః కృశతాఽరతిః
> హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ.'

సంఘటింపఁగాన్ = కలిగింపఁగా, తుది దశ = ఆపదియవస్థలలోఁ గడపటి దయిన మరణావస్థ, రాజునందున్ = నలునియందు, ఏను వచ్చుచోన్ = అతనికడనుండి నేను ఈరాయబారముకై తరలునప్పుడు, వెడ = ఇంచుక, తోఁచుచున్ ఉన్నది=అగపడుచుండినది; చిగురాకుఁబోణి = చిగురుటాకువలె కోమలమయిన దేహము గలయో దమయంతీ, అది = ఆకడపటిదశ, అటన్=అతనియందు, అంబర పుష్ప వికాసము=మింటి పువ్వుయొక్క విరియుటవంటి విరియుట కలది, అయ్యెడిన్=అగును. (మింటిపువ్వు అనునది మిథ్య గాన ఆదశ యతనియందు లేనిదే అగును. నేను బోయి నీకూర్మిం జెప్పెదను గాన ఆదశ అతనికి తప్పును అని భా. ఆదశను వర్ణింపఁగూడదు.

> 'రసవిచ్ఛేదహేతుత్వాన్మరణం నైవ వర్ణ్యతే
> జాతప్రాయం తు తద్వాచ్యం చేతసా కాఙ్క్షితం తథా.' సా. ద.

జాతప్రాయముగా వర్ణింపవచ్చును, కావున నిట నట్లే వర్ణితము.)

ఇట చేతులు మార్పక రెండు అయిదులు ప్రయోగించుటకన్న మార్పుచుఁ బ్రయోగించిన విశేషమేమి? ఎట్లైనను పదిబాణములే గదా అగును? అనిన, ఆమార్చుట సామర్థ్యగర్వమువలని విలాసవిశేషముగాను, లెక్క నిశ్చయముకొఱకును అని తలంపవచ్చును. లెక్కనిశ్చయ మేల యన, పదియవస్థలనుం దప్పక కలిగించుటకు. మఱియిట మరణమును మరణశబ్దముచే పేర్కొనక ప్రకారాంతరమునం దెలుపుట అమంగళత్వాది నివారణార్థము. ఈఫక్కికను ఈక్రింది యుదాహరణములందుం గనవచ్చును.

> 'తతో భావిని సంగ్రామే బద్ధశ్రద్ధస్య తాటకా
> స్వప్రాణాన్ రామబాణస్య వీరపాణ మకల్పయత్.' భోజుఁడు.

> 'క్షణమాత్రసఖీం సుజాతయోః స్తనయోస్తా మవలోక్య విహ్వలా
> నిమిమీల నరోత్తమప్రియా హృతచన్ద్రా తమసేవ కౌముదీ.' కాళి.

> 'రామమన్మథశరేణ తాడితా దుర్భరేణ హృదయే నిశాచరీ
> గన్ధవద్రుధిరచన్దనోక్షితా జీవితేశవసతిం జగామ సా.' ,,

'వెడ' అనుటకు 'తగన్' అని పూర్వముద్రణములపాఠము. 'తగన్' అని నలునిశత్రువులు చెప్పఁదగును.—మదనబాణములు అయిదు నెవ్వి యన:

> 'అరవిన్దమశోకం చ చూతం చ నవమాలికా
> నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.'

ఇట పదియేటులకును క్రమముగా పదిదశలు కల్గె ననుటచే యథాసంఖ్యాలంకార మని సాహిత్యవిద్యాధరి. తుదిదశ యంబరపుష్పవికాస మనుట మిథ్యాధ్యవసిత్యలంకారము.

వ. మదన శర వేదనా దోదూయమాన మానసుం డైన యతండు పుత్తేర నీ సమ్ముఖంబునకు వచ్చితి. నీచిత్తంబులోనిభావంబు నెఱింగితి. (3-115) 91

మద ... డు — మదనశర = మన్మథబాణముల - వేదనా = నొప్పిచే - దోదూయమాన = మిక్కిలి వేఁపఁబడుచున్న - మానసుండు = హృదయముకలవాఁడు, ... పుత్తేరన్ = పంపఁగా, నీ - సమ్ముఖంబునకున్ = ప్రోలకు, ...

తే. తరుణి, వైదర్భి నీ వెట్టి ధన్య వొక్కొ! (3-116)
భావ హావ విలాస విభ్రమ నిరూఢిఁ
గౌముదీలక్ష్మి యప్పాలకడలిఁ బోలె,
నదురఁ జేసితి నైషధునంతవాని! 92

తరుణి = ఓయువిదా, వైదర్భి = ఓవిదర్భరాజకుమారీ, ... భావ ... ఢిన్ - (భావాదుల లక్షణమును 37-చూ.) భావాదులయొక్క పాటవముచేత, కౌముదీ లక్ష్మి = వెన్నెల సిరి, ఆ - పాలకడలిఁబోలెన్ = పాలసముద్రమును ఎట్లో అట్లు, నైషధునంతవానిన్ = అంత ధీరుఁడయిన నలమహారాజును, అదురన్ = చలించునట్లు, చేసితి(వి).— కౌముదీసంపద అంత గంభీర మయిన సముద్రమును ఎట్లు చలింపఁజేయునో అట్లే నీవును (నీగుణాతిశయములచేత) అంత ధీరుని నిషధ రాజును కామకాతరుం జేసితివి. కావున నీవు కరము ధన్యురాలవు. నీ భావ హావ విలాస విభ్రమములు అంత లోకోత్తరములు.

ధన్యతకు అదురఁజేయుట కారణముగాన వాక్యార్థక హేతుక కావ్యలింగము; అది కౌముదీ సాదృశ్యోక్తిచే నుపమాసంసృష్టము.

వ. చంద్రుఁడునుఁ జంద్రికయుఁబోలెఁ, బువ్వునుం దావియుంబోలె, రసంబును భావంబునుంబోలె, నవినాభావసంబంధంబున నతండును నీవును నన్యోన్య ప్రేమానుబంధంబున ధన్యత్వంబు నొందుండు(3-117). పాణిద్వయంబుచేతం బల్లవితంబును మందస్మితంబుచేతం గోరకితంబును శరీరసౌకుమార్యంబుచేతం బుష్పితంబును గుచభరంబుచేత ఫలితంబును నైన భవన్మూర్తికల్పపాదపంబునకు నృపతినందనుండు నందనోద్యానం బయ్యెడుంగాక మఱియును. (3-120, 121) 93

చంద్రిక (=వెన్నెల) చంద్రునితోనేగాని ప్రత్యేకముగా నుండదు, తావి పూవుతోనేగాని ప్రత్యేకముగా నుండదు, అట్లే నీవును నలునితోనే యుండవుగాక; రత్యాదిభావమే శృంగారాది రస మగును, అట్లే నీవే అతఁడు అతఁడే నీవు కండు, అనఁగా అభేదముగా నుండుఁడు; అని భా.

'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీ భావో రసః స్మృతః.'

అవినాభావము = పాయకయుండుట. పాణి ద్వయంబుచేన్ = చే దోయిచేత, పల్లవితంబును= చిగుళ్లు పొందినదియు (చేదోయి యనెడి చిగుళ్లం బొందినదియు) మంద ... నైన = లేనగవనెడి మొగ్గం బొందినదియు, దేహసౌకుమార్య మనెడి పుష్పమును బొందినదియు, వలుదపాలిం డ్లనెడి

పండ్లం బొందినదియు నయిన - భవత్ మూర్తి కల్ప పాదపంబునకున్ = నీ సెమ్మెననియెడి కల్ప వృక్షమునకు, నృపతినందనుండు = ఆరాజకుమారుఁడు, నందన ఉద్యానంబు = ఇంద్రుని యుప వనము ... ['పాణి ... అయ్యెడున్ గాక' – రూపకాలంకారము.]

తే. మహిత బంధాఢ్య రతి కేళి మల్ల యుద్ధ (3-124)
సమయములయందు దివి మరు త్సముదయంబు
గుసుమ వర్షంబు మీమీఁద గురియుఁగాక
వనజ దళ నేత్ర, శృంగార వనములోన. 94

వనజ దళ నేత్ర = తేఁకులవంటి కన్నులుగలదానా, శృంగారవనములోనన్ = కేళికారామమునందు, మహిత...యందున్ = ఉత్కృష్టములయిన పంకజాసనాది బంధములచేత (జెట్టిపట్లచే ననియు) (ఆఢ్య=)సమృద్ధమయిన సురత క్రీడయనెడి జెట్టి పోరితపు వేళలందు, మీమీఁదన్= నీమీఁదను నలునిమీఁదను, దివిన్ = ఆకాశమునుండి (స్వర్గమునుండి యనియు), మరుత్ సముదయంబు = వాయువుల (దేవతల యనియు) సముదాయము, ...

యుద్ధమాడువారిని దేవతలు వచ్చి చూచి గెలిచినవారిపై సంతసమునై పూలవానం గురియుట ప్రసిద్ధము; కావున వింతవింతబంధములతో జెట్టిపోరివలె నొప్పుమీరతిక్రీడలో, నీవు మీఁదైన నీమీఁద, అతఁడు పైఁదైన అతనిమీఁదను, సమ మయిన యిరువురమీఁదను, చెట్లనుండి తెమ్మెరలు రాల్చు విరులవాన మీమీఁ గెలుపులకు నలరి వేల్పులు గురిసిన విరివాన యన నొప్పునట్లుగా, మీరు శృంగారవనములో నానావిధ రతబంధములతోడి సురతక్రీడలం దేలుచు, ఆవిరులవానచే సేదఁదేరుచు, నెమ్మనై నుందురు గావుత.

'చెలి మరుత్సముదయంబు' అని పూర్వముద్రణములపాఠము. దీనిం గొన్న రెండుసంబుద్ధులగును; 'చెలి'ని సముదయమునకు విశేషణము సేత హృద్యము గాదు; పైగా చెలితనమొకటి కల్పించుకొనవలయు.— ఇందు రూపకాలంకారము, శ్లేషానుప్రాణితము.

చ. నెలఁతుక యానృపాలునకు నీకుఁ బరస్పర సంగమంబునం (3-125)
గలయఁగ డాసి మానస యుగంబు వికాసము నొందుఁగాక పూ
విలుతుని దేహయష్టిఁ బ్రభవింపఁగఁ జేయ సమర్థ మైన ని
ర్మల పరమాణు యుగ్మకము మాడ్కిని దైవ మనోనుకూలతన్. 95

నెలఁతుక = ఓకలికీ, ఆనృపాలునకును నీకును, పరస్పరసంగమంబునన్ = ఒండొరులతోడి పొందునందు,మానస యుగంబు=(మీ) రెండు మనస్సులును, కలయఁగన్=ఒకటిగా కూడునట్లుగా, డాసి = కదిసి, దైవ...తన్ – దైవ=విధియొక్క - మనః=చిత్తముయొక్క (సంకల్పముయొక్క యనుట) - అనుకూలతన్ = పొందికచేత, పూ...ష్టిన్ - పూవిలుతుని = మదనుని - దేహయష్టిన్ = కఱ్ఱవంటిదేహమును, ప్రభవింపఁగఁ జేయన్ = పుట్టించుటకు, సమర్థము = శక్తిగలది, ఐన - నిర్మల పరమాణు యుగ్మకము మాడ్కిన్ = స్వచ్ఛమయిన పరమాణు ద్వంద్వమువలె, వికాసమున్ = ఉత్సాహమును, ఒందుఁగాక = వహించుఁగావుత.

మనస్సు పరమాణు రూప మని నైయాయికమతము. ఈశ్వరుని యిచ్ఛవలన పరమాణువుల యందు చలనము కలుగును, దానిచే రెండు పరమాణువులు కలసికొని ద్వ్యణుక మగును, అట్లే మూఁడు ద్వ్యణుకములు కూడిన త్ర్యణుక మగును, ఈ తీరున చతురణుకాదిక్రమమున పృథివ్యాది మహాభూతంబులు ఉత్పన్నము లగును.—అనియు నైయాయిక సిద్ధాంతము.

మీరు ఇరువురును ఒండొరులం బొంది అత్యంతైకమత్యము గలిగి మనోరథాతీతము లయిన కామసౌఖ్యములం బొందుదురుగాక యని భా.

దైవము పూవిలుతుని వపుస్సృష్ట్యారంభముకై వీరి మనఃపరమాణువులనే ఏటికో నేల మఱి యెవరివియు పనికిరావా యనిన.— అంత సుందరదేహముం జేయుటకై మఱి యేదంపతులవియు ఇంత నిర్మల పరమాణువులు గావు. దంపతులవే యేల యన, కాముఁడు దాంపత్య ఫల కారకుఁడు గదా. మఱియు వీరిమనస్సులు కలసినట్లు మఱి యేదంపతులమనస్సులును కలయవుగాన వానివలన ద్వ్యణుక మేర్పడదు. మఱియు 'యష్టి' 'సమర్థ' శబ్దములచే ఈద్వ్యణుకమందు బీజభావము స్ఫురించుచున్నది. బీజమందు దళద్వయము ఒక్కటిగా కలసియుండును, ద్వ్యణుకమందును రెం డణువులు ఒక్కటిగా కలసికొని యుండును. క్షేత్ర జల దోహదాదు లెట్లున్నను ఏబీజమునకు ఆచెట్టే మొలచునట్లు మదనరాగపూర్ణాణుద్వితయమయిన యీ బీజమునకు అవయవాదిపోషణ దేన నయినను కాముఁడే ఉద్భవించును. ఇది 'నిర్మల'మై కేవలానందమయమాత్రముగా నున్నది గావున దీనం బుట్టు కాముఁడును వెండి ముక్కంటి కంటం బడుట లోనగు కడగండ్లెఱుంగక పరమభాగ్యముం బొందు నని భా.— ఉత్ప్రేక్షాలంకారము.

శా. గ్రీవాలంకృతి పట్ట సూత్ర లతికా శ్రీకార రేఖాంకితన్ (3-126)
దేవీ, యవ్రణ వంశ సంభవ గుణాన్వితన్ నినుం గాయజుం
డావిర్భూత రతిం ధనుర్లతిక గా నంగీకరించున్ బలే!
పూవింటన్ నిషధాధినాథు గెలువం బూనంగ రాకుండుటన్. 96

దేవీ, కాయజుండు = మదనుఁడు, పూ ...టన్ = పూవింటితో నలమహారాజును (జితేంద్రియుని) గెలువ శక్యము కానందున, గ్రీ ... తన్ – గ్రీవా = మెడకు - అలంకృతి = ఆభరణమయిన- పట్ట సూత్ర లతికా = తీఁగవంటి పట్టు దార మనెడి - శ్రీకార రేఖా=శ్రీకారపు గీఁతచే- అంకితన్ = గుర్తింపఁబడినదియు, [ధనుస్సు చేసికొనువారు వెదురుమొలకలో బోలులో సిందూరము పెట్టుదురు. ఆసిందూరము దాని పచ్చితోఁ గలసిపోయి గెడ యెదిగినకొలఁదియు దాని కంతటికి వ్యాపించును. దానిపై నొక్కెడ కాలాంతరమున పక్వతా పరీక్షార్థమై కత్తితో శ్రీకారమువలె రేఖ గీయుదురు, ఆగీఱలో సిందూర మఱికనేని ఆగెడ ముదిరినదియు ధనుర్యోగ్యంబు నని పరీక్ష. 'అపక్వం భఙ్గ మాయాతి అతిజీర్ణం తు కర్కశమ్.' శార్ఙ్గ. దమయంతి మెడమీఁద వెనుకప్రక్కను ఇంచుక వ్రేలుచున్న యెఱ్ఱపట్టుదారము సిందూర వర్ణవంత మయిన యా శ్రీకారరేఖవలె నున్న దని భా. శ్రీకారముగా గీయుట విజయమంగళార్థము.] అవ్రణ వంశ సంభవన్ = దోషములేని కులమందుఁ బుట్టువుగలదానిని (నుసిపురుగుల తొలులు గాయములు లోనగు దోషములు లేని వెదురుతో చేయఁబడినదానిని), గుణ అన్వితన్ = లావణ్యాదిగుణములతో కూడుకొన్నదానిని (అల్లెత్రాటితో కూడుకొన్నదానిని), నినున్, ఆవిర్భూత రతిన్ = స్ఫుటమైన (మెండుకొన్న యనుట) యనురాగముతో, ధనుః లతిక కాన్ = తీఁగవంటి ( అనఁగా

సన్నమయిన - అందమైన - చేతికి ఇమ్మయిన) విల్లుగా, అంగీకరించుకొ బలే = కైకొనును జుమా.

మన్మథుఁడు జితేంద్రియుని నలమహారాజును అన్నువ యైన క్రొన్ననవింట గెలువ శక్యము గాక నీవే యనెడి సర్వసిద్ధి లక్షణ సంపన్న మయిన వెదురువింటిని నలజయార్థమై మహాప్రీతితోఁ గైకొనును జుమా.—కామునికి నీవు దప్ప వేఱు నలవశీకరణ సాధనము లే దని భా.

ఇందుఁ జెప్పిన పట్టసూత్రము వరుఁడు గట్టు మంగళసూత్రము గాదు, వివాహమునకు పూర్వము కన్యలు ధరించునట్టిది. సౌవర్ణాద్యాభరణవంత మయిన సూత్రవిశేషము. ఈచెప్పిన మదనవిజయంబును వివాహమునకు ముందుదే, కాదేని నలుఁడు స్వయంవరమునకు రానే రాఁడు. ముందు ఈమె దర్శన మెక్కడిది? అనిన, స్వప్నచిత్రాదులయం దని యెఱుంగునది.

> ' మన్యే శఙ్కే ధ్రువం ప్రాయో నూన మిత్యేవమాదిభిః
> ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః.' — దండి.

పాఠము 'బలెకా' 'బలే' అను రెంట నే దయినను 'బలెకా' ఇవార్థక మగుటచేతను, 'బలే' ధ్రువార్థక మగుటచేతను ఉత్ప్రేక్షాలంకారము రూపకానుప్రాణితము. పూవింట జయము లేదు, నీమేనివింట జయము కలదు, అని వ్యతిరేకాలంకారంబును ధ్వనించుచున్నది.

'శ్రీకారరేఖాంకితకా' - శ్రీకారశబ్దముచేతనే రేఖ గమ్య మగుచున్నదిగాన 'శ్రీకారసిందూరికకా' అని పఠించిన వివక్షితార్థమును మూలానుగుణ్యంబును స్ఫుటతరంబు లగును. మూలము:—

> ' కామః కౌసుమచాపదుర్జయ మముం జేతుం నృపం త్వాం ధను
> ర్వల్లీ మవ్రణవంశజా మధిగుణా మాసాద్య మాద్య త్యసౌ
> గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా పృష్ఠే కియల్లమ్బయా
> భ్రాజిష్ణుం కషరేఖ యేవ నివస త్సిన్దూర సౌన్దర్యయా.'

తే. తరుణి, నత నాభి మండ లోదంచ నాభి (3-127)
రామ రోమావళీ జ్యా విరాజమాన
నీదుతను వుండవిలు సేసి నెఱకు లేయు
రతివరుఁడు హారగుళికల రాజహంసు. 97

తరుణి = ఓ జవరాలా, రతివరుఁడు = మన్మథుఁడు, నత ... మాన— నత = లోఁతయిన - నాభి = పొక్కిటియొక్క - మండల = బింబమనెడి - ఉదంచన = ఉండ నుంచెడిరంధ్రముచేత- అభిరామ = రమణీయమయిన - రోమావళీ = నూఁగారనెడి - జ్యా = అల్లెత్రాటిచేత - విరాజమాన = ప్రకాశించుచున్న దానిని, నీదుతనువు = నీదేహమును, ఉండవిలు = గుళికాధనుస్సుగా, చేసి, హారగుళికలకా - హార = నీబన్నసరములయొక్క - గుళికలకా=ముత్త్యాలనెడి యుండలతో, రాజ హంసుకా = రాజ వరేణ్యుని (రాజనెడి హంస ననియు), నెఱఁకులు ఏయుకా = మర్మములు కొట్టును.—రూపకాలంకారము.

దమయంతి యనెడి యుండవింటి బద్దఁగో ఆమెయొక్క హారమౌక్తికము లనెడి యుండలతో మన్మథుఁడు నలమహారాజును గుఱిపెట్టి కొట్టును. ఈయుండవింటిబద్దకు నూఁగారే నారి, నాభియే అందులో ఉండపెట్టెడు బిలము.—ఇట విల్లు నడుమ ఉండఁ బెట్టుటకు బద్దచిక్కము గలిగిన జంటనారితోడిది గాదు; ఉండఁబెట్టుటకు నడుమ గుండ్రని రంధ్రము కల యొంటినారిది చెప్పఁ

బడినది; తత్పరము ఉదంచన శబ్దము. నూఁగారు ఏకరాజియే గాన ఒంటిసారియే మంచి యుప మానము. పూర్వముద్రణమున నుత్తరార్ధ మిట్లున్నది:—'నీదుతను వుండఁ జేసి తా నెఱఁకు లేయు| రతివరుఁడు హారగుళికత రాజవదన.' పూర్వతమ ముద్రణములందు:—'...వుండవిలు సేసి...హార గుళికల ...' అని భేదము. ఉదంచనశబ్దమునకు పైకి త్రోయుసాధనమని యౌగికార్థము చెప్పుకొని దానిచే పూర్వోక్త బిలమునే గ్రహింపవలసినది. మూలములో బిలము కంఠోక్తముగా చెప్పఁబడి యున్నది.—మఱియు ఈమె తనువును ఉండ చేసిన పిమ్మట పెండ్లి ఎవరికి? ఉండకు పెండ్లి యేల? నెఱఁకులు ఎవరివి? రెండు సంబుద్ధు లేల? విరాజమానాంత సమాసముం గూడ సంబుద్ధి గాఁ గొనిన మూఁడగును. అట్లు చేయక తనువునకు విశేషణము సేసిన, స్త్రీత్వ మెట్లనిన, — 'కాయో దేహః క్లీబపుంసోః స్త్రియాం మూర్తి స్తను స్తనూః' అనునమరవచనముచే తనుశబ్దమేని తనుశ్శబ్ద మేనియు స్త్రీలింగము, దానివిశేషణంబుగాన దీనికిని వైకల్పికముగా స్త్రీత్వము కలుగును. 'మహ తీతరంబు లగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు' బా. వ్యా.—మూలముం గన నగును. 'రాజవదన' యనుటకు ఒకానొక వ్రాఁతపుస్తకమందు 'రాజహంస్స' అని యున్నది. ఉండవింటికిఁ ఇతర జంతువుల నేయుటకన్న పిట్టల నేయుట ప్రసిద్ధము; మూలమున హంస త్వారోపమే కలదు; కావున 'రాజహంసు' అనునదియె శ్రీనాథునిపాఠము. మూలము:—

> 'త్వద్గుచ్ఛావళి మౌక్తికాని గుళికా స్తం రాజహంసం విభో
> ర్వేధ్యం విద్ధి మనోభువః స్వ మపి తాం మఞ్జుం ధనుర్మఞ్జరీమ్
> యన్నిత్యాఙ్క నివాస లాలిత తమ జ్యా భుజ్యమానం లస
> న్నాభీ మధ్యబిలా విలాస మఖిలం రోమాళి రాలమ్బతే.'

వ. అని పలికి, వీరె సఖులు వచ్చుచున్న వారు, మంత్ర రహస్యంబులు బయలుపడ కుండవలయు, నన్ను వీడుకొల్పు, పోయివచ్చెద. నని తదనుమతి వడసి గగనమార్గంబున నిషధాధిపరాజధానికి నభిముఖుం డై చనియె నప్పుడు.

మంత్ర = మంతనముయొక్క. అనుమతి = అంగీకారమును, వడసి = పొంది, గగన = ఆ కాశ. చనియెన్ – దీనికికర్త 88–లో 'ఆపరమేష్ఠి వాహనకులాగ్రణి.' **(3-129)**

మ. మరు వాలారు శరంబులం దొరఁగు కమ్మందేనెతోఁ గూడి య **(3-130)**
యర్యరవిందాక్షికిఁ బక్షిపుంగవ గవీ హైయంగవీనంబు ని
ర్భరహర్షంబు నొనర్చె మున్ను రుచి సౌరభ్యంబులం, బిమ్మటన్ [99
మురియం ద్రోయుచు నించె నెమ్మనమునన్ మూర్ఛాసముచ్ఛ్రాయమున్.

అ – అరవింద అక్షికిన్ = తామరస నయనకు, పక్షి పుంగవ గవీ హైయంగవీనంబు = విహ గేంద్రునియొక్క 'హంసయొక్క' వాక్కనెడి నిన్నఁటియావుపాడియొక్క నేయి, మరు వాలారు శరంబులన్ = మదనుని వాఁడి బాణములనుండి, తొరఁగు ... తోన్ = తొరఁగు = స్రవించు చున్న – కమ్మందేనెతో = తీయనిమకరందముతో, కూడి = కలసి, మున్ను = తొలుత, రుచిసౌర భ్యంబులన్, రుచి = మనోజ్ఞతచేతను (చవిచేత అనియు) – సౌరభ్యంబులన్ = ప్రసిద్ధిచేతను (తావిచేత అనియు), నిర్భర హర్షంబున్ = పట్టరాని సంతోషమును, ఒనర్చెన్ = కలిగించెను,

పిమ్మటఁ = తరువాత, మరియుఁ = తిరుగుడువడునట్లు, త్రోయుచుఁ, నెమ్మనమునఁ = నిండుమదిలో, మూర్ఛా సముచ్ఛ్రియముఁ = సొమ్మయొక్క పెంపును, ఊన్చెఁ = పూన్చెను [పా. నించెఁ = నిండించెను. 'పూను'నకు ధరణార్థమున రూ. 'ఊను' 'కన లూను కీనాళ కాసరమ్మునుబోలె' (మను.) ఇత్యాది ప్రయోగములందు దృష్టము. కావున బాలవ్యాకరణోక్తిని పాటింపక అప్పకవివచనము నిట నంగీకరింపవచ్చును:—

'పూనుపొదవుల కాదిలోపం బొకానొకండు వచించె నది యవిచార మూలకంబు.' బా. వ్యా.

'పూనె నెగసెఁ బొదవెఁ బొనరెఁ బొందె నటన్న । పలుకులందు మొదలఁ గలుగునట్టి

వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు । నిలుచు వలయునపుడు నీరజాక్షు.' అప్ప.]

దమయంతికి హంసవచనములును అవి గలిగించిన మదనోదయంబును హైయంగవీనముతోఁ గలసిన క్రొత్తపుఁదేనెవలె, మాధుర్యముచేతనుంబోలె మనోజ్ఞతచేతను, పరిమళముచేతనుం బోలె ప్రసిద్ధిచేతను, తొలుత పట్టరాని సంతోషమును గలిగించి, హంస వీడుకోలు వడసి చన్న యనంతరము మనస్సును తిరుగుడువడఁ జేసి మూర్ఛం గలిగించెను.—దమయంతికి హంస సన్నిధిలోనున్నంతసేపు ప్రత్యాశోత్పత్తిచేత సంతోషంబును, అనంతరము విలంబాసహతచేత దుఃఖంబునుం గలిగె నని భా.—తేనెతో సమభాగముగాఁ గలసిన నేయి విష మగును.

'భజతే విషరూపత్వం తుల్యాంశో మధుసర్పిషోః.' వాగ్భటము.

'శ తాన్యస్యాః కాఞ్చీమణిరణిత మాకర్ణ్య సహసా
యదాశ్లిష్య న్నేవ ప్రశిథిల భుజగ్రన్థి రభవః;
త దేతత్ క్వాచక్షే ఘృతమధుమయ త్వద్బహువచో
విషే ణాఘూర్ణన్తీ కి మపి న సఖీ మే గణయతి.' అమరు.

తిరుగుడువడుటయు (ఘూర్ణనమును) మూర్ఛయు విషకార్యములు

'వాలారు' - వాలు = వాడి - ఆరు = ఒప్పుచున్న - అని మహాకవి ప్రయోగ మహిమచే తద్ధర్మార్థక విశేషణభావముం గోలుపోయి రెండు పదము లయినను ఏకపదీభావంబును పొందిన విశేష్యనిఘ్న మయినది. 'వాలారుతై కరజంబు లిగ్గిరించె' 'అని పారి. 'వాలారుం గొన గోళ్లనీ వలసతఁ వాయించుచో' అని మను. తద్ధర్మార్థక విశేషణ మయినచో నుగాగమము రాదు. 'కమ్మందేనె' — అదంతగుణవాచకంబులకు నుగాగమము తనంబు పరంబగునపుడు విహితము గాని సమాసమందుఁ గాదు. అయినను సీతారామాచార్యులవారు 'కమ్మ' శబ్దముక్రింద 'కమ్మఁగూర' అని సార్థానుస్వారముగా ముద్రించినారు. తమప్రౌఢవ్యాకరణమునందు 'గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు బిందు వగు' నని ప్రక్రియ వ్రాసి ప్రకృత ప్రయోగము నే యుదాహరించినారు.—రూపకాలంకారము.

తే. ప్రాణబాంధవుఁ డైన య ప్పక్షిరాజు (3 - 131)
నభ్రమార్గంబునం దొయ్య ననుచరింప,
నశ్రుధారాప్రవాహంబ యవధి గాఁగ,
దైన్య మందుచు మరలె వైదర్భిచూడ్కి. 100

వైదర్భి చూడ్కి = దమయంతి చూపు, ప్రాణ...రాజుఁ = (తనకు నలమహారాజును కూర్చి ప్రాణదానము సేయుటవాఁ డగుటచేత) ప్రాణములకు బంధుఁడయినట్టి (ప్రాణములవంటి బంధు

వయిన యనియు) యాహంసను, అభ్ర మార్గంబునందుక్ = మింటి దారియందు, ఒరప్యక్ = తిన్న గా, అనుచరింపక్ = సాఁగనంపుటకు, అశ్రు ధారా ప్రవాహంబ = కన్నీటి యేటి వఱదయే, అవధి = హద్దు, కాఁగాక్, దైన్యము అందుచుక్ = దీనభావమును పొంది, మరలెను

లోకులు దేశాంతరము పోవు ప్రాణబంధువులను 'ఓదకాన్తం హి బాన్ధవా అనువ్రజన్తి' అను వచనముబడి నీటివఱకు సాఁగ నంపి దీనతతో మరలి వత్తురు. అట్లే దమయంతిచూపు తన ప్రాణబంధు వయినహంసను ఆకాశమార్గమున తన కన్నీళ్ల యేఱే అడ్డము అగునంతదాఁక సాఁగ నంపి దైన్యముతో వెనుకకు మరలినది. దమయంతి మింటం బోవుచున్న హంసను కనుచూపు మేర వఱకు చూడవలయు నని చూడం దొడంగుడు తత్ ప్రాణప్రియ బంధు ప్రవాస దుఃఖము ముంచు కొని రాఁగా కన్నీళ్లు వఱద యై ఆబంధునిం గానరాకుండం జేసినవి. కన్నులు తుడుచుకొని చూచు నప్పటికి హంస చూపుమేర దాఁటి పోయినది. కావున నంతట దమయంతి దాని దిక్కునం జూచుట మానినది అని భా. ఇట దృష్టికి ప్రాణబాంధవుఁ డని హంస చెప్పఁబడియెఁ గావున హంసపోక దృష్టిపోకగానే యుండె నని, అనఁగా అంత దుఃఖకరముగా నుండె నని, భా.— చూడ్కియందు బంధుజనుని సాఁగనంపు బంధుజనవృత్తాంతము స్ఫురించుచున్నదిగాన సమాసోక్త్యలంకారము.

వ. ఇవ్విధంబునఁ బక్ష విక్షేప సూచిత నిజ కార్య ప్రయోజనసద్భావుం డై యమ్మహానుభావుండు దనరాక కెదురుసూచుచుం దటాక ప్రాంత కేళీవనాంత రంబున నశో కానోకహ చ్ఛాయా శీతల శిలాతలంబున నుపవిష్టుం డైన నిషధ రాజుం గనుంగొని, తన పోయి వచ్చిన వృత్తాంతం బంతయు నెఱింగించిన, ముదిత స్వాంతుం డై. (3-132) 101

పక్ష ... వుండు - పక్ష = ఱెక్కలయొక్క - విక్షేప = కదలించుటయొక్క - భేద = ప్రకారవిశేషముచేత - సూచిత = తెలుపఁబడిన - నిజ = తనదైన - కార్య = పని యొక్క - ప్రయోజన = ఫలముయొక్క - సద్భావుండు = సిద్ధికలది. ... ఆ మహానుభావుఁడు= గొప్పప్రభావము కలదయిన యా హంస; ... అనోకహ = చెట్టుయొక్క - ఛాయా = నీడచేత - ... ఉపవిష్టుండు = కూర్చున్నవాఁడు, ముదిత = సంతోషమును బొందిన - స్వాంతుండు = మానసము గలవాఁడు.

'తన పోయి వచ్చిన వృత్తాంతంబు'—ఈ సమాసంపు స్వరూపము నరయవలయును; నడుమ 'పోయిన' యను ధాతుజ విశేషణమునకు మాఱుగా 'పోయి' యనుక్త్వార్థ కావ్యయము ప్రయుక్త మయినది. సీతారామాచార్యులవారు ధాతుజ విశేష ణోభయపద కర్మధారయమునకు 'కొట్టిన తిట్టిన యాశఁడు' భోజ., 'కలిగిన యొప్పని దోసములు' విజ్ఞా., 'ఎత్తినపెంచినవారి' విక్ర., అను నుదాహరణంబుల నొసంగినారు. అందు 'సమానాశ్రయం బగు పూర్వకాలిక ధాతుజ విశేషణమునకు క్త్వార్థకరూపము విభాష నగు' ననియుం జెప్పిన యెడల ప్రకృత సమాసమునకు గతి యగును.... 'ముదితస్వాంతుం డై'—ఇందలి క్త్వార్థకంబునకు కర్త 105 లోని 'పృథ్వీనాయకుండు.'

రాజు హంసను మెచ్చుకొనువిధము:—

మ. సరసత్వంబు నిగూఢ కార్య ఘటనా చాతుర్య సంపత్తియుం
బుధ షాడ్గుణ్య పరాయణత్వమును నభ్యూత్థాన లీలా ధురం

ధరతా ప్రౌఢియునుం గృతజ్ఞతయు వాత్సల్యంబు సద్భావముఁ
సరసీజాసనవాహనాన్వయవతంసా హంస, నీ కందముల్. 102

సరసీజ ఆసన వాహన అన్వయ వతంసా=బ్రహ్మ వాహనముల వంశమునకు శేఖరమైనవాఁడా ('ఉత్తంసః కర్ణపూరేఽపి శేఖరే చావతంసవత్' విశ్వుఁడు), హంస = ఓహంసమా, నీకుఁ, సరసత్వంబు=(శృంగారాది) రసముల నెఱుంగుట (ఇట ముఖ్యముగా శృంగారమును - ఇది రాజునకు దమయంతిం గూర్పఁ బూనుటచేతఁ దెలియుచున్నది), నిగూఢ కార్య ఘటనా చాతుర్య సంపత్తియుఁ = రహస్యముగా కరణీయముయొక్క సాధించుటయందలి నేర్పుయొక్క కలిమియు (దీనికి 108 విస్తరము), పురుష అర్థ ఏక పరాయణత్వముఁ = పురుష ప్రయోజనములందు ముఖ్యమయిన తాత్పర్యమును (ధర్మార్థకామమోక్షము లని పురుషార్థములు నాలుగు - 'ధర్మార్థకామమోక్షాశ్చ పురుషార్థ ఉదాహృతాః' మనువు; 'పరాయణం క్లీబ మిష్టాశ్రయయోస్తత్పరే త్రిషు.' నానా. ప్రత్యుపకారముగా స్త్రీని గూర్చువాఁడు ఎవతెనేని మహాసుందరిని ఉంపుడుగత్తెంగాఁ గూర్పక గార్హస్థ్యధర్మోపాదక మయిన వివాహముం గావింపం దొడంగుట ప్రథమపురుషార్థమైన ధర్మమందలి తాత్పర్యమును తెలుపుచున్నది), అభ్యుత్థాన లీలా ధురంధరతా ప్రౌఢియునుఁ = పూనికయొక్క క్రీడను నిర్వహించుటయందు నేర్పును (ఇది అంతలోఁ బోయి అంతలో కార్యమును సాధించుకొని వచ్చుటచే తెలియుచున్నది - 'ప్రౌఢిమయుఁ' అని పూర్వముద్రణ పా. 'ప్రౌఢిమ' శబ్దము సిద్ధింప దని వామనోక్తి), కృతజ్ఞతయుఁ= చేసినమేలు మఱవమియు (ఇది ఈప్రత్యుపకారముచేతనే తెలియుచున్నది), వాత్సల్యంబుఁ= అనురాగమును, సద్భావముఁ= నమ్మకమును, (ఇది మరల వచ్చి రాజుచేతిలో వ్రాలినప్పుడే తెలిసినది. సద్భావ మనఁగా నమ్మక మనుటకు:—

'సద్భావం ప్రతిపన్నానాం వఞ్చనే కా విదగ్ధతా?
అఙ్క మారుహ్య సుప్తస్య హననే కిన్ను పౌరుషమ్?' విక్రమ.)

అందముల్ = సొంపులు (భూషణము లనుట - సర్వసుగుణభూషితుఁడ వని స్తుతి.) [నీకందముల్ - నీ (వనెడి కల్పతరువున) కు వేరులు-ఈవేరులు నీవుగా పరిణమించినవి-అని కొందఱ స్వారస్యోక్తి.]

సరసత్వాదులయందు భూషణత్వారోపముచే రూపకము. సరసత్వాదిబహుగుణములు యీగ పద్యంబున 'నీ కందముల్' అను విధేయముతో నన్వయించుటచే సముచ్చయము:—

'అగు వర్ణింప ననేకము। యుగపద్భావాశ్రయము సముచ్చయ మనఁగా.' అలం.

క. పరవతి యగు దమయంతిని । ధరణీధవ కన్య నల్పతారుణ్య సఖీ [103
పరివార మెఱుఁగ కుండఁగఁ । బరిచిత నిమిషమునఁ జేయఁ బరులకు వసమే?

పరవతి = పరాధీనురాలు ('పరతన్త్రః పరాధీనః పరవా న్నాథవా నపి' అమ.—అట్టిదాని కడ రాయబారము నడపుటకు దానిపెద్దలయనుమతి వలసి యుండును. అది లభించుట దుర్ఘటము), ధరణీ ధవ కన్యకుఁ=భూ నాథ కుమారిని (అట్టిదానికడకు ప్రవేశమే ఘటిల్లదు, దైవఘటనచే ఆరామములోఁ గావున దొరకినది), అల్ప తారుణ్యకుఁ = ఇంచుక యైన జవ్వనము కలది - ఉదయద్యౌవన - ఇంకను శైశవము తీఱ లే దనుట (అట్టిది రాయబారమును చక్కఁగా గ్రహింపకయేని నమ్మకయేని బేలుపుచ్చియేని చెఱుచును), సఖీపరివారము ఎఱుఁగకుండఁగఁ (వా రెఱింగిన అల్లరి చేసి నోటి కొకమాట తల కొకయూహగా కార్యము చెఱుపుదురు ), నిముసమునకు = ఱెప్పపాటులోపల

(అల్పకాలములో ననుట), పరిచితఁ = స్నిగ్ధముగా, చేయఁ = చేయుట, పరులకుఁ = ఒరులకు, వసమే = శక్యమా (ఈనిపుణతయందు నీకు సాటి లే రని భా.)— వశము గామి విశేషణములకు అభిప్రాయము కావున పరికరము.

వ. అని గారవించి. 104

శా. ఏ మేమీ యని విన్నమాటయ వినుఁ, వీక్షించు నెమ్మోము, సాం
ద్రామోదంబునఁ బక్షముల్ నివురు హస్తాంభోజయుగ్మంబునన్,
భామారత్నమురూపసంపదఁ దగఁ భావించు, నానంద మా [105
ధ్వీ మత్తుం డయి చొక్కెఁ జిత్తమునఁ బృథ్వీనాయకుం డెంతయున్.

పృథ్వీనాయకుండు = మహీపతి (నలుఁడు),...వినుఁ = మరలమరల చెప్పించును, (ఇంక నేమి చెప్పునో యని) నెమ్మోముఁ వీక్షించుఁ, సాంద్ర ఆమోదంబునన్ = గాఢమయిన సంతోషముచేత, హస్త అంభోజ యుగ్మంబునన్ = తామరలవంటి చే దోయితో, పక్షముల్ నివురుఁ = రెక్కలను నిమురును, భామా రత్నము రూప సంపదఁ = రమణీ మణి (యైన దమయంతి)యొక్క ('రత్నం స్వజాతి శ్రేష్ఠేఽపి' అమ.) లావణ్య లక్ష్మిని, తగఁ = చక్కఁగా, భావించుఁ = ధ్యానించును, ఆనంద మాధ్వీ మత్తుండు = హర్షమనెడి సురచేత క్రైపెక్కినవాఁడు ('గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయా త్రివిధా సురా' మనువు. 'మృద్వీమత్తుం డ'ను పాఠంబున - మృద్వి యనఁగా కపిలద్రాక్ష యని రాజనిఘంటువునందుఁ గలదు, దానిసుర నిట లక్ష్యార్థముగా గ్రహింప వలయును. 'ఆనన్ద మాధ్వీక మత్తః' అని మూ.) ఎంతయున్ = మిక్కిలి, చొక్కెన్ = పరవశుఁడగును.

'ఆనంద ... మత్తుండు' — రూపకాలంకారము. ఇట క్రమికము లయిన శ్రవణాది క్రియలు పృథ్వీనాయకుఁ డను నేకకారకముతో నన్వయించుచున్నవి గాన కారకదీపకము:—

'కారకదీపక మగు నొక । కారకముం జెందు నెక్కు క్రమికంబులచేన్.' అలం.
హృష్ట స్వభావవర్ణనంబునుం గలదు. (3-135)

వ. ఇవ్విధంబున నానందరసమగ్నుం డైన యన్నరేంద్రుం గనుంగొని, విహంగపుంగవుండు 'కార్యంబు సంఘటితం బయ్యె, నింక నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయం బోవలయు.' నని పలికి, యతనిచేత సముచితప్రకారంబున వీడుకోలు వడసి, బ్రహ్మలోకంబునకుం జనియె నప్పుడు. 106

ఆనంద రస మగ్నుఁడు = ఆనందమనెడి యమృతమందు మునింగినవాఁడు -
('శృఙ్గారముఖ్య మధురాది సువర్ణ రేతో । నిర్యాస రాగ గరళ ద్రవ పారదేషు [నానా.)
ఆస్వాదన ధ్వని సు ధామ్బు రసాఖ్య ధాతు । ష్విష్టా రసోఽథ రసనా ధరణీ రసా స్యాత్.'
'మగ్నుం డ'నుటచేత రసమునకు రససముద్రత్వమును దానిచే ఆనందముయొక్క మహత్త్వమును స్ఫురించుచున్నవి.) సంఘటితంబు= సమకూర్పఁబడినది. పంకజాసనునకున్ =బ్రహ్మకు, పరిచర్య= సేవ. సముచిత = తగిన - ... వీడుకోలు = సెలవు. 'వడసి'కి తర్వాత 'యమ్మానసౌకంబు అని పూర్వముద్రణపాఠము - ఆ హంస యని యర్థము, కాని, 'విహంగపుంగవుండు' అని ముందు వచ్చియున్నదిగాన రెంట నొకటి యనావశ్యకము.

తే. నిషధభూవల్లభుం డాత్మ నిండియున్న
కౌతుకంబు ప్రకాశంబు గాక యుండ,
వనము వెలువడి, పరివార జనము గొలువ,
వచ్చెఁ గ్రమ్మఱ నాత్మ నివాసమునకు. 107

... భూవల్లభుండు = భూమీదయితుఁడు = రాజు, ఆత్మన్ = మనస్సులో, ... కౌతుకంబు = సంతోషము ('కౌతుకం మఙ్గళే హర్షే హస్తసూత్రే కుతూహలే' శాశ్వతుఁడు), ప్రకాశంబు = ప్రకటము, ... క్రమ్మఱన్ = మరల,...

వ. వచ్చి విదర్భరాజకన్యావియోగవిహ్వలుం డగుచుఁ గాలంబు గడపు చుండె. నంత నక్కడ. 108

విదర్భ... విహ్వలుండు = దమయంతీ విరహ వివశుఁడు. అక్కడన్ = విదర్భరాజాంతః పురమందు.

—* దమయంతి విరాళి *—

చ. నల వసుధాకళత్రుని గుణంబె గుణంబుగ, సౌర సౌరభా (4-1)
కలిత తదీయ కీర్తి కలికామయ మైన శరాసనంబునన్,
విలసిత సౌమనస్య పదవీ రుచిరం బగు తద్విలాసమున్
ములికిగఁ జేసి, మన్మథుఁడు ముద్దియ నేయఁ దొడంగె నెవ్వడిన్. 109

మన్మథుఁడు, నల ... ని = నలరాజుయొక్క (వసుధా = భూమి - కళత్రుఁడు=భార్యగాఁ గలవాఁడు -'కళత్రం శ్రోణిభార్యయోః' అమ.)- గుణంబె=సౌందర్యాదికమే, గుణంబుగన్ =అల్లెగాను, సౌర ... బునన్- సౌర = శ్రేష్ఠమయిన ('సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబే వరే త్రిషు' అమ.) - సౌరభ = మనోజ్ఞతతో (పరిమళముతో ననియు - 'సుగన్ధేచ మనోజ్ఞే చ వాచ్యవత్ సురభిః స్మృతః' విశ్వుఁడు.) - ఆకలిత = కూడుకొన్నదైన - తదీయ=ఆనలునిదైన- కీర్తి = యశస్సనెడి - కలికామయము = మొగ్గయే - ఐన - శరాసనంబునన్= వింటితో, విల ...మున్ - విలసిత = ప్రస్ఫుటమయిన - సౌమనస్య = ధీరత్వముయొక్క (పుష్పత్వముయొక్క) యనియు - సుమనసుఁడు మంచిమనస్సుగలవాఁడు- వానిభావము సౌమనస్యము - అదే సహృదయత్వము ధీరత్వము మనీషితయు -'సుమనాః పుష్పమాలత్యోః స్త్రియాం నా ధీర దేవయోః' మేదిని. ('ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞః' అమ.) - పదవీ=ప్రకారముచేత- రుచిరంబు = మనోజ్ఞము, అగు - తత్ విలాసమున్= ఆనలుని లీలను, ములికి కాన్=బాణముగా - చేసి, ముద్దియన్ = ముగ్ధయైన యాదమయంతిని, నెవ్వడిన్ = అతివేగముగా, ఏయఁ దొడంగెన్ = గుఱిపెట్టి కొట్టసాగెను.

హంస యివలికి వచ్చినప్పటినుండి దమయంతి నలునిగుణములనే తలపోయుచు మదనబాణములకు గుఱి యై కడింది విరహబాధ పడుచుండెను. సాధారణ మయిన మదనాయుధములనే ని ఆమె సరకు గొనదు, ఇప్పుడు మదనుఁడు నలకీర్తిని విల్లుగాను, నలగుణమును నారిగాను నలవిలాసమును బాణముగాను, ఉపయోగించినందునను, ముగ్ధ గావునను, ఆమె యెంతయు డస్సెను.—రూపకము.

తే. అతను తాపజ్వరంబు మైఁ నలమి యుండఁ, (4-2)
చపలలోచన ప్రియకథా సరసిఁ దేలెఁ;
నా యపథ్యంబునన కదా యంత కంత
కలరుఁబోణికి సంతాప మతిశయిల్లె. 110

చపలలోచన = చంచలనేత్ర - లేక - మీననయన -
'చపలః పారదే మీనే చోరకే ప్రస్తరాన్తరే ...
నపుంసకం తు శీఘ్రే స్యా ద్వాచ్యవ త్తరళే చలే.'

అతను తాప జ్వరంబు = అనంగ సంతాప మనెడి (అధిక మయిన తాపము గలదైన యనియు) జ్వరము, మైన్ = దేహమందు, అలమి = వ్యాపించి, ఉండన్ = ఉండఁగా (ఉన్నప్పుడు), (తచ్ఛాంతికై), ప్రియ కథా సరసిన్ = ప్రియుని యుబుసనెడి కొలనిలో, తేలెన్ = స్నాన మాడెను; ఆ యపథ్యంబునన కదా (జ్వరితులకు స్నానమాత్రముచే జ్వరము కరము విషమించును; సరోవగాహస్నానము మాట చెప్పవలసినదే గాదు), అంతకంతకున్, అలరుఁబోఁడికిన్ = దమయంతికి, సంతాపము = సంజ్వరము, అతిశయిల్లెన్ = అధిక మాయెను.

దమయంతి మదనతాపము భరింప లేక తచ్ఛాంతికై నలుని ముచ్చటలలో కాలము గడపుచుండినది, దాన మదనతాపము మఱియు మఱియు అధికమే అగుచుండినది.—ఇష్టార్థముకై చేయు యత్నమునకు అది సిద్ధింపమియే గాక అనిష్టము కూడఁ గలుగుట విషమాలంకారభేదము:—

'(1) అమరఁగ విరూపఘటన విషమ మగును, (2) విరూపకార్యసంభవమును, (3) నిష్టముకై యత్నింపఁగ నిష్టము గలుగమితో ననిష్టసంప్రాపణమున్.' అలం.

ద్వాదశావస్థల పక్షమున సంజ్వర మనెడి తొమ్మిదవయవస్థ వర్ణితము; అవి:—

'చక్షుఃప్రీతి మనస్సఙ్గా సంకల్పోఽథ ప్రలాపితా
జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగో ఽథ సంజ్వరః
ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః.
అవస్థా ద్వాదశ మతాః కామశాస్త్రానుసారతః.' ప్రతా.

తే. కమలనేత్ర కవస్థాన విముఖ మైన (4-3)
చంచలత్వంబు మదిఁ బ్రకాశించు చుండె;
బాల యాలీల యభ్యసింపంగఁ బోలు
రమణ దూత పతంగశక్రంబుతోడ. 111

కమల నేత్రకున్ = తమ్మి కంటి యయిన దమయంతికి, అవస్థాన విముఖము = నిలుకడకు విరోధి, ... ఆలీలన్ = ఆవిధమును, రమణ ... తోడన్ - వల్లభుఁ డయిన నలుని దూత యయిన పక్షీంద్రునియొద్ద, అభ్యసింపంగఁబోలున్ = నేర్చుకొనియుండవలయును. ఈచపలత ఆహంస వేగముగా పోయినప్పటినుండి కలిగినది గావునను, అంతకు ముందు లేదు గావునను, వేగముగాఁ బోవునపుడు హంసయం దుండినది గావునను, దానివలన నేర్చినదిగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇట చపలత యనెడి సంచారిభావము చెప్పఁబడినది. — 'చాపలం త్వనవస్థానం రాగద్వేషాది సంభవమ్.'

'పతంగశక్రంబుతోడన్'— 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు.' బా. వ్యా. సూ. దీనివృత్తి - 'నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగంబు నాఁబడు. రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులు చదివిరి - సాందీపునివలన నని యర్థము.' - ఇందువలన 'తోడ' ప్రయోగంబుచే నియమపూర్వకముగా నేర్చె నని యర్థ మేర్పడుచున్నది. అందువలన 'చపలత' కడిందిది అని భా. పతంగశబ్దమునకు 'ఎగురుచుంబోవునది' అని వ్యు., తత్ప్రయోగముచేత - హంస తా నెగురుటయే యుపదేశముగా చపలతను నేర్పిన - దని భా. 'పతంగచంక్రమముతోడ'—పా.

ఉ. బాలకుఁ జెక్కుటద్దముల పజ్జలఁ గోమల మందహాస రే (4-4)

ఖా లవ మంకురింపదు, వికాసము చాలదు నెమ్మనంబునన్,

వాలిక మించుఁ గన్గొనల వాకిట నల్లన సంచరింపనుం

జాలక చాలఁ గుంటువడెఁ జారు నిరీక్షణ ఖంజరీటముల్. 112

బాలకున్ = లేఁ బ్రాయపుదైన యాదమయంతికి, చెక్కు ... పదు = అద్దములవంటి చెక్కిళ్ల పార్శ్వములయందు నునుఁజిఱునగవుయొక్క గీఱయొక్క లేశమయినను పొటమరించుట లేదు, ..., చారు నిరీక్షణ ఖంజరీటముల్ = అందములయిన చూపులనెడి కాటుకపిట్టలు, వాలిక ... చాలక = నిడుద లై తళుకుగలవైన కంటికొసలయొక్క అగ్రభాగమందు మెల్లఁగా నయినను సంచారము చేయలేక, చాలన్ = మిక్కిలి, కుంటువడెన్.

దమయంతి ఇపుడు బొత్తిగా ఎలనవ్వు మానినది, ఉత్సాహము మఱచినది, క్రేఁగంట చూచుట ఇంచుకేనియు లేదు.—'నిరీక్షణ ఖంజరీటముల్ కుంటువడెన్' - రూపకము.

'బాలకు' అనుట సహృదయులకు జాలి గొలుపుటకు. 'ఖంజరీట' శబ్దమునకు యోగార్థము కుంటివలె నడచునది అని; కాటుకపిట్ట నడచుట అట్లే యుండును. 'వాకిటన్'— కుంటియు తన యింటి వాకిటికి ఎట్లో ఒకట్లు వచ్చుట కలదు; నిరీక్షణములు అంతమాత్రము కూడ రాలేక పోయినవి. కావున కుంటికన్న కుంటువడినవి.

సీ. అతివ సమ్ముఖ వాస్తు వగు వస్తువును గాన (4-12)

దాత్మ యంతర్ముఖం బొటఁజేసి;

చెలువ క్రొమ్మించు లేఁ జెక్కుటద్దం బొయ్యఁ

బాణి పల్లవ శయ్యఁ బవ్వళించెఁ;

గోమలి నిట్టూర్పు క్రొవ్వేఁడి నెత్తావి

ముసరు తేంట్లును మూతి ముట్ట వెఱచెఁ;

దరుణి లోచన బాష్ప ధారా లవంబులు

ముత్యాల సరులతో ముద్దు గురిసెఁ;

తే. జామ శర కాండ పాండిమ చ్ఛాయ నొందెఁ; (4-31)

బోటిమది కింపు గా దయ్యె నాట పాట;

మృగవిలోచన కంతంత మేను డస్సె;
నంత కంతకు సంతాప మతిశయిల్లె. 113

అతివ = (ఆ) పడఁతి, ఆత్మ = మనస్సు -
'ఆత్మా కళేబరే యత్నే స్వభావే పరమాత్మని
చిత్తే ధృతౌ చ బుద్ధౌ చ పరవ్యావర్తనేఽపి చ.' ధరణి.

అంతర్ముఖము = లోనికి మరల్పఁబడినది (అనఁగా తనయం దున్న నలమహారాజును చూచుచున్నట్టిది - ఆతని ధ్యానించుచున్నట్టిది), అగుటఁజేసి=అగుటచేత, సమ్ముఖ వాస్తువు = ఎదుట నున్నట్టిది, అగువస్తువును కానదు.—ప్రత్యక్షమునకు మనస్సు ఇంద్రియముతో చేరవలయును. 'ఆత్మా మనసా సంయుజ్యతే, మన ఇన్ద్రియేణ, ఇన్ద్రియ మర్థేన, తతః ప్రత్యక్షమ్.' అని వాత్స్యాయనుఁడు.

ఇచట చింత యను సంచారిభావము చెప్పఁబడినది - 'ధ్యానం చిన్తా హితానాప్తేః శూన్యతా శ్వాస తాప కృత్' (సా. ద.); శూన్యదృష్టియు సూచితము -
'నిశ్చలా సమతారా చ ధ్యానా ద్బాహ్య మగృహ్ణతీ
తథా సమపుటోపేతా శూన్యా దృష్టి రుదాహృతా.'

'అతివసమ్ముఖవాస్తువు'— అతివయొక్క అని సమస్తముగా గ్రహించి, కానమికి ఆత్మను కర్తం జేయుద మన్న, పైమూఁడు సీసపాదములయం దున్న సమస్త ఫక్కి 'చామ' అను వ్యస్త ప్రయోగముచే గీతములో భగ్న మయినది; కావున నిట సమస్తాన్వయము ప్రక్రాంతము కాదు.

సమ్ముఖావస్థాన మనెడి పుష్కలకారణం బున్నను దర్శనకార్యము కలుగమి విశేషోక్తి:—
'కృతి జనియింపమి హేతువు । స్థిత మయినన్ నిండుగా విశేషోక్తి యగున్;
సతి, తఱుఁగ దయ్యె స్నేహము । మతిలో స్మరదీప మెంత మండుచు నున్నన్.' అలం.

చెలు... బు=దమయంతియొక్క క్రొత్తధాళధళ్యము తోడి లేఁతచెక్కిలి యనెడి యద్దము, ... పాణి పల్లవ శయ్యన్ = కరతల మనెడి చిగురుఁబాన్పునందు, పవ్వళించెన్ = శయనించెను.— 'క్రొమ్మించు' విరహపాండిమచేత నయిన మించు. విరహిజనులు తాపశాంతికై పల్లవశయ్యపైఁ బవళించునట్లు దమయంతియొక్క చెక్కుటద్దము నలకపోలాదిసంయోగము లేమిచే విరహతాప మొంది తచ్ఛాంతికై (కర) పల్లవశయనము నాశ్రయించిన దని భా. జడ మయిన కపోలమే ఇట్టి విరహతాపముచే కందురుచుండఁగా ఆమెయొక్క విరహతాప మెట్టిదో చెప్పవలయునా యనుట.

ఇందును చింతయే సూచితము; అందులకు ఉదాహరణాంతరము (ఛాయ)—
'కమలేన వికసితేన సంయోజయన్తీ విరోధినం శశిబిమ్బం
కరతల పర్యస్త ముఖీ కిం చిన్తయసి సుముఖి అన్త రాహిత హృదయా?' సా. ద.

రూపకాలంకారము. చెక్కుటద్దంబునందు పల్లవశయ్య నాశ్రయణ రూప విరహి వృత్తాంతము స్ఫురించుటచేత సమాసోక్త్యలంకారంబును.

శ్వాస ... విన్ = దమయంతియొక్క నిట్టూర్పుల క్రొత్తవేఁడి పరిమళమును, మొకరి తేంట్లునున్ = తెంపరితనముగల తుమ్మెదలుసయితము, మూతిన్ = మూతితో, (మూతి కాలు నను భయముచే), ముట్టన్ వెఱచెన్ = తాఁకుటకు భయపడెను. శ్వాసతాపములచేత ఇందును చింత సూచితము. వ్యాధి యనెడి మదనావస్థయు సూచితము.

తరుణీ ... బులు = దమయంతియొక్క కన్నీటిధారల బొట్లు, ము ... సెన్ = ముత్యాల సరులలో తామును ముత్యాలసరులవలె నుండినవి.—ఉపమ. బాష్పములచే లజ్జాత్యాగము సూచితము.

చామ = ఆలేమ, శరకాండ పాండిమ చ్ఛాయన్ ఒందెన్ = రెల్లుకాఁడయొక్క తెల్లని కాంతిని పొందెను; [ఒకదినుసు రెల్లుకాఁడ తెల్లఁగా నుండును; అది బంగారువన్నె గలయొడలి మీఁద వ్యాపించినపాండిమకు తగినయుపమానము; దానితోనే బాణములు చేయుదురు:—

'అతః పరం ప్రవక్ష్యామి శరాణాం లక్షణం శుభమ్;
స్థూలం న చాతిసూక్ష్మం చ న వక్రం న కుభూమిజమ్
హీనగ్రంథి విదీర్ణం చ వర్జయే త్తాదృశం శరమ్;
పూర్ణగ్రన్థి సుపక్వం చ పాణ్డురం సమయాహృతం
కఠినం వర్తులం కాణ్డం గృహ్ణీయా త్సుప్రదేశజమ్.' శార్ఙ్గధరుఁడు.

'పూని నెగనెఁ బొనరెఁ బొదవెఁ బొందె నటన్న । పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు । నిలుచు వలయునపుడు నీరజాక్షు.' అప్ప.

పాండిమచే వ్యాధి యనెడిమదనావస్థ సూచితము - 'వ్యాధి స్తు దీర్ఘనిశ్వాస పాణ్డుతా కృశతాదికృత్' సా. ద.], బోటి ... పాట - [ఇందు అరతి యనెడి మదనావస్థ సూచితము - 'అరతిః ప్రియవస్తు విద్వేషః' సా. ర. ఇందులకు మను. 3 ఆ. 64 మంచియుదాహరణము:—

సీ. 'ఘనసారపంక మొక్క లతాంగి దెచ్చిన । ముట్టి వ్రేలనె చుక్కబొట్టు వెట్టి,
యింతి యొక్కతె పూవుబెత్తు లెత్తినఁ జూచి । విసువుతో నొకకొన్ని విరులు దురిమి,
పడఁతి యొక్కతె రత్నపాదుక లిడ నిల్చి । తొడుగ కవ్వలికిఁ బో నడుగు వెట్టి,
బాగాలు వెస నొక్క పద్మాక్షి యొసఁగిన । వెగ్గలం బని కొన్ని వేడల నుమిసి,

తే. సగము గొంతికి నయాకును, సకులు పిలువ । సగ మొసఁగు నుత్తరము, తెల్వి సగము మఱపు
సగము, నై చింతచే సగ మగుచుఁ జనిరొ । నవ్వరూథిని యంతికోద్యానమునకు.'

'ఆట పాట'— వ్యస్తపదములనుగాఁ గొని 'ఆట ఇంపుగా దయ్యె, పాట ఇంపు గా దయ్యె' అని భిన్నవాక్యముగా గ్రహించి 'కాదు' అనెడి యేకవచనమును సాధింపవలయును.]

మృగవిలోచనకున్ = లేడికన్నులవంటి కన్నులుగలదమయంతికి, అంతంతన్ = క్రమక్రమముగా, మేను = ఒడలు, డస్సెన్ (ఇచట గ్లాని యను సంచారిభావము సూచితము - 'గ్లాని ర్బల స్యాపచయో వైవ ర్ణ్యారతి కారణమ్.' ప్రతా.) అంత కంతకున్ = మఱియు మఱియు, సంతాపము = సంజ్వరము. ... సంజ్వర మనెడి మన్మథావస్థయు సూచితము - 'తాపాధిక్యం జ్వరో మతః' ప్రతా.; కామశాస్త్రానుసారమున ద్వాదశావస్థలలో నిది యొకటి.

చ. ఉదిత మనోనురాగ దహ నోష్ణ భరంబున నా లతాంగికిన్ (4-28)
హృదయమునందు జొబ్బిల వహించిన చందన కర్దమంబు బు
ద్బుదముల నీనెఁ; గల్పిత విభూషణ జాల మృణాళ వల్లరీ (4-34)
వదనములం దమందగతి వారక పిచ్ఛిలఁ జొచ్చె ఫేనముల్. 114

ఆలతాంగికిన్ = ఆతీఁగఁబోఁడికి, హృదయమునందున్ = వక్షంబునందు, జొబ్బిలన్ = చిక్కనగా, వహించిన చందనకర్దమంబు = పూసికొన్న గంధంపు ద్రవము; ఉది...నన్ — ఉదిత =

పైకి ఉప్పొంగిన - మనః అనురాగ = మదిలోని మరులనెడి - దహన = నిప్పుయొక్క - ఉష్ణ = వేడియొక్క - భరంబునన్ = అతిశయముచేత, (కుతకుత ఉడికి), బుద్బుదములన్ = బుడగలను, ఈనెన్ = గ్రక్కెను, కల్పి ... లందున్ = రచింపఁబడిన నగల సమూహ మగు (నగలుగా కల్పింపఁబడిన) తమ్మితూఁటి తీఁగలయొక్క కొనలయందు, వారక = నిరంతరము, ఫేనముల్ = నురుగులు, పిచ్ఛిలఁ జొచ్చెన్ = ఉబుక సాగెను.

అప్పుడు దమయంతికి చలువకై వక్షంబునం బూసిన చిక్కనికలపము హృదయములోని రాగాగ్ని పై కుతకుతచేతనో యన కాఁగి బుడగలు లేవ సాగెను; చలువకొఱకే కంకణ హారాద్యాభరణములుగాఁ జేసి మేనం బెట్టిన తామరతూఁటి ఖండముల కొనలు నురువు గ్రక్క సాగినవి.—సంజ్వరావస్థ చెప్పఁబడినది.—సంబంధాతిశయోక్తి ; 'మనోనురాగదహన'...రూపకము. సెఱవేఁడని రాగము వేఁచును గాన దానియందు దహనత్వారోపము.

మ. దశ లంతంతకు నెక్కఁగా, విరహ సంతాపాతిరేకంబునన్ **(4-15)**
శశిబింబాననకుం దమస్వసకుఁ గార్శ్యం బొందె దేహం ; బహ
ర్నిశమున్ సాంద్ర నిరంతర స్మృతి సమున్మేషంబునం గాంతకుం
దశ దిగ్భిత్తులయందుఁ గానఁబడియెం దద్రూప చిత్రావళుల్. **115**

విరహ సంతాప అతిరేకంబునన్ = వియోగ జ్వరము అతిశయిల్లుటచేత, దశలు = మదనావస్థలు, అంతంతకున్ = ఒకదానికంటె నొకటి, ఎక్కఁగాన్ = (ముందు వచ్చినదానికన్న పిమ్మట వచ్చినది దుస్సహ మయి) పైకొనుచుండఁగా, శశిబింబ ఆననకున్ = చంద్రమండలమువంటి ముఖము గలదైన - దమ స్వసకున్ = దమునియొక్క తోఁబుట్టువునకు (దమయంతికి), దేహంబు = శరీరము, కార్శ్యంబు = కృశత్వమును, ఒందెన్ = పొందెను; కాంతకున్ = ఆ రమణికి, అహర్నిశమున్ = రేయుం బవలు, సాంద్ర ... బునన్ — సాంద్ర = దృఢమయిన - నిరంతర = తెంపులేని - స్మృతి = ధ్యానముయొక్క - సమున్మేషంబునన్ = ప్రస్ఫుటత్వముచేత, తత్ రూప చిత్ర ఆవళులు = ఆనలుని యాకృతులనెడి చిత్తరువుల వరుసలు, దశ దిక్ భిత్తులయందున్ = పది దిక్కులనెడి గోడలమీఁద, కానఁబడియెన్ = అగపడినవి.

మదనావస్థలు ఒకటికన్న నొకటి దుస్సహమై పైకొనఁగా దమయంతి విరహతాపాతిశయముచే కృశతం బొందినది ; ఆమెకు నిరంతర నలధ్యాన సంజాత మదన జ్వర కల్పిత భ్రాంతి మెయి నలరూపమే ఎల్లెడలం గానిపించుచుండెను.—కార్శ్యజ్వరములు. చతుర్థపాదమందు రూపకము.

తే. చెలులు శిశిరోపచారముల్ సేయుపొంటెఁ **(4-24)**
బ్రోవు లిడ్డ మృణాల కర్పూర వితతిఁ
గాంచి వైదర్భి మదిలోనఁ గళవళించె
జాల కాయాత చంద్రికా జాల మనుచు. **116**

వైదర్భి = దమయంతి, (తనకు), చెలులు = సఖులు, శిశిర ఉపచారములు = చలువ (సొలుపు) సేవలు, చేయుపొంటెన్ = చేయుటకుఁగాను, ప్రోవు ... తిన్ = రాసులుగా పెట్టియున్న తామరతూండ్లయు కప్పురాలయు సమూహమును, కాంచి = చూచి, జాల...ము —

జాలక = కిటికీలవలన - ఆయాత = వచ్చిన - చంద్రికా = వెన్నెలయొక్క - జాలము = సమూహము, అనుచున్ = అని తలంచి, మదిలోనన్ = మనస్సులో, కళవళించెన్ = దిగులుపడినది.

'ప్రోవులు' - కర్ణ భూషణములు అని వివరించుటకు 'వితతి' శబ్దము బాధించును. ధావళ్యాది గుణ సామ్యముచేత చంద్రికా జాల భ్రాంతి; చంద్రిక ఒడలిం గాల్చును గాన కళవళించుట.— భ్రాంతిమదలంకారము -

'స్మృతి, సందేహము, భ్రాంతి, స। మతచేతం గల్గె సేని స్మరణాదు లగున్;
రతిఁ దలఁచు మరుఁడు నినుఁ గని;। సతివో హరిసతివో? భవుఁడు సతి వని భ్రమసెన్.' అలం.

క. బిస పన్నగ భూషణయును। బ్రసవ రజో భూతిమతియుఁ బాండిమ లక్ష్మీ
వసతియు నై చూపెను సతి।యసమాయుధునకుఁ బినాకియాటోపంబున్.

సతి = దమయంతి, బిస పన్నగ భూషణయును = తామరతూం డ్లనెడి పాఁప తొడవులు కలదియు, ప్రసవ రజః భూతిమతియున్ = పువ్వుల ధూళి (పుప్పొడి) యనెడి విభూతి కలదియు, పాండిమ లక్ష్మీ వసతియున్ = ధావళ్య శోభకు నివాసంబును, ఐ, అసమ ఆయుధునకున్ = విషమ బాణునకు (మన్మథునకు), పినాకి యాటోపంబున్ = రుద్రునియొక్క యాడంబరమును, చూపెన్ = అగపఱిచెను. (4 - 27) 117

హార కేయూర కంకణాది భూషణములుగా తామరతూండ్లు ధరించి, మెయినిండం బుప్పొడి దాల్చి, విరహ పాండిమకు తావల మై, దమయంతి పన్నగాభరణుండును విభూతిధారియు స్వభావ ధవళ దేహుండును నైన శంభుని వేషమును మన్మథుని భయపెట్టి తఱుముటకై తాల్చెనో యనునట్లుండెను.—గమ్యోత్ప్రేక్షాలంకారము, దానికి రూపక మంగము.

తే. మన్మథానల తాపంబు మాన్ప వేఁడి (4 - 29)
డెందమునఁ జేర్పఁబూనిన కెందలిరులు
వెలఁది నిట్టూర్పు గాడ్పుల వెచ్చదాలి
బెరసి యరత్రోవయంద మర్మరము లయ్యె. 118

(చెలులు దమయంతికి), మన్మథ అనల తాపంబున్ = వలరాచ చిచ్చుయొక్క కాఁకను, మాన్పన్ వేఁడి = ఆర్పఁ గోరి, డెందమునన్ = వక్షముపై, చేర్పఁ బూనిన = ఇడ నుంకించిన - కెం దలిరులు = ఎఱ్ఱని చిగుళ్లు (కెంపు తలిరులు), వెలఁది నిట్టూర్పు గాడ్పుల వెచ్చ దాలి = దమయంతియొక్క నిడుద యూరుపుల వెచ్చ యనెడి గుండము, బెరసి = తగిలి, అరత్రోవయంద= (శిశిరోపచారము చేయుచు చెంత నున్న చెలి ఆతలిరులను పుటికలోనుండి కేల నెత్తినచోటికిని దమయంతివక్షమునకును)సగము దారిలోనే, మర్మరములు అయ్యెన్=తడి యిగిరి మర్మరధ్వని గలవి యాయెను ('అథ మర్మరః। స్వనితే వస్త్రపర్ణానాం భూషణానాం తు శిఞ్జితమ్.' అమ.)

'కెందలిరులు' — కెంపుఁదళ్కు మాఱనివి పాలతో నిండి శీతలతరంబుగా నుండును. 'అర త్రోవ' యనుటచే నిశ్వాసము ఎంతదవ్వు వీఁగునో అచటికి ఆతలిరులు సగముత్రోవ వచ్చిన వని తెలియుచున్నది. దానిచేత తలిరులు దమయంతి చెంతనే యుండిన వని యూహ్యమగుచున్నది. 'మర్మరములయ్యె' ననుటచే ఆచిగుళ్లు అంతలో శుష్కించిన వనియు, ఆశుష్కించుట నిట్టూర్పు వెట్టచే ననియు, ఆమర్మరధ్వనివలన చెలులు తెలిసికొన్నవా రై చెలిదేహస్థితికి మిగుల దిగులుపడి

రనియు నూహనీయముగా నున్నది. 'మాన్పకొనఁగ' అని యాత్మనేపదప్రయోగము లేకున్నను దమయంతియే యిట 'మాన్ప వేఁడుట'కును 'పూనుట'కును కర్త్రి యని యర్థము చేయు పక్షమున, పై పంక్తులలో చెలులు చేసినట్లు చెప్పినదానిని ఆమెయే చేసికొనె నని తలంపవలయు. 'వారు దిగులుపడి' రనుటకు మాఱుగా 'ఆమె వానిని పాఱ వైచె' నని గ్రహింపవలయును.

'వెచ్చదాలి' – రూపకము. శ్వాసముచే అరత్రోవయందే మర్మర మనుట అతిశయోక్తి.

'పూను కెందమ్మి విరులు' అని పూర్వముద్రణములో ద్వితీయపాదాంతము; ఈపాఠమున యతిభంగమును, అప్రయోజన 'విరి' శబ్దమును, గలవు;

మూ. 'స్మరహుతాశనదీపితయా తయా బహు ముహుః సరసం సరసీరుహమ్
శ్రయితు మర్ధపథే కృత మన్తరా శ్వసిత నిర్మిత మర్మర ముజ్ఝితమ్.'

'కెందలిరుల'కు బదులుగా మూలములో 'సరసీరుహ' మున్నది. దాని కనుగుణముగా 'కెందమ్మి' యని మార్చినవారు తెనుఁగులో అధిక మయిన 'డెందము'ను దానివలనం గలుగు యతి భంగమును గానరైరి. 'క్రొందమ్మి' యనియేని మార్చిన 'క్రొత్త' శబ్దముచేత మూలగత మయిన సరసత్వము సూచిత మగును, కాని, 'విరుల'బాధ యుండును. శ్రీనాథుఁడు ఆధార మయిన యవయవ విశేషమును నిరూపింపమి యందము గా దని శ్వాస వేగ గోచర మయిన 'డెందమును' చేర్చినాఁ డనియు, తదనుగుణముగాను పద్యలక్షణానుగుణముగాను 'సరసీరుహము'ను 'కెందలిరులు'గా మార్చినాఁ డనియు, సంతోషించుట మంచిది. 'దాలి'కి 'దాఁకి' యనియు పూర్వముద్రణముల పాఠము; 'తాఁకుట'యే 'బెరయుట' గాన దానం బౌనరుక్త్యము ప్రస్ఫుటము.

సీ. చిగురుఁదామరపాకు జివ్వంచుఁ జనుదోయి (4-32, 30)
మొనల క్రొవ్వేఁడిని మునుఁగఁబాఱె;
దరుణ రంభా గర్భ దళ తాళవృంతంబు
పైగాలి సోఁకినఁ బలుకఁబాఱె;
లలిత ముక్తాహార గుళికా కలాపంబు
ఘ్రాణానిలంబునఁ గందఁబాఱె;
గర్ణపూర కలాప కల్హార దళరాజి
యశ్రుధారల నురియంగఁబాఱె;
తే. దర్ప మొలయ నాలీఢ పాదమున నిల్చి
మండలీకృత చాపుఁ డై మన్మథుండు
గవలి సవ్యాపసవ్య మార్గములఁ దొడిగి
పువ్వుఁదూపులు పుంఖానుపుంఖ మేయ. 119

మన్మథుండు, దర్పము = గర్వము [పా. తమకము = త్వర], ఒలయన్ = మెఱయ, ఆలీఢ పాదమునన్ = ముందునకుఁ జాఁపఁబడిన కుడికాలు గల స్థానముగా – [విలుకాండ్రు బాణ మేయునపుడు నిలుచు ప్రకారములు ఆలీఢాదులు అయిదు; వానికి స్థానము లని పేరు:—

స్థానాని ధన్వినాం పఞ్చ; తత్ర వైశాఖ మస్త్రియామ్
వితస్త్యన్తరగౌ పాదౌ, మణ్డలం తోరణాకృతీ,
సమానౌ స్యా త్సమపద, మాలీఢం పద మగ్రతః
దక్షిణం వామ మాకుఞ్చ్య, ప్రత్యాలీఢం విపర్యయః.' యాదవ.],

మండలీ కృత చాపుఁ డై = వలయముగా చేయఁబడిన విల్లుకలవాఁ డై (నిండుగా లాగిన వలయాకార మగును), కనలి = కోపగించి, పూవుఁ దూపులు = పూ బాణములను, సవ్య అపసవ్య మార్గములఁ = ఎడమ కుడి ప్రకారములచేత (రెండుచేతులతోను ; సవ్యాపసవ్యముల నేయుట అతి వేగముగా అమితముగా బాణము లేసి ఊపిరి తిరుగ నీయకుండం గూల్చుటకు - అట్లు కూల్చుట 'కనలు' చేత), తొడిగి = సంధించి (అరిఁ బోసి), పుంఖ అనుపుంఖము = పింజవెంబడి పింజగా [పింజ యన బాణముయొక్క పిడి; పింజవెంబడి అలుఁగు రావలసినది ; అట్లు గాక పింజయే వచ్చుట బాణప్రయోగమందలి మహాశైఘ్ర్యమును తెలుపుచున్నది. ఈ విధమునే 'గతి గతిం గడవ' అని వర్ణించుటయు. గతి యన బాణపక్షము], ఏయఁగ = ప్రయోగింపఁగా;

చిగురుఁ దామర పాకు= (శిశిరోపచారార్థమై దమయంతికి పైటగాఁ గప్పఁబడిన) లేఁత తామరాకు (చిగురనే కొనుట శైత్యాధికతకై), జివ్వంచుఁ = జివ్వనుశబ్దముతో (జివ్వనుపదము తడిని బీల్చు ధ్వనిం దెలుపు ననుకరణశబ్దము - జివ్వనుట చిగురుగాన), ... క్రొవ్వేఁడిఁ = క్రొత్త (తీవ్ర మయిన) వేఁడిచేత, ముణుఁగఁబాఱెఁ= ముణుఁచుకొని పోయినది (పాఱుధాతువు స్వార్థమునం దనుప్రక్తము);

తరు...బు-తరుణ = క్రొత్తదైన (దళమునకు విశేషణము - అప్పుడే కోసి తెచ్చిన యని యర్థము - చలువయు సొంపును తెలుఁగమి ప్రయోజనము) - రంభా = అరఁటియొక్క - గర్భ= కడుపులోని - దళ = ఆకు అనెడి - తాళవృంతంబు = వీవన ['తాళ' వృంతము - వృతువాచకములు నపుంసకలింగమున తత్ఫలాదివాచకము లగును గాన ('ద్విహీనం ప్రసవే సర్వమ్' అమ.) 'తాటియాకు' తొడిమ యని యవయవార్థము; తొడిమతోడి లేఁతతాటియాకుతో విసనకఱ్ఱలను చేయుట ఆదికాలమునుండి వాడుక గాన ఆశబ్దమే లాఁతి వీవనలకుం గూడ రూఢిచే వాచకమైనది-

'గర్జన్తి శైలశిఖరేషు విలమ్బిబిమ్బా
మేఘా వియుక్త వనితా హృదయానుకారాః ;
యేషాం రవేణ సహ సోత్పతితై ర్మయూరైః
ఖం వీజ్యతే మణిమయైరివ తాళవృన్తైః.' మృచ్ఛ.

పై గాలి వెక్కన = దమయంతి యొడలిపై వీచుచున్న (ఆయొడలి సంపర్కముచే నుడికిన) గాలియొక్క వేఁడిమికే (ఒడలికి తగులకయే అని ఏవార్థకస్వారస్యము), పలుకఁబాఱెఁ = వివర్ణమాయెను;

లలి ... బు - లలిత= మనోజ్ఞమైన (ముక్తా హార = ముత్తెపుఁ బేరులయొక్క - గుళికా= ఘుటికల)కలాపంబు = సమూహము ('కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అమ.— గుళిక లనుటచే నిండుచలువ తాఁకుటకై ఒక్కొక్క ముత్తెంబును స్ఫుటముగా పెద్దదిగా గుండ్రతనముచే లలితముగా నున్న దని భా. లలితము గానిచో వారినాశెమునకు లోపము), ఘూర్ణ అనిలంబునఁ = ఊర్పు గాలిచేత, కందఁబాఱెఁ = కప్పెక్కినది;

కర్ణ ... రాజి - కర్ణపూర = అవతంస మనెడి - కలాప = ఆభరణ మయిన ('శిరీషోత్పలయోః కర్ణపూరం నా త్వవతంసకే' నానా.) - కల్హార = సౌగంధికముయొక్క ('సౌగన్ధికం తు కల్హారమ్' అమ.—'ఇంచుక యెఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళము గల కలువ' అని సీతారామాచార్యులవారు; కే=నీట - హ్లాదతే = ముద మొందునది అని వ్యు. ఔత్తరాహగ్రంథములందు 'కహ్లార' అనియు, మన దేశపు గ్రంథములందు 'కల్హార' అనియు దీని రూపములు. ఈ శబ్దము పృషోదరాదులలోనిది గాన మనదేశపురూపంబును సాధువుగానే గ్రహింపవచ్చును) - దళ = ఱేకులయొక్క - రాజి = సమూహము, అశ్రుధారలన్ = కన్నీటి యొడికలచేత, ఉరియంగఁబాఱెన్ =(కప్పురాకువలె) ఉడికిపోయెను.—ఇందు అంతటను అతిశయోక్త్యలంకారము.

వ. ఇవ్విధంబునం బ్రతిపచ్చంద్రరేఖయుం బోలెఁ గళామాత్రావశేష యై విషమశరశరాశీవిష విషవేదనా దోదూయమాన మానస యగుచు శిశిర శైవాల పలాశ గుచ్ఛంబులను సరస బిసకిసలయ చ్ఛేదంబులను దుషార సలిల ధారా సేకంబులను గర్పూర పరాగ పాళి సముద్ధూళనంబులను జందన చర్చా మచర్చికా క్షాళనంబులను జంద్రకాంత శిలా తల్పంబులను గదళీ దళ పలాశ తాళవృంత సంతానంబులను వాసరంబులు గడపుచు, నొక్కనాఁడు విభావరీ సమయంబునఁ గేలి సౌధ మణి చంద్రశాలా ప్రదేశంబున సఖీజనులు పరివేష్టించి యుండ నిండుచందురుం జూచి వైదర్భి యుపాలంభగర్భంబుగా నిట్లనియె. 120

ప్రతిపత్ = పాడ్యమినాఁటి - ... కళామాత్ర అవశేష = ఒక పాలుమాత్రమే మిగులుగాఁ గలదై (మిక్కిలి కృశించిన దనుట) - చంద్రపక్షమున 'కళ' యనఁగా పదియాఱవభాగము -

'కలా స్యాన్మూలరైవృద్ధౌ శిల్పాదా వంశమాత్రకే
షోడశాంశే చ చన్ద్రస్య కలనా కాలమానయోః.' మేది.

[ఉపమాలంకారము]; విష ... మానస = శేసియమ్ములవాని యమ్ములనెడి (ఆశీవిష =) పాముల విష బాధచేత (దోదూయమాన =) మిక్కిలి పీడింపఁబడుచున్న మనస్సుకలది (రూపకము), ... శిశిర...బులను = చల్లని నాఁచుఁ జిగుళ్ల జొంపంబుల(ను ధరించుట)చేతను, సర...బులను - సరస = జలవంతములయిన - బిస = తామరతూండ్లయొక్క—కిసలయ = మొసులయొక్క - ఛేదంబులను = తునియల(ను ధరించుట)చేతను, కర్పూ...బులను = కర్పూర ధూళీ పటలమును (ఒడలికి మాటి మాటికి) పూసికొనుటచేతను, చంద ... లను = (మచర్చికా =) శ్రేష్ఠమయిన (చందన=) గంధంపు ద్రవములతో (అంగములను) కడుగుటచేతను, చంద్ర ... లను = చంద్రకాంతపు ఱాల పాన్పులచేతను (ఆఱాల తిన్నెలపై పరుండుటచేతను), కద ... లను = అరఁటియాకుల విసనకఱ్ఱల సమూహములచేతను, వాసరంబులు = దినములను, ... విభావరీ = రాత్రి - ... కేళి ... నన్ - కేళి = విహారార్థమయిన - సౌధ = మేడయందలి - మణి = మణిమయమయిన - చంద్రశాలా ప్రదేశంబునన్ = శిరోగృహ స్థానంబునందు, ... పరివేష్టించి = బలసి, ... ఉపా ... గాన్ - ఉపాలంభ = నింద - గర్భంబుగాన్ = లోపల కలిగి యుండు నట్లుగా (నిందతోఁ గూడుకొన్నట్లుగా), ...

## —* చంద్రోపాలంభము *—

ఉ. హాలహలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీల పాండుర (4-61)
జ్వాలలతోడ; నం దొకవిషం బొకవేలుపు మ్రింగె; నెందఱో
వేలుపు లోలిమై ననుభవించిన రెండవ యీవిషంబు ని
ర్మూలము గాక యున్నయది! ముద్దియ, పాంథులపాప మెట్టిదో! 121

ముద్దియ = ఓముగుదా, కలశ అంబుధిన్ = పాల సముద్రములో, హాలహల ద్వయంబు= రెండు కాలకూటములు, వినీల పాండుర జ్వాలలతోడన్ = ఒకటి నల్లని జ్వాలలతోను రెండవది తెల్లని మంటలతోను, పుట్టెన్ = పొడమినవి; అందున్ = ఆరెంటిలోను, ఒకవిషంబున్ = ఒక కాలకూటమును, ఒకవేలుపు = ఒకదేవుఁడు (శివుఁ డనుట), మ్రింగెన్;

' నిర్మథ్యమానా దుదధే రభూ ద్విషం । మహోల్బణం హాలహలాహ్వ మగ్రతః ;
త దుగ్రవేగం దిశి దిశ్యుప ర్యధో । విసర్ప దుత్సర్ప దసహ్య మప్రతి.
భీతాః ప్రజా దుద్రువు రఙ్గ సేశ్వరాః । అరక్ష్యమాణాః శరణం సదాశివమ్.
తతః కరతలీకృత్య వ్యాపి హాలాహలం విషమ్
అభక్షయ న్మహాదేవః కృపయా భూతభావనః.' భాగవ.

' చిన్ని వెన్నెల కందు వెన్న దన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టు మాకు.' మను.

' తే సర్వే తత్ర సహితా మమన్థు ర్వరుణాలయమ్ ;
తస్మిం స్తు మథితే జాతః పున స్సోమో మహీపతే ;
త మేవ దేవమనుజాః, షోడ శేమా శ్చ దేవతాః,
ఉపజీవ న్తి వృక్షా శ్చ, త శ్తై వౌషధయః ప్రభుమ్.
రుద్ర స్త మేవ సకలం దధార శిరసా తదా.' దేవీపురా.

ఎందఱో వేలుపులు = వహ్న్యదిదేవతలు ఎంతమందియో, ఓలిమైన్ = 'ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః' ఇత్యాది శ్రుత్యుక్తక్రమమున - అనుభవించిన = భుజించినట్టి [ఒండె - భక్ష్యార్థం సర్వదేవానాం సోమః సృష్టః స్వయంభువా,
తత్రస్థ మమృతం చాపి సంభూతం సూర్యతేజసా
త్రయశ్చ చ త్రిశతం చైవ త్రయస్త్రింశ త్తథైవ చ
త్రయ శ్చ త్రిసహస్రా శ్చ దేవా స్సోమం పిబ న్తి యే.' దేవీపురా.]-
రెండవ యీ విషంబు = (చంద్రుఁ డనెడి) యీ రెండవ కాలకూటము, నిర్మూలము గాక యున్నయది = వారు భుజించుటచేత తఱిఁగియు మరల నిండుకొనుచునే యున్నది, పాం... దో - ఈ రెండవకాలకూటము నిర్మూలము గామికి విరహులు చేసికొన్న మహాపాపము కారణము.

పాలసముద్రములో రెండు విషములు పుట్టినవి, కాలకూటము ఒకటి చంద్రుఁ డొకటి; అది నల్లనిజ్వాలలతోను, ఇది వెన్నెల లనెడి తెల్లజ్వాలలతోను, పుట్టినవి. దానిని శివుఁడు ఒకఁడే మ్రింగి నశింపఁజేసెను. దీనిని వహ్న్యదిత్యాదులు ఎందఱో దేవతలు 'కళల' వరుసగా మాసమాసము కృష్ణపక్షమందు, అమావాస్యనాఁటికి ఏమియులేనియట్లుగా, మ్రింగుచున్నను, విరహులు చేసి

కొన్న మహాపాపము మూలముగా, ఇది మరల మరల శుక్లపక్షమందు నిండుకొనుచునే యున్నది.

ఇందు చంద్రుని హాలహాల మని ఉపమానశబ్దముచే చెప్పుటవలన రూపకాతిశయోక్తి.—

' నిగరణ మధ్యవసానము । నగు రూపకగతుల రూపకాతిశయోక్తిన్;

నగయుగముఁ గంటి మించున । గగనంబున సుడిని, నెలను గమలయుగళమున్.' అలం.

ఉపమాన మయిన కాలకూటమునకును ఉపమేయ మయిన చంద్రునికిని ఏకానేక భోక్తలచే నాశా నాశము లనెడి విశేషము చెప్పినందున వ్యతిరేకాలంకారము:—

' అమరు వ్యతిరేకము విశే । షము వచియింపఁగ విషయివిషయములలోనన్;

దమినె వెలుఁగు నెల, పగలే । కమలము, నీముఖము సర్వకాలములందున్.' అలం.

పాం... దో - నిర్మూలము గామికి పాపమును హేతువుగా సంభావించినందున హేతూత్ప్రేక్ష, వాచకము లేనందున గమ్య. పలువురు మ్రింగుట యను పుష్కలకారణ మున్నను నిర్మూల మగుట యనుకార్యము జనింపనందున విశేషోక్తి.

సీ. విరహిణీ వధ మహా దురిత పంక కళంక **(4-62)**

కలుషితాత్మకుఁ డైన ఖలుఁడు వీఁడె;

కాలకూట కఠోర కల్పాంత వహ్నికిఁ **(4-61)**

దోఁబుట్టు వైన ఘాతుకుఁడు వీఁడె;

చండ దీధితి కర జ్వాల మండలములోఁ

బ్రోదిఁ బొందిన మహోగ్రుండు వీఁడె;

బాడబంబును దానుఁ బాథోధి కుక్షిలో

సరి పొత్తు మన్న దుర్జాతి వీఁడె;

తే. సైంహికేయ నిశాత దంష్ట్రా విటంక

విష రస ప్రతిపాక భావితుఁడు వీఁడె;

గగన మను రుద్రభూమి నేకతమ తిరుగు

నదరు లుమిసెడి కొఱవిదయ్యంబు వీఁడె. **122**

విర...ఁడు — విరహిణీ = ప్రియుల నెడఁబాసి యున్న స్త్రీలయొక్క - వధ = కొల యనెడు - మహా దురిత=గొప్ప పాప మనెడి (పురుష వధయే పాపము, స్త్రీవధ మహాపాప మని చెప్పవలయును, అనుటయు, ఉపాలంభించునది స్త్రీ గావున స్త్రీకి ముగ్ధకు పురుషులను చంద్రుఁడేఁచువిధము తెలియనందునను స్త్రీమాత్రాభిమానముచేతను వచించుటయు విరహిణీశబ్దస్త్రీలింగప్రయోజనము) - పంక=అడుసు చేతనయిన-కళంక=మచ్చచేత - కలుషిత=సంజాతమాలిన్యమయిన - ఆత్మకుఁడు= దేహము కలవాఁడు ('పజ్కోఽఘే కర్దమే' హేమ. 'కలుషం క్లీబేఽంహ స్యావిలే త్రిషు' నాసా. 'కలుష' శబ్దము ధర్మధర్మివాచకము - 'శస్తం చాథ త్రిషు ద్రవ్యే పాప పుణ్య సుఖాది చ' అను నమరవాక్యమునకు వ్యాఖ్యలో 'ఆదిశబ్దాత్ శ్రేయః కలుష శివ భద్రాదయః' అని క్షీరస్వామిః మాలిన్యార్థమున నైషధమందే-

'శ్రియ స్తదాలిఙ్గనభూ ర్న భూతా వ్రతక్షతిః కాఽపి పతివ్రతాయాః
సమస్తభూతాత్మతయా న భూతం తద్భర్తు రీర్ష్యా కలు షాణు నాపి.'

(ఆత్మా యత్న ధృతి స్వాన్త స్వభావ పరమాత్మ సు । జీవబుద్ధి శరీరేషు' నానా.), ఐన ఖలుఁడు= క్రూరుఁడు ('ఖలః కల్కే భువి స్థానే క్రూరే కర్ణేజపేఽధమే' మేదిని.); స్త్రీహత్యాపాతకము వీనిమొగాన వ్రేలాడు చున్న దని భా.) (దురితపంకకళంక – రూపకము.)

కాల...కిఁ – కాలకూట = కాలకూట మనెడి- కఠోర = దారుణమయిన - కల్పాన్త= ప్రళయముయొక్క ('సంవర్తః ప్రళయః కల్పః క్షయః కల్పాన్త ఇ త్యపి' అమ.) - వహ్ని కిఁ = నిప్పునకు, తోఁబుట్టువు = (అదియును తానును సముద్రముకడుపున నే పుట్టినందున) కూడఁబుట్టిన వాఁడు (తోఁబుట్టు వనుటచే సకలదుర్గుణ దుష్కృతములందును కాలకూటసమత్వము సూచితము), ...ఘాతుకుఁడు = చంపెడుస్వభావము కలవాఁడు; (తోఁబుట్టువు - అలుగ్బహువ్రీహిసమాసము; కాల... కిఁ – రూపకాలంకారము; తోఁబుట్టుతనముం జెప్పుటచే నుపమాధ్వనియు;)

చండ ... లోఁ = వేఁడి వెలుఁగుయొక్క (సూర్యునియొక్క) కిరణముల మంటల సమూహములో, ప్రోది = పోషణమును, ... మహోగ్రుండు = అతిఘోరుఁడు - చంద్రుఁడు సూర్యునియందు ప్రవేశించి తత్కరములచే నెదుగు నని దేవీపురాణము:—

'కలాః షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవిః
అమృతే నామృతం కృష్ణే; పీయతే దైవతైః క్రమాత్;
ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పవనః కలామ్, ...
కలావశిష్టో నిష్పీతః ప్రవిష్టః సూర్యమణ్డలమ్,
అమాయాం విశతే రశ్మౌ; అమావాసీ తతః స్మృతా.
ఏవం సంక్షీయతే సోమః, క్షీణ శ్చాప్యాయ్యతే పునః,
తస్మాత్ సూర్యః శశాఙ్కస్య క్షయవృద్ధివిధే ర్విభుః.'

మంటలలో పెరిగినవాఁడు కాల్చుట ఆశ్చర్యము గా దనుట. ['కర జ్వాల మండలములో పోషణఁ జెందిన యనుట కరములతో సాంభ్రాత్రముం జెందిన యను నభిప్రాయముచేత సాదృశ్యముం బోధించుచున్నది గాన నుపమాధ్వని.]

బాడబంబును = బడబాగ్నియు, తానును, పాథోధి కుక్షిలోఁ=సముద్రము కడుపులో, సరి పొత్తు = సమానానుభవముగల యవిభక్తతతో, మన్న దుర్జాతి = జీవించిన దుర్జనుఁడు; ... అతిశయోక్త్యలంకారమును ఉపమాధ్వనియు;

సైంహి ... తుఁడు - సైంహికేయ = రాహువుయొక్క - నిశాత = వాఁడియైన - దంష్ట్రా = కోఱలయొక్క - విటంక = ముంజూరులందలి - విష రస = గరళ ద్రవమునకు - ప్రతిపాక = (ఉప్పునకు కారమువలె) ఎదురు రుచిగా - భావితుఁడు=కలుపు కొనఁబడినవాఁడు (అనఁగా ఆ గరళముతో మిశ్రితుఁడై వచ్చినవాఁడు - గరళగుణములు గలవాఁడు - తత్తుల్యుఁడు మారకుఁడు అనుట -గమ్యోత్ప్రేక్ష); గగ ... బు=ఆకాశమనెడి శ్మశానములో ఒంటిగా సంచరించుచు విస్ఫులింగములు గ్రక్కుచుండెడి కొఱవిదయ్యము (అపకారకుఁడు దాహకుఁడు ననుట.— రూపకాలంకారము.)

సీతారామాచార్యులవారు 'కొన్నియెడల విశేషణోభయపదంబులు ... సందర్భయోగ్య పదవ్యవహితంబులు నగు' నని సూత్రము రచించి అందులకు 'గగన...వీఁడె' అను నీయుదాహరణము నే యొసంగి, ఇట్టిప్రయోగములు కవిత్రయము వారి గ్రంథములలో దొరక లే దనియు వ్రాసినారు. కాని కొన్ని పుస్తకములలో పాఠము 'తిరుగు చదరు' లని యున్నది; ఇట్లే పఠించినచో ఇచ్చోట నీ సమాధాన మనావశ్యక మగును.

సీ. జనన కాలము నాఁడు జలరాశి కుక్షిలోఁ (4-51)
దరిగొండ పొరివోవఁ దాఁకెనేని,
గ్రహణ వేళలయందు రాహు వాహారించి
తృప్తిమై గట్టునఁ ద్రేఁచెనేని,
విషమ నేత్రుఁడు చేఁతి విష మారగించుచోఁ
బ్రతిపాకముగఁ జేసి ద్రావెనేని,
నపర పక్షము పేరి యపమృత్యు దేవత (4-63)
యొకమాటుగా నామ ముడిపెనేని,
తే. కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి (4-51)
తజ్జలముతోడ వెడలింపఁ దలఁపఁడేని,
విరహిజను లింత పడుదురే వీనిచేత?
నక్కటా దైవ మటు సేయ దయ్యెఁ గాక. 123

(ఈచంద్రుని), జననకాలమునాఁడు = ఈతఁడు పుట్టిన క్షీరాబ్ధిమథన దినమందు, జలరాశి కుక్షిలోన్ = సముద్రము కడుపులో, తరిగొండ = చిలుకుటకు కవ్వముగా నుపయోగింపఁబడిన మందరపర్వతము, పొరివోవన్ = (ఇతఁడు) చచ్చునట్లుగా, తాఁకెనేని = తగిలినచో;

రాహు, గ్రహణవేళలయందున్ = ఉపరాగసమయములయందు, ఆహారించి = ఆరగించి, తృప్తిమైన్=తనివిచేత. గట్టుని ద్రేఁపు భుక్తము కడుపులో చక్కఁగా కుదుటంబడుటచే కలుగును; అట్లు కుదుటం బడుట జీర్ణ మగుటకు.

విషమనేత్రుఁడు = బేసికంటి (ముక్కంటి - శివుఁ డనుట), చేఁతి విసము = చేఁదయిన కాలకూట విషమును, ... ప్రతిపాకముగన్ = ఆచేఁదు రుచించుటకై వేఱురుచి గల ద్రవ్యముగా, ... ద్రావెనేని = త్రాగినయెడలను;

అపర పక్షము పేరి = కృష్ణ పక్ష మను పేరం బరగుచున్న - అప మృత్యుదేవత = అకాల మృత్యుదేవత (కైతవాపహ్నుతి), ఒకమాటుగాన్ - (కొంచెకొంచెముగాఁ గాక - అనఁగా దిన మున కొకకళగా కాకుండ), నామము ఉడిపెనేని = పేరులేకుండ (అనఁగా పదునాఱవకళను మిగుల నీయక) రూపు మాపెనేని;

కుంభ సంభవుఁడు = అగస్త్య మహాముని, అబ్ధితోన్ = సముద్రముతో, కూడన్, క్రోలి = త్రాగి, తత్ జలముతోడన్ = ఆసముద్రపు నీటిని వెడలించినప్పుడు దానితోఁ గూడ,

... ఇంత = ఇంతబాధ, వీనిచేతన్ = ఈచంద్రునిచేత ('వీఁడు' అనుట తిరస్కారముచే), ... దైవము = విధి.

చంద్రనాశము సిద్ధించుటకై ఇట్లయ్యెనేని అట్లయ్యెనేని అని తలపోయుటచేత సంభావన.
'ఇటు లయ్యెనేని యని యెం । చుట సంభావనము లాఁతి చొప్పడుటకుఁగా;
నిటలాక్షుమురగు నుడివిన । ఘటియించును నీదుగుణగణంబులఁ జెప్పన్.' అలం.

**తే.** ప్రాణసఖులార, వెన్నెలబయలి కిపుడు **(4-59)**
మించుటద్దంబుఁ గోలయుఁ గొంచు రండు;
చోరుఁ డల చంద్రుఁ డద్దంబు సొచ్చినపుడ
వంచనము లేక వ్రేయుఁడీ పొంచి యుండి. **124**

ప్రాణసఖులార = ప్రాణప్రియ లయిన యో చెలులార (ప్రాణమువలె ప్రియయలు ప్రాణప్రియలు - ఉపమాన పూర్వపద కర్మధారయము, ప్రాణప్రియ లైన సఖులు ప్రాణసఖులు - మధ్యమపదలోపిసమాసము), ... మించు టద్దంబున్ = నిర్మలమయిన ముకురమును, కోలయున్ = దుడ్డుగుదియను, కొంచున్ రండు = కొని రండు (తెండు అనుట); చోరుఁడు = దొంగ యైన - అల = ఆ - చంద్రుఁడు, అద్దంబు చొచ్చినపుడ = అద్దమున ప్రతిబింబించినవెంటనే పొంచి ఉండి = చాటునందు నిలిచి (ప్రతిబింబచంద్రునికి ఎదుట నిలిచిన ఆతఁడు పలాయితుఁ డగును, అనఁగా ప్రతిబింబముపై వీరు మోము చూపిన ఆప్రతిబింబము అగపడదు, కొంచెము ప్రక్కగా నిలిచిన అగపడును, కాన నిట్లు చెప్పుట; చోరునిం గొట్టువారు వానికి కనఁబడక దాఁగి యుండి, వాఁడు రాఁగానే కొట్టుదురు, అటులే మదీయప్రాణములను తస్కరింప వచ్చిన యీ చోరుని పొంచియుండి అద్దములోనికి రా నిచ్చి కొట్టుఁడు అని భా.), వంచనము లేక = శక్తి వంచన చేయక - ఆదెబ్బతో చచ్చునట్లుగా, వ్రేయుఁడీ = కొట్టుఁడు - అద్దముం బ్రద్దలుకొట్టిన పిమ్మట మఱి ఆచంద్రప్రతిబింబము లేక పోవుటయే చంద్రనాశము అని భ్రమ.

'చోరుఁడు' హేతుపరము గాన పదార్థకహేతుకకావ్యలింగము.

**తే.** మనము గారానఁ బోషించి కనకపంజ **(4-58)**
రమున నిడ్డ కేళీ చకోర వ్రజంబు
వీనివెన్నెలఁ దెగఁ గ్రోలుఁ గాని విడువుఁ,
డొక్క గ్రుక్కన కుంభజుఁ డుదధిఁ బోలె. **125**

గారానన్ = గారాబముతో. కనక (=బంగారు) పంజరమున నిడుట గారాముచేతనే. కేళీచకోర వ్రజంబు = క్రీడార్థ మయిన వెన్నెలపులుఁగుల సమూహము. కుంభజుఁడు = అగస్త్యుఁడు, ఉదధిఁబోలెన్ = సముద్రమునుంబలె. వీని = ఈచంద్రుని యొక్క - వెన్నెలను, ఒక్క గ్రుక్కన్ ఆ = ఒకగ్రుక్కలోనే, తెగఁ గ్రోలుఁ గాని=నిశ్శేషమగునట్లు త్రాగును గాక, విడువుఁడు.—చకోరములు వెన్నెలను గ్రోలి బ్రదుకుట కవిసమయసిద్ధము -

'జ్యోత్స్నా పేయా చకోరై, ర్జలధరసమయే మానసం యాన్తి హంసాః;
ఇత్యాద్యన్యేన్యయ మన్యత్ కవిసమయగతం సత్కవీనాం ప్రబన్ధే.' సా. ద.

చకోరముల వెన్నెలబువ్వము పారిజాతాపహరణంబున రమణీయముగా వర్ణింపఁబడి యున్నది.

కుంభజసామ్యోక్తిచే ఉపమాలంకారము. తత్సామ్యస్వారస్యమే 'ఒక్క-గుక్కన'; ఆయన సముద్రము నెల్ల అఱచేతిగుంటలోనికిం గొని యొక్క మాటే గటా త్రాగినాఁడు. ప్రభువులు కాఁపురముకై శిబిరంబులందు మంచి యిండ్లు కట్టించి యిచ్చి అన్నవస్త్రము లిచ్చి పోషించిన సిపాయి పటాలములు సమయము వచ్చినప్పుడు వారిశత్రువులను ఒక్క-తాఁకులోనే నాశము చేయునట్టి వర్తనము చకోరవ్రజమందు స్ఫురించుటచేత సమాసోక్త్యలంకారంబును.

తే. శ్రవణ పూర తమాల పల్లవ చయంబు (4-56)
మేపుదము వీనిలో నున్న మృగశిశువున;
కది ప్రవర్ధన మొందెనే ముదితలార,
మండలం బెల్లఁ దాన యై యుండుఁ గాని. 126

ముదితలారా = ఓచెలులార, వీని ... కున్ = ఈచంద్రునియం దున్న జింకపిల్లకు, శ్రవ ... బున్ = మనయవతంస మయిన చీఁకటిమ్రానిచిగుళ్ల మోపును, మేపుదము; అది=ఆజింక పిల్ల, ప్రవర్ధనము ఒందెనేని = పెంపు పొంది (పిల్ల గావున ఎదుగును, పెద్దది మఱి యెదుగదు), మండలం బెల్లన్= బింబ మంతయు, తాన యై = ఆక్రమించి, ఉండుఁగాని = ఉండునుగాక; (అప్పటికి వీనిముఖము నాకు కనఁబడ కుండును, దానం దుష్టిఁ జెందెదను; అనుట.)

తినునప్పుడే ఎదిగి చంద్రునిం గ్రమ్మెట అభిప్రాయము గాన అక్రమాతిశయోక్తి-

'యుగపద్భావాశ్రయమున। నగుఁ గృతి కారణము నక్రమాతిశయోక్తిన్;
జగదీశ, నీశరములున్। బగఱుం జ్యాలింగనంబుఁ బడయుట యొకటన్.' అలం.

క. రాహు గ్రహ వదన గుహా। గేహాంత ర్ధ్వాంత పటల కేళీ రస కౌ
తూహల నవ ఖద్యోతం। బీ హారిణాంకుండు; వీని కేటికి వెఱవన్? 127

ఈ - హారిణాంకుండు= చంద్రుఁడు (జింక చిహ్నముగాఁ గలవాఁడు అని యౌగికార్థము), రాహు ... బు = రాహుగ్రహముయొక్క నోరనెడి గుహా (రూప మయిన) గృహములోపలి చీఁకటి మొత్తమునందు క్రీడయొక్క (రస =) అనుభవమునందు ఉత్సాహముగల బుడుత మిణుఁగురు (ఎప్పుడు రాహువు నోరు మూసికొనునో అప్పుడు వీనినాశము తప్పదు గాన) ,... వీనికిన్, వెఱవ నేటికిన్ = భయపడ నక్కఱ లేదు. (4-65)

'ఖద్యోత'—క్షుద్రమైన కీటకమాత్రము అనుట; 'నవ'- పసితనముచే తెలివి చాలక తనకు ఎచట నాశము కలుగునో ఆరాహువదనములోనికే పోవుచుండు ననుట. పసితన మెట్లనఁగా 'చన్ద్రమా జాయతే పునః,' 'నవో నవో భవతి జాయమానః...చన్ద్రమాః,' ఇత్యాదిశ్రుతులందుఁ జెప్పినట్లు మాటిమాటికిం బుట్టుచుండుటచేత.

వ. అని మఱియును. 128

మ. అవతంసంబవు పార్వతీపతికి; దు గ్ధాంభోధికిం కూర్మి ప (4-50)
ట్టివి; బృందారకధేను కల్పతరువాటీ కౌస్తుభ శ్రీ సుధా

సవభుగ్వారణ సోదరుండవు; జగ చ్ఛ్లాఘ్యుండ వీ; విట్టి నీ
కవునే ధర్మువు శోచ్యపాంథ జన సంహారంబు తారాధిపా? 129

తారా అధిపా = నక్షత్రేశుఁడా, ఈవు, పార్వతీపతికిన్, అవతంసంబవు = శేఖరమవు ('పుం స్యుత్తం సావతంసౌ ద్వౌ కర్ణపూరే చ శేఖరే' అమ.–పార్వతిం జెప్పుటచే ఆ మెఱుఁగూడ నవతంసమవు అని భా. అంతటి గొప్పదేవతలచేత శిరంబున వహింపఁబడినవాఁడవు, కడుం గొప్పవాఁడవనుట); దుగ్ధ ... ట్టివి = క్షీరసముద్రునికి (మహానిర్మలునికి సకలరత్నాకరునికి అని భా.), కూర్మి పట్టివి = ప్రియ పుత్త్రుఁడవు (అక్షీతికి తగినట్లు తండ్రికి మంచిపేరు తేఁదగునే గాని చెడ్డ పేరు తేఁగూడ దనుట); బృం ... డవు – బృందారక ధేను = వేల్పు టావు – కల్ప తరు = ఈగి మ్రాఁకులయొక్క – వాటీ = చాలు (చా లనుట అయిదు గావున –

'ప ఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతకః
సంతానః కల్పవృక్ష శ్చ పుంసి వా హరిచన్దనమ్.' అమ.
'కల్ప స్తు ప్రళయే న్యాయే శాస్త్రే బ్రహ్మదినే విధౌ
సురద్రుమే వికల్పే చ, ప్రత్యయ శ్చ త్సమార్థకః.' నానా.)–

కౌస్తుభ = హరిచేత వక్షోధృత మైన కలశవారాశిజాతమణి – శ్రీ = మహాలక్ష్మి – సుధా = అమృతము – సవభుక్ = యజ్ఞ (హవిర్భాగ) భోక్త లయిన వేల్పులయొక్క – వారణ = ఏనుఁగైన యైరావతము – వీనికి – సోదరుండవు = (తానును అవియు పాలకడలిలో పుట్టినందున) సహోదరుఁడవు (వానివలె దాన రక్షణ సంజీవ నాది సుగుణములచేతనే ప్రకాశింపవలసినవాఁడవు అనుట); జగత్ శ్లాఘ్యుండవు = ప్రహ్లాదనాది గుణములంబట్టి లోకులకు కొనియాడం దగినవాఁడవు; ఇట్టి = ఇంతమహనీయునికి – నీకున్, శో ... బు – శోచ్య = కనికరింపఁదగిన – పాంథజన = విరహిజనులయొక్క (జనశబ్దము స్త్రీపురుషోభయవాచకము గావున నిది పురుషులనే ఉద్దేశించినమాట యని తలంపఁ గూడదు) – సంహారంబు = కొల, ధర్మువు = న్యాయము, అగునే – కా దనుట.

జగచ్ఛ్లాఘ్యునికి పాంథసంహారమునకును అననురూపఘటన గావున విషమాలంకారభేదము–
'విషమము (1) విరూపకృతిజని । (2) విషమఘటన (3) యత్నమునకు విఫలత కీడున్.
'(1) ఇక్కుప్పుఁగ త్తి కనెఁ దెలి । యక్కీర్తిని; (2) సీత యేడ నలవెత లేడన్?
(3) అక్కలికిపై మరుఁడు వి । ల్లెక్కిడి తాఁ జిక్కె దానియెమ్మెలకు వెసన్.' అలం.

క. చేయకుము చంద్ర, (4-53)
సుమనస్సాయకునిం గూడి విరహి జన మారణమున్;
వ్రేయకు మందంద పయ
స్తోయధి వంశమున కపయశో డిండిమమున్, 130

చంద్ర, సమనః సాయకునిన్ = పూవు టమ్ములవానిని, కూడి, విరహి జన మారణమున్ = వియోగి జనులను చంపుటను, చేయకుము=కావింపకుము; అందంద = ఎల్లెడలను, పయస్ తోయధి వంశమునకున్= పాల సముద్రుని కులమునకు, అపయశో డిండిమమున్=అపకీర్తి తప్పెటను, వ్రేయకుము = వాయింపకుము.— పూర్వ వాక్యార్థమునకు (ఉత్తరవాక్యార్థము) హేతువు గావున వాక్యార్థహేతుక కావ్యలింగము.

వ. అని బహుప్రకారంబుల. 131

తే. ఇవ్విధంబునఁ గ్రథకైశికేంద్ర తనయ
మదన వేదన దోధూయమాన యగుచు,
బహువిధంబుల విధు దూఱి పలుకు చుండెఁ,
దొడఁగి మధురంబుగా విధుంతుదునిఁ బొగడె. 132

క్రథకైశిక ఇంద్ర తనయ – క్రథకైశిక = విదర్భదేశముయొక్క – ఇంద్ర = దొరయైన భీమరాజుయొక్క – తనయ = కూఁతు రయిన దమయంతి, ... మదన వేదన దోధూయమాన = మదన బాధచేత మిక్కిలి పీడింపఁబడుచున్నట్టిది, అగుచున్, ... విధున్=చంద్రుని, ...దూఱి = నిందించి, ... తొడఁగి = ఆరంభించి, ... విధుంతుదునిన్ = రాహువును, ...

వ. అనంతరంబ. 133

—* మదనోపాలంభము. *—

తే. అంతరిక్షంబునం దతి వ్యవహితుఁ డగు (4-74)
నిందు నిందింపఁ గారణం బేమి నాకు ?
నెమ్మనంబునయందు సన్నిహితుఁ డైన
కంతుఁ బాపాత్ము నిందింతుఁ గాక యనుచు. 134

... అతి వ్యవహితుఁడు = కడు దూరమున నున్నవాఁడు – దూరముచే వినఁబడదు గాన నిందించుటవలనం బ్రయోజనము లే దని భా., ... ఇందున్ = చంద్రుని, ... సన్నిహితుఁడు= ఉన్నవాఁడు, కంతున్ = మన్మథుని, ...

వ్యవహితత్వము నింద మానుటకును సన్నిహితత్వ పాపాత్మతలు తొడంగుటకును హేతువులు గాన పదార్థక హేతుక కావ్యలింగము.

'నెమ్మనంబునయందున్' – సూత్రములచే 'నెమ్మనంబునందున్' అనురూపము సాధ్యము; ఈరూపము బాలవ్యాకరణమున 'సమాసంబునయందు' అను ప్రయోగముచే జ్ఞాపితము.

చ. ననవిలుకాఁడ, మన్మథ, యనాథ వధూ వధ పాతకంబు నిన్ (4-79)
గొని మునిఁగించెఁ గ్రూర హర కోప కటాక్ష శిఖి స్వరూప మై;
మనమున నీవు నిర్దయత మానవు; చూడఁగ నేముహూర్త వే
ళను జనియించితో యకట లచ్చికి న మ్మధుకైటభారికిన్? 135

నన విలుకాఁడ=పూ విల్తుఁడా, మన్మథ=మరుఁడా (మనస్సును మథించువాఁడు అని వ్యు.), అనాథ వధూ వధ పాతకంబు=పతులకు దూర మైనస్త్రీల మారణ మనెడి (ఆస్త్రీలను చంపిన)పాప కృత్యము, క్రూర...ము=క్రూర మయిన రుద్రునికోపముతోడి కడకంటి చూపుయొక్క చిచ్చే తన రూపముగాఁ గలది (తానే ఆశిఖిగా), ఐ = మాఱి, నిన్=నిన్ను, కొని=పట్టుకొని, మునిఁగించెన్ =రూపుమాపినది,... చూడఁగన్ = ఆలోచింపఁగా, అకట = అయ్యో, ... మధు కైటభారికిన్ = నారాయణమూర్తికిని, ఏ ముహూర్త వేళన్ = ఎట్టి చెడుముహూర్తమున, ...

మధుకైటభ ప్రస్తావముచేత వారివలెనే నీవును ఒకయసురుఁడవు, సముద్రమున యోగనిద్రాపరవశుఁడయిన యా నారాయణునికి లక్ష్మియందే అయినను ఏదోయొక పాడుముహూర్తమునందు జనించితివి, అని యాకూతము.

మునిఁగించుట యను పుష్కలకారణం బున్నను నిర్దయత మానుట యనుకార్యము జనింపనందున విశేషోక్తి. నిర్దయతచేత దుర్ముహూర్తవేళాజనన మనుమానింపఁబడినది గావున ననుమానాలంకారము.

తే. కామ, పరమేష్ఠి నీ మనః క్రౌర్య మెఱిఁగి, (4-86,87)
పుష్పములు నీకు నాయుధమ్ములుగఁ జేసె;
నవియు బహుళంబుగాఁ జేయ కైదె చేసె, (4-89)
నింత కైనను బ్రతుకునె యిజ్జగంబు? 136

కామ = మదనుఁడా, పరమేష్ఠి = బ్రహ్మ, ... నీ - మనః క్రౌర్యము = హృదయముయొక్క కూరతనమును, ఎఱిఁగి = ఎఱిఁగినందున, పుష్పములు - అపటువు లని భా., ... బహుళంబుగాన్ = పెక్కులుగా, ... ఇంతకున్ = ఈయైదుపూములుకులకు.

'పర ... చేసె' - హేతూత్ప్రేక్ష. ఐదుపువ్వు లనెడి యసమగ్రహేతువుచేత జగజ్జయమనెడి కార్యము చెప్పఁబడినది గావున విభావనాభేదము. ఇంతకే బ్రతుకకున్నట్టి జగత్తును గట్టి విల్లు ఉక్కుటలుఁగులు నిచ్చిన నీక నేమి సేయుదువో అని కావ్యార్థాపత్తి ధ్వనించుచున్నది.—

'(1) కారణము వినా, (2) యసకల। కారణమునను, (3) బ్రతిబంధకం బుండ, (4) నతత్కారణమునను, (5) విరుద్ధపుఁ। గారణమునఁ గృతి జనింపఁగ విభావన లౌ?' అలం.

ఉ. రాక సుధాంశు మండలము రాకకు మాఱుమొగంబు సేయుచో,
డీకొని వచ్చు దండధర దిక్పవమాన మదక్షిణం బవుం (4-96)
గాక వియోగికిం, గుసుమ కార్ముక శృంగము వంగఁ జేయు నీ
యీ కరపంకజాతము రతీశ్వర, దక్షిణ మైన నాఁటికిన్. 137

రతి ఈశ్వర = మన్మథుఁడా, వియోగికిన్ కాక = వియోగిపై ద్వేషించి, కుసుమ కార్ముక శృంగమున్ = (అల్లె నెక్కువెట్టి బాణములు ప్రయోగించుటకై) పూ వింటియొక్క కొప్పును, వంగఁజేయు నీ యీ - కర పంకజాతము=చే దామర, దక్షిణము=అనుకూలము (ఇంచుక సవ్యము-కుడిదియు), ఐననాఁటికిన్ = ఐనప్పుడు, రాకన్ = నిండుపున్నమనాఁడు- లేక - రాక ..., రాకకున్ = నిండుపున్నమనాఁటి చంద్రమండలముయొక్క యాగమనమునకు (దాని నోర్వ లేక యనుట), మాఱు మొగంబు సేయుచోన్=(వియోగి) పెడమరలు నప్పుడు (అనఁగా - తూర్పుమొగముగా నున్న వియోగి చంద్రోదయముం గన లేక పడమటిమొగముగా తిరిగి దానిబాధను కొంత తప్పించుకొన్నప్పుడు), డీకొని=(పొట్టేలు తలతోఁ బొడుచునట్లుగా) పోరాడుటకుఁ బూనుకొని, వచ్చు=పైకొనెడి - దండధర దిక్ పవమానము = యముని దెస గాలి (దక్షిణపుగాలి - మలయమారుత మనుట), అ దక్షిణంబు = ప్రతికూలము (బొత్తిగా సయిఁపరానిది - కుడిది కానిది - ఎడమవైపుది అనియు), అగున్.

నీకు చంద్రోదయము తోడయినప్పుడు నీయేటులను కొంచెము సహించినను సహింపవచ్చును గాని, మలయమారుతము తోడ్పడినప్పుడు బొత్తిగా సహింప శక్యము కాదని భా. 'చందనమారుతా'ద్యాహ్లాదన బోధక నామమునఁ జేర్కొనక 'దండధరదిక్పవమాన' మనుట దానియొక్క మారణ స్వభావాపేక్షచేత.— దక్షిణము అదక్షిణ మగు నని విరోధము, అనుకూలము అననుకూలము అను నర్థములచే పరిహారము, కావున విరోధాభాసాలంకారము.

సీ. భువన మోహాన సముద్భవ మైన యఘమున (4-83)
నశరీర భూతంబ వైతి మదన ;
విరహ మాలిన్య దుర్విధుఁ గాని సోఁకవు,
కలిదోషమవె నీవు కాయజుండ ;
ప్రాల్గల రతిదేవి భాగ్యసంపదఁ గదా
ప్రసవసాయక, చచ్చి బ్రతికి తీవు ;
చాలదా యేలెదు సకల ప్రపంచంబు
పంచత్వ మొందియుఁ బంచబాణ ?
తే. తమ్మిపూచూలి నీ యాగ్రహ మ్మెఱింగి, (4-86)
లోక మవ్యాకులతఁ బొందుఁ గాక యనుచుఁ,
దక్కుఁ గల కైదువులు మాని దర్పకుండ,
విరులు నీ కాయుధములు గావించినాఁడు. 138

మదన, భువ...నక్ = లోకముయొక్క (లోకమును - లోకస్థుల ననుట) మూర్ఛిల్లఁ జేయుటవలన పుట్టుక కలదైన (పుట్టిన) పాపముచేత, అశరీర భూతంబవు = దేహము లేని దయ్యమవు (అనంగునికి దేహము లేదు, దయ్యమునకును లేదు, దయ్యము స్త్రీబాలకాదులను పూని బాధించును, అనంగుఁడును దమయంతిని బాధించుచున్నాఁడు, కావున పిశాచమ వనుట), ఐతివి; మహాపాపము చేసినవారు పిశాచజన్మ మెత్తుట ప్రసిద్ధము ; గమ్యోత్ప్రేక్ష.

కాయజుండ = అంగభవుఁడా - మదనుఁడా, విర...వె=వియోగమువలని మలినత్వముచేత సనిచెడినవానిని గాని తగులవు (ఆవేశింపవు) నీ వేమి కలివికారమవా; ఉత్ప్రేక్ష.

ప్రసావసాయక = పుష్పబాణా, ప్రాలు= సౌమంగల్యము (ఐయిదువతనము), ... భాగ్యసంపదన్ = అదృష్టము కలిమిచేత, ...చచ్చియు బ్రదుకుట రతీదేవియొక్క మంగళసూత్రమహిమచేతఁ గాని నీప్రభావముచేతఁ గాదు సుమా యనుట; హేతూత్ప్రేక్ష. కుమారసంభవములో ఆకాశవాణి రతిని ఈక్రింది యట్లూరార్చినది:—

"కుసుమాయుధపత్ని, దుర్లభ స్తవ భర్తా న చిరా ద్భవిష్యతి ;
శృణు యేన స కర్మణా గతః శలభత్వం హరలోచనార్చిషి.
అభిలాష ముదీరితేన్ద్రియః స్వసుతాయా మకరో త్ప్రజాపతిః,
అథ తేన నిగృహ్య విక్రియా మభిశప్తః ఫల మేత దన్వభూత్.

'పరిణేష్యతి పార్వతీం యదా తపసా తత్ప్రవణీకృతో హరః
ఉపలబ్ధసుఖ స్తదా స్మరం వపుషా స్వేన నియోజయిష్యతి.'
ఇతి చాహ స ధర్మయాచితః స్మరశాపావధిదాం సరస్వతీమ్;
అశనే రమృతస్య చోభయో ర్వశిన శ్చాంబుధరా శ్చ యోనయః."

పంచ బాణ = అయిదు కోలలవాఁడా, పంచత్వ మొందియుఁన్ = చచ్చియు (పంచత్వ మనఁగా ఒకటిగా నున్న దేహము పంచభూతములుగా విడి పోవుట), సకల ప్రపంచంబు = లోకము నంతయు, ఏలెదు.—కాముఁడు చచ్చియు ప్రపంచ మేలుట విరోధము; పార్వతీపరిణయానంతరము నిజదేహముతో కూడిన కారణమువలన పరిహారము; కావున విరోధాభాసాలంకారము.

దర్పకుండ = కాముఁడా, తమ్మిపూచూలి = బ్రహ్మదేవుఁడు, నీయాగ్రహమ్ము = నీ(లోకహింసా)దురభినివేశమును, ... అవ్యాకులతన్ = నెమ్మదిని, ... అనుచున్ = అనుకోరిక చేత, తక్కుఁగల కైదువులు = కడమ యాయుధములను (కత్తులు కటారులు బల్లెములు బాకులు నారసములు లోనగు పటిష్ఠాయుధముల ననుట), ... విరులు = పువ్వులను (శబ్దముచేతను అర్థముచేతను అధమాధమములను అని భా.); బ్రహ్మ కేల ఈ లోక క్షేమాభిమాన మనిన తనసృష్టికి భంగము కలుగకుండుటకై.—హేతూత్ప్రేక్ష.

'విరులు...గావించినాఁడు' - ఇంచుగాగమమునను స్వరయతి లేమిం బరికించునది.

వ. అని పలికి, లీలోద్యానంబునందు సరస రసాల కోమల కిసల యాస్వాదన కషాయ కంఠ కలకంఠ కామినీ కుహూకార కోలాహల పంచమంబు వీతెంచిన, నప్పల్లవాధర యుల్లంబు జల్లన నొల్లంబోయి మూర్ఛిల్లిన. 139

'అని పలికియు వైదర్భి' అని పూర్వముద్రణ పాఠములో 'వైదర్భి'— యను పద మధికము. సరస...మంబు= రసవంతమయిన తియ్యమావి లేత చిగురును మేయుటచేతె ఒగరుగొంతు కల కోకిల కోమలియొక్క కుహూశబ్ద కలకలముయొక్క పంచమస్వరము, వీతెంచినన్ = వినఁబడఁగా, ఆ పల్లవ అధర = చిగురువంటి యధరము గల యాదమయంతి, ఉల్లంబు = గుండె, జల్లనన్ = జల్లు మనఁగా, ఒల్లంబోయి = చేతన యొడలి,...కలకంఠ కంఠము కషాయ మైనచో కూజితము మధురతరమును విరహోద్దీపకతరంబు నగు ననుటకు -

'చూతాఙ్కు రాస్వాద కషాయ కణ్ఠః పుంస్కోకిలో య న్మధురం చుకూజ,
మనస్వినీ మాన విఘాత దక్షం త దేవ జాతం వచనం స్మరస్య.' కుమా.

కోకిలకామినీ కాకలీప్రభావమునకు ముక్కుతిమ్మనార్యుని ముద్దుఁ బలుకును వినఁ దగును -

'ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన కోప దవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుట న్లలితాంగి పంకజ
శ్రీసఖ మైన మోముపయిఁ జేల చెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్.'

కోకిల సప్త స్వరములలో పంచమమురి బలుకును -

'నిషా దర్షభ గాన్ధార షడ్జ మధ్యమ ధైవతాః
పఞ్చమ శ్చే త్యమీ సప్త తన్త్రీ కణ్ఠోత్థితాః స్వరాః.' అమ.

'షడ్జం మయూరో వదతి, గావ స్త్వృషభ భాషిణః,
అజావికం తు గాన్ధారం, క్రౌఞ్చః క్వణతి మధ్యమమ్,
ధైవతం హ్రేషతే వాజీ, నిషాదం బృంహతే గజః,
మయూరాదయ ఏతే హి మత్తా గాయన్తి పఞ్చమమ్.' అమ. అధి.

'నక్రోడాది బహ్వచః' అని బహ్వచ్ఛనసు జీషు నిషిద్ధ మగుటంజేసి 'పల్లవాధరి' అనునది అపశబ్దము. ఈ వచనమందలి ఛేకవృత్త్యనుప్రాసంబులం బరికించునది.

—* శిశిరోపచారములు. *—

ఉ. గొజ్జఁగ నీరు సల్లె నొక కోమలి, త్రిప్పె లతాంగి యోర్తు లా
మజ్జక తాలవృంత, మొక మానిని చందన కర్దమంబునన్ (4-111)
మజ్జన మాచరించెఁ గుచ మండలి, నొక్కవధూటి యెంతయుం
బుజ్జవ మొప్పఁ బాదములఁ బుష్పొడి యొత్తె విదర్భకన్యకున్. 140

విదర్భకన్యకున్ = దమయంతికి, ఒకకోమలి, గొజ్జఁగనీరు = పన్నీటిని, చల్లెన్ = చిలుకరించెను; లతా అంగి ఓర్తు = తీఁగఁ బోఁడి యొకతె, లామజ్జక తాళవృంతము = నీటివట్టివేరుల విసనకఱ్ఱను, త్రిప్పెన్ = విసరెను; ఒకమానిని, చందన కర్దమంబునన్ = చిక్కని గంధపుఁగలపముతో, కుచ మండలిన్ = వట్రువ యయిన కుచ ప్రదేశమును, మజ్జనము ఆచరించెన్ = స్నానము చేయించెను (అభిషేకము చేసెను); ఒక్క - వధూటి = బోటి, ఎంతయున్ = మిక్కిలి, బుజ్జవము = ('అమ్మా రవంత పూయనీ, మాయమ్మ గదే' ఇత్యాది) లాలన, ఒప్పన్ = మీఱ, పాదములన్ = అడుగులయందు, పుష్పొడి = పుష్పపరాగమును, ఒత్తెన్ = పట్టించెను.

అందఱు నొక్కుమ్మడి నాయాయుపచారములు చేసిరి గాన సముచ్చయాలంకారము -
'అగు వర్ణింప ననేకము । యుగపద్భావాశ్రయము సముచ్చయ మన; నీ
పగతురు వెఱతురు పఱతురు। వగతు రసి విడుతురు పుట్టపై నిలుతు రనిన్.' అలం.

'గొజ్జఁగనీరు' - గొజ్జఁగ యన రోజాపువ్వు - దానిపైఁ బడి తత్పరిమళము పట్టిన మంచు ('పని' - అఱవము) 'గొజ్జఁగనీరు' - అదియే 'పన్నీరు' - తత్పరముగానే పెద్దనగారు వరూథినికి 'హిమాంబుపూరంబుల'ను బ్రయోగించిరి - పట్టిమంచు శైత్యమాత్ర మగునుగాని శృంగారోచితము గాదు-అట్లే (మూ.శ్లో.) 'వ్యధిత కాఽపి హిమం సుతనో స్తనా'అనుచో 'హిమం చన్దనమ్'అని వ్యాఖ్య.

'కర్పూర ధూళీ రచితాలవాలః కస్తూరికా కుఙ్కుమ లిప్తదేహః
పన్నీరనీరైః పరిషిచ్యమానః ప్రాఞ్చం గుణం ముఞ్చతి కిం పలాణ్డుః.'
అని యొకకవి రచించినాఁ డఁట.—'కోమలి' – ఇది తద్భవము, 'కోమల' తత్సమము -
'సౌధవీథికలలోఁ జరియించు పుష్పకో । మల లేడ మల లేడఁ దలిపఁబోఁడి.' నరస.

ఉ_క్తశైత్యోపచారములకు తత్తదవయవౌచిత్యముం బరికింపవలయును; చందనోక్తిచే కుచ మండలికి మలయగిరిసామ్యము, పుష్పొడిం జెప్పుటచే పాదములకు పద్మసాదృశ్యమును భా.

సీ. పద్మినీ, కన్నీరు పన్నీటఁ దుడువుము;
రంభాదళంబు సారంగి, వీవు;

కల్పవల్లి, యొనర్పు కర్పూరతిలకంబు; (4-113)
చక్రవాకి, యలందు చందనంబు;
వలిపెంపుఁ జెంగావి వలువఁ గప్పు చకోరి;
బిసకాండ హారంబు వెట్టు హారిణి;
కలకంఠి, చేర్పు చెంగలువ యెత్తు దలాడ;
కలిక, పైఁ జిలికించుఁ గమ్మఁదేనె; (4-113)
తే. బాల శైవాల మంజరీ జాలకంబు
లిందుమతి, యొత్తు మఱి చేతులందుఁ గదియ;
నప్పళింపు మందారిక, యడుగులందుఁ
జల్లఁగాఁ బుండరీక కింజల్క ధూళి. 141

ఇందు 'సఖీజనంబులు' ఒండొరులకుం బెట్టుపనులు వర్ణితములు.—ఇందు అంతటను చెలులకు తత్తన్నామధేయముచే సంబోధన కలదు. ఆయానామధేయమునకు ఆయాతరుణి సేయవలసిన యుపచారమునకుం గల గర్భగతసామ్యాద్యౌచిత్యము నరయవలయును:—

పద్మినీ ... తుడువుము—కన్నీరు గ్రమ్మిన కన్ను మంచునీరు (పని నీరు - పన్నీరు) గ్రమ్మిన పద్మమువలె నున్న దని యాకూతము, పద్మిని = ఒక తెపేరు - పద్మములతోడి పద్మలతయు పద్మినీజాతిస్త్రీయు నర్థములు -

['బాష్పవర్షేణ నీతం వో జగన్మఙ్గళ మాననమ్
అవశ్యా యావసిక్తస్య పుణ్డరీకస్య చారుతామ్.' ఉ. రా. చ.

అని శ్రీరాములవారిం గూర్చి లవ వాక్యము - ఇత్యాదుల ననుసంధింప వచ్చును], రంభా దళంబు= అరఁటి ఆకును, ... వీవు = వీవుము, సారంగి = ఒక తెపేరు - పిడియేనుఁగును - ఏనుఁగునకును అరఁటికిని గలవైరమును అరఁటి నది పెకలించుటయు బ్రసిద్ధములు—'అదెవో తద్వైరమూలం బిలన్' అని రామరాజభూషణుఁడు గజకదళీ వైరమును వర్ణించినాఁడు;

కల్పవల్లీ కుసుమములు ధవళములు కర్పూరపుబొట్టులవలె నుండును అని యౌచిత్యము; 3 ఆ. 69 పద్యముం గన నగు; అలందు = పూయుము - చందనము పూయుట ముఖ్యముగా స్తనముల యం దని పూర్వపద్యమునం గన నగు: స్తనచక్రవాక సామ్యము ప్రసిద్ధము గదా;

వలిపంపుఁ జెంగావి వలువన్ = సన్నని చెంగావి వస్త్రమును; సన్నని తెల్లవస్త్రమునకును చంద్రికకును సామ్యము ప్రసిద్ధము:— 8 ఆ. 2. పద్యముం జూచునది -

'అనతిలమ్బి దుకూల నివాసినీ । లఘుభి రాభరణైః ప్రతిభాతి మే
ఉడుగణై రుదయోన్ముఖచన్ద్రికా । గతహిమైరివ చైత్రవిభావరీ.' మాళవిక.

'తారాగణప్రవరభూషణ ముద్వహన్తీ । మేఘావరోధ పరిముక్త శశాఙ్కవక్త్రా [బు.సం.
జ్యోత్స్నాదుకూల మమలం రజనీ దధానా । వృద్ధిం ప్రయా త్యనుదినం ప్రమదేవ బాలా.'

కావున ఉదయచ్చంద్ర చంద్రికకును చెంగావికిని సామ్యము సిద్ధము -

'శశికాంతి చెంగావి దసిలి మించిన కేలి । స్వర్ణత్సరువు వాఁడి వాలు మెఱయ.' ఆము.

చంద్రిక చకోరములకు భోజనము; చెంగావి చలువ; చంద్రికయుం జలువ;

'చెంగావుల మృణాళభంగంబుల నంగంబులకుం జలువఁ బుట్టింప.' యను. కావున ఉదయించుచున్న చంద్రుని చంద్రికవంటి చెంగావిని తెచ్చి కప్పుము అని యాకూతము. హారిణి అనఁగా తెల్లనిదియు, బిస కాండ హారము (తామర తూఁటి పేరు)ను తెల్లనిది – 'హారిణః పాణ్డురః పాణ్డుః' అమ.

కలకంఠి – ఇది హంసకునుం బేరు – 'కలకణ్ఠ స్తు కోకిలే। హంసే పారావతే చాపి త్రిషు త్వేష కలస్వరే' నానా. నీటిపక్షికి హంసకు చెంగలువల నాళము చక్కఁగా తెలియును; చెంగలువ యొత్తు = చెంగలువ దండను, (మడిఁచి), తలాడ = తలగడనుగా, చేర్పుము;

'కలిక' – అనఁగా మొగ్గ, మొగ్గలో తేనె సిద్ధము; ['కలికి' అని పూర్వముద్రణ పాఠమున ఇది యొక్కటియే ఇందలి సంబుద్ధులలో నచ్చతెలుఁగు మాటయు స్త్రీసామాన్య వాచకంబును. కావున నిది 'కలిక' యని యుండ నోపు; 'కలికా కోరకో౽స్త్రియామ్' అమ. మూలములో 'అయి కలే కలయ శ్వసితి స్ఫుటమ్?' అని 'కలా'శబ్దమున్నది, దాని కిది స్వార్థకకప్రత్యయముచే నిష్పన్నముగా ప్రయుక్తమైనను కోరక వాచకంబును నై యున్నది. ఈకలయే కలావతి యను పేర ౭ఆ. (55 – 90) లో 'నొడికారపుంబ్రోడ'తనంబు నూపిన చేడె యని తలంపం దగును.]

ఓసి ఇందుమతీ – అబచేతులందుఁ బాల శైవాల మంజరీ జాలకంబులు = లేఁత నాఁచు కొమ్మల జొంపములను, కదియ నొత్తుము = అంటునట్లుగా అదుముము; హస్తము పద్మతుల్యము, పద్మముపై ఇందునికి పగ, ఆపగ తీఱునట్టు దానిని తత్సహవర్తి యగు శైవాలముతోఁ గప్పివేయు మనుట; చక్కఁగాఁ గప్పు మనుటకు చమత్కారోక్తి;

మరందిక – పుష్పరసవాచక మయిన మరందశబ్దముపై సంజ్ఞాద్యోతక కన్ప్రత్యయము రాఁగా నయిన రూప మిది – పుండరీక కింజల్క ధూళిక = తెల్లదామరల యకరువులె దుమారమును,... అప్పళింపుము = అద్దుము; పుండరీకమందు మరందము కింజల్కమునకుం దోఁబుట్టువు. 'మందారిక' యనుపాఠంబున – మందారశబ్దముపై ప్రక్రియ పైయట్లే; మందారశబ్దము గజమునకును వాచకము, కావున మందారిక యనఁగా పిడియేనుఁగు అర్థ మగును; 'మన్దారో హస్తి ధూర్తయోః' మేది; ఏనుఁగు కమలములం ద్రుంచుట ప్రసిద్ధము.

## ——*స్వయంవరము చాటుట.*——

వ. అని పలుకుచు సంభ్రమించు సఖీజనంబుల కలకలం బాలించి, యిది యేమి కోలాహలం,బని, భీమభూపాలుండు దేవీసహితుం డై యడుగఁ, దద్వయస్యాజనంబులు దా రెఱింగిన తెఱం గెల్లను విన్నవింప, నన్నరనాథుండు ముద్దుఁ గూఁతు మనోభిలాషంబునకు ననుకూలంబుగా జగంబునం దెల్ల స్వయంవరంబుఁ జాటం బంచిన. 142

... సంభ్రమించు = త్వరపడు ('సంభ్రమ స్త్వరా' అమ.)...కలకలంబు=గోల్లు ('కోలాహలః కలకలః' అమ.) ... వయస్యా = సఖీ...

తే. సప్త సాగర పరివృత క్ష్మాతలమునఁ
జాటఁబడియెను వాదిత్ర సంయుతముగ

ధరణి నాథ కుమార హృద్ధైర్యహారి
భోజకన్యా స్వయంవ రాభ్యుదయ మహము. 143

... హృత్ధైర్య హారి = హృదయముల ధైర్యమును హరించునది, ... అభ్యుదయ = శుభోదయముయొక్క - మహము = ఉత్సవము, ... పరివృత = చుట్టుకొనఁబడిన - క్ష్మా తలమునన్ = భూ ప్రదేశమందు (సప్త...నన్ - అఖిలప్రపంచమందు ననుట; సప్తసాగరములు లవణేక్షు సురా సర్పి ర్దధి క్షీర జలార్ణవములు), వాదిత్ర సంయుతముగన్ - వాదిత్ర = తతము - ఆనద్ధము - సుషిరము - ఘనము - అనెడి నాలుగువిధముల వాద్యములతో - సంయుతముగన్ = కూడుకొన్నదిగా -

'తతం వీణాదికం వాద్యం, మానద్ధం మురజాదికమ్,
వంశాదికం తు సుషిరం, కాంస్యం తాలాదికం ఘనమ్;
చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్య నామకమ్.' అమ.

## —* ఆశ్వాసాంతము. *—

మ. నవ రత్నోపల దివ్య లింగ వర దాన ప్రీత దాక్షాయణీ
ధవ, కర్పూరవసంతరాయ, యనవద్య ద్వాదశీ వాసరో
త్సవ రుక్మాంగద, వేమభూపతి మహాసామ్రాజ్య రక్షామణీ,
యవనాధీశ సభా నిరంకుశ వచో వ్యాపార పారాయణా. 144

నవ ... ధవ - (నవరత్న=) తొమ్మిది మణులనెడి (ఉపల=) శిలలయొక్క - శ్రేష్ఠమయిన లింగముల యుత్కృష్టదానములచేత సంతసిల్లిన పార్వతీపతికలవాఁడా (శివప్రీతిగా నవరత్నములతో ప్రత్యేకముగా లింగములు చేయించి దానము చేసినాఁ డనుట; వజ్ర వైదూర్య గోమేదక పుష్యరాగ మరకత మాణిక్య నీల ప్రవాళములు నవరత్నములు), కర్పూరవసంతరాయ = కర్పూరవసంత రాయఁడా-('క... డు' అని బిరుదు), అనవద్య ... గద = నిర్దోషమయిన (యథావిధిగ జరుపఁబడిన) ద్వాదశీతిథియందలి పండుగకు రుక్మాంగద మహారాజా (తత్తుల్యుఁడా యనుట - రుక్మాంగదమహారాజు ఏకాదశ్యుపవాసవ్రతముచే జగత్ప్రసిద్ధి చెందినవాఁడు - రూపకము), వేమ ... మణీ = వేమరాజుయొక్క గొప్పమండలేశ్వరత్వమునకు రక్షించెడుమణీ (మణిమంత్రౌషధములు రక్షించుట ప్రసిద్ధము -

'య స్తం బిభర్తి మనుజాధిపతి ర్న తస్య
దోషా భవన్తి విషరోగకృతాః కదాచిత్,
రాష్ట్రే చ నిత్య మభివర్షతి తస్య దేవః
శత్రూం శ్చ నాశయతి తస్య మణేః ప్రభావాత్.' బృ. సం.

అట్టిరక్షామణివంటివాఁడా యనుట, రక్షకుఁడా యని భా.), యవన అధీశ ... యణా = యవన ప్రభువుయొక్క సభయందు అడ్డులేని వాక్ప్రయోగమందు (యవనభాషను భాషించుటయందు) సంపూర్ణతగలవాఁడా అనర్గళ యావనవాగ్ధోరణి కలవాఁడా యనుట - ('సాకల్యాసఙ్గవచనే పారాయణ పరాయణే' అమ.)

క. ఆ చక్రావళ శైల। త్స్మాచక్ర మహా మహీశ కట కాస్థానీ
వాచాట చాటు కవి వా। గ్గోచర కీర్తిప్రతాప, కుల మణిదీపా. 145

ఆ చ ... తాప - లోకాలోకపర్వతము వఱకుం గల భూవలయములో గొప్ప రాజుల (కట క =) రాజధానులయందలి (ఆస్థానీ =) సభలయందు వాగ్మిలయి ప్రియము పల్కు కవుల వాక్కునకు విషయమయిన కీర్తి ప్రతాపములు కలవాఁడా (భూలోకములో ఎల్ల రాజులసభలలో చాటు కవులు ఈతనికీర్తిప్రతాపములంగూర్చి కవనములు సేసి చదువుచుందు రనుట, మహాయశస్కుఁడును మహాప్రతాపుఁడును అని భా. అతిశయోక్త్యలంకారము. 'లోకాలోకశ్చక్రవాళః' అమ.

'కటకోఽస్త్రీ నితమ్బేఽద్రే ర్దన్తినాం దన్తమణ్డనే
సాముద్రలవణే రాజధానీ వలయయో రపి.' మేది.

'సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః
ఆస్థానీ క్లీబ మాస్థానం స్త్రీనపుంసకయోః సదః.' అమ.

వాచాటుఁ డనఁగా—ప్రేలరి - 'ఆలజాటచ్ఞా బహుభాషిణి' 'కుత్సాయా మితి వక్తవ్యమ్' 'స్యా జ్జల్పాక స్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్' అమ. అను శాస్త్రాభిధానములను లక్ష్యపెట్టక శ్రీనాథకవి దీనిని వాగ్మి యను మంచియర్థమునం బ్రయోగించినాఁడు), కులమణిదీపా= వంశమునకు రత్నదీపమా (రూపకాలంకారము; రత్నదీపప్రభ గాలికి ఆఱదు, కావున శాశ్వతకీర్తిం దెచ్చిన వాఁడా యని భా.)

( పృథ్వీవృత్తము. )

చతుర్ముఖ విలాసినీ శయ విలాస పంకేరుహ
స్రుతామృత మధూళికా సురభి సార సారస్వతా,
వితీర్ణ మహిమార్ణవా, విభవ యోగ సంక్రందనా,
ప్రతాప గుణ భూషణా, పరిణతార్థ సంభాషణా. 146

చతు ... స్వతా = నలువ రాణియొక్క చేతియందలి లీలా కమలమునుండి స్రవించిన యమృత (మధుర) మైన పూఁదేనెయొక్క పరిమళవంత మయిన (లేక - మనోజ్ఞ మైన) స్థిరాంశము వంటి విద్యకలవాఁడా, వితీర్ణ మహిమ అర్ణవా = ఈవియొక్క ప్రభావమునకు సముద్రుఁడా, విభవ యోగ సంక్రందనా = వైభవముయొక్క సంప్రాప్తియందు ఇంద్రుఁడా, ప్రతాప గుణ భూషణా = తేజస్సనెడు గుణమే భూషణముగాఁ గలవాఁడా, పరిణత అర్థ సంభాషణా = పరిపక్వ మయిన ప్రయోజనమును పలుకువాఁడా (ప్రల్లదము కాని మాట లాడువాఁడా యనుట.) [రూపకములు కలవు.] —'చతుర్దశయతిర్జ్జసల్ జసయవల్ వెసం బృథ్వి యౌ.' ప్ర. ఛం.

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్రి మారయామాత్యపుత్త్రి
సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బయిన
శృంగారనైషధకావ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ

# శృంగారనైషధము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీహర్ష సుకవి కవితా
వ్యాహార కథా సుధా రసాస్వాద సుఖ
శ్రీ హర్షోదయ నిత్య స
మాహిత మహి తాంతరంగ మామిడిసింగా. 1

శ్రీహర్ష ... రంగ = శ్రీహర్షుఁ డనెడి మహాకవియొక్క కవనంపు భాషిత మయిన (నల) కథ యనెడి యమృత ద్రవముయొక్క (ద్రవమును) గ్రోలుటచేత నయిన యానందసంపదచేత నైన సమ్మోద ప్రాదుర్భావముచేత సర్వదా సుమాళం బయిన యుత్కృష్టమయిన (లేక-సోత్సవ మయిన) చిత్తము కలవాఁడా ('వ్యాహార ఉక్తి ర్లపితం భాషితం వచనం వచః,' 'ము త్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమో దామోద సమ్మదాః' అమ.)—నిరంతరము శ్రీహర్ష కవికవనములను విని యానందించు వాఁడా యనుట.

### —* నారదపర్వతు లింద్రుని దర్శించుట. *—

వ. ఆకర్ణింపు మాసమయంబున నిఖిల భువన వృత్తాంత వేదియు నశేష భాషా కుశలుండును సర్వ విజ్ఞాన నిధియును సమస్తశాస్త్రప్రవీణుండును సకల పురాణేతిహాస సంహితా రహస్య విశారదుండును నగు నారదుండు బాలసఖుండైన పర్వతుండునుం దానును. 2

నిఖిల భువన వృత్తాంత వేది = సకల లోక వార్తలను ఎఱుఁగువాఁడు. కుశలుండు = నేర్పరి. విజ్ఞాన నిధి = సంగీతాదికళల నేర్పునకు తావలమయినవాఁడు. ప్రవీణుఁడు = నిపుణుఁడు. సంహితా ... డు = గ్రంథములయొక్క మర్మములయొక్క పండితుఁడు ('విద్వ త్సుప్రగల్భ విశారదే' అమ.) బాల సఖుండు = తాను బాలుఁడుగా నున్నప్పటినుండి తనకు చెలికాఁడు. పర్వతుండు = పర్వతముని.

ఉ. పంబిన వేడ్కతో భిదుర పాణి సురాసుర మౌళి మాలికా (5-1)
చుంబిత పాదపీఠు బల సూదనుఁ జూడఁగఁ గోరి నాక లో

కంబునకుఁ జనంగ సమకట్టెఁ బితామహు కూర్మిపట్టి హ
స్తాంబురుహాంగుళీ నఖ శిఖాంకుర కోటి విపంచి మీటుచున్. 3

పితామహు కూర్మి పట్టి = బ్రహ్మదేవునియొక్క యనుంగుఁ గుమారుఁడు (నారదుఁ)డు, పంబిన వేడ్కతోన్ = అతిశయించిన కుతూహలముతో, భిదుర పాణిన్ = వజ్రాయుధము చేతియందుఁగల వాఁడును ('హ్రాదినీ వజ్రమస్త్రీ స్యాత్ కులిశం భిదురం పవిః' అమ.), సుర ... తున్ – సుర = దేవతలయు – అసుర = దానవులయు – మౌళి = సిగలయందలి ('చూడా కిరీటం కేశాశ్చ సంయతా మౌళయ స్త్రయః' అమ.) – మాలికా = దండలచేత (లేక-కిరీటముల పంక్తులచేత) – చుంబిత = ముద్దు గొనఁబడిన– పాదపీఠున్ = పాదము లుంచుకొను పీఁటకలవాఁడును, (అయిన), బలసూదనున్–బల = బలాసురుని– సూదనున్ = కూల్చినవాఁ డయిన యింద్రుని ('వాస్తోష్పతిః సురపతి ర్బలారాతిః శచీపతిః' అమ.), చూడఁగఁ గోరి, నాక=స్వర్గ –...చనంగన్ = పోవుటకు, హస్త అంబురుహ అంగుళీ దళ నఖ అంకుర కోటిన్ = కమలమువంటి చేతియొక్క రేకులవంటి వ్రేళ్లయొక్క మొలకలవంటి గోళ్లయొక్క కొనతో (కొనలతో ననుటకు జాత్యేకవచనము – ('అజ్కారో ఽభినవోద్భిది' అమ.), విపంచిన్ = వీణను (నారదవీణకు మహతి యని పేరు –

'విశ్వావసో స్తు బృహతీ తుమ్బురో స్తు కళావతీ
మహతీ నారదస్య స్యాత్ సరస్వత్యా స్తు కచ్ఛపీ.' వైజయంతి),

మీటుచున్ = లీలగా వాయించుచు, సమకట్టెన్ = కడంగెను (తరలె ననుట.)

నారదుఁడు ఇంద్రునిఁ జూడ నాకలోకమునకుం దరలెను. అతనిం జూడఁ బోనేల యన– 'సురా...తు' అతనికడకు వీరు లనేకులు వత్తురు; దేవుఁడు మేలు చేసి సమయము బాగుగానున్న, వారిలో ఎవరికైన పుల్లపెట్టి, ('భిదురపాణి' 'బలసూదను') మంచి మంచి యుద్ధములు చేయించి, పారణ చేయ వచ్చు నని; ఈకడంకను రాఁగల 27–వ చనమందు నారదుఁడే చెప్పుకొన్నాఁడు. ఇంద్రవిశేషణములకు గొప్పవాఁడు దర్శనార్హుఁ డనియు భావము. 'పితామహుకూర్మిపట్టి' యనుటచే సామాన్యుఁడు గాఁడు మహాప్రభావుఁ డనియు (కలహముల విషయమై) సృష్టికర్త యనియు భా. 'నాకము' – అక మనఁగా దుఃఖము – అది లేనిది 'నాకము' – ఏ వైన దుఃఖము కల్పింత మని వచ్చినాఁ డని.భా. 'చనంగన్' – ఎటనుండి? 6–వ పద్యములో ఆవహ సంవహాద్యనిలములం జెప్పుటచేత భూలోకమునుండి యని తెలియ నగుచున్నది. ఆవహాది వాయుస్కంధములు భూమిని అన్ని ప్రక్కలను క్రమముగా ఒకదానిపై మఱియొకటి చుట్టుకొని యుండును:

'భూవాయు రావహ ఇహ ప్రవహ స్తదూర్ధ్వః
స్యా దుద్వహ స్తదను సంవహ సంజ్ఞకశ్చ
అన్య స్తతోఽపి సువహః పరిపూర్వకోఽస్మాద్
బాహ్యః పరావహ ఇమే పవనాః ప్రసిద్ధాః.' సి. శి. గో.

స్వర్గము పరివహ వాయుస్కంధమం దున్నది –

'త్రిస్రోతసం వహతి యో గగన ప్రతిష్ఠాం। జ్యోతీంషి వర్తయతి చ ప్రవిభక్తరశ్మి
తస్య ద్వితీయ హరి విక్రమ నిస్తమస్కం।వాయో రిమం పరివహస్య వద న్తి మార్గమ్.' శాకుం.

రాఁగల 31–వ పద్యములో భూలోకమునుండి యనియే సూచితప్రాయము. దారిలోఁ గూడ విపంచి మీటుట శ్లేశపంచకాభావమును పరమానందమయత్వమును సూచించుచున్నది.

చ. భువనగురుత్వవైభవము పూనిన నేనియుఁ బూనెఁ గాక, పొం (5-2)
దవుఁ జరియింప నారదున కభ్రపదంబునఁ; బర్వతుండు దాఁ
దివురుట యెట్లు మింటఁ జనఁ దేరఁగ? యుక్తమె యవ్విధంబునుం
బ్రవితత పక్షపాత గతి భంగి మదిం దలఁపంగ వచ్చినన్. 4

నారదునకున్ = నారదమహామునికి [మేఘుని కనియు - నారదశబ్దమునకు యౌగికార్థము ఎట్లన—నార = జలమును (పితృదేవతలకు) ద = ఇచ్చువాఁడు -

'నారం పానీయ మి త్యుక్తం, తత్ పితృభ్యః సదా భవాన్
దదాతి, తేన తే నామ నారదేతి భవిష్యతి.'

మేఘపరముగాను జలమిచ్చునది యని యర్థము]; భు ... ము - భువన = లోకములకు (లోకములలోని జనుల కనుట) - గురుత్వ = పూజ్యుఁడై యుండుటయొక్క - వైభవము = ప్రాభవమును (మేఘపరముగా - భువన = నీటిచేత నయిన - గురుత్వ = బరువుయొక్క

('గురు స్త్రీలిఙ్గ్యాం మహతి దుర్జరాలఘునో రపి
పుమా న్నిషేకాదికరే పిత్రాదా సురమన్త్రిణి.' మేది.)-

వైభవమున్ = అతిశయమును, పూనిన నేనియుఁ బూనెఁగాక = పొందియున్నను, అభ్ర పదంబునన్ = ఆకాశ స్థానమందు (మేఘస్థానమందుననియు - 'అభ్రం మేఘే చ గగనే ధాతుభేదే చ కాఞ్చనే,' 'పదం వ్యవసితి త్రాణ స్థాన ల క్ష్మాఙ్ఘ్రి వస్తుషు' అమ.—'అభ్రపథంబునన్' అని పాఠమేని 'ఆకాశమార్గమునందు అని యర్థము), చరింపన్ = సంచరించుట, పొందు అగున్=అనుకూలపడును; పర్వతుండు=(నారదమిత్త్రుఁ డయిన) పర్వతముని (కొండ యనియు-'పర్వతా శైల దేవర్షీ' నానా.), తాను, మింటన్ చనుదేరఁగఁ దివురుట = ఆకాశమునందు (తోడుగా) పోవుటకు ఉద్యమించుట, ఎట్లు= తగునా - బరువువస్తువు మింటికి ఎగురుట అశక్యము గావున ప్రశ్న; అందులకు ఉత్తరము ఏ మన, ప్రవి...భంగి - ప్రవితత = మిక్కిలి విస్తార మయిన - పక్షపాత=నారదుని యందలి యనురాగముయొక్క - గతి = వ్యాపారముయొక్క (ప్రవితత = మిక్కిలి దీర్ఘముగా చాఁపఁబడిన - పక్ష = ఱెక్కలచేత - పాత = ఎగురుటచేత నయిన - గతి = (ఆకాశ) గమనముయొక్క - భంగి = ప్రకారము, మదిన్ = మనమనస్సులో, తలఁపంగవచ్చినన్=స్మరణకు వచ్చెనేని (తలపోయుదుమేని), అ వ్విధంబునున్=ఆ యాకాశ యానోద్యమరీతియు, యుక్తమె = ఉచితమే (తగు ననియే తోఁచు ననుట.) [పూర్వము పర్వతములకు ఱెక్క లుండినవి. ప్రకృత కథను ఇంద్రకృత పర్వతపక్షచ్ఛేదమునకు ముందుదానినిగా భావింపవలయును.]

లోకముల కెల్ల గురు వయిన నారదుఁడు ఆకాశమార్గంబునం బోవుట యాశ్చర్యము గాదు, పర్వతుండును ఆనారదునియందలి యనురాగముచే ఆయనతో మింట సావాసముగా నేగుటయు ఉచితముగానే యున్నది. నీటిచే బరు వెక్కినను మేఘము మింటం జరించుట వింత గాదు, అట్లే మహాభారపదార్థ మయినను పర్వతంబు ఱెక్కలకలిమిచే మింటం జరించుటయు వింత గాదు.— ఇందు శ్లేషానుప్రాణిత మయిన విరోధాభాసాలంకారము.

తే. గగన వీథి విమాన మెక్కకయ చనిరి (5-3)
యోగ విద్యా బలంబు చేయూఁత గాఁగఁ;

దపము గల్గంగ సాధనాంతరము లేల,
సకలకార్యంబులందును సంయములకు? 5

(పర్వత నారదులు), యోగ విద్యా బలంబు = సమాధి విద్యా ప్రభావము, చేయూఁత= (చేయి ఊఁతకొను) సాధనముగా నుండుటంబట్టి, విమానము = వ్యోమయానమును, ఎక్కకయ = ఎక్కకుండనే, గగన వీథిన్ = ఆకాశమార్గంబున, చనిరి = పోయిరి; సంయములకున్ = యోగులకు (యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధులు ఎనిమిది యోగాంగములు: అందు కడపటి మూఁటిమొత్తమునకు సంయమ మని పేరు. 'త్రయ మేకత్ర సంయమః' అని పాతంజలసూత్రము. దానిని సాధించినవారు సంయములు - వారే యోగులు - వారికి), తపము = తపస్సు (తపస్సిద్ధి), కలుగంగన్ = ఉండఁగా, సకలకార్యంబులందునన్ = ఆకాశగమనాది) సమస్తకృత్యములందును, సాధనాంతరములు = ఇతరోపాయములు, ఏల = ఎందులకు (అనావశ్యకము లనుట - 'జ న్మౌషధి మన్త్ర తపః స్సమాధిజాః సిద్ధయః' అను యోగ పాతంజల సూత్రముచేత తపస్సువలన సిద్ధులు కలుగు నని తెలియుచున్నది.)

ఇందు పూర్వార్థమున విశేషమును, ఉత్తరార్ధమున సామాన్యమును, జెప్పఁబడినవి గాన అర్థాంతరన్యాసాలంకారము:—

' భాషింపఁగ సామాన్య వి । శేషము లర్థాంతరాఖ్య చెన్ను వహించున్;
ఓషధిపతి సహి ప్రింగున్ । భాషాపతిప్రాలు దాఁట వశ మెవ్వరికిన్?' అలం.

సీ. అంతరాంతరముల నాకాశచరకోటి (5 - 4)
మోడ్పుఁ జేతులు మస్తముల ఘటింపఁ,
దన కాంతి చంద్రికా ధవళ యయ్యును బేర్చి (5 - 6)
నాదిత్య దీప్తుల నతకరింపఁ,
జదలేటి వీచిహస్తముల నిర్మలవారి (5 - 7)
సంఘుల్ల కర్ఘ్య పాద్యంబు లొసఁగ,
నావహా సంవ హాద్యనిల ఘట్టనముల
శతతంత్రి మూర్ఛనా స్వరము లీన,
తే. గహన సంసార ఘోర సాగరము దాఁటి, (5 - 8)
పరమ యోగీశ్వరుఁడు మోక్ష పదము వోలె
బహుళతర మైన యాకాశ పథము దాఁటి,
నాక భువనంబు సొత్తెంచె నారదుండు. 6

నారదుండు, అంతరాంతరములన్ = (దారిలో) నడుమ నడుమ, ఆకాశచర కోటి = (సిద్ధ గంధర్వ విద్యాధరాది) ఖేచర సమూహములు, మోడ్పుఁ జేతులు = (తనకైన) నమస్కారాంజలులను, మస్తములన్ = (తమ) యౌఁదలలందు, ఘటింపన్ = చేర్చుకొనుచుండఁగా;

తన ... రింపన్ = తన (దేహ) ప్రకాశము వెన్నెలవలె తెల్లని దయ్యును ఎక్కువతనము చేత సూర్యుని తేజములను (అత కరింపన్ =) అధఃకరించుచుండఁగా, (విరోధభాసాలంకారము);

చదలేటి = ఆకాశగంగ, వీచిహస్తములన్ = అలలనెడి చేతులతో (రూపకము), నిర్మల వారిన్=పరిశుద్ధము లయిన నీళ్లతో, అంఘ్రులకున్ = పాదములకు, అర్ఘ్య పాద్యంబులు=పూజార్థమును పాదార్థమును అయిన జలంబులను, ఒసంగన్ = సమర్పింపఁగా ('అర్ఘ్య మర్ఘార్థే పాద్యం పాదాయ వారిణి' అమ.) ['పాద్య' మనుటచే 'అంఘ్రులకు' అనావశ్యకము - కావున నిది శ్రీనాథ పాఠము కాదని తలంచి మూలానుసారముగా 'నిర్మలవారిజాంబులన్' = పరిశుద్ధము లయిన తామరలతోను అట్టి జలముతోను - అర్ఘ్య=పూజార్థద్రవ్యములను - పాద్యంబులన్=పాదోదకములను - అని పాఠార్థములను మార్పఁదగు నని తెలుపుచున్నాఁడ. మూలము -

'విష్టరం తటకుశాలిభి, రద్భిః పాద్య, మర్ఘ్య మథ కచ్ఛరుహాభిః,
పద్మ బృన్ద మధుభి ర్మధుపర్కం, స్వర్గసిన్ధు రది తాతిథయేఽస్మై.']

ఆ ... లన్ = ఆవహము సంవహము లోనగు (అనిల=) వాయువుల తాఁకుచే - నారదముని చేతితో వాయింప కుండనే (ఆవహాది వాయుభేదములను 3-వ పద్యము వ్యాఖ్యలో చూ.), శతతంత్రి = నూఱుతీఁగలవీణ (మహతి యనునది), మూర్ఛనా స్వరములు= (ఏరాగమునకు మేళము చేసి యున్నాఁడో దాని) యారోహావరోహ క్రమముతోడి సరిగమపధని స్వరములను-

('సమ్రగేషు విలోమేన సాదయ స్తు స్వపూర్వగాః
స్వరాణాం స్థాపనా స్సన్తాః మూర్ఛనాః సప్త సప్త హి.' సంగీతరత్నాకరము.
'స్వరః సమ్మూర్ఛితో యత్ర రాగతాం ప్రతిపద్యతే
మూర్ఛనా మితి తా మాహుః కవయో గ్రామ సంభవామ్.' సంగీతదామోదరము.) -

ఈనన్ = పలుకుచుండఁగా; (స్వభావోక్తి);

పరమయోగీశ్వరుఁడు=ఉత్కృష్టుఁ డయిన సంయమీంద్రుఁడు, గహన ... రమున్=దుఃఖమయిన ('గహనం వన దుఃఖయోః । గహ్వరే కలిలే చాపి' హేమ.) జనన మరణ పరంపర యనెడి భయంకర మయిన సముద్రమును, దాఁటి = అతిక్రమించి - భంగించి యనుట, మోక్షపదము = అపవర్గ మనెడి ('ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిఃశ్రేయ సామృతం । మోక్షోఽపవర్గః' అమ.) స్థానమును, పోలెన్=ఎట్లో అట్లుగా (నికృష్టస్థానమునుండి యుత్కృష్టస్థానమునకు), బహుళతరము =మిక్కిలి గొప్పది, ఐన - ఆకాశ పథమున్ = మింటి దారిని, ... నాక భువనంబు = స్వర్గ లోకమును, చొత్తెంచెన్ =ప్రవేశించెను.—గీతమందు రూపకముతోడి యుపమ.

వ. ఇట్లు నారద పర్వతులు నాక లోకంబునకుం జని, సర్వ గీర్వాణులు గొల్వం బేరోలగం బున్న సుపర్వాధీశ్వరు సన్నిధికి నేతెంచి, యాశీర్వాదంబు చేసిరి. యతండును సుముఖోల్లాసంబున సముచితాసన విన్యాసంబు మొదలయిన యుపచారంబు లాచరించి, యిష్టగోష్ఠీవినోదంబునఁ గొంతప్రొద్దు నడపి, ప్రసంగవశంబున. 7

గీర్వాణులు = దేవతలు. పేరోలగంబు = నిండోలగంబు = గొప్పసభ (తీరి). సుపర్వ = దేవతలయొక్క ... సు ముఖ ఉల్లాసంబునన్=మంచి ముఖ వికాసముతో. సముచిత ఆసన విన్యా

సంబు = తగిన పీఠమును ఉంచుట. ఉపచారంబులు = సేవలు. ఇష్టగోష్ఠీ వినోదంబునన్ = ప్రియమయిన సల్లాపముల వేడుకయందు. ప్రసంగ = ప్రస్తావ.—వృత్త్యనుప్రాసములు.

తే. అనఘ, జగములఁ గల్గు వృత్తాంత మెల్లఁ (5 - 13)
దెలియఁగా నీకుఁ గరతలామలక మగును;
గారణం బేమి? నడిమి లోకముననుండి
నరపతులు రారు మునువోలె నాకమునకు. 8

కర తల ఆమలకము = అఱ చేతిలోని యుసిరికకాయ (వంటిది) – ఉసిరికకాయను అఱచేతిలో అన్నివైపులను దొర్లించి దొర్లించి సమగ్రముగా చూడవచ్చును. కావున సంపూర్ణముగా ఎఱుకపడినట్టిది అని భా. – రూపకము. నడిమిలోకముననుండి = స్వర్గభూపాతాళము లనెడి మూఁటిలోను నడిమిదైన భూలోకమునుండి. నరపతులు = రాజులు, మునువోలెన్ = మును పటివలె, నాకమునకున్ = స్వర్గమునకు.

క. రా రిపు డిచ్చోటికి నసి। ధారా మార్గమున ధరణి ధవు లెవ్వారున్;
నారద, నృపవంశంబుల। వీరకరీరంబు లుద్భవింపవె ధరణిన్?(5 - 14) 9

ధరణి ధవులు = రాజులు. అసిధారా మార్గమునన్ = కత్తివాదర యనెడు దారిచేత (యుద్ధములో కత్తివాతం బడి చచ్చి – రూపకము.) ధరణిన్ = భూమిలో, నృపవంశంబులన్– నృప = రాజుల – వంశంబులన్ = వంశములనెడి (వంశంబులన్ =) వెదుళ్లయందు, వీర కరీరంబులు = వీరు లనెడి వెదురుమొలకలు, ఉద్భవింపవె=జనించుట లేదా.— శ్లిష్టరూపకము.

ఉ. ఏలొకొ మాగృహంబునకు నిప్పుడు రారు మునీంద్ర, భద్ర శుం
డాల సమాను లైన నరనాథ తనూజులు మోముఁదమ్ములన్
వాలికపోటుగంట్లు చెలువంబు గవింపఁగ, బేరురంబులం
గ్రాలఁగ లీలమై దివిజ కాంతలు వైచినపుష్పమాలికల్. 10

ఓ మునీంద్రా, భద్ర శుండాల సమానులు=(భద్ర మంద మృగ సంకీర్ణము లనెడి నాలుగు జాతుల యేనుఁగులలో (శ్రేష్ఠజాతి యైన) భద్రజాతి యేనుఁగులతో తుల్యులు (అట్టిబలాఢ్యులు – ఉపమ), నరనాథ తనూజులు=రాజ కుమారులు, మోముఁదమ్ములన్=తామరసములవంటి ముఖముల యందు-ఉపమ), వాలికపోటుగంట్లు – వాలిక=నిడుదలైన – లేక– వాఁడులయిన – పోటుగంట్లు= (ఈఁటె లోనగు కైదువుల) పోట్లయొక్క గాయములు, చెలువంబు = సొంపును, కవింపఁగన్ = (రూ. కవియింపఁగా) కూర్పఁగా, పేరురంబులన్ = వెడందఱొమ్ములందు, దివిజకాంతలు=అచ్చరలు, లీలమైన్ = విలాసముతో, వైచిన = వేసిన – పుష్ప మాలికల్ = పూవు దండలు (వరణమాల్యములు), క్రాలఁగన్ = ప్రకాశించుచుండఁగా, మాగృహంబునకున్, ఇప్పుడు, రారు ఏలొకొ = రా రేమి!—అతిథి పూజ లేమిచే నాగార్హస్థ్యధర్మమునకు కొఱఁత కలిగినది, అని భా.

పూర్వపద్యములోని యసిధారామార్గమునకే విస్తర మీపద్యము.—'చెలువంబు గవింపఁగ'— జోదులకు గాయపుగంట్లే యాభరణములు – 'ప్రత్యాదిష్టాభరణరుచయ శ్చన్ద్రహాస వ్రణాఙ్కైః' మేఘ, 'పుష్పమాలికల్' – యుద్ధములో మృతిఁజెందినవారిని అచ్చరలు వరింతురు –

'వరాప్సరః సహస్రాణి శూర మాయోధనే హతం
త్వరితా న్యభిధావన్తి మమ భర్తా భ వేతి చ.' అగ్ని పు.
'శుం । డాల...నాథ'- అనునాసికాక్షరయతి.

చ. అతి నిశి తాసిధార సమ రాంగణ భూములఁ ద్రెళ్లి, శోణిత (5-15)
స్రుతిఁ గడుఁ జుల్కనై యెగసి, సూర్యపథంబున నేఁగుచెంచుచో,
గతిఁ గయికొంద్రు లాఘవముఁ, గాంతురు మాభవనంబునందుఁ దా
రతిథి సమర్చనా ప్రభవ మైన గురుత్వముఁ, బార్థివోత్తముల్. 11

పార్థివ ఉత్తముల్= రాజ శ్రేష్ఠులు, తారు, సమర అంగణ భూములన్= యుద్ధ రంగ ప్రదేశములయందు, అతి నిశిత అసిధారన్= కడు వాఁడియైన కత్తివాదరచేతను, త్రెళ్లి = పడి, శోణిత స్రుతిన్= నెత్తుటియొక్క కాలుటచేత, కడున్ చులుకన ఐ, = మిక్కిలి తేలిక యయి, (చులుక నగుటచేత) ఎగసి, (స్వర్గమునుగూర్చి), సూర్య పథంబునన్ = సూర్యుఁ డనెడుదారిలో (యుద్ధమున ఎదురుపోటుచే చచ్చినవాఁడు సూర్యమండలమును భేదించుకొని స్వర్గమున కేఁగును -
'ద్వా విమౌ పురుషౌ రాజన్, సూర్యమణ్డలభేదినౌ
పరివ్రా డ్యోగయుక్త శ్చ, రణే చాభిముఖో హతః.'),
ఏగుదెంచుచోన్ = పోవుసమయమందు, గతిన్ = గమనమందు, లాఘవమున్= వేగమును (తేలిక ననియు - 'అగురు క్షిప్ర నిస్సార మనోజ్ఞేషు లఘు స్త్రిషు.' నానా.), కాంతురు = పొందుదురు, మాభవనంబునందున్= మాయింట, అతిథి సమర్చనా ప్రభవము=అతిథి పూజయే జన్మకారణముగాఁ గలది ('స్యా జ్జన్మహేతుః ప్రభవః' అమ.), ఐన - గురుత్వమున్= గౌరవమును (బరువు ననియు), కాంతురు = పొందుదురు.

పూర్వము రాజవీరులు యుద్ధములం ద్రెళ్లి సూర్యమండలమార్గముగా వచ్చి నాయింట అతిథి సత్కార గౌరవమును పొందుచుండిరి, అది లేమి నా కిప్పుడు కొదువగా నున్నది, అని భా.
గురుత్వము పొందుటకై తద్విపరీత మయిన లఘుత్వ వహనము విచిత్రాలంకారము -
'అవు నిష్టవిరుద్ధోద్యమ । ము విచిత్రము; నతి యొనర్చు బుధుఁ డున్నతికై.' అలం.

క. అభిముఖు లై యేలొకో నా (5-16)
సభ కిప్పుడు రారు నృపతి సత్తము లనఘా ?
యభిశాప మొనర్పరుగా
త్రిభువనసంస్తుత్యా, నాదు దెస నరనాథుల్ ? 12

అనఘా = దోషరహితుఁడా, నృపతి సత్తములు = రాజ వరేణ్యులు, ఇప్పుడు, అభిముఖులై = ఎదురుగా, నాసభకున్, ఏలొకో = ఎందులకో, రారు = రాకున్నారు, త్రిభువన సంస్తుత్య = మూఁడులోకములచేతను పొగడఁదగినవాఁడవైన నారదుఁడా (సర్వలోకవృత్తాంతములను నీ వెఱిఁగి యుందువు గావున చెప్పుము అని భా.), నరనాథుల్ = రాజులు, నా దెసన్ = నన్నుఁగూర్చి, అభిశాపము = అపదూఱు ('అథ మిథ్యాభిశంసనమ్ । అభిశాపః' అమ.), ఒనర్పరు

గా = చేయరు గదా.—అతిథిపూజాలోపఖేదము ననుభవించుచున్నా ననుట.—ఉత్తరార్ధమున గమ్యోత్ప్రేక్ష.

చ. కొలకొల మంచు నుండు సిత కోకనద ప్రభవ ప్రసూత, నా (5 - 16)
కొలు విది తొంటినాఁ డతిథి కోటుల సందడిఁ; నిప్పు డెంతయుం
బలపల నయ్యెఁ బందుగులు పల్మఱుఁ గైకొని రాక యున్కిఁ; నా
కలిమి ని జోద రైక భృతి కార్య కదర్యతఁ జిన్నవోయెడుఁన్. 13

సిత ... త - సిత = తెల్లని - కోకనద = తామర(‘అథ రక్తసరోరుహం రక్తోత్పలం కోకనదమ్’ అమ.) - ప్రభవ = జన్మహేతువుగాఁగలవాఁ డయిన బ్రహ్మచే - ప్రసూత = (మనస్సుచే) పుట్టింపఁబడిన యోనారదుఁడా, నా కొలువు ఇది = నా దయిన యీసభ, తొంటి నాఁడు = పూర్వకాలమందు, అతిథి - కోటుల = సమూహముల - సందడిన్ = సంకుల ధ్వని చేత, కొలకొల అంచున్ = కొలకొల యని శబ్దించుచు, ఉండున్ = ఉండుట వాడుక, ఇప్పుడు, బందుగులు = చుట్టాలు (అతిథు లనుట), పల్మఱున్ = మాటిమాటికిని, కైకొని = పూనికతో, రాక యున్కిన్ = రా కుండుటచేత, ఎంతయున్ పలపలన అయ్యెన్ = మిక్కిలి బావురు మనుచు ఉన్నది; నా - కలిమి = సంపద, నిజ ... ర్యతన్ — నిజ = స్వకీయమైన - ఉదర = కడుపుయొక్క - ఏక = కేవల మయిన - భృతి = భరణము అనెడి - కార్య = పనిచేత నయిన - కదర్యతన్ = కృపణత్వముచేత, చిన్నవోయెడున్ = ఖిన్నత నొందుచున్నది.

పూర్వము నాసభ అతిథులతో నిండి కళకళ లాడుచుండినది, ఇప్పుడు వారు రామిచే పాడు పడియున్నది. కావున నాసంపద స్వోదరపూరణమువలని పిసినితనముచేత ఖిన్నమై యున్నది.

‘కొలకొలమంచున్’—‘ధ్వన్యను కరణశబ్దంబుల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమం బగు.’ ప్రౌ. వ్యా.—ఇచట ఇంద్రసభ యను నేకాధారమందు కాలక్రమమున అవస్థా భేదము లనెడి యాధేయములు పెక్కు లయినందున పర్యాయాలంకారము:—

‘క్రమముగ (1) నొక్కటి పెక్కుట।
నమరుట పర్యాయ (2) మొకట నలె పెక్కులు గాన్.’ అలం.

పలపల నగుట చిన్నవోవుటకు కారణ మైనందున (వాక్యార్థహేతుక) కావ్యలింగము.

చ. వదలక పూర్వ పుణ్య విభవ వ్యయ హేతువు లౌట సంపదల్ (5 - 17)
మదిఁ దలఁపంగ నాపదలు; మాన్య సుహృజ్జన బంధు కోటికిన్
హాదనున మేలు సేఁత చతురానన సంభవ, శాస్త్ర పద్ధతిం
ద దుచిత మైన శాంతికవిధానము, నిక్క మెఱుంగ వచ్చినన్. 14

చతురానన సంభవ = ఓ బ్రహ్మ పుత్త్రుఁడా, మదిన్ తలపంగన్ = మనస్సులో ఆలోచించి చూడఁగా, సంపదలు = సిరులు, వదలక = నిశ్చయముగా, పూ ... లు - పూర్వ = తొంటి - పుణ్య = సుకృతముయొక్క - విభవ = ప్రభావముయొక్క - వ్యయ = వెచ్చమునకు - హేతువులు, ఔటన్ = అగుటచేత, ఆపదలు = కీడులు; నిక్కము ఎఱుంగ వచ్చినన్ = వాస్తవము బోధపడె నేని, మాన్య సుహృత్ జన బంధు కోటికిన్ = పూజనీయు మైన మిత్త్రబృందమునకును (అట్టి)

బంధువుల సమూహమునకును, హదనునన్ = సమయమునందు (అవసరమం దనుట), మేలు సేఁత = ఉపకారము చేయుట, శాస్త్రపద్ధతిన్=ధర్మశాస్త్రోపదిష్ట మార్గముచేత, తత్ ఉచితము = ఆ యాపదలకు తగినది, ఐన - శాంతిక విధానము = శాంతిఫలక మైనట్టి కర్మ (ప్రశమనోపాయ మనుట.)

అయ్యా బ్రహ్మపుత్త్రుఁడా, చక్కఁగా ఆలోచించి చూచినయెడల, పూర్వపుణ్యమును వ్యయించునవి యగుటచేత సంపదలే ఆపదలు; బంధుమిత్త్రాదులకు ఆసంపదలను దేశకాలపాత్రముల నెఱింగి వినియోగించుటయే మరల పుణ్యోత్పాదన చేసి మొదటి పుణ్యరాశిని మరల మగల నిండించుచు తదీయపరిమాణమును తఱుఁగకుండం జేయునది యగుటచేత ఆ యాపదలకు శాంతికర్మ యని శాస్త్రహృదయముగా నున్నది.—సంపదలు తద్వ్యయములు ననెడి గుణదోషములందు ఆపత్త్వ శాంతికత్వ రూప దోషత్వ గుణత్వ కల్పనము లేశాలంకారము -

'దోషమున గుణత గుణమున । దోషత ఫలముఁ గని చెప్ప దుగ లేశము లా.' అలం.

'శాస్త్రపద్ధతిన్' - ప్రభువునకై పౌరోహితుఁడు శాంతికపౌష్టికములు చేయవలయు -

'త్రయ్యాం చ దణ్డనీత్యాం చ కుశలోఽస్య పురోహితః
అథర్వణేన విధినా కుర్యా చ్ఛాన్తిక పౌష్టికమ్.'

'హదనునన్' ఇది దేశపాత్రములకు ఉపలక్షణము -

'సర్వత్ర గుణవ ద్దానం శ్వపాకాది ష్వపి స్మృతం,
దేశే కాలే విధానేన పాత్రే ద త్తం విశిష్యతే.'—

'ఔటు' - రూ. 'అగుట' 'అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.' బా. వ్యా. 'హదను' - రూ. 'అదను.' ఆపాఠమున 'బంధుకోటికి న్నదనున' అను సంశ్లేషమును 'లుక్సంశ్లేషౌ నాచి' యనుసూత్రము బాధించును గావున - 'బంధుకోటికిన్ అదనున' అని వాక్య విరామసంధ్యభావమును అంగీకరింపఁదగును; పద్యపాదమునకు వాక్య మని యాంధ్రమున వ్యవహారము.—యహలు స్వరమైత్త్రిఁ జెంది యెల్లస్వరములకును యతికిఁ జెల్లునుగాన 'హదను ... చతురానన' అనుచో అహలకు యతి.

వ. కావున నఘ మర్షణ ఋక్కులం బోలు నీవాక్కుల మ త్సంశ యాఘుం బపనయింపు **(5-18)**. మని సహస్రాక్షుండు నిజ చక్షు స్సహస్రంబు తన ముఖంబున నిల్పి యూరకున్న **(5-19)**. నారదుండు పాకశాసను వినయ పరిపాకంబునకు మనంబునం బరితోషంబు నొందుచు ని ట్లనియె **(5-20)**. **15**

అఘమర్షణ ఋక్కులన్=పాపాపనోదకము లయిన ఋగ్వేదమంత్రములను ('సర్వై వ్వేనసా మపధ్వంసి జప్యం త్రి ష్వఘమర్షణమ్' అమ. - అఘ=పాపమును - మర్షణము = ధ్వంసించునది.) నీవాక్కులన్ = నీయుత్తరముచేత. మత్ సంశయ అఘంబు = నాయొక్క సందేహముచేత నయిన దుఃఖమును ('దుః ఖైనో వ్యసనే ష్వఘమ్' వైజయంతి.) పాక ... బునకున్ - పాకశాసను = ఇంద్రునియొక్క (పాక = పాకుఁడను నసురయొక్క - శాసనుఁడు = దండించువాఁడు) - వినయ= అణఁకువయొక్క - పరిపాకంబునకున్ = పరిణతికి.—వృత్త్యనుప్రాసములు..

తే. అతిథి బాంధవ సంభావ నాభిలాష **(5-24)**
గర్భ మగు నీదు వాక్య సందర్భమునకు

సంతసం బయ్యెఁ సురరాజ! సాదు సాదు!
సర్వకాలంబు నీవ యిజ్జగము లేలు. 16

సురరాజ = దేవేంద్రుఁడా, అతి ... ము = అతిథులయొక్కయు బంధువులయొక్కయు సత్కారమునందలి కోరిక తనలోపల కలయట్టిది (వారిని సత్కరింపవలయు నను కోరికను తెలుపుచున్నట్టిది), అగు - నీ... వన్ = నీమాటల కూర్పుచేత (నీవు పల్కిన మాటలచేత), సంతసంబు = సంతోషము, అయ్యెను, సాదు సాదు = బళి బళీ, నీవ = నీవే, సర్వకాలంబున్ = ఎల్లకాలంబును (శాశ్వతముగా), ఇజ్జగములు = ఈ స్వర్గ భూ పాతాళ లోకములను, ఏలుము.

'పాకశాసను'—అంతటి వీరుఁ డయ్యును ఇంతవినయము గలవాఁ డని గుణోత్కర్ష - సంతసము సాధువాదమునకు హేతువు.

'అతిథి... బయ్యె'—సంతసంబగుట పైయాశీర్వాదమునకు హేతువు గాన వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారము.

'సాదుసాదు' - ప్రతులలో నెల్ల 'సాధుసాధు' అని యున్నది:—ఇట వృవర్ణకము రామి రాహు బాహు శబ్దంబులందుంబోలె నని యంగీకరించుట యొకపక్షము; సంస్కృతపదములే యనూక్తము లనుట రెండవపక్షము; ధకారము లేఖకాదిప్రమాదజనితము, 'సాదుసాదు' అని యచ్చతెనుఁగుగానే యుండ నోపును, అనుట మూఁడవపక్షము ఉత్తమము.

వ. నాకభువనంబునకు రాజలోకంబు భూలోకంబు నుండి రాకుండుటకుం గారణంబు వినుము. (5-25) 17

—* ఇంద్రునికడ దమయంతీస్వయంవర ప్రస్తావము. *—

మ. ఒకరత్నంబు విదర్భదేశమునయం దుద్భూత మై ప్రార్థివ (5-26)
ప్రకరంబున్ భ్రమియించుచున్నయది సౌభాగ్య ప్రభా నిత్య ల
క్ష్మికి సంకేత నివాస మై మదన ని స్త్రింశంబు నా. భీమ క
న్యక నాఁగా దమయంతి నాఁ బరఁగు పర్యాయాభిధానంబులన్. 18

విదర్భదేశమునయందున్, భీమకన్యక నాఁగాన్ = భీమరాజుకూఁతురు అనియు, దమయంతి నాన్ = దమయంతి యనియు, పరఁగు = ఒప్పుచున్న - పర్యాయ అభిధానంబులన్ = మాఱుపేరులు గలదై, ఒకరత్నంబు = ఒకమణి, ఉద్భూతము = జనించినది, ఐ, సౌభా ... క్షిన్ - సౌభాగ్య = మంచియదృష్టముతోను - ప్రభా = లావణ్యముతోను - నిత్య = శాశ్వతమయిన - లక్ష్మికిన్ = సిరికి, సంకేత నివాసము = గుర్తుగా నేర్పరించుకొనఁబడిన యిల్లు (మతి యెక్కడ నుండక పోయినను అక్కడ తప్పక యుండు నని భా.), ఐ, మదన నిస్త్రింశంబు నాన్ = మదనుని కత్తి యనునట్లుగా, పార్థివ ప్రకరంబున్ = రాజుల సమూహమును, భ్రమియించుచున్నయది = తిరుగుడు వెట్టుచున్నది.

విదర్భదేశములో భీమరాజునకు దమయంతి యని కన్య పెండ్లియాడుది యున్నది. దాని సౌభాగ్య లావణ్య లక్ష్మీ సమాకృష్ట చేతస్కులై భూలోకపురాజు లెల్ల తదేకలిప్సువులై యుద్ధాదీతరవిషయములు మఱచి యున్నారు. అందువలన నీయింటికి వా రెవ్వరును వచ్చుట లేదు.

వర్ణనాప్రకారమును స్వయంవరము జరుగక ముందే వచ్చి హెచ్చరించుటయును ఇంద్రునికిం గూడ ఆస గొలుపుటగా నున్నది. అదియే నారదుఁడు పుల్లవెట్టుట.

మదననిస్త్రింశసంభావనచే నుత్ప్రేక్ష; అది రత్నత్వారోపరూప రూపకాలంకారాను ప్రాణితమై యున్నది. 'సౌభా...ము' - రూపకము.

'విదర్భదేశమునయందు' - ఈయడాగమము 'సమాసంబునయందు' అను బా. వ్యా. ప్రయోగముచే సిద్ధము.

తే. ప్రతిముహూర్తంబు మదన సౌభాగ్య రేఖ **(5-27)**
యౌవనముతోడఁ బెరుఁగు నా యలరుఁబోఁడి
ధరణియం దొక్క రాజనందనునిమీఁద
నిలిపె నఁట బయ లోవకుండ నెమ్మనంబు. **19**

ప్రతి ముహూర్తంబు=ఒక్కొక్క ఘటికాద్వయమునకును ('తా స్తు త్రింశత్ క్షణ స్తే తు ముహూర్తో ద్వాదశాస్త్రియాం । తే తు త్రింశ దహోరాత్రః' అమ.), మదన సౌభాగ్య రేఖ =మదనునిచే నయిన సౌందర్య ప్రభ, యౌవనముతోడన్ = జవ్వన మెచ్చుచున్న కొలఁదియు, పెరుఁగు = ఎవతెకు పెఁరుగుచున్నదో - ఆ - అలరుఁ బోఁడి = కుసుమ సుకుమార గాత్ర దమయంతి, ... నెమ్మనంబున్ = తన నిండు మనస్సును (పూర్ణానురాగమును), బయలు పోక ఉండన్ = ఆరాజనందనునుండి ఒరునిపైకి చలింపకుండునట్లు (లేక - ఒరులకుం దెలియనీయక - పా. 'బయల్ పడకుండన్'),...

'ధరణియందు ఒక రాజనందనుని'—సామాన్యుని అని భా. తన్నుం గాంచిన నాతని వదలి తన్ను వలచు నని ఇంద్రునిమదిలో ప్రత్యాశ గొలుపుటకు ఈమాట. 'బయ లోవకుండ'—ఆకుమారియొక్క మనస్సును నీపైకి మరలించుకొనుట సులువు గాదు, సాధించినచో బిరుదుమగఁడవే, అని పురికొల్పుట.

'బయలు వోకుండ'—'బయలు పడకుండ' అనుపాఠములందు ఛందోభంగము.

మదనసౌభాగ్యమునకు యౌవనముతో హృదయంగమ మైన సహత్వము చెప్పఁబడినందున సహోక్త్యలంకారము:—

'వరసహత సహోక్తి; ధరా । వరుయశము దెసలకుఁ జనియె వైరులతోడన్.' అలం.

వ. పురాకృత సుకృత సంభవం బయిన భాగ్యంబునకుఁ దానకం బైన యమ్మానవేంద్రుం డెవ్వం డొకో యని యడుగఁ దలంచెదేని. **20**

పురా ... బు - పురా = పూర్వ (జన్మ) మందు - కృత = చేయఁబడిన - సుకృత = పుణ్యమువలన - సంభవంబు = పుట్టువు గలది. భాగ్యంబునకున్ = అదృష్టమునకు. తానకంబు = స్థానము. ... మానవేంద్రుండు = రాజు.— 'పురా ... కంబు'— ఎంతప్రయాస మైనను పడి దమయంతిని సాధింపఁదగును అని భా.

తే. అడుగఁ బూనిన మాట యేమెడకు నెక్క, **(5-28)**
నంతనుండియు మగిడింపు మమరరాజ;

ప్రశ్నమున కుద్గమన పరిశ్రాంతి వలదు,
తెలిసి యుత్తర మీఁ నాకు వలను లేమి. 21

అమరరాజ = దేవేంద్రుఁడా. మాట=(ఎవఁ డారాజకుమారుఁడు? అను) ప్రశ్న. ఏదె డఁకన్=(హృదయమునుండి కంఠములో) ఎంతదాఁక. మగిడింపు = క్రిందికి హృదయములోనికి త్రిప్పుము(ఆప్రశ్న యడుగకుము అనుట.) ఉద్గమన పరిశ్రాంతి = పైకి వచ్చుటచేత (ఉచ్చరింపఁ బడుటచే) నగు నలయిక, వలదు = అక్కఱలేదు. ఈన్ = ఇచ్చుటకు, వలను లేమిన్=శక్యము గానందున (నే నెఱుంగను గాన ఉత్తరము చెప్ప లే ననుట.)

'మాట' యందు ఉన్నతప్రదేశమున కెక్కువానివృత్తము స్ఫురించుచున్నది గాన సమాసోక్తి.

వ. నీవు యోగీశ్వరుండవు; నీహృదయంబు పరమాణు దర్శన సమర్థంబు; మనంబులు నణు పరిమాణంబులు; గావున నక్కాంతారత్నంబు మనం బెఱుం గవే? యని యడిగెదేని. 22

పరమాణు దర్శన సమర్థంబు = పరమాణువు అతీంద్రియము - కిటికీలో ఎండపొడలో కాన నగు సూక్ష్మరజములో ఆఱవపాలు -

'జాలాన్తరస్థ సూర్యాంశౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః
భాగ స్తస్య చ షష్ఠో యః పరమాణుః స ఉచ్యతే.' తర్కకౌముది.

చ. అలయక యోగిబుద్ధి పరమాణువుఁ గాంచినఁ గాంచుఁ గాక కే (5-29)
వలము; ద దంతరస్థమగు వస్తువు గానఁగ నెట్లు నేర్చు? న
న్నలిన ద ళాయ తేక్షణ మనః పరమాణువునందు హ్రీ దరీ
నిలయ హరీ కృతుం డతఁడు; నేరఁగ వచ్చునె వానిఁ గానఁగాన్? 23

... అలయక = శ్రమపడక, ... కేవలము పరమాణువున్ = పరమాణువును మాత్రము,... తత్ అంతర స్థము = ఆ పరమాణువు లోపల నున్నట్టిది,... అతఁడు = ఏరాజును దమయంతి వలచి యున్నదో ఆరాజు, ఆ నలిన దళ ఆయత ఈక్షణ మనః పరమాణువునందున్ = తామర ఱేకులవలె విశాలమైన నేత్రములు గల దైన యా దమయంతియొక్క మనస్సనెడి పరమాణువునందు, హ్రీ ...డు - హ్రీ = లజ్జయనెడి - దరీ=గుహయనెడి -నిలయ=ఉనికిపట్టునందు-హరీకృతుండు =సింహముగా చేయఁబడినవాఁడు ('దరీ తు కన్దరో వా స్త్రీ దేవఖాత బిలే గుహా,' 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యః హర్యక్షః కేసరీ హరిః' అమ. - కొండలో గుహలో సింహమువలె ఆబాల మనస్సులో లజ్జలో మఱుఁగుపడి యున్నవాఁడు-కొండనుచూచినమాత్రాన అందలి గుహలోని సింహము ఎట్లు తెలియదో అట్లే మనస్సు నెఱింగినమాత్రాన దానిలోని యారా జెవఁడో ఎఱుకపడఁడు, అనుట.) —యోగదృష్టిచే నెఱుంగ నలవి గా దనియు, లజ్జచే ఆకన్య బయటికి తెలియ నీయలే దనియు భా.

'నలినదళాయతేక్షణ'—ఉపమ. 'హ్రీ ... తుండు'—రూపకము.

వ. అన్నీలవేణి కుసుమబాణ బాణ పరంపరా శరవ్యం బైన తన హృదయంబు విరహ పరితాప పాండురంబు లైన యవయవంబులం బ్రకాశించుటం

గనుంగొని, గురుజనంబు తద్భావ పరిజ్ఞా నార్థంబు పంచాశ త్కోటి విస్తీర్ణం
బైన భూమండలంబున స్వయంవర మహోత్సవంబు చాటం బంచిన. 24

ఆ నీలవేణి=నల్లనిజడకలదైన యా దమయంతి, కుసు ... బు=పూవుటమ్ములవాని యమ్ముల బారులకు గుఱి ('వేధ్యం లక్ష్యం శరవ్యం చ' అమ.), అయిన తనహృదయంబును, విరహ...బులు = వియోగ సంతాపముచేత పాలినవి, అయిన యవయవంబులచేత, ప్రకాశించుటకా=వెల్లడిసేయుటను (ప్రేరణార్థకము), కనుంగొని = (ఎవరిమీఁదనో తమకుమారి బద్ధానురాగ యైన దని తదీయ విరహ పాండిమచేత) ఊహించి, గురుజనంబు = తల్లిదండ్రులు, తత్ భావ పరిజ్ఞాన అర్థంబు= ఆదమయంతియొక్క యభిమతమును తెలిసికొనుటకై, పంచాశత్ కోటి విస్తీర్ణంబు = ఏఁబది కోట్ల (యోజనములచే) విరివి గలది. -

['మహాసరోరుహాకారే పఞ్చాశత్కోటి విస్తీర్ణే భూమణ్డలే' మహాసంకల్పము.
'శతార్ధకోటి విస్తారా పృథివీ కృత్స్నశో ద్విజ.' మార్కండేయపు.]

ఉ. అంగదఁ దత్స్వయంవర మహామహ వైభవ హూతి కేలికిన్ (5-31)
క్రంగన ఘంటపైఁ గొడుపు వ్రాలుట యెన్నఁడొ, నాఁటనుండియున్,
సంగరముం గరంబుగ మనంబున భావన సేయ నైరి యా
మంగళ కార్య నిష్ఠు లయి మధ్యమ లోకమున న్మహీపతుల్. 25

అంగదన్ = ఉత్సాహముతో, తత్ ... కిన్ - తత్ = ఆదమయంతియొక్క-స్వయంవర = తనంతట (మగని) వరించుట యను - మహామహ = మహోత్సవముయొక్క - వైభవ = విభవమను - కేళి = విహారమునకైనట్టి - హూతికిన్=ఆహ్వానముకొఱకు ('హూతి రాకారణాఽహ్వానే' అమ. - స్వయంవరమహోత్సవ విభవ వినోదమునకు రమ్మని అనుట), క్రం ... న్నఁడొ =క్రంగ్ క్రంగ్ అనునట్లుగా గంటను కొయ్యతో ఏదినము వాయించినారో, నాఁటనుండియున్= ఆదినమే మొదలుగా (యుశబ్దము అవధారణార్థకము), మధ్యమలోకమునన్ = భూలోకమునందు - మహీపతులు=రాజులు ('మహీ' అని చెప్పియు 'మధ్యమలోకమునన్' అనుటచే ఒకఁడయినను దక్కక ఎల్లరాజులును అని భా. దాన దమయంతియొక్క సౌభాగ్యాతిశయము ధ్వనితము; నీవు తప్పకుండ పోయి పరిగ్రహింపఁ దగినకన్య, పరిగ్రహింపుము, అని ధ్వని), ఆ-మంగళకార్య నిష్ఠులు = శుభప్రయోజనమందు ఆసక్తులు, అయి, సంగరమున్ = యుద్ధమును, గరంబుగన్ = విషమునుగా (రూపకము), మనంబునన్, భావనసేయనైరి = తలపోయుచున్నారు.

స్వయంవరము చాటినప్పటినుండి రాజు లెల్ల తదేకాసక్తులై యున్నారు, కావున భూలోకములో యుద్ధములు లేవు, దానంజేసి నీకడకు వా రెవ్వరును రాకున్నారు.

'ఆమంగళకార్యనిష్ఠులు'—'ఆ' శబ్దమునకు 'కార్య'ముతో నన్వయముగాని 'నిష్ఠుల'తోఁ గాదు. 'కొన్నియెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి' అని ప్రౌ. వ్యా.; కాని, యిట్టిప్రయోగము హృదయంగమము గాదు. 'తన్మంగళకార్య నిష్ఠులు' అని మార్చికొన్న సరిపడును. విశృంఖలకవులు ఎట్లయినను బ్రయోగింతురు.

'కరంబుగన్' 'చేయ రైరి' అను భేదపాఠములు మూలవిరుద్ధములు. 'తేన తత్పరవశాః పృథివీశాః సంగరం గరమి వాకలయన్తే' అని మూ., 'గరమివ విషతుల్యమ్' అని వ్యాఖ్య.

తే. అఖిల మోహిని యైన య య్యలరుఁబోణి, (5-33)
శైశవము వీడుకొన్నది సందు గాఁగ,
ననుదినంబును రాజనందనుల మీఁద,
వేఁట లాడుచు నున్నాఁడు విషమశరుఁడు. 26

విషమ శరుఁడు=బేసి బాణములవాఁ డయిన మన్మథుఁడు (ఓరువరాని క్రూరబాణములవాఁ డనియు), అఖిల మోహిని = ఎల్లవారిని మోహపెట్టునది, ...శైశవము = బాల్యమును (శైశవం శిశుతా బాల్యమ్' అమ.), వీడుకొన్నది = వదలుట - అతిక్రమించుట - అనఁగా వయస్సంధిలో ప్రవేశించుట, సందు = అవసరము, కాఁగన్ - అప్పటినుండి యనుట, అనుదినంబునన్ = ప్రతి దినము, ... ఆమెనే మోహనబాణముగా నేసి రాజనందనులను నొగుల్చుచున్నాఁ డనియు వారు మృగమాత్రములవలె నై తప్పించుకో లేక చేయునది లేక కేవలము అతనిచే నొగులుచున్నా రనియు భా.-వా రెల్ల ఆమోహంబునం బడి యున్నందున, యుద్ధంబులు లేమిచే నీకడకు రాకున్నా రనుట.

'వేఁటలాడుచు నున్నాఁడు,' అనుటచే విషమశరునియందు మృగయువ్యాపారము స్ఫురించు చున్నది గావున సమాసోక్త్యలంకారము.

వ. అది కారణంబుగా రాజలోకం బీలోకంబునకు రాదు (5-34). భూమండలంబున భండనంబు లేకుండుటం జేసి నావిలోచనంబు లుపవసించి యున్నయవి. ఏ నిప్పుడు వీనికి సుఖపారణంబుగా రణక్రీడాడంబరంబు రాక్షసులతో నీకు సంభవించునొకో యనునాస నిచ్చోటికిఁ జనుదెంచితి (5-35). నని పలికిన. 27

రాజ లోకంబు = రాజుల సమూహము. భండనంబు = యుద్ధము. సుఖ పారణంబు=సుఖమయిన యుపవాసానంతర భోజనము. రణ క్రీడా డంబరంబు=యుద్ధ కేళీ విజృంభణము (కేళి యనుటచే అవలీలగా శత్రువులను జయించు నని భా.)

ఉ. అమ్మఘవంతుఁ డల్ల నగి యంబురుహాసన సూతి కిట్లనున్ (5-37)
సమ్మద మొప్ప:—లేదు రణచర్చ దివంబున, నాదు నెయ్యపుం
దమ్ముఁడు కైటభాంతకుఁడు దక్షతఁ బ్రెగ్గడ యై సమస్త భా (5-38)
రమ్ము భరింపఁ, దాఁ ద్రిదశరాజ్యము నెమ్మదిఁ జేయు చుండుదున్. 28

మఘవంతుఁడు = ఇంద్రుఁడు (రూ. మఖవంతుఁడు - మఘువుఁడు - మఖువుఁడు), అల్లన్ = ఇంచుక, నగి = నవ్వి, అంబురుహ ఆసన సూతికిన్ = కమ లాసనునివలన జన్మము గలవాఁడు (అనఁగా బ్రహ్మపుత్త్రుఁడు) అగు నారదమహామునితో, సమ్మదము ఒప్పన్ = సంతోషముతో, ఇట్లు = అనంతరవాక్యమును, అనున్ = చెప్పెను. దివంబునన్ = స్వర్గములో, రణచర్చ = యుద్ధ ప్రస్తావము, లేదు, ... కైటభ అంతకుఁడు = కైటభాసురుని సంహారించిన నారాయణుఁడు - ఉపేంద్రుఁ డనుట, నాదు నెయ్యపుం దమ్ముఁడు=నా ప్రి యానుజుఁడు ('నాదు'- 'యుష్మదస్మచ్ఛబ్దార్థంబుల కు త్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాష నగు.' బా.వ్యా.) దక్షతన్ = సామర్థ్యముతో, ప్రెగ్గడ = మంత్రి, ... తాన్ = నేను, త్రిదశ = దేవ [త్రీ

యమైన కౌమారదశ సర్వదా కలవారు అని వ్యు.], ... ఉండుదుక్ = ఉన్నాను.—రణచర్చ లేమికిని తనసెమ్మదికిని ఉపేంద్రుని రాజ్యభారవహనము కారణము గాన కావ్యలింగము.

తే. సాక్షిమాత్రంబు గాఁ గర స్థలమునందు (5-39)
నెపుడు వజ్రాయుధంబు వహింతుఁ గాని,
యతనియాజ్ఞయ చాలు సంయమివరేణ్య,
త్రిదశ లోకాధిరాజ్యంబుఁ దిరము సేయ. 29

సంయమి వరేణ్య = మునీంద్రా ('ముఖ్య వర్యవరేణ్యాశ్చ' అమ.), సాక్షి ... గాని = సర్వదా చేతియందు (ఇంద్రత్వచిహ్న మయిన) వజ్రాయుధమును ధరించి సాక్షిమాత్రుఁడ నై యున్నానే గాని, త్రిదశ లోక అధిరాజ్యంబు = దేవలోకసామ్రాజ్యమును, తిరము = స్థిరము, చేయక్ = చేయుటకు, అతని యాజ్ఞయ = నాతమ్ముని శాసనమే, చాలును (నా ప్రయత్న మేమియు వలదు అనుట.) వజ్రాయుధకృత్యమును అతనిశాసనమే చేయుచున్న దని భా.

త్రిదశరాజ్య స్థిరీకరణము తనయందు నిషేధించి యుపేంద్రునియందు చెప్పుట పరిసంఖ్య – 'ఒకచోఁ గా దని వస్తువు । నొకట విధింపఁ బరిసంఖ్య యొప్పుఁ; ప్రదీప ప్రకరముల స్నేహనాశము । పికవాణుల యెదలఁ గాదు పృథుఁ డిల నేలన్.' అలం.

వ. అని పలికినం గలహాభోజనుండు నిట్టూర్పు నిగిడించి యి ట్లనియె. 30

కలహ భోజనుండు = పోరే ఓగిరముగాఁ గలనారదముని. నిట్టూర్పునకు కలహాభావము కారణము.

శా. పాతాళంబున నున్నయప్పుడు గడుం బ్రార్థింతు భూలోకముం, (5-41)
జేతోవీథి ధరిత్రి నున్నపుడు కాంక్షింతున్ సురావాసమున్,
దైతేయాంతక, యొక్కచోట నిలువం దాత్పర్య మిబ్భంగి నా
కేతోయంబున లేక పోయెను సమి ద్వీక్షాభిలాషంబునన్. 31

దైతేయ అంతక = అసురుల సంహారకుఁడా ('అసురా దైత్య దైతేయ దను జేంద్రారి దానవాః' అమ.), నేను, పా...డు, సమిత్ వీక్షా అభిలాషంబునన్ = యుద్ధములను ('సమి త్యాజి సమి ద్యుధః' అమ.) చూచు కోరికచేత, భూలోకమును, చేతో వీథిన్ = మనో మార్గమందు - మనస్సులో, కడుం బ్రార్థింతున్, ధరిత్రిన్ = భూలోకములో ('ధరా ధరిత్రీ ధరణిః' అమ.), ఉన్న అపుడు, (సమిద్వీక్షాభిలాషంబునన్ జేతోవీథిన్), సుర ఆవాసమున్ = దేవ నివాసమును - స్వర్గము ననుట, (కడున్), కాంక్షింతున్ = కోరుదును, ఇబ్భంగిన్ = ఇట్లు నిరంతరము ఒకలోకమునుండి మఱి యొకలోకమునకుం బోవం గోరుచుండుటచేత, నాకున్, ఒక్కచోట నిలువన్, తాత్పర్యము = ఇచ్ఛ, ఏతోయంబునన్ = ఏసమయమందును, లేక పోయెను.

వ. నిన్నుం గనుంగొంటి; నారాక కిదియ లాభంబు; నన్ను వీడు కొల్పుము; మధ్యమలోకంబునకుం గ్రమ్మఱఁ బోయెద; దమయంతీ స్వయం వరోత్సవావసరంబున మాత్సర్యంబు పుట్టి జెట్టిబిరుదు లగు రాచపుట్టువులు దమ

లోనం బ్రతిఘటించి నిల్చి శస్త్రాస్త్రంబులం గదిసి మొత్తులాడిరేని చిత్తంబునం గుత్తుకబంటిగా సమర సంరంభంబు భుజియింతుఁ గదా (5-42). యని పలికి సముచిత ప్రకారంబున నముచిసూదనుచేత ననుజ్ఞాతుం డై పర్వతుండునుం దానును నరిగెఁ (5-43). దదనంతరంబ. 32

వీడుకోల్పుము = పంపుము. క్రమ్మఱన్ = మరల. అవసరంబునన్ = సమయమందు. మాత్సర్యంబు = మచ్చరము. జెట్టి బిరుదులు=శూరు లని ప్రసిద్ధి కెక్కినవారు. ప్రతిఘటించి=ద్వేషించి, శస్త్రాస్త్రంబులన్ - శస్త్ర = కొట్టునట్టి కైదువులతోను - అస్త్ర = విరసివైచు కైదువులతోను, కదిసి = కలయఁబడి, కుత్తుకబంటిగాన్ = గొంతుమోవ - తనివి తీరునట్లుగా ననుట ('దఘ్నార్థంబున బంటికోలందు లగు' బా. వ్యా.), సమర సంరంభంబున్ =యుద్ధముయొక్క యాటోపమును ('అస్త్రియాం సమ రానీక రణాః' అమ). నముచిసూదనుచేతన్ = నముచి యను నసురునిం గూల్చిన వాఁ డయిన యింద్రునిచేత, అనుజ్ఞాతుం డై = సెలవు వడసిన వాఁ డయి.

—* ఇంద్రాదులు స్వయంవరమునకు తరలుట *—

తే. దేవమునిమాట లమృతంపుఁ దేట లగుచు, (5-44)
నధిక తర మైనయాహ్లాద మాచరింప,
వేడ్కపడె నెమ్మనంబులో విబుధరాజు
భోజ కన్యా స్వయంవరంబునకుఁ బోవ. 33

దేవముని=నారదునియొక్క - మాటలు, అమృతంపుఁదేటలు అగుచున్ = అమృతములో మడ్డి క్రిందికి దిగఁగా పైకి తేరిన శ్రేష్ఠ మయిన భాగము లై - అమృతసారమువలె ప్రియము లై అనుట, అధికతరము = మిక్కిలియెక్కువ, ఐన - ఆహ్లాదము = సంతోషమును, ఆచరింపన్ = కలిగింపఁగా, విబుధరాజు = దేవేంద్రుఁడు, ... భోజ= భీమ (విదర్భరాజులు భోజవంశస్థు లగుటచే వారి కెల్ల భోజు లనియుం బేరు.)—ఆహ్లాదము అమృతముచే నధికము, దాని తేటచే నధికతరము. పూర్వార్ధమున రూపకము.

మ. పవి సంగంబునఁ దాప మొందిన శచీ ప్రాణేశు కెంగేలికిం (5-45)
జివురుం గైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవ నీహార పయో మిళ న్మలయజ స్నానార్ద్రపర్యంత మై
యివ తాళించు విదర్భరాజ తనయా హృద్య స్తనద్వంద్వమున్. 34

చివురుం గైదువు జోదు = మన్మథుఁడు, పవి సంగంబునన్ = వజ్రాయుధముయొక్క (పిడుగుయొక్క) కూడికచేత, తాపము = వేడిని, ఒందిన - శచీ ప్రాణేశు కెంగేలికిన్ = శచీదేవి భర్త యైన యింద్రుని యెఱ్ఱని(కందిన)చేతికి, రహస్యంబుగాన్ = ఇతరులకు తెలియనీయకుండ, నవ ... మై - నవ = నూతనమయిన - నీహార పయః = మంచు నీళ్లతో (పన్నీటితో ననుట)- మిళత్ = కూడుకొనుచున్న - మలయజ = చందనము (పన్నీటం గలిపిన చందనంపుఁగలపము) చేత నయిన - స్నాన = అభిషేకముచేత - ఆర్ద్ర = తడిగా నున్న - పర్యంతము = పరిసరము కలది, ఐ, ఇవ...మున్=చలువ వెదచల్లుచున్న దమయంతీ మనోహర కుచ యుగళమును, వైద్య

ము = మందుగా, రహస్యంబుగాఁన్ = ఇతరుల కెవ్వరికిని తెలియ నీయక, ఉపదేశించెన్ = నేర్పెను.

ఇంద్రునికి పిడుగుఁగ్రొవ్వు బూనియుండుటచే వేఁడి యెక్కి కందిన చేతికి మన్మథుఁడు క్రొత్తపన్నీటం గలిపిన గందంపుఁబూఁతచే అంతటను దోఁగినదై, చలువ గ్రమ్ముచున్న దమయంతీ రమణీయ స్తన యుగళముయొక్క స్పర్శను మందుగా రహస్యముగా నుపదేశించినాఁడు.—నారద కృతవర్ణనచేత ఇంద్రునికి దమయంతిపై మరులు జనించె నని భా.

'పవిసంగతాపము' నార్పఁగల యంత యివతాళించుచున్న దని స్తనద్వంద్వ గుణోత్కర్ష. 'శచీ.'-అనుటచే శచీస్తనములకు లేని ప్రభావము దమయంతీ స్తనములకు కల దనియు, శచికన్న సుందరియు కోమలయు, ననియు భా. 'కెంపు' విశేషణముచేత కేలు కంది యెఱ్ఱ నయిన దనుట. 'జోదు.'— జోదులకుం దగిన పరమహంస క్రియలును చిట్కాలును జోదులకే తెలియును, కావున పవికైదువుజోదునకు ఈచివురుఁగైదువుజోదు వైద్యము చెప్పెను. 'రహస్యంబుగా నుపదేశించెను'— చెప్పఁగా చూచినవా రెవ్వరును లేరు గావున రహస్య మనుట - మదనావేశము కలిగి దమయంతీ స్తనస్పర్శమును (తత్సంభోగమును) అపేక్షించె నని భా. 'హృద్య'— 'హృదయస్య ప్రియః' అను సూత్రముచే నిష్పన్న మయిన యీశబ్దమునకు హృదయప్రియ మని యర్థము - దానంజేసి - ఎద యందు కదియించుకొనం బ్రియ మైనది యనియు నర్థము. 'ద్వంద్వమున్ - ఈమందును ఏవిధముగా నుపయోగింపవలయునో ఆజోదు చెప్ప లేదే యనిన, దానిని చెప్ప నేల, 'సంగము'వలనం గలిగిన వేఁడికి సంగమువలనం గలుగు చలువయే మం దని స్పష్టము, కావున తద్గ్రహణమే వెజ్జుహృదయ మని యెఱుంగ నయ్యెడిని. 'కెంగేలికిన్' - 'హృద్య' - అనుటచే ఇంద్రుని హస్తంబును హృదయంబును దమయంతీ స్తనస్పర్శకై పురపురలాడం దొడంగిన వని భా. 'ద్వంద్వ' శబ్దస్థానమున శ్రీనాథుని పా. 'స్పర్శ' మని కొందఱును 'గ్రాహ' మని కొందఱును తలంచుచున్నారు; 'గ్రహే గ్రాహః' అమ. గ్రాహ మన గ్రహణము; మూలములో 'కరగ్రహణము' చెప్పఁబడినది గాని 'స్తనగ్రహణము' గాదు. శ్రీనాథుఁడు ఈపద్యమును మూలమునకన్న విరివి చేసినాఁడు. ఈయుపదేశము కెంగేలికే చేయఁబడియెను గాని ఇంద్రునికిం గా దని కొందఱు ఒకస్వారస్యమును వక్కాణింతురు.— గమ్యోత్ప్రేక్ష.

'కెంగేలు' - ఇట ప్రాఁతాదికార్యము కలిగినది. 'చివురుంగైదువు' - 'సమాసమంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు.' 'ఇవతాళించు' - 'ఇవక + తాళించు' అని సీతారామాచార్యులవారు వ్రాసినారు. 'ఇవము + తాళించు' అని విగ్రహించి 'తాళించు'ను పడ్వాదిగణములో పఠించినచో ములోపము వచ్చును.

'ఇవ...హృద్య'- యహలు స్వరమైత్త్రిఁ జెందునపుడు ఎల్లస్వరములకును యతికిఁ జెల్లును— ఇకార ఋకారములకు మైత్త్రి కలదు.

> ' అద్వయమునకు వక్రతమద్వయంబు । నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు
> నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ । జెల్లు స్వరమైత్త్రి వళు లన శేషశయన.' అప్ప.

వ. అప్పుడు. 35

సీ. రంభ విస్రంభ సంరంభంబు దిగనాడె, (5-48)

మాన రోషము పూనె మంజుఘోష,

దళుకొత్తె మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు, (5-50)
ప్రమ్లోచ ప్రమ్లాన భావ మొందె,
నుర్వశి సౌభాగ్య గర్వంబు పొరివోయె, (5-52)
హరిణి సంతాపాగ్ని కరణి యయ్యె,
వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి, (5-49)
మేనక సమ్మాన మూన మయ్యె, (5-51)
తే. నచ్చరలు దక్కఁ గలవార లలసి సొలసి (5-49)
ప్రాణముక్తియ యుక్తిగా ననుమతించి,
రాత్మవల్లభుఁ డింద్రుం డయ్యవనినాథ
తనయ వరియింప ధరకుఁ బోఁ దలచుఁ టెఱిఁగి. 36

ఆత్మవల్లభుఁడు = తమ దయితుఁడయిన, ఇంద్రుఁడు, ఆ- అవనినాథతనయన్ = రాకొమరితను, వరియింపన్ = పరిగ్రహించుటకు, ధరకున్ = భూలోకమునకు, పోన్ = పోవుటకు, తలఁచుట = కోరుటను, ఎఱిఁగి = తెలిసికొని,

రంభ, విస్రంభ సంరంభంబు = కేళి కలహముయొక్క - లేక - ప్రణయముయొక్క-('విస్రమ్భః కేళికలహే విశ్వాసే ప్రణయేఽపి చ' మేది.) వేగిరపాటును, దిగనాడెన్ = త్యజించెను; మంజుఘోష (అను నచ్చర), మానరోషమున్=ఈసుచేతనైన కోపమును ('స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మాన ఇ త్యభిధీయతే,' 'కోప క్రోధామర్ష రోష ప్రతిఘా రుట్క్రుధౌ స్త్రియామ్' అమ.), పూనెన్ = వహించెను;

తిలోత్తమకున్, మదిన్ = మనస్సులో, ఉత్తలపాటు = తబ్బిబ్బు, తళుకొత్తెన్ = జనించెను; ప్రమ్లోచ, ప్రమ్లానభావము = మిక్కిలి వాడిపోయిన స్థితిని, ఒందెన్ = పొందెను;

ఉర్వశి = ఉర్వశియొక్క, సౌభాగ్యగర్వంబు = సౌందర్యమదము, పొరి (లేక - పొలి) వోయెన్ = భంగపడెను; (ఉరూన్ = గొప్పవారిని - అశ్నుతే = వ్యాప్నోతి - వశీకురుతే= వశపఱుచుకొనునది అని వ్యు.—లేక - ఊరుం=నారాయణస్య మహర్షే రూరుప్రదేశం - అశ్నుతే- యోనిత్వేన వ్యాప్నోతి-నారాయణుని తొడను వ్యాపించునది అని వ్యు. ఈరెండవపక్షమున హ్రస్వాదిత్వము పృషోదరాదిత్వముచే సాధ్యము. దాక్షిణాత్య పుస్తకములందు ఈశబ్దము దీర్ఘాదిగా నగపడుచున్నది. 'నారాయణోరుం నిర్భిద్య సంభూతా వరవర్ణినీ' అని యుర్వశిని గూర్చి హరివంశము;

'ఊరూద్భవా నరసఖస్య మునేః సురస్త్రీ కైలాసనాథ ముపనృత్య నివర్తమానా.' అని,

'యా ప్రత్యాదేశోరూప గర్వితాయాః శ్రియః.' అనియు, విక్రమోర్వశీయము; కావున కవి సౌభాగ్యగర్వమును చెప్పినాఁడు.) హరిణి, సంతాప అగ్నికిన్=సంజ్వర మనెడి చిచ్చునకు, అరణి=ఉత్పత్తిస్థానము ('నిర్మన్థ్యదారుణి త్వరణి ర్ద్వయోః' అమ.—ఏకొయ్యలో ఇంకొక కొయ్యతో త్రచ్చి నిప్పు పుట్టింతురో ఆక్రిందికొయ్య అరణి యనంబడును);

ఘృతాచి, వంతన్ = దుఃఖముచేత, మేను = దేహమును, పానుపుమీఁదన్ = శయ్యపై, వైచెన్ = పడవైచెను (చాఁపకట్టుగా పడె ననుట), మేనక (యొక్క) - సమ్మానము = గౌరవము ('సమ్ + మానము'), ఊనము = కొఱఁత, అయ్యెన్;

తక్కుఁగలవారలు అచ్చరలు = కడమ యప్సరసలు, అలసి = ఆయాసపడి, సొలసి = వెతగుడిచి, (ఆదుఃఖము పోఁగొట్టుకొనుటకు) ప్రాణముక్తియ = ప్రాణత్యాగమే, యుక్తిగన్ = ఉపాయముగా, అనుమతించిరి = అంగీకరించిరి - నిశ్చయించికొనిరి.

'ఆత్మ ... ఎఱుఁగుట' కడమపద్యార్థమునకు హేతువు గాన వా. హే. కావ్యలింగము.

ప్రాణ - ప్రాణిత్యనేన - అన ప్రాణనే - అన = ప్రాణించుట - దేనిచేత ప్రాణింతురో అది ప్రాణము - 'ప్ర' ఉపసర్గ - 'అన' ధాతువు - ఈభేదముచేత ఇచట ఉపసర్గయతి స్వరమునకుం గూర్పఁబడినది.

వ. ఇట్లు జంభారి విశ్వంభరాభువనంబునకుం బోవ సమకట్టి కట్టాయితం బయ్యె; నతనితోడం గూడఁ బావక పరేతరాజ పాశపాణులు పయనంబు లయిరి **(5-55)**. అప్పు డప్పురందరాది బృందారక చతుష్టయంబు మున్నాడి ప్రోడ లగు వేల్పుఁ జేడియలచేత దమయంతికిం గానుకలుగా నిగూఢ ప్రకారంబున మందార కుసుమ దామంబులు మొదలుగా దేవలోకంబునం గల వస్తువులు పంపిరి**(5-56)**. అనంతరంబ. **37**

జంభారి = ఇంద్రుఁడు ('జమ్భభేదీ హరిహయః స్వారాణ్ణముచి సూదనః' అమ.) విశ్వంభరా భువనంబునకున్=భూ లోకమునకు ('భూ ర్భూమి రచలాఽనన్తా రసా విశ్వమ్భరా స్థిరా,' 'జగతీ లోకో విష్టపం భువనం జగత్' అమ.) సమకట్టి = ఉద్యమించి, కట్టాయితంబు = కడున్ + ఆయితంబు = సంపూర్ణముగా సిద్ధము. పావక పరేత రాజ పాశ పాణులు = అగ్ని (ప్రేత నాథుఁ డయిన) యముఁడు (పాశాయుధము కేలంగల వాఁ డయిన) వరుణుండును. పురందర ఆది బృందారక చతుష్టయంబు = ఇంద్రుఁడు మొదలయిన దేవతలు నలువురును ('పురుహూతః పురన్దరః,' 'బృన్దారకా దైవతాని,' అమ.) మున్నాడి=ముందుగా (మున్ను = ముందుగా-ఆడి= ప్రవర్తిల్లి). ప్రోడలు = ప్రౌఢలు - జాణలు. వేల్పుఁజేడియలచేత = దేవచేటికలచేత. నిగూఢ ప్రకారంబునన్ = చాటయిన విధముగా ('గూఢగుప్తే' అమ.) మందార కుసుమ దామంబులు = మందార మనెడి దేవతరు విశేషముయొక్క పూవుల దండలు.—వృత్త్యనుప్రాసములు.

శా. ఆ దిక్పాలురు దివ్య కాంచన విమానారూఢులై సమ్మదా **(5-57)**
పాది వ్యోమ తరంగిణీ లహరికా పర్యంత వాతంబు ప్ర
స్వేదాంభః పృషతంబులం గముపఁగా శీఘ్రంబ యేతెంచి రా
హ్లాదం బొప్ప వసుంధరాస్థలి కమర్త్యవ్రాతముల్ గొల్వఁగన్. **38**

ఆ దిక్పాలురు=పూర్వ పూర్వదక్షిణ దక్షిణ పశ్చిమ దిక్కుల పాలకు లయిన యింద్రాగ్ని యమ వరుణులు, అమర్త్య వ్రాతముల్ = దేవసంఘాతములు ('అమర్త్యా అమృతాన్ధసః,' 'స్తోమౌఘ నికర వ్రాత వార సంఘాత సంచయాః,' అమ.), కొల్వఁగన్ = సేవించుచు కూడ వచ్చుచుండఁగా, దివ్య ... లు - దివ్య = స్వర్గ సంబంధియైన - కాంచన = బంగారపు - విమాన=చదలితేరులయందు - ఆరూఢులు = ఎక్కినవారు, ('వ్యోమయానం విమానోఽస్త్రీ' అమ.), వి, సమ్మ ... బు = సంతోషమును (ఆపాది = ) కలిగించుచున్న యాకాశనదీ (మందాకినీ) ప్రవాహము

యొక్క పరిసరపుగాలి ('పర్యన్తభూః పరిసరః' అమ.), ప్రస్వే ... బులన్ = ప్రస్వేద=చెమట వలె సూక్ష్మము లైన - అంభః పృషతంబులన్=నీటిబొట్టులను (ఘర్మో నిదాఘః స్వేదః స్యాత్,' 'పృషన్తి బిన్దు పృషతాః' అమ.), కముపఁగాన్ = కవియింపఁగా- దేహముపై కూర్పఁగా ననుట, శీఘ్రంబ = త్వరగా, ఆహ్లాదంబు = సంతోషము, ఒప్పన్ = మీఱఁగా, వసుంధరాస్థలికిన్ = భూ ప్రదేశమునకు, ఏతెంచిరి = వచ్చిరి.

'ప్రస్వేదాంభః పృషతంబులు' అనుసమాసమును 'బింబాధరాదుల' వలె మధ్యమపద లోపిగా గ్రహించుట యేల యన, దేవతలకు స్వేదము జనింపదు గాన. ఇందులకు 5 ఆ. 182 చూ. అందు 'ఘాలము' లనుట నియమార్థము గాదు; తన్మూలముం గన నగు:

> 'స్వేదః స్వదేహస్య వియోగతాపం నిర్వాపయిష్యన్నివ సంసిస్పృక్షోః
> హీరాఙ్కుర శ్చారుణి హేమనీవ నలే తయాఽలోకి న దైవతేషు.'

'క్రమియు' అనఁగా 'కవియు' అని శబ్దరత్నాకరము. తెలియు కలియు తడియులవలె, ఇదియు ప్రేరణంబున 'కముపు' అగు నని యంగీకర్తవ్యము.

దేవతాసమూహము వెంటఁ గొలుచుచుండ, ఇంద్రాది దిక్పాలకులు దివ్యము లయిన బంగారు విమానము లెక్కి, దారిలో మిన్నేటి తుంపురులను గాలి తెచ్చి వారి యంగంబులయందు క్రొంజెమరు బొట్టులనుం బోలె కదియింపఁగా, సుఖించుచు, త్వరలో సంతోషముతో భూలోకమునకు వచ్చిరి.

'ప్రస్వేదాంభః పృషతంబులు'—ఉపమ.

వ. ఇట్లు గగనంబు డిగ్గి యమరులు సజల జలధర ధ్వాన గంభీరం బై దూరంబుననుండి వీతెంచు నొక్కమ్రోఁత యాలకించి (5-58), యిది యేమి ఘోషంబొకో యని యద్దిక్కుఁ గనుంగొను నప్పుడు నిస్వన శ్రుతి సహోపయాతం బైన రథంబునందు (5-59). **39**

గగనంబున్=ఆకాశమునుండి ('ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొక విభక్తియు నగు.' శా. వ్యా. ఇచట పంచమికి ద్వితీయ). సజల జలధర ధ్వాన గంభీరంబు = నీళ్లతోడి మేఘము యొక్క యుఱుమువలె మంద్రము ('మన్ద్రస్తు గమ్భీరే' అమ.- ఉపమ.)వీతెంచు=విసరుచున్న-వినవచ్చుచున్న. మ్రోఁత = ధ్వనిని. ఆలకించి = విని. నిస్వన శ్రుతి సహ ఉపయాతంబు = ధ్వనియొక్క వినికితోఁ గూడ వచ్చినది (ధ్వని వినఁబడునప్పటికి రథమును వచ్చినది, అంత మహావేగంబున వచ్చిన దని భా. ఈశైఘ్ర్యమునకుం గారణము నలుని యశ్వహృదయజ్ఞానము.)

హేతు వయిన రథాగమనంబును కార్యమయిన తద్ధ్వానంబును ఏకకాలమందే కలిగినట్లు వర్ణన గావున అక్రమాతిశయోక్తి:—

> 'సమకాలమున నగుం గా । ర్యమునుం గారణము నక్రమాతి శయోక్తిన్;
> సమరమున నీశరము నరి । సమితియు నొక్కటనె కాంచు జ్యాపరిరబ్ధిన్.' అలం.

—* ఇంద్రాదులు నలుం గలయుట *—

ఉ. కాంచిరి నిర్జరేశ్వరు లఖండిత రూప విలాస సంపదన్ (5-60)
వంచిత పంచబాణుఁ డగు వాని సమంచిత సార ధీరతం

గాంచన భూధరంబునకు గాదిలి నెచ్చెలి యైనవాని ని
ర్వంచిత దానశక్తి సురరత్నముఁ బోలెడువాని నైషధున్. 40

నిర్జర ఈశ్వరులు=దేవ ప్రభువులు ('ఈశ్వరః ప్రభు రీశితా' అమ.), అఖండిత రూప విలాస సంపదన్ = ఖండితముగాని అనఁగా పూర్ణ మయిన సౌందర్య లీలా సమృద్ధిచేతను, వంచిత పంచ బాణుఁడు = మదనుని వంచించినవాఁడు (మదనునికి లేనట్టి రూపాదిసంపద కలవాఁడు), అగు వానిన్, సమంచిత సార ధీరతన్ = ఒప్పిదము శ్రేష్ఠము అయిన ధైర్యమందు, కాంచన భూధ రంబునకున్ = బంగారు పర్వతమునకు (మేరువునకు), గాదిలి నెచ్చెలి = ప్రియుఁ డైన స్నేహి తుఁడు, ఐనవానిన్, నిర్వంచిత దాన శక్తిన్=నిర్వ్యాజ మయిన యీవి నేర్పునందు, సుర రత్న మున్ = చింతా మణిని, పోలెడు వానిని, నైషధున్ = నిషధరాజును - నలుని, కాంచిరి.

'సంపదన్ వంచిత'-ఇచ్చోట 'సంపదన్' అను తృతీయాంతము 'వంచిత' అను పదముతో నన్వయించుచున్నదని సీతారామాచార్యులవారి మతము. వారు ప్రౌఢవ్యాకరణములో 'కొన్ని యెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబు చూపట్టెడి.' అని సూ త్రము రచించి ఈవాక్యమునే ఉదాహరించిరి.— కాని 'అగువాని' అను సమాసమందలి 'యగు' ధాతువుతోనే 'సంపదన్' అనుపదమునకు అన్వయము యుక్తము.— మూఁడు ఉపమలు.

వ. కాంచి వరుణుం డతని తరుణత్వంబునకు నిబిడం బగు జడభూయం బును **(5-61)**, లులాయధ్వజుం డతని రూపధేయంబునకు ధూమలత్వంబును **(5-62)**, వైశ్వానరుం డతనియైశ్వర్యంబునకుం బరితాపంబును **(5-63)**, సుత్రాముం డతని కామనీయకంబునకుం జూపోపమియును **(5-64)**, నిక్కంబుగా వహించి. 41

తరుణత్వంబునకున్=యౌవనంబునకు (యౌవనాలంకృత మయిన సౌందర్యమున కని భా.— 'తారుణ్యం యౌవనం సమే' అమ.) నిబిడంబు= దట్టము. జడభూయంబు=జడత్వమును - అనఁగా ఏమియుం దోఁపక పోవుట - నివ్వెఱపాటు - (యమకాదులయందు లడల కభేదము చెప్పవచ్చును గాన - జలత్వము నీటితనము - నీటి సామికి నీటి తన మని ఔచిత్యము). లులాయధ్వజుండు = దున్నపోతు చిహ్నముగాఁగలవాఁ డయిన యముఁడు('లులాయో మహిషః,' 'పాళిః కేతు ర్ధ్వజో౽ లిఙ్గమ్' అమ.) రూపధేయంబునకున్ = రూపమునకు, ధూమలత్వంబును = (ముఖ) మాలిన్యం బును (నలుపును అనియు - 'ధూమ్ర ధూమలౌ కృష్ణలోహితే' అమ.-స్వభావముచేతనే నల్లనివాఁ డుగాన మాలిన్యోక్తి ఉచితమై యున్నది.) వైశ్వానరుండు=అగ్ని, ('అగ్నిర్వైశ్వానరో వహ్నిః' అమ.) ఐశ్వర్యంబునకున్ =ప్రాభవమునకు, పరితాపంబును = వెతను (వేఁడిమిని అనియు-అగ్నికి వేఁడిమి యుచితము). సుత్రాముండు = ఇంద్రుఁడు, కామనీయకంబునకున్ = రమణీయతకు, చూపు ఓపమి = ఓర్వలేమి (చూడ నోఁపమి యనియు-ఇంద్రునికి కన్నులు పెక్కులు గాన చూడ నేరమి యుచితముగానే యున్నది; వేయికన్నులకును వెక్కసమగు సంతతి సౌందర్య మని భా.)

మ. శ్రుతపూర్వం బగు విశ్వ మోహన కళా శోభా విశేషంబు సం **(5-66)**
మతి నూహింపఁగఁ జాయవాఱుటయుఁ, బ్రేమం బాత్మలోఁ గీలుకో,
నితఁడే నైషధుఁ డంచు నెండొరులతో నేకాంత మొయ్యొయ్య నా
శతమన్యు ప్రముఖామరుల్ మునుకుచున్ జర్చించి రుత్కంఠతోన్. 42

ఆ - శతమన్యు ప్రముఖ అమరుల్ = ఇంద్రుఁడు మొదలగు వేల్పులు ('శతమన్యు ర్దివస్పతిః' అమ.), శ్రుతపూర్వంబు = పూర్వము విన్నట్టిది, అగు = అయిన - విశ్వ ... బు= లోకమును (లోకుల ననుట) పరవశము చేయునట్టి సౌందర్యముయొక్కయు కాంతియొక్కయు అతిశయమును, సమ్మతిక్ = నిండుమనంబులో (మనస్సులో సంపూర్ణముగా), ఊహింపఁగన్ = ఆలోచించి చూచుకోఁగా, చాయవాఱుటయున్ = (తమవినికికిని నలునిరూపమునకును) సాటి యగపడఁగా, ప్రేమంబు = అనురాగము, ఆత్మలోన్ = మనస్సులో, కీలుకోన్ = నెలకొనఁగా, ... ఒండొరులతోన్ = ఒకరితో నొకరు, ఏకాంతము=రహస్యముగా, ఒయ్యొయ్యన్ = అల్లనల్లన, మునుకుచున్ = పలుకుచు, ఉత్కంఠతోన్ = కోరికతో, చర్చించిరి - కలయఁబలికికొని రనుట.

నలుఁడు లోకము నంతయు మోహపెట్టఁజాలిన రూపరేఖావిలాసములు కలవాఁ డని తాము వినియున్నారు గావున ఇంద్రాది దిక్పాలురు ఇతనిం జూడఁగానే తాము విన్న లక్షణములు ఇతని యందు అగపడఁగా మనస్సులో ప్రీతు లై ఇతఁడే నలుఁ డని యూహించి యొకరితో నొకరు రహస్యముగా చెప్పుకొనిరి.

'చాయవాఱుటయున్' - ఇట యుశబ్దము అనంతర్యార్థకము. 'కోన్'—'కొనన్' అను దానికి రూపాంతరము;'ముజ్జుపరంబగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు.' బా.వ్యా.

వ. ఇట్లు విమర్శించుచుండ. **43**

విమర్శించుచున్ = విచారించుచు.

తే. విమలతర దివ్య గగనయానములమీఁద,
ధరణిఁ గొలువున్న యా దిగీశ్వరులఁ జూచి
యద్భుతాక్రాంత చిత్తుఁడై యధిపసుతుఁడు
చేరఁ జనుదెంచె నంతంతఁ దేరు డిగ్గి. **44**

రాజ కుమారుఁ డయిన నలుఁడు మిక్కిలి నిర్మలము లయిన (గగనయానములమీఁదన్=) ఆకాశ యానములయందు భూమిమీఁద సభ తీరి యున్న యాదిక్పాలకులం గాంచి ఆశ్చర్యము చేత ఆక్రమింపఁబడిన మనస్సుగలవాఁ డై(= ఆశ్చర్యపడి) కొంతదూరమున రథమునుండి దిగి వారి సమీపమునకు వచ్చెను.

వ. ఇవ్విధంబున రథంబు డిగ్గి మూర్తం బైన రామణీయక గుణాద్వయ వాదంబునుంబోని యమ్మేదినీ రమణుండు **(5-65)** సుత్రామాది విబుధ రాజ చయంబునకు నభివాదనం బాచరించి ప్రాంజలి యై పార్శ్వంబున నిలిచియుండె. నయ్యమృతాశు లతనిం జూచి దమయంతీనిరాశంబు లైన యాశయంబులతోఁ బరస్పరము ఖావలోకనంబులు చేసిరి **(5-72)**. అప్పుడు వంచనా కపట నాటక సూత్రధారుం డైన శునాసీరుం డా నృపకుమారున కి ట్లనియె. **(5-73)** **45**

మూర్తంబు = రూపు దాల్చినట్టిది, రామ...బోని - రామణీయక = రమణీయత్వమనెడి - గుణ = గుణముయొక్క - అద్వయ = రెండవది లే దనుటయొక్క (రామణీయకము ఇతనికిఁ

దప్పు మ రెవ్వరికిని లే దనెడి) - వాదముం బోని=వాదమో యనునట్లు ఒప్పుచున్న (సౌందర్య మందు సాటి లేనివాం డై యున్న యనుట - మూర్త మయిన 'రామ...దము'గా సంభావించుటచే నుత్ప్రేక్షాలంకారము), ఆమేదినీ రమణుండు = ఆభూవల్లభుండు (నలుండు), సు...కుక్ = ఇంద్రుండు మొదలుగాంగల దేవప్రభు సమూహంబునకు ('సుత్రామా గోత్రభి ద్వజ్రీ,' 'విబుధాస్సురాః,' 'సముదాయ స్సముదయ స్సమవాయ శ్చయో గణః' అమ.). అభివాదనంబు = పాదగ్రహణము ('సమే తు పాదగ్రహణ మభివాదన మి త్యుభే.' అమ.) ప్రాంజలి = ప్రకృతమయిన (రచింపంబడిన) మోడ్పుంగేలు గలంవాడు (చేతులు మోడ్చుకొన్నవాండు). అమృత ఆశులు = అమృత భోజనులు (దేవతలు.)దమ ... లు= దమయంతియందు ఆశ లేనివి. ఆశయంబులతోన్ = అభిప్రాయములతో ('అభిప్రాయ శ్ఛన్ద ఆశయః' అమ.) వ...ండు - వంచనా=మోస మనెడి-కపట నాటక = మాయ లాటయొక్క - సూత్రధారుండు =నడిపించెడువాండు (సూత్ర మనంగా నాటకముయొక్క యాను పూర్వి - దానిని ధరించువాండు - అనంగా ధారణ చేసి యుండువాండు సూత్రధారుండు.) సునాసీరుండు=ఇంద్రుండు (వ్యు. సు = లెస్స యయిన - నాసీరః = సేనాముఖము కలవాండు.)

## —*ఇంద్రాదులు నలుని దమయంతి కడకు దూతగా పంపుట*—

సీ. అన్న యెవ్వరివాండ వయ్య? నేమమె నీకు ? (5-74)
నైషధుం డనుబుద్ధి నాకుం బొడమె;
గారాపుంజెలికాండు వీరసేనుండు మాకు, ,,
నాతనిరేఖ నీ యందుం దోంచె;
నేమికార్యముం గోరి యెటు పోవుచున్నాండ ? (5-75)
వెపుడు నీచారిత్ర మేము విందు;
మెఱుంగుదో నీవు మ మ్మిందఱ లెస్సగా ?
నెఱుంగ కుండిన నేమి? యెఱింగికొనుము;

తే. దండపాణి యితం, డనలుం డతండు, (5-76)
వరుణుం డితం, డేను నిర్జరవల్లభుండం;
బిండితార్థంబు విను; మేల పెక్కుమాట ? (5-77)
లర్థులై వచ్చితిమి మము నాదరింపు. 46

అన్న-ఇది వాత్సల్యసంబోధనము గాని తమకన్న పెద్దవాండని పూజించుట గాదు. ఎవ్వరివాండవు = ఎవరి కుమారుండవు. పొడమెన్ = కలిగినది. రేఖ = తీరు = పోలిక. తోంచెన్ = అగపడుచున్నది. చారిత్రము = చరిత్రము. దండిపాణి = యముండు (దండము కేలం గలవాండు).

అనలుండు = అగ్ని. నిర్జర వల్లభుండన్ = దేవేంద్రుండను. పిండిత అర్థంబు = మొత్తము చేయంబడిన ప్రయోజనము (మావచ్చిన ప్రయోజనమును ఒకమాటలో చెప్పెదము విను మనుట.) అర్థులై = యాచకులమై.

వ. ముహూర్తమాత్రంబున మార్గఖేదం బపనయించి కార్య నివేదనం బొనర్చెద (5-77). మని పలికి, యభిధా కుశలుం డైన యవ్విబుధ నాయకుం డూరకుండిన (5-78). 47

మార్గ ఖేదంబు = దారిబడలిక, అపనయించి = తొలఁగించుకొని - తీర్చుకొని, కార్యనివేదనంబు = (చేయవలసిన) పనియొక్క తెలుపుటయు. అభిధా కుశలుండు = చెప్పుటయందు నేర్పరి. విబుధనాయకుండు = దేవపతి.

తే. అర్థి యనుపేరు చెవి సోఁకినంతమాత్ర (5-79)
జాదుకోఁ బులకించె నజ్జనవిభుండు,
ప్రావృషేణ్య పయోధర ప్రభవ మైన
గాలి ననిచిన నీపవృక్షంబు వోలె. 48

ఆ జ్జనవిభుండు = ఆ రాజు, ...చెవి సోఁకినంతమాత్రక = చెవికి తగిలినంత మాత్రముననే (వినఁబడ్డ క్షణమందే), ప్రా...ము - ప్రావృషేణ్య = వర్షాకాల సంబంధియైన 'స్త్రియాం ప్రావృట్ స్త్రియాం భూమ్ని వర్షాః'అమ.) - పయోధర=మేఘము - ప్రభవము=జన్మకారణముగాఁ గలది (వర్షామేఘము మీఁది నుండి వీచుచున్నట్టిది),...గాలిక = గాలిచేత, ననిచిన = ననలెత్తిన (మొగ్గలు పుట్టిన) - నీపవృక్షంబు వోలెక = కడిమి చెట్టువలె ('నీప ప్రియక కదమ్బాస్తు హలిప్రియే' అమ.), జాదుకోఁక = దట్టముగా, పులకించెక = గగుర్పాటు వహించెను.—ఉపమ.

'పులకించుట' యాచకుల యభీష్టమును తీర్ప నవసరము గలిగినందుల హర్షముచేత. 'జాదుకొనుట'—హర్షోత్కర్ష చేత. నీటిమేఘపు గాలికి కడిమిచెట్టు ననుచుట ప్రసిద్ధము:—

'ప్రథమ ప్రియయా వచన సంశ్రవ స్ఫుర త్పులకేన సంప్రతి మయా విడమ్బ్యతే
ఘనరాజి నూతన పయః సముక్షణ క్షణ బద్ధ కుట్మల కదమ్బ డమ్బరః.' మాలతీ.

వ. ఇట్లు సంతసిల్లి భూవల్లభుం డంతర్గతంబున. 49

క. త్రిదశులకును దుర్లభ మై (5-80)
మదధీనం బయినయట్టి మంచి పదార్థం
బది యెట్టి దొక్కొ? వేగమ
యొదవునొకో యడిగినపుడ యుచితంబునకుకా? 50

వేగమ = శీఘ్రముగా, ఉచితంబునకుక = తగినదానికి (తగినట్లు ఇచ్చుటకు), ఒదవునొకో = సమకూడునా.

తే. అడిగినప్పుడ యిత్తు నేఁ బ్రాణ మైన (5-81)
నర్థిమాత్రంబునకు వేడ్క యతిశయిల్ల;
నట్టి యే నింద్రునంతవాఁ డాసపడిన,
నకట యే మిచ్చి పరితోష మందువాఁడ! 51

అర్థిమాత్రంబునకున్ = అర్థి యన్నవాని కెల్ల. పరితోషము = తృప్తి. సామాన్యునికే ప్రాణమయినను ఇయ్య సిద్ధుఁడను, ఇంద్రునంతటి వానికి ప్రాణముకన్న ఎంతయు నెక్కుడగుదానిని ఈయవలయును; అట్టిది యే మున్నది? అని జిజ్ఞాస. 'అకట' - అట్టి దేదియు లేదే యని చింత. కావ్యార్థాపత్త్యలంకారము.

క. ప్రాణంబుకంటె భీమ। క్షోణీపతనూజమీఁదఁ గూర్మి గలదు; గీ (5-82)
ర్వాణాధీశ్వరుఁ డయ్యలి। వేణిన్ మదిఁ గోరనేని వేగమ యిత్తున్. 52

భీమ క్షోణీప తనూజ = భీమ భూపతి కూఁతురు (దమయంతి). కూర్మి = అనురాగము. గీర్వాణ అధీశ్వరుఁడు = ఇంద్రుఁడు ('గీర్వాణా దానవారయః' అమ. - గీర్వాణులు వేల్పులు-వారి దొర.) ఆ యలివేణిన్=తుమ్మెదలవంటి జడ కల దైన యాదమయంతిని. (జరుగనున్న వృత్తాంతమే విధియోగముచే నలునికి ఇట్లు తోఁచుచున్నది.)

తే. ఎద్దియొకో వీరియభిలాష మెఱుఁగుభంగి? (5-83)
యడుగకయ మున్న యీవి భాగ్యంబు గాదె!
వాంఛ నెఱిఁగియు నర్థార్థి వచన దైన్య
మాత్మ సహియింపఁ జాలువాఁ డధమదాత. 53

భంగి = ప్రకారము - ఉపాయము. ఈవి = ఇచ్చుట. భాగ్యంబు = ఇచ్చువాని యదృష్టము. వాంఛన్ = కోరికను, ఎఱిఁగియున్, అర్థార్థి = ప్రయోజనముచేత కోరికగలవానియొక్క (ప్రయోజనము నభిలషించినవానియొక్క - యాచకునియొక్క) - వచన =(కోరికను తెలుపుకొని బతిమాలుకొను) మాటలయొక్క - దైన్య=దీనభావమును, ఆత్మన్ = తనమనస్సులో, సహియింపఁ జాలు వాఁడు = ఓర్వ సమర్థుఁ డైనవాఁడు (అంతటికఠినాత్ముఁ డనుట), అధమ దాత = అధముఁడయిన దాత.—అర్థాంతరన్యాసాలంకారము.

చ. కటికితనంబు మాన్చి, చటు కాకు విడంబముఁ గూర్చి, లజ్జసం (5-84)
కటపడఁ జేసి, యర్థిఁ గడుఁ గాఱియ పెట్టినపాతకంబు న
క్కట తలఁగంగఁ జాలునొకొ కాలవిలంబము నాచరించి పి
మ్మటఁ దదభీప్సితార్థము సమర్పణ సేయు ప్రదాత యెమ్మెయిన్? 54

అక్కట = అయ్యో, అర్థిన్ = యాచకుని, కటికితనంబున్ = (అతని) చిత్తదార్ఢ్యమును, మాన్చి= పోఁగొట్టి, (ఆతనికి), చటు...మున్—చటు=బతిమాలుకొను మాటలయొక్కయు - కాకు = తనదీనతను ప్రకటించుకొనుమాటలయొక్కయు - విడంబమున్ = నగుఁబాటును, కూర్చి =కలిగించి, లజ్జన్ = సిగ్గుచే, సంకటపడన్ = క్లేశపడునట్లుగా, చేసి, (ఇట్లు), కడున్ = మిక్కిలి, కాఱియ పెట్టిన = వేదన గలిగించినందువలని - పాతకంబు = పాపమును, కాలవిలంబమున్ = కాలయాపనను, ఆచరించి = చేసి, పిమ్మటన్ = తర్వాత, త ... మున్ - తత్ = ఆయాచకునియొక్క - అభీష్ట = కోరికయైన - అర్థమున్ = వస్తువును ('అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు' అమ.), సమ ... త = ఇచ్చెడు దాత, ఎమ్మెయిన్ = ఏయుపాయముచేత నైనను, తలఁగంగన్ = పోఁగొట్టుకొనుటకు, చాలునొకో = సమర్థుఁ డగునా - కానేరఁ డనుట.

దాత యగువానికి మొదట యాచకుని మనోధైర్యమును పోనడిచి, వానిచే బతిమాలింపించుకొని, పేదమాటలు పలికించి, ఆవిధముగా వానిని నగుఁబాటు గావించి సిగ్గుపడిచి క్లేశపెట్టిన పాపము, వానికోరిన యర్థమును జాగుచేసి పిమ్మట ఇచ్చినప్పటికిని, ఏయుపాయముచేతను తొలఁగదు.—అడుగక ముందే ఇవ్వవలయు ననుట. ఇది సామాన్యోక్తి; తాను అడిగించుకొన్నచో అపరిహార్యమయిన పాపము కలుగు నని ప్రస్తుతవిశేషము ఇందుల యభిప్రాయము కావున సామాన్యనిబంధన అప్రస్తుతప్రశంస అలంకారము.

చ. కమలము పంక సంకర విగర్హిత, మర్హము గాదు నిల్వఁగాఁ (5-87)
గమలకు, నంచు, నెంతయును గౌతుక మింపెసలార, నర్థి దోః
కమలము నిర్మలంబు నతిగాఢవివేకులు తద్విహార స
ద్మముగ నొనర్తు రప్రతిమ దాన కళా కలనా ధురీణతన్. 55

అతిగాఢ వివేకులు = మిక్కిలి దృఢ మైన ('గాఢ బాఢ దృఢాని చ' అమ.) గుణదోషపరిజ్ఞానము కలవారు, అప్ర...తన్ - అప్రతిమ = సాటిలేని - దాన కళా = ఈవి విద్యయొక్క - కలనా = వినియోగమందలి - ధురీణతన్ = ప్రౌఢికలవా రగుటచేత, కమలము=తమ్మి, పంక...ము =బురదయొక్క (పాపముయొక్క అనియు - 'పఙ్కోఽస్త్రీ శమ లైనసోః' అమ.) సంపర్కముచే నిందితము ('కుత్సా నిన్దా చ గర్హణే' అమ.), కమలకున్ = లక్ష్మికి ('లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీ ర్హరిప్రియా' అమ.), నిల్వఁగాన్ అర్హము కాదు = (నివసించుటకు పనికిరాదు సరియే గదా) నిలుచుట కైనను తగదు, అంచున్ = అని తలపోసి, ఎంతయును = మితి లేని - కౌతుకము = ఉత్సాహము ('కౌతూహలం కౌతుకం చ కుతుకం చ కుతూహలమ్' అమ.), ఇంపు ఎసలు ఆరన్ = ఉప్పొంగుచుండఁగా, నిర్మలంబున్ = మాలిన్యము లేనిది (పాపము లేనిది - 'మలోఽస్త్రీ పాప విట్కిట్టే కృపణే త్వభిధేయవత్' మేది.] అయిన, అర్థి దోః కమలమున్ = యాచకునిచేయి యనెడి తమ్మిని, త ... గన్ - తత్ = ఆలక్ష్మియొక్క - విహారసద్మముగన్ = క్రీడామందిరముగా, ఒనర్తురు = చేయుదురు.

దాన విద్యా రహస్యము నెఱిఁగిన మహాబుద్ధిశాలులు - మహాలక్ష్మి పద్మాలయ యగుటవలన పద్మమునందు ఉండునే గాని, పద్మము బురదలో (పాపములో) నుండుటంబట్టి దూష్యము గావున ఆమెకు నిలుచుట కైనను తగినతావు గాదు, అని - యాలోచించుకొని ఆ మహాలక్ష్మిని నిష్పంకంబు (సత్పాత్ర మగుటచేత నిష్పాపంబు) అయిన యాచక హస్తపద్మ మనెడి క్రీడామందిరమందు నెలకొల్పుదురు.—పంకసాంకర్యమునకును నిర్మలత్వమునకును, నిల్వం గొలఁ గామికిని విహారయోగ్య సద్మత్వమునకును, గల వ్యతిరేకముం గన నగు.—తాద్రూప్యరూపకము.— 'గర్హిత,' 'నిర్మల,' 'గాఢవివేక,' అను విశేషణములు హేతుపరములు గాన పదార్థహేతుక కావ్యలింగము. పాత్రదానమునకు హేతువు కాని కమలానర్హత హేతువుగా సంభావింపఁబడినది గాన నుత్ప్రేక్ష, వాచకము లేదు గాన గమ్య. ఈసామాన్యోక్తికి అట్లు తానును చేయవలయు నను ప్రస్తుతవిశేషమభిప్రాయము గాన, సామాన్యనిబంధ నాప్రస్తుతప్రశంసయు.

ఉ. దాన కళా కలాప సముదంచిత సార వివేక సంపదన్ (5-88)
మానిత యాచమాన జన మానస వృత్త్యభిపూర్తి బుద్ధి నెం

వ్వానికి లే దొకింతయును, వాఁ డొకరుండు భరంబు ధాత్రికిం;
గానలు గావు, శైలములు గావు, పయోధులు గావు భారముల్. **56**

ఎవ్వానికిన్, దాన...దన్ - దాన = ఈవి యనెడి - కళా = విద్య యనెడి - కలాప = అలంకారముచేత - సముదంచిత = మిక్కిలిపూజిత మయిన ('పూజితోఽఞ్చితః' అమ.) - సార= శ్రేష్ఠ మయిన - వివేక = పాత్రాపాత్రతారతమ్యజ్ఞానముయొక్క - సంపదన్ = సమృద్ధిచేత, మాని...ద్ధి - మానిత = పూజ్యమాను లయిన - యాచమాన = యాచించుచున్న - జన = జనులయొక్క - మానస = మనోగత మైన - వృత్తి = వ్యాపారముయొక్క (కోరికయొక్క) - అభిపూర్తి = తీర్చుటయొక్క - బుద్ధి = సంకల్పము, లేదు = లేదో, వాఁడు, ఒకరుండె= ఒక్కఁడే, ధాత్రికిన్ = (ఎన్నిటి నైనను ఎంత బరు వయినను భరించున దైన) భూమికి (ధాత్రి యనఁగా ధరించునది — 'దధాతి ఇతి ధాత్రీ' వ్యు.— 'ధాత్రీ స్యా దుమాతాఽపి క్షితి ర ప్యామల క్యపి' అమ.), భరంబు = బరువు, కానలు = (మహావృక్షములుగల వైన) యరణ్యములు, భారములు గావు, శైలములు = కొండలు ('అద్రి గోత్ర గిరి గ్రా వాచల శైల శిలోచ్చయాః' అమ.), ... పయోధులు = సముద్రములు,...

దానబుద్ధి యెవనికి లేదో వాఁడు భూమికి బరువు గాని అడవులు కొండలు సంద్రములును బరువు గావు.—అట్టివాఁడు జీవింప నర్హుఁడు గాఁడనుట.

'మానిత' - దీనిచే పాత్రత చెప్పఁబడినది. 'మానస' - నోటఁ జెప్పింపకయే అనుటయు కోరినంతయు ననుటయు భా.—పరిసంఖ్యాలంకారము.

తే. తలఁప నధమర్ణుఁ డొకఁడు ప్రదానపాత్ర, **(5-92)**
మిచట నొక్కటి గొని మీఁద నిచ్చుఁ గోటి;
సుకృత సంపదఁ బారలౌకిక కుసీద
మాసపడువారి కిదియ బేహార మరయ. **57**

తలఁపన్ = ఆలోచింపఁగా, దాన పాత్రము ఒకఁడు = ఈవికి అర్హుఁ డగు వాఁడొకఁడే
('పాత్రం తు కూలయో ర్మధ్యే పర్ణే నృపతిమన్త్రిణి
యోగ్యభాజనయో ర్యజ్ఞభాణ్డే నాట్యానుకర్తరి.' హేమ.)—
అధమర్ణుఁడు = (మంచి) ఋణగ్రాహకుఁడు (అధమ మయిన ఋణము కలవాఁడు - అనఁగా అచ్చుకో వలసినవాఁడు అని వ్యు. 'ఉత్తమర్ణాధమర్ణౌ ద్వౌ ప్రయోక్తృగ్రాహకౌ క్రమాత్' అమ.), (ఏల యన, ఆతఁడు), ఇచటన్ = ఈలోకములో,...మీఁదన్= స్వర్గములో, కోటిన్ = అనంతఫలమును, ఇచ్చును, (కాన), అరయన్ = ఆలోచింపఁగా, సుకృత సంపదన్ = పుణ్యసమృద్ధిచేత, పారలౌకిక కుసీదము = స్వర్గమందలి వడ్డిజీవికను ('కుసీదం వృద్ధిజీవికా' అమ.), ఆసపడువారికిన్ = కోరువారికి, ఇదియ = ఇట్లు సత్పాత్రు(ఁడయిన యధమర్ణు)నికి ఇచ్చుటయే, బేహారము = (వ్యవహారము) (మంచి) బేరము.

స్వర్గమందు అనంత సౌఖ్య మనుభవించుటకు సత్పాత్రదానము సాధనము. సత్పాత్రుఁడు ఈలోకములో ఒక్కటి అప్పు పుచ్చుకొని పరలోకములో దీనికి లెక్క లేని మడుంగులు ఇచ్చునట్టి

యప్పుకాఁపు. సామాన్య మయిన యప్పుకాఁపు ఎన్నాళ్లవడ్డి పేరినను చక్రవృద్ధి సరళవృద్ధియుం బేరినను ధర్మశాస్త్రానుసారముగా ధనద్విగుణముకన్న అధిక మియ్యఁడు:—

'అశీతిభాగం గృహ్ణీయా న్మాసే వార్ధుషికః శతే.'

'వస్త్ర ధాన్య హిరణ్యానాం చతు స్త్రి ద్వి గుణాః పరే.'

'కుసీదవృద్ధి ర్ద్వైగుణ్యం నాత్యేతి సకృ దాహితా.'

సత్పాత్రము, లెక్కలేనిమడుంగుల ఫలము నిచ్చును కావున సత్పాత్రమునకు తప్పక ఈ వలసినది.

'సమ మబ్రాహ్మణే దానం, ద్విగుణం బ్రాహ్మణబ్రువే,
ప్రాధీతే శతసాహస్ర, మనన్తం వేదపారగే.' మనువు.

అధికాభేదరూపకము. అట్లే తాను పాత్రములలో నుత్తమపాత్ర మయిన దేవేంద్రునికి వలసినది ఇచ్చి అనంతసౌఖ్యమును స్వర్గములో పొందవలసినది, అని ప్రస్తుతవిశేషము ఈసామాన్యమున కభిప్రాయము గావున అప్రస్తుతప్రశంసాలంకారంబును.

వ. అని ముహూర్తమాత్రంబు చింతించి యానిషధరాజు ప్రసన్న ముఖుం డై యా బర్హిర్ముఖుల కిట్లనియె. (5-93) 58

ముహూర్తమాత్రంబు = ఇంచుకసేపు (మాత్రచ్ప్రత్యయము పరిమాణమును ద్యోతించుచున్నది.) ప్రసన్నముఖుండు= సంతుష్ట మయిన (మనస్సులోని సంతోషము తన వికాసముచే తెలుపుచున్న- 'ప్రసన్నా స్త్రీ సురాయాం స్యా దచ్ఛ సంతుష్టయో స్త్రిషు') వదనము కలవాఁడు. బర్హిర్ముఖులకున్ = దేవతలకు ('బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః' అమ. బర్హిః అగ్నిః - ముఖమ్ యేషాం తే - అగ్నియే నోరుగాఁ గలవారు.)

తే. జన్య జనకంబులకు భేద శంక లేదు; (5-94)
దేహ మన్నజ; మిందు సందేహ మెద్ది?
మీర లమృతాశు; లమృతంబు మిమ్ముఁ జూడఁ,
దృప్తి సంపద నొందె మ ద్వీక్షణములు. 59

జన్య జనకంబులకున్ = కార్య కారణములకు, భేద శంక = భేదము (కలదు) అనెడి వితర్కము - 'శఙ్కా త్రాస వితర్కయోః' నానా.), లేదు; దేహము = ఒడలు, అన్నజము = ఆహారమువలనం బుట్టినట్టిది; ... మీరలు = మీరు, అమృతాశులు = అమృతము ఆరగించువారు, అమృతంబున్ మిమ్మున్ = అమృతభూతు లయిన మిమ్ము, చూడన్ = చూచి, మత్ వీక్షణములు = నా కన్నులు, తృప్తి సంపదన్ = తనివియొక్క సమృద్ధిని, ఒందెన్ = చెందెను.

బంగారము జనకము, కడియము జన్యము, పేరు వే అయినను కడియంబును బంగారమే; అన్నము జనకము, దేహము జన్యము; అమృతము జనకము, అమృతాశను లయిన యింద్రాదుల దేహము జన్యము; 'అన్నా ద్ధ్యేవ భూతాని జాయన్తే, జాతా న్యన్నేన వర్ధన్తే.' అని శ్రుతి; కావున మీమూర్తులు అమృతమే; 'కారణగుణములు కార్యమందు సంక్రమించును' అను న్యాయంబున, మిమ్ముఁ జూచి నాచూపులు అమృతమగ్నములుం బోలె సుఖించుచున్న వి;- మీదర్శనముచే పరమానంద భరితుఁడ నైతి-నని భా.—సామాన్యవిశేషోక్తిచేత నర్థాంతరన్యాసము.

తే. ఏను జేసిన పుణ్యంబు లెట్టి వొక్కొ! (5-95)
ఫలిత మయ్యెను మత్పూర్వ పరమ తపము;
లింత కల్యాణ కర మాయె నీదినంబు!
కౌతుకం బార దర్శింపఁ గంటి మిమ్ము. 60

... పుణ్యంబులు=సుకృతములు...మత్ పూర్వ పరమ తపము=నా తొంటి యుత్కృష్ట తపస్సు. ఫలితము = సంజాతఫలము. ... కల్యాణ కరము = మంగళ ప్రదము. కౌతుకంబు = వేడుక, ఆరన్ = నిండునట్లుగా. దర్శింపఁ గంటిన్ = చూచునట్టి భాగ్యమును పొందితిని.

చెప్ప శక్యము గానంత పుణ్యము నేను పూర్వజన్మమున చేసి యుందును, గొప్ప తపస్సులును చేసియుందును; వానిఫలము గానిచో యీమీదర్శనభాగ్యము నా కెట్లు కలుగును? ఐనను ఇంతటి మహాఫలమునకుం దగిన పుణ్యంబులం జేయ శక్యమా? - ఇత్యాది భా.— కావ్యలింగము.

చ. నలువు దలిర్ప సర్వసహాన వ్రత జన్మము లైన పుణ్యముల్ (5-96)
ఫలితము లయ్యెఁ గావలయు భాగ్యముపెంపున భూతధాత్రికిన్!
లలితము లైన పాదకమలంబుల నర్చన మాచరింపఁగాఁ
దలఁతురె వేల్పులార, ప్రమదంబున మీ, రటు గాక తక్కినన్? 61

వేల్పులార = ఓదేవతలారా, భూత ధాత్రికిన్ = (భూతముల నన్నిటిని పోషకురాలైన) భూమికి ('జగతీ రత్నగర్భా చ భూతధాత్ర్యబ్ధిమేఖలా' అమ.), సర్వ...ముల్–సర్వ= (ప్రాణి క్షేమార్థ మై సహ్యాసహ్యము లగు) నన్నిటియొక్కయు - సహాన=ఓర్చుట యనెడి (అందువలననే భూమికి సర్వంసహా యని పేరు - 'సర్వంసహా వసుమతీ వసు ధోర్వీ వసుంధరా' అమ.) - వ్రత = నియమమువలన-జన్మముల్=పుట్టువు కలవి, ఐన-పుణ్యముల్=సుకృతములు, భాగ్యము పెంపునన్= అదృష్టాతిశయముచేత, నలువు =మనోజ్ఞత, తలిర్పన్= చిగుర్చునట్లు, ఫలితములు = సంజాతఫల ములు, అయ్యెఁ గావలయున్=అయిన వని యూహించెదను. అటు కాక తక్కినన్ = ఆకారణము వలనం గాదేని, మీరు, ప్రమదంబునన్ = సంతోషముతో, లలితములు = సుందరములు, ఐన-(మీ) పాద కమలంబులన్=చరణ సరోజములతో, (భూదేవికి), అర్చనము=పూజను, ఆచరింపఁగాన్= చేయుటకు, తలఁతురె = పూనుదురా?

నాపుణ్య మెక్కడ మీదర్శన మెక్కడ! మీరు నాకు దర్శన మిచ్చుటకై వచ్చినవారు గారు. భూదేవత సర్వప్రాణిక్షేమంకరముగా చేసిన సర్వసహానవ్రతమునకు ప్రసన్నుల రై మీరు భూమిని సంభావింప వచ్చితిరి గావలయు; నాకును ఆనుషంగికముగా మీదర్శనభాగ్యము కలిగినది.

సర్వసహానము వీరిరాకకు హేతువు గానిది హేతువుగా సంభావింపఁబడినది గావున హేతూత్ప్రేక్ష. పాద కమలంబులు—రూపకము.

వ. నాయందు మీ రపేక్షించిన ప్రయోజనం బానతిండు; ప్రాణం బైనను బ్రాణాధికం బైనను నది యెట్టిపదార్థం బైన నిచ్చెద (5-97). నని నిర్వ్యాజంబుగాఁ బలికిన యుర్వీశ్వరునకు గీర్వాణవల్లభుం డి ట్లనియె (5-98). 62

ఆనతి ఇందు = సెల విందు. (ఇత్వసంధి విరళము, ఈప్రయోగంబున వైకల్పికము.) ఉర్వీశ్వరునకున్ = రాజునకు ('స్వామీ త్వీశ్వరః పతి రీశితా' అమ.) గీర్వాణ వల్లభుండు = ఇంద్రుఁడు. ర్వావృత్తి వృత్త్యనుప్రాసము.

ఉ. ఓ మిహికాంశు వంశ కల శోదధి కౌస్తుభరత్న, భూపతి (5-99)
గ్రామణి, యస్మదీయ మగు కాంక్షితమున్ విను; భీమపుత్త్రిపైఁ
గామన సేసి వచ్చితిమి; గమ్ము సహాయము మాకు నిక్కపుం
బ్రేమయు భక్తియుం గృపయుఁ బెంపుగఁ జేయుము దూతకృత్యమున్.

ఓ మిహికా అంశు వంశ కలశ ఉదధి కౌస్తుభ రత్న = మంచు ('ప్రాలేయం మిహికా' అమ.) వెలుఁగులవాని (చంద్రుని) కుల మనెడు పాలసముద్రమునకు కౌస్తుభ మణి యగువాఁడా (రూపకాలంకారము - కలశము పాలకడలియొక్క యమృతమును పోసి యుంచుటకై విశ్వకర్మచే సృజింపఁబడిన యమృతఘటము - దానికి సంబంధించినది గాన కలశోదధి యనం బాలకడలి -

'సాగరే మథ్యమానే తు పీయూషార్థం సురాసురైః
పీయూషధారణార్థాయ నిర్మితా విశ్వకర్మణా,
కలాః కలా స్తు దేవానా మసితా స్తాః పృథక్ పృథక్
యతః కృతా స్తు కలసా స్తత స్తే పరికీర్తితాః.' కాళికా పు.

కౌస్తుభమణి సముద్రమున జనించి శ్రీహరికి వక్షోఽలంకార మయిన దని ప్రసిద్ధము), భూపతి గ్రామణీ = రాజోత్తముఁడా ('గ్రామణీ ర్నాపితే పుంసి త్రిషు శ్రేష్ఠేఽధిపే త్రిషు' అమ.), అస్మదీయము = మాది, అగు - కాంక్షితమున్ = కోరికను, వినుము; భీమ పుత్త్రిపైన్ = దమయంతి మీఁద, కామన = కోరిక, చేసి = వహించి, వచ్చితిమి; మాకున్, సహాయము కమ్ము = తోడ్పడుము ('సహాయము' - మువర్ణకము చింత్యము, ఇట పుల్లింగమహద్వాచకం బగుటచే 'సహాయుఁడు' అని డుజ్జు రావలయును. 'సహాయుఁడ వీవు' అని పఠించిన నీయాక్షేపము ఉండదు. ప్రతుల యందు 'సహాయము' అనియే యున్నది.) (మామీఁద), నిక్కపుం బ్రేమయున్ = నిజ మయిన స్నేహంబును ('ప్రేమా నా ప్రియతా హార్దం ప్రేమ స్నేహః' అమ.), భక్తియున్ = అనురాగ విశేషంబును, కృపయున్ = దయయు ('కృపా దయాఽనుకమ్పా స్యాత్' అమ.), పెంపు గన్ = అతిశయ మగునట్లుగా, దూతకృత్యమున్ = దూత్యమును (రాయబారమును), చేయుము.

వ. భూమండలంబున రాజనందను లెందఱు లేరు? వారివలనం బ్రయోజనం బేమి? దక్కిన గ్రహంబులు గ్రహరాజుం బోల నేర్చునె **(5-100)**? యగాధ గుణాంభోధి వగు నీవు సహాయంబుగా మాకు సాధింప రాని కార్యంబుం గలదే **(5-101)**? యని పలికిన. **64**

తక్కిన గ్రహంబులు = సూర్యేతరము లయిన గ్రహములు - భూమిచుట్టును దిరుగుచు నక్షత్రములకంటె వెనుకఁబడు గోళవిశేషములు గ్రహము లని ప్రాచీనమతము - అవి సూర్య చంద్రాంగారక బుధ బృహస్పతి శుక్ర శనులును ఛాయారూపు లయిన రాహుకేతువులును. గ్రహరాజున్ = సూర్యుని (సూర్యపర్యాయములలో 'విభావసు ర్గ్రహపతి స్త్విషాంపతి రహర్పతిః' అమ.)

[.' భూమండ... నేర్చునే'—దృష్టాంతాలంకారము.] అగాధ గుణ అంభోధివి = లోఁతు అందని గుణసముద్రుఁడవు ('అగాధ మతలస్పర్శే' అమ. — రూపకము.) సహాయంబు కాన్ = తోడు అయినయెడల - ఇటను 'సహాయుండవుగాన్' అని పఠించిన పూర్వోక్తాక్షేపము ఉండదు.

తే. బలనిషూదను కపటంపు భాషణములు (5-103)
విని నృపాలుండు పలికెఁ దద్విధమ గాఁగఁ,
గుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ
యర్హ మగుఁ గాని, నీతి గా దార్జవంబు. 65

బల నిషూదను = బలాసుర హంతయొక్క....తద్విధమ కాఁగన్=ఆ(కపట)విధమే అగునట్లుగా. కుటిల బుద్ధులన్ = కుత్సిపు బుద్ధి గలవారిని....మతియ = బుద్ధియే. అర్హము = తగినది. ...ఆర్జవంబు = తిన్నఁదనము, నీతి = నయము, ..—వాక్యార్థ హేతుక కావ్యలింగము.

వ. అఖిల భూ తాంత ర్వ ర్తనంబుల నెఱింగెడు మీకు నెఱుంగంబడని యర్థంబునుం గలదె? యట్టి మీ రివ్విధంబున నానతిచ్చిన నేమి యనం గలదు (5-106)? ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నాఁడ. నమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయనేర్తు(5-107)? విరహ వేదనా దోదూయమాన మానసుండ నైన యేను మీారహస్యం బెట్లు రక్షింపనోపుదు(5-108)? మనోరథ పరంపరా సుధారసంబునఁ బరవశుండ నైన నాకు భావగోపనం బెట్లు సిద్ధించు(5-109)? వివిధ రక్షాధికృతపాలితంబు లైన రాజశుద్ధాంతభవన కక్ష్యాంతరంబు లే ప్రకారంబునం బ్రవేశింతుఁ (5-110)? బెద్దకాలంబుననుండియు నాయందు వినుకలి దద్దయుం గలిగి యున్న యమ్ముద్దియతో మీ ప్రసంగం బెబ్భంగిఁ జేయుదుఁ(5-114)? గాన హాస్యకారణం బగునిక్కార్యంబునకు నన్ను భారకుం జేయకుం (5-115) డని పలికిన. 66

అఖిల భూత అంత ర్వ ర్తనంబులు = సమస్త ప్రాణుల మనస్సులలోని వృత్తులను ('యుక్తే క్ష్మాదా వృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు' అమ.) అర్థంబు నున్ = విషయము కూడ. ఏమి యనం గలదు = ఉత్తరము చెప్ప నే మున్నది. అంగనన్ = సుందరిని (ప్రశస్తము లయిన యంగములు గలది అని వ్యు.) మచ్చె కంటి = (బేడిస) మీాలవంటి కన్నులు గల యింతి. కుంటెనతనంబు = తార్పుగానికృత్యము (కామదూత్యము). మనో ... నన్ = కోరికల వరుస యనెడి యమృత ద్రవంబులో (రూపకము). భావ గోపనంబు = మదీయానురాగమును దాఁచుట. వివి...బులు= పెక్కురు కావలివాండ్రచేత రక్షింపఁబడినవి (రక్ష—కాపునందు-అధికృతులు=నియమితులు.రక్షాధికృతులు), రాజ శుద్ధాంత భవన కక్ష్యా అంతరంబులు = రాని యంతిపురి యింటి తొట్టికట్ల నడిమిప్రవేశములు ('స్త్ర్యగారం భూభుజా మన్తఃపురం స్యా దవరోధనం । శుద్ధాన్త శ్చావరోధశ్చ' అమ. 'కక్ష్యా కచ్ఛే వరత్రాయాం కాఞ్చ్యాం గేహ ప్రకోష్ఠకే' నానా.) తద్దయున్=విశేషముగా. ముద్దియతోన్ = ముద్దరాలితో. ప్రసంగంబు = ప్రస్తావంబు, భారకున్ = సెలాఫరిని.

క. మేలపు మైవడి నగవున । వేలుపులం దోడివారి వీక్షించి మహీ (5-116)
పాలునితో ని ట్లనియెను । బాలోమీవల్లభుండు ప్రస్ఫుటఫణితిన్. 67

పౌలోమీ వల్లభుండు = శచీ దయితుఁ డయిన యింద్రుఁడు, మేలపు మైవడి నగవునన్ = పరిహాసపు విధము గల నవ్వుతో (పరిహాసముగానుంబోలె నవ్వుచు), వే ... చి = తోడిదేవతలను చూచి, ప్రస్ఫుట ఫణితిన్ = స్పష్ట మయిన వాక్కుతో, మహీపాలునితోన్ = (నల మహా) రాజుతో, ఇ ట్లనియెను.

ఇంద్రుని యీ వీక్షణమునకు.—ఇతఁడు తప్పించుకొనఁ జూచుచున్నాఁడుగాని తప్పించుకో నీయఁ గూడదు సుమా అనియు, ఇతనియం దమ్మద్దియ నిను కలి తద్దయుం గలిగి యున్న దఁట విన్నారా అనియు, నారదుఁడు పేర్కొనియారాజకుమారుఁడు ఇతఁడే గావలయు ననియు, భా. 'పరిహాసపుమైవడి' యాతనిమాటను నిషేధించుటకు. 'నగవు' ఆతనిని ఆవర్జించుటకు.

సీ. ఈమాట లాడకు మిందు వంశ వతంస, (5-117)
యాడి తప్పఁగ వచ్చు నయ్య నీకు?
క్షణ భంగురం బైన సంసారమునకుఁగా (5-118)
ధర్మంబుఁ గీర్తియుఁ దగు నె విడువ?
నన్వయంబున కాది యగు చందరుఁడువోలె (5-119)
నకట! కళంకి వే లయ్యె దీవు?
చిరకాలమున నుపార్జింపఁబడ్డ ప్రసిద్ధి (5-122)
నేఁగిఁ బొందఁగ నుపేక్షింపవలదు.

తే. పరుస నైనచింతామణిఁ బసర మైన (5-125)
కామధేనువు ద్రుమ మైనకల్పకంబు
నడిగి వైఫల్యమును బొంద రర్థిజనులు,
మిన్నకయ పోదుమే యేము నిన్ను నడిగి? 68

ఇందు వంశ వతంస = చంద్ర వంశమునకు సిగపూ వైనవాఁడా. ఆడి=(62-వ వచనంబులో 'ప్రాణం ... నిచ్చెదను' అనుమాటలను) పలికి (ప్రతిశ్రుతి చేసి యనుట.)

భంగురము = భంగపడునది. సంసారమునకుఁగాన్ = ఆలుబిడ్డలతోడి యునికికొఱకు. ధర్మంబున్=పుణ్యమును - లేక - అర్థిమనోరథపూరణాచారమును ('ధర్మాః పుణ్య యమ న్యాయ స్వభా వాచార సోమపాః' అమ.)

అన్వయంబునకున్ = (నీ) వంశమునకు ('సంతతి ర్గోత్ర జనన కులా న్యభిజ నాన్వయౌ। వంశోఽన్వవాయః సన్తానః' అమ.), ఆది = మూలపురుషుఁడు. కళంకివి = అపవాద కలవాఁడవు (మచ్చ కలవాఁడవు అని చంద్రపరము - 'కళఙ్కాఙ్కౌ లాఞ్ఛనే చ కళఙ్కోఽపవాదయోః' అమ.)

ప్రసిద్ధి=కీర్తి. నేఁగిన్ = నష్టిని.

పరుసన = (రాయి గావ) కఠినము (ఒకరికష్టమును భావించుకోలేనిది యనియు) - ఐన - చింతా మణిన్ = ఈవి మానికమును; పసరము = గొడ్డు (ప్రైయఖ్రిపాంతు పెం) - ఐన-కామధేను

వుక్ = వేల్పుటావును (కోరికలను తీర్చెడియావు అని వ్యు.), ద్రుమను = చెట్టు (మొద్దు - జడము - పై యభిప్రాయమే) - ఐన - కల్పకంబుక్ = కల్పవృక్షమును, ... వైఫల్యమును = ప్రార్థనా భంగము ను, ... నిన్నున్ - ఇంతప్రాజ్ఞుని దానశీలుని అని యభిప్రాయము. ...

సీసపాదములలో 'అడి' మొదలుగాఁగలవాక్యము లన్నిటియర్థమును ఆమాట బాడరామికి హేతువు గాన కావ్యలింగము. మూఁడవపాదంబున నుపను గూడ నున్నది. గీతములోని విశేషణము లకును పరదుఃఖాద్యనభిజ్ఞత అభిప్రాయము గాన పరికరము; గీతములో కావ్యార్థాపత్తియు.

చ. అసదృశ దాన వైభవ మహాగుణ ధన్యుని నిన్ను దేవతా (5-133)
విసరము యాచకత్వమున వేఁడఁగ వచ్చుట కారణంబుగాఁ
బ్రసవ వికాసమాత్రమునఁ బాండురభావము నొందుఁగాక యా
కసము యశోవిహీన మగు కల్ప మహీరుహ పంచకంబుచేన్. 69

అస...నిక్ = సాటిలేని త్యాగోన్నతి యనెడు గొప్ప గుణముచేత కృతార్థుఁడ వగు, నిన్నుక్, దేవతా విసరము = వేల్పుల సమూహము ('సమూహ నివహ వ్యూహ సందోహ విసర వ్రజాః' అమ.), యాచకత్వమునక్ = అర్థిభావముచేత, ... ఆకసము = (స్వర్గస్థాన మయిన) చదలు, యశో విహీనము = కీర్తిచేత కొఱవడినవి, అగు - కల్ప మహీరుహ పంచకంబుచేక్ = ఈవిమ్రాఁకులు అయిదింటిచేతను, ప్రసవ వికాస మాత్రమునక్ = కేవలము పూవుల విరియుటచేత ('మాత్రం కార్త్స్న్యే౽వధారణే'- అమ. ఇట నవధారణ మర్థము - దానయశస్సుచేతఁ గా దనుట), పాండుర భావముక్ = ధావళ్యమును, పొందుఁ గాక = పొందునట్లు చేయుము.

మాకు సకలాభీష్టములను నిరంతరమును తీర్చుచున్న కల్పవృక్షముల యశస్సు - తా మియ్య లేని దానిని నీ వియ్యఁగల వని తమ్ము మాని మేము వచ్చి నిన్ను యాచించుటచేత - పోనున్నది. కల్ప వృక్షములు ఇయ్యలేనిదానిని దేవతలు సంపాదించుకో లేనిదానిని వారి కిచ్చుటకన్న యశ ముండు నా? నీవు అట్టి మాకార్యమును నెఱవేర్చి ఆమహాయశస్సుం బొందుము.

'ఆకసము' —అనుటచే ఇంతవఱకు స్వర్గమున కున్న యశము ఇప్పుడు నీవలన భూలోకము నకుం గలిగినది యనియు, నీవలన భూలోకము స్వర్గముకంటె నుత్కృష్ట మయిన దనియు, భా. 'పంచకంబు' - అనుటచే ఒక్కటేనియు నీకు సాటిగాదు గదా అయిదింటిమొత్తము కూడ సాటి గా దని యభిప్రాయము. 'యాచకత్వమునక్' - అనుటచేత దైన్యముతో నని భా. 'పాండుర భావముక్' - తమయశస్సు పోయి ఒరునికిం జెందినందులకుఁ గలిగిన వెలవెలఁబా టని భా. - అట్టి మహాకీర్తికన్న దమయంతి యెక్కుడు గాదు గావున దమయంతిమీఁది కాంక్షను మాని మాకై దూత్యము సలుపుము, అని పద్యాభిప్రాయము.—పాండురత్వముకై యశస్సును నిషేధించి ప్రసవవికాసమును నియంత్రించుటచేత పరిసంఖ్యాలంకారము.

ఉ. 'అక్షరముల్ పఠించు సమయంబునఁ బాఠము సేయఁ డయ్యెనో? (5-121)
శిక్షిత వర్ణ మధ్యమునఁ జెందెనొ విస్మృతి?' నంచు, నర్థు లు
త్ప్రేక్ష యొనర్తు రీక్రియ నభీష్ట ఫల ప్రతిపాదన క్రియా
దక్షుని నిన్నుఁ గూర్చిన యధర్మనికారమున న్నకారమున్. 70

అర్థులు = యాచకులు ('అర్థీ పుమాన్యాచకే స్యాత్సేవకే చ వివాదిని' మేది.), ఈక్రియన్ = ఈవిధముగా (అనఁగా మాకు సయితము దమయంతిని సైతము ఒడఁగూర్చువాఁడవుగా), అభీ...నిన్ = కోరిన ప్రయోజనమును ఇచ్చుట (అనఁగా నెఱవేర్చుట) యనెడి వ్యాపారమందు సమర్థుని, నిన్ను...నన్ =నిన్ను గుఱించిన (అధర్మ =) పుణ్యాభావముయొక్క (నికారమునన్ =) నిషేధమునందు (అనఁగా నీయందు పుణ్యమే గాని తదభావము లేదని వ్రాయుచున్నసమయమందు), నకారమున్ = 'న' (లేదు) అను నక్షరమును, అక్ష ... నో=అక్షరములు నేర్చుకొను నప్పుడు నేర్చుకోలేదో, శిక్షిత వర్ణ మధ్యమునన్ =(నేర్చుకొనియు) ఆ నేర్చిన యక్షరములనడుమ, విస్మృతిఁ జెందెనో = మఱచినాఁడో, అంచున్ =అని, ఉత్ప్రేక్ష యొనర్తురు=సంభావన చేయుదురు.

ఎల్ల వారికిని ఎల్లయభీష్టముల నొసంగువాఁడ వయిన నీయొక్క పుణ్యకర్మైకప్రవణత్వమును వర్ణించు వేళలయందు యాచకులు ఇట్లు ఉత్ప్రేక్ష సేయుదురు.—"ఈరాజు ఎవ రేమి వేఁడినను 'న' (చేయను, లేదు) అనఁడు. ఈయన అక్షరములు నేర్చుకొన్నప్పుడు 'న'వర్ణమును నేర్వ లేదో, నేర్చియు మఱచినాఁడో, రెంట నొకటి కారణము గావలయును." అని.

'ఖేలత్సు భూరి ష్వపి యాచకేషు దానైకలీలారసికస్య యస్య
దాప్యర్థచారీ కిల యో నకారో యది ప్రియోఽసౌ న పరః కదాచిత్.' హమ్మీర.

∴ నకారమును మఱచినాఁ డనుటచే ఈవి యీతనికి తప్పని వ్రత మని భా. (ఇప్పుడు తప్పి ఆకీర్తిని పోఁగొట్టుకొనుట యుక్తము గాదు గావున మాకార్యముం జేయుము,' అని బోధనోపబృంహణము. ఇట్లుత్ప్రేక్షింతు రనుట రాజును ఉబ్బవేయుటకు ఇంద్రుఁడు కల్పించినమాటయే గాని వాస్తవముగాదు గావున సంబంధాతిశయోక్తి. పూర్వార్ధమున కోటిద్వయముం గని సందేహాలంకార మని కొందఱు తలంచిరి. సాదృశ్యము మూలము గానందున సందేహాలంకారము గాదు.

[దొరకిన వ్రాఁతపుస్తకములలో ఈపద్యమున ద్వితీయపాదములో 'విక్షుత వర్ణ మధ్యమున విస్మృతిఁ జెందెనో' అనియున్నది. 'విక్షిత' అని కొన్నిట నున్నది. 'వీక్షిత' అని పూర్వముద్రణము. 'శిక్షిత' అని పూర్వతరముద్రణములు. 'శిక్షిత' పా. కైకొని యతికై 'విస్మృతిఁ జెందెనో' అను వరుసను 'జెందెనో విస్మృతి' అని మార్చినాఁడ. తురీయపాదమం దుండిన'వికారము'ను 'నికారము' గావించినాఁడ.]

'చేయఁ డయ్యెనో'–'భూతంబున లఙకి లిడంతంబగునగుధాతు వను ప్రయుక్తంబగు.' బా.వ్యా. లఙ అనఁగా వ్యతిరేకార్థకము; లిడంతం బనఁగా భూతార్థకము.

శా. ఈ యర్థంబు ఘటింపవన్న నృప, నీ కెంతేని మే లయ్యెడున్; (5-135)
మా యాశీర్వచనంబులం ద్రిజగతీ మధ్యంబున న్నీ యశ
శ్ఛాయా మండల మిందు కుంద కుముద స్వచ్ఛంబు సంధించు సం
ధా యుక్తిన్ శితి పీత రోహిత హరి ద్వర్ణోపసంహారమున్. 71

నృప = ఓరాజా, ఈ యర్థంబున్ ఘటింపవు అన్న =ఈకార్యమును సమకూర్పవయ్యా, మాయాశీర్వచనంబులన్ = మేము పల్కెడు వరములచేత ('స్త్రీ త్వాశీ ర్హితాశంసాఽహిదంష్ట్రయోః' అమ.), నీకున్, ఎంతేని = కరము, మేలు = శ్రేయము, అయ్యెడున్ = కలుగును; (ఇంతియ కాక, త్రిజగతీ మధ్యంబునన్ = ముల్లోకములయందు, ఇందు కుంద కుముద స్వచ్ఛంబు=

చంద్రునివలెను మొల్లలవలెను తెల్లగలువవలెను ధవళ మయిన, నీ - యశః ఛాయా మండలము = కీర్తియొక్క కాంతి సంఘాతము ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.

'స్యా న్మణ్డలం ద్వాదశరాజకే చ దేశే చ బిమ్బే చ కదమ్బకే చ
కుష్ఠప్రభేదేఽప్యుపసూర్యకేఽపి భుజఙ్గభేదే శుని మణ్డలః స్యాత్.' విశ్వ.),

సంధా యుక్తిన్ = ప్రతిజ్ఞా యోగముచేతను (ప్రతిజ్ఞ చేసి యనుట - 'సంధా ప్రతిజ్ఞా మర్యాదా' అమ.), శితి పీత రోహిత హరిత్ వర్ణ ఉపసంహారమున్ = నలుపు పసుపు ఎఱుపు పసరు అనెడు వన్నెల ధ్వంసమును ('శితీ ధవళమేచకౌ,' 'పీతో గౌరో హరిద్రాభః,' 'రోహితో లోహితో రక్తః,' 'పాలాశో హరితో హరిత్,' 'గుణే శుక్లాదయః పుంసి' అమ.), సంధించున్ = సమకూర్చును.

ఓరాజా, ఈ మాకార్యమును నెఱవేర్పుము బాబూ; నీ కెంతయు శ్రేయము కలుగునట్లుగా వరము లిచ్చెదము. అందువలన నీకుం గలిగెడుకీర్తి చంద్ర కుంద కుముదములవంటి తెలుపు గలదై, ముల్లోకములందు వ్యాపించి, అందు నలుపు లోనగు నితరవర్ణముల నెల్లను మాయించును.

'అన్న'- బతిమాలుకొనుట. 'ఆశీర్వచనంబులన్'- తెలిపించుట:— కార్యసాధనమున కైన సామ దాన భేద దండోపాయములు నాలుగింటిలో ఈయనయెడ నీతినిపుణుం డగుటచే భేదము శక్యము గాదు, పరాక్రమవంతుఁడు గావున దండము శక్యము గాదు, కడమ రెండే శక్యములు. అందు ఇంతసేపు సామోపాయము నింద్రుఁడు ప్రయోగించినాఁడు, ఇపుడు దానోపాయముం బ్రయోగించుచున్నాఁడు. 'మా' అనుటచేత అమోఘము లని భా. 'త్రి' - విశ్వ మంతట ననుట. 'మధ్యంబునన్'- ఆవరించుకొనియున్న చక్రవాళపర్వతమును దాఁటి బయటికి పో నలవి గానందున ఆచక్రవాళ మని భా. 'మండలము' - దట్టమయిన దనుట. 'కుంద కుముద'ములం జెప్పుట 'ఇందు' నియందలి కళంకము ప్రకృతోపమలో చేరలే దని తెల్పుచున్నది. అన్నిటిం జెప్పుట స్వచ్ఛతాతిరేకముచేత అసాదృశ్యాపోహార్థ మని కొందఱు; ఇట్టిది అపుష్టార్థ మని. వామనమతము - కావ్యాలంకారసూత్రమున:—

సూత్రము.— 'ఉపమానాధిక్యా త్తదపోహ ఇ త్యేకే.' వృత్తి. — "ఉపమానాధిక్యా త్తస్యా సాదృశ్య స్యాపోహ ఇ త్యేకే మన్య న్తే। యథా—'కర్పూర హార హర హాస సితం యశ స్తే'। కర్పూరాదిభి రుపమానై ర్బహుభి ర్యశసః సాదృశ్యం సంస్థాపితం భవతి। తేషాం శుక్ల గుణాతిరేకాత్."

సూత్రము.— 'నాపుష్టార్థత్వాత్.' వృత్తి. — 'ఉపమానాధిక్యా త్తదపోహ ఇతి య దుక్తం తన్న। అపుష్టార్థత్వాత్। ఏకస్మి న్నుపమానే ప్రయుక్తే ఉపమానాన్తరప్రయోగో న కఞ్చి దర్థవిశేషం పుష్ణాతి.'

'సంధా' - ప్రతిజ్ఞ చేసి యనుటచే వక్ష్యమాణ సంహారసిద్ధి నిశ్చయము సూచితము. 'ఇతరవర్ణసంహారము' యశస్సుయొక్క ధావళ్యోత్కర్షాతిశయమును సూచించును.

'ఘటింపవన్న'—ఇట సంప్రార్థనంబునందు ఎదాదులలోని దయిన 'యన్న' శబ్ద మనుప్రయుక్త మయినందున మువర్ణకమునకు వుజె వర్ణకము వచ్చినది. బా. వ్యా. క్రియా. 33, 34 లను చూ. 'త్రి జగతీ'—'త్రిలోక'మువలె త్ర్యవయవ మైన జగతి యని మధ్యమపదలోపిసమాసము గా చెప్పుకొనవచ్చును.— స్వచ్ఛంబు (సు + అచ్ఛంబు) - ఉపసర్గ యతి.

'ఘటించిన'-చో 'మే లగు' నని భావము గాన కావ్యలింగము. పదార్థములు శితి పీతాది స్వస్వవర్ణత్యాగము చేసి యశస్సంబంధి ధావళ్యముం బొందు నని యర్థము గాన తద్గుణము -

'స్వగుణము విడిచి యొకటి య। న్యగుణంబుం గొనుట తద్గుణాలంకృతి యా;
మగువకు ముంగఱ యధరపు। జిగిచేతం బడసెఁ గెంపుసింగారంబున్.' అలం.

ఇట 'స్వ' శబ్దఘటిత్రైతల్లక్షణకారికాసమన్వయార్థమై అసితాదిద్రవ్యములను ఊహించుకొనునది.

'శితి' యనుటకు 'సిత' యని పూర్వముద్రణము. 'సిత' మనఁగా తెలుపు, అది యిట నప్రసక్తము. మూలములో 'శితి' యున్నది, దానికి 'ధవళము' కూడ అర్థ మయినను ఔచిత్యముం బట్టి మేచకార్థమునే వ్యాఖ్యాతలు వచించినారు.

చ. వసుమతి వేయిపాదముల వానికిఁ బుట్టినచాయపట్టికిన్ (5-136)
విసవిస గాదు కాలొకటి; నిత్యము తండ్రి సుతుండు వోలఁగాఁ
బోసఁగదె? దీని కుత్తరము వో యిది, నీ ప్రకట ప్రతాపముం
గసమస దాఁటఁ బోయి యతిఖంజత నొందె సహస్రపాదుఁడున్. 72

వసుమతిన్ = భూమిలో (లోకములో ననుట), వేయి పాదముల వానికిన్ = వేయి కిరణములవానికి - సూర్యునికి (వేయికాళ్లు గలవాని కనియు - 'పాదా రశ్మ్యఙ్ఘ్రి తుర్యాంశాః' అమ.), పుట్టిన చాయ పట్టికిన్ = జనించిన ఛాయాదేవీసుతుఁ డైన శనికి, కాలు ఒకటి, విసవిస గాదు = ప్రసరింపదు సరిగా నడచుటకు రా దనుట), నిత్యము = ఎల్లప్పుడు (తప్పకుండ ననుట), తండ్రిన్, సుతుండు = కొమరుఁడు, పోలఁగాన్, పొసఁగదె = వలదా? దీనికిన్ = ఈప్రశ్నకు, ఉత్తరము ఇది - వో (= సుమా); (ఏ దనఁగా), సహస్ర పాదుఁడున్ = శనితండ్రి యైన సహస్ర కిరణుఁడు సూర్యుఁడు (వేయికాళ్లవాఁడును), నీ - ప్రకట ప్రతాపమున్ = ప్రసిద్ధ తేజమును ('స ప్రతాపః ప్రభావ శ్చ య త్తేజః కోశదణ్డజమ్' అమ.), కసమసన్ = తొట్రుపాటుతో, దాఁటఁ బోయి, అతి ఖంజతన్ = మిక్కిలి కుంటుఁదనమును, ఒందెన్.

ఇంద్రుఁడు తనప్రతాపముచే నలునిం బనిగొనఁ జాలక, ఉబ్బవేసి పనిచేయించుకొనువాఁడై బట్టువలె నతనిప్రతాపముం బొగడుచున్నాఁడు:—లోకములో తప్పకుండ కొడుకు తండ్రిపోలికగా నుండవలసినది; కారణగుణములు కార్యగుణముల నారంభించు నని న్యాయము; శని కుంటివాఁడు; ఈకుంటిలో ఇతనికి తండ్రిపోలిక కలదా? అని సందేహించు చుంటిమి. ఇప్పుడు నిన్ను చూడఁ గానే ఆసందేహము తీఱినది. ఎ ట్లనఁగా, నీప్రతాపమును దాఁటవలయు నని ఎగిరి యీతనితండ్రి వేయిపాదములను విఱుచుకొన్నాఁ డని తెలిసినది.—

కసమస'-తన కలవి గాని పనిం దొడంగుటచేత. 'అతి'- వేయియు పాదములుఁ విఱిగిన వని భా. సూర్యుని వేయికిరణముల మొత్తమును మించిన తేజము గలవాఁ డని భా. 'దాఁటన్' ఆకాశగమనముచే నని ధ్వని.

శనియొక్క ఖంజతకు హేతువు కానట్టిది లేనట్టిది తండ్రియొక్క ఖంజత హేతువుగాఁ జెప్పఁబడియెను గాన హేతూత్ప్రేక్ష, వాచకము లేమిచే గమ్య.

వ. అనియప్పుడు. 73

తే. 'అధిప, మా కిది పురుషార్థ' మనియె వహ్ని;
'ప్రార్థనము చేకొను' మటంచుఁ బలికె జముఁడు;
'రాజ, యన్యోపకార సంప్రభవ మైన
యశముఁ గైకొనవయ్య నీ;' వనియెఁ బాశి. 74

వహ్ని = అగ్ని. ఇది = దమయంతీసంఘటనము. పురుష అర్థము = పురుష ప్రయోజనము - జన్మసాఫల్య మనుట. జముఁడు = యముఁడు. చేకొనుము = అంగీకరింపుము - సెలవిమ్ము మనుట. పాశి = పాశాయుధుఁ డగు వరుణదేవుఁడు. అన్య ... ము = ఇతరులకు ఉపకరించుట వలననుండి పుట్టువు గలది.

## —— * నలుఁడు దూతగా నేఁగుట * ——

వ. ఇత్తెఱంగునం జాటుగర్భంబు లైన వేల్పుల వాక్య సందర్భంబు లాకర్ణించి వైదర్భీకాముకుం డయ్యును న య్యాదిగర్భేశ్వరుండు త ద్దూత్యభారంబు భరించె. రాజపుంగవు నంగీకారం బెఱింగి దేవత లతని కంతఃపుర ప్రవేశంబున కుచితంబుగాఁ దిరస్కరిణీవిద్య యుపదేశించి, 'పొమ్ము కార్యసిద్ధి యయ్యెడు' మని వీడుకొల్పిన (5-137). 75

చాటు గర్భంబులు=గర్భంబులో(లోపల) చాటువులు (స్తుతులు) గలవి. సందర్భంబులు= రచనలు. ఆది గర్భేశ్వరుండు = అగర్భ శ్రీమంతుఁడు - అనఁగా-గర్భములో నుండుట యాదిగా ఐశ్వర్యము కలవాఁడు - ఐశ్వర్యవంతుల గర్భంబులో జనించి తాను నైశ్వర్యవంతుఁ డై యున్న వాఁ డనుట. రాజ పుంగవు = రాజ శ్రేష్ఠునియొక్క

('స్యు రుత్తరపదే వ్యాఘ్ర పుంగవ ర్షభ కుఞ్జరాః
సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః.' అమ.)

తిరస్కరిణీ విద్యన్ - ఒరులకంటికి అగపడకుండునట్లు చేయువిద్య పేరు తిరస్కరిణి (వ్యు. చాటు సేయునది - తెర - దానివలె దర్శననివారకము గాన విద్యయు ఆ పేరఁ బరఁగుచున్నది.)

'అయ్యెడు మని'-'ఎడుతద్ధ్రుతంబున కచ్చు పరం బగునపుడు మకారం బగు.' బా. వ్యా.

ఉ. ఆ పర మోపకార నిధి యప్పుడు వేల్పుల రాయబార మ (6-1)
న్మోపు వహించి యా దివిజ ముఖ్యుల వీడ్కొని చిత్తవృత్తికిన్
జూపునకున్ శతాంగ రయ శుద్ధికి లక్ష్యముఁ జేసె భూతధా
త్రీ పతి రాజధాని జగతీ రమణీ మణిహారవల్లరిన్. 76

...మోపు=భారము. వహించి = మోచికొని. దివిజ = దేవ. జగతీ రమణీ మణి హార వల్లరిన్ = భూమి యనెడి యంగనయొక్క రత్న హార లత యైన (భూదేవికి స్తనాలంకార మైన - ప్రియతమము అలంకరణతమము నయిన యనుట.) భూత ... నిన్ - భూతధాత్రి = భూలోకమునకు ('జగతీ రత్నగర్భా చ భూతధా త్ర్యబ్ధిమేఖలా' అమ.) - పతి=దొర యయిన భీమరాజు యొక్క - రాజధానిన్ = పట్టణమును [రాజు ఉంపఁబడునది (పట్టణము ) రాజధాని.] చిత్త

...చేసెన్ = ఆనగరిని తలంచుచు దాని దెస చూచుచు దానికి తేరు నడపె ననుట. శతాంగ = తేరియొక్క - రయ = వేగముయొక్క - శుద్ధికిన్ = నైర్మల్యమునకు - సూటి కనుట. లక్ష్యము = గుఱి.—'రాయబార మనోక్షపు' రూపకము; 'జగతీ ... రిన్' - రూపకము.

తే. విరహభారంబుతోన యుర్వీధవుండు (6-2)
ప్రబల మగు దేవ కార్య భారము భరించె
నౌర్వశిఖితోన జలరాశియంబుపూర
మౌర్వశేయుండు భరియింపఁ డయ్యె నెట్లు? 77

ఉర్వీ ధవుండు = రాజు, విరహభారంబుతోన = దమయంతీవియోగముయొక్క బరువుతోఁ గూడనే, ... ఔర్వశేయుండు = ఉర్వశీపుత్త్రుఁడైన యగస్త్యుఁడు, ఔర్వ శిఖితోన = బాడబానలముతోఁ గూడనే ('ఔర్వ స్తు బాడబో బడబానలః' అమ.), అంబు పూరము = నీటి మొత్తమును, ఎట్లు భరియింపఁ డయ్యెన్ = భరించి యుండ లేదా. ఔర్వమువంటిది వియోగ వేదన, జలరాశివంటిది దేవకార్యము, అగస్త్యునివంటివాఁడు రాజు, అని బింబప్రతిబింబ భా.

అగస్త్యమహాముని ఔర్వానలమును బాధకముగా నెంచక సముద్రపూరమును కడుపులోనుంచుకొన్నట్లే, నలరాజు దమయంతీ వియోగమును అంతరాయముగా నెంచక దేవకార్యమును పూనుకొనె నని యర్థము.— 'తే తే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థం పరిత్యజ్య యే' అని భర్తృహరి చెప్పినట్లు, నలమహారాజు తనకష్టమును చూడక ఒరుల కుపకారము చేయఁ గడంగిన మహానుభావుఁడు సుమా యనుట; శాకుంతలములో దుష్యంతుని శార్ఙ్గరవుఁడు ఈ భావముగానే స్తుతించినాఁడు:—

'స్వసుఖ నిరభిలాషః ఖిద్యసే లోకహేతోః;
ప్రతిదిన మథవా తే వృత్తి రేవం విధైవ;
అనుభవతి హి మూర్ధ్నా పాదప స్తీవ్ర ముష్ణం,
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్.'

ఇందు నలుని కృపాతిశయముచే తదీయ ధీరోదాత్తత సూచింపఁబడినది.—

'గమ్భీరః సారసంపన్నః కృపావా నవికత్థనః
పరకీయగుణగ్రాహీ ధీరోదాత్తో నిగద్యతే.' సా. ర.

దృష్టాంతాలంకారము. రెండువాక్యములందును భరించుట యొకటే ధర్మ మనియు దానంజేసి ప్రతివస్తూపమ యనియు తలంపఁగూడదు. ఏల యన, భరించుట ఔర్వశేయుని పక్షమందు వాస్తవముగా మోచుట, రాజుపక్షమందు పూనుకొనుట, అని యర్థభేదముచే ధర్మభేదము కలదు.

మ. బలభిద్వహ్ని పరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం (6-3)
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబున
న్నల నాళీక మృణాళ నాళ లతికా నవ్య ప్రణాళీ మిళ
ల్లల నాలాప కథా సుధానుభవ లీలా లోల చేతస్కులై. 78

బలభిద్ వహ్ని పరేత రాజ వరుణుల్ = ఇంద్రాగ్ని యమ వరుణులు, నల ... లు - నల = నలమహారాజనెడి - నాళీక మృణాళ = తామర తూఁటియొక్క - నాళ లతికా = తీఁగ

వంటి గొట్టు మనెడి-నవ్య = అపూర్వ మయిన-ప్రణాళీ=నీటి పోకడదారియందు - మిళత్ = కూడు చున్న - లలనా = దమయంతియొక్క- (దమయంతి చెప్పెడి)- ఆలాప=మాటలయొక్క- - కథా = వృత్తాంత మనెడి - సుధా = అమృతముయొక్క- - అనుభవ లీలా = ఆస్వాదన కేళి యందు - లోల = ఆస గొని యున్న - చేతస్కులు=మనస్సులు గలవారు, ('మృణాళం బిసమ్' అమ. 'నాళం తు న స్త్రియాం కాణ్డే క్లీబే వివర శేషయోః' నానా. 'ద్వయోః ప్రణాళీ పయసః పదవ్యామ్,' 'లోల శ్చల సతృష్ణయోః,' 'చిత్తం తు చేతో హృదయమ్.' అమ.), ఐ, పర్యుత్సుకత్వంబు సంధిలన్ = ఉవ్విళ్లూరుచు ('ఇష్టార్థోద్యుక్త ఉత్సుకః' అమ.), ఒండొరుం, కదిసి = సమీపించి, అర్థిన్ = కోరికతో, తత్ప్రదేశంబునన్ = ఆ చోట, కూర్చుండిరి = కను పెట్టుకొని యుండిరి.

ఇంద్రాదిదేవపతులు నలమహారాజనెడి తామరతూఁటిగొట్టమువలన దమయంతీప్రత్యుత్తర మనెడియమృతముం బీల్చుకొని త్రాగుటకు ఆచోటనే కనుపెట్టుకొనియుండిరి.—దమయంత్యంగీకారమును అచటికే వచ్చి చెప్పునట్లు నలుని కానతిచ్చినవారై, వారు ఆతని నెదురుచూచుచు అచటనే వేచి యుండి రనుట.—ఉత్తరార్ధమున రూపకము.

ఇందు శ్రీనాథుఁడు ప్రథమపురుషేకారమునకు ప్రకృతిభావము చేసె ననియు, 'నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః' అను నాంధ్రశబ్దచింతామణిసూత్రముచేత అది బాధిత మనియు,

"విరచించెను శ్రీనాథుఁడు । ధరణిని శృంగారనైషధంబునఁ 'గూర్చుం
డిరి యొండొరు' నని కానక । పరపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే?"

అని అప్పకవి యాక్షేపించినాఁడు. చిన్నయసూరి మతమున ప్రథమపురుషేకారసంధి వైకల్పికము.

**తే. అమ్మహారథు రథము డాయంగ నరిగె, (6-4)**
**సత్వరమున విదర్భరాజన్యు వీడు,**
**సార మగు భాగ్యవంతు మనోరథంబు**
**కార్యసంసిద్ధి వోలె నస్ఖలిత లీల. 79**

అమ్మహారథు రథము = మహారథుఁ డయిన యా నలుని తేరు, మహారథునిస్వరూపము -

'ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్
అస్త్రశస్త్రప్రవీణ శ్చ మహారథ ఇతి స్మృతః.'

సారము = శ్రేష్ఠము - అగు - భాగ్యవంతు నియొక్క - మనోరథంబు = కోరిక, అస్ఖలిత లీలన్ = తప్పిపోని ప్రకారముతో, సత్వరముగన్ = త్వరగా, కార్య సంసిద్ధి పోలెన్ = కార్యసిద్ధిని ఎట్లు డాయంగ నరుగునో అట్లు, (సత్వరముగన్ = త్వరగా,) అస్ఖలిత లీలన్=(దారిలో) తడఁబడని ప్రకారముగా, విదర్భరాజన్యు వీడు = భీమరాజు పట్టణమును (రాజన్యుఁడు=రాజు కొడు కైన రాజజాతివాఁడు), డాయంగ నరిగెన్ = చేరం జనియెను.— 'నలుఁడు అశ్వహృదయవేదియు మహారథుండునుం గావున పుణ్యాత్ముని కోరిక అవిలంబితముగా సిద్ధిం బొందునట్లు స్వల్పకాలములోనే గంతవ్యముం బొందినాఁ డనుట.— ఉపమాలంకారము.

**మ. దమయంతీ సుకుమార పాదకమలద్వంద్వార్పణా ధన్య కు (6-5)**
**ట్టిమహర్మ్యం బగు పట్టణం బవుడు గంటిన్ మంటి నం చెంతయుం**

ప్రమదం బందె, దిగీశకార్యఘటనా భారంబు చింతించి దీ
ర్ఘము నుష్ణంబునుగా నొనర్చె ధరణీకాంతుండు నిశ్వాసమున్. 80

ధరణీ కాంతుండు = భూ వల్లభుఁ డయిన నలుఁడు, అపుడు = తాను కుండినపురి చేరి నప్పుడు, దమ...బు=దమయంతియొక్క కోమలము లయిన చరణసరోజముల కవయొక్క న్యాసముచేత పుణ్యవంతము లయిన ('సుకృతీ పుణ్యవాన్ ధన్యః' అమ.) నెలకట్లు గల ('కుట్టిమోఽస్త్రీ నిబద్ధా భూః' అమ.) మేడలు గలది ('హర్మ్యాది ర్ధనినాం వాసః' అమ.), అగు - పట్టణంబు = (కుండిన) నగరమును, కంటిన్ = చూచితిని, మంటిన్ = బ్రదికితిని (ఏతద్దర్శనము చేత జన్మసాఫల్యముం బొందితి ననుట), అంచున్, ఎంతయున్ = మిక్కిలి, ప్రమదంబు = సంతోషమును, అందెన్ = పొందెను. (అంతలో), దిగీశ కార్య ఘటనా భారంబున్=దిక్పాలకులయొక్క కార్యమును నెఱవేర్చు పూనికను, చింతించి = తలంచుకొని, ఉష్ణమున్ దీర్ఘమున్ కాన్ నిశ్వాసమున్ ఒనర్చెన్ = వేఁడి నిడుద యూరుపుం బుచ్చెను.

నలుఁడు అంతట దమయంతి యుండుపురిం జేరితిం గదా యని హర్షించి, అంతలో, దిక్పాల దూత్యముకొఱకే గదా యని విషాదముం జెందెను.—

'హర్ష స్త్విష్టావాప్తే ర్మనఃప్రసాదోఽశ్రుగద్గదాదికరః.'
'ఉపాయాభావజన్మా తు విషాదః సత్త్వ సంక్షయః,
నిశ్వా సోచ్ఛ్వాస హృత్తాప సహాయాన్వేష ణాది కృత్.' సా. ద.

ఇట హర్ష శాంతి విషాదమునకు అంగము గాన సమాహితాలంకారము—

'భావింతు సమాహిత మని । భావశమన మంగము రసభావములకుఁ గాన్;
'రాత్రిఁ గడపి వచ్చినహరి । సాత్రాజితి తన్నె వామచరణంబున, నా
క్షేత్రజ్ఞుఁ డర్మిలిం దన । గాత్రములం దానిఁ దాల్పఁగా సతి నవ్వెన్.' అలం.

వ. ఇట్లు కుండిననగరంబు చేరం జనుదెంచి, యప్పురుషప్రకాండుండు వలయునమాత్యులం దగినవారల నొక్కరమ్య ప్రదేశంబున సైన్యంబు విడియ నియమించి, బృందారక సందేశ కార్యంబు నిర్వర్తింపం దలంచి, ససారథికం బగు రథంబు నచ్చోట నిలిపి, యొక్కరుండునుఁ బాదచారంబున నప్పురంబు ప్రవేశించె నప్పుడు (6-7). 81

పురుష ప్రకాండుండు = పురుష శ్రేష్ఠుఁడు ('మతల్లికా మచర్చికా ప్రకాణ్డ ముద్ఘ తల్లజౌ । ప్రశ స్తవాచకా న్యమూని' అమ.) సైన్యంబు విడియన్ = దండు దిగునట్లుగా. బృందారక సందేశకార్యంబు=దేవతలయొక్క పను పయినట్టి పనిని, నిర్వర్తింపన్ = నెఱవేర్చుటకు. ససారథికంబు = సారథితో కూడ నున్నట్టిది. పాదచారంబునన్ = కాలి నడకను.

శా. చూడం జూడఁగ దేవతావరమునం జోద్యంబుగా భూమిభృ (6-8)
చ్చూడా రత్న మదృశ్యుఁ డయ్యె నతఁ డచ్చో, నద్భుతం బంద న
వ్వాడం బౌరజనంబు లెల్ల 'నితఁ డెవ్వాఁడొకొ? నేత్రోత్సవం
బై డాయం జనుదెంచె, నంతటను మాయం బయ్యె!' నం చెంతయున్.82

చూడం జూడఁగన్ = జనులు చూచుచుండఁగానే, భూమి భృత్ మౌళీ రత్న మతండు = రాజ శిఖా మణి యయిన యా నలుఁడు, అన్చోటన్ = అందఱు చూచుచున్నచోటనే, అవ్వాడన్ = ఆవీథిలో, పౌరజనంబులు = పురసంబంధు లయిన జనులు, ఎల్లన్ = అందఱును, ఇతఁడు, డాయన్ = చెంతకు, చనుదెంచి = వచ్చి, అంత...అంచున్, ఎంతయున్=మిక్కిలి, అద్భుతం బందన్ = ఆశ్చర్య పడునట్లుగా, దేవతావరమునన్ = దేవతావరముచేత, చోద్యంబుగాన్ = ఆశ్చర్యకరముగా, అదృశ్యుఁ డయ్యెన్ = కనఁబడక పోయెను.

వ. ఇట్లంతర్హితుం డై రాజమార్గంబున నిరర్గళవేగంబునం జని యారాజ కుంజరుండు మద కుంజర ఘటా సుందరం బగు రాజమందిరంబు డాసి.(6-9) 83

అంతర్హితుండు = అదృశ్యుఁడు. నిరర్గళ వేగంబునన్ =అడ్డులేని వడితో, రాజ కుంజరుండు = రాజోత్తముఁడు, మద కుంజర ఘటా సుందరంబు = మదపు టేనుఁగుల సమూహముచే నందము ('మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ,' 'కరిణాం ఘటనా ఘటా' అమ.)

సీ. వంచనమై డాఁగి వర్తించు టిది యేమి (6-10)
ప్రాభవం బని సిగ్గుపాటు నొందు;
నాయుధహస్తులై యాయితం బై యున్న
రక్షివర్గముల తీవ్రతకు నవ్వు;
నది యెవ్వ రని ప్రతీహారు లెవ్వరి నన్నఁ, (6-12)
దన్నుఁగాఁ దలఁచి చిత్రముగ నొదుగు;
నెదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల
కొయ్యనఁ దెరు విచ్చి యోసరిల్లుఁ;
తే. దలఁచి తలఁచి యలీకమై దర్భిఁ గాంచుఁ; (6-17)
గాంచి వేల్పుల ప్రియవాచికంబు నొడువు;
నొడివి తనమాట కచ్చెరువడు జనంబు
క్రందుసందడిఁ దెలివొందు రాజసుతుఁడు. 84

వంచనమైన్= మోసముచేత (అదృశ్యముగా డాయుట మోసము. 'మైన్' - ఇది కొన్ని యెడల తృతీయావిభక్తికి మాఱుగా వచ్చును.) ప్రాభవంబు = పరాక్రమము.

ఆయితంబు = సిద్ధము. రక్షివర్గముల తీవ్రతకున్=కావలివాండ్ర (వట్టి) తీవరమునకు.

ప్రతీహారులు=ద్వారపాలకులు ('ద్వారి ద్వాఃస్థే ప్రతీహారః ప్రతీహా ర్యప్యనన్తరే' అమ.- ప్రతీహారుఁడు, ప్రతిహారుఁడు ప్రతీహారి ప్రతిహారి-ఇవన్నియు ద్వారపాలకుని పేరులు, తుదిరెండును ద్వారపాలకురాలికిం గూడ పేరులు, వీనికి బహువచనములు ప్రతీహారులు, ప్రతిహారులు; పద్యములో రెండురూపములకు ఛందస్సు అనుకూలమే.) చిత్రముగన్ = వింతగా (చిత్ర మీ మనఁగా, తాను వారికి కనఁబడుచున్నట్లు భ్రమపడుటయు అనావశ్యకముగా లోఁగుటయు. పా. 'చిత్తమున'- 'చిత్తమునఁ దలఁచి' అని యన్వయించుకొనవలయును), ఒదుగున్ = ఓసరిల్లును.

ఇందీవర అక్షులకున్ = నల్లగలువలవంటి కన్నులుగల యువిదలకు, ఒయ్యనన్=తిన్నఁగా.

తలఁచి తలఁచి = నిరంతర భావనా బలముచేత, అలీక వైదర్భిన్ కాంచున్ = మిథ్యా దమయంతిని చూచును (దమయంతి యగపడిన దని భ్రమపడు ననుట - 'అలీకం త్వప్రియేఽనృతే' అమ.) వాచికంబు=సమాచారము ('సందేశవా గ్వాచికం స్యాత్' అమ.) నొడువున్ = వచించును. జన...డిన్= జనులయొక్క గుంపుయొక్క (మానిసి కనఁబడక మాటమాత్రము వినఁబడిన యాశ్చర్యమును వారొండొరులతో చెప్పుకొనెడి) ధ్వనిచేత, తెలివి ఒందున్=(భ్రాంతివైదర్భికడ వాచికము పలికిన) పొరఁబాటును తెలిసికొనును ( ఇత్వసంధి - 'తెలివొందు' అని 2 ఆ. 39 ప. లోఁ గూడ నున్నది.)

వ. ఇవ్విధంబున నేనుంగుమొగసాల గడచి కక్ష్యాంతరంబులు ప్రవేశించి యంతఃపురంబు సొత్తెంచె నప్పుడు. 85

ఏనుంగు మొగసాల= యామకుంజరము లుండెడి ముఖశాలను. కక్ష్యా అంతరంబులు=వేఱు తొట్టికట్లు.

చ. ప్రిదిలిన నీవిఁ గేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి, లోఁ (6-13)
గదిరిన పాపభీతి బడిఁ గన్నులు మోడ్చ, నొకళ్లొకళ్లకై
యెదురుగ వచ్చివచ్చి యొక యిద్దఱు ముద్దియ లొత్తి రవ్విభున్
మద గజరాజ కుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్. 86

ప్రిదిలిన నీవిన్ = వదలిన పోఁకముడిని, సవరించు తల ఉదరిన్ = బిగించుకొనుచున్న సన్నని నడుముదానిని, ఓర్తున్ = ఒకతను, కాంచి = చూచి, లోన్ = మనస్సులో, కదిరిన పాపభీతిన్= కలిగిన పాపభయముచేత, బడిన్ = వెంటనే, ('పడి' అని క్త్వార్థకముగాఁ గొన్నంబునరుక్తిదోషము కలుగును), కన్నులు, మోడ్చన్ = ('నగ్నాం చేక్షేత న స్త్రియమ్' అను ధర్మశాస్త్రవచనముం బట్టి) మూసికొనఁగా (మూసికొన్నట్టి), అవ్విభున్ = ఆనలుని, ఒకళ్లు ఒకళ్లకై = ఒకతెకోస మొకతె, ఎదురుగన్ = ఒండొరులకు ఎదురుగా, వచ్చివచ్చి ఒక యిద్దఱు-ముద్దియలు = మగువలు, మద గజరాజ కుంభములన్ = మత్త గజేంద్రముల కుంభస్థలములతో, మచ్చరికించు = చలపట్టునట్టి (ఉపమావాచకము) - కుచద్వయంబులన్ = చనుఁగవలతో (ఇద్దఱవి గాన బహువచనము - కన్నులు మూసికొనియున్నాఁడు గాన తప్పించుకొనలేదు.)

[అదృశ్యుఁ డొకయాజానుబాహుఁడు తమ యిరువురనడుమ నొత్తుఁబడినందులకు ఆకుచ ద్వంద్వవతులు ఆశ్చర్యపడకుందురా? అంతఃపుర మంతయు గందరగోళ పెట్టియుండరా? రసికు లరసికొందురు గాక యని అవిషయమును కవి తాను ప్రస్తావింపక మానెఁగావలయును.]

వ. మఱియు శుద్ధాంతభవనాంతరంబులఁ జరియించువాఁడు హృదయోత్కంఠాతిరేకంబున. 87

శుద్ధాంత భవన అంతరంబులన్= అంతఃపుర గృహంబుల లోపల. హృద...నన్-హృదయ =మనస్సులోని - ఉత్కంఠా = తమకముయొక్క

(' రాగే త్వలబ్ధవిషయే వేదనా మహతీ తు యా
సంశోషణీ తు గాత్రాణాం తా ముత్కంఠాం విదు ర్బుధాః.') -

అతిరేకంబునన్ = అతిశయముచేత.

సీ. సమనుభూ తానాది సర్గపరంపరా (6-14)
 స్రక్సమాకలిత సంసర్గముననొ,
లలిత కేళీచిత్రఫల కాభివిలిఖిత
 ప్రతిమా విలోక నాభ్యాసముననొ,
యాస్వాదనీయ విహంగపుంగవ గవీ
 హైయంగవీన పా నాభిరతినొ,
భువనైకమోహ నాద్భుత శంబరారాతి
 శాంబరీ లీలా విడంబముననొ,
తే. వివిధ సంకల్ప కల్పనా వేశముననొ
 కన్నెక్రొక్కాఱు మెఱుఁగుఁదీగయనుబోలెఁ
బొలిచి యప్పుడ యడఁగుపూఁబోఁడిమూర్తి
 నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు. 88

ఆ కుమారుండు = నలుఁడు, సమ ... నొ - సమనుభూత = చక్కఁగా అనుభవింపఁబడిన - అనాది = ఆది లేని - సర్గ = సృష్టులయొక్క (జననములయొక్క అనుట- 'సర్గః స్వభావ నిర్మోక్ష నిశ్చయాధ్యాయ సృష్టిషు' అమ.) - పరంపరా = వరుస యనెడి - స్రక్ = పూమాలికయందు ('మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని' అమ.) - సమాకలిత = సంఘటించిన - సంసర్గముననొ = సంబంధముచేతనో-

['పున శ్చిరాయుః సా భూత్వా జాయతే విమలే కులే,
పతివ్రతా తు యా నారీ తమేవ లభతే పతిమ్.' అని స్మృతియును,
'సతీవ యోషిత్ ప్రకృతి స్సునిశ్చలా
పుమాంస మభ్యేతి భవాన్తరే ష్వపి.' అని మాఘపండితుఁడును,
చెప్పినట్లు, పతివ్రత యెల్లజన్మంబులందును ఆపతికే పత్ని యగును గాన, అట్లు గలిగిన పూర్వజన్మ పరంపరా సంబంధముచేతనా ;]

లలి ... నొ - లలిత = ఈప్సితమై ('లలిత మీప్సితే । లడితే హావభేదే స్యాత్' అని రామాశ్రమిధృతము) - కేళీ = క్రీడార్థమై - చిత్రఫలక = చిత్తరుఁబలకయందు - అభివిలిఖిత = వ్రాయఁబడిన - ప్రతిమా = (దమయంతి) బొమ్మయొక్క - విలోకన = చూచుటయొక్క- అభ్యాసముననొ = అలవాటుచేతనో; [జన్మాంతరసంబంధము మరణముచే బొత్తిగా విస్మృతమగును గాన, వైకల్పము సరి కా దని, ఇట చిత్రావలోకమును చెప్పినాఁడు; - 'అభ్యాసము' లేనిచో నలుదిక్కుల నగపడుట నూపపన్నము గాదు.]

ఆస్వా ... నొ - ఆస్వాదనీయ = ఆస్వాదింపఁదగిన - విహంగపుంగవ = పక్షిశ్రేష్ఠ (మయిన హంస)మయొక్క - గవీ = వాక్కనెడు - హైయంగవీన = సద్యోఘృతము యొక్క - పాన = త్రాగుటయందలి - అభిరతినొ = ఆసక్తిచేతనో [సద్యోఘృతమువలె రుచ్యములయిన హంసకృత దమయంతీరూప వర్ణనావాక్యములను మాటిమాటికి తలపోయుచుంటచేతనో;]

భువ ... నో - భువన = లోకములయొక్క (లోకములను - లోకస్థుల ననుట) - ఏక మోహన = ముఖ్యముగా (తప్పకుండ) మోహపెట్టెడి (శాంబరికి విశేషణము) - అద్భుత=వింతయైన ('విస్మయోఽద్భుత మాశ్చర్యమ్' అమ.) - శంబర అరాతి = శంబరాసురునికి శత్రువైన మన్మథునియొక్క - శాంబరీ = మాయయొక్క ('స్యా న్మాయా శామ్బరీ' అమ.) - లీలా = క్రీడార్థ మయిన - విడంబముననో = దమయంతీ సదృశ రూపనిర్మాణముచేతనో - లేక - వంచనచేతనో - లేక - పరిహాసముచేతనో [విడంబ (= విడంబన=విడంబనా) శబ్దమునకు అనుకరించుట, మోసగించుట, హసించుటయు అర్థములు:—

'నయనా న్యరుణాని ఘూర్ణయన్ వచనాని స్ఖలయన్ పదే పదే
అసతి త్వయి వారుణీమదః ప్రమదానా మధునా విడమ్బనా.' కుమా.
('విడమ్బనా - అనుకృతిమాత్రమ్' మల్లి. వ్యా.)
'నో చే దేతేషాం సకాశా ద్విడమ్బనాం ప్రాప్య మరిష్యసి.' పంచ.
'ఇయం చ తేఽన్యా పురతో విడమ్బనా య దూఢయా వారణరాజహార్యయా
విలోక్య వృద్ధోక్ష మధిష్ఠితం త్వయా మహాజనః స్మేరముఖో భవిష్యతి.' కుమా.
('విడమ్బనా - పరిహాస ఇత్యర్థః' మల్లి. వ్యా.)

మన్మథుఁడు వినోదార్థము (లేక నలవంచనార్థము - లేక నలపరిహాసనార్థము) ఆమెరూపములను మాయచేత కల్పించి చూపుటచేతనో;]

వివిధ ... నో - వివిధ = నానాప్రకారము లయిన - సంకల్ప = భావనలచేత నైన - కల్పనా = నిర్మాణముయొక్క - ఆవేశముననో = ప్రవేశముచేతనో (తా నెప్పుడును దమయంతిని మనస్సులో కల్పించుకొను చుండినందుననో), క్రొత్తకారు మెఱుఁగుఁ దీఁగయును బోలెన్ = నూత్నమయిన (తొలకరియాదిలోని) మెఱుపుఁదీఁగవలె, పొలిచి = తోఁచి (అగపడి యనుట), అప్పుడ = వెంటనే, అడఁగు పూఁబోఁడి మూర్తిన్ = అదృశ్య మగు దమయంతీ స్వరూపమును, నలుదిక్కులందున్ = అన్ని దెసలను, కాంచున్.—

దమయంతి యుండుతావు గావునను తదేకాయత్తచిత్తుఁ డగుటచేతను ఎక్కడఁబట్టిన నక్కడ ఆమె తనకుఁ గనఁబడినట్లు ఆతఁడు భ్రమపడుచుండె నని తా.

భ్రాంతిదర్శనమునకు హేతువులు కాని వానిని హేతువులుగా నూహించుటచేత హేతూత్ప్రేక్ష. తొలకరి మెఱుపునకుం బోల్చుట యుపమ. దమయంతి యను నొకవస్తువు ('నలుదిక్కులందు') ఉన్నట్టు వర్ణించుట విశేషాలంకారభేదము:—

'(1) ప్రాకట మగునాధారము । లే కాధేయంబు రాజిలి విశేష మగున్,
(2) ఏక మనేకగతంబున్ । (3) స్తోకారంభమున నన్యదుర్ఘటకృతియున్;
(1) పోకార్చును జీఁకటి దీ । పాకరములు భానుకరము లాతఁడు గ్రుంకన్,
(2) ఆకోమలి గనుదు నెల్లెడ । (3) నా కయ్యెను గల్పదర్శనము నినుఁ గనుటన్.' అలం.

ఉ. పోరణగండిమార్గమునఁ జొచ్చినసన్న నిగాలి యొక్కయుం (6-31)
భోరుహపత్త్రినేత్త్రినునుఁబొంకపుఁజన్నులమీఁది సన్న పుం
జీర చెఱంగు పాయుగలఁ జేసిన, విశ్వధరాతలేశ్వరుం
డోర యొనర్చెఁ జూపభయ మొందఁ నిజాననచంద్రబింబమున్. 39

సౌరణగండి మార్గమునన్ = కిటికీ దారిని, ... సన్నని = మందమయిన - గాలి (కర్త), ఒక్క...చెఱంగు = తామర రేకులవంటి కన్నులు గలదైనయొక తెయొక్క సన్నని వస్త్రపు... చెంగును, పాయగిలన్ = తొలఁగునట్లు, చేసినన్ = చేయఁగా, విశ్వ ధరా తల ఈశ్వరుండు = సర్వ భూ మండ లాధిపతి యైన నలమహారాజు, పాప భయము = పాపమువలని వెఱపును - ఒంది = పొంది (చూచినచో పాపము వచ్చునని భయపడి), నిజ ఆనన చంద్ర బింబమున్ = తన దైన మొగ మనెడి జాబిల్లి మండలమును, ఓర యొనర్చెన్ = ప్రక్కగాఁ ద్రిప్పెను.

'సౌరణగండి'—ఆస్త్రీ పైనున్నది గాఁబట్టి చక్కఁగాఁ గనఁబడినది. 'అంభోరుహపత్త్రనేత్ర' తక్కడమ యవయవముల సౌందర్యమునకు ఉపలక్షకము. అట్లే స్తనములు నునుపుగాను బింకముగాను ఉన్నవి. చీరచెఱంగు 'సన్నము' గాన సన్నగాలియు పాయగిలఁ జేయఁగలిగినది. 'సన్న' చీరయు ఆభిజాత్యమును సూచించుచున్నది. 'విశ్వ...ండు' - అంతగొప్పవాఁడు ధర్మసంస్థాపన చేయవలసినవాఁడు అధర్మమునకు వెఱవ కుండఁడు; - 'ఓర యొనర్చుట' నలుని జితేంద్రియత్వమును తెలుపుచున్నది. ఇంకను ఏమి కనవట్టునో అను భయమును కూడ తెలుపుచున్నది.

'సౌరణగండ్లు' - ఈశబ్దము వ్యస్తముగా నిత్యబహువచనాంత మనియు, వృత్తియందు 'సౌరణగండి' అని ఏకవచనాంత మనియు సీతారామాచార్యులవారు తెలిపియున్నారు.

తే. ఇరులు గెలిచిన యంతఃపు రేందుముఖుల (6-19)
కురులు మరుఁ డను వేటకాఁ డురులు సేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులు లేని దృక్ఖంజన శాబకముల. 90

మరుఁడు = మన్మథుఁడు....ఇరులు = చీఁకటిని,...అంతః...లు = అంతఃపురములోని చంద్ర వదనల ముంగురులను, ఉరులు = వలలుగా,... మనుజవిభుని= నలునియొక్క, సరులు = సదృశములు,... దృక్ ఖంజన శాబకములన్=నేత్రము లనెడి కాటుకపిట్ట పిల్లలను ('పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః శిశుః' అమ.), మరులు కొలుపంగ లేఁడ య్యెన్ = వలపింప నేరక పోయెను.

రాజు కేవలము జితేంద్రియుఁ డని తా. ఎవరిపై మరులు కొలుప లేకపోయెను? ఆ'యంతఃపురేందుముఖుల' పై నని యూహ్యము. 'మనుజవిభుని' అను పదము మీఁది 'యొక్క' ప్రత్యయము లోపించినది. 'యొక్కకు లోపంబు బహుళంబు.' ప్రౌ. వ్యా. కారక. 16.

ఇట మరులుకొనుట ( = వలచుట) దృక్కార్యము గాని ఖంజనశాబక కార్యము గాదు; కావున ప్రకృతక్రియోపయోగార్థ మై ఖంజనశాబకములు దృగాత్మతాపరిణతి నపేక్షించుచున్నవి. 'ఖంజనశాబకముల వంటి దృక్కులను' అని ఉపమితసమాసముగాఁ గొనుటకు 'మరుఁ డను వేటకాఁడు' ఇత్యాదికము బాధించును. అట్లే వేటకానికిని ఉరులకును తత్తద్విషయాత్మతాపరిణతి వలసియున్నది. కావున పరిణామము. ఇరులు కురులు మరులు సరులు అనుశబ్దావయవ సామ్యము అంత్యానుప్రాసము.

ఉ. 'కట్టపుఁబ్రత్యవాయ మిది గల్గుచు నున్నది మీలనక్రియా (6-22)
స్పష్ట విలోకనంబుల; నపాంగవుఁ జూ పనురాగ విక్రియా

పుష్టికరం; బబాహ్యగృహ భూమిం బ్రచారము సేయుచోట నా
దృష్టికి మార్గ మొండు గలదే?' యని చింత వహించె గా జెదన్. 91

రాజు, మీలన క్రియా స్పష్ట విలోకనంబులన్=మూసికొను వ్యాపారముచేతను (మూసికొనుటచేత ననుట) స్పష్ట మైన చూపులచేత, కష్టపుం బ్రత్యవాయము ఇది = ఈకష్టపు దోషము (86, 89 ప. చూ.), కల్గుచునున్నది; అపాంగపుం జూపు = కడకంటి వీక్షణము, అనురాగ విక్రియా పుష్టి కరంబు = ప్రేమ దోషమునకు పెంపు చేయునది, అబాహ్య ... మిన్ = అంతఃపురగృహముల తావునందు, ప్రచారము = సంచారము, చేయు చోటన్ = చేయు సమయమందు, ... ఒండు = వేఱు, మార్గము = విధము, ... ఎదన్ = హృదయములో.

కన్నులు మూసికొన్నంతట ఇరువురు గుబ్బెతలు ఎదురెదురుగా వచ్చి నడుమను ఒత్తివైచిరి. తెఱచినచో స్తనాదులు కనఁబడుచున్నవి. ఇట్టి ప్రత్యవాయము కలిగించును గాన కన్నులు మూసికొనుటయు తెఱచుటయు సరి గాదు. క్రేఁగంట చూతునా?' యనిన, అట్టిచూపు కామవికార పోషకము కావున అదియుం బనికి రాదు. ఈ యంతఃపురమందలి తావులో ఈసంచరించుటయందు నాచూడ్కికి వేఱు తీరు లేదే, ఏమి సేయుదును? - అని రాజు చింతపడసాగెను.

తే. రాజ శుద్ధాంత భామినీ రత్న రాజి (6-23)
దీము గావించి వలరా జధీశు నేసె;
నతనితాల్మికి నది పూజ యయ్యె. నట్ల,
యతనుతూపులు పుష్పంబు లౌనొ కావె. 92

వలరాజు = మన్మథుఁడు, రాజ...జిన్ = (విదర్భదేశపు) ఱేని యంతిపురి యువిద మిన్నల వరుసను ('శ్రేణీ రేఖా స్తు రాజయః' అమ.), దీము = ఆకర్షకముగా (స్వతంత్ర పక్షిమృగాదులను బట్టుటకై వేటకాఁడు ఒగ్గునట్టి పెంపుడు పక్షిమృగాదులు దీము దీమము అనఁబడును), కావించి = పెట్టి, అధీశున్ = నలమహారాజును, ఏసెన్=బాణములతోఁ గొట్టెను; అతను తూపులు = మదనుని బాణములు, పుష్పంబులు ఔనో కావో = పువ్వులే గదా, (అందువలన), అది ఆబాణప్రయోగము, అతని తాల్మికిన్ = నలుని యింద్రియనిగ్రహమునకు, పూజ యయ్యెన్.

మదనుఁడు అత్యంతఃపురమందు ఎట్టిసుందరీమణులను జూపియు నలుని వలపింప లేఁడాయెనని తా. — ఇచట మదనునికి నలజయరూపేష్టార్థాసిద్ధితోడి తత్పూజారూపానిష్టావాప్తి కథితము గావున విషమాలంకారము తృతీయ భేదము.

ఉ. చీటికిమాటి కేకపథ సీమ మెలంగఁగఁ బాటు గామి శృం (6-24)
గాటకవీథి కేఁగెఁ బతి కాంతలసందడి కల్కి; యైన; న
ప్పాట వసించి యుండుట యుపాయమె? నాలుగు త్రోవలందునుం
బాటలగంధు లొక్కటతఱిం బైకొనివచ్చినఁ జిక్కుఁ జిక్కఁడే?(6-27) 93

పతి = నలుఁడు, చీటికి మాటికిన్ = మాటి మాటికిని, ఏక పథ సీమన్ = ఒక్క దారి యంచున ('సీమ సీమే ఇమే క్షేత్రే కూల మర్యాదయో రపి' నానా.), మెలంగుట = సంచరించుట, పాటి కామిన్ = వలను పడకుండున, కాంతల సంగడికిన్ = నితంబినుల సామీప్యంబునకు

(తాఁకుడునకు), అల్కి = వెఱచి, శృంగాటక పీఠికిన్ = చదుకమయిన (నాలుగుదారులు కలసిన - 'శృఙ్గాటక చతుష్పథే' అమ.) మార్గమునకు, ఏఁగన్ = పోయెను. ఐనన్ = కాని, అప్పాటన్ = ఆ విధముగా, వసించి యుండుట = నిలిచి యుండుట, ఉపాయమె = ఉపాయమెట్లగును - కాదనుట, (ఏల యన), నాలుగు త్రోవలందునన్ = (చదుకముగాన) నాలుగు ప్రక్కలనుండియు, పాటలగంధులు = పాదిరి పువ్వుల పరిమళమువంటి పరిమళము గల చెలువలు, ఒక్కతటిన్ = ఏక కాలమందు, పైకొని వచ్చినన్ = మీఁదికి వచ్చినయెడల, చిక్కుఁ జిక్కఁడో = ఇఱుకుకొనునా ఇఱుకుకోఁడా (ఇఱుకుకొనును.)

నలునికి ఎదురుగాను వెనుకనుండియు వచ్చుచున్న నెలఁతలకొఱకు దారి తొలఁగుటకై మాటిమాటికిని ఒక్కదారియోరకే ఒదుగుట శక్యము గాక పోయెను. అంత నాతఁడు, ఇంతులు తగులుదు రని భయపడి నాలుగుదారులు కలియు చదుకమునకుం బోయి నిలిచెను. అది మాత్రము ఉపాయమా? అచ్చట నాలుగు దారులనుండి నలువురు ఒక్కమొగినే వచ్చి నలుప్రక్కలం బొడివిన, నితఁడు వారినడుమ ఇఱుకుకొనక తప్పదు గదా.—ఒకతెను ఇద్దఱను తప్పించుకొనఁ బోయిన నలువుర నడుమం దగులుకొనవలసినట్లు ఉన్నది, అని భా.

'ఏకపదిసీమ' అని యొకపాఠము - త్రోవయొక్క యోరయందు అని యర్థము - మిశ్రసమాసము - 'సరణిః పద్ధతిః పద్యా వర్త న్యేకపదీతి చ' అమ. పూర్వోక్త విషయభేదమే.

చ. ఉరవడి నేగుచోట నొక యుగ్మలి యొల్లెచెఱంగు మేదినీ (6-28)
శ్వరుని భుజావిభూషణము వజ్రములం దవులంగఁబాఱినన్
విరిసెను నీవిబంధ, మది విస్మయ మందఁగఁ, దోడిభామినుల్
పరిహాసనం బొనర్పఁ, బతి పాపభయంబునఁ గంప మొందఁగన్. 94

ఉరవడిన్ = అతివేగముగా, ఏఁగుచోటన్ = పోవుచుండఁగా, ఒక ఉగ్మలి ఒల్లెచెఱంగు - ఒకవనితయొక్క పైఁట చెంగు, మేది... నన్ = నలుని బాహుపురిలోని వజ్రమునకు (చెక్కిన వజ్రముయొక్క వాఁడి కొనకు) తగుల్కొన్నంతట, అది = ఆస్త్రీ, విస్మయము ఒందగన్ = ఆశ్చర్యపడుటకుఁ గాను ('విస్మయో ఽద్భుత మాశ్చరమ్' అమ.), తోడి భామినుల్ = కూడ వచ్చుచున్న స్త్రీలు, పరిహాసనంబు ఒనర్పన్ = ఎగతాళి చేయుటకుఁగాను, పతి = రాజు (నలుఁడు), పాప భయంబునన్=నగ్నతాదర్శనపాపమువలని వెఱపుచేత, కంప మందఁగన్=వణఁకుటకుఁగాను, (దాని), నీవి బంధము = పోఁక ముడి ('నీవీ పరిపణే గ్రన్థౌ స్త్రీణాం జఘన వాససః' విశ్వ.), ప్రిదిలెను = వీడిపోయెను.

ఒకతె వడివడిగాఁ బోవుచుండెను; అంతట పోఁకముడికి కట్టియున్నట్టిది దాని సన్నని పైఁటయొక్క చెంగు నలుని బాహుపురిలోని వజ్రపుమొనకు గ్రుచ్చుకొన్నది. పైఁట ఒకదెసం దగుల్కొనుటయు యువతి ఇంకొకదెసకు వడివడి నేఁగుచుండుటయు ఈ నిమిషమాత్రపు లాగులాటలో పోఁకముడి వీడి పోయినది; అందుల కాస్త్రీ ఆశ్చర్యపడినది. తోడిచెలులు దానిని హేళనము చేసిరి; నలుఁడు తా నందులకారణ మయినందున ఆ నగ్నీకరణపాపము తనది గదా యనియు నగ్నాదర్శన పాపమునకును వణఁకసాగెను.

'ఉరవడి' నీవి విస్రంసనము నెఱింగి తప్పించుకొను నవకాశము లేమికి కారణము. 'బల్లి' సన్నదనము సులువుగా తగుల్కొనుటకును ఊడిరామికిని కారణము. 'వజ్రములక్'- ఇతర మణులకు సన్నమొన లున్న విఱిగి పోవును, వజ్రపుమొనలు విఱుగవు. పైగా వజ్రమునకు మొనలు ప్రధానము - ('సూచీముఖం తు హీరకః। వరారకం రత్నముఖ్యం వజ్రపర్యాయనామ చ' హేమ.) కావున (గట్టి) మొనలకై వజ్రము చెప్పఁబడినది. మూలములో 'హీరా జుష్కర ప్రోత దుకూల' అని మొనలం జెప్పకున్నను ఔచిత్యముచేత నవియే యర్థము.

'తవులంగఁ బాటినక్'—'పాటు'ధాతువు స్వార్థమునం దనుప్రయుక్తము.

ఇట, నీవి ప్రిదులుట హేతువు, విస్మయము పరిహాసము పాపభయంబును తద్ధేతుకములు కావున హేత్వలంకారము:—

'హేతు వగును (1) గార్యముతో। హేతువు వర్ణింప, (2) వాని కేకతఁ జెప్పక్;

(1) నాతికొలకు సెల పొడిచెక్,। (2) భూతేశు కృపాకటాక్షములు కవులసిరుల్.'అలం.

మఱియు యీగపద్యంబునం గలిగిన పెక్కు(క్రియలను) కలిపి వర్ణించుటచేత సముచ్చయము.

చ. ఇరువురు నీలనీరజ నిభేక్షణ లించిన వేడ్కతోఁ బర (6-42)
స్పర మెదిరించి కాంచనపు బంతులఁ దచ్చన వాటు లాడఁగా,
ధరణిపుఁ డడ్డమై చనుచుఁ, దద్భుజదండముఁ దాఁకి మిట్టి బి
ట్టురవడిఁ జెండు గ్రమ్మఱిన నుబ్బరపోయిరి భామినీజనుల్. 95

ఇరువురు నీల నీరజ నిభ ఈక్షణలు = నల్ల గలువలవంటి కన్నులు గల యువిదలు ఇద్దఱు, ఇంచిన వేడ్కక్ = ప్రియ మయిన కుతూహలముచేత, పరస్పరంబు = ఒండొరులను, ఎదిరించి, కాంచనపు బంతులక్ = సంపెంగపూవుల బంతులతో, తచ్చనక్ = పరిహాసముగా, వాటులు= వ్రేటులు, ఆడఁగాక్ = వైచినప్పుడు, ధరణిపుఁడు = నలుఁడు, అడ్డమై = అడ్డముగా, చనుచుక్= పోవుచున్నందున, చెండు = ఆబంతి, తత్ భుజ దండముక్ = అతని బాహు యష్టికి, తాఁకి = తగిలి, మిట్టి = ఎగిరి, బిట్టు = అధికమయిన - ఉరవడిక్ = వేగముతో, క్రమ్మఱినక్=వెనుకకు మరలఁగా, భామినీ జనుల్ = స్త్రీలు, ఉబ్బర పోయిరి = ఆశ్చర్యపడిరి.

వేడుకకై పరిహాసముగా ఇద్దఱు పడఁతులు ఒండొరులపైకి మోహరించి బంతులతో కొట్టుకొనసాగిరి. అం దొకబంతి రాజునకు తగిలి వెనుకకు మిట్టివడిగా మరలినది. రాజు అగపడనందున దేనికిని తలగుకయే మిట్టి మరలిన దని తలఁచి అచటిస్త్రీ లందఱు ఆశ్చర్యపడిరి.

'నీలనీరజనిభేక్షణ' లనుటచే యౌవనము వచ్చినవా రని తెలియుచున్నది. యౌవన ప్రాదుర్భావముచేత కన్నులకు ఇందీవరధాళధళ్యము కలుగును. రసమంజరిలో అజ్ఞాతయౌవనోదాహరణముం గనుఁడు:—

'నీరా త్తీర ముపాగతా శ్రవణయో స్సీమ్ని స్ఫురన్నేత్రయోః
శ్యామం లగ్న మిదం కి ముత్పల మితి జ్ఞాతుం కరం న్యస్యతి,
శైవా లాఙ్కుర శఙ్కయా శశిముఖీ రోమావళిం ప్రోఞ్ఛతి,
క్రాన్తాఽ స్మీతి ముహుః సఖీ మవిదిత శ్రోణీభరా పృచ్ఛతి.'

యువతు లైనారు గావుననే పొగ రెక్క బంతులతోఁ గొట్టుకొనఁ గడంగినారు. వేద్య-యుం దచ్చనయుం గావున, 'కాంచన' మనఁగా సంపెంగ గాని, బంగారము గాదు; బంగారమే అయినచో, మహావేగంబున నతికఠిన స్థిర బృహత్పదార్థమునకుం దగిలినం దప్ప, వెనుకకు రాదు; తగిలి క్రిందఁబడును. కడు విసరుగానే కొట్టుకొనినను, రాజదేహము శిలాకఠినము గాదుగాన, బంతి మరలదు, వారికిని అపాయము కలుగును, బరువుచేత విసరుటయే వారికి కష్ట మగును. 'తచ్చన'కు మాఱుగా 'క్రచ్చఱ' నను పాఠమునకు వేగముగా నని యర్థము.

సీ. చెలువారు క్రొమ్మించు నిలువు టద్దములలోఁ (6-47)
ప్రతిబింబములు గానఁ బడిన కతన,
సికతామయం బైన సీమాంతరంబునఁ
బాదపద్మంబు లేర్పడిన కతన,
నలవోకయునుబోలె నాకస్మికం బైన
యంగాంగ సంస్పర్శ మైన కతన,
దిక్పాలు రొసఁగిన దివ్యపుష్పంబుల
బహుళంబు లగు సౌరభముల కతన,
తే. విరహ విభ్రాంతి నొక్కొక్క వేళయందుఁ (6-46)
గళవళపు వింత భాషలకతన, నప్పు
డెవ్వఁడో యొక్క మాయావి యేగుదెంచె
నంతిపురమున కని లోఁగి రబ్జముఖులు. 96

ప్రతిబింబములు—నలునివి. కతనన్ = హేతువుచేత. సికతామయంబు=ఇసుకగలది ('సైకతం సికతామయమ్' అమ.) సీమా అంతరంబునన్ = ప్రదేశము నడుమ. పాద పద్మంబులు = నలుని యడుగుఁదమ్ముల జాడలు. అలవోక=లీల. ఆకస్మికంబుగాన్ = కారణము లేకయే - అంగాంగ సంస్పర్శము = (తాఁకుడునకుం గారణ మయిన నలుని దేహ మగపడకయే) తమ దేహమునకు అతని దేహమునకును తాఁకుడు. దివ్య పుష్పంబుల = (నలుని మెడలోనివియు అదృశ్యములును ఐన) మందారాది కుసుమంబులయొక్క (ఇచట 'యొక్క'కు లోపము-సమాసము గాదు, ఒండె-పుష్పంబులన్ = పువ్వులయందు, అని యేని కొనవచ్చును.) బహుళంబులు = మిక్కుటములు. సౌరభముల = పరిమళములయొక్క. విరహ విభ్రాంతిన్ = వియోగముచేత నైన చిత్తభ్రమచే. కళవళపు=తొట్రుపాటుగల. భాషల = నలుని మాటల. మాయావి = మాయలాఁడు (అదృశ్యకరణ్యాది విద్యలు ఎఱిఁగినవాఁడు.) అబ్జముఖులు = కమలాస్యలు. లోఁగిరి = భయపడిరి.

వ. (a) ఇవ్విధంబునం బరస్త్రీ పరాఙ్ముఖుండును జగన్మోహ నాకారుండును నగు నా రాజకుమారుండు శుద్ధాంత కాంతా మధ్యంబున నిర్వికారుం డయి చరించుచు, సుఖశారికా భవనంబులు గడచి, యెడనెడం జంద్రకాంత వేదికా

విటంకంబుల విశ్రమించుచు, ప్రబోధ మోహ శబలితంబగు చిత్తంబుతో విరహ వేదనా భరంబునం దూఁగాడుచుం (6-56), పాదచారంబున ననతిదూరం బరిగి, యభ్రంకషంబును (6-57) ప్రతోళీ రత్న వేదికా మధ్యా ధ్యాసీన సిద్ధ గంధ ర్వాంగనా ప్రవర్తిత సంగీతకంబును (6-65) (b) దార హార గుంభన వ్యాపార పారగత శంభళీ నికాయంబును బంచశర లేఖ లేఖన వియాత దూతి కానీత కేతకీ గర్భ పలాశంబును కమల కల్హారబిస కిసలయ ప్రధాన నానా శిశి రోపచార ద్రవ్య సమానయన సత్వర సంచారికా జ నాసార సంకులంబును నగు దమయంతీ ప్రా సాదంబు డాయం జనియె (6-57). నచ్చట. 97

(a) ఉపకారికా భవనంబులు = ఉప్పరిగలు - అనఁగా - రాజగృహంబులు ('ఉపకా ర్యోపకారికా' అమ. 'ఉపకారి కోపకర్త్ర్యాం పిష్టభేదే నృపాలయే' మేది.) చంద్రకాంత వేదికా విటంకంబులఁ = చలువఱాతి తిన్నెల పైభాగములందు (విటంక మనఁగా పైభాగ మనుటకు -

'చోళ కేళి సలిలావగాహగన ప్రాప్త భూరి ఘనసార పాణ్డురా

సా హిమాచల విటఙ్క నిర్గతా జాహ్నవీవ తటినీ వ్యరాజత.' విక్రమాంక.)

ప్రబోధ మోహ శబలితంబు = తెలివి కలుగుటచేతను తెలివి తప్పుటచేతను పలువన్నెలు గలదిగా (నానాప్రకారములు గలదిగా) చేయఁబడినది ('చిత్ర కిర్మీర కల్మాష శబ లైతా శ్చ కర్బురే' అమ. - ప్రబోధము తెల్లనిది మోహము నల్లనిది, అవి కల దగుటచే చిత్తము శబలము.) అభ్రంకషము = ఆకాశము నొరయు నట్టిది. ప్రతో ... బును = రచ్చయందలి ('రథ్యా ప్రతోళీ విశిఖా' అమ.) మణి యరంగుల నడిమి ప్రదేశమును అధ్యాసించిన (అనఁగా ఆప్రదేశమందు కూర్చున్న) సిద్ధ గంధర్వ స్త్రీలచే జరుపఁబడిన నృత్య గీత వాద్యములు కలదియు (సిద్ధ గంధర్వులు దేవయోని విశేషములు -

'విద్యాధరోఽప్సరో యక్ష రక్షో గన్ధర్వ కిన్నరాః

పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః' అమ. -

దేవయోనులు మనుష్యులకు శక్యము గాని గాంధారగ్రామమున పాడఁగలరు. అందులకు నారదోక్తి-

'షడ్జమధ్యమనామానౌ గ్రామౌ గాయన్తి మానవాః;

న తు గాన్ధారనామానం, స లభ్యో దేవయోనిభిః.'

ఇచ్చటనే గాక గంధర్వకన్యలను శ్రీహర్షుఁడు గ్రంథాంతమందుఁగూడ ప్రస్తావించినాఁడు:-

'శిష్యాః కలావిధిషు భీమభువో వయస్యాః వీణా మృదు క్వణన కర్మణి యాః ప్రవీణాః

ఆసీన మేన ముపవీణయితుం యయౌ స్తాః గన్ధర్వరాజతనుజా మనుజాధిరాజమ్.'(21-110)

(b) తార ... బును = శుద్ధముత్తెముల ('తారో ముక్తాది సంశుద్ధౌ తరణే శుద్ధమౌక్తికే' విశ్వ.) పేరులను గ్రుచ్చుట యను పనియందు ఆసక్తలై యున్న పరిచారికా సమూహము కలదియు. పంచ...బును - మదనుని జాబులు వ్రాయించుటయందు దిట్టలయిన ('ధృష్టే ధృష్ణు ర్వియాత శ్చ' అమ.) దూతికలచేత తేఁబడిన మొగలిపూవు లోపలి రేకులు గలదియు (లేఁత మొగలి రేకుల మీఁద మరు కమ్మలు వ్రాయించుటకు వానిని దూతికలు తెచ్చి రనుట. కమ...బును = తామరలు

ఎఱ్ఱగలువలు ('సౌగన్ధికం తు కల్హారమ్' అమ.) తామర తూండ్లు. ('మృణాళం బిసమ్' అమ.) మోసులును ముఖ్యముగాఁగల (మొదలయిన) పెక్కు చలువ సేవల పరికరములను తెచ్చుటయందు త్వర గలిగిన దూతికా సంఘముల ('దూతీ సంచారికే సమే' అమ. - 'పరిచారికా' అనుపాఠమున 'సేవకురాండ్ర సంఘముల'యని యర్థము-'నియోజ్య కింకర ప్రేష్య భుజిష్య పరిచారికాః' అమ.) జడిచేత ('ధారాసంపాత ఆసారః' అమ. - ఎడతెంపులేకుండ వచ్చుదు నేయుటన్నమాట) నిండి నదియు ('సంకీర్ణే సంకు లాకీర్ణే' అమ.) ప్రాసాదంబుక్ = రాజ భవనమును ('హర్మ్యాదిర్ధనినాం వాసః ప్రాసాదో దేవ భూభుజామ్' అమ.)

ఉ. లేమ యొకర్తు వేడుక నళీక నళీ కరణంబు జాతిగా (6-61)

బూమియు దాను బన్నుకొని పోకలఁ బోవుచు నుండఁగా, మృషా

భీమభవీభవంతి యయి బింబఫలాధర యోర్తు, పార్థివ

గ్రామణి చూడ, దానిమెడ గ్రక్కున వైచె మధూక దామముక్. 98

పార్థివగ్రామణి = రాజేంద్రుఁడు, చూడక్=చూచుచుండఁగా, లేమ = బోటి,...అళీక నళీ కరణంబు = మిథ్యా నలునిగా చేసికొనుట ('అళీకం త్వప్రియేఽనృతే' అమ. - నలుఁడు కాని దానిని నలుఁడుగాఁ జేయుట నళీకరణము - నలరూపముం దాల్చుట), జాతిగాక్ = యథాస్థిత ముగా, బూమియక్ = వేషమును, పన్నుకొని = ధరించి, పోకలక్ పోవుచుక్ ఉండఁగాక్ = (హాస్యార్థము) నలునివలె వ్యవహరించుచుండఁగా, బింబఫల అధర=దొండపండువంటి మోవిగలది,... మృషా భీమభవీ భవంతి అయి=మిథ్యా దమయంతి యగుచున్నదై (దమయంతి వేసము దాల్చి), దాని మెడక్ = ఆ నలవేష ధారిణి కంఠమున, గ్రక్కునక్ = తటాలున, మధూక దామముక్ = స్వయంవరార్థ మయిన యిప్పపూదండను, వైచెక్ = సమర్పించెను.

రాజు చూచుచుండఁగా, వేడుకకై ఒకతె నలవేషము దాల్చి నలునివలె వ్యవహరించుచుండఁగా, ఇంకొకతె దమయంతీవేషము దాల్చి నలవేషధారిణి మెడలో స్వయంవరమాలను వైచినది. ఇందువలన దమయంతి నలునే వరింప నిశ్చయించుకొన్నదనియు అందులకు కాలవిలంబము నోర్వకున్నదనియు నలునికి తెలియ నాయెను.

తే. వ్రాసె నొక్క లతాంగి క్రొవ్వాఁడి గోర (6-63)

వర్ణములు దోడుతో మషీ వర్ణములుగఁ

బసిఁడి గేదంగి రేకునఁ బ్రస్ఫుటముగ

మదన లేఖంబు నర్మ మర్మంబు మెఱయ. 99

ఒక్క లతాంగి = ఒక తీఁగఁబోఁడి, క్రొవ్వాఁడి గోరక్ = కడుం బదనైన గోటితో, పసిఁడి గేదంగి రేకునక్ = (97-వ వచనములో ప్రస్తావించిన) బంగారు గేదంగి రేకునందు, వర్ణములు = అక్షరములు, తోడుతోక్ = వ్రాసినవెంటనే, మషీ వర్ణములు కాక్ = సిరా యక్షరము లగునట్లుగా (సిరాయక్షరములవలె నల్లఁబడిన వనుట. మొగలిమీఁద వ్రాసిన నట్లు నల్లఁబడుట సిద్ధము- 'మేలా మసీజలం పత్త్రాఞ్జనం చ స్యాన్మసి ర్ద్వయోః' త్రికాణ్డ శేషము; ఇట 'మషీ' అని పాఠాంతరము. 'మలినామ్బు మషీ మసీ' హేమ. 'వత్స, మషీభాజనం పత్త్రిం చో

పానయ' మ్ముద్రా. పక్షాంతరమున - మషి యనఁగా గంటపుఁవ్రాఁ తగల తాటియాకులకుం బూయు టకు పసరుతోఁ గలిపి నూటిన మసిగాఁ గొనవచ్చును, ప్రస్ఫుటముగన్ = చక్కఁగా తెలియున ట్లుగా (విడంబటించి యనుట), నర్మ = పరిహాసముయొక్క ('ద్రవ కేళి పరీహాసాః క్రీడా ఖేలా చ. నర్మ చ' అమ.) - మర్మంబు = గుట్టు - మెఱయన్ = బయల్పడునట్లు (నలుని పేరికి దమయంతి వ్రాసినట్లు గా, మదన లేఖంబు = మరుజాబును, వ్రాసెను.

'క్రొవ్వాఁడి' లేఖిని మొనవలె నుండుటకు - అక్షరములను విశదముగా గీఱుటకును. 'పసిఁడి' ఱేకున నే వ్రాయ రాదా యనిన, వన్నెతోడి పరిమళముకై 'గేదంగి'. పరిమళ మేల యన - 'మద నలేఖము' గదా.

తే. చంద్ర రజమున నొక పూర్ణ చంద్ర వదన (6-62)
చంద్ర మండల తిలకంబు సఖికిఁ దీర్చెఁ
జంద్రశాలా శిలా ప్రదేశంబునందు
నావహిల్లంగ నపుడు చంద్రానవస్థ. 100

ఒక పూర్ణ చంద్ర వదన = నిండు చందురునివంటి మోము గలది యొకతె, చంద్రశాలా శిలా ప్రదేశంబునందున్ = పైమేడలోని (నెల) రాతి తావునందు, అపుడు = ఆతిలకము తీర్చి నప్పుడు, చంద్ర అనవస్థ = చంద్రులకు (లేక - చంద్రములకు - అనఁగా కర్పూరములకు - 'అథ కర్పూర మస్త్రియాం ఘనసార శ్చన్ద్రసంజ్ఞః' అమ.) సంఖ్యలో తుదలేమి, ఆవహిల్లన్ = కలుగు నట్లుగా, చంద్ర రజమునన్ = కర్పూర ధూళితో, సఖికిన్ = తనచెలికి, చంద్ర మండల తిలకంబు = చంద్ర బింబాకార మయిన బొట్టును, తీర్చెన్ = పెట్టెను.

చంద్రశాలలో ఒక చంద్రవదన తన సకిముఖమున చంద్రమండలాకార మయిన తిలకమును చంద్ర (కర్పూర) రజముతో చిత్రించినది. అచటి (చంద్రకాంత) శిలాప్రదేశంబులందు ఉక్తవదన చంద్ర తిలకచంద్రాది ప్రతిబింబ పరంపరలుం గలయఁగా నపుడు చంద్ర సంఖ్యకు అంతము లేక పోయెను.—చంద్రశాలా శబ్దములో ఒక 'చంద్ర' శబ్ద మున్నది, ఆచెలువ 'చంద్రవదన'- ఆ వదన మొక 'చంద్రుఁడు', 'చంద్ర' రజమున తిలకంబు - అందొక 'చంద్రము', తిలకంబు 'చంద్ర'మండలా కారంబు - అదొక 'చంద్రుఁడు' - అటుపై వీని ప్రతిబింబములు లెక్కలేని 'చంద్రులు' లెక్కలేని 'చంద్రములును'. ఇట్లుఅపుడటం గలిగిన చంద్రసంఖ్యకు అంతము లేక పోయెను.—గమ్యోత్ప్రేక్ష.

తే. 'మహిళ, లావణ్య వార్ధిలో మదనుఁ డెక్కు (6-63)
కప్పురపుఁజోగుఁ గంటిమి కంటి, మనుచు,
నర్మగర్భంబుగా నొక్కనలినవదన
పొగడె సఖిచంటిమీఁది యొప్పుల నఖంబు. 101

ఒక్క - నలిన వదన = కమల ముఖి, మహిళ = ఓలలనా, లావణ్య వార్ధిలోన్ = మేని కాంతి యనెడి సముద్రములోపల, మదనుఁడు - ఎక్కుడు - కప్పురపు జోగున్ = కర్పూరపుఁ బడవను, కంటిమి కంటిమి అనుచున్ (హర్షాతిశయముచే ఆమ్రేడనము), సఖి చంటిమీఁది- ఒప్పుల నఖంబున్ = అంద మైన నఖక్షతమును, నర్మ గర్భంబుగాన్ = పరిహాస గమకము

గా, పొగడెన్. 'మహిత... కప్పురపుజోఁదు కలకంఠి కంటె యనుచు' అనిపూర్వముద్రణము. వ్రాఁతప్రతులపాఠముల పర్యాలోచనచేత ప్రకృతపాఠ మూహించుకొనఁబడినది.

'నర్మ ... గాన్'- నీవు నీదయితునితో రాత్రి ఇచ్ఛారతులం దేలితివి. మాకు ఆరహస్యము నీవు చెప్పకున్నను సముద్రమువలె నపార మయిన నీలావణ్యములో మదనుఁడు సికారి సేయు పడవవలె నొప్పుచున్న నీకుచోపరినఖక్షతముచేతనే మాకు తెలిసినది లే, అని పరిహాసము గమ్యము. కప్పురపు జో గేమి యన - జోగును కప్పురముతో నిర్మించుట పరిమళమునకు చలువకు సొంపునకు ధవళతాధాళధళ్యమునకును; చలువ నఖక్షతమునకు సుఖ మొసంగును గాన అందుకై కర్పూరము పూసికొన్నదని భా. 'వేశ్యా స్త్వత్తో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిన్దూన్' మేఘ. 'లావణ్యము వార్ధి యైన, నఖక్షతము జోగైన, తదాధార మైన కుచ మేమి?' అనిన, కుచము పొడవుగా లేచిన (లావణ్య) తరంగ మని యెఱుంగునది. 'మదనుఁ డెక్కుట' యే మన - ఈ నఖక్షతముతో మదనునిభాగ్యము కొండ యెక్కిన దని భా.— రూపకము.

ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన వ్రాసె నొక్క ల (6-69)
జ్జావతి మించు గుబ్బ వలిచన్నులపై మకరీకలాపమున్
వావిరిఁ గమ్మ నీరు మృగనాభి రసంబున మేళవించి యే
కావళి నాకసింధువున కన్వయలీల ఘటించునట్లుగాన్. 102

భావము పల్లవింపన్ = అనురాగము (లేక - అభిప్రాయము) తలిర్చునట్లుగా, ఒక పంకజలోచన = ఒక నలి నాక్షి, వావిరిన్ = ఉత్కృష్టముగా, కమ్మనీరు = (పరిమళోదకము) పన్నీరు (మకరంద మని సీతారామాచార్యులవారు), మృగనాభి రసంబునన్=కస్తూరి ద్రవముతో, మేళవించి=కలిపి, ఒక్క లజ్జావతి మించు గుబ్బ వలి చన్నులపైన్= ఒకానొక సిగ్గరికత్తెయొక్క తళుకు గల (లావణ్యము తొనఁకుచున్న) గుండ్ర మయిన చల్లని కుచములమీఁద, మకరీ కలాపమున్ = ఆఁడుమొసలి యాకారమును భూషణముగా, ఏకావళి నాకసింధువునకున్ = ఒంటిపేట ముత్తెపుఁ జేరనెడి మిన్నేటికి, అన్వయ లీల - అన్వయ = సంబంధముయొక్క (లేక - వాహనముయొక్క)- లీల = సొంపు (సొం పయినసంబంధము - లేక - సొం పయిన వాహనము), ఘటిల్లు న ట్లుగాన్= కలుగుప్రకారమున, వ్రాసెన్ = చిత్రించెను.

అనురక్తి మీఱఁగా ఒకతె పన్నీట రంగరించిన కస్తూరితో ఇంకొకబోటి కుచములపై ఆఁడు మొసలిరూపమును వానిమీఁది యొంటిపేట ముత్తెసర మనెడి గంగానదికి ఉచిత మయిన సంబంధముగా చిత్రించినది.

'ఏకావళి'- ఒంటిపేటను చెప్పుట ఒక్కటే ప్రవాహ మయిన గంగతో సాటికి. 'అన్వయ లీల' ఉచితమయిన సంబంధము-గంగకును అం దుండునవి గావున మొసళ్లకును సంబంధము ఉచితము; ఇదియునుంగాక 'గఙ్గా మకరవాహినీ' యని ప్రసిద్ధి గావున, గంగయొద్ద తద్వాహనవిలాసము ఘటిల్లవలసినదే. ముత్తెపుఁజేరునకు 'నాకసింధు' సామ్యము ధావళ్యాదికముచేత; ఒకపాటి యేట వాలు ప్రదేశమందు పొఱుదల గలకడమనదులవలెఁ గాక, గంగ, నాకమునుండి మంచుకొండకు, మంచుకొండనుండి నేలకును, నేలనుండి పాతాళమునకును, అధోముఖముగా ప్రవహించునట్టిది; ఈస్ఫూర్తికొఱకే 'గంగ' యనక 'నాకసింధువు' అనుట; అట్లే ఏకావళియు కంఠమునుండి,

స్తనములమీఁదికి, వానినుండి కడుపుమీఁదుగా నాభికడకుం, గ్రాలునది. 'మృగనాభిరసంబు' మొసలియొక్క దేహసైల్యమునకు. 'అన్వయము' వంశంబునుం గావున నాకసింధువంశమునం గడ పటివానిని శ్రీపుత్త్రుని మన్మథుని అనంగుని తద్ధ్వజ మయిన మొసలిచే సూచించె ననియు భా. 'మకరీ'అనుచో స్త్రీత్వము అవివక్షితము, లేక - మకరి యున్నచో మకర ముండక మానదు గాన, మకరిచేతనే మకరంబు సిద్ధించుచున్నది. మదనుని ధ్వజ మగుమకర మిచట జాయాసమేతముగా నున్న దనుటచే 'నీ స్తనములు మదనశిబిరములుగా నున్న' వనియు 'వీనిచే నీదయితు నేలుదువు' అని యు పల్లవించిన భావము. మఱియు 'వలి' యనుటచే మంచు, 'గబ్బి' యనుటచే శిఖరిత్వము; అందువలన ఆకుచమండలము మంచుకొండవలె నున్నదని యాశయము. ఆవిషయము తెల్లమ యైనను, 'నీకుచము మంచుకొండగా నున్నది' యన్నచో 'లజ్జావతి' ఒప్పికొనదు గావున ఆవిషయమును మాటచే చెప్పక నాకసింధ్వన్వయమును వ్రాయుటచే చెలి సూచించినది; ఇదియే ఆచెలిమనస్సులో 'పల్లవించినభావము.'— రూపకాలంకారముతోడి యుత్ప్రేక్ష.

క. సారె యదె ఫోడువు మని యొక (6 - 71)
సారె యొకతె యక్షకేళి సమయంబున ని
చ్ఛారతి నొకతెకుఁ జెప్పిన,
సారె కనకపంజరమున సాధ్వస మందెన్. 103

అక్ష కేళి సమయంబునన్ = పగడసాల యాట వేళలో ('అక్షా స్తు దేవనాః పాశకా శ్చ తే' అమ.), ఒకతె, ఇచ్ఛా రతిన్ = ఇచ్ఛయొక్క క్రీడచే (ఇచ్ఛమెయి), ఒకతెకున్ = ఆడుచున్న దానికి, సారె యదె ఫోడువు = ఆ కాయనే చంపుము, అని, ఒకసారె = ఒకమాఱు, చెప్పినన్ = హెచ్చరించి నంతట, కనక పంజరమునన్ = బంగారపుఁ బంజరమునందు, సారె= గోరవంక, సాధ్వసము అందెన్ = భయ పడెను ('భీతి ర్భీః సాధ్వసం భయమ్' అమ.)

పగడసాల లాడుచున్నయొకతెకు ఇంకొకతె 'ఆకాయను చంపుము' అను నర్థముతో 'ఆ సారెను ఫోడువుము' అని చెప్పఁగా 'సారె' శబ్దమునకు గోరవంకయు అర్థము గావున, బంగారు పంజరములోని గోరవంక తన్ను ఫోడువు మని యాచెలువ యుపదేశించిన దని భ్రమపడి భయ పడెను. భయ మేల యన, 'పంజర'బద్ధ మయినందున ఎగిరి పోలేక. పక్షికి శబ్దార్థజ్ఞాన మెక్కడి దనిన,— పెంపుడు పక్షిగాన, వేడుకకై వారు అప్పుడప్పుడు 'కొట్టెదను చూడు', 'ఫొడిచెదను చూడు', అని కొట్టఁబోయియు పొడువఁబోయియు ఆ యాపదముల యర్థమును ఆ శారికకు నేర్పి యున్నా రని భావింపవలయును; ఇట్లు దానిని దండించుటకు కారణ మే మన, వల్లభులతోడి వీరి సరససల్లాపములను ఈశారిక వినఁగూడనివారియెదుట వాగం దొడంగుటయే. శిక్షావిశేషముచేత పావురములు దేశాంతరమున జాబు లందిచ్చుట, బంగారుపిచ్చుకలు రాణివాసము లిచ్చిన యాకు మడుపులం గొనిపోయి ఆస్థానాదిగతుఁ డయిన ప్రభువున కందిచ్చుట, ఏనుఁగులును గుఱ్ఱములును ఆజ్ఞ నెఱిఁగి మెలఁగుట, గంగిరెద్దు సర్వముం జెప్పినట్లు చేయుటయు ప్రసిద్ధము.

ఉ. 'వీఁడె నలుండు విశ్వ పృథివీ వల యైక విభుండు వచ్చుచు (6 - 60)
న్నాఁడని భీమభూమిపతి నందన నూఱడిలంగఁ బల్కు పూఁ

బోఁడుల మాట నేర్చికొని ప్రోది శుకాంగన యట్ల పల్కినన్,
తేఁ డిది నన్ను నేక్రియ నెఱింగెనొకో యని యెంచె నాత్మలోన్. 104

వీఁడె ... లోన్ = ఈతఁడే (వీఁడుగో) సర్వ భూమండలై కాధిపతి యగు నల మహారాజు వచ్చుచున్నాఁడు, అని దమయంతి నూఱడించుటకై చెలికత్తెలు అప్పుడప్పుడు పలుకు చుండఁగా, ఆ వాక్యమును పెంపుడుచిలుకరమణి నేర్చుకొని అలవాటుచే అట్లే అను వదింపఁగా, అది యనువాదమాత్ర మని యెఱుంగక, నలుఁడు తన్ను అదృశ్యుని ఆచిలుక ఏవిధముగా తెలిసికొన్నదో అని మనస్సులో కళవళింప సాగెను.— సార్థబిందు ద్విప్రాసము.

తే. అంబుజానన కొలువుకూటంబునందుఁ (6-71)
కనక కలహంస శాబ కాకార మైన
విడియపుం బెట్టెఁ జూచి యుర్వీధవుండు
దలఁచెఁ దనకూర్మి దూతఁ జిత్తంబులోన. 105

(ఉర్వీధవుండు =) నలమహారాజు కమల ముఖి(యైన దమయంతి)యొక్క సభా గృహంబునందు బంగారపు రాజహంస పిల్ల యాకారమువంటి యాకారము గలదైన (హంసపిల్లరూపముగా బంగారముతోఁ జేయఁబడిన దైన) తాంబూలపుఁ బెట్టెను చూచి, తన యనుంగు రాయబారియైన యా బంగారు రాజహంసమును ("కలహంస స్తు కాదమ్బే రాజహంసే నృపోత్తమే" మేది.) మనస్సులో తలఁచుకొనెను.

'విడియపుం బెట్టె' - 'పెట్టె' యని ఒక పా. మూలవ్యాఖ్యలలో 'తామ్బూలపాత్రమ్' అనియు, 'సువర్ణఘటితహంసపుత్త్రికాశోభామ్' అనియు, నున్నది. 'వీడియపు బుట్టి' యని పా. బుట్టి యనఁగా పుటిక. 'దూతన్' - మహత్త్వంబున 'దూతుఁడు' 'దూత' - అమహత్త్వంబున 'దూత' అని రూపములు.

'కనక కలహంసశాబకాకారము' - బహువ్రీహి - ఉపమాలంకారము. తాంబూలపుబుట్టిం గాంచి సామ్యహేతువుచే రాజు ఆ రాజహంసం దలంచుట స్మరణాలంకారము.

వ. ఇట్లు కన్యాంతఃపురంబుఁ బ్రవేశించి దమయంతీ సభా భవన ద్వారంబు సేరం జనుదెంచి యొక్కపసిండి యరంగుమీఁదఁ గూర్చుండె. నప్పడబ్జాలికా రత్నంబు జననీ ప్రయత్నంబునం దత్సమీపంబున కరుగుటయును స్వయంవర కల్యాణ మహోత్సవంబు సంపాదింపంబడుటయు శోభ నారంభ సంభ్రమంబులవలన నెఱింగినవాఁడు గావున నయ్యంభోరుహాక్షి సమాగమంబు నపేక్షించుచుండె. నప్పుడు. 106

జననీ ప్రయత్నంబునన్ = తల్లియొక్క యత్నముచేత (తల్లి రప్పించుకొనఁగా). తత్సమీపంబునకున్=తల్లిచెంతకు (వేఱే మందిరమునకు). అరుగుటయున్=పోయియుండుటయు. కల్యాణ = శుభ. శోభన ఆరంభ సంభ్రమంబులవలనన్ = మంగళములయిన వ్యాపారముల వేగిరపాటు వలన. అంభోరుహాక్షి సమాగమంబున్ = తామరసనేత్ర (యగు దమయంతియొక్క) రాకను. అపేక్షించుచున్ = ఎదురుచూచుచు.

తే. అనుఁగుఁదల్లికి వందనం బాచరించి, (6-48)
వరున నిలువేల్పులకు మ్రొక్కి, వలను మిగుల
బ్రాహ్మణులచేత దీవెనల్ వడసి, పుణ్య
భామ లిచ్చు హేమాక్షత ప్రతతిఁ దాల్చి. 107

అనుఁగు = ప్రియమైన. వందనంబు = ప్రణామము. వరుసన్ - ఒకరినైన మఱవకుండ, ఇలువేల్పులకున్ = ఇంటిదేవతలకు (కులదైవతముల కనుట). వలను = ఆనుకూల్యము, మిగులన్ = మీఱునట్లుగా, దీవెనల్ = ఆశీర్వచనములు, పడసి = పొంది (గ్రహించి). పుణ్యభామలు = పవిత్ర లయిన స్త్రీలు (పేరఁటాండ్రు). హేమ అక్షత ప్రతతిన్ = బంగారపు సేసఁబ్రాల మొత్తమును (అ క్షతలు - అ ఖండితములు వ్యు.)

ఈపద్యమునందును అనంతరపద్యమందు 'ఏఁగుదెంచు'వఱకును 'కమలానన'యనునొకకర్తృకారకమునకు ఆచరించుట లోనగుబహుక్రియలతో నన్వయము గావున కారకదీపకాలంకారము:—

'కారకదీపక మగు నొక । కారకముం జెందు పెక్కు క్రమికంబులచేన్.' అలం.

ఉ. తల్లి మనః ప్రసాద సహితంబుగ నిచ్చిన పుష్పదామమున్
బల్లవ పాటలం బయిన పాణి సరోజమునన్ ధరించి, యా
యల్లక తీవ్ర సంజ్వర భరాలస కోమల గాత్ర వల్లి యై
యల్లన నేఁగుదెంచు కమలాననఁ జూచె విభుండు దవ్వులన్. 108

తల్లి, మనః ప్రసాద సహితంబుగన్ = చిత్తములోని యనుగ్రహముతో కూడుకొన్నట్లుగా ('ప్రసాదో ఽనుగ్రహే కావ్యప్రాణ స్వాస్థ్య ప్రసత్తిషు.' మేది.), ... దామమున్ = (వరణ) మాలికను, పల్లవ పాటలంబు = చిగురువలె నెఱ్ఱనిది ('శ్వేతరక్త స్తు పాటలః' అమ.), అయిన-పాణిసరోజమునన్ = చేదమ్మియందు. ధరించి = (స్వయంవరసభలో వరుని మెడలో వైచుటకై) కైకొని,...ఆయ ... ల్లి-ఆయల్లక = ఉత్కంఠచేత నయిన- తీవ్ర = దారుణ మయిన - సంజ్వర = సంతాపముయొక్క - భర = అతిశయముచేత - అలస = డస్సిన - కోమల = సుకుమార మయిన - గాత్ర వల్లి = మైదీఁగ గలది-ఐ(వరుని మెడలో దానిని వైచువఱకు విలంబము నోర్వక విరహతాపముచేత సోలుచు చొక్కుచు ననుట; 'ఔత్సుక్యం రణరణ కోత్కణ్ఠే ఆయల్ల కారతీ' హేమ. 'ఆయల్లక'మునకు మఱియొక యుదా.—

'బ్రహ్మ న్నధ్యయనస్య నైష సమయ, స్తూష్ణీం బహిః స్థీయతాం;
మల్పం జల్ప బృహస్పతే జడమతే, నైషా సభా వజ్రిణః;
వీణాం సంహర నారద; స్తుతి కథాలాపై రలం తుమ్బురో;
సీతాయల్లక భల్ల భగ్న హృదయః స్వస్థో న లఙ్కేశ్వరః.' మహానాటకము),

... దవ్వులన్ = దూరమందు,...

'మనః'-ప్రసాదము మనస్సునందు ఉండునదే అగుటచేత చెప్ప నక్కఱ లేని దైనను 'మనః' అని చెప్పుటచేత మనస్సులో నిండి యుండి బయటికి వచింప శక్యము కాకున్నట్టిది యని భా. 'సహితంబుగ' అనుటచే పుష్పమాలికను ఇచ్చినది, ప్రసాదమును కూడ నిచ్చినది, అని

స్వారస్యము.—'పల్లవ పాటలంబు,' 'పాణిసరోజము,' 'కమలానన'—ఉపమలు. దవ్వులన్ – దూరమున నుండఁగానే లావణ్యవిశేషముచేతను విరహచిహ్నములచేతను దమయంతి యని కనిపట్టె నని భా. 'వల్లి'–తన్వి యనుట – విరహకృశ యనుటయు.

వ. ఇట్లు వీక్షించి నిషధాధ్యక్షుండు సాక్షాత్కరించిన మదన సామ్రాజ్య లక్ష్మియుం బోని యా ధవళాక్షి సమక్షంబు చేరం జనియె నప్పుడు. 109

ఉ. ఎంతయు డాయ నేఁగియు మహీశుఁ డెఱుంగఁగ నేరఁ డయ్యె వి (6-48)
భ్రాంతి విదర్భరా డ్దుహితృ పంక్తుల లోన మృగాక్షి నప్పు; డ
య్యంతి యెఱుంగ దయ్యె దిగధీశ చతుష్టయ దత్త శాంబరీ
ధ్వాంత నిగూఢుఁ డైన వసుధాధవునిన్ నికటస్థలంబునన్. 110

ఎంతయున్ = మిక్కిలి. డాయన్ = సమీపముగా. విభ్రాం ... లోనన్ = భ్రమ జనితము లయిన విదర్భరాజ సుతల వరుసల లోపల, మృగాక్షిన్ = హరిణనయనను (వాస్తవ మయిన దమయంతిని). దిక్ అధీశ ... డు=దిక్పాలకుల చతుష్టయముచేత ఈయఁబడిన (దిక్పాలకులు నలువురు నిచ్చిన) మాయ యనియెడి యంధకారముచే('అన్ధకారోఽస్త్రియాం ధ్వాన్తమ్' అమ.) మఱఁగింపఁబడినవాఁడు (అదృశ్యత నొందినవాఁడు). వసుధా ధవునిన్ = భూ పతిని (నలుని). నికట స్థలంబునన్ = సమీప ప్రదేశమునందు ('సమీపే నిక టాసన్న సన్నికృష్ట సనీడవత్' అమ.)

ఇట భ్రాంతిదమయంతులలో వాస్తవదమయంతియొక్క విశేషము ఏర్పడమికి సామ్యము కారణ మైనందున సామాన్యాలంకారము:—

'సామాన్య మెన విశేషము । పో; మెలఁత మొగ మెదో నళినిఁ బొడవడదయ్యెన్.' అలం.

[ఎనన్ = సామ్యముచేత. పోన్ = కనఁబడక పోయె నేని.]

'శాంబరీ ధ్వాంత ...' – రూపకము. ప్రస్తుతములకే 'ఎఱుంగనేరమి' ఆవృత్త మయినం దున అర్థావృత్తి దీపకాలంకారము:—

'ఆవృత్తిదీపకం బగుఁ । బో వర్ణ్యంబులకె యన్యములకే ధర్మం
బావృత్తి చేసి చెప్పిన । (1) నావచనము (2) నర్థమును (3) ద్వయము పద్ధతులన్.
'(1) వర్షధళ నొందె మేఘము; । వర్షదళం బొందె రజని; (2) వనజిని బడలెన్,
ధర్షణి విటుకొలి కడలెన్; । (3) హర్షించె శిఖావళములు హర్షించెఁ గరుల్.' అలం.

తే. అతివ విభ్రాంతి వీక్షితుం డైన నృపతి (6-49)
కంఠమున వైచెఁ జేతి చెంగలువ దండ;
యది నిజంబుగ నికటస్థుఁ డయిన విభుని
యుఱుత సంలగ్న మయ్యె నత్యద్భుతముగ. 111

చెలువ (దమయంతి) భ్రమచే చూడఁబడిన (తనకడ నున్నాఁ డని తాను భ్రమపడిన యవాస్తవపు) రాని మెడలో తనచేతి చెంగలువదండను సమర్పించినది. ఆదండ వాస్తవముగా చెంత నున్న వాఁ డయిన (వాస్తవపు) రాజు మెడలోనే అత్యద్భుతముగా తగులుకొన్న దాయెను. — దండ

యదృశ్య మైనందులకు ఆమెకు అద్భుతము, 'న న్నెట్లెఱిఁగి నామెడయందు వైచినదో?' అని తేనికద్భుతము, ఈకాకతాళీయము ఎల్లవారికి నద్భుతము.

తే. వాసనా దృష్ట యగు కాంత వైచినట్టి (6-50)
బొండు నిజ మయ్యె నని చోద్య మందె రాజు;
తాను వైచిన కల్హార దామకంబు
మాయ మగుటయుఁ దరుణి విస్మయము నొందె. 112

వాసనా = చింతా సంతానముచే - దృష్ట = చూడఁబడినట్టిది (భ్రాంతికల్పిత.) బొండు = పూదండ. చోద్యము = ఆశ్చర్యము. తరుణి = దమయంతి, తాను, వైచిన=వేసిన-కల్హార దామకంబు = ఎఱ్ఱగలువల దండ, మాయ మగుటయున్ = అదృశ్య మయినందులకు, విస్మయమున్ ఒందెన్ = (అదృశ్యుఁడుగా నున్నట్టి తేని మెడయందుం బడినందున నదృశ్య మయిన దని యెఱుంగమిచేత) ఆశ్చర్యపడినది.—అర్థావృత్తిదీపకము.

తే. ఒక్కచో నుండియును బాసి యున్న భంగి (6-51)
భ్రాంతి నన్యోన్య మీక్షించి పతియు సతియుఁ
జేరి మిథ్యా పరస్పరాశ్లేష కలన
సత్య పరిరంభ ఖేలనా సక్తు లైరి. 113

... భంగిన్ = విధముగా, భ్రాంతిన్ = భ్రమచేత, ... మిథ్యా ... లనన్ —మిథ్యా= అవాస్తవమయిన (భ్రాంతిజనితు లయిన) - పరస్పర = ఒండొరులయొక్క - ఆశ్లేష = ఆలింగనముయొక్క ('పరిరమ్భః పరిష్వఙ్గః సంశ్లేష ఉపగూహనమ్.' అమ.) - కలనన్ = భావముతో (మిథ్యాలింగన మనియే తలంచుచు) సత్య ... లు – సత్య = వాస్తవ మైన - పరిరంభ=ఆలింగనమనెడు - ఖేలనా = క్రీడయందు - సక్తులు= తగులుకొన్నవారు, ...

నలుఁడు దమయంతికడనే యుండియు ఆమెను కూడ భ్రాంతిదమయంతి యని తలంచెను. దమయంతియు నలునికడనే యుండియు ఆతనిం గానకుండెను. ఇందువలన వారు ఒండొరులకడనే యుండియు లేనట్లు భావించుకొని భ్రాంతికల్పితు లయినయొండొరులను ఆలింగనము చేసికొనుచుండులలో నిపుడు వాస్తవ మయిన యొండొరులం గూడ ఆలింగనము చేసియు ఆ యాలింగన సత్యత్వమును ఎఱుంగకయే యుండిరి.

వాస్తవదమయంతిని భ్రాంతిదమయంతినిగా నలుఁడు భావించుటయు, నలదమయంతులు సత్యపరస్పరాశ్లేషమును మిథ్యాపరస్పరాశ్లేషముగానే తలంచుటయు భ్రాంతిమదలంకారములు.

శా. అంభోజానన భూమిపాలకునిచే నాశ్లిష్ట యయ్యున్ మదిన్ (6-52)
సంభావింప దతం డదృశ్యుఁ డగుటన్ సత్యోపగూహంబుగా;
స్తంభావిష్కృతి వైరసేనియును వైదర్భిన్ గ్రహింపంగఁ బ్రా
రంభంబుం దగఁ జేయ నించుకయు నేరం డయ్యె నీక్షించియున్. 114

అంభోజ ఆనన = కమల ముఖి (దమయంతి), ... ఆశ్లిష్ట = కవుంగిలింపఁబడినది, ... ఉపగూహంబు = ఆలింగనమును, మదిన్ = మనస్సులో, సంభావింపదు = తలఁపదాయెను,... స్తం ... తిన్ – స్తంభ = మ్రానుపాటుయొక్క ('స్తమ్భ శ్చేష్టాప్రతీఘాతో భయహర్షామయాదిభిః.' సా. ద.) – ఆవిష్కృతిన్ = ప్రాదుర్భావముచేత, ... వైరసేని యును = వీరసేనసుతుఁడయిన నలమహారాజు కూడ, ... ప్రారంభంబున్ = పూనికను, ...

రాజు వాస్తవముగానే దమయంతిని ఆలింగనము చేసినను అతఁడు కంటి కగపడనందున ఆయాలింగనము వాస్తవనలుని దని యామె తలంపదాయెను. ప్రత్యక్షముగా మిథ్యాదమయంత్యాలింగనపరంపరలో కలిగిన సత్యదమయంత్యాలింగనమువలనం దనదేహమునందు మ్రానుపాటు జనించినందువలన నలమహారాజు, తనయెట్టయెదుటనే ఆమెను చూచుచునే యుండియు, చేపట్టుటకు ఇంచుకేనియు పూననేరఁడాయెను.

సత్యాశ్లేషరూపకారణ మున్నను నట్టిబోధ యను కార్యము జనింపమి విశేషోక్తి, అస్పృశ్యత్వనిమిత్తమును చెప్పినందున ఉక్తనిమిత్త. దమయంతీసాన్నిధ్య మను పుష్కలకారణ మున్నను నలునియందు తద్గ్రహణరూపకార్యము పొడమమియు విశేషోక్తియ, స్తంభ మను నిమిత్తముం జెప్పినందున ఉక్తనిమిత్త.

చ. మొదల శరీర సంగమ సముద్గత సత్య మతి ప్రకాశతన్, (6-53)
పిదప నలీక సంవి దుపబృంహిత బాధతఁ, బొంది యిద్దఱుం
బదపడి యంతరంగములఁ బ్రత్యయ మొందర యించుకేనియున్
గదిసి యొకళ్లొకళ్ల నిఱి గౌఁగిటఁ జేర్చియునుం బ్రముగ్ధతన్. 115

ఇద్దఱున్ = నలదమయంతులు, మొదలన్ = ముందుగా నొకమాఱు (పుణ్యవశంబున సత్య మయిన యొండొరుల నాలింగనము చేసికొని ఆయాలింగనమందు), శరీ ... తన్ – శరీర = తమదేహములయొక్క – సంగమ = ఒండొంటితోడి కలయికచేత – సముద్గత = పొడమిన ('ప్రకాశము' నకు విశేషణము) – సత్య మతి=(ఆలింగనము) వాస్తవ మైనదే అనెడి బోధయొక్క – ప్రకాశతన్ = స్ఫురణ కలవారితనమును, పొంది = అనుభవించినవారై, పిదపన్ = పిమ్మట (మరల నాసత్యాలింగనముకై కడఁగి, యీమాఱు దైవవశంబున భ్రాంతిజనితు లయినయొండొరులం గౌఁగిలించి ఈవట్టియాలింగనమువలన), అలీ ... తన్ – అలీక సంవిత్ = (ఆలింగనము) మిథ్య యనెడి జ్ఞానముచేత 'స్త్రీ సంవిజ్ జ్ఞాన సంభాషా క్రియా కా రాజి నామసు' అమ.) – ఉపబృంహిత= బలపఱుపఁబడిన – బాధతన్ = (పూర్వాలింగనముయొక్క సత్యత్వ) ఖండనము కలవారితనమును, పొంది = అనుభవించినవారై, పదపడి = అటుతర్వాత, కదిసి = దగ్గఱి, ఒకళ్లు ఒకళ్లన్ = ఒకరి నొకరు, ఇఱి కౌఁగిటన్ = బిగు వయిన కవుంగిటియందు, గ్రుచ్చియున్ = పొదివికొనియు, ప్రత్యయము = (ఆయాలింగనము సత్య మయినదే యని), ఇంచు కేనియున్ = కొంచె మయినను, ప్రత్యయము = నమ్మకమును ('ప్రత్యయోఽధీన శపథ జ్ఞాన విశ్వాస హేతుషు' అమ.), అంతరంగములన్ = మనస్సులలో, ప్రముగ్ధతన్ = బేలతనముచేత, పొంద = వహింపకయే యుండిరి.

ఇరువురును మొదట భాగ్యవిశేషంబున ఒండొరులవాస్తవాలింగనమునే పొంది అందలి శరీరసంపర్కముచేత దాని సత్యత్వమును గ్రహించిరి. అంతట మరల నట్టియాలింగనముకై కడఁగి

యీమాఱు దైవ దుర్విపాకంబున భ్రాంతి జనితుల నొండొరులం గవుంగిలించికొని, ఈయాలింగన మురెుక్క మిథ్యాత్వముం గని, దీనివలెనే ఆపూర్వాలింగనము సయితము మిథ్యయే గాని వాస్తవ ము గా దని నిశ్చయించుకొనిరి. తర్వాత మఱి యెన్నిమాఱులు వాస్తవాలింగనముల ననుభవించి నను అవి వాస్తవము లని మనస్సులలో మూఢత్వముచేత నెంతమాత్రము విశ్వసింపరైరి.

సత్యాలింగన మనెడు పుష్కలకారణ మున్నను సత్యతాప్రత్యయ మను కార్యము జనింపమి విశేషోక్తి, మధ్యలోఁ గలిగిన మిథ్యాలింగన మను నిమిత్తముం జెప్పుటచే నుక్తనిమిత్త.

ఉ. ఆరతి బోటికిన్ విభున కప్డు మనంబుల విప్రలంభ శృం (6-55)
గార మొకల్లొకల్ల యిఱి కౌఁగిటఁ బుట్టిన నిండువేడ్కచే
బోరన నాఱియాఱి మదిఁ బొంగె, ఘృతం బతిమాత్రఁ బోసినన్
గూరికి గూర్కి యక్షణమ గొబ్బున మండిన దీపమో యనన్. 116

అప్డు, ఆ రతిన్ = ఆ క్రీడయందు, బోటికిన్ విభునకున్, మనంబులన్ = మనస్సుల యందు, విప్రలంభ శృంగారము = వియోగ భారము, ఒక ... చేన్, బోరనన్ = శీఘ్రముగా, ఆఱి యాఱి = శమిల్లి శమిల్లి, ఘృతంబు = నేయి, అతిమాత్రన్ = అధికముగా, పోసినన్ = పోసినయెడల, కూరికి కూర్కి = కునికి కునికి, అక్షణమ = అనుకొననిక్షణములో (ఉన్నట్టే ఉండి- ఆకస్మికముగా), గొబ్బునన్=తటాలున, మండిన దీపమో, అనన్ = అనునట్లుగా, మఱి పొంగెన్= అధికముగా ఉబికెను.

ఆసమయమందు వారి కిరువురకును మనస్సులోని వియోగభారము ఉక్తాలింగనములచేత కొంతసేపు శమించియుండియు, నేయి యెక్కువగా పోసినయెడల కునికికునికి ఉన్నట్టే యుండి బగాలు మని దీపము ప్రజ్వరిల్లిన విధముగా, ఆకస్మికముగా అత్యుత్కట మాయెను.

దీపసామ్యమాత్రము చెప్పక 'దీపమో' అని యధ్యవసాయము చేసినందున ఉత్ప్రేక్షాలం కారము. వారిమనస్సులు ప్రమిదలవంటివి, విప్రలంభ శృంగారము దీపము వంటిది, కౌఁగిలింతల వేడ్క ఘృతము వంటిది, శమిల్లు చుండుట కునుకు చుండుట వంటిది, మఱి పొంగుట గొబ్బున మండుట వంటిది.

ఇచట 'విప్రలంభశృంగార' మని రసమును స్వశబ్దముచేతఁ జెప్పుట దోషము.—
'రసాదేః స్వశబ్దోక్తిః క్వచిత్సంచారివర్జం దోషః। ...
తత్ర రసస్య స్వశబ్దేన శృఙ్గారాదినా వాభిధానం యథా—
'శృఙ్గారీ గిరిజాననే, సకరుణో రత్యాం, ప్రవీరః స్మరే,
బీభత్సోఽస్థిభి, రుత్ఫణీ చ భయకృ, న్మూర్త్యాఽద్భుత స్తుఙ్గయా,
రౌద్రో దక్షవిమర్దనే చ, హాసకృ న్నగ్నః, ప్రశాన్త శ్చిరా,
దిత్థం సర్వరసాత్మకః పశుపతి ర్భూయాత్ సతాం భూతయే.' కావ్యానుశాసనము.

వ. ఇవ్విధంబున సంయోగ వియోగంబులవలన బోధ మోహంబులు వహించుచు, నవ్వరారోహా హృదయ నిర్విశేషం బగు సఖీజనంబు మెల్ల మెల్లనఁ దోడ్కొని పోవ, నిజ సభా భవనంబునకు నెట్టకేలకుం జనియె (6-56). ధరా

ధీశ్వరుండును ధారా వాహిక జ్ఞాన ప్రవాహంబునం దేలియాడుచు నంత నంతఁ
గాంతారత్నంబుఁ గదియ నేతెంచె (6-57)· నట్లు కొలువుకూటంబుఁ జొచ్చి
యబ్బోటి హాటకపీఠం బలంకరించి సఖీ పరివార పరివృత యై తారకా గణ పరి
వృత యగు చంద్రరేఖయుం బోలెఁ బొలుపారె. నానమయంబున. 117

వరారోహ = ఉత్తమురాలు (వరః శ్రేష్ఠః ఆరోహో నితమ్బో ఽస్యాః - మంచి నితం
బము కలది అని వ్యు. 'వరారోహా మత్తకాశి న్యుత్తమా వరవర్ణినీ' అమ.) హృదయ నిర్విశేషంబు
= తన మనస్సుతో భేదము లేనిది (సమ దుఃఖ సుఖము.) నిజ సభా భవనంబునకుఁ = తన
కొల్వు కూటంపు గృహమునకు, ఎట్టకేలకుఁ = అతిప్రయాసమున. ధరా అధీశ్వరుండును = భూ
పతియు, ధారా వాహిక జ్ఞాన ప్రవాహంబునఁ దేలి యాడుచుఁ=తెంపులేనిదిగా పాఱుచున్న
దమయంతీవిషయక జ్ఞాన ప్రవాహంబునందు తేలి చరించుచు (ఏటివడిలో కొట్టుకొని వచ్చినవాని
వలె – అవశముగా ననుట.) కదియఁ ఏతెంచెఁ = చేరం జనియె. హాటక పీఠంబు = బంగారు
పీటను. తార...లెఁ=అశ్విన్యాది నక్షత్ర సంఘముచే పరివేష్టింపఁబడిన శీత నెలవలె.

ఉ. భావముఁ జూడఁగోరి యొక పార్శ్వమునన్ దమయంతిఁ జేరి ధా (6-74)
త్రీవరుఁ డుండె శాంబరి ధరించియ భీమసుతా వినోద సం
భావనకై సఖీజనులు పన్నిన యాత్మ మనోజ్ఞ పుంస్త్వ రూ
పావళిలో నిజాకృతి బయల్పడకుండఁగ రత్నవేదికన్. 118

ధాత్రీవరుఁడు = రాజు, దమయంతిన్ చేరి, భావమున్ = (ఆమె) యభిప్రాయమును,
చూడఁ గోరి = పరీక్షించువాఁడై, ఒకపార్శ్వమునన్ = ఒక్కెడ (చతుర్థాశ్వాసము 2_వచనము
లో 'కట్టెదుర' నని యున్నది), శాంబరిన్ = తిరోధానమాయను, ధరించియ = పిడకయే (అదృ
శ్యుఁడు గానే), రత్న వేదికన్ = మణి యరుఁగుమీఁద, భీమ...గన్ = దమయంతికి వేడుక
కలిగించుటకై చెలికత్తెలు రచించిన తనయొక్క (నలునియొక్క) మనోహర మయిన పురుషత్వము
గల యాకారముల వరుసలో ('వీథ్యాళి రావళిః పఙ్క్తిః' అమ.), నిజ ఆకృతి = తన దైన ప్రతి
బింబము, బయల్పడక ఉండన్ = (విశేషము) గోచరింప కుండునట్లుగా, ఉండెన్.

నలుఁడు క్రమంబున దమయంతి కడకుం బోయెను ; అచట ఆమెయొక్క యభిప్రాయము
నెఱుంగువాఁ డై ఆమెయెదుట నే తిరస్కరిణీవిద్యచేత అదృశ్యుఁడుగా నే రతనంపుటరంగుమీఁది
సకులు దమయంతీవినోదార్థ మై చిత్రించి (లేక చెక్కించి) యున్న తన సుందర రూపముల వరు
సలో కూర్చుండెను. వాని నడుమను ఏల యనఁగా, తా నదృశ్యుఁ డై యున్నను తన ప్రతిబిం
ములు మణ్యాదులయం దగపడును, అట్లే తన చిత్రాకృతుల నడుమ తన ప్రతిబింబ మగపడినను
అది చిత్రాకృతియే యని వారు తలఁచి తనయునికి నెఱుంగకుండుటకై, వానినడుమం గూర్చు
డెను.— అదృశ్యుని ప్రతిబింబములు అద్దములలో నగ పడు నని 96_పద్యములో చూడ నగును

చెక్కడపు నల స్వరూపములలో నలుని ప్రతిబింబముయొక్క విశేషము తెలియరాని
సామాన్యాలంకారము.

'పుంస్త్వ'-పురుషుఁ డని చెప్పవలయునా! ఈమాట యేల? ఇందులభావ మేమి? అనిన - మనోజ్ఞ పుంస్త్వ = మనోహారి యగు పురుషత్వము గలిగిన - అనఁగా పురుషసౌందర్యమునకుం బరమావధి యైన యని భా. మఱియు, పురుష సౌందర్య పరమావధి యైన పురుషాకారమును చిత్రింపఁగా ఆ పరమావధి యితఁడే అయినందున ఆ యాకారము ఇతనిదే అయిన దని స్వారస్యము. 1 ఆ. 76 వ గీతముం జూడవలయును.

—* ఇంద్రాదుల దూతికలు *—

వ. ఇవ్విధంబున నబ్బాల పేరోలగం బున్న సమయంబునందుఁ బ్రతీహారి యేతెంచి, యింద్రాగ్ని యమ వరుణులు పుత్తెంచిన దూతికలు మందిర ద్వారంబున నున్నవా రని విన్నపంబు చేసి, తదనుమతి వడసి, ప్రవేశింపఁ జేయుటయు; నా సందేశహారిణులు మందమంద గమనంబున నాత్రైలోక్య సుందరిం జేరం జనుదెంచి సముచిత సత్కారంబులు వడసి సఖీనిర్దిష్టంబు లగు మణిమయాసనంబు లందుఁ గూర్చుండిరి. ఆ సంచారికాచతుష్టయంబునందు విస్పష్ట మధు రాలాప యు నర్మోక్తి నిపుణయు నింగి తాకార చేష్టా వివేక విశారదయునుం బుంవత్ప్రగల్భయు నగు జంభారి గారాపు శంభళి హస్తాంభోరుహంబులు మోడ్చి యిట్లనియె. (6-76) 119

పేరోలగంబు = నిండు సభ. ప్రతీహారి = ద్వారపాలకురాలు (ప్రతీహారీశబ్దము - ఈకారాంత స్త్రీలింగము). ఏతెంచి = వచ్చి. పుత్తెంచిన = పంపిన. తత్ అనుమతి = దమయంతి యొక్క సెలవును. వడసి=పొంది. సందేశ హారిణులు = దూతికలు ('స్యా త్సందేశహరో దూతః' అమ.) మందమంద గమనంబునన్ = మంద ప్రకార మయిన నడకతో. ఆ త్రైలోక్య సుందరిన్ = మూఁడులోకములలోను సుందరి యైన యాదమయంతిని. సముచిత సత్కారంబులు = తగిన సమ్మానములు. సఖీ నిర్దిష్టంబులు = చెలికత్తెలచేత చూపఁబడినవి. ఆ - సంచారికా చతుష్టయంబునందున్ = దూతికలు ('దూతీ సంచారికే సమే.' అమ.) నలువురలో, విస్పష్ట మధుర ఆలాప = స్ఫుటములు మధురములు నయిన మాటలు గలది. నర్మ ఉక్తి నిపుణ = వేడుక మాటలయందు జాణ ('ద్రవ కేళి పరీహాసాః క్రీడా ఖేలా చ నర్మ చ' అమ.) ఇంగి ... రద = అభిప్రాయ సూచకము లయిన ఆకారములయొక్కయు చేష్టలయొక్కయు భేదములను ఎఱింగినది. పుంవత్ ప్రగల్భ = పురుషునివలె ప్రతిభ గలది. జంభారి గారాపు శంభళి = ఇంద్రునికి ప్రియ యైన దూతి. హస్త అంభోరుహంబులు మోడ్చి = కమలముల వంటి చేతులు మొగిడ్చి (అంజలి చేసి యనుట.)

సీ. అవధారు దేవి, దివ్య కిరీట కోటి సం (6-77)
దానిత వికచ మందార దామ

సందోహ మకరంద బిందు ధారా ధౌత
సందీప్త చరణారవిందుఁ డైన
సంక్రందనుండు నా స్వామి; స న్నాయింద్రుఁ
గారాబు సంచారిఁ గా నెఱింగు;
పాలిండ్ల కొత్తుగాఁ బరిరంభణము సేసి (6-78)
యడిగె నీసేమ మయ్యమర విభుఁడు;

తే. పారిజాతక మాల్యం బుపాయనముగ (6-86)
నముచి దమనుండు పుత్తెంచె నాతి, నీకుఁ;
గైకొనుము దీని.—నని యిచ్చె నాకవనిత
పూర్ణ చంద్ర ని భాస్య క పూవుదండ. 120

దేవి=ఓదమయంతీదేవీ, అవధారు=చిత్తగింపవలయును ( ఇది మాన్యులకు విన్నవించుకొను మాట), దివ్య...డు - దేవతలయొక్క (దివి భవాః దివ్యాః = స్వర్గమం దుండువారు) మకుటముల యగ్రములందు ('అత్యుత్కర్షాశ్రయః కోట్యః' అమ.— అశ్రి = అంచు) కట్టఁబడిన ('బద్ధే సందానితం మూత ముద్దితం సందితం సితమ్' అమ.) వికసించిన మందార కుసుమముల మాలికల సమూహముయొక్క తేనె బొట్ల ధారలచేత కడుగఁబడిన వై (ఆహేతువుచేత) వెలుఁగుచున్న వగు పాద పద్మములు కలవాఁడు, ఐన - సంక్రందనుండు = దేవేంద్రుఁడు ('సంక్రన్దనో దుశ్చ్యవన స్తురాషా ణ్మేఘవాహనః' అని ఇంద్రపర్యాయములలో అమ.), నా స్వామి = వ న్నేలు దొర. ...సంచారిఁగాన్ = దూతికనుగా,...ఆ - అమరవిభుఁడు = వేలుపు ఱేఁడు, పాలిండ్లకున్ = (నీ) స్తనములకు, ఒత్తుగాన్ = బిగువుగా, పరిరంభణము = ఆలింగనము. చేసి, నీ - సేమము= క్షేమమును, అడిగెన్ ; నాతి = ఓతరుణీ, నముచి దమనుఁడు = నముచిదానవుం గొట్టిన యాయింద్రుఁడు, నీకున్, ఉపాయనముగన్ = చేకానుకగా ('ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్త థోపదా' అమ.), పారిజాతక మాల్యంబు=గున్న పారిజాతపుఁ బువ్వుల దండను, పుత్తెంచెన్= (ఇదిగో నాచేత) పంపినాఁడు; దీనిన్; కైకొనుము = పుచ్చుకొమ్ము, అని, నాకవనిత = స్వఃస్త్రీ, పూర్ణ చంద్ర నిభ ఆస్యకున్ = నిండు నెల వంటి మోము గల దైన యాదమయంతికి, ఆ పూవు దండన్, ఇచ్చెన్.

'అవధారు'-'అవధారయతు' అను సంస్కృతపదముయొక్క ప్రాకృతరూప మగు 'అవధారఉ' అను పదమునకు ఇది వైకృతము. ఇందు అచ్చ తెనుఁగులో లేనిది ఒత్తక్షరము ఉండుటయు, ఇది ప్రాకృతమునుండి తిఙంతమునకు వైకృతం బగుటయు, ప్రకృతిలో ప్రథమపురుషమై యుండుటయు విశేషములు; 8 ఆ. 91 చూ.

'మంధార దామ'- 'పారిజాతక మాల్యంబు' - 'ద్విహీనం ప్రసవే సర్వమ్' అను నమరోక్తి చేతను తన్మూలము లయిన 'ఫలే లుక్' 'పుష్పమూలేషు బహుళమ్' అను సూత్రవార్తికములచేతను మందారపారిజాతక శబ్దములు నపుంసకలింగమున పుష్పవాచకము లయినవి. ఇతర దేవతరు మాల్య

మును మాని దమయంతికి పారిజాతకమాల్యమును పంపుటలో విశేష మేమనఁగా, దేవతరువులు అయిదింటిలోను పారిజాతము శ్రేష్ఠము :—

> 'తేషాం మహార్హాసన సంస్థితానా । ముదార నేపథ్య భృతాం స మధ్యే
> రరాజ ధామ్నా రఘు సూను రేవ । కల్పద్రుమాణామివ పారిజాతః.' రఘు.

'క' ప్రత్యయముచే గున్నతనము సూచితము; ఇంద్రుఁడు స్వయముగా తనచేతితో ఆపువ్వులను కోయుట లోనగునవి స్వారస్యములు.

పుత్తెంచినాఁడు నీకు.'— అని ప్రతులలో పాఠము. ఇట యతి విచారణీయము. 'పుత్తెంచి నవాఁడు' అను సమాసమున సంధివశమున వకార లోపముచే 'ఆఁడు' మిగిలి, 'పుత్తెంచినాఁడు' అయినది. కావున నిట ఆకారమునకే యతి యిడవలయును. 'తెలవ' 'ఉవిద' ఇత్యాది సంబుద్ధులు తర్వాతి పద్యములందుం గలవు; ఇటను అట్టి సంబుద్ధిగా 'పుత్తెంచె నాతి నీకు' అని కవి రచించె నని తలంపఁ దగును.

వ. ఇట్లు కనక కదళీ పలాశ గర్భగతం బై నిర్భ రామోద మధురం బగు దివ్యదామం బయ్యాదిగర్భేశ్వరికి సమర్పించి (6-86) యి ట్లనియె.— 121

కనక కదళీ పలాశ గర్భ గతంబు = పసిండి యరఁటి యాకు(ఁ బొట్లము)లోపల నున్నట్టిది. నిర్భర ఆమోద మధురంబు = మిక్కుటమైన యుత్కృష్టపరిమళముచే ప్రియ మైనది ('విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే । ఆమోదః సోఽతినిర్హారీ,' 'స్వాదు ప్రియౌ తు మధురౌ' అమ.) దివ్యదామంబు = స్వర్గ భవ మయిన యీ పూవుమాలను. ఆది గర్భేశ్వరికిన్ = గర్భములో నునికి యాదిగా నైశ్వర్యవంతురా లైన యాదమయంతికి.

ఉ. చంచలనేత్ర, దివ్య లిపి సంతతి భూజనముల్ పఠింప లే (6-77)
రంచును మానెఁ గాని, నఖ రాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు
త్తెంచుఁ జుమీ మహేంద్రుఁడు మదీయ కరంబున దేవతా వనీ
కాంచన కేతకీ కుసుమ గర్భ దళంబునఁ గార్యపద్ధతుల్. 122

చంచలనేత్ర = ఓ చపలాక్షీ, మహేంద్రుఁడు = దేవేంద్రుఁడు, నఖర అగ్రమునన్ = గోటి కొనతో ('పునర్భవః కరరుహో నఖోఽస్త్రీ నఖరోఽస్త్రియామ్' అమ.), లిఖియించి = వ్రాసి, మదీయ కరంబునన్ = నా దయిన చేతితో, దేవ...నన్ - దేవతల యారామములోని (నందనవన ములోని) బంగారు మొగలి (పసుపుఁబూవుల మొగలి - గేదంగిపూవు)లోపలి రేకునందు, కార్య పద్ధతుల్ = (కామ) క్రియా సరణులను, నీకున్ పుత్తెంచున్ చుమీ = పంపించి యే యుండును, కాని = అయినను, దివ్య లిపి సంతతిన్ = దేవతల వ్రాఁత వరుసను, ...మానెన్ = మానినాఁడు.

ఓ చంచలాక్షీ, దేవేంద్రుఁడు దేవలిపిని భూజనులు చదువ నేరని కారణముచేత నీకు కామ లేఖమును (వలరాచకమ్మను) వ్రాయ లేదే గాని, అటు గా వున్న నందనోద్యానంపు బంగారు మొగలి పూవుయొక్క లోపలి రేకుమీఁద గోటికొనతో మదనకార్య సరణులను వ్రాసి నీకు నాచేత నే పంపియుండును జుమా.—అతనికి నీమీఁది కూరిమి అంత మిక్కుటము మనుట.

'నఖరాగ్రమునఁ' గోటికొనతో వ్రాయుట విలాసముచేత, వైదగ్ధియు నగును. వ్రాసి పంపుట అన్యముఖసంక్రాంతి లేక తానే ప్రత్యక్షముగా చూచి మాటలాడుటతో సమానముగా నుండుటకు. అట్లే కాళిదాసు విక్రమోర్వశిలో వచించినాఁడు;—

'తుల్యానురాగపిశునం లలితార్థబన్ధం । పత్త్రే నివేశిత ముదాహరణం ప్రియాయా:
ఉత్పక్ష్మణా మమ సఖే మదిరేక్షణేన । తస్యా స్సమాగత మివాననమాననేన.'

'దేవతావనీ'—మానుషా ద్యన్య జన దుర్లభ మనుట. 'కాంచన కేతకీ కుసుమ గర్భ దళంబులఁ'— బంగారుతాటియాకువలె నుండుటకొఱకు. 'పుత్తెంచుఁ జుమీ'— ఆతని వరించినచో నీవును దివ్యలిపిం బఠింప నేర్తువు. అప్పుడు ఆతఁడు నీకు స్వయముగా అట్టి పలరాచకమ్మలు పంపఁ గలఁడు. అతని వరించి అట్టి భాగ్యముం బొందు మనుట. 'మదీయకరంబునఁ' — నీకు ఆలిపి తెలియని దోసముచే ఆతని సందేశము నానోట నీకు వచ్చినదే గాని, ఒండుచో నేను ఊరక జాబు తేవలసిన మాత్రపు దాననే సుమా, ఆంతరంగికురాల వేమో ఎప్పటికిని నీవే అనుట. భూజనలిపిలో నే వ్రాయమి అన్యగోచర మగు ననుశంకచేత.

**తే.** తెఱవ, యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు నిన్ను, (6-79)
నెరయ నిది తప్పు గాదె? సంవరణవేళఁ
గట్టు మమరేంద్రు కంఠంబుఁ గప్పురంపుఁ
బలుకు లెడఁబెట్టి కట్టిన యలరుదండ. 223

తెఱవ = ఓయింతీ, (ఇంద్రుఁడు), ఇన్నాళ్లుఁ = ఇంతకాలంబును, నిన్నుఁ అడుగఁ పుత్తేఁడు = తన్ను వరింపు మని నిన్ను దూతముఖమున ప్రార్థింపక యుండెను, ఇది = ఈ దూత్యము ఇన్నాళ్లు దాఁకం బంపమి, నెరయఁ = నిండైన - తప్పు కాదె = తప్పిదము గాదా (గొప్ప తప్పిదము గదా అనుట), (అందులకు దండనముగా), సంవరణ వేళఁ = స్వయంవర సమయమందు, అమరేంద్రు కంఠంబున్ = ఇంద్రుని మెడను, కప్పు...దండఁ = కపురపుం దునియలు పూవులును ఒకటి తర్వాత నొకటిగా గ్రుచ్చిన పూ దండతో, కట్టుము.

వరింపు మనుటకు దండింపు మనుట ఈ సంచారికయొక్క— 'నర్మోక్తి నిపుణత.'

ఇటం జెప్పిన దండన ప్రకారము వరణముగానే పరిణమించుటచేత ప్రాతికూల్యము అనుకూల్యానుబంధి యగును కావున నిది అనుకూలాలంకార మని దర్పణకారుని మతము -

'అనుకూలం ప్రాతికూల్య మానుకూల్యానుబన్ధి చేత్'
'కుపి తాఽసి యదా తన్వి, నిధాయ కరజక్షతమ్,
బధాన భుజపాశాభ్యాం కణ్ఠ మస్య దృఢం తదా.'

చంద్రాలోకమతమున దండన యనెడి వ్యాజముచేత వరణ మనెడి యిష్టమును సాధించుట గావున పర్యాయోక్తాలంకార భేదముగా నున్నది -

'పర్యాయోక్తము (1) మిషచేఁ । గార్యాప్తియు(2) నన్యభంగి గమ్యోక్తియునుఁ.' అలం.

**చ.** భువనములందు నెల్లఁ గడుఁ బూజ్యము నాకము, నాకభూమిలో (6-81)
దివిజులు ప్రాభవాధికులు, దివ్యకదంబములోఁ బులోమజా

ధవుఁడు వరేణ్యుఁ డానముచి దర్పహరుండు దృఢానురాగుఁ డై
యువిద, నిను స్వరింప మది నువ్విళులూరెడు, నెట్టిధన్యవో! 124

లోకములలో నెల్ల మిక్కిలి పూజనీయము స్వర్గము; ఆస్వర్గ సీమలో (నుండువా రందఱ లోను) వేల్పులు మహోన్నతులు; ఆవేల్పుల సమూహములోపల శచీపతి (ఇంద్రుఁడు) శ్రేష్ఠుఁడు; ఆ నముచి గర్వ దమనుఁడు (దేవేంద్రుఁడు) బల్లిద మయిన ప్రేముడి గలవాఁ డయి, ఓయువతీ, నిన్ను వరించుటకు మనస్సులో ఉత్కంఠపడుచున్నాఁడు, ఆహా! నీ వెంతటి ధన్యురాలవో గదా!— నీకు అందని పండయిన యాయింద్రుఁడే నిన్నుఁ గోరుచున్నాఁడు, కావున నీయదృష్టము ఎవ్వరికిని లేదు. దానిం గోలుపోవక యాతని వరించి ధన్య వగుము.

ఉత్తరోత్తరోత్కర్షము చెప్పబడినది గాన సారాలంకారము–

'సార మగు నుత్తరోత్తర । సారత్వ నిబంధనంబు; క్షౌద్రముకన్నన్
సారము సుధ, సుధకన్నన్ । సారములు కవీంద్ర వచన సందర్భంబుల్.' అలం.

శా. ఏ లోకంబునకై మహా క్రతు శతం బేకాగ్రతం జేసినాఁ, (6-82)
డాలోకంబు నలంకరించుటకు ని న్నర్థించె జంభారి; నీ
వా లేఖర్షభు నాజ్ఞ సేయఁ దగదే యబ్జాక్షి మైకోలుమై?
నాలస్యంబునఁ బోలె నైన నొకమా అల్లార్పు భ్రూవల్లరిన్. 125

అబ్జాక్షి = ఓ తామరసనయనా, జంభారి = ఇంద్రుఁడు, మహా క్రతు శతంబు = గొప్ప యజ్ఞములను నూటిని (నూఱు అశ్వమేధములను అనుట), ఏకాగ్రతన్ = తదేకాయత్త చిత్తతతో, చేసినాఁడు = చేసినాఁడో,... అర్థించెన్ = ప్రార్థించుచున్నాఁడు. లేఖర్షభు = దేవేంద్రునిని ('జిష్ణు ర్లేఖర్షభః శక్రః శతమన్యు ర్దివస్పతిః' అమ.) మైకోలుమైన్ = అంగీకారముచేత. ఆజ్ఞ సేయఁదగదే = పనిగొనుట నీకు మంచి యదృష్టము గాదా - దాసునిఁగా నేలుకొనం దగు ననుట. ఆలస్యంబునన్ = అలసతచేత. ... భ్రూ వల్లరిన్ = బొమ తీఁగను, అల్లార్పు = ఆడింపుము.

'మహాక్రతు శతంబు'— నూఱు అశ్వమేధ యాగములు చేసినవానికి ఇంద్రపదము వచ్చు నని శాస్త్రము. ఆప్రకారమే నూఱు గుఱ్ఱపుజన్నములు చేసి తత్ఫలముగా ఇతఁడు దేవేంద్రుఁ డయినాఁడు. 'ఏకాగ్రతన్' - మనస్సును యజ్ఞ పురుషుఁ డయిన జనార్ధనునియందే నిలిపి - ఏకాగ్రతచే ఉత్తమఫల శీఘ్రప్రాప్తి. 'ఆలోకంబు నలంకరించుటకున్'— ఆ నూఱు జన్నములును నీకొఱకే చేసినట్టివిగా పరిణమించిన వని భా. 'అలంకరించుటకున్'— అట్టి యన్ని జన్నములకు ఫల మయిన యింద్రత్వ మాతనికి నీవు లేమిచేత దేబెగా నున్నది. 'ఆలస్యంబునఁ బోలె నైన'— అంగీకారముచేతఁ గాకపోయినను అనుట; నీవు కనుబొమలను అలసతచేతనే అల్లార్చినను అంగీకారముచేతనే అల్లార్చితి వని నేను సంతోషించెద ననుట. 'అలసత' ఏకారణమున ననఁగా - అంగీకారము లేకున్నను నామాట వినుటకై నావదనమును బొమలను బిగించుకొని అవధానముతో చూచు చుండుటచేత. ఇందువలన దమయంతి అంగీకారేంగిత మేమియును వదనమునందు తోఁప దాయె ననియు, దూతికను తేచ్చవడి చూచుచు మాత్ర మున్నదనియు, ఎఱుకవడుచున్నది. 'తగదే'— నూఱు గుఱ్ఱపుజన్నముల ఫల మయిన యింద్రత్వమునకన్న నీ కవుంగిటిని ఎక్కువగా భావించిన

గౌరవప్రేమలకై గుణగ్రహణసూచనార్థ మయినను అతని వరింపఁదగు ననుట. 'భ్రూవల్లరిక'- మాటచేఁ గాకపోయినను బొమచలనముచేతనైనను నీయంగీకారమును దెలుపు మనుట.

అన్యోన్యోపకృతి చెప్పుటచే నన్యోన్యాలంకారము. ఎల్లవారికిని ఇంద్రపదవి ప్రార్థనీయము, ఇంద్రునికి నీవు ప్రార్థనీయ వైతివి, అని ఉత్తరోత్తరోత్కర్ష చే సారాలంకారంబును.

సీ. నందనోద్యాన మందారక చ్ఛాయల (6-83)
విశ్రమింపఁగ నీకు వేడ్క గాదె?
మందాకినీ పాండు మహిత సైకతములఁ
గ్రీడ సల్పఁగ నీకుఁ బ్రియము గాదె?
దుగ్ధాబ్ధికన్యక తోడికోడలు గాఁగ
నొరిమమై నుంట నీ కొప్పుఁ గాదె?
మధుకైటభారాతి మఱఁది ర మ్మని పిల్చి
పని గొంట నీకుఁ బ్రాభవము గాదె?
తే. మూఁడుసంధ్యల నీచేత మ్రొక్కు గొందు
రెవ్వ రిటఁ దొల్లి, యావేల్పు లెల్ల నీకు
నర్థి మ్రొక్కంగ నునికి భాగ్యంబు గాదె?
యేల సందేహ మమరేంద్రు నేలికొనుము. 126

దమయంతీ హృద్గత సందేహమును ఆమె భ్రూవల్లరిబిగువువలన నూహించి తత్సందేహాప నోదనార్థము దేవశంభలి మఱియు నుపన్యసించుచున్నది:—

మందారక = గున్న మందారవృక్షములయొక్క ('క' ప్రత్యయము హ్రస్వత్వమును దెలుపు చున్నది. చిగుళ్లు పూవులు ఫలములును చేతి కందుట లోనగుసౌభాగ్యము గున్నతనమునకు ఫలము.

'తత్రాగారం ధనపతిగృహా నుత్తరే ణాస్మదీయం
దూరా ల్లక్ష్యం సురపతిధనుశ్చారుణా తోరణేన,
య స్యోపాన్తే కృతకతనయః కాన్తయా వర్ధితో మే
హస్త ప్రాప్య స్తబక నమితో బాల మన్దార వృక్షః.' ఉ. మేఘ.

మందార పుష్పామోదము చెప్పవలసినదే లేదు; అవె నిష్టార్థసిద్ధియు.)

మందా...లఁ = స్వర్గంగలోని ('మందాకినీ వియద్గఙ్గా స్వర్ణదీ సురదీర్ఘికా' అమ.) తెల్లని యొప్పిదమైన యిసుకతిన్నెలయందు (నదీమాత్రముయొక్క యిసుకతిన్నెయే పాండువు, అట్లుండఁగా ధవళనది యగు స్వర్గంగలోని యిసుకతిన్నెల ధావళ్యమును చెప్పవలయునా? భూ గంగయే పావని, స్వర్గంగమాట మఱి చెప్పవలయునా? అందలిక్రీడచే - ఆనందపుణ్యంబులం బడయ వచ్చు ననుట-

'మన్దాకిన్యాః పయసి శిశిరైః సేవ్యమానా మరుద్భి
ర్మన్దారాణా మనుతటరుహాం ఛాయయా వారితోష్ణాః

ఆన్వేష్టవ్యైః కనకసికతా ముష్టి నిక్షేప గూఢైః
సంక్రీడన్తే మణిభి రమరప్రార్థితా యత్రకన్యాః.' (ఉ. మేఘ.)

దుగ్ధ అబ్ధి కన్యక = పాల మున్నీటి కూఁతురు (లక్ష్మి), తోడి కోడలు కాఁగన్ (ఇంద్రుని తమ్ముఁడు ఉపేంద్రుఁడు నారాయణుఁడే గావున, ఇంద్రుని వరింతువేని, లక్ష్మి తోడికోడ లగును, అందును నిన్ను మన్నించునట్టి చెల్లెలే అగును. 'దుగ్ధాబ్ధి' యనుటచే దేవదానవులు అంతకష్టపడి సముద్రమును మథింపఁగా జనించినట్టి కారణజన్మురాలు అని మహిమ సూచితము. ఇతరు లందఱు ఆమెను ఉపాసింతురు. ఇంద్రుని వరింతువేని నీవు ఆమెను ఆజ్ఞాపింతువు. ఎంత భాగ్యమో చూచికొమ్ము అనుట.) ఒరిమమైన్ = ఒద్దికతో. ఉంట = ఉండుట. నీకున్ ఒప్పున్.

మధుకైటభ అరాతిన్ = సాగరమున మధుకైటభులు అను నసురులం బరిమార్చిన యోగనిద్రాపరాయణుని నారాయణుని. పనిగొంట = పనులుచేయించుట. ప్రాభవము = ఏలికతనము.

మూఁడు సంధ్యలన్ = ప్రాత ర్మధ్యాహ్న సాయం సంధ్యలందు. ఎవ్వరు = ఏవేల్పులు. ఇటన్ = ఈలోకములో. తొల్లి = పూర్వము (ఇప్పుడు). కొందురు = గ్రహించుచున్నారో. అర్థిన్ = కోరికతో. మొ్రిక్కఁగన్ = నీకు మ్రొక్కుచుండఁగా. ఉనికి = వర్తించుట. ఏలికొనుము = దాసునిఁగాఁ జేసికొనుము - పెండ్లియాడి నెత్తిమీఁద నెక్కి కూర్చుండుము అనుట; శ్రుతివాక్యము నట్లే-'మూర్ధానం పత్యు రారోహ ప్రజయా చ విరాడ్భవ। ననాన్దరి చ సంరాజ్ఞీ సంరాజ్ఞీ అధి దేవృషు.'

సందేహము మాని యమరేంద్రు నేలికొనుటకు హేతువును 'కాదె' 'కాదె' యని ముగియు వాక్యములయర్థములు దెలుపుచున్నవి గాన వాక్యార్థ హేతుకకావ్యలింగము.

ఉ. ఆ ద్దివిజాధినాయకుని యానతి సేయుము; చిత్తవృత్తి నెం (6-84)
డెద్దియునుం దలంపకు; మహీన పరాక్రమ నీతిశాలి నీ
ముద్దు మఱంది కుబ్జ హరి మోసలఁ గార్యభరంబు దీర్పఁగా,
గద్దియమీఁద నుండి త్రిజగంబులు నేలికొనంగ నొల్లదే? 127

ఆవేల్పుటేని (ఇంద్రుని) యాజ్ఞను నెఱవేర్పుము (ఆతనిని పెండ్లి గమ్ము అనుట); మనోవ్యాపారముచేత మఱి దేనిని గాని తలంపకుము (మఱియొకనిని వరింపం గోరకుము, ఇందు బాధకమేమేని కలదో యను నాలోచన చేయకుము;) కొఱవడని దైన శౌర్యముచేతను అట్టి నీతిచేతను ప్రకాశించువాఁడు నీకు గారాబ మగువాఁడు (నీయెడ గారాబముగా నడచుకొనువాఁడు అనుట) మఱఁది బాలుఁడు (బావగా రయినచో ఆయనకు భయపడి చాటునకుం బోవలయు, అట్లు గాక మఱంది యగుటచేతను బాలుఁడు నగుటచేతను పనిగొనం దగినవాఁ డనుట; కుబ్జ యనుట వామనమూర్తి గాన;) శ్రీనారాయణుఁడు (సకలదేవతోపాస్యుఁడు) నీ యాస్థానియొక్క ముఖశాలయందు భారమయిన కార్యము లన్నియు తీర్చుచుండఁగా (ఇంద్రునితోఁ గూడ) సింహాసనము మీఁద కూర్చుండి మూఁడులోకములను పాలించు భాగ్యమును గోరఁదగదా? (తప్పక కోరఁదగును; కావున ఇంద్రుని వరింపుము; అని భా.)

వ. అనిన విని యక్కన్నియ మిన్నకుండె. నప్పుడా పేరోలగంబున నున్న బోటికత్తియ 'లిది యుత్తమకార్యం' బనువారును, 'నీ ప్రయోజనంబు

నకు విచారింపం బని లే' దనువారును, 'దీనికిం దగిన యుత్తరం బంగీకారంబ' యనువారును, నై, తమలోన గుజగుజలం బోవుచుండిరి (6-87). అనంతరంబ మందస్మిత సుందర వద నారవింద యగు భీమనందన హస్తారవిందంబులు మోడ్చి, సంక్రందనుం దలంచి వందనం బాచరించి, త త్సందేశహారిణిం గనుంగొని యి ట్లనియె (6-90). 128

మిన్నక = ఊరక (ఉత్తరము చెప్పక). బోటికత్తియలు = చెలికత్తియలు. గుజగుజలం బోవుచుండిరి = తమలో నొకరితో నొకరు చెప్పుకొను చుండిరి. మంద ... ద = చిఱు నగవుచేత అందమైన ముఖ కమలము గలది. భీమ నందన = భీమరాజు కూఁతురు దమయంతి. మోడ్చుట ఇంద్రునికిఁ గాని శంభళికిఁ గాదు.

తే. వేదములు నాల్గు వేవేల విధులఁ బొగడ, (6-91)
మనము వొగడెడువారమే యనిమిషేంద్రు?
వేఁడికొనియెదఁ జికురాకుఁబోఁడి నిన్ను,
హరి గుణ స్తుతి సాహసిక్యంబు మాను. 129

వేవేల విధులన్ = వేయి వేల (వేనవేల - పదిలక్షల - లెక్కలేని యనుట) ప్రకారముల చేత, అనిమిష ఇంద్రున్ = దేవేంద్రుని (నిమిషము అెప్పపాటు - అది లేనివారు అనిమిషులు- దేవతలు - 'అనిమేష శ్చానిమిషో ఽ ప్యేతౌ ద్వౌ సుర మత్స్యయోః, నానా.) హరి...బు=ఇంద్రుని గుణముల స్తుతించుటయందలి తెంపరితనమును (నీవు సరిగా పొగడ లే వనుట)-

('యమానిలేన్ద్ర చన్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు
శుకాహి కపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు.' అమ.)
పూర్వార్ధమున నర్థాపత్తి. మొత్తమున కావ్యలింగము వాక్యార్థహేతుకము.

సీ. శ్రుతి నుతింపఁగ నీవు నుతియించెదే యింద్రు? (6-91)
నతివ, యీసాహసిక్యంబు మాను;
సకలాత్మసాక్షికి శతమన్యునకు వేఱ ,,
చెప్పంగ వలయునే చిత్తవృత్తి?
హరియాజ్ఞ లక్షించి నాకు రోచ్చార పా (6-92)
రుష్య భారమున కోరుచునె జిహ్వ?
సంక్రందనుని దివ్య సందేశవాక్యంబు ,,
ధరియింతు మాళిఁ బూదండఁ బోలె.

తే. రాజు నాఁగ నిజాంశ సంప్రభవుఁ డైన (6-94)
జిష్ణునకు నేను బరిచర్య సేయఁగలను.

మున్నె నలునకు న న్నిచ్చు కొన్నదాన, (6-95)
నింక నెరునకు నెబ్బంగి నిత్తుఁ జెపుమ? 130

శ్రుతి = వేదము. నుతింపఁగన్ = పొగడుచుండఁగా. నీవున్ = నీవు కూడ (నీవు శ్రుతితో సమానురాలవా? అని దెప్పరము; అతనిమహిమ వేదపూరుషుని కెఱుక గాని నీబోంట్లకు గోచరించునది కాదు, అనుట.) అతివ=ఓయింతీ.

ఎల్లవారి హృదయములకును ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.) సాక్షి (సాక్షాత్తుగా చూచువాఁడు - సర్వాంతర్యామి యనుట) యైన నూఱు జన్నముల వానికి (ఇంద్రునికి - 'శతమన్యు ర్దివస్పతిః' అమ.) నా మనోవ్యాపారమును (నే నెవరిని కోరుచున్నానో? నాకు తనయందు భక్తి కలదో లేదో? ఇత్యాదికమును) చెప్ప నక్కఱ లేదు (నేను చెప్పకుండ నే ఆయనకే తెలిసియున్నది.)

ఇంద్రుని యాజ్ఞను ఉద్దేశించి (అందుల కుత్తరముగా) 'న' అనెడి (నేను చేయను అనెడి) యక్షరమును ఉచ్చరించుటచేత నగు కాఠిన్యముయొక్క శ్రమను (నా) నాలుక ఓర్వదు (ఇంద్రాజ్ఞకు ఎదురు సెప్పను, దానిని నెఱవేర్చెదను. - ఇట్లు చెప్పుట నీతిప్రజ్ఞ.)

ఇంద్రుని యుత్కృష్ట వాచికమును ('సందేశవా గ్వాచికం స్యాత్' అమ. - చెప్పి పంపిన వార్తను.) కొదలయందు పుష్పమాలికనుంబోలె తాల్చెదను (కొదల గౌరవమును సూచించును, పుష్పమాలా సాదృశ్యము ప్రీతిని పదిలమును సూచించును, ధరించుట నెఱవేర్చుటయే.) — ఉపమ.

నెఱవేర్చుప్రకారముం జెప్పుచున్నది;— (నల) రాజు అను పేర (ఏ రా జయినను ఇంద్రాద్యంశజాతుఁడే యగును గదా, అట్లుండఁగా నలరాజే యని యె ట్లర్థ మేర్పడును? అనిన—'రాజు నాఁగ' అనుమాటలకు 'రా జన్నఁ దానే రాజుగా' అని యర్థము చెప్పవలయును, కడమరాజులు రాజు లనం దగరు, కావున వారు ఇంద్రాద్యంశజాతులు గారు, ఇతఁ డొక్కఁడే రా జనం దగిన వాఁడు, గావున ఇతఁ డొక్కఁడే తదంశజాతుఁడు అని భా.) తన (ఇంద్రుని) దైన యంశమువలన మంచిపుట్టుక గలవాఁ డైన (తన యంశ మయిన యనుట - 'అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః' మను. ఎనమండ్రు లోకపాలుర యంశములచే రాజు నిర్మింపఁబడును, అని యర్థము.) జయశీలునికి ('జిష్ణు ర్నా వాసవే ఽర్జునే । జిత్వరే వాచ్యవత్' నానా.—ఇంద్రుని కనియు) నేను ఉపాసన('వరివస్యా తు శుశ్రూషా పరిచర్యా ప్యుపాసనా' అమ.) చేసెదను....

అన్యాసక్త నని చెప్పుట వాస్తవకథనమే గాక మంచినీతిప్రయోగము. ఏల యన, అన్యాసక్త మనోదత్త యను పౌనర్భవకన్య, వేఱొకనికి భార్యార్థము పనికి రాదు;—

'సప్త పౌనర్భవాః కన్యాః వర్జనీయాః కులాధమాః;
వాచాదత్తా, మనోదత్తా, కృతకౌతుకమఙ్గళా,
ఉదకస్పర్శితా యా చ, యా చ పాణిగృహీతికా,
అగ్నిం పరిగతా యా చ, పునర్భూప్రసవా చ యా;
ఇ త్యేతాః కాశ్యపే నోక్తా దహన్తి కుల మగ్నివత్.'

అట్టిది కులదాహిక గావున తన్ను ఇంద్రుఁడు కోరఁగూడ దని భా. అంబను సాల్వాసక్తను భీష్ముఁడు త్యజించిన వృత్తాంతము:—

'ఆసక్తాఽపి కురఙ్గాక్షీ శఙ్కనీయా విచక్షణైః,
అన్యాసక్తా న వక్తవ్యా భీష్మే త్యేతి న్యకాకి సా.' బాలభారత.

నలుఁడు ఇంద్రుఁడే అను వ్యాజముచే ఇంద్రపరిహార నలవరణ రూపేష్టసాధనముం జెప్పుట చేత పర్యాయోక్తాలంకారభేదము.

తే. నలుని వరియింపఁ గోరెడు నాకు నిప్పు (6-96)
డింద్రుపలుకు లయుక్తంబు లింపు గావు;
కామసుఖములు నిర్వాణ కామ మతికిఁ
దలఁప రుచియింప నట్టి చందంబు గాఁగ. 131

నిర్వాణ కామ మతికిన్ = మోక్షమందు కోరికగల దైన మనస్సు గలవానికి ('నిర్వాణం నిర్వృతౌ మోక్షే వినాశే గజమజ్జనే,' 'స్మరాభిలాషయోః కామోఽనుజ్ఞాయాం కామ మవ్యయమ్' నానా.), కామ సుఖములు = మదన సౌఖ్యములు, తలఁపన్ = స్మరించుటకు (నయినను), రుచియింపనట్టి = ప్రియపడని - చందంబు గాఁగన్ = విధముగా. ...

మదన సుఖములకును బ్రహ్మానందమునకును ఎంత భేదమో ఇంద్రునికిని నలునికిని అంత భేదము. ముక్తికామునికి కామసుఖములు ఎంత తుచ్ఛములో నలకామకు నాకును ఇంద్రుని సంపర్కము అంతతుచ్ఛము, అనియు, భా.—ఉపమాలంకారము.

'కరము రుచియింప కునికి యుక్తంబు గాదె' అని చతుర్థపాద పాఠం బేని, అయుక్తత యను సామాన్యధర్మము విషయివిషయపరవాక్యద్వయియందు నిబద్ధమగును గాన ప్రతివస్తూపమ.

మ. ఇల వర్షంబులలోన భారతము భూయిష్ఠంబు నాల్గాశ్రమం (6-97)
బులలోనన్ గృహమేధి యాశ్రమమునుం బోలెం; బయోజాక్షి, యి
చ్ఛలఁ గావించెద భర్తృభక్తి గరిమన్ శర్మోర్మి కిర్మీర ని
ర్మల ధర్మాగమ మర్మ నర్మ సఖ సమ్యక్కర్మ కాండంబులన్. 132

ఇలన్ = భూలోకములో, వర్షంబుల లోనన్ = జంబూద్వీపములోని వర్ష సంజ్ఞక భూవిభాగముల లోపల, (వర్షములు తొమ్మిది - భారత కిన్నర హరి కురు హిరణ్మయ రమ్యక భద్రాశ్వ కేతుమా లేలావృతములు.—

'స్యా ద్భారతం కింపురుషం హరివర్షం చ దక్షిణాః,
రమ్యం హిరణ్మయ కురూ సుమేరో రుత్తరా స్త్రయః,
భద్రాశ్వ కేతుమాలౌ తు ద్వౌ వర్షౌ పూర్వపశ్చిమౌ,
ఇలావృతం తు మధ్యస్థం సుమేరు ర్యత్ర తిష్ఠతి.' వాచస్పతి.

నాల్గు ఆశ్రమంబుల లోనన్ = బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసము లనెడి నాలుగు ధర్మాచరణవిశేషములలో ('బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో భిక్షు శ్చతుష్టయే । ఆశ్రమోఽస్త్రీ' అమ.), గృహమేధి యాశ్రమమునుం బోలెన్ = గృహస్థాశ్రమము వలె, భూయిష్ఠంబు = గొప్పది (పుణ్యభూమి యగుటచేత శ్రేష్ఠ మనుట. గృహస్థాశ్రమ ప్రాశస్త్యమునకు మనువచనము:—

'యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వజన్తవః,
తథా గృహస్థ మాశ్రిత్య వర్తన్తే సర్వ ఆశ్రమాః;
యస్మాత్ త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానే నాన్నేన చాన్వహం
గృహస్థే నైవ ధార్యన్తే తస్మా చ్ఛ్రేష్ఠాశ్రమీ గృహీ.
భారతవర్ష శ్రైష్ఠ్యమునకు స్మృతివచనము:—
'గాయన్తి దేవాః కిము గీతకాలే జాతా స్తు యే భారతభూమిభాగే
స్వర్గాపవర్గాస్పద మార్గభూతే భవన్తి తే నో పురుషాః స్వధాభుజః.'),
పయోజాక్షి = ఓకమలనేత్రా, ఇచ్చలన్ = కోరికలతో (పా. నిచ్చలు = సర్వదా), భర్తృభక్తి గరిమన్ = పతియొక్క (పతికి నేను జేసెడి) సేవయొక్క పెంపుచేత, శర్మ ... లన్= శర్మ=సుఖముయొక్క 'శర్మ శాత సుఖాని చ' అమ.) - ఊర్మి = ప్రవాహములచేత - కిర్మీర= చిత్ర మయిన ('చిత్ర కిర్మీర కల్మాష శబ లైతా శ్చ కర్బురే' అమ.) - నిర్మల = పరిశుద్ధము లయిన - ధర్మ ఆగమ = ధర్మ శాస్త్రములయొక్క - మర్మ = రహస్యములకు - నర్మ సఖ = వేడుకమిత్త్రము లయిన - సమ్యక్ = యథావిధి యైన-కర్మ = శ్రౌతస్మార్త కర్మలయొక్క - కాండంబులన్ = సమూహములను, కావించెదన్ = చేసెదను.

భూలోకములో నెల్ల పుణ్యభూమి యగుటచే శ్రేష్ఠ మయిన భారతవర్ష ములో నివసించుచు, ఆశ్రమములలో శ్రేష్ఠ మైన గృహస్థాశ్రమము నవలంబించి, పాతివ్రత్యవిరాజిత నై, పతితోఁగూడ, శాస్త్రోక్తము లైన స్మార్తకర్మలను దేవతాప్రీతిగా జన్మములనుం జేయుచు, ధర్మ మార్జించెద.—

ఉపమయు, సారాలంకారమును. ర్మావృత్తిచేత వృత్త్యనుప్రాసంబును:—

'ఒకటి రెండును మూఁడు నై యొలయుత్రాలు। పద్యమున నచ్చటచ్చటఁ బరఁగునేని
వృత్త్యనుప్రాస మన నది విస్తరిల్లు। లలిత రీతుల నెల్ల విలాస మగుచు.' విన్నకో.

ఉ. శర్మమె కాని, యవ్విబుధ సద్మమునందుఁ దలంచి చూడఁగా (6-98)
ధర్మము సేయ లే; దిచట ధర్మము సేయఁగ, నిర్విశంకతన్
శర్మము నొందనుం, గలదు; శర్మము ధర్మముఁ గాంచు టొప్పునో,
శర్మముఁ గాంచు టొప్పునొ, విచారము సేయుము నెమ్మనంబునన్. 33

ఇంత కర్మకును ఫలము స్వర్గమే గదా, అది యత్నశమముగా వచ్చుమార్గమును విడిచి తదర్థమై బహుళకర్మాచరణప్రయాసముం బూన నేల యను శంకకు సమాధానముం జెప్పుచున్నది.—

తలంచి చూడఁగాన్, ఆ - విబుధ సద్మమునందున్=దేవలోకమునందు ('అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధా స్సురాః,' 'గృహా గేహోదవసిత వేశ్మ సద్మ నికేతనమ్.' అమ.), శర్మమె కాని = సుఖము మాత్రమే గాని, ధర్మము = వేద చోదిత క్రత్వాది కర్మమును, చేయన్ = చేయుట, లేదు = వలనుపడదు; ఇచటన్ = ఈలోకమందు, ధర్మము చేయఁగన్ = ధర్మము నాచరించుటకును, నిర్విశంకతన్ = నిర్భయముగా, శర్మమున్ = సుఖమును, ఒందనున్ = పొందుటకును, కలదు = వలనుపడును. శర్మ ... నన్ - సుఖమును ధర్మమును రెంటిని సాధించుట మేలో సుఖమును మాత్రమే అనుభవించుట మేలో నీ నెందుమనస్సులో (మనస్సులో చక్కఁగా) ఆలోచింపుము.

ఇందులభావ మే మన.—ఏపుణ్యముచేత స్వర్గ శర్మము కలుగునో అది తచ్ఛర్మానుభవముచే వ్యయిత మై పోఁగా, అనంతరము అశర్మమే గదా ప్రాప్తించును; ఇటనే యుండి పూర్వకృత ధర్మఫల మైన శర్మము నిపు డనుభవించుచు భావిశర్మముకై ధర్మమును కూడ ఆచరించుచుండిన, ఎప్పటికిని శర్మపరంపర కలుగుచు నే యుండును, కావున నలుని వరించి యిట నే యుండి శర్మ ధర్మములు రెండును సాధించుచుండెదను;—అని భా. ఉక్తమునకును వక్ష్యమాణమునకును ;—

'స్వర్గస్య మే గుణాన్ బ్రూహి సాంప్రతం ద్విజసత్తమ,
ఏత త్సర్వం ద్విజశ్రేష్ఠ, కరిష్యామి న సంశయః....
సర్వకామ సమృద్ధా శ్చ సుఖ దుఃఖ వివర్జితాః
నరా స్సుకృతిన స్తే తు విచర న్తి యథాసుఖమ్.
సత్యా స్తపః స్థితాః శూరా దయావ న్తః క్షమాపరాః
యజ్వానో దానశీలా శ్చ తత్ర గచ్ఛ న్తి తే నరాః;
న రోగో, న జరా, మృత్యు, ర్న శోకో, న హిమాదయః;
న తత్ర క్షు త్పిపాసా చ, కస్య గ్లాని ర్న దృశ్యతే.
ఏతే చాన్యే చ బహవో గుణా స్స న్తి చ భూపతే,
దోషా స్తత్రైవ యే స న్తి తా ఞ్ఛృణుష్వ చ సాంప్రతమ్.
శుభస్య కర్మణః కృత్స్నం ఫలం త త్రైవ భుజ్యతే,
న చాత్ర క్రియతే భూయః సోఽత్ర దోషో మహా ఞ్ఛ్రితః,
అసంతోష శ్చ భవతి దృష్ట్వా దీప్తాం పరశ్రియమ్.
సంప్రాప్తే కర్మణా మ న్తే సహసా పతనం తథా,
ఇహ యత్ క్రియతే కర్మ ఫలం త త్రైవ భుజ్యతే,
కర్మభూమి రియం రాజన్, ఫలభూమి స్త్వసౌ స్మృతా.' పాద్మపురా.

భూలోకస్వర్లోకములయందు శర్మము సాధారణము, భూమియందు ధర్మము విశేషము, కావున వ్యతిరేకాలంకారము. ఇచ్చట భారతవర్షంబున గార్హస్థ్యంబును తా నాశ్రయింతు ననుట ప్రస్తుతకార్యము, అది యభిప్రాయముగా తత్కారణమును ధర్మోత్పాదనమునకై ఆగార్హస్థ్యమునకుం గల సామర్థ్యమును ఉపన్యసించుటచేత కారణనిబంధనాప్రస్తుతప్రశంస.

క. ఇందుండి యూర్ధ్వ గతియును (6-99)
నందుండి యధోగతియును నవసానమునన్
బొందును సజ్జను; డిందును
నందును గల వాసి చూడుమా డెందమునన్. 134

ఇందుండి = భూలోకమునుండి. ఊర్ధ్వగతి = స్వర్గమునకుం బోవుట. అందుండి = స్వర్గమునుండి. అధోగతి = క్రింద (భూలోకమున) పడుట ('క్షీణే పుణ్యే మర్త్యలోకం విశ న్తి' అని గీత.) అవసానమునన్ = అంతమున (ఆయురంతంబునను స్వర్గసుఖానుభవాంతంబునను). వాసి = తారతమ్యము. డెందమునన్ = మనస్సులో.—కావున నేను ఇందే నలభార్య నై ధర్మ మాచరించుట శ్రేయము – అని భా.—అప్రస్తుతప్రశంస కారణనిబంధన.

ఉ. ఆతత మైన కర్మగతి నాయువు వీడ్కొను నప్పు డాత్మలోఁ (6-100)
గాతుక మావహించునది గావున నాక సుఖం బపథ్య; మా
పాత సుఖోన్ముఖుం డయిన పంచజనుండు భజించు దానిఁ గా
మాతుర తాతిరేకమున; నార్యుల కింపవు దత్ప్రకారముల్. 135

నాక సుఖంబు = స్వర్గ సౌఖ్యము, ఆతతము= వ్యాప్తము - ఎల్లజీవులను ఆక్రమించునది- అయిన - కర్మ గతిన్ = పూర్వకర్మముయొక్క వ్యాపారముచేత, ఆయువున్ = జీవితమును, వీడ్కొను నప్పుడు = వదలిపోవు సమయమందు, కౌతుకము = ఇచ్చను
('కౌతుకం నర్మ ణీచ్ఛాయా ముత్సవే కుతుకే ముది
పారమ్పర్యాగత ఖ్యాత మఙ్గళోద్వాహసూత్రయోః । గీతాదౌ భోగకాలేచ' మేది.), ఆవహించునది కావునన్ = కలిగించున దగుటచేత, (నాకసుఖంబు),అపథ్యము=అపథ్యమువంటిది- ( ఆయుస్సు ముగియు నప్పుడు సేవించెడి యపథ్యము జిహ్వాచాపల్యముం దీర్చి తాత్కాలిక మోద మును ఘటించును; అట్లే ఆయుస్సు ముగియునప్పుడే స్వర్గంబును ప్రాప్తించి తాత్కాలిక మోదముం ఘటించును. ఆయపథ్యమే రోగిని ముగించును; అట్లే ఈస్వర్గభోగమే మరల నరుని భూలోకమునకుం ద్రోయును. ఇట్లు ఆపాతసుఖంబును పరిణామదారుణంబును అగుటచేత స్వర్గ భోగము అపథ్యకల్పము.) దానిన్ = అట్టి యీనాకసుఖమును, ఆపాత సుఖ ఉన్ముఖుండు = ఆ రంభమాత్ర సుఖమును కోరినవాఁడు - ఐన - పంచజనుండు = నరుఁడు ('స్యుః పుమాంసః పఞ్చ జనాః పురుషాః పూరుషా నరాః' అమ.), కామ ఆతురతా అతిరేకమునన్ = కామ మనెడి వ్యాధి యొక్క ప్రకోపముచేత ('అమయోవీ వికృతో వ్యాధిశ్శోఽపటుః। ఆతురోఽభ్యమితోఽభ్యాన్తః అమ.), భజించున్ = కోరును; ఆర్యులకున్ = వివేకులకు, తత్ ప్రకారముల్ = ఆ పాటువులు, ఇంపవు=ప్రియపడవు.—కావున నేను ఇంద్రుని వరింపను, అని ప్రకృతము భా.

నాకసుఖముం దపథ్యత్వారోపముచేతను కామమందు వ్యాధితారోపముచేతను రూపకాలం కారము. 'తన కింప వు' అని విశేషము అభిప్రాయముగా 'ఆర్యుల కింపవు' అని సామాన్యముం జెప్పుటచేత సామాన్య నిబంధ నాప్రస్తుత ప్రశంసయు. ఆపాతసుఖోన్ముఖుం డనుసమస్తపదము భజించుటకు కారణముం దెలుపుచున్నది గావున పదార్థహేతుక కావ్యలింగంబును.

వ. అని పలికి యింద్ర దూతికా వాక్యంబులకు మనసు వెట్టిన బోటి క త్రియల తలం పెఱింగి వారివదనంబులు వీక్షించి యిట్లనియె. (6 - 101) 136

తే. మీఁతలం పే నెఱుంగుదు, మిన్నకుండుఁ (6-102)
డంబుజాననలార, యాయాస ముడిగి;
యే ననాది సంచారిణి యైన యాత్మ
హేతు పంక్తికి విధికి నధీన బుద్ధి. 137

అంబుజ ఆననలార = కమల ముఖులారా, ఏను = నేను, అనా...పంక్తికిన్ - అనాది= ఆది లేనట్లుగా- సంచారిణి=ప్రవహించుచున్నట్టిది - ఐన - ఆత్మ = మదీయజీవాత్మలయొక్క -

లేక - దేహములయొక్క (' ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.)-హేతు = కారణము లయిన యదృష్టములయొక్క - పంక్తికిన్ = వరుసయైన, వశికిన్ = దైవమునకు (' దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతి ర్విధిః' అమ.), అధీన = వశ మయిన (' అధీనో నిఘ్న ఆయత్తోఽస్వచ్ఛన్దో గృహ్యకోఽప్యసౌ' అమ.) - బుద్ధిన్ = బుద్ధిగలదానను (' బుద్ధిః కర్మానుసారిణీ' అని వచనము.)

ఇప్పటికి వరుసగా నే నెత్తినజన్మములు సంఖ్యాతీతములు; వానికి ఒకటొక్కటికిని తత్తత్పూర్వాదృష్టము కారణము; వాని యాపరంపరకు అదృష్టపరంపర కారణము; అయ్యదృష్టపరంపర అనాదియు తెంపు లేక ప్రవహించుచుండునదియు; ప్రాణిబుద్ధి ఆయదృష్టపరంపరకు వశమై యుండును; కాన నేను అదృష్టపరంపరావశమున ఇంద్రు నిరాకరించి నలుని కోరుచున్నాను; నేను స్వతంత్రను కాను; కావున మీరు ఇంద్రునే వరింపు మని నా కుపదేశింపఁ గడంగకుఁడు.

'పంక్తి' శబ్దము స్త్రీలింగమును అమహత్తునుం గాన, తద్విశేషణము వైకల్పికముగా స్త్రీలింగంబున నుండవచ్చును గావునను, 'సంచారిణి' యని స్త్రీలింగంబుగా ప్రయోగింపఁబడినది.

'అధీన' (ఇన మధిగతా - దొరను పొందినది - ప్రభువు గలయది - అని వ్యు. కావున, ఇన శబ్దముయొక్క ఇకారమునకు ఉపసర్గయతిగా హేకారము చెల్లినది.

ఉత్తరార్థమునర్థము మిన్న కుండుటకు హేతువు గావున వాక్యార్థక హేతుక కావ్యలింగము.

క. నియతి యచేతన; మఖిలము। నియతిప రాధీన; మిట్టి నిజ మెఱిగినచో
నియతివశు న్నియమించుట। నియతి గుఱిచి గర్హసేఁత నిష్ఫల మరయన్.

నియతి = దైవము, అచేతనము = జడము; అఖిలము = సకలవ్యవహారంబును, నియతి పరాధీనము=దైవమునకు వశము [ 'పరతన్త్రః పరాధీనః పరవాన్ నాథవా నపి.' అమ. అదృష్ట మనఁగా ప్రాక్తనభాగ్యము - అదే దైవము - దేహాంతరార్జిత మయిన తన కర్మమే దైవము - 'స్వమేవ కర్మ దైవాఖ్యం విద్ధి దేహాన్తరార్జితమ్.' మాత్స్య. దానిబలము ఎట్టిదన-

' దైవాధీనం జగత్సర్వం జన్మకర్మశుభాశుభమ్,
సంయోగా శ్చ వియోగా శ్చ; న చ దైవాత్ పరం బలమ్.' బ్రహ్మవైవర్తము],

ఇట్టి నిజము = ఈ సత్యమును, ఎఱిఁగినచోన్, నియతి వశున్ = దైవ పరాధీనుని ( పుంలింగము సామాన్యాభిప్రాయముచేత) నియమించుట = 'ఇట్లు చేయుము' 'అట్లు చేయుము' అని విధించుటయు, నియతిగుఱిచి = దైవమునుగూర్చి, గర్హ= నిందను, చేఁత = ఒనర్చుటయు, అరయన్= ఆలోచింపఁగా, నిష్ఫలము = నిష్ప్రయోజనము.

మీకు మంచి దని తోఁచినపనిని నేను చేయనందులకు మీరు నియత్యధీనురాల నని నన్ను మాని నియతిని నిందింపఁ దలంచెద రేమో? అట్లు చేతయు నింద్యమే; ఏల యన - నియతి జడము, అస్వతంత్రము; సమస్తము నియతివశము; ఈనిజ మెఱిఁగి నియతివశను అస్వతంత్రను నన్ను విధించుట యెట్లు నిష్ఫలమో, అట్లే నేను దేని వశమందుఁ బడి యున్నానో ఆ నియతిని నిందించుటయు, వ్యర్థమే; కావున నియతిని నిందింపకుఁడు. (6-102)

'నన్ను విధింపకుఁడు, నాకై నియతిని నిందింపకుఁడు,' అని ప్రకృతవిశేష మభిప్రాయము గా సామాన్యముం జెప్పినందున సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంస.

క. లోకంబున నాకీటం।బాకైటభవైరి యెల్ల యాత్మలకు నభీ (6-106)
ష్టాకాంక్ష యొక్కచందమ। యీకీలెఱుఁగంగవలదె హృదయములోనన్?

లోకములో, ఆకీటంబు = పురుగు మొదలుకొని, ఆకైటభవైరి = నారాయణునివఱకు, ఎల్ల యాత్మలకున్ = అందఱు జీవులకును, అభీష్ట ఆకాంక్ష = ప్రియముయొక్క కోరిక ('అభీష్టేఽభీప్సితం హృద్యం దయితం వల్లభం ప్రియమ్,' 'ఇచ్ఛా కాఙ్క్షా' అమ.), ఒక్కచందమ = ఏకవిధమే; హృదయములోనన్, ఈ - కీలు = మర్మమును, ఎఱుఁగంగవలదె = ఎఱుఁగవలయు.

'లోకో భిన్నరుచిః' అనుటకు ఈపద్యము విస్తరము. లోకములో పురుగు మొదలుగా నారాయణువఱకును ఎల్లజీవులును ఎవరిప్రియమును వారు కోరుదురు. ఒకరిప్రియము ఇంకొకరి ప్రియము గాదు, కావున ఒకరిప్రియమును ఇంకొకరు నిందించుట సరి గాదు.—నాప్రియమును నేఁ గోరితిని, నాప్రియము మీప్రియము గాదు, కావున నాప్రియమును మీరు నిందింపకుఁడు – అని ప్రకృతవిశేషము అర్థముగా సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంస. 139

'ఆకీటంబు'—'ఆకైటభవైరి'- ఆఙవ్యయముతో అభివిధ్యర్థమందు అవ్యయీభావములు.

తే. కొన్నిజీవులు చిదిపి తా గ్గొఱికి బ్రతుకు; (6-104)
కొన్ని నును సోఁగ వెన్నెలల్ గ్రోలి పొదలు;
భిన్నరుచులైనవానికిఁ బ్రీతి సరియ;
తగవు గా దిందులోన నేకతరగర్హ. 140

జీవులు = ప్రాణులు. ఱాల్ =ఱాలను. క్రోలి = ఆని- ఆరగించి, పొదలున్ = వర్ధిల్లును. భిన్న రుచులు = వేర్వేఱు అభీష్టములు కలవి, ఐన వానికిన్ = అగునట్టి యాజంతువులకు. ప్రీతి = సంతుష్టి, సరియ = సమానమే, ఇందులోనన్ = ఈఱాదిండి వెన్నెలదిండులలో, ఏకతర గర్హ = ఒకదాని నింద (ఒకదానిని నిందించుట - రెంట నొకటిని నిర్ధారించుటయందు తరప్పత్యయంబును రెంటికన్న పెక్కింట నొకటిని నిర్ధారించుటయందు తమప్పత్యయంబును వచ్చును), తగవు = న్యాయ్యము, కాదు.

పావురములు లోనగు ప్రాణులు ఱాలను భుజించి జీవించును. చకోరములు నున్నని నిడుద చంద్రకిరణములను కబళించి జీవించును; వీనికి అభిరుచిలో భేద మున్నను తుష్టి సమానమే; వెన్నెలచే ఇది కడుపు నిండి హాయిగా నున్నట్లు, రాలచే అది కడుపు నిండి హాయిగా నున్నది. ప్రీతిని చూడవలయునే గాని రుచిని చూడ నక్కఱలేదు. వెన్నెల తినుదానిని మెచ్చి ఱాయి తినుదానిని దూఱుట న్యాయ్యము గాదు.

'నాకు నలవరణము మేలుగాఁ గనఁబడుచున్నది, మీకు ఇంద్రవరణము మేలుగాఁ గనఁబడుచున్నది; ఇంద్రవరణమున మీరు తలంచుతుష్టి నలవరణమున నాకుం గలదు; కావున మీరు నన్ను దూఱుట సరి గాదు.' అని ప్రకృత విశేష పర మగుఁన సామాన్యోక్తి గావున సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంస.

తే. అగ్రమార్గ జాగ్ర న్నిభృ తాప దంధు (6-107)
బంధు సంరక్షణము పాడి బాంధవులకు;
నైనకార్యంబు గాని కార్యంబు దెలిసి,
యాడుఁడా; యేను మీమాట కడ్డ మాడ. 141

* పురుషకారమే లేనియట్లు వాదించెద వేమి? పురుషకారముచే దైవము నడఁచి సదీప్సిత సిద్ధిం బొందరాదా? యనునందులకును, ఇంద్రవరణముకన్న నలవరణమే శ్రేయ మని చెప్పుచున్నది.—

* ‘కృష్ణాయత్తం చ తద్ దైవం; స దైవాత్ పరత; స్తతః
భజన్తి సతతం సన్తః పరమాత్మాన మీశ్వరమ్;
దైవం వర్ధయితుం శక్తః క్షయం కర్తుం స్వలీలయా
న దైవబద్ధ స్తద్భక్త శ్చావినాశీ చ నిర్గుణః.’ బ్రహ్మవైవర్తము.

‘మను రువాచ:—
దైవే పురుషకారే చ కిం జ్యాయ స్తద్బ్రవీతు మే;
అత్ర మే సంశయో దేవ, చ్ఛేత్తు మర్హ స్యశేషతః.

మత్స్య ఉవాచ:—
స్వ మేవ కర్మ దైవాఖ్యం విద్ధి దేహా న్తరార్జితం;
తస్మాత్ పౌరుష మే వేహ శ్రేష్ఠ మాహు ర్మనీషిణః.
ప్రతికూలం యథా దైవం పౌరుషేణ నిహన్యతే,
మఙ్గళాచారయుక్తానాం నిత్య ముత్థానశీలినామ్.
యేషాం పూర్వకృతం కర్మ సాత్త్వికం మనుజోత్తమ,
పౌరుషేణ వినా తేషాం కేషా ఞ్చి ద్దృశ్యతే ఫలమ్. ...
కర్మణా ప్రాప్యతే లోకే రాజసస్య తథా ఫలమ్,
కృచ్ఛ్రేణ కర్మణా విద్ధి తామసస్య తథా ఫలమ్.
పౌరుషే ణాప్యతే రాజన్, మార్గితవ్యం ఫలం నరైః;
దైవ మేవ విజానన్తి నరాః పౌరుషవర్జితాః.
తస్మా త్త్రికాలసంయుక్తం దైవేన సఫలం భవేత్;
పౌరుషం దైవసంపత్త్యా కాలే ఫలతి పార్థివ.
దైవం పురుషకార శ్చ కాల శ్చ నృపసత్తమ,
త్రయ మేవ మనుష్యస్య పిణ్డితం స్యా త్ఫలావహమ్.
కృషే ర్వృష్టిసమాయోగాత్ దృశ్యన్తే ఫలసిద్ధయః,
తా స్తు కాలే ప్రదృశ్యన్తే నై వాకాలే కథఞ్చన.
తస్మాత్ స దైవ కర్తవ్యం సధర్మం పౌరుషం నృభిః,
ఏవం తే ప్రాప్నువ న్తీహ పరలోకే ఫలం ధ్రువమ్.
నాలసాః ప్రాప్నువ న్త్యర్థా న్నచ దైవపరాయణాః,
తస్మాత్ సదైవ యత్నేన పౌరుషే యత్న మాచరేత్.
త్యక్త్వాలసాన్ దైవపరాన్ మనుష్యా । నుత్థానయుక్తాన్ పురుషాన్ హి లక్ష్మీః
అన్విష్య యత్నాద్ వృణుతే నృపేన్ద్ర । తస్మా త్స దోత్థానవతా హి భావ్యమ్.’

బాంధవులకున్ = సుహృత్తులకు, అగ్ర ... ము - అగ్ర = ముందటి - మార్గ = దారిలో - జాగ్రత్ = కుదిరియున్న - నిభృత=అవిదిత మయిన (మఱుఁగుపడి యున్న) - ఆపత్ = ఇక్కట్టు అనెడి - అంధు = బావి కల - బంధు = సుహృత్తుయొక్క - సంరక్షణము = కాపు, పాడి = న్యాయ్యము; ఐన కార్యంబు = హిత మయిన యుద్యమమును, కాని కార్యంబు =అహిత మైన యుద్యమంబును, తెలిసి, ఆడుఁడా = పలుకుఁడు; ...

గడ్డి గాదము చిగిరింత చిదుగులు లోనగువానిచేత మూఁతపడి కానరాని బావి యొకటి ముం దున్న దని యెఱుఁగక దానిమీఁదికి పోవువానిని దానియునికి నెఱిఁగిన సుహృత్తు ఆదారిని పోవల దని వారించునట్లు, తెలియక ఆపదలోఁ గూలఁబోవుచున్న వానిని ఆప్తులు వారించుట న్యాయ్యము. అట్లే ఇంద్రవరణము అవిది తాంధకూప మార్గ గమనమువంటిది, మీరు నన్ను దాని నుండి నిషేధించుట న్యాయ్యము. నలవరణము అట్టిది గాదు. ఆభేదము తెలియక మీరు నలవరణము నుండి నన్ను నివారింపఁ జూచుచున్నారు. మీరు హితాహితములను చక్కఁగా వివేచించికొని చెప్పుఁడు; మీమాటను నేను ఉల్లంఘింపను.—దైవమును నిరాకరించి పురుషకార మవలంబించినను నలవరణమే కరణీయ మనుట.—పూర్వార్ధమున రూపకాలంకారము. ఐన...డా - ఇది అడ్డ మాడమికి హేతుపరము, కావున వా. హే. కావ్యలింగము.

వ. అని సఖుల నెల్ల నివారించి పురుహూత దూతికం గనుంగొని మఱియు నిట్లనియె. (6-108) 142

పురుహూత = ఇంద్ర.

ఉ. స్వర్పతి చిత్తవృత్తి గలుషత్వము నొందునొ యన్భయంబు నా
కేర్పడ లేదు, విన్ము దివిజేశ్వర దూతిక, సప్తతంతు భా (6-110)
గార్పణ మాచరించి కర మాదరణంబున నేను రాజ కం
దర్పుఁడు నైషధాధిపుఁడుఁ దన్ను నుపాస్తి యొనర్పఁ జాలుటన్. 143

దివిజేశ్వర దూతిక = ఓ యింద్ర శంభళీ, వినుము; రాజ కందర్పుఁడు = కామునివంటి వాఁడును రాజును అగు - నైషధాధిపుఁడున్=నలమహారాజును, ('సస్త్రీకో ధర్మ మాచరేత్' - స్త్రీసమేతుఁ డై ధర్మము చేయవలయును - అనువచనముం బట్టి), నేనున్=నేనును, తన్నున్ = ఇంద్రుని, సప్త...ము- సప్తతంతు = యజ్ఞములయొక్క (యజ్ఞములందలి హవిస్సులయొక్క) - భాగ = పాళ్లయొక్క - అర్పణము = ఒసంగుటను, ఆచరించి=చేసి, కరము ఆదరణంబునన్= నిండు భక్తితో, ఉపాస్తి యొనర్పఁ జాలుటన్ = సేవ చేయ సమర్థుల మై యుండుటంబట్టి, స్వర్పతి చిత్త వృత్తి = ఇంద్రుని మనో వ్యాపారము, కలుషత్వమున్ = (నామీఁద - లేక - మామీఁద) మాలిన్యమును (కోపము ననుట), ఒందునో అనెడి భయంబు, నాకున్, ఏర్పడన్=రూఢిగా (బొత్తిగా ననుట), లేదు.

'కందర్పుఁడు'—ఇంద్రుఁడు నలునంత సుందరుఁడు కాఁడనుట. 'సప్తతంతుభాగార్పణము'- ఇంద్రుఁడు నాయొసంగు హవిర్భాగములు భుజింపం దగు నేగాని నాతోఁ గందర్పక్రీడకుం దగఁడు,

అందులకుఁ దగినవాఁడు నలుఁడే, అనుట. 'ఉపాస్తి'— నాకు కేవలము పూజ్యుఁడు కావున ఒకవిధమైన సమత్వము వలయునట్టి సయ్యాటలు ఆయనతో సల్పుట అపచార మగు ననుట.

చ. తన హృదయాధినాయకునిఁ దక్కఁగఁ దక్కొరు సన్నుతింపఁగా
వినుట సతీవ్రతంబునకు విగ్రహ; మిట్టిది ధర్మశాస్త్ర వా (6-95)
సన; యటు గాన, నో దివిజ శంభళి, యిం కిటఁ బట్టి నీకు మీ(6-110)
యనిమిషరాజుపాదముల యాన సుమీ మఱి యేమి వల్కినన్. 144

తన - హృదయ అధినాయకునిన్ = మనఃప్రభువును (నలునికి తాను స్వహృదయ దత్త గావున ఆతఁడు తత్పతియే), తక్కఁగన్ =తప్ప (ప్రాణేశుని స్తుతిని వినవచ్చును అనుట), తక్కు ఒరున్ = కడమవాని నెవని నేని, సన్నుతింపఁగాన్=పొగడుచుండఁగా, వినుట, సతీ వ్రతంబునకున్ = పతివ్రతా ధర్మంబునకు ('సతీ సాధ్వీ పతివ్రతా' అమ.), విగ్రహము=యుద్ధము (విరుద్ధ మనుట); (ఇది నాకల్పన గాదు), ఇట్టిది = ఇట్లని, ధర్మ శాస్త్ర వాసన = స్మృతుల సంస్కారము,...ఇటఁ బట్టి=ఇప్పటి నుండి,...అనిమిషరాజు పాదముల యాన=దేవేంద్రుని పాదములపై ఒట్టు - అనఁగా ఆయనపాదముల కెగ్గు దలంచినపాపము నీకుఁ గల్గు ననుట.

వ. అని తెగనాడి యచ్చేడియ సముచితప్రకారంబున బిడౌజసునిదూతి కను వీడుకొల్పె (6-111). నగ్ని యమవరుణుల సంచారికలునుఁ దమతమకు నదియ యుత్తరంబుగాఁ గైకొని య య్యుత్తమాంగనం దగిన తెఱంగున నామంత్రణంబు చేసి చనిరి (6-109). అంతర్హితుం డైన ధరణీకాంతుం డావృత్తాంతం బంతయు నెఱింగి సంతోష భరితాంతఃకరణుం డై యక్కాంతారత్నంబునుం గనుంగొనియె (6-112). నప్పుడు. 145

తెగన్ = వ్యవహారము ముగియునట్లుగా. ఆడి=వచించి. చేడియ=చెలువ. బిడౌజసుని = ఇంద్రునియొక్క ('ఇన్ద్రో మరుత్వాన్ మఘవా బిడౌజాః పాకశాసనః' అమ.) ఆమంత్రణంబు= పోయివచ్చెద నని చెప్పుట.

—— * నలుఁడు దమయంతీ సౌందర్యమును వర్ణించుట. * ——

తే. ముదిత క్రొమ్మేని కాంతిలో మునిఁగె మొదల, (7-2)
నంత నానంద రస వార్ధియందుఁ దేలెఁ,
బిదప సమ్మోద బాష్పాంబు బిందు ధార
యందు నవగాహనము చేసె నధిపు దృష్టి. 146

అధిపు దృష్టి = నలుని చూపు, మొదలన్, ముది...లోన్ = మగువయొక్క క్రొత్త (ఇంచుకేనియు మాయని - తఱుఁగని - నిండు) దేహ లావణ్యములో, మునిఁగెన్, అంతన్ = అనంతరము, ఆనంద రస వార్ధియందున్ = సంతోష మనెడి యమృత సముద్రములో

('శృఙ్గారముఖ్య మధురాది సువర్ణ రేతో
నిర్యాస రాగ గరళ ద్రవ పారదేషు
ఆస్వాదన ధ్వని సుధా 2మ్బు ర సాఖ్య ధాతు
ష్విష్టో రసో(2థ రసనా ధరణీ రసా స్యాత్.' నా నా.),
తేలెన్; పిదపన్ = తర్వాత, సమ్మో ... రన్ = ఆనంద బాష్పముల నీటి బొట్టుల ధారలో,
అవగాహనము = స్నానము, చేసెన్.

రాజు దమయంతీలావణ్యముం గాంచి సంతోషించి యానందబాష్పంబులు గురిసె నని తా.

దృష్టి యనెడి యొక యాధేయమునకు క్రమముగా కాంతి వార్ధి ధార లనెడి మూఁడాధారములం జెప్పినందున పర్యాయాలంకారభేదము:—

'(1) క్రమముగ నొక్కటి పెక్కిట
నమరుట పర్యాయ, (2) మొకట నటు పెక్కులుగాన్.' అలం.

మునుఁగుటకుం దేలుటకు నవగాహనమునకును భిన్నదేశత్వము విరోధము; తనివి తీరఁ జూచుట సంపూర్ణముగా ననుభవించుట వహించుట యనునర్థాంతరములచేత తత్పరిహారము గావున విరోధాభాసాలంకారమును.

తే. మానవతి మూర్తి యాపాదమస్తకముగఁ (7-3)
దివుట వీక్షించి నిషధ పృథ్వీ కళత్రుఁ
డపుడు బ్రహ్మాద్వయ ప్రమోదాతిశాయి
మన్మథాద్వైత సుఖ వార్ధి మగ్నుఁ డయ్యె. 147

అపుడు, నిషధ పృథ్వీ కళత్రుఁడు=నలుఁడు (కళత్ర మనఁగా భార్య - 'కళత్రం శ్రోణి భార్యయోః' అమ. - పృథ్వి యన భూమి - భూమి భార్యగాఁ గలవాఁడు రాజు - నిషధుల రాజు నలుఁడు), మానవతి మూర్తిన్ =(ఆ) మానినియొక్క (దమయంతియొక్క - 'విశేషా స్త్వఙ్గనా భీరుః కామినీ వామలోచనా । ప్రమదా మానినీ కాన్తా' అమ. 'మాన శ్చిత్తసమున్నతౌ। గృహే క్లీబం ప్రమాణే ప్రస్థాదౌ' మేది. మానము అనఁగా చిత్తసమున్నతి - లేక - గృహము - కావున చిత్తసమున్నతిమంతురా లని యేని ఇల్లా లని యేని వ్యు.) దేహమును ('స్త్రియాం మూర్తి స్తను స్తనూః' అమ.), ఆ పాద మస్తకముగన్ = పాదములు మొదలు శిరము వఱకు రెంటినిం జేర్చుకొని (అభివిధ్యర్థమందు అవ్యయీభావము), తివుటన్=కోరికతో, వీక్షించి=చూచి, బ్రహ్మ... యి-బ్రహ్మ=బ్రహ్మ మనెడి - అద్వయ=('ఏక మే వాద్వితీయం బ్రహ్మ' అను శ్రుతివలన) రెండవది లేని వస్తువుయొక్క (సాక్షాత్కారమువలనం గలుగు) - ప్రమోద=ఆనందమును - అతిశాయి=అతిక్రమించున దైన - మన్మ...ర్ధిన్ - మన్మథ=కాముఁ డనెడి-అద్వైత=అద్వితీయవస్తువుయొక్క (ఆవేశముచేతఁ గలిగిన) (రెంటిభావము ద్విత - ద్వితయే ద్వైతము - అది లేనిది అద్వైతము)- సుఖ=ఆనంద మనెడి - వార్ధిన్=సముద్రములో, మగ్నుఁడు=మునింగినవాఁడు, అయ్యెన్.

ఉన్నతచిత్తురా లయినయాదమయంతిని కోర్కిమెయి ఆపాదమస్తకము వీక్షించి నలమహారాజు బ్రహ్మసాక్షాత్కారానందము నతిక్రమించున దైన మన్మథావేశానందము ననుభవించుచు మఱి యేమియు నెఱుంగకుండెను.

'అతిశాయి'—'జయతి'వలె ఉపమావాచకముగా గ్రహింపవచ్చును. కావున, 'ప్రహర్ష...వార్ధి' - ఉపమాలంకారము; 'మన్మథా...వార్ధి' - రూపకము.

చ. సుదతి ముఖేందు మండలము సొంపున రాగ రసాంబురాశి య (7-4)
భ్యుదయముఁ బొంది యెంతయును నుబ్బున వేల నతిక్రమించుచున్,
మదిఁ గడు భీతిఁ బొందిన క్రమంబున భూవరు దృష్టి సేరె న
మ్మద గజరాజ యాన కుచ మండల తుంగ మహీధ్రశృంగమున్. 148

'మానవా మౌళితో వర్ణ్యా దేవా శ్చరణత స్తథా' అను కవిసంప్రదాయముబడి దమయంతీ సౌందర్యమును మౌళ్యారంభముగా వర్ణించుచున్నాఁడు:—

సుద...నన్ - సుదతి = దమయంతియొక్క (శోభన మయిన దంతములు గలది వ్యు.)- ముఖ ఇందు మండలము = వదన చంద్ర బింబపు - సొంపునన్ = సౌందర్యముచేత, రాగ ... శి - రాగ = (నలునియొక్క) అనురాగ మనెడు - రస అంబురాశి= సుధా సముద్రము, అభ్యుదయ మున్=మేలును (పెంపును అనియు),పొంది, ఎంతయును‌న్ ఉబ్బునన్=మిక్కుట మైన పొంగు చేత(మిక్కుటముగా ఉప్పొంగుటచేత ననియు), వేలన్ అతిక్రమించుచున్=అతివేలము కాఁగా (మితి మీఱఁగా ననుట - 'అతివేల భృ శాత్య ర్థాతిమా త్రోద్గాఢ నిర్భరమ్' అమ. - చెలియలి కట్టను దాఁటఁగా - 'అబ్ధ్యమ్బువికృతౌ వేలా కాలమర్యాదయో రపి' అమ.- పోటెక్కఁగా అని యేని చెప్పవచ్చును - లేక - పోటును అతిక్రమింపఁగా అనఁగా సాధారణ మయిన పోటు గాక పోటునకు పోటుగా ప్రబలఁగా నని భా.), భూవరు దృష్టి=నలుని చూపు, మదిన్ = మన స్సులో, కడున్=ఎక్కువ, భీతిన్=భయమును, పొందిన - క్రమంబునన్=విధంబున, అమ్మ... మున్ - మద=మద మెక్కిన - గజరాజ=ఏనుఁగుమన్నీని - యాన = నడకవంటి నడక గల దైన యాదమయంతియొక్క - కుచ మండల = స్తన చక్రవాళ మనెడి - తుఙ్గ = ఉన్నత మయిన - మహీధ్ర=కొండయొక్క - శృంగమున్=కొమ్మును, చేరెన్=ఆశ్రయించెను.

నలునికి దమయంతిముఖ మనెడిచంద్రుని సౌభాగ్యమును దర్శించుటచే అనురాగసముద్రము ఉప్పొంగి చెలియలికట్టను దాఁటుకొని వెల్లి వోడువఁగా, అతనిచూపు తాను ఆవెల్లిలో మునిఁగి పోవుదునో యనుభయముచేతనుంబోలె ఆమత్తేభేంద్రగమనయొక్క కుచమండల మనెడి యున్నత గిరిశిఖరముపై కెక్కెను.— రాజు దమయంతిముఖముం గాంచి అనురక్తి మితి మీఱఁగా తదీయ స్తనసౌభాగ్యముం బరికింపం దొడంగెను; ఈవృత్తము చంద్రోదయమున సముద్రము పొంగి వెల్లి వోడువఁగా, దరి నున్నవాఁడు మునుకభయమున కొండ నెక్కుటవలె నుండెను.

'రాగ'ము నలునిదా దృష్టిదా? దృష్టిదే. చూడం జూడ నింకనుం జూడనే కోర్కె వొడమిన దని భా. అట్లు చూచుచునే యుండఁగా, 'వేల' - కాలము దాఁటి పోయినది, అట్లు చాల సేపు చూచి యనుట. 'మది'యు దృష్టిదే. 'భీతి'యు దృష్టిదే.

రూపకానుప్రాణితోత్ప్రేక్ష; మదగజరాజయాన - ఉపమ.

చ. మగువ ముఖేందువం దమృత మధ్యమునన్ మునుఁగంగఁ బాఱె యో,
మగువ కుచద్వయంబు నడుమం బడి రాయిడి దందసిల్లి యో, (7-5)

మగువ గభీర నాభి బిల మార్గముఁ దూఱి పరిభ్రమించి యో,
సొగపున రాజనందనుని చూపులు నిల్చెఁ దదంతరంబులన్. 149

నలునిచూడ్కులు దమయంతియొక్క ముఖచంద్రునియందు అమృతమునఁడుమ మునిఁగి పోయి నందుననో, ఆమె చనుదోయి సందునందు పడి ఒరయికచేత ఇఱికి కొన్నందుననో, ఆమె యొక్క లోఁతయిన పొక్కిటి రంధ్రపు దారిలోఁ దూఱి సుడి దిరిగినందుననో, చొక్కు (=పారవశ్యము) చేత (పరవశత నొంది) దానిదానిలోపల నిలిచిపోయెను.

నలునిచూపులు దమయంతీ ముఖ కుచ నాభి లావణ్యముం గాంచి యానందపరవశము లై ఎంత చూచినను తనివి తీరక వాని నొక్కొక్కటిని వదలి రాలేక తడయుచుండిన వని భా. 'మునుఁగుట' - అత్యంతముగా ఆసక్తము లగుట; 'మునుఁగుటం' జెప్పుటచే వదనలావణ్యము అమృతసరస్సుగా నున్న దనుట. 'పడి' - అత్యంతతృష్ణతో వడివడిం బోయి చనులసందులో కూలిన వనుట; కుచంబులు వాలు చాలని మిట్టలనియు నునుపుయొక్క పెక్కువచే కాళ్లను జాఱఁజేసిన వనియు భా. రెండుకనుల చూపులు రెండును రెండుకుచంబులమీఁదను అడుగిడి జాఱి సందునం బడిన వని 'ద్వంద్వ' శబ్దమునకును చూపుశబ్ద బహువచనమునకును స్వారస్యము. 'రాయిడి'చేత చనుఁగవనడుమ నవకాశము లే దని భా. ఈయర్థమునే కాళిదాసు కుమారసంభవములో పార్వతీ వర్ణనములో ఈవిధమునం జెప్పినాఁడు.—

'అన్యోన్య ముత్పీడయ దుత్పలాక్ష్యాః స్తనద్వయం పాణ్డు తథా ప్రవృద్ధమ్
మధ్యే యథా శ్యామముఖస్య తస్య మృణాళసూత్రాన్తర మ ప్యలభ్యమ్.

ఈరాయిడినే రత్నావళీకారుఁడు ఇట్లు వర్ణించినాఁడు:—

'పరిచ్యుత స్తత్కుచకుమ్భ మధ్యా త్కిం శోష మాయాసి మృణాళహార?
న సూక్ష్మతన్తో రపి తావకస్య త త్రావకాశో భవతః కథం స్యాత్?

రాయిడిచే పీనత్వము సూచితము. రాయిడి ధన సుఖ ప్రదము:—

'మధ్యం త్రియా త్రివళిసార్ధ మరోమశం చ,
వృత్తౌ ఘనా వవిషమౌ కఠినా వురస్యౌ,
రోమాపవర్జిత మురో మృదు చాఙ్గనానాం
గ్రీవా చ కమ్బునిచి తార్థసుఖాని ధత్తే.' బృ. సం.

'పరిభ్రమించి' - గిరగిరం దిరిగి - దీనిచే ఆవర్తము (సుడి) సూచితము; గభీర ప్రదక్షిణావర్తము శుభలక్షణము:—

'వి స్తీర్ణమాంసోపచితో నితమ్బో గురు శ్చ ధత్తే రశనాకలాపమ్,
నాభి ర్గభీరా విపులాఙ్గనానాం ప్రదక్షిణావర్తగతా ప్రశస్తా.' బృ. సం.

'సొగపునన్' - మునిఁగిపోవుట, వాలుగా జాఱి పడి యిఱుకుకొనుట, సుడిలోఁ బడి గిరగిర త్రిప్పఁ బడుటయు, సొగపును కలిగించునవి. 'నిల్చెన్' - వదలి రావని భా. ఆయాపారవశ్యము తీఱు వఱకు అచ్చటచ్చటనే నిలిచి పోయిన వనుట. చూపు లను బహు వచనముచే అట్లు మాటిమాటికి చూచుచుండె నని భా. ఇందు 'పాఱి' 'దండపిల్లి' 'పరిభ్రమించి' అనుక్త్యర్థకములు హేత్వర్థకంబులు (పౌ. వ్యా. క్రియా. 15.)—హేతూత్ప్రేక్షాలంకారము.

ఉ. కాంత మెఱుంగుఁ జన్నులకుఁ గ్రమ్మఱి క్రమ్మఱి వచ్చుచుం డెఁ దం
గాంతర సన్నివేశములకై యటు లేఁగియు నేఁగ లేక భూ (7-6)
కాంతునిదృష్టి; దిగ్భ్రమము గైకొనఁబోలు బలే తదీయ ప
ర్యంతమునం దలందిన కురంగమదం బను చిమ్మచీఁకటిన్ ! 150

భూకాంతుని దృష్టి = రాజు చూపు, అం...కై - అంగాంతర = (స్తనములకన్న) కడమ యవయవముల - సన్నివేశములకై = స్థానములకై - వానిం జూచుటకొఱకు, అటులు=ఆయాయంగములవైపు, ఏఁగియున్ = కదలియు, - ఏఁగ లేక = (ఆయాయంగముకఱకు) పోఁ జాలక (పో సిచ్చగింపక - పోవ శక్తి లేక యనియు), కాంత మెఱుంగుఁ జన్నులకున్ = దమయంతియొక్క లావణ్యవంతము లయిన కుచములంగూర్చి, క్రమ్మఱి క్రమ్మఱి = తిరిగి తిరిగి, వచ్చుచున్ ఉండెన్ (కర్త దృష్టి), తదీ...దున్ - తదీయ = ఆకుచముల వైన - పర్యంతమునందున్ = పరిసరమందు, అలందిన = పూసిన - కురంగమదంబు = కస్తూరి, అను చిమ్మచీఁకటిన్ = అనెడి కటికి చీఁకటియందు, దిగ్భ్రమము=దిక్కులు తెలియమిని, కైకొనఁ బోలు బలే=పొంది యుండును జుమా.

నలుని దృష్టి దమయంతియొక్క స్తనలావణ్యమును జూచుచుండి ఇతరాంగములం జూచుటకై వానికేసి పోయియుం బోకయే మరల ఆస్తనములమీఁదికే వచ్చుచుండెను; స్తనసౌభాగ్యమును ఎంత చూచినను తనివి తీరదాయె ననుట. మరల వానికడకే అవచ్చుట ఆస్తనములచుట్టును బూసి యున్న కస్తూర యనెడి చిమ్మచీఁకటిలో ఆదృష్టికి దిక్కు తెలియక పోయినదా యను నట్లుండెను; కడమ యవయవము లన్నియు నొకయెత్తును స్తనములుమాత్ర మొకయెత్తునుం గా నుండె ననుట. 'కురంగమదం బను చీఁకటి'- నైల్యముచే సాదృశ్యము - రూపకము. 'దిగ్భ్రమము గైకొనె' ననుట ఏతద్రూపకానుప్రాణిత మయిన హేతూత్ప్రేక్ష.

క. రమణీనితంబ చక్ర । భ్రమణంబునఁ జిక్కిఁ దిరిగి పడఁబాఱియొ భూ (7-7)
రమణునిచూపు పరిష్వం । గ మొనర్చెఁ దదూరు కదళికా స్తంభములన్.

భూరమణుని చూపు, రమణీ - నితం...నన్—నితంబ = పిఱుం దనెడి ('పశ్చాన్నితమ్బః స్త్రీకట్యాః' అమ.) - చక్ర=బండికంటియందు ('చక్రం రథాఙ్గమ్' అమ.) - భ్రమణంబునన్ = (కుమ్మరిసారెయందుంబోలె) గిరగిరఁ దిరుగుటచేత, జిక్కిఁ దిరిగి=మొగము తిరిగి, పడఁబాఱియొ = పడునట్లు ఐనందుచేతనో, తదూ...లన్ - తత్ = ఆదమయంతియొక్క - ఊరు=తొడలనెడి- కదళికా స్తంభములన్ = అనఁటి కంబములను, పరిష్వంగ మొనర్చెన్ = కవుంగిలించుకొనెను.

రాజు దమయంతియొక్క నితంబచక్ర సౌభాగ్యమును కలయం గని పిదప తదూరులావణ్యముం గనుంగొనం దొడంగెను.—'నితంబచక్ర'— 'ఊరుకదళికా' - రూపకములు; పడఁబాఱుట హేతువుగా నుత్ప్రేక్షింపఁబడినది.

ఉ. 'నేత్రమ నేను, జీరయును నేత్రమ; చీరకు నాశ్రయింపఁగాఁ (7-8)
బాత్రత గల్గె, నాకు నిటఁ బాత్రత లే.' దని నామసామ్యవై
చిత్రి కతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా
క్షత్త్రియకన్య చారు కటి చక్రము నూరు యుగంబు దూకొనెన్. 152

రాజుదృష్టి, నేను, నేత్రమక్ = కన్నును, చీరయును, నేత్రమ = నేత్రమే ('నేత్రం వస్త్రేఽక్ష్ణి వైశాఖగుణ భూరుహమూలయోః' నానా.), (మాఠెంటిలో), చీరకుక్, ఆశ్రయింపఁగాక్ = (ఈకన్నెయొక్క నితంబమును ఊరువులను) ఆలింగించుటకు, పాత్రత గల్గెక్ = యోగ్యత కలిగినది, నాకుక్ (దృష్టికి), ఇటక్ = ఈవిషయములలో (తన్నితంబోర్వాలింగనములకు), పాత్రత, లేదు = లేదాయెను, అని, నావు...నక్ - నావు = పేరిచేత నయిన - సామ్య = సమత్వముయొక్క - వైచిత్రికతంబునక్ = వింతయే కారణముగా, బలిమిక్ = బలాత్కారముచేత, కైకొనినట్టులు = స్వీకరించినట్లుగా (తటాలున), ఆక్షత్త్రియకన్య (యొక్క) - చారు...బుక్ = అందమయిన నితంబ బింబమును తొడల కవను, దూకొనెక్ = అనుభవించెను.

నేత్రశబ్దమునకు రెండర్థములు, కన్నొకటి వస్త్ర మొకటి; ఇందులో వస్త్రమునకు దమయంతీ నితం బోరు సమాలింగన యోగ్యత కలిగినది. కంటికి ఆయోగ్యత లేకపోయినది. సములలో ఒకరికి పాత్రత యుండుట ఒకరికి లేకపోవుటయు అన్యాయ్యము గదా యను కారణంబున లేని దృష్టి బలాత్కారముచేఁ గైకొన్నదా యనునట్లుగా ఆ రాచకన్నియయొక్క నితంబ బింబమును ఊరుద్వయమును కవ్వకొన్నది.—హేతూత్ప్రేక్షాలంకారము.

సంయోగప్రాసములలో కొన్నిట ద్విత్వము కలిమి కొన్నిట లేమియు ఐక్య భంజకములు గావు;—

'క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియ వైశ్య శూద్రు లనఁగాఁ దగు నాలుగుజాతులక్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరిక్షితుకాచినయట్లు రామ మాం
ధాతృ రఘు క్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులక్?' భార. ఆది.

'క్షతా త్కిల త్రాయత ఇ త్యుదగ్రః క్షత్త్రస్య శబ్దో భువనేషు రూఢః.'

అని కాళిదాసు చెప్పినట్లు నిష్పన్నమైనను, 'క్షద తీతి క్షత్త్రమ్' అని ఉణాదిష్ట్రన్ప్రత్యయముచే నిష్పన్నమైనను, 'క్షత్త్ర'శబ్దమును దానినుండి నిష్పన్నమైన 'క్షత్త్రియ'శబ్దంబును ద్విత కారములు.

వ. ఇత్తెఱంగున సఖీ పరివార పరివృత యగు నక్కాంతం గనుంగొని, యంతర్గతంబున. (7-9) 153

క. వితత ప్రతి ప్రతీకా। ద్భుత రూప విలాస విభవ భూషిత యగు నీ (7-12)
రతిబోఁటి తేటపఱుచుక్। జతురానన హస్త శిల్ప చాతుర్యంబుక్. 154

విత...త—వితత = విస్తీర్ణ మయిన (విభవమునకు విశేషణము)- ప్రతి ప్రతీక=ఒక్కొక్క యంగమందును ('అఙ్గం ప్రతీకోఽవయవోఽపఘనః' అమ.- ప్రతీకేప్రతీకే ప్రతిప్రతీకమ్ అని యవ్యయీభావము) - అద్భుత = వింత యయిన - రూప = సౌందర్యముయొక్కయు - విలాస = విభ్రమముల యొక్కయు - విభవ = సంపదచేత - భూషిత = అలంకరింపఁబడినట్టిది, అగు = అయినట్టి - ఈరతిబోఁటి = మదనభార్యయయిన రతీదేవికి ('రతిః స్మరప్రియాయాం చ రాగే చ సురతేఽపి చ' అమ.) తుల్యురాలైన యీదమయంతి, చత...బుక్-నలువరయొక్క చేతి చేఁతనేర్పును, తేట పఱుచుక్ = తెల్లము సేయుచున్నది.— బ్రహ్మయొక్క సృష్టినైపుణ్యాపుం బరమావధి యీ కాంత యని భా.

తే. యౌవ నాంభోధ రోద్భూత హావ భావ (7-11)
వారి ధా రాభిపూర్ణ శృంగార తటిని
యబ్జభవ సృష్టి విద్యా రహస్య భూమి
నిఖిల లావణ్య సీమ యీ నీరజాక్షి. 155

ఈనీరజాక్షి = ఈకమలనేత్ర, యౌవ...ని - యౌవన = జవ్వన మనెడి - అంభోధర= మేఘమునుండి - ఉద్భూత = జనించిన - హావ భావ = హావ భావము లనెడి (వాని స్వరూపము ఇంతకు ముందే ఈవ్యాఖ్యలో వివరింపఁబడి యున్నది), వారి ధారా = నీటియొక్క యవిచ్ఛిన్న పతనముచేత - అభి పూర్ణ = అంతటను నిండిన - శృంగార = సింగారముయొక్క - తటిని = ఏ అయినట్టిది, అబ్జ...మి - అబ్జ భవ=తామర చూలియొక్క - సృష్టి విద్యా=నిర్మాణ కౌశలము యొక్క - రహస్య = కిటుకులయొక్క - భూమి=తావు, నిఖిల లావణ్య సీమ=సమస్త మయిన కాంతికిని ఎల్ల.—రూపకాలంకారము.

ఈసుందరి యౌవనముచేఁ గలిగిన హావభావములచే రంజిల్లుచున్న శృంగారము కలదై నూతన వర్షామేఘముల జడివానచే నిండిన నదివలె శోభించుచు, బ్రహ్మయొక్క సృష్టివిద్యారహస్యమునకు వినియోగస్థాన మయినది. దీనికి మించినలావణ్య మెవ్వతికిని లేదు.

తే. సాటి జంబేటి జంబాల జాలమునకుఁ, (7-12)
బాటి నూత్న హారిద్రా విభంగమునకుఁ,
దగము సౌదామనీ దామ ధామమునకుఁ,
గరము బొలుపొందు దీని యంగముల కాంతి. 156

దీని యంగముల కాంతి, కరము పొలుపొందు (చున్నది); (ఈకాంతి), జంబేటి జంబాల జాలమునకుఁ=జంబూనదియొక్క యసటియొక్క మొత్తమునకు, సాటి = సమానము[సప్తద్వీపములలో మన ముండు ద్వీప మయిన జంబూద్వీపమునకు జంబూవృక్షము (నేరేటిచెట్టు) చిహ్నము; దానిచేతనే ఈ దీవికి ఆ సంజ్ఞ. దాని ఫలముల రసముతో కలసి ప్రవహించునదికి జంబూనది (నేరేటేఱు) అని పేరు; ఆపండ్ల రసంపుఁ బ్రభావంబున దాని నీరు సోఁకిన మన్నెల్ల దేవార్హ మయిన యుత్తమ సువర్ణ మగును; దానికి జంబూనదీప్రభవ మగుటచేత జాంబూనదం బని పేరు. ఆయేటి యడుసంతయు ఆబంగారమే. ఈవిషయమునకు విస్తరము ౫. ఆ. (76...80) లో కనఁదగును

'జమ్బూఫ లామల గళ ద్రసతః ప్రవృత్తా
జమ్బూనదీ రసయుతా మృ దభూ త్సువర్ణమ్,
జామ్బూనదం హి త, దతః సురసిద్ధసఙ్ఘాః
శశ్వ త్పిబ న్త్యమృతపాన పరాఙ్ముఖా స్తమ్.' గోళ],

నూ...కుఁ - నూత్న = క్రొత్త - హారిద్రా = పసుపు (ఁగొమ్ము)యొక్క - విభంగమునకుఁ= ఖండమునకు, పాటి=సమము ; సౌ...కుఁ-సౌదామనీ దామ = మెఱుపుల మాలికయొక్క ['తటి త్సౌదామనీ విద్యు చ్చఞ్చలా చప లాऽపి చ' అమ. - సుదామ్నా అద్రిణా ఏకదిక్ - సుదామ [illegible]కొండ యేదిక్కున నున్నదో ఆదిక్కున నుండునది అని వ్యు.- 'సౌదామని' అగును గాని

'సౌదామిని' యని సిద్ధింపదు. దామశబ్దమునకు త్రాడు వాచ్యార్థము- 'న పుంసి దామ సందానమ్' అమ. మాఘకవి మాలార్థమందుఁ బ్రయోగించినాఁడు:—

'దధతి చ వికస ద్విచిత్ర కల్ప ద్రుమ కుసుమై రభిగుమ్ఫితా ని వైతాః
క్షణ మలఘు విలమ్బి పిచ్ఛ దామ్నః శిఖర శిఖాః శిఖిశేఖరా నముష్య.'

'పిచ్ఛా న్యేవ దామాని స్రజః యేషు' మల్లి.]—

ధామమునకుఁ=కాంతికి ('ధామ జన్మ ప్రభా స్థాన ప్రభావ సుఖ సద్మసు' నానా.), తరము = సమానము.

'జాలము' - మొత్తమునకు దీప్తి యెక్కువ. 'నూత్న' - ఇంకను మాయనిది. 'భంగము' - విఱుపులోనికాంతి ఉత్కృష్టముగా నుండును. — ఉపమాలంకారములు.

ఉ. చంచలనేత్ర మేని నునుఁజాయకు సాటి యొనర్పఁగాఁ దగుఁ (7 - 18)
గాంచన కేతకీ కుసుమ గర్భ దళంబులు ధూళి బ్రుంగ వే;
నంచిత భీతి నీ సరసిజాక్షి తనుద్యుతి కోడి గాదె సే
వించెను వారిదుర్గ మరవింద వరాటక చక్రవాళముల్. 157

కాంచ...లు=బంగారు మొగలి (అనఁగా గేదంగి పూవు)యొక్క కడుపులోని రేకులను, ధూళిన్ = పరాగమందు, బ్రుంగ వేని = మునింగి యుండని యెడల, చంచ...గున్; అరవింద వరాటక చక్రవాళముల్ = తామర దుద్దుల సమూహములు ('వా పుంసి పద్మం నళిన మరవిన్దం మహోత్పలమ్,' 'బీజకోశో వరాటకః,' 'చక్రవాళం తు మణ్డలమ్,' అమ. - మండలశబ్దమువలెనే చక్రవాళశబ్దంబును సమూహవాచకంబు నగు,-

'పద్మాకరం దినకరో వికచీకరోతి। చన్ద్రో వికాసయతి కైరవచక్రవాళమ్.' భర్తృ.నీతి.

'విరమ విరమ వహ్నే, ముఞ్చ ధూమానుబన్ధం
ప్రకటయసి కి ముచ్చై రర్చిషాం చక్రవాళమ్.' రత్నా.),

ఈ సరసిజాక్షి తను ద్యుతికిన్=ఈ తమ్మికంటి మేని కాంతికి('శోభా కాన్తి ర్ద్యుతి శ్ఛవిః' అమ.), ఓడి, అంచిత భీతిన్ కాదె = పైకొన్న భయముచేతఁ గదా, వారి దుర్గమున్ = జల మనెడి కోటను (జలమధ్యగత మయిన కోటను అనియు), సేవించెను=ఆశ్రయించినవి.

గేదంగిపువ్వుకడుపులోపలి రేకులను ధూళి కమ్మకొని యుండదేని ఈ చంచలాక్షియొక్క నున్ననిమేనికాంతికి సమ మన వచ్చును. ఈ సరోజలోచన మేనికాంతికి ఓడిన వై, ఈకాంతి ఎప్పుడు తమ్ము వచ్చి పట్టి దండించునో యను భయముచేత, దానికి దొరక కుండుటకుఁ గదా తామరదుద్దుల సమూహములు నీటికోటలో డాఁగినవి?

'గర్భ' అనుటచే కోమలతమములు నునుపు గలవి కాంతిమత్తమములు అని భా.

ధూళి లేని గర్భదళ ముండదు గావున, పూర్వార్ధమందు అభూతోపమ. ఉత్తరార్ధమందు హేతూత్ప్రేక్ష; 'ధ్రువమ్, నూనమ్' ఇత్యాదులవలె 'కాదె' ఉత్ప్రేక్షావాచకము. 'వారిదుర్గము'- రూపకము.

తే. ఇంద్రుఁడు దింతికి రత్నగా నిడఁగఁబోలు (7 - 19)
నాభరణ మ్రజహమూర్తి మ్రజాయుధంబు;

నతఁడ యంతటఁ బోక బాణాసనంబు
నిఖిల మణిదీప్తి యనుపేర నిలుపఁబోలు. 158

రక్షగాన్ = రక్షకముగా. ఆభ... ర్తి - ఆభరణ= నగలలోని. - వజ్ర = వజ్రమణియే- మూర్తి = స్వరూపముగాఁ గలదైన (నగలలోని వజ్రముగా), వజ్రాయుధంబున్=తనయాయుధ మైన వజ్రమును, ఇడఁగఁ బోలున్ = పెట్టినాఁడు గావలయు;...నిఖిల... పేరన్ = (ఈయింతి దాల్చిన తొడవులలోని) సకల మణుల కాంతుల రూపముగా, బాణాసనంబున్ = తనధనుస్సును, నిలుపఁ బోలున్ = ఉంచినాఁడు గావలయును.

ఈయింతి నగలలోనివి వజ్రములును సకల మణి కాంతులును దీని సంరక్షణకై ఇంద్రుఁ డుంచిన తన వజ్రాయుధంబును తన ధనుస్సునుం గావలయును. - ఆ వజ్రములు వజ్రాయుధము వలెను, ఆమణులదీప్తులు ఇంద్రధనుస్సువలెను ఉన్న వని తా. ఇందువలన దమయంతి ధరించిన మణులు బహుమూల్యములు అత్యుత్కృష్టములు రక్షకములు నని భా. - ఉత్ప్రేక్షాలంకారములు. వజ్రాదిమణులవలన రక్షణ కలదు గావున, రక్షణార్థ మని యుత్ప్రేక్ష:—

'శ్వే తాలోహిత పీత మేచకతయా ఛాయా శ్చతస్రః క్రమాద్,
విప్రాదిత్వ మి హాస్య య త్సుమనసః శంస న్తి సత్యం; తతః
స్నిగ్ధాం కీర్తి మను త్తమాం శ్రియ మిదం దత్తే యథా సంధృతం
మర్త్యానా మయథాయథం తు కులిశం పథ్యం హితం జాత్యతః.
విప్ర స్సోఽపి రసాయనేషు బలవా నష్టాఙ్గసిద్ధిప్రదో,
రాజన్య స్తు నృణాం వలీపలితజి న్మృత్యుం జయే దక్షసా,
ద్రవ్యాకర్షణ సిద్ధిద స్తు సుతరాం వైశ్యోఽథ శూద్రో భవేత్
సర్వ వ్యాధి హర, స్త దేష కథితో వజ్రస్య వర్ణో గుణః.' రాజనిఘంటువు.
'తేఽపి స్యుః పురుషాః శ్రేష్ఠా రస-బన్ధన కారిణః
స్త్రియః కుర్వ న్తి కాయస్య కా న్తిం, స్త్రీణాం సుఖప్రదాః.' భావప్రకాశము.
'అకాలే శక్రచాపానా ముదయ స్తు యతో భవేత్,
అసౌ ధన్యతరో జ్ఞేయో బహుమూల్యో మణిః స్మృతః.' రత్నపరీక్షాశాస్త్రము.
'సర్వద్రవ్యాభేద్యం లఘ్వమ్భసి తరతి రశ్మిమత్ స్నిగ్ధమ్
తటి దనల శక్రచా పోపమం చ వజ్రం హితా యోక్తమ్.' బృ. సం.

తే. నెమలి పింఛంబుతోడ నీ రమణి వేణి (7 - 22)
చెలిమి సేయుటఁ బగ గొంట దెలియ నరిది;
యందుఁ బువ్వులఁ బూజించి నట్టి తెఱఁగు
నర్ధచంద్ర ప్రహార చిహ్నములఁ గలిమి. 159

వేణి=జడ. పింఛంబు=కుంచె. చెలిమి=స్నేహమును. పగ=శత్రుత్వమును;కొంట=కొనుటను- వహించుటను. తెలియన్=కనఁగా, అరిది=ఇంతింతగా నున్నది. అందున్=ఆ కేశపాశమందు, పువ్వు లన్ = పుష్పములలో. తెఱఁగు=విధము. అర్ధచంద్ర ప్రహార చిహ్నములన్ = గోళ్ళ క్షతముల

వ్రేటుల గుర్తులును ('తర్జన్యఙ్గుష్ఠవిస్తారే గళహస్తార్ధచన్ద్రికా' బలుఁడు, 'అర్ధచన్ద్రో బాణభేదే చన్ద్రికే చ శిఖణ్డినామ్' ధరణి), కలిమిన్=ఉండుటచేత.

ఈతరుణియొక్క వేనలి నెమలిపింఛముతో స్నేహమును పగయును రెండునుం గల విధము చూడఁగా ఆశ్చర్యముగా నున్నది. ఆరెంటికిని తాత్పర్యము మేమనఁగా, నెమలిపింఛమునందు పూజాపుష్పచిహ్నంబులును గళహస్తప్రయోగచిహ్నంబులును ఉండుటయే తాత్పర్యము.— వేణి నెమలిపురులకు సమానముగా నుండి వానికన్న నుత్కృష్ట మైన దని భా.

ఇట 'పువ్వులు' 'అర్ధచంద్ర' అనుశబ్దములచేత తదుపమేయము లయిన నెమలిపురికన్నులు తెలుపఁబడినవి, కావున ఉత్తరార్ధమందు రూపకాతిశయోక్తి. పుష్పార్ధచంద్రములను సాధనములనుగాఁ గొని స్నేహద్వేషములను సాధించినందున ఉక్తాతిశయోక్తి సంకీర్ణ మైన యనుమానాలంకారము. చెలిమిపగలకును పుష్పార్ధచంద్రములకును క్రమాన్వయము కలుగుటచేత యథాసంఖ్యాలంకారము. ఉక్తానుమానము పేతత్సంకీర్ణంబును నై యున్నది.

తే. అలక తిమి రాభిదృశ్య ఫా లార్ధచంద్ర (7 - 23)
మెలఁత యిది కృష్ణప క్షాష్టమీ త్రియామ;
దీని ప్రాపున నేల సాధింపకుండు
విషమబాణుండు త్రిజగతీ విజయ సిద్ధి? 160

అల...ద్ర - అలక=ముంగురు లనెడి - తిమిర=చీఁకటితో (నల్లనిపగముతో), అభిదృశ్య=కనఁబడుచున్న - ఫాల=నుదు రనెడి - అర్ధ చంద్ర=సగము చందురుఁడు గలది, మెలఁత యిది=ఈ యువిద, కృష్ణ పక్ష అష్టమీ త్రియామ=బహుళ పక్షమందలి యష్టమి (నాఁటి) రాత్రి ('నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా' అమ. - మూఁడుజాములు గలది అని వ్యు. నాలుగు జాములలో తొలి యరజామును కడపటి యరజామును మెలఁకువ కాలము లగుటచే పగటి వంటివే గావున అట్లు పేర్కొనుట); దీనిప్రాపునన్=కృష్ణాష్టమీతిథి యగు నీ దమయంతి నండ గొని, విషమ బాణుండు=బేసి ములుకుల జోదు (విషమ=దారుణము లయిన-బాణుఁడు=శరములు గలవాఁ డనియు) మన్మథుఁడు, త్రిజగతీ విజయ సిద్ధిన్=మూఁడులోకముల గెలుపున కైన (వశీకరణ) సిద్ధిని, ఏల సాధింపకుండున్=నిశ్చయముగా సాధించును.

కృష్ణాష్టమి సాధకులకు మంత్రసిద్ధిని గలిగించును. యుద్ధయాత్రకు అష్టమి జయప్రదము:—
'జయదా విజిగీషూణాం యాత్రాయా మష్టమీ తిథిః,
శ్రవణే నాపి రోహిణ్యా జయయోగో విశేషతః.' పితామహుఁడు.

కృష్ణాష్టమినాఁడు చంద్రుని క్రిందిసగమే వెలుఁగు గలిగి యుండును, పైసగము నల్లఁగా నుండును. ముంగురుల నలుపుతోడ ప్రకాశమాన మైన దమయంతీఫాలము అష్టమీరాత్రి చంద్రునివలె వెలుఁగుచున్న దని భా. ఆమె సౌందర్యముచేత ముల్లోకముల పురుషులును మదనునికి జితు లై వశ్యు లై యుందు రనియు, అనఁగా ఆమెకన్న సుందరి ముల్లోకములలో లే దనియు, భా. లలాటమున అష్టమీచంద్ర సాదృశ్యము స్త్రీలకు శుభలక్షణము—

' ఆ[illegible]స్థాన మష్టోష్ఠశం చ శస్తం . లలాటం న నతం న కుబ్జమ్.' బృ. సం.
[illegible]

తే. హరుని కోపాగ్నిఁ బొగచూరి మరుని చాప (7-24)
మసిత కేసర పరివేష మైననాఁడు
హృదయ మోహన శక్తి నీ యిందువదన
యంచిత భ్రూలతా రేఖ కైన యుపమ. 161

మరుని చాపము = మన్మథుని విల్లు, హరుని (శివుని)- కోప అగ్నిన్ = కోపముతోడి నిప్పుచే, పొగ చూరి, అసి...ము - అసిత=నల్లని - కేసర = అకరువు లనెడి ('కిఞ్జల్కః కేసరోస్త్రియామ్' అమ.) - పరివేషము = మండలము కలది ('పరివేష స్తు పరిధి రుపసూర్యక మణ్డలే' అమ.), ఐన నాఁడు=అయిన సమయమందు, ఈ...కున్=ఈ చంద్రముఖియొక్క యొప్పిద మైన బొమ తీఁగ గీఱకు, హృదయ మోహన శక్తిన్=మానసమును మోహపెట్టెడు సామర్థ్యమందు, ఐన యుపమ= తగిన యుపమానము.

శివునికోపాగ్నికి పొగచూరినదై నల్లఁబడిన యకరువు లనెడి గుడికట్టిన మరుని ధనుస్సు లోక మోహన శక్తియందు ఈకన్యామణియొక్క బొమతీఁగ గీఱకు తగిన యుపమానము.

'పొగచూరుటం' జెప్పుట నైల్యార్థము; 'అసితకేసర పరివేషముం' జెప్పుట నీలసైగని గ్యార్థము; 'హరునిం' జెప్పుట ఆసంహారకునిఁ గూడ మోహపెట్టినట్టి దని మోహనశక్తిపరమావధికొఱకు. 'రేఖ' యనుట సన్ననిసోగతనమునకు.—ఉపమాలంకారము.

తే. సాయకంబులు మూఁటిమ జగము గెలువఁ (7-27)
బాలు పెట్టి, శేషించిన బాణయుగళి
మదనుఁ డేత ద్దృగంభోజ పదమునందు
గౌరవం బొప్పఁ బట్టంబు గట్టఁబోలు, 162

మదనుఁడు, సాయకంబులు మూఁటిన్ = (తన యయిదు బాణములలోను) మూఁడు బాణ ములను, ము...ట్టి,...యుగళిన్= కవను, గౌరవంబు ఒప్పన్ = (అయిదింటిలోను ఈరెండును (శ్రేష్ఠము లగుటచే వీనియందు ఎక్కువ) యాదరము కలిగి, ఏతత్ దృక్ అంభోజ పదమునందున్ =ఈబాలయొక్క నేత్ర కమలముల స్థానమందు ('పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రి వస్తు షు' అమ.), పట్టంబు గట్టఁ బోలున్ = రాజ్యాభిషేకము చేసినాఁడు గావలయు.

రాజ్యాభిషేకమున రాజుమొగమున నడ్డముగా నిడుపైన బంగారు రేకును గట్టుదురు.—

'నిర్వృత్త జామ్బూనద పట్టశోభే న్యస్తం లలాటే తిలకం దధానః
తే నైవ శూన్యా న్యరిసున్దరీణాం ముఖాని స స్మేరముఖ శ్చకార.' రఘు. (18-44)

'పట్టంబు గట్టుటం' జెప్పుటచేత నేత్రపదవిఁ బొందిన బాణద్వయము కడమమూఁటిపై దొరతనము చేయఁ దగిన దని సూచితము. 'గౌరవంబు' ప్రభుత్వార్హ మగుటచేత. మూఁటికి పనిపెట్టుట అవి భటత్వార్హములు గావున. 'యుగళి' - దంపతు లనుట, దంపతులం జెప్పుట (అపత్నీకులములం దక్క) అవివాహితునికి పట్టాభిషేకాధికారము లేదు గావున.

ఇందు రాజును రాణియు నైన రెండుబాణముల యాజ్ఞచే కడమ మూఁడు బాణములు మూఁడులోకములను జయించిన వని భా. వానిని జయించుటకు దమయంతి నేత్రము లేల, వాని తొంకలే చాలును, అని తన్నేత్రప్రభావమునకు మహోత్కర్ష.—ఉత్ప్రేక్ష.

తే. అతివ ముష్టి ప్రతిగ్రహా ర్హావలగ్న, (7-28)
సందియము లేదు, వలరాజు చాపయష్టి;
యట్లు గాకున్నఁ గురియంగ నెట్లు నేర్చెఁ
బ్రకృతి శాత కటాక్ష నారాచ వృష్టి? 163

ముష్టి...గ్న - ముష్టి=పిడికిటితో ('ముష్టిబద్ధ స్తు సంగ్రాహః' అమ.) - ప్రతిగ్రహ=పట్టు కొనుటకు - అర్హా=తగిన - (పిడికిట నిముడునట్టి - అంత సన్నపాటి)- అవలగ్న = నడుము కలది ('మధ్యమం చావలగ్నం చ' అమ.), అతివ = ఈతరుణి, సందియము లేదు = నిస్సందేహముగా, (పిడికిట నిముడు పిడికట్టు కల దైన) - వలరాజు చాప యష్టి=మదనుని విలు కోల, (ఈ యతివ), ప్ర...వృష్టిక్ - ప్రకృతి = స్వభావముచేత నే చికిలీ లేకయె - 'ప్రకృతి ర్గుణసామ్యే స్యా దమాత్యాది స్వభావయోః' మే.) - శాత=వాఁడి యైన ('నిశిత క్ష్ణుత శాతాని తేజితే'మేది.)-కటాక్ష= కడకంటిచూపు లనెడి - నారాచ=లోహబాణములయొక్క - వృష్టిక్=వానను,...

ఉత్ప్రేక్షాలంకారము.—'సందియము లేదు' అనువాక్యము తద్వాచకము. నడుము (లస్త కంబును) పిడికిట నిముడుటచే నగుసామ్యము ఉత్ప్రేక్షాబీజము. ఉత్తరార్ధమున నీయుత్ప్రేక్ష రూపకసంకీర్ణము.

నడుము పిడికిట నిముడుట విల్లనుటకు కారణ మయిన నగును గాని వలరాయని విల్లనుటకు ఆకారణము చాలునా; యనిన, అందుకొఱకే 'ప్రకృతిశాత' త్వము చెప్పఁబడినది. కడమవారివిండ్ల నారాచములు చికిలీ లేక వాఁడి గావు, ఇందునుండి వెలువడునవి చికిలీ లేకయే వాఁడులు, కావున ఇది వలరాజుదే. 'వృష్టి' శబ్దముచేత నారాచబాహుళ్యంబును, 'కురియుట' చేత అప్రతిహతప్రసారంబును, బాహుళ్యప్రసారములచేత విజయంబును, నలుఁడు వానిప్రభావమునకు ఆఁగలేక లోనగుటయు, సూచితములు.

తే. చల దింద్రనీల గోళా (7-29)
మల కోమల తార తార మండలములు ప
క్ష్మలములు ప్రాంశు శ్వేతం
బులు చపలము లౌర మెఱుఁగుఁ బోఁడి నయనముల్. 164

చల ... లు - చలత్ = చలించుచున్న [చలనముచే చకితదృష్టి సూచితము - చకితదృష్టి స్త్రీలయందు ప్రశస్తము - 'చకిత మృగ దృ గాభే ప్రాన్తరక్తే చ నేత్రే' అని పద్మినీలక్షణమం దున్నది; 'కవికులగురు' వైన కాళిదాసుని యుమావిలోకితవర్ణనంబున నీచలత్వవిశేషముం గనుఁడు.-

'ప్రవాత నీలోత్పల నిర్విశేష మధీరవిప్రేక్షిత మాయతాక్ష్యాః

తయా గృహీతం ను మృగాఙ్గనాభ్య స్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః.'

అయధీరవీక్షణ సామ్యముక్తి గోళములకు చలత్వవిశేషణము] - ఇంద్రనీల గోళ = నీలమణి గుండులయొక్క-అమల=నిర్మలమయిన - కోమలతా=సౌందర్యమును - ఆర = పొందున దైన - తార= కల్లగుడ్లులయొక్క - మండలములు = వృత్తములుగలవి [చలత్ = చటులములును ('చపలములు'ను అనఁగా మిలమిలలని విశేషణము)... గోళ = గుండ్లవలె - అమల కోమలము లఖున - తార = కనీనికలు గలవియు- తార [illegible] మండలములు [illegible] చక్రములు కలవియు - అని

మీనపరము. ఇటను చలత్వము చకితవిలోచన సామ్యార్థము], పక్ష్మలములు = ప్రశస్త మయిన ఱెప్పలు గలవి [ప్రశస్త మయిన ఱెక్కలు గలవి అని మీనపరము - 'పక్ష్మాఽక్షిలోమ్ని' అమ. పక్ష్మశబ్దమునకు పక్షపర్యాయత్వము అమరమాలలో చెప్పఁబడి యున్నది. రెండర్థములకును ఈభర్తృహరిశ్లోకము ఉదాహరణము:—

'సన్మార్గే తావ దాస్తే ప్రభవతి పురుష స్తావ దే వేన్ద్రియాణాం
లజ్జాం తావ ద్విధత్తే వినయ మపి సమాలమ్బతే తావ దేవ,
భ్రూచాపాకృష్టముక్తాః శ్రవణపథజుషో నీలపక్ష్మాణ ఏతే
యావ ల్లీలావతీనాం హృది న ధృతిముషో దృష్టిబాణాః పతన్తి.'

('నీలాని పక్ష్మాణి లోమా న్యన్యత్ర గరుత శ్చ యేషాం తే తథోక్తాః' అని రామచంద్రవ్యాఖ్య.) 'సిధ్మాదిభ్య శ్చ' అను సూత్రముచేత సిధ్మాదిగణపఠితములకు మత్వర్థమందు 'లచ్' ప్రత్యయము వచ్చును; పక్ష్మశబ్దము సిధ్మాదిగణపఠితము; మత్వర్థములు:—

'భూమ నిన్దా ప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే
సమ్బన్ధేఽస్తివివక్షాయాం భవన్తి మతుబాదయః.'

అను వార్తికముచేత లచ్ప్రత్యయమునకు ఇట ప్రశంస యర్థము. ఱెప్పవెండ్రుకలకు సాంద్రత్వము స్నిగ్ధత్వమును ప్రశస్తములు; కు. సం. లో పార్వతీతపోవర్ణనములో 'స్థితాః క్షణం పక్ష్మసు' అనుశ్లోకమునకు వ్యాఖ్యలో 'స్థితా ఇ త్యనేన పక్ష్మణాం సాన్ద్రత్వం, క్షణ మితి స్నైగ్ధ్యం చ, గమ్యతే' అని మల్లి. సాంద్రత్వస్నిగ్ధత్వములు చేప ఱెక్కలయందు సహజములు.], ప్రాంశు శ్వేతంబులు-ప్రాంశు=ప్రకృష్ట మైన కిరణములు గల (ఉజ్జ్వల మయిన) - శ్వేతంబులు=ధావళ్యము గలవి (శ్వేతశబ్దము—'గుణే శుక్లాదయః పుంసి' అనుటచే గుణపరము కూడను; తళుకును ధావళ్యంబును బేడిసచేపకునుం గలవు), (ఐనట్టి), ఈమెఱుఁగుఁబోఁడి నయనముల్ = మెఱుపుఁదీఁగవంటి దగు నీ కన్నెయొక్క నేత్రములు, చపలములు=మీనములుగా నున్నవి ('చపల శ్చోరకే చలే, ... మీనేఽపి' హేమ.), ఔర = ఎంతయద్భుతము. ప్రకృతమున వివక్షిత మయిన మీనము శఫరము (=బేడిసచేప) గాఁదగును:—

'త వాపర్ణే, కర్ణేజప నయన పైశున్యచకితా
నిలీయన్తే నీరే నియత మనిమేషాః శఫరికాః;
ఇయం చ శ్రీ ర్బద్ధచ్ఛదపటుకవాటం కువలయం
జహాతి ప్రత్యూషే నిశి చ విఘటయ్య ప్రవిశతి.' సౌందర్యలహరి.

'తస్మా దస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటుల శఫ రోద్వర్తన ప్రేక్షితాని.' మేఘ.

'బేడిస (మీను)...The silver fish, a sort of carp. శఫరము...to the gleam or flash of which in water, the poets compare a swimming or glancing eye, as the interpreter of love.' బ్రౌను.

'A silver fish—వెండివలె మెరిశే చేప, దీన్ని పాఠీనము, బేడిసచేప అంటారు.' బ్రౌను.

'బేడిస తళుకుల బెడఁగుఁ గన్నులను,
దాడిమీ బీజ సుందర దంతములును.' హ. ద్వి.]

చంచలము లయిన యింద్రనీలగోళముల నైగనిగ్యమనోజ్ఞత్వములను పొందియున్న నల్లగ్రుడ్లు గలవియును దట్టమైన నిద్దంపు ఱెప్పలు గలవియు ధాళధళ్యముతోడి ధావళ్యము గలవియును నగు నీ దేదీప్యమానాంగి నేత్రములు - (చంచలములును ఇంద్రనీలగోళములవలె అమల మనోజ్ఞము లయిన కనీనికలు కలవియు దట్ట మయిన నిద్దంపు ఱెక్కలు గలవియు ధాళధళ్యముతోడి ధావళ్యము గలవియు - నగు) ఔడిసచేఁపలుగా నున్నవి, ఏమి యాశ్చర్యము!—ఉత్ప్రేక్షాలంకారము, శ్లేషానుప్రాణితము.

మ. దళ దిందీవర కాంతిఁ బంచష బహిస్త్వక్పాటనానంత రో · ·(7-31)
జ్జ్వల రంభా తరు గర్భ సంపుట లస చ్ఛాయా కలాపంబులోఁ
గలయం గూర్చి చతుర్ముఖుం డొనరిచెం గాఁబోలు నాకర్ణ శ
ష్కులి కాపాంగక మైన యీ చిగురుటాకుంబోఁడి నేత్రద్వయిన్. 165

చతుర్ముఖుండు=బ్రహ్మ, ఆ ... లు— ఆ కర్ణ శష్కులికా=చక్కిలములవంటి చెవుల వఱకుం గల - అపాంగకము = అంతములు గలది ('అపాఙ్గౌ నేత్రయో రన్తౌ' అమ.), ఐన - ఈ చిగురుటాకుంబోఁడియొక్క - నేత్రద్వయిన్ = కనుదోయిని, దళత్ ఇందీవర కాంతిన్ = వికసించుచున్న నల్లగలువల జిగిని ('స్యా దుత్పలం కువలయ మథ నీలామ్బుజన్మ చ। ఇన్దీవరం చ నీలేఽస్మిన్' అమ.), పంచ ... లోన్—పంచష = అయిదాఱు - దళ త్వక్ = ఆకులతోడి పట్టలను-పాటన = ఒలిచి వేసిన - అనంతర = పిమ్మట— ఉజ్జ్వల = వెలుఁగుచున్న - రంభా తరు గర్భ=అరఁటి చెట్టుయొక్క లోపలిభాగ మనెడి - సంపుట = బరణిలో - లసత్ =ఒప్పుచున్న- ఛాయా=కాంతియొక్క ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.)-కలాపంబులోన్ = సమూహములో, కలయన్ కూర్చి = (ఈ తెల్లకాంతిమొత్తము నడుమ ఆ నల్లకాంతిని) నిండుగా ఉంచి, ఒనరించెన్ కాఁబోలున్ = చేసినాఁడు గావలయును.

బ్రహ్మ నల్లగలువల కాంతిమొత్తమును అరఁటియందు అయిదాఱు పట్ట లొలిచిన పిమ్మటఁ గానిపించు లోపలిభాగములోని కాంతిమొత్తములో ఉంచి యీకొమ్మకన్నులం జేసినాఁడు గావలయును. ఉత్ప్రేక్షాలంకారము; 'కర్ణశష్కులికా' - ఉపమ.

'దళత్' - శతృప్రత్యయాంతము వర్తమానార్థకము - వికసిల్లుచున్న సమయమందలి అనుట— అప్పుడు అమ్లానతవలన జిగి ఎక్కువ; 'కాంతిపుంజము' అనుపాఠమున కాంతిమొత్తము నని యర్థము. 'దళ త్వక్' - ఆకు లూడినపట్టలు బయటివి - ఆకు తోడిపట్టలు వానికి లోపలివి - పట్టలను ఒలిచినకొలందియు లోలోపలిబోదెకు కాంతి హెచ్చు గావున, ఆలోపలిపట్టలను కూడ కొన్నిటిని ఒలిచి వేయుట అధికకాంతికొఱకు. 'పంచష' = పఞ్చ వా షడ్వా = అయిదాఱు- పట్టలలోపలి 'సంపుటమునం' జెప్పుటచే బ్రహ్మదేవుఁడు అంతగోప్యముగా దాఁచుకొన్న లావణ్యద్రవ్యమని కాంతిగుణోత్కర్ష. 'చతుర్ముఖుండు'—నాలుగు మోములం జెప్పుట 'ఆకర్ణ' నేత్రముల యాయామాతిశయమును సూచించుటకు; నేత్రములు అత్యాయతము లయినందున తదపాంగములు ఆకొమ్మ తనవదనమును ఇటునటుం ద్రిప్పినప్పుడు గాని ఒంటిమోమువానికి అగపడవు. నలుమొగములవానికి త్రిప్పకయే యగపడును. వానిని ఆకర్ణవిశాలములనుగాఁ జేయుటకు ఎనిమిదికన్నులతోను ఎడమ కుడికన్నుమొదలు కుడితుదికంటివఱకు చూచుకొనె నని భా. 'కర్ణశష్కులికా'- కవులు చెవులను శ్రీకారపాశ సమసంఖ్యా శష్కులికలతోం బోల్తురు.

చ. కలువలనుం జకోరములఁ గారుమెఱుంగుల గండుమీల వె (7-32)
న్నెలలను దమ్మిఱేకులను నిర్మల మౌక్తిక రత్న శుక్తులం
దలఁచి పయోజగర్భుఁడు సుధా రస ధారలు రెంటిలో విసం
బులుఁ జిలికించి చేసె నొకొ పొల్పెసలారఁగ దీని నేత్రముల్! 166

పయోజగర్భుఁడు = (విష్ణుదేవుని నాభీ) కమలమే (తన్నుం గన్న) కడుపుగాఁ గలవాఁడు ((బ్రహ్మ), . . ., చకోరములన్ = వెన్నెలపులుఁగులను, కారు మెఱుంగులన్ = తొలకరి మెఱ పులను (వానికి అటువిమ్మటి మెఱపులకన్న కాంతి యెక్కువ), గండుమీలన్ = మగ బేడిసలను (వానికి ఆఁడుబేడిసలకన్న జిగి ఎక్కువ), . . . మౌక్తిక రత్న = ముక్తా మణులను - జేక - శ్రేష్ఠములైన (యాణి) ముత్తెములను- 'రత్నం స్వజాతి శ్రేష్ఠేఽపి మణావపి నపుంసకమ్' మేది.— మంచి నీరు గలవాని ననుట) - శుక్తులన్ = ముత్తెపుఁజిప్పలను, తలఁచి = మనస్సులోఁ దలపోసి - అనఁగా వానిసారమును మానసికముగా గ్రహించి, రెంటిలోన్ = (ముత్తెములు రెండుగా చేసి) ఆరెండుముత్తములలోను, సుధా రస ధారలున్ = అమృత ద్రవముయొక్క ధారలను, విసంబు లున్ = గరళములను, చిలికించి = చల్లి, దీని నేత్రములు, పొల్పు = సౌందర్యము, ఎసలారఁగన్ = ఒప్పునట్లుగా, చేసె నొకొ = సృజించినాఁడేమో.—ఉత్ప్రేక్షాలంకారము.

'తలఁచి' - 'రూపోచ్చయేన విధినా మనసా కృతా ను?' శాకుం. పూర్వోక్తముల సారంపు ముత్తమునకు 'సుధారసధారలు'-ధావళ్యమును పెంచుటకు. 'విసంబులు' - నీలకనీనికార్థము. నాయికా నేత్రములు సంయుక్తునికి దర్శనముచేత ఆనందమును గలిగించుట సుధాగుణము, వియుక్తునికి స్మృతిచే తాపమును గలిగించుట విసంపుగుణ మనియు విశేషము. 'గండుమీలన్'-

'మగమీలు నగఁజాలు తెగ గీలుకొను వాలుఁగన్నుల కొకవింత కాంతియొదవె.' పారి.

'సుధారసధారలు - విసంబులు' - మాలతీ కర్ణసుందరులందు:—

'యాన్త్యా ముహు ర్వలిత కన్ధర మాననం త । దావృత్తవృన్త శతపత్త్రనిభం వహన్త్యా ।
దిగ్ధోఽమృతేన చ విషేణ చ పక్ష్మలాక్ష్యా । గాఢం నిఖాతఇవ మే హృదయే కటాక్షః.'

'కన్దర్ప దైవత నికేతన వైజయన్తీ । యాన్తీ విలాసరస మన్థర ముత్పలాక్షీ
దృష్టిం నివేశితవతీ మయి కాలకూట । లేశాన్ధకారిత సుధా లహరీ విచిత్రామ్.'

ఈ 'లేశ లహరులే' ఆ 'చిలికించుట' యు 'ధారలు'ను.

తే. శ్రవణ పుట కూప వినిపాత సాధ్వసమున (7-34)
నిగిడి యవ్వలి కటు పోక నిల్చెఁగాక,
యధిక చపల స్వభావంబు లైన యట్టి
దీనికన్నులు దలచుట్టుఁ దిరిగి రావె? 167

అధిక చపల స్వభావంబులు = మిక్కుటమయిన చంచలత (తులిపితనము) గలవి, అయిన యట్టి దీని కన్నులు, శ్రవణ పుట కూప వినిపాత సాధ్వసమునన్ = (పుట=)దొన్నెలకంటి చెవులనెడి బావులయందు పడుటవలని భయముచేత, నిగిడి అవ్వలికిన్ అటు పోక = నిగుడుటను అవతలికి వేఱివైపు పోవుటను మాని, నిలిచెన్ = ఉన్నయెడనే ఇముడుకొన్నవి, కాక = అట్లు గానిచో

(అనఁగా బావిలో పడెడు భయము లేనియెడల), త ... వె = తలచుట్టును తిరిగి వచ్చియుండును (అంత చపలములును అంత యాయతములును అనుట.)

చపలత తలచుట్టుఁ దిరిగి రాఁదగుటకు కారణము - కావున ప. హే. కావ్యలింగము. అట్లు పోవుండుటకు హేతువుకానట్టి బావిభయమును హేతువుగాఁ జెప్పుట హేతూత్ప్రేక్ష. 'శ్రవణ పుటకూపము'-రూపకము. తిరిగి వచ్చు నని తలంచుటయు నుత్ప్రేక్ష.

'చపలత' కంఠోక్తము. అత్యంతచపలతయు అత్యంతాయతత్వంబును పద్యాభిప్రాయములు. 'ఆయతాక్షి' 'చంచలనేత్ర' ఇత్యాదివర్ణనలు ప్రసిద్ధములు. తిరిగి వచ్చుట యనఁగా వేనలికడను అనంతరము ముక్కుకడను ఒండొంటిం దారసిల్లి తనతనతావుం జేరుట. ఈతిరుగుటలో కుడిది కుడి చెవిపై పే ఎడమది ఎడమచెవిపై పే తరలు నని కవిహృదయము; ఏల యన, నిగిడినమాత్రానకే బావిలో పడెడిభయమును చెప్పినందున; అందువలన అపాంగదైర్ఘ్యము కటాక్షదైర్ఘ్యమును సూచితములు; 'దీర్ఘాపాంగ' మని శాకుంతలములో శకుంతలజింకకు నామము; 'ఆమోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణి దీర్ఘాన్ కటాక్షాన్' అని మేఘమున మహాకాళభవన నృత్యద్వేశ్యాకటాక్షవర్ణనము.

క. కేదారములో శిశిర। ప్రాదుర్భావమునఁ జచ్చి పడసిన యురు పు (7-35)
ణ్యోదయమున నొకో యీ శా। తోదరికిం గన్ను లగుచు నున్న వి దమ్ముల్.

తమ్ముల్ = కమలములు, కేదారములోన్ = పంటకాలువయందు (కేదార మను శివక్షేత్రమం దనియు-'కేదారః శఙ్కరక్షేత్రే శైలభే దాలవాలయోః' నానా.), శిశిర ప్రాదుర్భావమునన్ = శిశిరర్తువు పొడమఁగా (మంచు జనింపఁగా అనియు - 'శిశిరః స్యా దృతౌ ర్భేదే తుషారే శీతలే ఽన్యవత్' విశ్వ.), చచ్చి, పడ...నొకో = పొందిన మిక్కుటంపుఁ బుణ్యోత్పత్తిచేతనో, ఈ శాత ఉదరికిన్ = సన్నని ('క్లీబే శాతం శితం చాపి సుఖే చ నిశితే కృశే' నానా.) నడుము గల దీనికి, ...

కమలములును మడికాలువ యను కేదారక్షేత్రములో శిశిరర్తు వనెడి మంచుపెంకచిష్టో చచ్చి, ఆపుణ్యముచే ఈలతాంగి నేత్రములుగా జనించినవి గావలయు. - శ్లేషమూలోత్ప్రేక్ష.

కేదారక్షేత్రము హిమవత్పర్వతములో బదరికాశ్రమమునకు ఏడుదినముల ప్రయాణములో నున్నది. అందు మరణము నొందువారికి మహాఫలము కాశీఖండమునం జెప్పఁబడియున్నది. కమలములు శిశిరర్తువులో మడియుట ప్రసిద్ధము -

'కాన్తాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపామ్.' మేఘ.

'శిశిరే కరీమధూమః కు న్దామ్బుజదాహ శిఖిరతోత్కర్షాః.' కావ్యకల్పలత.

'చచ్చి' యనుటకు 'చొచ్చి' యని పూర్వముద్రణము. కమలములు శిశిరములో 'చచ్చుట' సిద్ధము గావునను, నేత్రరూప జన్మాంతర ప్రాప్తికి కమలరూప పూర్వజన్మ నాశము వలయును గావునను, పురాణమునందు కేదారక్షేత్రసేవాఫలము జన్మసమాప్త్యనంతరానుభవనీయముగానే చెప్పఁబడియుండుటచేతను, మూలములో

'కేదారభాజా శిశిరప్రవేశాత్ పుణ్యాయ మన్యే మృత ముత్పలిన్యా,
జాతా యత స్తత్కుసుమేక్షణేయం యత శ్చ తత్కోరకదృ క్చకోరః.'

అని కమలమృతియే కథితం బగుటచేతను, 'చొచ్చి' పాఠము త్యక్తము.

తే. త్రిభువన వ్యస్త సాయక త్రితయుఁ డైన (7-36)
మరుని తిలపుష్ప తూణ మీ మగువ నాస,
మానిత శ్వాస నవ సౌర భానుమేయ
పుష్పమయ బాణయుగ ళాభిపూర్ణ మగుట. 169

మా...ము = మనోజ్ఞ మయిన యూర్పుల క్రొత్త పరిమళములచేత ఊహింపఁ దగిన పుష్ప స్వరూపపు బాణముల జంటచేత నిండినది, అగుటక = అయిన హేతువుచేత, ఈ - మగువ = కలికి యొక్క - నాస = ముక్కు, త్రి...డు - మూఁడు లోకములమీఁదను ప్రయోగింపఁబడిన ('వ్యస్తం తు వ్యాకులే వ్యాప్తే' విశ్వ.) మూఁడు బాణములు గలవాఁడు, ఐన - మరు ... ము = మన్మథుని నువ్వుఁ బువ్వుటంపపొది ('తూ ణోపాసఙ్గ తూణీర నిషఙ్గా ఇషుధి ర్ద్వయోః । తూణ్యామ్' అమ.)

ఈమగువముక్కు మన్మథుఁడు మూఁడులోకములమీఁదను మూఁడుబాణములను ప్రయోగింపఁగా మిగిలిన రెండుబాణములతోడి నువ్వుఁబువ్వు టంపపొది గావలయును; ఏల యన, అట్లని పుష్పపరిమళము గల శ్వాసములచేత నూహింపఁ దగి యున్నది.—ఉత్ప్రేక్షాలంకారము.

'వ్యస్త' - (వి + అస్త) ఒకలోకమునకు ఒకబాణము చొప్పున ప్రయోగించెనని భా. 'తిల పుష్ప' — కవులు స్త్రీనాసికకు తిల చంపక పుష్పములను ఉపమింతురు. 'అనుమేయ' - పుష్పము తూణీరాంతర్గత మగుటచే నగపడనందున తావిచే నూహింపవలసి యున్న దనుట.

సీ. నిబిడ శైశవ యౌవనీయ సంధ్యావేళ, (7-37)
యానన చంద్ర బింబామృతంబు, (7-38)
లప నామృతాంశు బాల ప్రభా జాలంబు,
బంధుజీవ లతాంత బాంధవంబు, (7-37)
పరిపక్వ బింబికా ఫల విడంబన ముద్ర, (7-39)
విద్రుమ ద్రుమ లతా వినిమయంబు, (7-38)
మదన నారాచ కోమల హైంగుళ చ్ఛాయ,
యస్మ న్మనో నురా గాంకురంబు,
తే. మహిత లావణ్య గుణ జాయమాన బహుళ (7-42)
మాధురీ చిత్ర శోభా సమన్వితంబు,
ప్రార్థనా కల్పపాదప ప్రాజ్యఫలము,
తియ్య పూఁదేనియలక్రోవి దీనిమోవి. 170

అధరవర్ణనః—ప్రాయికముగా ఎఱ్ఱవస్తువులతం బోల్చుటః—దీని మోవి = ఈతరుణి పెదవి, నిబిడ శైశవ యౌవనీయ సంధ్యా వేళ = దట్టమయిన (సంధ్యకు విశేషణము) బాల్య తారుణ్య సంబంధి యైన సంధ్యయొక్క కాలము (వయస్సంధియం దున్న దనుటయు), ఆన ... బు = మోముఁ జందురుని మండలముయొక్క సుధ [ఇచట సామాన్యధర్మము మాధుర్యము

గాని ధావళ్యము గాదు – 'పీయూష మమృతం సుధా' అమ.– శుభ్రపదార్థగణములో 'సౌశేభ శర్కరా శాలి దుగ్ధ గఙ్గా సుధా జలమ్' అని కా. క. ల.; చంద్రుఁ డమృతమయుఁ డనుటకు 8 ఆ. (177) చూ.; పారిజాతాపహరణము 2 ఆ. (86) చూ.; లేదా – ఆనన చంద్ర=ముఖ చంద్రుని యొక్క – బింబ = దొండపండుతో (తత్ప్రతిబింబముతో) కూడుకొన్న – అమృతంబు, ముఖ చంద్రుని సుధయందు తోఁచుచున్న బింబఫల ప్రతిబింబము అనుట; అశ్లే మూ. – 'అస్యా ముఖేన్దో రధరః సుధాభూ ర్బిమ్బస్య యుక్తః ప్రతిబిమ్బ ఏవ.' లేదా – అమృతంబు = నవీనామృతము – అనఁగా సంధ్యాకాలామృతము – అది యెఱుపనుటకు 174 చూ.

లపన...బు = ముఖ మనెడి చంద్రునియొక్క లేత కాంతి సమూహము ('ఆననం లపనం ముఖమ్' 'విధుః సుధాంశుః శుభ్రాంశు రోషధీశో నిశాపతిః' అమ.– ఉదయించుచున్న చంద్రుని కాంతి యెఱుపు), బంధు...బు = మంకెన పూవునకుం జుట్టము;

పరి ... ద్ర = పండిన దొండ పండునకు పరిహాస స్థాపనము (దొండపండును పరిహసించు నది (లేక ... పండుయొక్క గర్వమునకు ఆఁపుదల), విద్రు ... బు = పగడపుఁ జెట్టుయొక్క కొమ్మకు ('సమే శాఖా లతే' అమ.) మార్పు (వినిమయ మనఁగా ఒకవస్తువును ఇచ్చి దానికి బదులుగా మఱియొకవస్తువును పుచ్చుకొనుట – సమాన మని భా.)

మద ... య = మన్మథ బాణములయొక్క మనోజ్ఞ మైన యింగిలీకపు వన్నియ (మద నుఁడు తనబాణములకు విలాసార్థము ఇంగిలీకము పూయు నని తలంపవలయును – అధరము ఎఱ్ఱఁగా మదనోద్రేకముగా నున్న దనుట), – మూలములో (7–70 లో తూణమునకే హైంగుళీ (వర్ణ) ము చెప్పఁబడినది. అస్మ ... బు = మా మనస్సుయొక్క ప్రేమ మొలక (అనురాగము ఎఱు పనీ కవి సమయము – 'రక్తౌ చ క్రోధరాగౌ' సా. ద.)

మహి ... బు=ప్రశస్తమయిన కాంతి గుణమునుండి పొడముచున్న మెండయిన యెఱుపు యొక్క యద్భుత మయిన కాంతితో కూడుకొన్నట్టిది [లావణ్యస్వరూపము:—

'ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వమి వాన్తరా
ప్రతిభాతి య దఙ్గేషు తల్లావణ్య మి హోచ్యతే.'

ముత్తెములయందలి తళుకువంటి దేహకాంతి యనుట; 'మాధురి' యన మధురత్వము– మధు రాతి= తేనె నొసఁగునది వ్యు: తేనె ఎఱుపు– 'హిఙ్గుళం మధు రత్నాని స్ఫులిఙ్గా వహ్నిబిన్దవః' అని కా. క. ల. లో రక్తపదార్థసంగ్రహములో నున్నది – ...

'తామరసాప్తతామ్రముఖి దంష్ట్రితవిస్ఫుటమల్లి హల్లక
స్తోమరజశ్ఛటాంగక మధుద్యుతితార వియద్ధ్రిచంక్రమో
ద్దామ పితృప్రసూప్లవగి దైన్యరుతోత్థరథాంగపోత చిం
తామయనిద్రలం బోలసి తాపము సేయఁ దొడంగె నింతికిన్.' ఆముక్త.

'జాతాః పక్వ పలాణ్డు పాణ్డు మధుర చ్ఛాయా కిర స్తారకాః
ప్రాచీ మఞ్కురయన్తి కాశ్చన రుచో రాజీవజీవాతవః.' అనర్ఘ.

ఈరెంటను 'మధుద్యుతితార' 'మధురచ్ఛాయా కిర స్తారకాః' అనువాని సామ్యము నరయునది. లావణ్య (= ఉప్పన యనెడు) గుణమునుండి మాధురి (=తీపుయొక్క) ఉత్పత్తి అని విరోధము– పూర్వోక్తార్థముచేత తత్పరిహారము కావున విరోధాభాసాలంకారము], ప్రార్థ ... ము = కోరిక

యనెడి కల్పవృక్షముయొక్క యుత్కృష్టమయిన పండు (ఇది దొరకినచో త్రిలోకాధిపత్యము లభించునని తీరు ననుట.-- పండినపండు. ఎఱ్ఱగణములలో పఠితము - 'పశ్యాకర్ష ణలలా ధ్యాకారం సపాకఫలము నాభీ' కా. క. ల.), తియ్య పూఁదేనియల క్రోవి = మధురము లైన పుష్పరసములయొక్క బావి (శ్లేక-ముఖప్రసరణమార్గము.) — మాలారూపకము.

ఉ. భాసురమధ్యరేఖ కిరు పక్కియలందును మోవి కించి దు (7-40)
చ్ఛ్వాసము నొంది యున్నయది చంద్రనిభాస్యకు; నే నొకప్పు ని
ద్రా సమయంబులం గలల రాకల నీకలకంఠిఁ గూడి వ
క్త్రాసవ మాని యాని దశ నాంకుర మొత్తఁ గదా రసోద్ధతిన్. 171

చంద్ర నిభ ఆస్యకున్ = చంద్రునికి సమాన మయిన మోముగల యీ కోమలికి, మోవి = అధరము, భాసు ... కున్ = ప్రకాశ మానమైన నడిమి గీఱకు, ఇరు పక్కియలందున్ = రెండు ప్రక్కలయందును, కించిత్ ఉచ్ఛ్వాసమున్ = ఇంచుక యుబుకును,... (అట్లుండుట),... కలల రాకలన్ = కలలు వచ్చినప్పుడు (కలలలో అనుట), (ఈ) కలకంఠిన్ — కల = అవ్యక్తమధుర మయిన - కంఠిన్ = కంఠస్వరముకల దైన (యీ) కొమ్మను, కూడి = కలసి, వక్త్ర ఆసవము = ముఖ మధువును, ఆని ఆని = అధికముగా క్రోలి, రస ఉద్ధతిన్ = ప్రేమయొక్క యతిరేకముచేత, దశన అంకురము = పంటి మొనను, ఒత్తఁ గదా = ఒత్తినందువలనఁ గదా.

కిమ్మోవి ప్రకాశమాన మయిన నడిమిరేఖకు రెండువైపులను కొంచెము ఉబికి యున్నది. ఈయుబుకు ఈకోమలికి నిద్రవేళలలో స్వప్నములలో నేను వచ్చి ఈకలకంఠిని గూడి దీని నోటిమద్యమును క్రోలి రసోద్రేకంబునం జేసిన దంతక్షతములచేతం గలిగి యుండును.

స్వాభావిక మయిన యధరోచ్ఛ్వాసమునకు స్వకృత రదక్షతములను హేతువుగా సంభావించుటచేత హేతూత్ప్రేక్ష.

కాంతులును కాంతలును అన్యోన్య ముఖమద్యముం గ్రోలుట ప్రసిద్ధము:—

'ప్రాప్యతే గుణవతాఽపి గుణానాం। వ్యక్త మాశ్రయవశేన విశేషః;
తత్తథా హి దయితాననదత్తం। వ్యానశే మధు రసాతిశయేన.' భారవి.

'పి పి ప్రియ స స స్వయం ము ము ముఖాసవం దేహి మే,
త త్త త్యజ దు దు ద్రుతం భ భ భ భాజనం కాఞ్చనమ్.
ఇతి స్ఖలిత జల్పితం మదవశాత్కురఙ్గీదృశః
ప్రగే హసితహేతవే సహచరీభి రధ్యైయత.' సరస్వతీ కంఠాభరణధృతము.

దశనాంకుర మొత్తుటకు కారణము 'రసోద్ధతి', రసోద్ధతికి దమయంతీ ముఖమద్యపాన బాహుళ్యము (ఆని యాని).

[ఈ క్రింది పద్యము పూర్వముద్రణములలో లేదు; వ్రాఁతపుస్తకములలో దొరకినది.]

ఉ. ఈ గజరాజగామిని మదేతదయోగ భర ప్రభూత మూ (7-45)
ర్ఛాగత ఖేద రాత్రి సమయావధి భూత విభాత సంధ్య, కా
లాగరు చిత్ర కాంధతమసాంశ సమన్విత, జంభవైరి కా
ష్ఠాగత రాగ కర్త్రి, ప్రకట ద్విజ సేవిత యౌట చిత్రమే? 172

ఈగజరాజ గామిని = గజేంద్రునివలె నడచునది (అట్టినడక గలది) ఆయిన యీకోమలి, మదే... ధ్య - మత్ = నాయొక్క - ఏతత్ = ఈకొమ్మతోడి - అయోగ భర = విరహాతిశయమువలన - ప్రభూత = కలిగిన - మూర్ఛా = మూర్ఛచేత - గత = పొందఁబడిన - ఖేద = క్లేశ మనెడి - రాత్రి సమయ=నిశా వేళకు - అవధి భూత = మేర యయినట్టి - విభాతసంధ్యా= ప్రాతఃసంధ్యగా నున్నది (ఈ సుందరిం జూడఁగానే నా విరహమూర్ఛాదుఃఖములు తీఱిన వనుట), కా...న్విత - కాల అగరు = నల్లయగరుయొక్క - చిత్రక = తిలక మనెడి ('తమాలపత్త్ర తిలక చిత్రకాణి విశేషకమ్' అమ.) - అంధతమస = చిమ్మచీఁకటియొక్క ('ధ్వాన్తే గాఢేఽన్ధతమసమ్' అమ.) - అంశ = భాగముతో - సమన్విత = కూడుకొన్నట్టిది, జం...త్రి - జంభవైరి కాష్ఠా= ఇంద్రదిక్కును (తూర్పును)-గత = పొందిన - రాగ = రక్తిమను - కర్త్రి = చేయునది (జంభ వైరి = ఇంద్రునికి - కాష్ఠా = పెక్కువను ('కాష్ఠోత్కర్షే స్థితౌ దిశి' అమ.) - గత = పొందినట్టి - రాగ = అనురక్తిని - కర్త్రి = చేయునది - ఇంద్రునికి మితి మీఱిన వలపు గలిగించినట్టిది), ప్ర... ట = ప్రసిద్ధముగా - ద్విజ = బ్రాహ్మణులచేత - (దంతములచేత అనియు - 'దన్త విప్రాణ్డజా ద్విజాః') - సేవిత = ఉపాసింపఁబడుచున్నట్టిది, ఔట, చిత్రమే = ఆశ్చర్యముకాదు.

ప్రాతస్సంధ్య రాత్రిని అంత మొందించును, కొంతచీఁకటిని వహించును, తూర్పున రాగము నించును, బ్రాహ్మణులచే నుపాసింపఁబడును; అట్లే ఈకోమలి నావియోగమూర్ఛాఖేదమును అంత మొందించినది, నల్లని చిత్రకముం దాల్చి యున్నది, ఇంద్రునికి రాగ మూన్చినది, దంతములచే నాశ్రితయై యున్నది.—శ్లిష్టరూపకాలంకారము.

ఉ. ఈ యెలదీఁగఁబోణి కృప యేర్పడఁగాఁ దన లేఁతనవ్వుతో (7-43)
వేయవ పాలపాంగముల వెంటఁ బ్రసాదము చేసిన, న్నిశా
నాయకుఁ డెంతయుం బ్రియమునం గయికోఁడొకొ నాల్గుదిక్కులం
బ్రాయపుఁ జంద్రికల్ వడిసి పాఱఁగ వైచుచు నప్పరార్ధముల్ ? 173

ఈ ఎల దీఁగఁ బోణి = లేఁ దీఁగవంటి మేను గల యీసుదతి, అపాంగముల వెంటన్ = కటాక్షమార్గమున (లేక - కటాక్షములతోఁ గూడ), ప్రసాదము చేసినన్ = అనుగ్రహము చేసిన యెడల (ఇచ్చినచో), నాల్గు...చున్ = నలుదెసలయందును తఱపి వెన్నెలలను విసరి పాఱవైచి, నిశానాయకుఁడు = చంద్రుఁడు, అప్పరార్ధముల్ = ఆచరమసంఖ్యను (పరార్ధమునకు పైని సంఖ్య లేదు - అంత వెలగల యాస్మితలవమును అనుట), ఎంత...నన్, కయికోఁడొకొ = గ్రహింపఁడా.

ఈయెలనాగ తన యపాంగములవెంటం బ్రసరించు తన లేనగవులో నొక సహస్రాంశమైనను ప్రసాదించినయెడల చంద్రుఁడు తన ముదురువెన్నెలలను పనికిరాని వని నలుదిక్కులకు విసరి పాఱవైచి ఆ స్మితలేశమును పరార్ధసువర్ణముల వెలగల వస్తు వని-లేక- తన తఱపి వెన్నెలలపరార్ధమునకు ఆలవమే సమ మని - ప్రీతితో గ్రహించును.—ఉత్ప్రేక్షాలంకారము.

చంద్రుని తఱపివెన్నెలలకన్న దమయంతీ స్మిత సహస్రాంశము పరార్ధగుణ ముత్కృష్టము, దానికన్న అపాంగస్మితము సహస్రగుణము, దానికన్న సాక్షాత్స్మితము ఎంత యధికమో చెప్ప నలవి గాదు, అని సారాలంకారము ధ్వనించుచున్నది. ఇట ధావళ్యమందు తారతమ్యము. స్మితము క్షరము ధవళ మని భా. హాసమందు ధవళత కవిసమయసిద్ధము, 'మాలిన్యం వ్యోమ్ని పాపే యశసి

ధవళతా వర్ణ్యతే హాసకీర్త్యోః' సా. ద. అపాంగస్మితము ప్రసిద్ధము - 'కన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసముల్' 2 ఆ. (85)

తే. దాడిమీ పక్వ ఫల బీజ తతుల గెలిచి, (7-44)
దంత కురువింద పంక్తి యాతరుణి కమరు,
నాస్య శీతాంశు మండల స్యందమాన
నవ సుధారస బిందు బృందంబు వోలె. 174

ఈతరుణికిల్, దాడి ... లల్ = దానిమ్మయొక్క పండిన పండ్లయొక్క గింజల సమూహములను, గెలిచి, దంత కురువింద పంక్తి = పల్లు కెంపుల వరుస, ఆస్య ... లెల్ = ముఖమనెడి చలివెలుఁగు (చంద్ర) బింబమునుండి స్రవించుచున్న క్రొత్త యమృత ద్రవముయొక్క బొట్టుల సమూహములవలె, అమరుల్ = ఒప్పుచున్నది.

కెంపులవలెను ఎఱ్ఱదానిమ్మ గింజలవలెను ఎఱ్ఱఁగా ప్రకాశించుచున్న దమయంతీ దంతములు ఆమెయొక్క మోముఁజందురునినుండి రాలుచున్న తొలితొలి యమృతబిందువులో యన విరాజిల్లుచున్నవి. 'నవ' అనుట సంజను సూచించుటకు, సంజ సూచన ఎఱుపునకు, దంతములయెఱుపు తాంబూలముచేతఁ గలిగినట్టిది. పండ్లకు, దాక్షిణాత్యస్త్రీలు కప్పువైచికొనునట్లే, ఔత్తరాహస్త్రీలు ఎఱ్ఱవన్నె వైచికొందురు. ఇటం జెప్పఁబడినయెఱుపు అది గాదని దీని వెంబడిపద్యముచే దెలియుచున్నది.

'సాంధ్యశీతాంశు'—అను ముద్రణము మూలానుగుణము గాదు. 'నవ'శబ్దముచే 'సాంధ్య' శబ్దము గతార్థము.

'దాడి...గెలిచి'—ఉపమ. 'స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి' అని యుపమావాచకములలో దండి 'జయతి'ని పఠించినాఁడు. 'దంత కురువింద'—ఉపమ. 'ఆస్య...బోలెల్'- రూపకోత్థాపితోత్ప్రేక్ష.

ఉత్తరార్ధమందు క్రమముగా 'అ య' యతియు, బిందుయతియు;—
'పనిఁ బూని నిలుచుఁ దమతమ । యనునాసికములకు బిందుయతు లన వెనుకల్
గనుపట్టు నాల్గు లిపులును । బెనుసున్నలు డాసి దమకుఁ బెఱుఁదఁ గదియుచోల్.' అప్ప.

తే. మాటి కుద్వేగ రా గాది మార్జనమున (7-46)
నతివిశుద్ధంబు లయిన దంతాంకురములు
విమల ముక్తావళీ సమానములు దాల్చు
నీ సరోజాక్షి ముఖ పద్మ కేసరములు. 175

ఈసరోజాక్షి = ఈతమ్మికంటి, మాటికిల్ = ప్రతిదినము, ఉద్వే ... నల్ = పోఁకయొక్క ('ఉద్వేగం పూగికాఫలే । ఉద్వేగ స్తూద్వేజనం స్యాత్' హేమ.) (రాగ) = ఎఱుపు- (ఆది =) మొద లయిన దానియొక్క తోమివైచుటచేత (ఉద్వేగ = దుశ్చింత - రాగ = విషయసుఖాభిలాష - లోనగువానిని తొలఁగించుటచేత), అతి విశుద్ధంబులు=మిక్కిలి ధవళములును (క్లేశరహితములును - అని ముక్తపక్షము), విమల ముక్త ఆవళీ సమానములు = పరిశుద్ధ మయిన

ముత్తెముల వరుసతో (అనఘులయిన మోక్షప్రాప్తుల సమూహముతో; 'ముక్తః ప్రాప్తమోక్షే చ మోచితే । త్రిషు స్త్రీ మౌక్తికే' మేది.) సదృశములును, అయిన, దంత అంకురములు = పలు మొగ్గ లనెడి, ముఖ పద్మ కేసరములు = తన మోముఁ దమ్మియొక్క యకరువులను, తాల్చెన్ = వహించియున్నది.

ప్రతిదినము తమ్మలంపుఁబోఁకయెలుసు లోనగువానిని తోముటచేత తెల్లనివియు నిర్మలంపు ముత్తెముల వరుసతో సమానములును, (దుశ్చింతను విషయసుఖాభిలాషను ద్యజించుటచేత క్లేశ రహితు లగు మోక్షప్రాప్తుల సమూహముతో సమానములును) అగు నీ నలినలోచన పలుమొగ్గలు దీని ముఖపద్మముయొక్క కేసరములుగా నున్నవి.—శ్లిష్టోపమాసంసృష్టరూపకము.

తే. వర శిరీష ప్రసూన కేసర శిఖాగ్ర (7-47)
పేలవంబుగ మేను గల్పించి ధాత,
కలిత సుకుమార సర్గ ప్రకర్షుఁ డగుచు,
నిలిపె మార్దవ మీయింతిపలుకులందు. 176

ధాత = బ్రహ్మ ('ధాతాఽబ్జయోని ర్ద్రుహిణః' అమ.), మేను = ఈయింతిదేహమును, వర...గన్ = ఉత్కృష్ట మయిన (అనఁగా సంపు ల్లమ్లాన కోమలతమ మయిన) దిరిసెన పువ్వు యొక్క యకరువుయొక్క కొనయొక్క కొసకంటె కోమల నగునట్లు, కల్పించి = సృజించి, కలి...డు = అలవడిన మృదు (వస్తు) సృష్టియొక్క నేర్పుకలవాఁడు, అగుచున్ = అయి,... పలుకులందున్ = మాటలయందు, మార్దవము = మృదుత్వమును, నిలిపెన్ = ఉంచినాఁడు.

శిరీషపుష్పము తత్కేసరము తచ్ఛిఖ తదగ్రము దమయంతీదేహము దమయంతీవాక్కు - ఇందు పూర్వపూర్వముకన్న ఉత్తరోత్తరము మృదుతర మని వర్ణించుటచేత సారాలంకారము. వాఙ్మార్దవ నిర్మాణ కౌశలలబ్ధికి హేతువు కాని దేహమార్దవ నిర్మాణమును తద్ధేతువుగాఁ జెప్పుట హేతూత్ప్రేక్ష.

ఆ మృదుదేహమును సృజింపనిచో ఆ మృదుతరవాక్కును సృజింప శక్తుఁ డై యుండఁ డనుటలో నభిప్రాయ మే మనఁగా, అట్టి దేహమార్దవము మతి యెందును లే దనియు, దానిని మించిన యావాఙ్మార్దవము మతి యెందును లేనే లేదనియు, ఆమేనికే అది తగినది గాన ఆమెకు మాత్రమే అది కల దనియు, నభిప్రాయము.

ఉ. పచ్చని వృక్షవాటికల పండుల భిక్ష భుజించి నిచ్చలున్ (7-48)
వచ్చి పఠింపఁ బోలుఁ బ్రతివారము గోయిల బ్రహ్మచారి పెం
పచ్చుపడంగ నీ సరసిజాక్షి ముఖ ద్విజరాజు నొద్ద వా
విచ్చి లసత్ప్రసూన శర వేద రహస్యము లైన పల్కులన్. 177

కోయిల బ్రహ్మచారి = కోకిల యనెడి వటువు (బ్రహ్మము అనఁగా వేదాధ్యయన వ్రతము- దానిని చరించువాఁడు బ్రహ్మచారి); నిచ్చలున్ = నియమభంగము లేకుండ, ... వృక్ష వాటికల పండుల భిక్షన్ = చెట్ల తోఁటల పండ్లయొక్క భిక్షను (భిక్షగా తెచ్చుకొన్న పండ్లను - పండుల భిక్షన్ అని వ్యస్తముగా సేని కొన వచ్చును), వచ్చి, ... ప్రతివారము = ప్రతిదినము, ...అచ్చు

పడంగన్ = ఏర్పడునట్లుగా, ... ముఖ ద్విజరాజు నోర్దన్ = ముఖ చంద్రుని వలన (ముఖ మనెడి బ్రాహ్మణోత్తమునివలన - 'ద్విజరాజః శశధరో నక్షత్రేశః క్షపాకరః' అమ. - ద్విజో రాజేవ అని బ్రాహ్మణపక్షమున నుపమితసమాసము), వా=నోరు - విచ్చి = తెఱచి.( అనఁగా చక్కఁగా ఉచ్చరించి), లసత్...ములు = ఒప్పుచున్న పుష్పబాణ వేద మర్మములు (కామోపనిషత్తులు), విన - పల్కులన్ = మాటలను, పఠింపఁ జోలున్ = అధ్యయనము చేసెను గాఁబోలుయును.

కోయిలబ్రహ్మచారి చెట్లనుండి పండ్లను భిక్షించి తెచ్చుకొని వానిచే జీవించుచు, దమయంతీ ముఖ మనెడి చంద్రునివలన (బ్రాహ్మణోత్తమునివలన) కామోపనిషత్తులు యథావిధిగా ఉచ్చరించి యధ్యయనము చేసెను గాఁబోలుయును.—రూపక శ్లేషానుప్రాణితోత్ప్రేక్ష.

'పచ్చని' - సంపదగల యనుట - పేదల యింటికి భిక్షకుం బోయినయెడల వారు పెట్ట లేక యాయాసపడుదురు - వేదయజ్ఞపరు లైన శిష్టు లనుటయు:—

'భిక్షా మాహృత్య శిష్టానాం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్, ...
భైక్ష స్యాహరణం ప్రోక్తం పతితాదివివర్జితమ్,
వేదయజ్ఞ విహీనానాం ప్రశస్తానాం స్వకర్మసు
బ్రహ్మచా ర్యాహరేద్ భైక్షం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్.
భైక్షేణ వర్తయే న్నిత్యం నైకాన్నాదీ భవే త్క్వచిత్.
భైక్షేణ వ్రతినో వృత్తి రుపవాససమా స్మృతా.' కూర్మ.

'వాటికలన్'-మునిపల్లెలయందుంబోలె - బ. వ. చేత ఏకగృహాన్నము గాక యని భా. 'పండులు'-ఫలాహారము ఉపవాసతుల్యము-

'అష్టౌ తా న్యవ్రతఘ్నాని ఆపో మూలం ఫలం పయః
హవి ర్బ్రాహ్మణకామ్యా చ గురో ర్వచన మౌషధమ్.' బోధాయనుఁడు.

'భిక్షు' - బ్రహ్మచారి గావున. 'నిచ్చలున్' - భిక్షావ్రతమునకు ఎన్నఁడును భంగము గాకుండ - ఏక గృహభోజనము ఎప్పుడును చేయక అనుట. 'వచ్చి' - గురువు నింట భిక్ష గ్రహింపఁగూడదు గావున - దానిని బయటనే ముగించుకొనుట సూచితము:—'గురోః కులే న భిక్షేత న జ్ఞాతికుల బన్ధుషు.' కూర్మ. 'కోయిల'కు - ద్విజత్వముచే వేదాధికారము కలదు- 'ద న్తవిప్రాణ్డజా ద్విజాః' అమ. 'ప్రసూనశర వేద' కామవేద మనుటచే దీనికూఁత కామోద్దీపక మని భా. ('పికః కూజతి పఞ్చమమ్.') దీనిపంచమ స్వరపుం గూఁత సామగానమును మించిన కామగానముగా నున్న దని భా. 'రహస్య' - దమయంతీవాణి యంతకామోద్దీపకముగా మఱి యే తరుణివాణియు నుండ దనుట. దమయంతివాణి పికవాణికన్న మధుర మనియు అంతకన్న మదనోద్దీపక మనియు పద్య భా.

'కోయిలబ్రహ్మచారి' - మిశ్రసమాసము గావున లాఘ సంయోగము (బ్ర) పరమయినను గురుత్వము లేదు.

తే. దీని కంఠంబునందు వాగ్దేవి యుండి, (7-50)
వీణ మొరయించుచున్నది వీను లలర,
నదియు ముఖమున వాగ్భావ మాశ్రయించి,
యమృత ధారా ప్రవాహ రూపమునఁ నిల్చె. 178

మెరయించుచున్నది = వాయించుచున్నది. వీనులు = నాచెవులు, అలరన్ = సంతోషించునట్లుగా. అదియ = ఆ వీణావాదనమే (ఆ వీణానాదమే), ముఖమునన్ = ఈతరుణినోట, వాగ్భావము ఆశ్రయించి = మాటతనమును పొంది (మాటయై), (నాచెవులయందు), అమృత ...

సరస్వతి ఈకొమ్మకంఠములో ఉండి నావీనులు తనియునట్లు వీణ వాయించుచున్నది. ఆ వీణానాదము దీనినోట మాటగా పరిణమించి నాచెవులలో అమృతధారాప్రవాహముగా నిలిచినది

ఉత్ప్రేక్షాలంకారము; సరస్వతీ వీణానాదము కంఠ ముఖ శ్రోత్రము లనెడి యనేకాధారములందు వరుసగా నున్నట్లు వర్ణించుటచేత పర్యాయాలంకారము; రెంటికిని సంకరము.

'మాశ్రయించి, యమృత ... పము వహించె' అనియు, 'మాశ్రయించె, నమృత ... పము వహించి' అనియు, పాఠాంతరములు.

తే. అబ్జగర్భుండు సుషమా సమాప్తియందు **(7-51)**
నెత్తి చూడంగఁ బోలు నీ యింతివదన;
మంగుళీ యంత్రణ క్రియా భంగి నమరెఁ,
జిబుకమునయందు నా నిమ్న సీమ సంధి. 179

అబ్జగర్భుండు=బ్రహ్మ, సుషమా సమాప్తియందున్=పరమశోభయొక్క సంపూర్ణతయందు (తాను ఈముఖమునకు సంపూర్ణలావణ్య మొసంగిన పిమ్మట – 'సుషమా పరమా శోభా' అమ. 'సమాప్తి రవసానే స్యాత్సమర్థనే' మేది.), ఈ యింతి వదనమును = ఈ కలికి ముఖమును, ఎత్తి చూడంగఁ బోలున్, (అందులకు గుఱుతే మనఁగా), చిబుకమునయందున్ = గడ్డమునంచు (గడ్డముయొక్క యంచున), ఆ నిమ్న సీమ సంధి = ఆ పల్లపుఁ బ్రదేశముయొక్క సంధానము ('సన్ధిః శ్లేషే' అమ.), అంగుళీ యంత్రణ క్రియా భంగిన్ = వ్రేళ్లతో (బొట్టనవ్రేలు ముందువైపునను కడమవ్రేళ్లు వెనుకవైపునను ఉంచి) ఒత్తుట యనెడి వ్యాపారముయొక్క రీతిచేత, అమరెన్ = ఒప్పుచున్నది.

బ్రహ్మ ఈయింతిముఖమును చేసినప్పుడు దీనికి సంపూర్ణముగా పరమశోభను ఒసంగి పరీక్షార్థము ఎత్తి చూచినాఁడు గావలయును? ఏల యట్లు తోఁచుచున్న దనఁగా, గడ్డముక్రిందిభాగమందలిపల్లము ఆతని బొట్టనవ్రేలి యొత్తుడుగా కనఁబడుచున్నది.—ఉత్ప్రేక్ష.—ముఖ మత్యంత శోభాసమగ్ర మై (తోడిమవంటి) క్రిందిభాగమున కొంచెము పల్లమై యున్న దని భా.

క. కమ లాధిరాజ్య పదవీ **(7-54)**
సమధిష్ఠిత మీవధూటి చారు ముఖాంభో
జము; మఱి యటు గాదే నే
నిమిత్తమున సేవ సేయు నేత్రాంబుజముల్? 180

ఈ వ...ము=ఈ భామయొక్క సుందర వదనారవిందము, కమల ఆధిరాజ్య పదవీ సమధిష్ఠితము = కమలముల సామ్రాజ్య మనెడి విభవముచేత ఆశ్రయింపఁబడినది. కాదేని = కానిచో.

ఈ భామ ముఖాంభోజము కమలములకెల్ల రాజు గావలయును, కానిచో నేత్రకమలములు ఏల ఈముఖమును సేవించుచుండును?—ఉత్ప్రేక్షాలంకారము; దానికి 'ముఖాంభోజము' 'నేత్రాంబుజముల్' అను రూపకము లంగములు.

చ. కమలము తండ్రి యైన యుదకంబుఁ, గళానిధి మిత్త్రి యైన య (7-56)
ద్దమును, నహర్నిశంబు నుపధావన సేసి వహించెనో సుమీ
క్రమమున నీ వధూమణి ముఖప్రతిబింబ విలాస సంపదన్
సముచిత లీల యాచితక చారు విభూషణ రాజి కైవడిన్. 181

కమలము, తండ్రి యైన యుదకంబున్ = తన జనకుఁ డైన నీటిని, కళానిధి=చంద్రుఁడు ('అబ్జో జైవాతృకః సోమో గ్లౌ ర్మృగాఙ్కః కళానిధిః' అమ.), మిత్త్రి యైన యద్దమును, అహర్నిశంబున్ = పవలును రేయును (రేయుం బవలు - సర్వదా - ఇచ్చినదాఁక పవలక), — ఉపధావన చేసి = వెంబడించి (బతిమాలి తెచ్చుకొని యనుట), ఈ ... దన్ = ఈ రామా రత్నము యొక్క మోము నీడయొక్క సొంపు పెంపును, సముచిత లీలన్ = తగిన విధముగా, యా ... డిన్ = ఎర వయిన యందంపు నగల సమూహమునుంబోలె, క్రమమునన్ = పర్యాయముగా, వహించెనో సుమీ = ధరించిన వేమో సుమా.

నీటను అద్దములోను ఈతన్వి ముఖము ప్రతిబింబించును గావున, ఆ ప్రతిబింబంపు సొంపును తండ్రి యగు నీటిని అడిగి కమలంబును, తనమిత్త్రి యయిన యద్దము నడిగి చంద్రుఁడును ఎరవు తెచ్చుకొని తగిన సమయములలో పగలు కమలంబును రాత్రి చంద్రుండును ఎరవు నగగా ధరింతురు గావలయును.—ఉత్ప్రేక్షాలంకారము; దానికి కమల కళానిధులకు 'అహర్నిశంబు'నకును గల యథాసంఖ్యంబును, చతుర్థపాదమున ఉపమయు, సంగములు.

'తండ్రి' - కమలము నీరజము గాన నీరము కమలమునకు తండ్రి. 'మిత్త్రిము' - స్వచ్ఛతాది గుణ సామ్యముచేత మైత్త్రి. 'అహర్నిశంబున్' - కమలము పగటివేళను, చంద్రుఁడు రాత్రి వేళను ఉక్తోపధావనమును ఉక్తవహనమును గావించుటచేత క్రమ మున్నది. 'ఉదకాదర్శములను' యాచించుట వానియందు దమయంతీ వదన ప్రతిబింబ విలాస సంపద వారి విహార ప్రసాధనాది సమయములందు సంక్రమించును గావున. 'సముచిత లీలన్' - ఎరవు సొమ్మును నిరంతరము ధరించుట యుచితము గాదు; కావున కమలము పగలే, చంద్రుఁడు రాత్రియే, అదియు నియతము గాదు; కమలము శిశిరాదిసమయములందు ధరింపదు, శారదవేళలందు ధరించును; చంద్రుఁడు అమావాస్యాదులందు వహింపఁడు, రాకారాత్రులయందు వహించును; కావున కాదాచిత్కముగా నుత్సవసమయములయం దని భా. మైగా చంద్రుఁడు వహించినప్పుడు కమలము వహింపదు, కమలము వహించినపుడు చంద్రుఁడు వహింపఁడు. ఒకరు వహించుట నొకరు చూడ లేమి తదీయ శాశ్వత వైరమునకు కరము సముచితము. ఉత్సవసమయము ముగిసిన పిమ్మట ఎరవును ధరింపరు. అట్లే కమలచంద్రుల వృత్తంబును; ఇదియు సముచితమే.

సీ. రాహు దంష్ట్రాంకుర క్రకచ ఘాతంబుల (7-52)
నొక్కొక్కపరి నెప్పి నొంద కున్నఁ,
బరివేష మిష మైన పాశ బంధంబున (7-58)
బహువారములు గట్టువడక యున్నఁ,
బ్రతిమాసమును గుహూ రాత్రి వేళలయందు (7-59)
నత్యంత నాశంబు నంద కున్నఁ,

బలవ త్కాళంక కజ్జల పంక సంకర
స్ఫూర్తి మాలిన్యంబుఁ బొరయ కున్నఁ
తే. గాక, పరిఁబోలఁ జాలునే కమలవైరి
యనధిగత దోష మైన యీ యతివ మొగము,
మధుర బింబాధ రోష్ఠంబు మాఱు గాఁగ
నమృత పూరంబు గలిగిన యంతమాత్ర ? 182

కమల వైరి = చంద్రుఁడు (పద్మములు రాత్రి వికసిల్లనందున నీవిరోగము), రాహు ...
లన్ = రాహువుయొక్క కోఱల మొలక లనెడు (వాఁడికొనలు గల కోఱ లనెడి - 'అజుక్కారోఽభినవోద్భిది' అమ.) అంపముయొక్క ('క్రకచోఽస్త్రీ కరపత్త్రిమ్' అమ.) కోఁతలచేత,
ఒక్కొక్క - పరి = మాఱు (గ్రహణవేళలం దనుట), నొప్పిన్, ఒందక, ఉన్నన్ = ఉన్న యెడల;

పరి ... నన్ = గాలిగుడి యనెడి ('పరివేష స్తు పరిధి రుపసూర్యకమణ్డలే' అమ.) మిషగల
దైన త్రాటి కట్టుచేత, బహు వారములు = పలు మాఱు (ముఖ్యముగా వర్ష దినములలో - 'వారః
సూర్యాది దివసే వారోఽవసర బృన్దయోః' విశ్వ.);

... కు ... దున్ = చంద్రుఁడు బొత్తిగా లేని యమవసనిసి సమయములయందు
('అమావాస్యా త్వమావస్యా దర్శః సూర్యేన్దుసంగమః
సా దృష్టేన్దుః సినీవాలీ సా నష్టేన్దుకళా కుహూః.' అమ.),
అత్యంత నాశంబున్ = స్వరూప హానిని (ఒకతుణ మేని కనఁబడనందున అత్యంతనాశ మనుట),
అందకున్నన్ = చెందక యుండునెడల;

బల ... ర్తిన్ = దిట్టమైన ('బలవాన్ మాంసలోఽంసలః' అమ.) మచ్చ యనెడి ('కళ
ఙ్కాఙ్కౌ లాఞ్ఛనం చ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్' అమ.) కాటుక యనెడి బురదతోడి
కూడికయొక్క తోఁచుటచేతను, మాలిన్యంబున్ = మాపుడును, పొరయ కున్నన్ = పొందక
యుండిన యెడల;

కాక = తప్పు, మధు ... గన్ = తియ్యనిదియు దొండపండువలె (నెఱ్ఱనిదియు) నగు క్రింది
పెదవికి మాఱుగా (బిమ్బారుణః అధరోష్ఠః అని మధ్యమపదలోపిసమాసము), అమృతపూరంబు =
సుధాప్రవాహము ('పూరో జలప్రవాహే స్యా ద్వ్రణసంశుద్ధి ఖాద్యయోః' మేది.), కలిగినయంత
మాత్రన్ = తనకు (చంద్రునికి) ఉన్నంతమాత్రాన, అనధిగతదోషము = పొందఁబడిన దోషములు
కలది కానిది [దోషరహితము అనుట - చంద్రుఁ డన్ననో అధిగత దోషుఁడు - అనఁగా పొందిన దోష
ములుకలవాఁడు - దోషయుక్తుఁడు - రాత్రిం బొందినవాఁ డని వాస్తవము - ఈయర్థమున దోషా
శబ్దము - 'దోషః స్యా ద్దూషణే పాపే దోషా రాత్రౌ భుజేఽపి చ' మేది.

'దీపదశా కులయువతి ర్యైవద్గ్యై నైవ మలినతా మేతి
దోషా అపి భూషాయై గణికాయా శ్శశికలాయా శ్చ.' ఆర్యాసప్తశతి.
ఇది యవ్యయంబు నగు.

'దోషాపి నూన మహిమాంశు రసౌ కి లేతి
వ్యాకోచ కోకనదతాం దధతే నళిన్యః.' మాఘ.],

విన - ఈయతివ మొగముతో, సరిఁబోలఁ జాలునే— చాలఁ డనుట.

చంద్రుఁడు దమయంతియొక్క మధురాధరమునకు సాటిగా తాను అమృతము కలిగి యున్నను అంపపుఁగోఁతలు, త్రాటికట్లు, స్వరూపనాశము, కాటుకపూఁతయు - కలిగి అధికత దోషుఁ డగుటచేత, నిర్దోష మయిన యామెముఖమునకు సాటి గానేరఁడు.

పూర్వోక్తదండనములను దమయంతీ వదనసామ్యాపేక్షణాపరాధమునకే పొందినాఁ డని భా. అంపముతోఁ గోయుట, పెడ కెక్కలు విఱిచి కట్టుట, దేశము వెడలఁ గొట్టుట, మొగమునకు (లేక-దేహమున కెల్ల) కాటుకపూసి తఱుముట - ఇట్టిదండనలకు తగిననేరమి సుమా అతని దమయంతీ వదన సామ్యాపేక్ష. అతనికిని ఆవదనమునకును అంత యంతరము కల దని భా.

ఉపరాగ పరివేష కళానాశ కళంకములను దండనములనుగా సంభావించుటచేత బృహత్పాదములందు ప్రతిదానను ఉత్ప్రేక్షాలంకారము. దానికి ప్రథమపాదమున (రాహు...క్రకచ) అనురూపక మంగము; ద్వితీయమున 'పరివేష మిషమున...' అని కైతవాపహ్నుతి అంగము; నాలవదాన 'కళంక కజ్జల' అని రూపక మంగము. 'సరిఁబోలఁజాలఁ' డనుట ప్రతీపభేదము:—

'(1) ఇతరమున కుపమ సేఁత ప్ర। కృత, (2) మితరోపమితలబ్ధి నితరంపుఁ దిర
స్కృతి, (3) యుపమానవృథాత్వము।ప్రతీపములు(4) పెఱకు నుపమ ప్రకృతగ లేమిక్షా.'

సీ. సకల శాస్త్రౌఘ నిష్యంద ధారా సార (7-62)
నవ సుధా రస వాటీ ప్రణాళు లొక్కొ,
రతి పంచబాణ దైవత యుగ్మ పూజ నా (7-61)
వసర నైవేద్య పూపంబు లొక్కొ,
ధన్వరే ఖాంచి తైత ద్భ్రూ జ్యకా వేణు (7-65)
శాఖా శిఖా త్వగంశంబు లొక్కొ,
బలభేది ముఖ చతు ర్బర్హి ర్ముఖప మనః (7-64)
సారంగ బంధ పాశంబు లొక్కొ,
తే. యధిక దీర్ఘ కటాక్ష బాణాగ్ర కషణ
శాణ చక్ర ప్రసార మసార తరళ
భర్మ తాటంక నేపథ్య భాసురములు
దీని వీనులు శ్రీకార వరానదములు. 183

అధి... ములు - అధిక = మిక్కిలి - దీర్ఘ = వాలిక యయిన - కటాక్ష = కడకంటి చూపులనెడి - బాణ = అమ్ములయొక్క - అగ్ర = కొనల (అలుగుల) - కషణ = నూఱెడి సాధనములయిన - శాణ చక్ర = సాన కండ్లయొక్క ('శాణ స్తు నికషః కషః' అమ.) - ప్రకార = ఆకారముగల దైన - మసార (బంగారపు వలయములతోఁ జేర్చిన) - యింద్రనీల (చక్ర)ములచేత ('నీలమణి ర్మసారః స్యాత్' హారావళి) - తరల = తళతళ లాడుచున్న ('తరలం చఞ్చలే షిద్గే భాస్వరేఽపి త్రిలిఙ్గకమ్ । హారమధ్యమణౌ పుంసి తరవాగూ సురయోషి స్త్రియామ్' మేది.) — భర్మ = బంగారము యొక్క ('భర్మ శాస్త్రాత్ కాఞ్చనే భృతౌ' మేది.) - తాటంక = కమ్మలనెడి - నేపథ్య = కై

సేఁతచేత ('నేపథ్యం తు ప్రసాధనే । రజ్గభూమౌ వేషభేదే' హేమ.) – భాసురములు=ప్రకాశ మానములును (ప్రతి తాటంకమందును పసిఁడి చక్రమునడుమ ఇంద్రనీల చక్రము పొదుగఁబడిన దనియు, ఆయింద్రనీలచక్రములు కటాక్షము లనెడి బాణములయగ్రములను నూఱెడు సానచక్రముల వలె నున్న వనియు, అట్లనుటచే కటాక్షములు ఆకర్ణాంతనేత్ర గావున ఆమసారచక్రములపై పొల యుచున్న వనియు, ఆ యింద్రనీలచక్రములచే బంగారపుఁ దాటంకములు మెఱయుచున్న వనియు, భా.), శ్రీ...లు–శ్రీకార=శ్రీ యనెడి యక్షరముయొక్క–మాన=గర్వమును – దములు=ఖండిం చు నవియు ('దో అవఖణ్డనే'), (అయిన), దీని వీనులు = దమయంతి కర్ణములు; (సీసపాద ములతో నన్వయము.)

సకల – లొక్క = సమస్తమైన శాస్త్రముల సమూహముల ('ఓఘో బృన్దేఽమ్భసాం రయే' అమ.) స్రవణముల యొడికలయొక్క జడి యనెడి ('ధారాసమ్పాత ఆసారః' అమ. – లేక- ఓడికలయొక్క స్థిరాంశ మనెడి – 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు' అమ.)- నూతనామృత ద్రవమును (మనస్సులోనికి) పాఱించెడి తూము లేమో ('ద్వయోః ప్రణాళీ పయసః పదవ్యామ్' అమ.)

రతి ... లొక్క = రతిదేవియు మన్మథుండు నను దేవతా దంపతులయొక్క పూజా సమయ మందలి నైవేద్యము లగు నప్పచ్చు లేమో ('పూపోఽపూపః పిష్టకం స్యాత్' అమ.)

ధన్వ...లొక్క = ధనుస్సులయొక్క ('ధన్వా తు మరుదేశే నా క్లీబం చాపే స్థలేఽపి చ' మేది.) శోభచేత ఒప్పుచున్న యీదమయంతియొక్క బొమల నారు లగు ('మౌర్వీజ్యా శిఞ్జినీ గుణః' అమ.) వెదురుకొమ్మ కొనతొక్క లగుభాగము లేమో (ధనుస్సునకు పండువెదురు తాఁటను నిడు పైన పలుచని సన్నని బద్దగా బద్దవలె చీల్చి తీసి దానితో నారి చేయుదురు, కావున వెదురు తొక్కనారుల తుదిభాగము లేమో అనుట;—

'పక్వ వంశ త్వచా కార్యో గుణ స్తు స్థావరో దృఢః,
పట్టసూత్రేణ సంనద్ధః సర్వకర్మసహో యుధి.' శార్ఙ్గధరుఁడు.)

బల ... మొక్క=ఇంద్రుఁడు ('బలారాతిః శచీపతిః' అమ.) మొదలుగాఁగల నలువురు దేవనాయకుల ('బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః' అమ. – బర్హిర్ముఖాః పా స్తీతి బర్హిర్ముఖపాః – బర్హిర్ముఖపులు – దేవనాయకులు ) మనస్సులనెడి లేళ్లను కట్టుటకొఱకైన వల యేమో.

ఈపద్యమందు పాఠసందేహములు పెక్కులు గలవు. ప్రథమపాదమందు పూర్వముద్రణము లందు 'వాఃప్రణాళులు'–శాస్త్రసారమును 'సుధారస' మన్నపిమ్మట, వాః(=జలము) అని రూప కము చేయుట సరసముగా అగపడదు; మూలములో 'శాస్త్రేషు నిష్యన్ద సుధాప్రవాహః' అని యున్నది, కావున తదనుగుణముగా 'సుధారసవాట్' అని మార్పు కల్పింపఁబడినది.

తృతీయపాదమున–'భ్రూజ్యకా'–ప్రతులలో దీనికి 'భూరిలతా' అని యున్నది; మూలములో 'భూరిజ్యా' చెప్పఁబడినది. నారికి ఏది శ్రీహర్షునిచే చెప్పఁబడినదో అది లతాపాఠములో వింటికే కలిగి పొందిక లేక యున్నది; మూలము—

'ఆత్మైవ తాతస్య చతుర్భుజస్య జాత శ్చతుర్ధోరుచితః స్మరోఽపి
తచ్చాపయోః కర్ణలతే భ్రువౌ జ్యే వంశత్వగంశౌ చిపిటే కి మస్యాః.'

జ్యాశబ్దము స్వార్థకప్రత్యయముచే 'జ్యకా' అగును, అదియే మూలానుగుణతాత్పర్యము శ్రీనాథోక్తముగా నుండునను తలంపున కల్పించుకొనఁబడినది. 'వ్యాసాహతం ప్రథమ మాప్త మిహాజ్యకా స్యాత్' అని లీలావతిలో భాస్కరాచార్యప్రయోగము.

చతుర్థపాదమందు 'పాశ మొక్కో'-అనుపాఠమున కడమ మూఁడుపాదములకుఁద నున్న 'లొక్కో'యను బహువచనప్రక్రమమునకు భంగము; 'మనస్సారంగ' - 'మనః ప్రతిబంధ' అని పూర్వపాఠము, అందు మనస్సులు మృగములో పక్షులో తెలియదు, ఉత్తమనస్సులను బంధించుటకు పాశములు పనికి రావు; మఱియు 'వాగురా' 'పాశములు' సమార్థకములు, రెంట నొకటి చాలును- 'వాగురామృగబన్ధనీ' అమ.

'పాశః కేశాదిపూర్వః స్యాత్ తత్సఙ్ఘే, కర్ణపూర్వకః
సుకర్ణే చ, స్వసామర్థ్యా న్మృగపక్ష్యాదిబన్ధనే.' మేది.

రెండు నున్నవి గాన పాశశబ్దమును రజ్జుమాత్రపరముగా చేసికొనవలయును. 'మన స్సారంగ బంధ పాశంబు లొక్కో' అనిన అన్నివిధములను సరిపడును. ఇందులకు ఈక్రిందిది సదృశము.

'యువమనో మృగరాజిఁ దవిలింపఁ దీర్చిన మదనవాగురలిందువదనకురులు' (2 ఆ.15)

గీతమందలి పెద్దసమాసమున రూపకాలంకారము. శ్రీ...లు = ఉపమ. సీసమున పావపాదమునందును ఉత్ప్రేక్షాలంకారము అంగి. ప్రథమమున రూపకము అంగము, 'ధన్వరేఖాంచితభ్రూ- ఇందు భ్రువులయందు ధన్వరేఖ సంభవింప నందున ధన్వరేఖవంటి రేఖ యని సదృశధర్మాక్షేపము చేత పదార్థవృత్తినిదర్శన అంగము. 'మనస్సారంగ' అని పఠించుపక్షమున రూపకము అంగము.

తే. పదియు నెనిమిది విద్య లీ పద్మనయన (7-63)
శ్రవణముల రెంట నర్థ మర్థము గ్రహించె,
నంత రుత్కీర్ణ గంభీర హారి లేఖ
యది గదా వీనులందుఁ దొమ్మిదవ లెక్క? 184

ఈపద్మనయన, పదియు నెనిమిది విద్యలు =
('సమఙ్గా చతుర్వేదీ మీమాంసా న్యాయవిస్తరః
ఆయుర్వేదో ధనుర్వేదో గాన్ధర్వ మర్థశాసనమ్
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యష్టాదశ స్మృతాః'

అని చెప్పఁబడిన) పదునెనిమిదివిద్యలను, శ్రవణముల రెంటన్ = రెండు చెవులచేతను, అర్ధమర్థము = తొమ్మిది తొమ్మిదిగా (చెవికి తొమ్మిదిచొప్పున - 'భిత్తం శకలఖణ్డే వా పుంస్యర్థోఽర్ధం సమేంఽశకే' అమ.), గ్రహించెన్ = నేర్చెను, అది గదా, వీనులందు, అంత ... ఖ - అంతః = లోపల - ఉత్కీర్ణ = చెక్కఁబడిన - గంభీర=లోఁతయిన - హారి = మనోహరమైన - లేఖ = గీఱ యైన, తొమ్మిదవ లెక్క = నవసంఖ్య.

ఈబాల పదునెనిమిది విద్యలను రెండు చెవులతోను చెఱి తొమ్మిది గ్రహించినది. ఆవిషయము నే చెవులలో లోఁతైన గీఱగా చెక్కఁబడియున్న నవసంఖ్య తెలుపుచున్నది.—చెవులలోపలి సంస్థానము తొమ్మిదియంకెవలె నున్న దని భా.—ఉత్ప్రేక్షాలంకారము.

తే. అవటు శోభిత మాణవ కాభిరామ (7-66).
యంచి తోర్ధ్వక తాలింగ్య తాతిహృద్య
యద్భు తైక నిదాన శో భాస్పదంబు
కంబు బిబ్బోకవతి దీని కంఠలక్ష్మి. 185

కంబు బిబ్బోక వతి—కంబు=శంఖముయొక్క - బిబ్బోక వతి = విలాసముకల దైన ('బిబ్బోకోఽభిమతప్రాప్తా వపి గర్వా దనాదరః' అమ. - ఇష్టవస్తువు లభించినను గర్వముచే దానియందు ననాదరము బిబ్బోక మనఁబడును—ఇచట లక్షణచేత సౌందర్యమాత్ర మర్థముగాఁ గొనవలయును.), దీని కంఠ - లక్ష్మి (=శోభ), అవటు శోభిత=వటువుచేత (=మాణవకునిచేత) శోభించినట్టిదికాదు, (అయినను), మాణవక అభిరామ=మాణవకునిచేత(=వటువుచేత) మనోహరమైయున్నది- [అని విరోధము - అవటు = ముచ్చలిగుంటచేత ('అవటు ర్ఘాటా కృకాటికా' అమ.) ... మాణవక = ఇరువది సరముల ముత్తెపుఁజేరుచేత ... అని విరోధపరిహారము - 'మాణవకో హారభేదే బాలే కుపురుషే వటౌ' మేది.- చిన్నది గావున మాణవక మని పేర్కొనుట - 'వింశతిసరో మాణవకోఽల్పత్వాత్' అని క్షీరస్వామివ్యాఖ్య - కొందఱు 'అర్ధహారో మాణవకః' అను నమర వచనమువలన మాణవక మనఁగా అర్ధహార మనుపేరి హారవిశేష మని వివరింతురు;] అం ... ద్య—అంచిత =శ్రేష్ఠ మయిన - ఊర్ధ్వకతా - ఊర్ధ్వక మనెడి వాద్యభేదముయొక్క భావము చేతను - ఆలింగ్యతా = ఆలింగ్య మనెడి వాద్యభేదముయొక్క భావముచేతను - అతిహృద్య = మిక్కిలిమనోహారిణి యైనట్టిది [యవాకార మగుమధ్యము గల మృదంగము ఊర్ధ్వక మనఁబడును, గోపుచ్ఛాకార మృదంగము ఆలింగ్య మనఁబడును:—

'మృదఙ్గా మురజా భేదా స్త్వఙ్క్యాలిఙ్గ్యోర్ధ్వకా స్త్రయః' అమ.
'హరీతక్యాకృతి స్త్వఙ్క్యో యవమధ్య స్తు ఊర్ధ్వకః,
ఆలిఙ్గ్య శ్చైవ గోపుచ్ఛో మధ్య దక్షిణ వామ గాః.' రామాశ్రమ్యుద్ధృతము.

ఊర్ధ్వకాలింగ్యములు విసదృశాకారము లగుటచేత కంఠలక్ష్మి కారెండు నగుట విరోధము; తత్పరిహార మెట్లన - అంచిత = ఒప్పిదమయిన - ఊర్ధ్వకతా=దేహముయొక్క పైభాగము కల దగుటచేత - అతి హృద్య = మిక్కిలి మనోహారిణి - అని పరిహారము], అద్భు...బు - అద్భుత = ఆశ్చర్యములకు - ఏక=ముఖ్య మయిన ('ఏకే ముఖ్యాన్య కేవలాః' అమ.) - నిదాన=మూలకారణ మయిన 'నిదానం త్వాదికారణమ్' అమ. - శోభా = కాంతికి ('శోభా కాన్తి ర్ద్యుతి శ్ఛవిః' అమ.)—ఆస్పదంబు = స్థానము.

పూర్వార్ధమున విరోధాభాసములు స్పష్టములు. కంబుబిబ్బోకవతి - పదార్థవృత్తినిదర్శన.

క. కవితా గాన క్రియవా (7-67)
గ్ర్యావరణ సీమా విభాగ విధి రేఖలు నా
ధవళాక్షి కంఠసీమం
బ్రవిమల రేఖాత్రయంబు ప్రస్ఫుట మయ్యెన్. 186

ధవళ అక్షి కంఠ సీమకు = తెల్లని నేత్రములు కల దైన యాదమయంతియొక్క కంఠప్రదేశమందు, ప్రవిమల రేఖా త్రయంబు = కడు శుభ్రమైన మూఁడురేఖలు, కవి...నా -

కవితా = కవిత్వము - గాన = పాట - ప్రియ వాక్ = ప్రియ మైన మాట - అను నీ మూఁటి యొక్క - వివరణ = ప్రకాశనమునకు - సీమా = హద్దుల - విభాగ = పంపకముయొక్క - విధి = బ్రహ్మయొక్క - రేఖలు = గీఁతలో- నాఙ్=అనునట్లు (ఆ పంపకముకై బ్రహ్మ గీచిన గీఁతలో యనునట్లుగా), ప్రస్ఫుట మయ్యెఙ్ = స్పష్టముగా నున్నవి.— ఉత్ప్రేక్షాలంకారము.

క. కాంతా బాహు ద్వంద్వా (7-68)
త్యంత పరాజయ సమాశ్రిత తాంభో దుర్గా
భ్యంతరము లైన బిసముల
కంత ర్నిర్వ్యథన కలన మది యెట్లొక్కొ ? 187

కాంతా... ములు = దమయంతియొక్క రెండు బాహువులవలన అతిమాత్ర మయిన యోటమిచేత (అది కారణంబుగా) ఆశ్రయింపఁబడిన జలదుర్గముయొక్క యంతరాళము కలవి (కాంతబాహువులకు బొత్తిగా ఓడి నీటిదుర్గములో దాఁగి యున్నట్టివి), ఐన - బిసములకుఙ్ = తామరతూండ్లకు, అంతః నిర్వ్యథన కలనము=మనస్సులో (లోపల అనియు) దుఃఖింపమి కలిమి (అని విరోధము-ఛిద్రముల కలిమి-'ఛిద్రం నిర్వ్యథనం రోకం రన్ధ్రం శ్వభ్రం వపా సుషిః' అమ. అని తత్పరిహారము.)

క. తరుణి యతి లలిత పర్వ (7-70)
స్మర పంచశరీ సమాన మహనీయ నఖాం
కుర మృదు లాంగుళి విలస
త్కరపంకజ యుగళి దీనిఁ దరమె నుతింపఙ్ ? 188

తరుణి = (ఈ) యువతి, అతి...ళి—అతి లలిత = అత్యంత సుందర మయిన - పర్వ = కనుపులు గలవియు ('గ్రన్థి ర్నా పర్వ పరుషీ' అమ.) - (అందుచేతనే) - స్మర = మన్మథుని యొక్క - పంచశరీ = ఐదేసి బాణముల మొత్తములకు - సమాన=తుల్యములును - మహనీయ= మిన్న లయిన - నఖ అంకుర = గోటి మొలకలు - మొలకగోరులు (గోరులవంటి కొనలు అనఁగా అలుఁగులు) కలవియు - నైన - మృదుల=కోమలము లయిన - అంగుళి = వ్రేళ్లచేత - విలసత్= ప్రకాశించుచున్న - కర పంకజ = కేలు దామరల - యుగళి = జంటకలది [రెండుచేతులందును ఐదేసి మదనబాణములవలె అయిదేసి వ్రేళ్లు ఉన్నవి, బాణములకుం బోలె వ్రేళ్లకును అంద మయిన కనుపు లున్నవి, బాణములకు అలుఁగులుంబోలె వ్రేళ్లకు మొలకగోరు లున్నవి, కావున రెండు చేతులును మదనుని అంపపొదుల జంటవలె నున్నవి], (అట్టి యీతరుణిని), నుతింపఙ్ = పొగడుటకు, తరమె = శక్యమా - శక్యము కా దనుట.— ఉపమాలంకారము.

తే. జలరుహానన దోర్వల్లి గెలువఁబోలుఁ (7-69)
గెలిమైని మృణాళికా కిసలయములఁ ;
గాక యివి యేల మిన్న కీకరణి మునుఁగు,
కీర్తి యను పేరి బహుళ దుష్కీర్తియందు. 189

జలరుహ ఆనన దోస్ లీల = కమలవదన(యైన యీయబల) యొక్క బాహువులయొక్క ('భుజబాహూ ప్రవేష్టో దోః' అమ.) విలాసము ('లీలా విలాస క్రియయోః' అమ. మృదుత్వ మనుట), మృణాళికా కిసలయములన్ = తామరతూఁటి మోసులను, కేలిమైన్ = ఆటగా - అనాయాసముగా ననుట, గెలువఁ బోలున్ = గెలిచినది గావలయును; కాక = అట్లు గాదేని - గెలువ లే దేని, ఇవి = ఈతామరతూఁటిమోసులు, మిన్నక = ఊరక, ఈకరణిన్=ఈవిధముగా, కీర్తి యనుపేరి బహుళ దుష్కీర్తియందున్ = బురద యనెడి విస్తీర్ణాపకీర్తియందు - ['కీర్తిః ప్రసాద యశసో ర్విస్తారే కర్దమేఽపి చ' హేమ. పైకి సిగ్గులేక కీర్తి యని చెప్పుకొనుటయే గాని వాస్తవముగా అపకీర్తియే యనుటయు - బురదలో ఉండియు 'బురదలో నున్నా'మనుటకే 'కీర్తిలో నున్నా'మనుచు, యశస్సులో నున్నా మను శ్లేషమాత్రమునకే సంతోషించుచు ననియు], ఏల మునుఁగున్ = గెలువఁబడినందుననే మునుఁగుచున్నవనుట.— ఉత్ప్రేక్షాలంకారము; దానికి కపట రూపక మంగము.

సీ. గంధవారణ కుంభ గౌరవ స్ఫురణంబు (7-78)
　　కనక కుంభములకుఁ గల్గెనేని, (7-75)
లికుచ కోమల కాంతి లీలావిశేషంబు
　　చక్రవాకములందు జరిగెనేని, (7-77)
మాలూర సౌభాగ్య మహిమానుభావంబు (7-79)
　　దాడిమీ ఫలములఁ దగిలెనేని,
నవక లోన్మీలిత ప్రసవ గుచ్ఛ చ్ఛాయ
　　యబ్జకోరకముల కబ్బెనేని, (7-77)
తే. గాని, సరిసేయఁ గారాదు వానిఁ దార (7-76)
　　హార నిర్ఝర సలిల ధారావధౌత
　　కాంచనాచల శృంగ భాగంబు లగుచు
　　రాజితము లైన దీని వక్షోజములకు. 190

గంధ ... నేని = మదపు టేనుఁగు కుంభ(స్థల)ముల గొప్పతనముయొక్క ('గురు స్త్రిలిఙ్గ్యాం మహతి దుర్జరాలఘునో రపి' మేది.) స్ఫూర్తి బంగారు గిండులకు అలవడిన యెడల;

లికు... నేని = గజనిమ్మపండ్లయొక్క ('లకుచో లికుచో డహుః' అమ.) మృదుల మయిన ('కోమలం మృదులే జలే' మేది.) ప్రభా విలాసాతిశయము జక్కవలకు కలిగినయెడల;

మాలూ ... నేని = మారేడుఁబండ్లయొక్క సౌందర్యముతోడి గొప్పతనముయొక్క ప్రభావము ('అనుభావః ప్రభావే చ సతాం చ మతినిశ్చయే' అమ.) దానిమ్మపండ్లకు అబ్బినయెడల;

నవక ... నేని = అతి కొఱఁతగా వికసించిన పూగుత్తుల('స్యా ద్గుచ్ఛక స్తు స్తబకః' అమ.) కాంతి తామరమొగ్గలకు దొరకినయెడలను;

కాక = (ఉపమింపవచ్చునే గాని - అటు) గానిచో, వానిని = సీసపాదోత్తరార్ధమునం జెప్పినవానిని, తార ... మన్ = శుద్ధము లయిన ముత్తెముల పేరనెడి ('తారో ముక్తాది

సంశుద్ధా తరణే శుద్ధమౌ క్తికే' విశ్వ. 'హారో ముక్తావళీ' అమ.) సెలయేటియొక్క ('శైల సాను స్రవ ద్వారిప్రవాహో నిర్ఝరో ఝరః' భావప్రకాశము.) నీటి పాటుచేత చక్కఁగా కడుఁగఁబడిన బంగారు కొండయొక్క శిఖర ప్రదేశములుగా, రాజితములు=ప్రకాశమానములు, అయిన - దీని - వక్షోజములకుఁ = పాలిండ్లకు, సరిసేయఁగా రాదు = ఉపమింపఁ గూడదు.

ఇచట కనకకుంభాదుల బహువచనములకు ఔచిత్యముచేత ద్విత్వమే యభిప్రాయము. సీస పాదములందు ఉత్తరార్ధోక్తములకు పెక్కుగుణంబులును ఒక్కొక్కటే కొఱఁతయు, కావున అది తీఱినచో వానికి ఉపమేయత ఘటిల్లును; పూర్వార్ధోక్తములకు పెక్కుకొఱంతలును ఒకటే గుణంబును కావున వానికి ఉపమేయత ఘటిల్లదు. కనకకుంభములు చేతి కబ్బునవి శక్యాలింగనం బులును వలసినవన్నె గలవియు. లికుచములకు పరిమాణము చాలదు; జక్కవకవ జంటగా నుండును, పరిమాణము చాలును, వన్నె కలదు, కాని కోమలము గాదు, ఎఱకలచే గఱుకు గల్గియున్నది. దానివర్ణము పీతము; పీతగణమందు

'పీతాని బ్రహ్మజీ వేద్ధ్రి గరు డేశ్వరదృగ్ఘటాః ...

కర్ణికారం చక్రవాక రాలకా శారికాముఖమ్.' కవికల్పలత.

దాడిమములు చేతి కబ్బును, చూచుకతుల్యాగ్రములు కలవి, వన్నెయుం గలవి, పై ప్రాలునట్లుం డునవి, కోమలశాఖా గతములు, అయినను వలుఁదతనము చాలదు; కాశికు త్తరప్రదేశములయందు మారేడుఁబండ్లు తాటిపండ్లయంత లేసిగా నుండును, ఒకటియే ఒకపూఁటయాహారమునకు చాలు ననియు యాత్రికులు చెప్పుదురు. అబ్జకోరకములు పసరువన్నె, ఆకృతి సమము, కోమలత కలదు, 'ప్రియఙ్గుపుష్పే పీతత్వం సరోజముకుళాదిషు హరితత్వమ్' అని కవికల్పలత. 'సకలోన్మిత' మయినచో మ్లానత్వము ఆరంభించును. 'నిర్ఝర' - పైనుండిపడుదానియందు ధాళధళ్య ముండును. 'ధౌత' - దుమారము లేనిది, మాపు లేనిది.—'ధారావతార' పా.

ఉపమ కలుగ దనుట ప్రతీప భేదము. గీతమందలి పెద్దసమాసమున రూపకము ప్రతీపాంగము.

తే. నలువ సన్నంబుగా దీని నడుము గీసి

యౌవనమునకు నిచ్చె నాయంశ మెల్ల; (7-82)

నది యుపాదానముగఁ గదా యిది సృజించె

నున్నతము లైన యేతత్పయోధరములఁ. 191

...సన్నంబు కాఁ = సన్నపడునట్లుగా,... ఆ యంశము = గీఁచి తీసిన యాభాగమును, అది = ఆభాగము, ఉపాదానముగఁ = ఉపాదానకారణముగా (ప్రకృతిగా - కుండలములకు బంగారము ప్రకృతి, కుండకు మన్ను ప్రకృతి - ఈవిధముగా),...ఇది = యౌవనము, ఉన్నతము లైన = నిక్కు లైన - ఏతత్ పయోధరములఁ = ఈ సెలఁత పాలిండ్లను, సృజించెఁ.

బ్రహ్మ దీనినడుమునుండి బహుభాగము తీసి యౌవనమున కిచ్చినాఁడు. ఆభాగముతో యౌవనము దీని నిక్కుఁజన్నులను సృజించినది.—ఉత్ప్రేక్షలు.

'గీఁచి' అనుటచే యౌవనము రానప్పుడు నడుము సూక్ష్మముగా నుండ లే దని భా. 'యౌవ నమున' కనుట 'యౌవనము రాఁగానే నడుము సన్నగిల్లినది గావున. 'అది యుపాదానము'-అక్కడ పోయి ఇక్కడ కనఁబడుటచేత. 'ఇది' - యౌవనము సృజించె ననుట తద్భాగమునకును పొందు

లేక, అనంతరము కలుగుటచేత. 'ఉన్నతములు' - క్రింద చోటు చాలమిచే పైని ఎత్తుగా ఉన్నవిగా కట్టెననుట.

' అనయో రనవద్యాఙ్గి స్తనయో ర్జృమ్భమాణయో      ను.
రవకాశో న పర్యాప్త స్తవ బాహులతాన్తరే.'      ఆ.

అను వర్ణనం బరికించునది; వక్షంబు నిండి పైకి నిక్కిన వనుట. నలువ తానే చేయరాఁగా, యౌవనముచేత చేయింపనేల యనిన, నలువసృష్టికి మెఱుఁగెక్కించునది యౌవనము గావున.

చ. అరయ ననంగ రాజ్య విభ వాభ్యుదయంబు ప్రకార మిట్ల పో; (7-81)
కర మస దైన యా సుదతికౌను వళిత్రితయంబుచే నిరం
తర మయి యాక్రమింపఁబడె; దానికిఁ దోడొకపొత్తునం బయో
ధరములు రాయుచున్న యవి దర్ప విజృంభణ లీల యేర్పడన్. 192

అరయఁగన్ = పరికింపఁగా, అనం...ము - (అనంగ =) మన్మథునియొక్క ('కన్దర్పో దర్పకోఽనఙ్గః కామః పఞ్చశరః స్మరః' అమ. - (అంగములు లేనట్టి అనియు - స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలములు రాజ్యమునకు సప్తాంగములు - అవి చక్కఁగా ఏర్పడనట్టి యనుట-ఇట నఞ్ఞునకు అల్పత్వ మర్థము:—

' తత్సాదృశ్య మభావ శ్చ తదన్యత్వం తదల్పతా
అప్రశస్తి ర్విరోధ శ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః')

దొరతనముయొక్క వైశ్వర్యముయొక్క ('విభవో ద్రైమో త్వైశ్వర్యే' మేది.) పెంపుయొక్క రీతి, ఇట్ల పో = వక్ష్యమాణమే సుమా; (ఏ దనఁగా), కరము = మిక్కిలి, అసదు = సన్ననిది (దుర్బల మనుట), ఐన - ఆ-సుదతి కౌను = సుందరి నడుము, వళి త్రితయంబుచేన్ = ముత్తఱుల చేత (బవల కభేదము - ముగ్గురు బలవంతులచేత అనియు), నిరంతరము అయి = ప్రకటముగా ('అన్తర మవకా శావధి పరిధా నాన్తర్ధి భేద తాదర్థ్యే' అమ.), ఆక్రమింపఁబడెన్ = పట్టుకొనఁబడెను; దానికిన్ తోడు = ఇది చాలక-ఆవళిత్రయమునకు సాయముగా, పయోధరములు= స్తనములు, (ఆబల్లిదులకు పైవారు గూడ), ఒక పొత్తునన్ = ఏకత్వ మొందిన చెలిమితో (రెండు నొకటియై), దర్ప విజృంభణ లీల = గర్వముచేత ఉప్పొంగుట యనెడి వ్యాపారము, ఏర్పడన్ = ప్రకట మగునట్లుగా, రాయుచున్న యవి = రాపాడుచున్న వి.

చామకు యౌవనము వచ్చి మదనోదయము కాఁగా, కౌను సన్నగిల్లినది, వళిత్రయ మేర్పడినది, స్తనములు విజృంభించినవి — అని సారాంశము.

అంగబలము లేని రాజ్యములో సాధువులను బలవంతులు బాధింతురు, పైవారితో చెప్పుకొందమన్న వారు గూడ ఆబలవంతులపక్షమే అవలంబించి యాసాధులకే ఒత్తడిం గలిగింతురు. అనంగుఁడు ఈచామయందు రాజ్య మేలుటకు దొరంకొనఁగా, కౌనును వళు లాక్రమించుటయు, పైపైన కుచములు కూడ కౌనునకే ఒత్తడిచేయుటయు పైని జెప్పఁబడిన కుత్సితరాజ్య వృత్తాంతము వలెనే యున్నది.

'త్రితయంబు' - ఒక యసదుమీఁదికి ముగ్గురు బల్లిదులు అని యథర్మాతిశయము. 'నిరంతరము' - 'వళులే కనఁబడుచున్నవి గాని కౌను గనఁబడుట లే దని భా. 'రాయుచున్న యవి'— ఒత్తడి చేయుట — కౌను కుచభారమును మోవఁజాల దని వర్ణించుట కవి సమ్మతము: — 'మధ్యః

కిం కుచయోర్ధ్రుత్యై బద్ధః కనకదామభిః.' పద్యమందు అంగవిహీనరాజక దేశగత ప్రబల జన పీడిత దుర్బలసాధువ్యవహారము విశేషణబలమున కానునందు స్ఫురించుటచేత సమాసోక్త్యలంకారము.

తే. ప్రబల వక్షోజ హేమ కుంభములు సూచి, (7-84)
లలిత రోమావళీ రజ్జు లతికఁ జూచి,
నాభి కూపంబుఁ జూచి నానయన యుగము
తృష్ణ వహియించుచున్నది దీనియందు. 193

నా-నయన యుగము = కన్నుఁగవ, దీనియందుఁ = ఈకన్యయందు, ప్రబ...లు= వలుఁద కుచము లనెడి బంగారు కుండలను, చూచి, లలి...కఁ = సుందర మయిన నూఁగారనెడి త్రాటి తీఁగను (తీఁగవంటి త్రాఁటిని - చేఁత్రాటి ననుట), చూచి, నాభి కూపంబుఁ = పొక్కిలి యనెడి బావిని, చూచి, తృష్ణఁ = (దీనిని పొందుటకు) కోరికను (దప్పి ననియు- 'తృష్ణా స్యాత్తర్ష లిప్సయోః' మేది.), వహియించుచున్నది = తాల్చుచున్నది.

తృష్ణాశబ్దగతశ్లేషానుప్రాణిత మయిన రూపకాలంకారము; నయనములయందు పిపాసత్వాంథత్వసమారోపము తోఁచుచున్నందున ఏకదేశవివర్తి.

తే. నాభి యుత్పాటి తాలాన నవ్యబిలము, (7-85)
రోమవల్లరి శృంఖలాదామకంబు,
కామ మదవారణమున కీకంబుకంఠి
వలుద చనుదోయి గురు వప్ర వాస్తు భూమి. 194

కామ మద వారణమునకుఁ = మన్మథుఁ డనెడి మదపు టేనుఁగునకు, ఈ కంబు కంఠి= శంఖమువంటి కంఠము కలదైన యీబోటియొక్క, నాభి = పొక్కిలి, ఉత్పా...ము - (ఉత్పాటిత =) పెకలింపఁబడిన (ఆలాన =) కట్టుకంబముయొక్క ('ఆలానం బన్ధన స్తమ్భే' అమ.) నూతన మైన ('ప్రత్యగ్రోఽభినవో నవ్యో నవీనో నూతనో నవః, నూత్నశ్చ' అమ.) గోయి, రోమ వల్లరి = నూఁగారు, శృంఖలా దామకంబు = ఇనుప సంకెల త్రాడు ('శృఙ్ఖలా పుంస్కటీ కాఞ్చ్యాం లోహరజ్జౌ చ బన్ధనే' హేమ.), వలుద చను దోయి = నిండు చనుఁగవ, గురు ...మి- గురు = గొప్ప - వప్ర = మట్టిదిబ్బ లయిన ('స్యాచ్చయో వప్ర మస్త్రియామ్' అమ. మత్తగజమునకు నిద్రలో పొరలుటకు ఇరుప్రక్కలను మట్టిదిబ్బలం జేయుదురు) - అట్టి దయిన - వాస్తు భూమి = వసతి స్థానము ('వేశ్మభూ ర్వాస్తు రస్త్రియామ్' అమ.)

కాముఁడు దమయంతీ దేహమందు అత్యంత మదోద్ధతుఁడై చెలరేఁగి యున్నాఁ డనుట. ఈదేహము ద్రష్టలకు అత్యంతమదనోద్దీపకముగా నున్న దనుట. 'నవ్య' అనుటచే ఈయౌవనము నూతన మనియు నాభికి ఈలోఁతు ఇప్పుడే ఏర్పడిన దనియు భా. —రూపకాలంకారము.

తే. ప్రతిఫలించు ప్రవేణికా భార రచిత (7-88)
మల్లికలు రాజతాక్షర మాలికలుగ,
శంబరారాతి విజయ శాసన సువర్ణ
పట్టికయుఁ బోలె నొప్పు ని ప్పణఁతివీఁపు. 195

ఇప్పణంతి = (ఈయింతియొక్క) - వీఁపు, ప్రతి ... లు = (తనయందు) ప్రతిబింబించుచున్న వేనలి మొత్తమునందు కైసేయఁబడిన మల్లెలు, రాజత అక్షర మాలికలు కాఁగా = వెండితోఁ జేయఁబడిన వర్ణముల పంక్తులుగా నొప్పుచుండఁగా, శంబ ... లేఖ = మన్మథునియొక్క ('శమ్బరారి ర్మనసిజః' అమ.) గెలుపు వ్రాఁత కలదైన ('శాసనం రాజదత్తోర్వ్యాం లేఖాజ్ఞా శాస్త్ర శాస్తిషు' మేది.) బంగారు తగడు అనునట్లుగా, ఒప్పుక = ప్రకాశించుచున్నది.

వీఁపునందు మల్లికలు ప్రతిబింబించు నేని వేనలియుం బ్రతిబింబించును; వేనలిప్రతిబింబము నల్లగా నుండును; కావున పద్యార్థము:— ప్రతిఫలిత వేణీ తద్గత మల్లికారచనం బై ఈ తరుణి వీఁపు బంగారు పలకలో నడుమ తాపించిన యింద్రనీలంపు రేకులో వెండి యక్షరములతో వ్రాసిన మదన విజయ శాసన పట్టిక యో యన నొప్పుచున్నది. 'ప్రతిఫలించుట' మెఱుఁగుపెట్టినది అగుటచే. 'భార' - కేశ బాహుళ్య వర్ణనయు ప్రశస్తిని సంపూర్ణముగా వ్రాయుటకు చాలునంత చోటు కొఱకును. 'రచిత'-వ్రాఁతపంక్తుల సౌష్ఠవముకొఱకు. 'మల్లికలు' - అందమైన వ్రాఁతం గని అక్షరములు ముత్తెములవలె నున్నవి, మల్లెమొగ్గలవలె నున్నవి, అని కొనియాడుదురు. 'రాజత' - ఐశ్వర్యముచేతను స్ఫుటముగా కనఁబడుటకొఱకును. 'మాలికలు' - పంక్తు లనుట. 'శంబరారాతివిజయ శాసన'- శిలాస్తంభాదులయందుఁ జెక్కిన రాజజయశాసనములం గని లోకులు తదాజ్ఞానువర్తు లగునట్లు ఈవీఁపుం గాంచిన పురుషులు ఈమెకై మదనునికి దాసు లగుదు రనుట.— ఉత్ప్రేక్షాలంకారము - పూర్వార్ధమందలి రూపకముచేత ననుప్రాణితము.

క. తనజనకుఁడు శౌరి సుద (7-89)
ర్శన చక్రమునను జయించె జగ మని, మరుఁ డీ
వనిత యదర్శన కటి తట
ఘన చక్రంబున జయింపఁగాఁ దలఁచెఁ జుమీ. 196

జగము = లోకమును, తన - జనకుఁడు = తండ్రి యగు - శౌరి = విష్ణువు ('దేవకీనన్దనః శౌరిః శ్రీపతిః పురుషోత్తమః' అమ.), సుదర్శన = సుదర్శన మనుపేరి (చక్కఁగా కంటికి కగపడెడి అనియు) చక్రమునన్ = చక్రాయుధముతో ('శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రం సుదర్శనమ్' అమ.), జయించె నని = గెలిచినాఁ డను హేతువుచేత, మరుఁడు= మన్మథుఁడు, (తాను జగమును), ఈ...నన్ = ఈతరుణియొక్క దుర్లభ దర్శన మైన (కంటికి కగపడని దైన) నితంబబింబ మనెడి గొప్ప చక్రాయుధముతో, జయింపఁగాన్, తలఁచెఁ జుమీ = సంకల్పించినాఁడు సుమా.

భక్తులకు శోభన మయినదర్శన మిచ్చువాఁ డగుటచే సుదర్శనుఁ డైన తనతండ్రి శ్రీనారాయణుఁడు సుదర్శన మయిన చక్రాయుధముతో లోకులను జయించి రక్షించుచున్నాఁ డను హేతువుచేత, మన్మథుఁడు తాను అదర్శనుఁడు (కనఁబడనివాఁడు) అగుటచేత అదర్శన మైన దమయంతీ నితంబచక్రముతో లోకులను జయించి సత్కుటుంబులం జేసి రక్షింపఁ దలఁచియున్నాఁడు సుమా.

హేతూత్ప్రేక్ష, వ్యతిరేకరూపకములచే ననుప్రాణిత.

కటిశబ్దముచే గ్రామ్యతాదోషము(కావ్యప్రకాశము-7 ఉ. చూ.) వినను కవులు సరకుసేయక 'తట'శబ్దఘటితముగా ప్రయోగింతురు. 'ఘన' - తండ్రిచక్రముకన్న ఈయనచక్రము పెద్ద దని భా. 'అదర్శన ఘన' - తుపాకికడుపున ఫిరంగి పుట్టిన దన్నట్లు తండ్రిని మించిన కుమారుఁడు అనుట.

దమయంతీనితంబము సుదర్శనచక్రముకన్న గొప్పదియు అంతకన్న జయప్రదము నని భా. సర్వలోక మోహకముగా నున్న దనుట.

శా. ఏదే నొక్కమనోహరాంగకముచే నీయిందుబింబాస్య హే (7-91)
లాదర్పంబునఁ బిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెం జుమీ;
లేదే నన్య మహీజ పత్త్రిములు వోలెం గాక యేలా భయ
ప్రాదుర్భావమునం జలించు నది నిర్వాత ప్రదేశంబునన్? 197

అంగకము = చిన్నయంగము (అల్పార్థమందు కప్రత్యయము). హేలా దర్పంబునన్ = తిరస్కారముతోఁ గూడుకొన్న (లేక - విలాసముతోడి - 'హేలా స్త్రియా మవజ్ఞాయాం విలాసే వరయోషితామ్' మేది.) యహంకారముచేత ('దర్పః కస్తూర్యా మప్యహంకృతౌ' మేది.), పిప్పల చ్ఛదమున్ = రావి దళమును ('బోధిద్రుమ శ్చలదళః పిప్పలః కుఞ్జరాశనః। అశ్వత్థే,' 'పత్త్రం పలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్' అమ.)...తలంచెన్ జుమీ-అని ఉత్ప్రేక్ష. మహీజ = వృక్ష. ప్రాదుర్భావమునన్ = పొడముటచేత. అది = పిప్పల చ్ఛదము. నిర్వాత = గాలి లేని. పిప్పలచ్ఛద సామ్యము సౌఖ్యసౌభాగ్యలక్షణము:—

'యోని ర్భవతి వై యస్యా బోధిద్రుమదళాకృతిః
సాఽన్యలక్షణహీనాఽపి సౌఖ్యసౌభాగ్య మృచ్ఛతి.'
'అశ్వత్థదళసంకాశం గుహ్యం గూఢమణిప్రభం
యస్యాః సా సుభగా నారీ పుణ్యై రేవ మవాప్యతే.'

తే. చిగురుఁబోఁణి భూరివల్లరి చిత్రరేఖ; (7-92)
యింతి నాస తిలోత్తమ; యింత నిజము;
చెలువ యూరు కాండ ద్వయీ సృష్టి రంభ,
మానినీ మణి మధురోక్తి మంజుఘోష. 198

...భూరి వల్లరి = బొమతీఁగ, చిత్రరేఖ = కుంభాండసుతయు ఉషాసఖియు - అసురకన్యయయ్యును అచ్చర యని పురాణములందు వ్యవహరింపఁబడియున్నది-

'బాణస్య మ న్త్రీ కుమ్భాణ్డ శ్చిత్రలేఖా చ తత్సుతా
స ఖ్యప్సృచ్ఛ త్సఖీ మూషాం కౌతూహలసమన్వితా.' శ్రీభాగ.
'ఉవాచ రుదతీం చైవ కుమ్భాణ్డతనయా సఖీమ్
అప్సరా శ్చిత్రలేఖా వై క్షిప్రం విజ్ఞాప్యతాం సఖి.' హరివంశము.

విక్రమోర్వశీయమందు ఉర్వశీసఖియు చిత్రలేఖయే. రంభా తిలోత్తమా మంజుఘోష లను నచ్చరలు 3 ఆ. 36 లో వచ్చియున్నారు.

బొమతీఁగ ఒకయచ్చర యగుట విరోధము - చిత్ర మయి రచన కలది యనునర్థముచే తత్పరిహారము;...నాస = ముక్కు, తిలోత్తమ = తిలపుష్పముకన్న ఉత్కృష్ట మైనది (అని అప్సరస్త్వ విరోధ పరిహారము);...ఊరు కాండ ద్వయీ సృష్టి = దండములవంటి తొడల జంట యొక్క నిర్మాణము - ('కృదభిహితో భావో ద్రవ్యవ త్ప్రకాశతే' అను న్యాయముచే) నిర్మిత

మయిన యూరుదండద్వయి యని యర్థము ('కాణ్డోఽస్త్రీ దణ్డ బాణార్వ వర్గావసర వారిషు' అమ.), రంభ=రంభ యను నచ్చర (అని విరోధము - అరఁటిబోదె యని తత్పరిహారము - 'రంభా కదళ్యప్సరసోః' మేది.); మా... క్తి = (చిత్తసమున్నతిమంతురాండ్రలో నుత్తమ రైన) యీచెలువయొక్క తియ్యని పలుకు, మంజుఘోష=ఆపేరియచ్చర (అని విరోధము - ఇంపయిన నాదము గలది అనునర్థముచేత తత్పరిహారము - 'మనోజ్ఞం మఞ్జు మఞ్జులమ్' అమ.)

విరోధాభాసాలంకార చతుష్టయము స్పష్టము. నలువురం జెప్పుటచే అందఱు అచ్చరలకు ఈమె ఒక్కతెయే సమానురా లనుట; అప్సరోధికసుందరి యని భా.

తే. ఊరు కాండ ద్వయమున నీ యుత్పలాక్షి (7-95)
సమద వారణ రాజ హస్తంబు గెలిచె;
నదియె కారణముగఁ గదా యధికలజ్జఁ
బొంది ముడిఁగించు నది యాస్యపుష్కరంబు. 199

ఈ - ఉత్పల అక్షి = కలువకంటి, ఊరు...నన్ = దండములవంటి రెండుతొడలచేతను, స...బున్ = మదముతోఁ గూడుకొన్న యేనుఁగుయొక్క తొండమును ('కుఞ్జరో వారణః కరీ' అమ. 'హస్తః కరే కరికరే సప్రకోష్ఠకరేఽపి చ । ఋక్షే కేశాత్పరో వ్రాతే' మేది.), గెలిచెన్; అదియె కారణముగన్ కదా = ఆ కారణముచేతనే గదా, అది = ఆతొండము, అధిక లజ్జన్=మెండయిన సిగ్గును ('మన్దాక్షం హ్రీ త్రపా వ్రీడా లజ్జా' అమ.) పొంది, ఆస్య పుష్కరంబున్=తన ముఖ మగు చివరను

- ('పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాణ్డముఖే జలే
వ్యోమ్ని ఖడ్గే ఫలే పద్మే తీర్థౌషధివిశేషయోః' అమ.

ఏనుఁగుతొండముచివరకు పుష్కర మని పేరు - తన ముఖకమలము ననియు), ముడిఁగించున్ = ముడుఁగఁజేసికొనును.

దమయంతితొడలు ఏనుఁగుతుండములవంటి వని సారము.— పూర్వార్ధమున క్రియోత్ప్రేక్ష, ఉత్తరార్ధమున హేతూత్ప్రేక్ష.

'సమద' 'రాజ' అనుట హస్తమందు పుష్టి పరిణాహాది గుణోత్కర్షార్థము. 'అధిక'-తాను 'రాజ'హస్త మయ్యు ఓడినందులకు 'లజ్జ.' కరాదు లగు నూర్ధ్వకాయావయవములచేతఁ గాక 'ఊరు' కాలిచేత ఓడుట 'అధిక'లజ్జ. 'ముడిఁగించున్' - పరాజయావమానిత దుఃఖితులు మోముముడుం చుకొని యుండుట ప్రసిద్ధము.

తే. వనిత నానార దాహ్లాది వదనకమల, (7-96)
నీలకుంతల కుచశైల శీలి భృగువు;
చామ శ్రీ మహాభారత సర్గ యోగ్య
కారణ వ్యాస కలి తోరు గౌర మహిమ. 200

వనిత=(ఈ) చెలువ, నానా...ల = నారదమునిని ఆహ్లాదింపఁ జేయునది నారదాహ్లాది - అట్టిది కానిది అనారదాహ్లాది - అదియును గానిది నానారదాహ్లాది - నారదుని తప్పక ఆహ్లాదింపఁ

జేయునది పెక్కు (దెఱంగు లైన) ('నానాఽనేకోభయార్థయోః' అమ.) దంతములచేత ('రదనా దశనా దన్తా రదాః' అమ.) ఆహ్లాదింపఁజేసెడిది (ఐన) ముఖ తామరసము కలది; నీల కుంతల = నల్లని తలవెండ్రుకలు గలది (అగు నీహాలఁతి - 'చికురః కున్తలో వాలః కచః కేశః శిరోరుహః' అమ.), కుచ...వు - చనుఁగొండల నాశ్రయించు భృగుమహామునిఁ కలది (చఱియ కలది - 'భృగుః సానౌ జమదగ్నౌ ప్రపాతయోః। శుక్రే రుద్రే చ' హేమ.); చామ = (ఈ) చెలఁతి, శ్రీ...మ= శోభాయుక్తమైన మహాభారత రచనకు ('సర్గః స్వభావ నిర్మోక్ష నిశ్చయాధ్యాయ సృష్టిషు' అమ.) తగిన కారణమైన (మహాభారతమును రచించిన యనుట) వ్యాసమహామునితో [సొంపుగల-అత్యంత కాంతితోడి ('సుషః ప్రభా రుగ్రుచి స్త్విడ్భా' అమ.) సురత సృష్టికి అర్హ కారణ మయిన విరివితో ('వ్యాసో నా వి స్తృతౌ మునౌ' మేది.) కూడుకొన్న (ఊరు=) తొడలయొక్క పసిమి యైన పెంపు గలది. - మునులే ఈసుందరిని మోహించి యున్నారు ఇతరులమాట చెప్పవలయునా అని భా.

నారదభృగువ్యాసులు కామపీడితు లై ఈచామయొక్క ముఖ కుచోరువుల నాశ్రయించి యున్నా రని మూఁడు విరోధములు, శ్లేషచే తత్పరిహారములు, కావున విరోధాభాసములు.

'నానా' — చిన్నవి పెద్దవి సన్ననివి లావులు అను భేదములు గల; నఞ్వ్యయము దృఢ నిశ్చయార్థకము. 'భృగు'—ప్రపాతములం జెప్పుటచే పృథుత్వాది గుణము లూహ్యములు. 'వ్యాస'— విరివి (పరిణాహము) ఊరువులందు ముఖ్య మయిన సులక్షణము:—

'నాగేన్ద్రహస్తా స్త్వచి కర్కశత్వా దేకాన్తశైత్యా త్కదళీవిశేషాః
లబ్ధ్వాఽపి లోకే పరిణాహి రూపం జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః. కుమార.

చ. సుదతి మనంబునం దలఁచి చూడఁ, జతుర్దశియా నరుంధతీ (7-98)
మదనపురంధ్రి దైత్యరిపు మానవతీ నవమాతృకా జన
త్రిదశవరేణ్య భామలకు దివ్య మహా మహిమానుభావ సం
పద; నటు గాక గుల్ఫపరిపాటి కదృశ్యత సంఘటిల్లునే? 201

సుద...డఁ=మనంబునం దలఁచి చూడఁగా ఈసుదతి, దివ్య...దఁ=దివియందలి దైన (ఉత్కృష్టమైన యనియు— 'దివ్యం లవఙ్గే ధాత్ర్యాం స్త్రీ వల్గా దివిభవే త్రిషు' మేది.) తేజో ఽతిశయమునొక్క ('మహ ఉత్సవ తేజసోః' మేది.) ప్రభావముయొక్క ('అనుభావః ప్రభావే స్యా న్నిశ్చయే భావబోధకే' మేది.) గుణోత్కర్షమందు (సంప ద్భూతౌ గుణోత్కర్షే హారభేదేఽపి చ స్త్రియామ్' మేది.), అరుంధ...కుఁ - అరుంధతీ = వసిష్ఠభార్య - మదన పురంధ్రి=మన్మథుని యిల్లా లగు రతి - దైత్య రిపు మానవతీ = లక్ష్మి — నవ మాతృకా జన = బ్రహ్మణ్యాదులు) తొమ్మండుగురు అంబికలు [అగమమందు వారి పరిగణనము ఇట్లున్నది-

'బ్రహ్మణీ చైవ మాహేశీ కౌమారీ వైష్ణవీ తథా
వారాహీ నారసింహీ చ మాహేన్ద్రీ చణ్డికా తథా
మహాలక్ష్మి రితి ప్రోక్తాః క్రమే ణైతా నవామ్బికాః.']-

త్రిదశ వరేణ్య భామలకుఁ = శచీ దేవి - అను వీపదుమువ్వురకును, చతుర్దశి = పదునాలవది (వారితో సమానురాలు - లేక - వారితరగతిలో చేరినట్టిది), ఔఁ = కావలయును. అటు కాక = అట్లు కాదేని, గుల్ఫ పరిపాటికిఁ = చీలమండలయొక్క వరుసకు('ఆనుపూర్వీ స్త్రియాం

వాప్య త్పరిపాటీ అనుక్రమః । పర్యాయ శ్చ' అమ. యుగళమునకు),అదృశ్యత=కంటికి కగపడమి, సంఘటిల్లునే = కలుగునా.

గుల్ఫములు గూఢము లై యుండుట స్త్రీలకు సులక్షణ మని సాముద్రికులు. ఎట్లు అరుంధత్యాదులు అదృశ్యగుల్భ లగుటం బట్టి సులక్షణ లై యున్నారో అట్లే దమయంతియు వారికి సమ యగుటంబట్టి గూఢగుల్ఫతచేత సులక్షణ యై యున్న దని యర్థము. లేక - ఈమెయు వారిలో చేరినదే గావున వారికిం గలయదృశ్యసిద్ధి ఈమెయందు గుల్భములకు కలిగినది అని యర్థము.— మఱియు చతుర్దశీతిథి సాధకులకు గుటికాదులచే అదృశ్యత్వసిద్ధి నొసంగు నని యాగమము; కావున ఈమె యనెడి చతుర్దశియందు గుల్ఫద్వయ మను సాధకునికి అదృశ్యత్వసిద్ధి కలిగిన దనియు గమ్యము. గూఢగుల్ఫ, అరుంధత్యాది సౌందర్యాదిగుణ మహిత, యని భా. ఉత్ప్రేక్ష.

సీ. పల్లవంబులు దీని పద కాంతి లవము లై (7-99)
పల్లవ శబ్ద లాభంబుఁ బొందె,
పవడంబుమీఁది కోపముననో యీకాంత
పాదంబు లత్యంత పాటలములు,
శుద్ధ పార్ష్ణులు గానఁ జూ దీనియంఘ్రులు (7-102)
గరి యూథ పతి యాన గరిమ గెలిచెఁ,
దోయజభ్రాంతినో యీయింతి యడుగుల (7-101)
నలువొప్పఁ బాయకు న్నయది లక్ష్మి,
తే. తరుణి పదములయది యలక్తక రసంబొ? (7-100)
కాక త్రైలోక్య భామా నికాయ మౌళి
భాగ విన్యాస సంలగ్న బహుళ నూత్న
చారు సీమంత సీమ సిందూర రజమొ? 202

పల్లవంబులు = చిగుళ్లు, దీ ... లు = ఈతరుణియొక్క చరణముల కాంతియొక్క లేశములు ('స్త్రియాం మాత్రా త్రుటీ పుంసి లవ లేశ కణాణవః' అమ.), ఐ, ప ... బుక్ = 'పల్లవ' అనెడి నామమునొక్క ప్రాప్తిని, ఒందెక్; ['పత్' - అనఁగా చరణము 'ప దఙ్ఘ్రిశ్చరణోఽ స్త్రియామ్' అమ.-పదః = చరణముయొక్క - లక్షణచే - చరణకాంతియొక్క - లవములు = లేశములు అని కవి యన్వ్యార్థమును కల్పించినాఁడు; పదములు చిగుళ్లకన్న కోమలారుణతరము లనుట, ఇట్లు నూతన యోగముచే నామములకు నన్వ్యార్థకల్పన నిరుక్త్యలంకారము:—

'యోగముచే నామములకు । బాగుగ నన్వ్యార్థ క్లప్తి పరఁగు నిరుక్తిక్;
ఈగతి వేఁపుదు వీవు వి । యోగుల దోషాకరాఖ్య యొప్పదె నీకుక్?' అలం.

పవడంబు = పగడము ... కోపముననో (కోప మెఱుపు; కోపమేల యన - కాంతిహీనమును కీటకృత రంధ్రాదిదోష జుష్టమును అయ్యును అది తమతో సాటి నపేక్షించినందులకు.) అత్యంత పాటలములు = మిక్కిలి యెఱ్ఱనివి. పగడముకన్న నెఱ్ఱని వనుట.— హేతూత్ప్రేక్ష.

దీని - యంఘ్రులు=చరణములు, శుద్ధ పార్ష్ణులు గానక్ చూ=ఎట్టి దోషములుగాని లేని మడమలు-గలవి యగుటచేతను జూమా [వశీకృతు లయిన పశ్చాద్భాగ శత్రువులు గలవి యగుట

చేత - శుద్ధ = నిర్భయమైన - పార్ష్ణిః = సేన వెనుకభాగము కలవి - 'పార్ష్ణిః స్యా దుస్మద స్త్రియాం । స్త్రియాం ద్వయోః సైన్యపృష్ఠే పాదగ్రన్థ్యధరేఽపి చ' మేది. - దిగ్విజయమునకుం దరలు రాజునకు వెనుక దిక్కున నుండు రాజు పేరు పార్ష్ణిగ్రాహకుఁడు; జిగీషువు ముందుగా ఆరాజును వశీకరించుకొనక ఇతరులమీఁదికి తరలెనేని ఆతఁడు వెనుకఁ జేరి కొట్టును, ముందుండు వాఁడు ఎదుటం గొట్టును; ఇరువుర నడుమ పడినవాఁడు అపజయముం బొందును], యాన గరి మన్ = నడక సొంపుచేత (దండెత్తి పోవుటయొక్క- మహిమచేత - 'గురు స్త్రీలిఙ్గ్యాం మహతి దుర్జ రాలఘునో రపి' మేది.), కరి యూథ పతిన్ = పరికానిని [సజాతీయ పశుసమూహము యూథ మనఁబడును - *కరియూథ మన ఏనుఁగులమంద - దానికి నాయక మయిన యేనుఁగు యూథపతి- అదియే తెనుఁగున పరికాఁడు - 'యూథం తిర్యక్సమూహే స్త్రీ పుష్పభేదే చ యోషితి.' మేది. 'ఇభః స్తమ్బేరమః పద్మీ యూథనాథ స్తు యూథపః' అమ. - (ఏనుఁగుదండు గలవాఁ డయిన రాజును అనియు], గెలిచెన్; శుద్ధపార్ష్ణి లగుట మంచినడకకు కారణము, పరికానినడక కరిమాత్రపునడకకన్న నందము, దమయంతినడక పరికానినడకకన్న నంద మని భా.—ఇచట విశేషణము లందలి శ్లేషచేత ప్రస్తుతాంఘ్రిలయందు అప్రస్తుత జిగీషు వృత్తాంతస్ఫూర్తి సమాసోక్తి.

లక్ష్మి = సిరి (శోభ), ఈ యింతి యడుగులను, తోయజ భ్రాంతిన్ =(అవి) కమలము లనెడి భ్రమచేతనేమో, పాయక = ఎప్పుడును విడువక, నలువు ఒప్పన్ = సొంపారునట్లుగా, ఉన్నయది ('లక్ష్మీః పద్మాలయా' అమ.)—లక్ష్మికి పద్మము నివాసము, భ్రమ సామ్యముచేత. అడుగులు పద్మశోభాన్వితము లని భా.—హేతూత్ప్రేక్ష.

తరుణి పదముల యది = ఈయువతి యడుగుల యెఱుపు, అలక్తక రసంబొ = లత్తుక ద్రవమొ ('లాక్షా రాక్షా జతు క్లీబే యావోఽలక్తో ద్రుమామయః' అమ.), కాక = లత్తుకద్రవము కాదేని, త్రైలో... మొ = మూఁడు లోకముల సుందరీ సమూహములయొక్క- ('నికాయ స్తు పుమాన్ లక్ష్యే సధర్మి ప్రాణి సంహతౌ' మేది.) చూడా ప్రదేశములమీఁద ('పాళిః కిరీటే ధమ్మిల్లే చూడాయా మనపుంసకమ్' మేది.) ఉంచుటచేత అంటుకొన్నదియు మిక్కుటమును క్రొత్తదియు సుందరమును ఐన పాపట సిందూరంపు ధూళియో (వారికన్న ఉత్కృష్టురా లనుటకు 'వారి తలపై కాలిడినది' అని వాక్రుత్తురు గాన ఆ వ్యవహారముంబట్టి యిట్లు వర్ణించుట.)- ఈమె త్రైలోక్యసుందరీమణులకన్న సుందరి, ఈమెపాదములు అత్యంతారుణములు, అని భా.—

సందేహాలంకారము.— పూర్వముద్రణమున - 'జూడ దీనంఘ్రిలు'- ఈప్రయోగమున

'ననయమ్ము వానిఁ గన్న నయమ్ము గల యింతి ననయమ్ము దాల్చు వానన్నఁ జెనకి.'

'వానన్న' (=వానియన్న) అను నీ నరసభూపాలీయప్రయోగమువంటి దుష్టసంధి. 'లలన...త్తుక'- యతిభంగము. 'కాక త్రైలోక్య ధామాభిరామ' - యతిభంగము.

తే. శిశిర కాలంబునందు నిశ్శేష మైన (7-104)
జలజ సస్యంబు సృజియింప వలచి బ్రహ్మ
యాచరింపఁడె యీకాంత యాస్య హ స్త
పాద సౌభాగ్యములయందుఁ బంచభిక్ష. 203

బ్రహ్మ = సలువ, శిశిర కాలంబునందుఁ=మంచు సమయమునందు - లేక - శిశిర ర్తువునందు ("శిశిరో నా హిమే న స్త్రీ ఋతుభేదే జడే త్రిషు"), నిశ్శేషము = మిగులు లేనిది (వి త్తనమున కైనను మిగులకుండ నశించినట్టిది), ఐన - జలజ సస్యంబు = తామర పైరును, సృజియింపఁ = (మరల) పుట్టించుటకు, వలచి = కోరి, ఈకాంత(యొక్క) - ఆస్య ... దుఁ= ముఖము చేతులు అడుగులు అనువానియొక్క శోభలయందు, పంచ భిక్షుఁ = (బ్రహ్మచారికి నియత మైన) యైదే యిండ్లయందలి మధుకర వృత్తిని, ఆచరింపఁడె = చేయఁడా - చేయు ననుట.—

మంచుకాలములో పద్మములు నశించినంతట బ్రహ్మదేవుఁడు ఈకాంతయొక్క ముఖ కర పాదములనుండి సౌభాగ్య పంచభిక్షను గ్రహించి దానితో మరల పద్మములను పైరుపెట్టును (వానిని మరల సృజించును.)—ఏతదాస్యకరపదములు పద్మశోభావంతము లని భా.

క. వినుత యశః పాదాంగు। ష్ఠ నఖాస్యము లనెడి పూర్ణ చంద్ర చతుష్కం
బును ధరియించుట నెకొ యీ। వనిత చతుష్షష్టి కళల వాసన కెక్కెఁ.

ఈ వనిత, విను ... లు - వినుత = కొనియాడఁబడిన - యశః = కీర్తి - పాద అంగుష్ఠ నఖ = అడుగుల బొట్టనవ్రేళ్ల గోళ్లు - ఆస్యములు = ముఖమును, అనెడి - పూర్ణ చంద్ర చతుష్కంబుఁ = నిండు చందురుల చతుష్టయమును (నలువురను పూర్ణచంద్రుల ననుట), ధరియించుట నొకొ=తాల్చుటచేత (కలిగి యుండుటచేత) నేమో, చతుష్షష్టికళలఁ = (శిల్పాదు లగు) నలువదినాలుగువిద్యలచేత (చంద్రునియొక్క పదునారవభాగమునకు కళ యని పేరు గాన, నలుగురు చంద్రులకును గల యఱువదినాలుగు కళలచేత ననియు), వాసనకుఁ ఎక్కెఁ=ప్రసిద్ధిని పొందెను.- శ్లేషానుప్రాణిత మైన యుత్ప్రేక్ష. (7-107) 204

చ. అని చికురాదియుం బదనఖాంతముగాఁ జిగురాకుఁబోఁడి నె (7-109)
మ్మనమున సంస్తుతించి, యసమాన విలాస కళా వినిర్జి తా
తనుఁ దను నవ్వధూమణికిఁ దత్సమయంబునఁ జూప వేఁడి, యొ
య్యన దిగఁ దాఁచె భూపతి దిశాధిప కల్పిత మైన శాంబరిఁ. 205

భూపతి = నలుఁడు, చికుర ఆదియుఁ= తలవెండ్రుకలు మొదలుగా(ఁ గలదిగా)ను, పద నఖ అంతముగాఁ = అడుగుల గోరులు తుదిగా(ఁ గలదిగా)ను, చిగురాకుఁబోఁడిఁ,...అస...నుఁ = సాటి లేని రూప రేఖలచేత జయింపఁబడిన (అతనుఁ =) మన్మథుఁడు కలవానిని (...మన్మథుని జయించినవానిని), తనుఁ = తన్ను, ... వేఁడి = కోరినవాఁడై, దిశా...రిఁ=దిక్పాలకులచేత సృజింపఁబడిన (తన కియ్యఁబడిన) మాయను (తిరస్కరిణీవిద్యను), ఒయ్యనఁ = తిన్నఁగా, దిగఁ తాఁచెఁ = తొలఁగించుకొనెను (అగపడుటకు సంకల్పింపఁగానే అగపడె ననుట.)

—* ఆశ్వాసాంతము. *—

ఉ. భానుసమాన, మానగుణబంధుర, బంధు రమా నిదాన, దా
నానుకృతాంబువాహ ధన దాంబుదవాహన కామధేను సం
తానక కర్ణ, కర్ణసుఖదాయి వచో రచనా ధురీణ, రీ
ణానత రాజ, రాజ మకుటాంఘ్రి సరోరుహ భావి తాత్మ, కా. 206

ఇఁకను కృతిపతిసంబోధనలు - ఉత్తరాశ్వాసాదియందలి 'అవధరింపుము' అను క్రియతో యుష్మచ్ఛబ్దాధ్యాహారపూర్వకముగా నన్వయము.—

భాను సమాన = సూర్యునితో సదృశుఁడా, మాన గుణ బంధుర = చిత్తౌన్నత్య మనెడి గుణముచే మనోహరుఁడా ('బన్ధుర బన్ధురా రమ్యే నమ్రే' విశ్వ.), బంధు రమా నిదాన=బంధువుల సిరికి మూలకారణమా ('నిదానం త్వాదికారణమ్' అమ.) దా...ర్ణ = దానముచేత పోలఁబడిన (అంబువాహ =) మేఘము (ధనద =) కుబేరుఁడు (అంబుదవాహన =) జీమూతవాహనుఁడు (గరుడునికి ఆహారముగా తనదేహ మర్పించి అతనివలననుండి ఒకపామును రక్షించిన విద్యాధర చక్రవర్తి) కామధేనువు కల్పవృక్షము కర్ణుఁడు (సహజకవచకుండలములను సయితము ఒలిచి అర్థి కిచ్చినవాఁడు) అనువారు కలవాఁడా (వారిని పోలిన దానశీలుఁడా), క...ణ = చెవులకు ఆనంద మును ఒసంగెడు మాటల సంభాషణమందు నేర్పరీ, రీణ అనత రాజ = కాఁతీపోయిన (నాశము పొందిన యనుట - 'స్యన్నం రీణం స్రుతం స్రుతే' అమ.) వంగని రాజులు కలవాఁడా (వంగనిరాజు లను రూపు మాపినవాఁడా యనుట), రాజ...కా=చంద్రశేఖరుని పాద కమలములయందు ఉంపఁ బడిన చిత్తము కలవాఁడా ('రాజా ప్రభౌ చ నృపతౌ క్షత్త్రియే రజనీపతౌ', 'మకుటం కిరీటం పున్నపుంసకమ్' అమ.)—ఇందు ముక్తపదగ్రస్త మనెడి శబ్దాలంకారము శోభిల్లుచున్నది; ముగిసిన పదమును వెంబడిగా వెండియుం గ్రహించుట తత్స్వరూపము.

క. కమలభవ వంశ పావన, । విమలాంతఃకరణ, బాహు విక్రమ కేళీ
యమళార్జున మదభంజన, । సమరార్జున, నిరభిసంధి సౌజన్య నిధీ. 207

కమ...వన=బ్రహ్మ (బ్రాహ్మణ,) వంశమును పవిత్రము చేయువాఁడా, విమల అంతఃకరణ= నిర్దోష మయిన చిత్తము కలవాఁడా, బాహు ... న=భుజ శౌర్య క్రీడయందు జంట మద్దుల య హంకారమును భంగించిన శ్రీకృష్ణుఁడా [నలకూబర మణిగ్రీవులు కుబేరపుత్త్రులు గర్వించి నారదశాప ముచే గోకులములో జంటమద్దులుగా జనించిరి. యశోదాదేవిచే ఱోటికి కట్టఁబడిన శ్రీబాలకృష్ణుఁ డు వానినడుమ ప్రాఁకుకొని పోయి వానికిం దగులుకొన్న ఱోటిని త్రాటితో నీడ్వఁగా ఆచెట్లు పెకలి కూలి శాపవిమోచనముం బొందినకథను శ్రీభాగవతమందుం బఠింపనగు. 'మద'-'విక్రమ'-

'పురా నారదశాపేన వృక్షతాం ప్రాపితౌ మదాత్
నలకూబరమణి గ్రీవా వి త్యాఖ్యాతౌ శ్రియాఽన్వితౌ.'

'బాలేన నిష్కర్ష యతాఽన్వ గులూఖలం త ద్దామోదరేణతర సోత్కలితాఙ్ఘ్రిబన్ధౌ
నిష్పేతతుః పరమ విక్రమి తాతివేప స్కన్ధ ప్రవాళ విటపౌ కృతచణ్డశబ్దౌ.' శ్రీభాగ.],

సమర అర్జున = యుద్ధమందు క్రీడీ (విజయీ యనుట), నిరభిసంధి సౌజన్యనిధీ = వ్యాజము లేని (సహజ మైన యనుట) సుజనత్వమునకు నిక్షేప మయినవాఁడా.—'బాహు...నిధీ'-రూపకములు.

స్రగ్విణి.

తల్లమాంబా సుతా, ధైర్య హేమాచలా,
పల్లవాదిత్య సౌభాగ్య భాగ్యోదయా,
పల్లవాక్షీ కుచ ప్రాంత భాగ ద్వయీ
గల్లపాళీ లస త్కామ ముద్రాంకురా. 208

తల్లమాంబా సుతా = తల్లమ్మగారి కుమారుఁడా, ధైర్య ... లా = ధీరతయందు మేరువా, పల్ల...యా = పల్లవాదిత్యు లనెడి రాజులయొక్క యైశ్వర్యమునకు అదృష్టప్రాదుర్భావమా (ఐశ్వర్యకారకుఁడా యనుట), పల్ల ... రా = చిగురువంటి మోవిగల పడంతులయొక్క చనుల పార్శ్వముల జంటయందును చెక్కిళ్లయందును చెవి తమ్మెలయందును-

'పాళిః కర్ణలతాగ్రే చ ప్రదేశాఙ్క్రిపఙ్క్తిషు

త్సరుచ్ఛదే చ యూకాయాం సంజాతశ్మశ్రుయోషితి.' నానా.

పాళిశబ్దమునకు పాళీ అని రూపాంతరము — 'కృదికారా దక్తినః'.) ప్రకాశించుచున్న (నఖక్షత రూప) మదన చిహ్నముల మొలకలు కలవాఁడా-

'నఖాఘాతః ప్రదాతవ్యో యథాస్థానాని కర్మసు,

పార్శ్వయోః స్తనయో శ్చైవ ఊరా చైవ నితమ్బకే

కక్షస్థలే చ కర్ణాన్తే కపోలే బాహుమూలకే.'

అను కామశాస్త్ర వచనముచేత పద్యోక్త కుచాద్యవయవములు నఖాస్పదము లని యెఱుంగ నగును. పల్లవాధరల కుచ కపోల కర్ణాంతములందు నఖక్షతములు చేసిన సుదతీమదనా యని భా.

'తల్లమాంబా' - తల్ల + అమ్మ + అంబా-అని శబ్దనిష్పత్తి; అంబ యన నమ్మయే గావున ఇట్టి ప్రయోగములు పునరుక్తిదూషితము లని కొందఱ యభిప్రాయము. పెద్దనాది మహాకవులును ఇట్టి ప్రయోగములు చేసియున్నారు - 'నాగమాంబికవలన నందనులఁ గాంచె.' మను. కాన వీనికి గతి నరయుట యుచితము. నామాంతావయవ మయిన యమ్మశబ్దమునకు పూజ్యవాచకత్వము వివక్షాధీన మగుటచే, త దవివక్షాపక్షమందు పూజార్థము అంబాశబ్దము అనుప్రయుక్త మయినందున పౌనరుక్త్యదోషము లే దనుట యొప్పును.—మఱి యిచట కవి తల్లమ్మను పేర్కొన నేల యనిన ఆమెకు బహుకాల స్వర్గవాస లబ్ధికై యని యెఱుంగవలయును.

'క్షితి నెవ్వనినామము స । త్కృతి నెన్నిదినంబు లుండు దివి నాపుణ్య

వ్రతుఁ డంతకాల ముండును । ధృతి నింద్రద్యుమ్ను నునికి దృష్టాంతముగాఁ.' అప్ప.

'గల్ల' శబ్దము గ్రామ్యతాదోషావహ మని ఆలంకారికు లాక్షేపింతురు. ధైర్య ... యా - రూపకములు.—స్రగ్విణీ వృత్తము - 'స్రగ్విణిక్ రారరల్ శైలవిశ్రాంతియుఙ్' ప్రక్రియా ఛందస్సు.

గద్యము.

ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర

సకల విద్యాసనాథ శ్రీనాథప్రణీతం బైన

శృంగారనైషధకావ్యంబునందుఁ

దృతీయాశ్వాసము.

శ్రీ

# శృంగారనైషధము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీమచ్చరణాంభోరుహ
చామీకర కటక ఘటిత సమ దారాతి
స్తోమ, దయా రఘురామ, ర
మా మందిర లస దపాంగ, మామిడిసింగా. 1

శ్రీ ... మ = శోభావంత మయిన పాద కమలమందలి బంగారపుఁ బెండేరమందు కూర్పఁబడిన మదయుక్తు లయిన శత్రుల సమూహము కలవాఁడా (శత్రువుల రూపములను రత్నములందు చెక్కించి గండపెండేరమందు పొదిగించుకొన్నాఁ డని భా.), ద ... మ = దయయందు రఘురామునివంటివాఁడా, రమా ... గ = లక్ష్మికి ఇల్లయిన ప్రకాశమాన కటాక్షము కలవాఁడా (ఎవరియందు ఆతని కరుణాకటాక్షము కలుగునో వారి దారిద్ర్యము అంతటితో తీఱు ననుట.), మామిడిసింగమంత్రీ అవధరింపుము అని యుత్తరపదముతో నన్వయము.

### —* నలదూత్యము. *—

వ. (a) అవధరింపు. మివ్విధంబున విబుధమాయాంధకారంబు దూరంబగుటయుం, గట్టెదుర నా జగజెట్టి జవనిక వాయం దట్టినం బొడనూపు బహురూపు తెలింగున, జలధర తిరోధానంబు వాసినం బ్రకాశించు నా హిమధాముని పగిది, నవిద్యావరణంబు విరిసినం దోఁచు పరమాత్ముని ప్రకారంబున, దోహద పలాల జాలంబు ప్రీలినం బ్రేక్షణీయం బగు పుండ్రేక్షుకాండంబు భంగిఁ (8-2), (b) బర మాద్భుతాస్త నిమేష ముద్రుండును నిర్నిద్రరోమ ప్రరోహుండును నిశ్చలాంగుండును వైశాఖ స్థాన కలితుండును నిర్వికారుండును నై, భీమభూపాల పుత్త్రికకు నేత్రవిషయీభావంబు భజియించె (7-109). నప్పు డప్పుడమిఱేనిం గనుంగొని సంభ్రమంబును భయంబును లజ్జయు మనంబునం బెనంగొనంగ నంగనా జనులు సమయ సముత్థాన ఝుళఝుళాయమాన మణి తులాకోటి వాచాటీభవత్సభాభవ నాళిందంబుగా నందఱుం బ్రత్యుత్థానంబు సేసిరి (8-7). (c) ధీరోదాత్త

గావున నయ్యాదిగర్భేశ్వరి సమున్నత కనకాసనంబున ము న్నున్న యునికిన యుండి యనిర్వచనీయం బైన యానందంబు డెందంబున ననుభవించుచు (8-15) 'నెవ్వండ? వెందుండి యేతెంచి? తెట్లు వచ్చితి?' వని యడుగనుండి, మరలఁ, జంద్రుండో, యుపేంద్రుండో, కంతుండో, జయంతుండో, యని సందియం బందుచు, మొదల హంసంబు సరస బిసినీ పలాశంబు మీఁదఁ జరణ న ఖాగ్రం బున లిఖియించి చూపినం జూచిన చిత్రరూపంబుతో రూపంబు సంవదించుటం జేసి యీతండు నిషధరా జని యెఱింగియు, శుద్ధాంత సదన ప్రవేశంబు దుర్ల భంబు గావున మిగుల విశ్వసింపక, నిమేష నిస్స్పృహంబు లైన విలోచనంబు ల సాద్భుతంబును సకౌతుకంబును సానురాగంబునుం గా విలోకించుచు. 2

(*a*) విబుధ మాయా అంధకారంబు=సురల('త్రిదశా విబుధాః సురాః'అమ.) శాంబరి(అదృశ్యకరణి) యనెడి చీఁకటి, ...అగుటయుఁ=కాఁగా, జగజెట్టి = జగమున కంతయు జెట్టి యయిన - అనఁగా - లోకైకవీరుఁ డయిన-యానలమహారాజు (జగము అని దంత్యాది - జగచ్ఛబ్దభవము - వృత్తియందు ముపర్ణలోపము) - జవనిక = (నాటకమందు) తెరను (దంత్యాది - యవనికాశబ్దభవము), పాయఁ దట్టినఁ = తొలఁగఁ ద్రోయఁగా, ... బహురూపు తెఱంగునఁ = నటుని చందంబున (పెక్కురూపములు అనఁగా వేసములు గలవాఁడు గాన నటుఁడు బహురూపుఁడు). ... జల ... బు = మేఘముయొక్క చాటు ('అపిధాన తిరోధాన పిధా నాచ్ఛాదనాని చ' అమ.), ...హిమధాముని పగిదిఁ = చలివెలుఁగు వలె, అవిద్యా ఆవరణంబు = అజ్ఞానముయొక్క ('అవిద్యాఽహమ్మతిః స్త్రియామ్' అమ.) మూఁత, విరిసినఁ=తొలఁగి పోఁగా, తోఁచు పరమాత్మని ప్రకారంబునఁ = ప్రత్యక్ష మగునట్టి పరబ్రహ్మము కైవడిని, దో...బు-దోహద= ఎరువు (గత్తము) అగునట్టి

('తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యా త్తు తత్క్రియా.')-

పలాల = గింజలేని వరిగడ్డి లోనగు వానియొక్క ('స్తమ్బో గుచ్ఛ స్తృణాదినః । నాడీ నాళం చ కాణ్డోఽస్య పలాలోఽస్త్రీ స నిష్ఫలః' అమ.) - జాలంబు = సమూహము, వ్రీలినఁ=సందు ఇయ్యఁగా, ప్రేక్షణీయంబు = దృశ్యము (అగపడునది), అగు - పుండ్రేక్షు కాండంబు భంగిఁ= ఎఱ్ఱచెఱకుఁ గఱ్ఱవలె ('రసాల ఇక్షు స్తద్భేదాః పుణ్డ్రి కాన్తార కాదయః' అమ. 'కాణ్డోఽస్త్రీ దణ్డబాణార్వవ ర్గావసర వారిషు' అమ.) ['కట్టెదుర' మొదలు 'భంగి' వఱకు 'నేత్రవిషయీభావంబు భజియించె' ననుదానితోఁ గలసి యుపమాలంకారములు.]

(*b*) పర...డుఁ-పరమ=ఎక్కుడయిన - అద్భుత = (దమయంతీ సౌందర్యదర్శనముచేఁ గలిగిన) ఆశ్చర్యరసముచేత ('విస్మయోఽద్భుత మాశ్చర్యమ్' అమ.) - అస్త = నష్ట మయిన - నిమేష = ఱెప్పపా టనెడి - ముద్రుండుఁ = సంకోచనము కలవాఁడును (ఱెప్పపాటు లేని వాఁడు - ఱెప్ప వ్రేయక చూచుచున్నాఁ డనుట), నిర్నిద్ర రోమ ప్రరోహుండుఁ=లేచిన పులక ఫెంలకలు కలవాఁడును, ... వైశాఖ స్థాన కలితుండుఁ = వైశాఖ మనెడి నిలిచెడు తీరుతో

కూడుకొన్నవాఁడును [స్థాన మనఁగా నిలుచుటయందు పాదముల నుంచుకొను తీరు. ఇది అయిదు విధములు: వైశాఖము, మండలము, సమపదము, ఆలీఢము, ప్రత్యాలీఢము, అని. పాదముల నడుమ జేనెఁ డెడ ముండునట్లు నిలుచుట వైశాఖ మనఁబడును-

'స్థానాని ధన్వినాం పఞ్చ, తత్ర వైశాఖ మస్త్రియాం
వితస్త్యన్తరగౌ పాదౌ, మణ్డలం తోరణాకృతీ,
సమానౌ స్యా త్సమపద, మాలీఢం పద మగ్రతః
దక్షిణం వామ మాకుఞ్చ్య, ప్రత్యాలీఢం విపర్యయః.' యాదవుఁడు.]

నిర్వికారుండుక్ = దమయంతీ దర్శనాది కారణములచేత కామాది దోషములు చిత్తమందు ఉదయింపనివాఁడును, ... నేత్ర విషయీ భావంబు భజించెక్ = కన్నులకు గోచరుఁ డగుటను అవలంబించెను (కన్నులకుం గనఁబడెను.) ... సమయ... గాక్ = ఆకాలమందు లేచి నిలుచుటచేత ఝుళంఝుళ యని మొరయుచున్న రత్నాల యందెలచే ముఖర మగుచున్న కొలువుఁ గూటపుం బ్రదేశము కలుగునట్లుగా (కొలువుఁగూట మెల్లవారి యందెల శబ్దముచేతను మొరయు చున్న దనుట - అందెల రొద ననుకరించుటకు ఝుళంఝుళశబ్దము అందము: 'చటుల ఝుళంఝుళ రవ పద । కటక సమాకృష్ట కేళి కలహంసిక లై' మను. 'పాదాఙ్గదం తులాకోటిః' అమ. 'స్యా జ్జల్పాక స్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్' అమ. 'ప్రఘాణ ప్రఘ ణాళిన్దా బహిర్ద్వార ప్రకోష్ఠకే' అమ. 'గృహైకదేశ ఆళిన్దః ప్రఘాణః ప్రఘణ స్తథా' అమరదత్తుఁడు-'అళింద' 'ఆళింద' అని రూపద్వయము - ఇచట ఏకదేశము అర్థము ; లేక - దమయంతి కూర్చున్న తావునకు ముందటి బహిర్ద్వారమువైపు ఉన్నభాగము.) ప్రత్యుత్థానంబు = (వచ్చినవారికి) గౌరవముగా ఎదుట లేచి నిలుచుట.

(c) ధీరోదాత్త = సత్త్వ గాంభీర్యావికత్థన కృపా పరకీయగుణగ్రహణములు గలది -

[' గమ్భీరః సత్త్వ సమ్పన్నః కృపావా నవికత్థనః
పరకీయ గుణ గ్రాహీ ధీరోదాత్తో నిగద్యతే.' సా. ర.

సత్త్వ మన క్రోధాదులచేత వికారముం జెందమి, గాంభీర్యము - చెందినట్టి వికారమును బయల్పడ నీయమి, అవికత్థనము - తన్నుఁ దాఁ బొగడుకొనమి, ... ] ఆదిగర్భేశ్వరి = (ఆ + ఆదిగర్భ + ఈశ్వరి) ప్రథమగర్భమం దునికి యాదిగా ఐశ్వర్యవంతురాలు - (అనాదిగా ఐశ్వర్యవంతులకడు పుననే పుట్టుచు పుట్టినప్పటినుండి ఐశ్వర్యమే అనుభవించుచు ఉన్నట్టి దనుట-'ఈశ్వరో మన్మథే శమ్భౌ నాఽఢ్యే స్వామిని వాచ్యవత్' మేది. ఇట స్వామ్యర్థము గ్రహింపఁ దగును),... అనిర్వచనీయంబు = ఇట్టి దట్టి దని మాటలచేఁ జెప్ప నలవి గా నట్టిది, ... అడుగ నుండి = అడుగ నుంకించియు,...ఉపేంద్రుఁడు= ఇంద్రుని తమ్ముఁడు (గా రూపెత్తిన నారాయణుఁడు-'ఉపేన్ద్ర ఇన్ద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః' అమ. సౌందర్యమునకుఁ బ్రసిద్ధిఁ బొందినవారిలో నొకఁడు - మనుచరిత్ర 3 ఆ. 61 లో

'ఇందునిభాస్య వాఁ డనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో'

ఇత్యాదిపద్యమును చూచునది.) కంతుఁడు = మన్మథుఁడు, జయంతుఁడు = ఇంద్రపుత్త్రుఁడు ('జయన్తః పాకశాసనిః' అమ.), ['చంద్రుఁడో ... సందియం బందుచుక్' - సందేహకారణము సామ్యము గావున, సందేహాలంకారము.] హాసంబు = హాసు (కొంకల్పముగా ముల్లోతము), సరస

బిసినీ పలాశంబుమీఁదన్ = పచ్చి తామరాకుమీఁద (ఎండినచో రూపము వ్రాయుటకు గీఱ యేర్పడదు - తామరాకు నుపయోగించుట మెత్తనచేత గీఱ లేర్పడుం గావున - బిసినీపలాశం బనినం దామరాకు గాని పూరేకు గాదు - బిసిని యన తామరతీఁగ యొండె తామరకొల నొండె - 'నళి న్యాం తు బిసినీ పద్మినీముఖమ్' అమ.), చరణ నఖ అగ్రంబునన్ = కాలి గోటి కొనతో. సంవదించుటంజేసి = సరిపోవుటవలన, ... 'శుద్ధాంత సదన = అంతఃపురగృహ - ... విశ్వసింపక = నమ్మక, .. నిమేష నిఃస్పృహంబు లైన - ఱెప్పపాటునందు ఆస లేని ('ఇచ్ఛా కాఙ్క్షా స్పృహేహా తృ డ్వాఞ్ఛా లిప్సా మనోరథః' అమ.) - విలోచనంబులన్ = కన్నులతో (ఱెప్ప వ్రాల్పక యనుట - ఇందులకు వక్ష్యమాణములైన కౌతుకాదులు కారణములు), సకౌతుకంబున్ = కుతూహలముతో కూడ, ... విలోకించుచున్ = చూచుచు.

తే. అతివ మిథ్యావలోక నాభ్యాస కలన (8-18)
నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ
దాల్పదయ్యెను శాలీనతా భరంబు
'తథ్య మిథ్యా వివిక్తి ముగ్ధలకుఁ గలదె!' 3

అతివ = దమయంతి, రాజున్, (ఇపుడు), నిజముగాన్ = సాక్షాత్తుగా, చూచియున్, మిథ్యా అవలోకన అభ్యాస కలనన్ = అవాస్తవపు దర్శనముల యలవాటు కలిమిచేత (భ్రాంతి జాతుఁ డయిన నలుని చూచిచూచి యలవాటుపడియుండుటచేత ఇపుడు ఎదుట నున్న యాతఁడు అట్టి యవాస్తవుఁడే యని తలఁచి), నెమ్మనమునన్ = నిండుమనస్సులో, శాలీనతా భరంబున్ = కొంకుయొక్క (= బిడియముయొక్క) పెంపును, తాల్పదయ్యెన్ = వహింపదాయెను; (ఇందులకు సమాధాన మేమన -) ముగ్ధలకున్ = ముద్దరాండ్రకు 'ముగ్ధః సున్దర మూఢయోః - కామార్తల కనుట), తథ్య మిథ్యా వివిక్తి = వాస్త వావాస్తవములయొక్క భేదజ్ఞానము, కలదె = ఉండునా - ఉండ దనుట.

దమయంతి తనయెదుట నున్న వాస్తవ నలుని నిత్యముం దాఁ జూచుచుండిన భ్రాంతినలునిఁగానే తలంచి ఆతని ప్రోల బిడియముం జెందఁదాయెను; కామార్తలకు తథ్యమిథ్యా వివేకము ఉండదు గదా.—చతుర్థపాదమున సామాన్యంబును కడమపాదంబుల విశేషంబునుం జెప్పినందున అర్థాంతరన్యాసాలంకారము.

ఉ. కేవల సాధ్వసంబున సఖీజను లూరక యుండఁగా, మనో (8-19)
భావ పిధాన యత్న పరిపాటి ననాదర ముద్రచేఁ దిరో
భావము నొందఁ జేసి, ముఖ పద్మ మొకించుక వ్రాల్చి, పల్కె నా
నా విధ చిత్ర వాక్య రచనాచణ భీమతనూజ నేర్పునన్. 4

సఖీజనులు, కేవల - సాధ్వసంబునన్ = భయముచేత ('భీతి ర్భీ స్సా ధ్వసం భయమ్' అమ.), ఊరక = రాజునకు ఆతిథ్యము సలుపక కూర్చుండుఁ డనక పలుకరింపక, ఉండఁగాన్, మ...టిన్ = మనస్సులోని యభిప్రాయమును ('భావ స్సత్తా స్వభా వాభిప్రాయచేష్టాత్మ జన్మసు' అమ.) (పిధాన =) దాఁచుటయొకదలి ('అపిధాన తిరోధాన పిధా నాచ్ఛాదనాని చ' అమ.)

ప్రయత్నముయొక్క క్రమమును - అనాదర ముద్రచేన్ = సరకుగొనమియొక్క ప్రకారముచేత-తిరోభావమున్=చాటుదలను - ఒందఁ జేసి = పొందునట్లు కావించి (ప్రయత్నపూర్వకముగా మనోభావమును డాఁచి - ఆప్రయత్నమును అనాదరతానుభావములచేత కప్పిపుచ్చిన దై), ముఖపద్మము = పద్మమువంటి నెమ్మోమును, ఒకించుక=కొంచెముగా (శాలీనతచే కొంచెముగా వంచుట, అవమానాది కారణములచేత నైనచో అధికముగానే యుండును), వ్రాల్చి = వాంచి, నా...ణ=పలు దెఱంగుల చదురు మాటలను వాక్రుచ్చుటయందు జాణ యైన, భీమతనూజ = దమయంతి, నేర్పునన్ = కౌశలముతో, పల్కెన్ = నలునితో ని ట్లనియెను.

సీ. "ప్రణత మౌళి మణి ప్రభా నికాయంబుతోఁ
బానీయమున నర్ఘ్య పాద్య మీఁగి,
యత్యంత మధుర వాక్య ప్రపంచములతో (8-20)
శర్కరాదుల మధుపర్క మీఁగి,
ప్రవిమలం బైన సద్భావ వైభవముతోఁ (8-21)
బృథుల కాంచన రత్నపీఠ మీఁగి,
పరమ సేవా విధా విరచి తాంజలితోడఁ (8-22)
బ్రముదితం బగు మనః పద్మ మీఁగి,

తే. యాతిథేయుల కభిన వాయాతుఁ డైన
యతిథి తమయింటి కేతెంచు నపుడు సేయు
సత్క్రియాచార విధి కలా సరణి యంద్రు
ధర్మశా స్త్రోపనిష దర్థ ధర్మ విదులు. 5

అభినవ ఆయాతుఁడు = క్రొత్తగా వచ్చినవాఁడు - ఐన - అతిథి = విందు [విందు వచ్చిన వెంటనే అనుట, 'అతిథి' = అస్థితి - ఒకచో (స్థితి=) నిలుకడ లేనివాఁడు గావున అతిథి యని మనుస్మృతి. 'అత' ధాతువునకు సతతగతి యర్థము కావున (ఒకచో నిలువక) సతము తిరుగుచుండువాఁడు 'అతిథి' యని శాబ్దికులు వ్యుత్పాదింతురు. అతిథిలక్షణము: —

'యస్య న జ్ఞాయతే నామ న చ గోత్రం న చ స్థితిః
అకస్మా ద్గృహ మాయాతః సోఽతిథిః ప్రోచ్యతే బుధైః.']

తమ=ఆతిథేయుల - ఇంటికిన్, ఏతెంచునపుడు = వచ్చినపుడు;-

ప్రణ...తోన్ = నమస్కరించిన సిగయందలి రత్నముయొక్క కాంతి సమూహముతో (నమస్కార పూర్వకముగా), పానీయమునన్ = నీటితో, అర్ఘ్యపాద్యము - అర్ఘ్య = పూజార్థమయిన జలమును ('అర్ఘ్య మర్ఘార్థే పాద్యం పాదాయ వారిణి' అమ. 'అర్ఘార్థే జలే' అని రామాశ్రమి.) - పాద్యము=పాదప్రక్షాళనార్థ జలమును, ఈఁగి = (హస్త పాదములు కడుగుకొనుటకు) ఒసంగుట.

అత్యం...తోన్ = కడుం దియ్య నైన మాటల విస్తరముతోఁ గూడ (మధుర మయిన మాటలు పలుకుచు ననుట), శర్కరా ఆదులన్ = పంచదార లోనగువానితో (లోనగునవి ఏవన, పెరుఁగు నేయి నీరు తేనెయు-

'దధి సర్పి ర్జలం క్షౌద్రం సి తైతాభి స్తు పఞ్చభిః
ప్రోచ్యతే మధుపర్క స్తు సర్వదేవౌఘతుష్టయే.' కాళికాపు.),
మధుపర్కము (అనెడు పేయమును), ఈగి = (ఆరగించుటకై) ఇచ్చుట;

ప్రవి...తోన్ = మిక్కిలి పరిశుద్ధమయిన నమ్మకముయొక్క పెంపుతో (నిండు శ్రద్ధతో ననుట), పృథు...ము=గొప్ప బంగారపు రత్నాల పీటను (రత్నాలు చెక్కిన విశాలపు బంగారపుఁ బీటను), ఈగి = (కూర్చుండుటకై) ఇచ్చుట;

పర...డన్ = ఉత్తమ మయిన శుశ్రూషా ప్రకారముచేత కూర్పఁబడిన మోడ్పుఁ గేలితో (శుశ్రూషా విధానముగా చేతులు మోడ్చుకొని), ప్రముదితంబు = సంతోష యుక్త మయిన ('ముత్ ప్రీతిః ప్రమదో హర్ష ః' అమ. ప్రకృష్టా ముత్ = ప్రముత్ - సా అస్య సంజా తేతి ప్రముదితమ్), అగు మనః పద్మము = హృదయ కమలమును - ఈగి = (మనస్సును తదేక ప్రవణముగా అతిథియందు) ఉంచుట;

ఆతిథేయులకున్=అతిథులకు సాధువు లయినవారు (అతిథిపూజాపరాయణులు), చేయు = ఒనరించునట్టి - సత్క్రియా...రణి = సత్కారముయొక్క వాడుకయొక్క నెఱవేర్పుటయొక్క ప్రకారము (పూజించు వాడుకను నెఱవేర్చు విధము - శాస్త్రోక్త మయినట్టి యతిథిసత్కార ప్రకార మనుట- 'విధి ర్విధానే దైవేఽపి' అమ.

'కలా స్యా న్మూల రై వృద్ధౌ శిల్పాదా వంశమాత్రకే
షోడశాంశే చ చన్ద్రస్య కలనా కాలమానయోః.' మేది.)

అని, ధర్మ...లు = స్మృతులయొక్క రహ స్యాభిప్రాయ మయిన వేదవిధులను ఎఱుంగువారు ('ధర్మశాస్త్రం తు వై స్మృతిః' మను. 'ధర్మే రహ స్యుపనిషత్,' '(త్రయీ) ధర్మ స్తు తద్విధిః' అమ.), అంద్రు = వచింతురు.

ఇది యెల్ల సామాన్యము అప్రకృతంబును, ఇందువలన-నీకు ఈచెప్పినవిధమున సత్కారము నేను చేయవలసి యున్నది, అని విశేషము ప్రకృతాభిప్రాయము కావున అప్రస్తుత ప్రశంసాలంకారము. పెద్దపాదములందు పూర్వార్థోక్తములకు తత్తదుత్తరార్థోక్త (సత్కార) సాధనములతో సామ్యము స్ఫురించుచున్నది గావున ఉపమాలంకారధ్వని. మణిప్రభ నీళ్లవంటి దనుటకు- 'అన్తస్తోయం మణిమయభువః' అని మేఘ. 'సద్భావ' 'పృథుల...' రెంటను హాయిగా నుండ వచ్చును. ప్రవిమలత్వంబును బంగారపు మెఱుఁగుతో సాటికిబీజము. సరసంపుఁ బలుకులు చక్కెరవంటి వనుటకు-

'ధ్వన్యధ్వ న్యధికం చమత్కృతికృతో య స్యాద్భుతాః సూక్తయః
సారస్యేన సుధాం సుధాం విదధతే తాం శర్కరాం శర్కరామ్.' కమలిని.

అంజలి పద్మమువంటి దనుటకు-

'ఆయాన్త్యా పరిదుర్మనాయితమివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా
కాశీరాజ్యా దరవిన్ద కుట్మల నిభో ముగ్ధః ప్రణామాఞ్జలిః.' ఉ. రా. చ.

తే. అనఘ యిదె హేమ రత్న సింహాసనంబు; (8-23)
ఇచ్చ గలదేని గూర్చుండు మిందు వచ్చి;
కాక కార్యాంత రాసక్తి కారణముగ,
నేగఁ దలఁచినవాఁడవో యేచటి కైన? 6

అనఘు=దోషరహితుఁడా (దోషరహితుఁ డని 'యత్రాకృతి స్తత్ర గుణా భవన్తి' అను న్యాయముచేత తెలిసినది.) హేమ=బంగారపు. 'ఏఁగఁదలఁచినవాఁడవో' అనుటచే 'ఏఁగు మ' ని యామెయభిప్రాయము గాదు; అట్టియభిప్రాయముం దెలుపుట అతిథేయతకు కొఱఁతం దెచ్చును. మఱి యే మన, తననిమిత్తమే వచ్చినాఁ డని తలంచుటకు శాలీనతచేత సంకోచించిన దై అట్లే యుండిన నుండుఁ గాక యని జిజ్ఞాసాపూర్వకముగా ప్రశ్నించుట. వక్ష్యమాణప్రశ్న చేతను అతఁడు అప్పటం దడయ వలయు ననియె ఆమె కోరిన ట్లగపడుచున్నది.— 'సింహాసనంబు ఇచ్చి' - వాక్యవిరామ మందు సంధి లేమి.

తే. నవ శిరీష సుమంబుల నవకమునకు (8-24)
నన్నదమ్ములఁ బోని నీ యడుగుఁ దమ్మి
లెంత దూరంబు నడపింప నిచ్చగించె
నొకో నిర్దయ మైన నీ యుల్ల మిపుడు? 7

శిరీష = దిరిసెన. నవకము = మృదుత్వము. అన్నదమ్ములఁ బోని = అన్నదమ్ములం బోలిన - అన్నదమ్ము లనఁ దగిన - సదృశము లయిన. అడుఁగుఁ దమ్ములు= చరణ కమలములను. ఉల్లము = హృదయము (ప్రయోజక కర్త).

ఎక్కుడి కేఁగెద వనుట గమ్య మగునట్లుగా భంగ్యంతరము ఆశ్రయింపఁబడినది గాన పర్యాయోక్తాలంకారము. 'నవ...బోని' ఉపమ. పసిబాలురను అతికష్టము లైన పనులకుం బెట్టు కట్టిఁడి వృత్తాంతము అప్రస్తుతము ప్రస్తుత మయిన యుల్లమందు స్ఫురించుటచేత సమాసోక్తియు. - అంగ కోమలత్వమునకు శిరీషపుష్పము ఉత్తమోపమానము:— 3 ఆ. 176 చూ.

సీ. ఏదేశమున నుండి యొచ్చోటి కేఁగెదు? (8-25)
సంకేత మెయ్యది సంజ్ఞ నీకు?
రక్షాధికృత జన వ్రాత పాలిత మైన (8-26)
శుద్ధాంత మెబ్భంగిఁ జొచ్చి తిపుడు?
ఫల మేమి యొకో యీపటు సాహసమునకు, (8-27)
మముఁ గృతార్థులఁ జేయు క్రమము దక్క?
నాభీల దౌవారి కాంధంకరణి యైన (8-27)
శక్తి నీ కేవిద్య సంభవించె?

తే. నైలుఁడవొ, యైలబిలు కూరి యాత్మజుఁడవొ,
పంచబాణుండవో, దేవపతి సుతుఁడవొ,
చంద్రుఁడవొ, యింకఁ బెక్కుభాషణము లేల?
నిజము దప్పక చెప్పుము నిషధపతివొ. 8

సంకేతము ఎయ్యది = ఏ శబ్దము, సంజ్ఞ = పేరు ("సంజ్ఞా తు చేతనా నామ హస్తాద్యైశ్చార్థసూచనమ్' అమ.) రక్షా అధికృత...ము = కాపుదలయందు నియోగింపఁబడిన మనుష్యుల

సమూహాముచేత కావంబడిన దైన (శుద్ధాంతము) = అంతఃపురమును. పటు=దిట్టమయిన. కృతార్థ లక్ =ధన్యురాండ్రను (బహువచనము రాజకుమారి గావున ఆత్మగౌరవార్థము.) అభీ...ణి = భయంకరు లైన (చూచి యున్న యెడల నటికిపైచి యుందు రనుట) ద్వారపాలకులను గ్రుడ్డివారి నిగాఁ జేయునది యైన(వారికి నిన్నుఁ గానరాకుండఁ జేయునది-అదృశ్య కరణి యనుట.) ఏవిద్యక = ఏవిద్యచేత. సంభవించెక్=అలవడినది.

ఐలుఁడవో = ఇలాపుత్త్రుఁడయిన పురూరవుఁడవో ('పురూరవ స్తతో విద్వా నిలాయాం సముపద్యత' భార. పురూరవుని ఊర్వశి వలచుటయే ఆతని సౌందర్యతేజములకు నిదర్శనము. విక్రమోర్వశీయనాటకమును బఠించినం దెలియును.) ఐల...వో=కుబేరుని ప్రియపుత్త్రుఁ డయిన నలకూబరుఁడవా-

('కుబేర స్త్ర్యమ్బకసఖో యక్షరా డ్గుహ్యకేశ్వరః...
యక్షైకపి ఙ్గైలబిల శ్రీద పుణ్యజనేశ్వరాః.
అస్యోద్యానం చైత్రరథం, పుత్త్ర స్తు నలకూబరః'. అమ.

రంభ యితని వలచుటయే ఇతనిసౌందర్యమునకు తార్కాణము- 2 ఆ. 55 చూ.)...పంచబాణుఁడవో = మదనుఁడవా, దేవపతి సుతుఁడవో = జయంతుఁడవా. గీతమందు సందేహాలంకృతి.

క. ఆరయ నీ యుదయమునకుఁ। గారణమై యే కులంబు గాంభీర్యమునక్
దారాపతిఁ గన్న పయః। పారావారంబుతోడఁ బ్రతిఘటియించెక్. 9

ఆరయక్ =ఆలోచింపఁగా (ఇతఁడు పుట్టినకులము 'తారా...తోడ' ప్రతిఘటించి యుండు ననువిషయము ఆరయఁగా తెలిసినది-అనిర్వచనీయ మహిమాఢ్య మని భా.)ఉదయమునకుక్ = జననమునకు. గాంభీర్యమునక్ = లోఁతునందు (గుణసమృద్ధియం దనుట), తారాపతిక్ = చంద్రుని, ... పయః పారావారంబుతోడక్ = పాల కడలితో ('దుగ్ధం క్షీరం పయః సమమ్,' 'సముద్రోఽబ్ధి రకూపారః పారావారః సరిత్పతిః' అమ.) ప్రతిఘటియించెక్ = ఎదురొడ్డినది (సాటిఁజెందిన దనుట.)— 'ప్రతిఘటించు'- ఉపమావాచకము. నల తత్కులములకు తారాపతి పయఃపారావారములతో బింబప్రతిబింబభావము. (8-30)

తే. మానవుఁడ వైతివేని యిమ్మహి కృతార్థ; (8-44)
విబుధలోకంబె లోకంబు వేల్పవేని;
భువనముల కెల్ల మీఁద దధోభువన మీవు
భుజగరాజాన్వయమునందుఁ బుట్టితేని. 10

మహి = భూమి. వేల్పవు = దేవతవు. విబుధలోకంబె=దేవ లోక మొకటియే ('అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధాః సురాః' అమ.) లోకంబు = ఉత్తమలోకము. భుజగ రాజ అన్వయమునందుక్ = వాసుకియొక్క కులమందు 'వాసుకి స్తు సర్పరాజః,' 'సంతతి ర్గోత్ర జనన కులా న్యభిజ నాన్వయాః' అమ.), అధో భువనము = పాతాళము (క్రింది భువన మనియు), భువనముల కెల్లక్ = అన్ని లోకములకంటెను, మీఁదు = పైది (ఉన్న దిక్కునుబట్టి క్రింది దైనను భాగ్యమునుబట్టి పైది అనుట - (సర్పరా జగు వాసుకికి పాతాళము నివాసము గావున నిట్లు చెప్పుట. - 'అధోభువన పాతాళ బలిసద్మ రసాతలం । నాగలోకః' అమ.)

'లోకంబు - లోకంబు' - శబ్దార్థములు అభిన్నము లయి తాత్పర్యభేద మున్నందున నిది లాటానుప్రాసము. క్రిందిభువనము మీఁదు అనుట విరోధమును గుణోత్కృష్ట మనునర్థముచే తత్పరిహారంబునుం గలవు గావున విరోధాభాసాలంకారము.

ఉ. వానిఁ బ్రశంస సేయఁ దగు, వాఁడు కృతార్థతముండు, వానిచే
నీనిఖిలంబు పావన, మహీన కృపా విభవం బెలర్ప నె
వ్వాని గృహాంగణంబునకు వచ్చెడి త్రోవ రజంబులందు నీ
మానిత పాద యుగ్మక మమర్చుఁ బ్రఫుల్ల సరోజ దామముల్. 11

(నీవు) అహీన కృపా విభవంబు = కొఱవడని ద యాతిశయము, ఎలర్పన్ = వికసిల్లఁగా, ఎవ్వాని - గృహ అంగణంబునకున్ = ఇంటి ముంగిటికి ('అఙ్గణం చత్వ రాజిరే'అమ.) - వచ్చిన త్రోవ రజంబులందున్ = (ఏత్రోవను వత్తువో ఆ) త్రోవలోని ధూళులయందు, నీ- మానిత పాద యుగ్మకము = పూజిత మయిన చరణ ద్వయము, ప్రఫుల్ల సరోజ దామముల్ = వికసించిన ('ప్రఫుల్లోత్ఫుల్ల సంఫుల్ల వ్యాకోచ వికచ స్ఫుటాః। ఫుల్ల శ్చై తే వికసితే' అమ.) కమలముల యొక్క- మాలికను, అమర్చున్ = కలిగించునో (అడుగులు పద్మములవంటివి గావున దుమారము లో వానిజాడయు పద్మశ్రేణివలెనే ఉండు నని భా.) వానిని = ఆగృహాస్థునిని, ప్రశంస = స్తుతి, ... కృతార్థతముండు = అత్యంతధన్యుఁడు, నిఖిలంబు = సమస్తము, పావనము = పవిత్రము.—నీవు అతిథివిగా వచ్చుటచే ఆతిథేయునికి మహామహిమ కలుగు ననుట.—అతిథేయమహిమ కార్యంబును అప్రస్తుతంబును, తద్వర్ణనకు తత్కారణంబును ప్రకృతంబును అగు నలగుణోత్కర్ష అభిప్రాయము గావున, కార్యనిబంధనాప్రస్తుతప్రశంసాలంకారము.

వ. గుణాద్భుతం బైన పదార్థంబు వర్ణింప కునికి యసహ్యా శల్యం బైన వాగ్జన్మ వైఫల్యంబు **(8-32)**.ధూర్జటి జటా కిరీ టాలంకారం బైన శశాంకుని సౌకుమార్యంబును నమృతంబునకు నుత్పత్తిస్థానం బగు పయోనిధానంబు గాంభీర్యంబును విశ్వ విశ్వంభ రాంభోజ కర్ణికాయమానం బగు సువర్ణాహార్యంబు ధైర్యంబును విభ్రమ భ్రూలతా భంగ లీలా విజిత సుమనస్సాయక విలాస రేఖా సారంబై నిర్వికారం బైనయాకారంబును నెవ్వరియందునుం గలదె? యేము కృతార్థుల మైతిమి. మాజన్మంబులు సఫలంబు లయ్యె. మావిలోచనంబులు భాగ్యంబులు సేసె. వీనులు భవ దుదంత శ్రవణ కుతూహ లాధీనంబు లయి యున్న యవి; వాగమృతంబు వానికిం బ్రసాదింపు." మనుటయు. 12

గుణ అద్భుతంబు = గుణములచేత ఆశ్చర్యము (లోకోత్తర శీల సౌందర్యాది గుణములు కలది.) అసహ్య శల్యంబు = (హృదయములో గ్రుచ్చుకొన్న) యోర్వరాని బాణము - లేక - మేకు ('శల్యస్తు న స్త్రీయాం శఙ్కౌ క్లీబం శ్వేడేషు తోమరే। మదనద్రు శ్వావిధో ర్నా'మేది.) ...వాక్ జన్మ వైఫల్యంబు = వాగింద్రియోత్పత్తియొక్క- నిష్ఫలత్వము (గుణాధిక వస్తువును స్తుతింప కుండుటకన్న మూఁగగా పుట్టియుండుట మేలు) ధూ...ను = శివుని జడల మకుటము

నవు తోఁడ వయిన చంద్రుని కోమలత్వంబును ('సుకుమారం తు కోమలం విరళం మృదు' అమ.) ఉత్పత్తి = పుట్టుక - పయోనిధానంబు = పాల సముద్రముయొక్క - గాంభీర్యంబున్ = లోఁతును(మనస్సులోనిభావమును పైకి తెలియనీయమియును.) విశ్వ...బుల్ = అశేషమయిన ('విశ్వ మశేషం కృత్స్నమ్' అను.) (అంభోజ =) కమలమువంటి దగు భూమికి ('భూ ర్భూమి రచలాఽనన్తా రసా విశ్వమ్భరా స్థిరా' అమ.) దుద్దువలె నొప్పుచున్నట్టిది. '(కర్ణికా కర్ణభూషణే హస్తాఙ్గుళౌ పద్మ బీజకోశ్యామ్' అమ.) - అగు - సువర్ణ అహార్యంబు ధైర్యంబుల్ = బంగారు పర్వతముయొక్క ధీరత్వంబును ['అహార్యః పర్వతే నా స్యా దహ ర్తవ్యే తు వాచ్యవత్' మేది. మేరుపర్వతము భూపద్మకర్ణిక యని భాగవతాది పురాణములందు వర్ణితము.—।

'ఇహ హి మేరుగిరిః కిలమధ్యగః కనకరత్నమయ స్త్రిదశాలయః,

ద్రుహిణజన్మకుపద్మగ కర్ణి కేతి చ పురాణవిదోఽము మవర్ణయన్.' గోశా.

'సౌవర్ణః కులగిరిరాజో మేరుః ... కర్ణికాభూతః కువలయకమలస్య మూర్ధని.' శ్రీభాగ.]

విభ్రి ... రంబు = విలాసముతోఁడి బొమ తీవయొక్క విఱుపు (ముడుఁచుట) యనెడివ్యాపారముచేత('లీలావిలాసక్రియయోః' అమ.) జయింపఁబడిన పుష్పబాణుని విలాస ప్రకారములయొక్క స్థిరాంశము కలది.

[ఇంతవఱకు ఈవచనంబున - 'గుణా... ఫల్యంబు' - రూపకము; 'నిన్ను వర్ణింప కునికి' యని ప్రకృత మభిప్రాయము గావున సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంస. 'కావున నిన్ను వర్ణించెద' నని ప్రకృతకార్య మభిప్రాయము గాన కారణనిబంధనాప్రస్తుతప్రశంసయు. సౌకుమార్య గాంభీర్య ధైర్యములు శశాంకాదులవి అన్యునియందు చెప్పఁబడినవి గావునను అర్థసిద్ధికై తత్సదృశము లాక్షిప్తములు గావునను పదార్థవృత్తి నిదర్శనాలంకారము. విశ్వంభ ... మానంబు = ఉపమ. 'విజిత' శబ్దము ఉపమావాచకము. శశాంకాదుల విశేషణములు. ఉపమానోత్కర్షార్థకములు. 'అమృతంబున కున్'—నీవు అమృతతుల్యుఁడ వనుట. 'విభ్ర...లీలా'—అవలీలగా ననుట. 'కలదె'—ఒక్కొక్కటి ఒక్కొక్కనియందున్న నుండుఁగాక అన్నియు నొక్కనియందే ఉండ వనుట.]

విలోచనంబులు = నేత్రములు. భాగ్యంబులు = శుభకర్మలు (పుణ్యకర్మ లనుట - 'భాగ్యం కర్మ శుభాశుభమ్' అమ.) వీనులు=చెవులు. భవ...బులు = నీ (భవచ్ఛబ్దము గౌరవముం దెలుపును) వృత్తాంతముయొక్క ('వార్తా ప్రవృత్తి ర్వృత్తాన్త ఉదన్తః స్యాత్' అమ.) వినికియందైన వేడుకకు వశములు. వాగమృతంబు = వాక్కనెడి యమృతమును - లేక - అమృతమువంటి దగువాక్కును. [తమ కృతార్థతాదికార్యము అప్రస్తుతము, అది ప్రస్తుత తత్కారణీభూత నల గుణోత్కర్షాభిప్రాయకము గాన అప్రస్తుతప్రశంస.]

ఉ. అంకిలి లేక యప్పు డరుణాధర పల్లవ నిర్గతంబులై (8-50)
పంకరుహాయతాక్షి నునుఁబల్కులు తేనియ లొల్కుచున్ శ్రవో
లంకృతులై నృపాలుమది లగ్నము లయ్యె వినోదలీలకై
మం కెనపూవుఁజాపమున మన్మథుఁ డేసినతూపులో యనన్. 18

అప్పుడు = దమయంతి అట్లు ప్రశ్న చేసినప్పుడు, అరుణ అధర పల్లవ నిర్గతంబులు = ఎఱ్ఱని కెమ్మోవి చిగురునుండి వెలువడినవి, [illegible] పంకరుహ ఆయత అక్షి = కమలమువంటినిడుదలగు [illegible]

అగు నేత్రములు కలదైన యాదమయంతియొక్క ('పఙ్కేరుహం పఙ్కజం సారసం సరసీరుహమ్', 'దీర్ఘ మాయతమ్' అమ.) - నునుఁబల్కులు = తియ్యనిమాటలు, తేనియలు ఒల్కుచున్ = ఇంపు గురియుచు, శ్రవః అలంకృతులు = నలుని కర్ణములకు తొడవులు (కర్ణ మఖిలష ణీయము లనుట), ఐ, అంకిలి లేక = అడ్డగింత లేక (సమగ్రముగా ననుట), మన్మథుఁడు, వినోద లీలకై = వేడుక చెర్లాటముకొఱకు, మంకెన పూవుఁ జాపమునన్ = తన విల్లయిన బంధూక పుష్పము నుండి, ఏసిన తూపులో అనన్ = ప్రయోగించిన బాణములో అనునట్లుగా, నృపాలు మదిన్ = నలుని మనస్సులో, లగ్నములు అయ్యెన్ = తగులు కొన్నవి.

ఆతీరున దమయంతి కెమ్మోవినుండి నలుని మనంబునందు నాటుకొన్న యా మధురోక్తులు మన్మథుఁ డాతనిపై మంకెనపూవువింట ప్రయోగించిన పూవుటమ్ములవలె నుండె ననుట.

'పల్లవ' అనుట మృదుత్వార్థము. 'నునుఁబల్కులు'—పల్కులు వాగ్దేవీరూపములు గావున శ్వేతములు, దంతకాంతులచేతను శ్వేతములే; పుష్పసామాన్యము కవిసమయంబున శ్వేతము:—

'శుభ్రాణి భారతీ ధర్మ శేషేశ వరు ణేన్దవః ...

ముక్తా కుసుమ నక్షత్ర దన్త స్వేదామ్బు బిన్దవః.' కా. క. ల.

కావున ఆపలుకులకును మదనబాణము లగు పుష్పములకును ధావళ్య మొకసాధారణ ధర్మము; తేనియలు పువ్వులకును సిద్ధములే గావున నదియు మదనోద్దీపకత్వమును మఱి రెండు సాధారణ ధర్మములు. 'తేనియలు'—నాలుకకు తేనియలచే నెట్టిప్రీతి గలుగునో ఆమాటలగుణముచే వీనులకు అట్టిప్రీతి గలిగె నని భా. 'శ్రవోలంకృతులు'—వీరులు ధర్మయుద్ధమందు తొలుత కుశలప్రశ్నగా బాణములను వైరిచెవిచెంత పోవునట్లు వేయుదురుగాన, అట్టి కుశల ప్రశ్నలై అని భా. 'మది లగ్నములు' - పిమ్మట గుండియ ప్రీల నేయుదురు గాన, అనంతరము ఆమాటలు అనంతర బాణములవలె డెందమున నాటుకొన్న వని భా. 'మంకెన' - అధరసామ్యార్థ మయిన యారుణ్యము కొఱకు. 'వినోద లీల'— ఏఁచుట గాదు. నాయికాసాన్నిధ్యమందు నాయకహృదయము ఆనంద జడముగా నుండును గావున, మదనునికి ఇప్పటి యీ బాణప్రయోగ వ్యాపారము వినోదలీల, హింసాలీల గాదు, కావుననే గుండెకు తగిలిన వైనను బాణంబులు ఆనందనంబులుగానే యున్నవి. 'తూపులో అనన్'—ఉత్ప్రేక్ష. కొందఱు స్వారస్యపరులు తూపులు (= బాణములు) అని వ్యస్తరూపకముగా గ్రహించి - ఓయనన్ = వరుసగా అని వివరింతురు.

వ. అనంతరంబ దమయంతీశాసనంబున సఖీజనంబు కనకాసనంబు వెట్టెను.

శాసనంబునన్ = ఆజ్ఞచే ('శాసనం రాజదత్తోర్వ్యాం లేఖాజ్ఞా శాస్త్ర శాన్తిషు' మేది.)

ఆ. అవ్వరాసనంబునందు నాసీనుఁడై (8-52)

యర్కుఁ డుదయ శిఖరియందుఁ బోలెఁ,

గొనియె నిషధరాజు వనజాత ముఖులచే

నాతిథేయ మయిన యర్ఘ్యపూజ. 15

నిషధరాజు, ఉదయ శిఖరియందున్ = పొడుపు గుబ్బలియందు ('ఉదయ స్తు పుమాన్ పూర్వ పర్వతే చ సమున్నతౌ' మేది. 'శిఖరీ స్యాదపామార్గే శైలపాదపయోః పుమాన్'), అర్కుండు పోలెన్ = సూర్యుఁడుంబోలె ('అర్కోఽర్కపర్ణే స్ఫటికే రవౌ తామ్రే దివస్పతౌ'

మేది.), ఆ వర ఆసనంబునందుఁ = ఉత్కృష్ట మయిన యా పీఁటమీఁద, ఆసీనుండు=కూర్చున్నవాఁడు, ఐ, వనజాత ముఖుల చేఁ = కమల వదనలవలన (వనజాతముఖీశబ్దబహువచనము, సూర్యపక్షమందు కమలవదనులవలన అనియర్థము - వనజాతముఖశబ్దబహువచనము), ఆతిథేయ మయిన = అతిథికి సాధు వయిన - అర్ఘ్య పూజఁ = జలపుష్పదానరూప మయినసత్కారమును, కొని యెఁ = గ్రహించెను.

రాజునకు అర్ఘ్య మిచ్చిరి. సూర్యుఁడు ఉదయపర్వతమందు నెలకొని యర్ఘ్యమును గ్రహించినట్లు రాజు బంగారుపీఁటపై కూర్చుండి యర్ఘ్యమును గ్రహించెను.— బింబప్రతిబింబభావాపన్న శ్లేషానుప్రాణి తోపమ. ఎత్తయిన బంగారుపీఁటకును ఉదయపర్వతమునకును సామ్యము. నిషధరాజునకును బాలసూర్యునికిని, వనజాతముఖీజనమునకును వనజాతముఖ (ద్విజ) జనమునకును సామ్యము; అర్ఘ్యము రెంటను సమానము, సూర్యునికి గాయత్ర్యుచ్చారణపూర్వకముగా ద్విజులు మందేహదేహనాశార్థము అర్ఘ్యము నొసంగుట ప్రసిద్ధము.

'మన్దేహదేహనాశార్థ ముదయాస్తమయే రవిః
సమీహతే ద్విజోత్సృష్టం మన్త్రితోయాఞ్జలిత్రయమ్.'

బింబప్రతిబింబభావము స్ఫుటము.— 'ఉదయ'ముం జెప్పుట వర్ధమానశోభార్థము.

వ. ఇట్లు సంభావితుం డై, యంభోరుహాక్షులు తన్ను వీక్షించుచు సంజాత కౌతుకంబున వింజ మాఁకిడిన భంగి నూర కుండ, నప్పుణ్యశ్లోకుండు ప్రావృషేణ్య పయోధర ధ్వాన గంభీరం బైన యెలుంగున దమయంతి నుద్దేశించి. 16

సంభావితుండు = సత్కృతుఁడు. అంభోరుహ అక్షులు = పద్మ నేత్రలు. వీక్షించుచుఁ = చూచుచు. సంజాత కౌతుకంబునఁ = పొడమిన వేడుకచేత. వింజము ఆఁక ఇడిన భంగిఁ= వింధ్యపర్వతము అడ్డగించిన రీతిగా [పూర్వము వింధ్యపర్వతము మేరువుతో పోటి చేసి సూర్యుని తనచుట్టుం దిరుగు మని కోరెను. అందులకు సూర్యుఁడు అంగీకరింపనందున వింధ్యము పెరిగి యాతని మార్గము నడ్డగించెను. అంతట సూర్యోదయాస్తమయములు లేమిం జేసి లోకము వ్యాకులము కాఁగా దేవతలప్రార్థనచే అగస్త్యులవారు వింధ్యమును నేలపయి చాఁగిలఁబడం జేసిరి. - కావున ఈవాక్యమునకు లోక మంధకారబంధురమై సర్వవ్యవహారంబులును నిలిచిపోవునట్లుగా సూర్యుని వింధ్యము ఆఁపినవిధంబున నని అర్థము; ఏమియుం దోఁపక ఏమియుం జేయక యని భా.] పుణ్యశ్లోకుండు=పావన మయిన యశస్సు కలవాఁడు ('పద్యే యశసి చ శ్లోకః' అమ.) ప్రా...నఁ= వర్షాకాలపు మేఘ గర్జనమువలె మంద్ర మయినస్వరముతో [(ప్రావృషి భవః - ప్రావృషేణ్యః= వర్షాకాలమందు ఉండునది-'స్త్రియాం ప్రావృట్ స్త్రియాం భూమ్ని వర్షాః', 'మన్ద్రస్తు గమ్భీరః' అమ.- మేఘధ్వనివంటి స్వరము మహారాజులకుండును, గర్దభాదిస్వరము దౌర్భాగ్యసమన్వితులకుండును.—

'కరి వృష రథౌఘ భేరీ మృదఙ్గ సింహాబ్ద నిఃస్వనా భూపాః
గర్దభ జర్జర రూక్ష స్వరా శ్చ ధన సౌఖ్య సంత్యక్తాః.' బృ. సం.

ఇదియునుం గాక స్వకాల మేఘ ధ్వానము సుభగంబు నగును. 'స్నిగ్ధ గమ్భీర ఘోషమ్' ('స్నిగ్ధః శ్రావ్యః' అని మల్లి. 'ఉచ్చైః శ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితమ్' ఇత్యాది మేఘసందేశ

గ్రంథ గత 'మేఘగర్జా విశేషణంబుల నరయఁ దగును. ఇందువలన నలుని కంఠస్వరము సజల 'జలధరధ్వానమువలె శ్రావ్యముగాను మంద్రముగాను ఉన్న దని భా.]—'ప్రావృ ... గంభీరన్' - ఉపమాలంకారము.

సీ. ఏను దిక్పతుల యాస్థానంబునందుండి (8-55)
యరుగుదెంచితి నీకు నతిథి నగుచుఁ,
బ్రాణంబులను బోలె నంతరంగమునందుఁ (8-55)
దత్కార్యభరమును దాల్చినాఁడఁ;
జరితార్థముగఁ జేయఁ జను నాదు దూత్యంబు, (8-56)
నాతిథ్య సత్కార మదియు నాకుఁ;
గాల యాపన సేయఁ గాదు నిశ్చయము పైఁ (8-57)
గర్తవ్య మగునట్టి కార్యమునకు;
తే. నుల్ల మిప్పు డేకాగ్రమై యున్నయది యొ? (8-57)
యవసరం బౌనె దేవ రహస్యమునకు?
వింతవారలు లేరు గా యింత నంత?
నువిద, మనవారలే కదా యున్నవారు? 17

... ఆస్థానంబునందుండి = సభనుండి
('సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః
ఆస్థానీ క్లీబ మాస్థానం స్త్రీనపుంసకయోః సదః.' అమ.)
... అరుగుదెంచితిన్ = వచ్చితిని - (దిక్పాలురు పంపఁగా వచ్చినదూత ననుట;)
ప్రాణంబులను బోలెన్ (అత్యంతప్రియముగాను పదిలముగాను అనుట), అంతరంగమునందున్ = మనస్సులో, ...
నాదు దూత్యంబున్ = నేను ఏపనికై దూతనుగా వచ్చితినో ఆపనిని, (దూతస్య కర్మ భావో వా దూత్యమ్ దౌత్య మపి), చరితార్థముగన్ = నెఱవేర్పఁబడిన ప్రయోజనము గలదానినిగా ('అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు' అమ.), చేయఁ జనున్ = నీవు చేయఁ దగును (అది చేయఁ దగిన పని కావున దానిని చేయుము అనుట.)
పైన్ = పిమ్మట, కర్తవ్యము = అవశ్యముగా చేయవలసినది, అగునట్టి కార్యమునకున్, కాల యాపన = (కాలముయొక్క జరుపుట) జాగు, చేయన్=చేయుట, కాదు = తగదు, నిశ్చయము = తగ దనుట సిద్ధాంతము - [లేక - 'నిశ్చయము (=నిశ్చయముగా) కర్తవ్య మగునట్టి' అనియేని అన్వయింపవచ్చును.]
ఉల్లము = మనస్సు, ... ఏకాగ్రమై = పరాకు లేకుండ, ... దేవరహస్యమునకున్ = దేవతలు నీకు సందేశించిన రహస్యవృత్తాంతమును నీతో చెప్పుటకు (రహస్య మనుటచే ఆప్తులే గాని ఇతరులు వినఁగూడ దనుట), అవసరంబు=సమయము, ...వింత = పరాయి, ...

క. నాకౌకఃప్రవరులు ని। న్నాకాంక్షించిన ప్రయోజ నాంశము దిరమై
యాకర్ణింపుము చెప్పెద। నాకర్ణపుటాయతాక్షి, యవధానమునన్. 18

ఆ కర్ణ పుట ఆయత అక్షీ = కర్ణ పుటముల వఱకును వాలికలైన నేత్రములు కలదానా, నాక ఓకః ప్రవరులు = దేవశ్రేష్ఠులు (నాక = స్వర్గము - ఓకః = నివాసస్థానముగాఁగలవారు- 'దేవా ద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియే' అమ.), నిన్నున్ = నీవలన, ఆకాంక్షించిన = కోరిన - ప్రయోజన అంశమున్=కార్య భాగమును, తిరము ఐ = స్థిరము గా, అవధానమునన్ = పరాకు లే కుండ, ఆకర్ణింపుము = వినుము. (8-57)

వ. పాకశాసన పావక పరేతరాజ పాశపాణులు పుత్తేరం బని వ్రాని వచ్చితిఁ (8-58). జిత్తగించి యక్కార్యంబు విను మప్పరమపురుషులు పరిషన్మధ్యంబునం బంకజాసను తనూభవునివలనం ద్రిభువన మోహనంబు లైన నీరూప లావణ్య విలాస విభ్రమాది గుణంబులు విని, వినుకలి వలవంత నెంతయుఁ జలించి, పంచేషు పరిలుంఠిత ధైర్య విత్తంబు లగు తమచిత్తంబులం గల వృత్తాంతంబు లంతయు దెలియం జెప్పి (8-59). రిప్పు డయ్యాశాపతు లాశాపాశంబులఁ గట్టు వడినారు (8-60). వారియందును సంక్రందనుండు. 19

పా ... లు = ఇంద్రాగ్ని యమ వరుణులు (పాకుఁ డను నసురుని కొట్టినవాఁడు ఇంద్రుఁడు - పవిత్రము చేయువాఁడు పావకుఁడు - పరేతులకు అనఁగా మృతులకు రాజు యముఁడు- పాశాయుధము పాణియందు కలవాఁడు వరుణుఁడు), పుత్తేరన్ = పంపఁగా. పరిషత్ మధ్యంబునన్ =సభ నడుమ ('సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః' అమ.), పంకజాసను తనూభవునివలనన్ = బ్రహ్మ పుత్త్రుఁ డయిన నారదునివలన, ... వినుకలి వలవంతన్ =వినికిచేఁ గలిగిన విరాళివలన.... పం ... లు - పంచేషు = ఏనమ్ములవానిచే - పరిలుంఠిత = కొల్లపెట్టఁబడిన- ధైర్య = ఇంద్రియ నిగ్రహ మనెడు - విత్తంబులు = ధనము కలవి. ...ఆశాపతులు=దిగీశ్వరులు ('ఆశా ది గతితృష్ణయోః' అమ.), ఆశా పాశంబులన్ = కోరిక లనెడి త్రాళ్లచేత ('ఆశాప ... నారు'—విరోధాభాసము.) సంక్రందనుండు = ఇంద్రుఁడు ('సంక్రన్దనో దుశ్చ్యవన స్తురాషా ణ్మేఘవాహనః' అమ.)

తే. నంద నోద్యాన వీథి కాంతరములందుఁ
బూర్ణచంద్రాస్య విహరింపఁ బోవ వెఱచుఁ
గల్ప తరు పల్లవంబులు గమిచి మేసి
'కోకిలం బెప్డు గూయునో కొసరి యనుచు.' 20

ఓ - పూర్ణ ... స్య= పూర్ణచంద్ర ముఖీ, కల్ప తరు పల్లవంబులు = ఈఁగి మ్రాఁకుల చిగుళ్లు, కమిచి = కవ్వుకొని, ... కొసరి = అధికముగా, ...అనుచున్ = అనుభయముచేత, నంద ...దున్ = నందన వనములోని వృక్షపంక్తుల మధ్య ప్రదేశములందు (ఇంద్రుని యుద్యానము పేరు నందనము - 'పుమా నాక్రీడ ఉద్యానం రాజ్ఞః సాధారణం వనమ్' అమ.), విహరింపన్ = స్వైరి సేయుటకు ...వెఱచున్ = వెనుదివియును.

'కల్పతరు పల్లవంబులు' - పల్లవ సామాన్య గ్రాసమునకే మధురముగా కూయు కోకిల కల్ప తరు పల్లవ గ్రాసముచే ఎంత మధురముగా ఎంత విరహోద్దీపకముగా కూయునో చెప్పవలయునా. అని ఆతనిభయము.—కర్ణపర్వములో శ్రీకృష్ణులవారు అర్జునునికి

'వివాహకాలే రతిసంప్రయోగే । ప్రాణాత్యయే సర్వధనాపహారే
విప్రస్య చార్థే హ్యనృతం వదేత । ప ఞ్చానృతా న్యాహు రపాతకాని.'
[ వారిజాక్షులందు వైవాహికములందుఁ । బ్రాణ విత్త మాన భంగమందుఁ
జకుల గోకు లాగ్రజన్మ రక్షణమందుఁ । బొంక వచ్చు నఘము పొంద దధిప.]

అని చెప్పినతీరున ఈప్రకరణములో నలమహారాజు దూత్యసాధకముగా కలవి లేనివి ఇచ్చవచ్చినట్లు పలుకుచున్నాఁడు.

తే. పరము మగు కోటి కెక్కె నో పద్మనయన, (S-61)
నవనవం బైన నీ జవ్వనంబుతోన
యసమబాణుని చాపంబునందు గుణము
భామ, నీయందు సుత్రాము ప్రేమ గుణము. 21

ఓపద్మనయన, నవనవంబు = నవప్రకారము - క్రొత్తక్రొత్తది, ఐన - నీ-జవ్వనంబుతోన = యౌవనముతో కూడనే (నీ జవ్వనము పరమము అగు కోటికి ఎక్కినంతనే - ఉత్కృష్టమయిన యతిశయమును పొందఁగానే - నీకు తత్పూర్వ మున్న లావణ్యాదికముకంటె కోటిమడుంగుల లావణ్యము రాఁగానే అనియు), అసమబాణుని చాపంబునందున్ = మదనుని వింటియందు, గుణముణ్ = అల్లెత్రాడును, భామ = ఓతరుణీ, నీయందున్, సుత్రాము ప్రేమగుణమున్ = ఇంద్రుని యొక్క యనురాగమనెడు గుణంబును ('సుత్రామా గోత్రభి ద్వజ్రీ', 'ప్రేమా నా ప్రియతా హార్దం ప్రేమ స్నేహః' అమ.), పరమము అగు కోటికిన్ ఎక్కెన్ = (అల్లెత్రాడు) పై దయిన వింటి కొప్పును ఆరోహించెను - (ప్రేమ) ఉత్కృష్ట మయిన యతిశయమును పొందెను ('కోటిః స్త్రీ ధనుషోఽగ్రేఽగ్రే సంఖ్యాభేద ప్రకర్ష యోః' మేది.)— నీకు నవయౌవనము విలసిల్లినంతట మదనుఁడు విల్లెక్కువెట్టి ఇంద్రుని నొంపసాఁగినాఁడు; ఇంద్రుఁడు నిన్ను తలమునుకలుగా వలచియున్నాఁడు; అనుట. సహోక్త్యలంకారము (శ్లేషానుప్రాణితము), 'తోన'తద్వాచకము :—

'వరసహిత సహోక్తి ధరా । వరుయశము దెసలఁ జనియె వైరులతోడన్.' అలం.

ఉ. ఆరసి చూచి తాపమునయందును రూపమునందుఁ బూర్ణిమా (S-62)
తారకరాజుగాఁ దలఁచి, తన్వి, భవ ద్విర హాతురుండు జం
భారి నిగుడ్చు భ్రాంతి నుదయావసరంబుల నొద్ద నుండి రో
పారుణ మైన లోచన సహస్రము బాల సహస్రభానుపైన్. 22

తన్వి = ఓలతాంగీ, భవత్ విరహ ఆతురుండు = నీతోడి యెడఁబాపుచేత విహ్వలుఁ డయిన, జంభారి = ఇంద్రుఁడు, ఉదయ అవసరంబులన్ = ప్రొద్దు పొడుచు వేళలయందు, ఒద్దన్ = సమీపమందు (ఈయన తూర్పుదిక్కు నేలు దొరగాన ఈయనకు సామీప్యము), ఉండి, (ఉదయించుచున్న సూర్యుని), తాపమునయందున్ రూపమునందున్ = వేఁడియందును ఎఱుపు

వర్ణమందును, ఆరసి చూచి=తారతమ్యము ఆలోచించి గ్రహించి, భ్రాంతిన్=మదనకృత మిథ్యా మతిచేత ('భ్రాంతి ర్మిథ్యామతి ర్భ్రమః' అమ.), పూర్ణిమా తారకరాజు గాఁ దలఁచి = పున్నమ చంద్రునిఁగా నెంచి (తారకాశబ్దము నపుంసకలింగంబునుం గలదు - 'సంధ్యానట స్తారకరాట్కిరీటః' అని నైషధమందే ప్రయోగము), బాలసహస్రభానుపైన్ = బాలసూర్యునిమీఁద ('భాను ర్హంసః సహస్రాంశు స్తపనః సవితా రవిః' అమ.), రోష అరుణము అయిన లోచన సహస్రమున్ = కోపముచే నెఱ్ఱ నయిన వేయి కన్నులను, సిగుడ్చున్ = పరఁగించును (ఒక్కొక్క కిరణము మీఁదికి ఒక్కొక్క కంటిని అనుట. సహస్రాక్షుఁడు గాన ఇతని కొక్కనికే అది సాధ్యము.)

'తాపము' - ఉదయసమయము గాన అరుణజ్యోత్స్నవలె నున్న దని భా. 'రూపము' - నిండుగాన పూర్ణచంద్రభ్రమ. చంద్రుఁడు విరహిదాహకుఁడు గాన రోషముతో చూచుట, 'రోష ... లోచన సహస్రము'- వేయికన్నుల కోపముతో చూచె ననుట - ఇతరు లయిన రెండుకన్నుల కోపముతో చూతురు, ఈతని కోపము వారి కోపముకన్న ౫౦౦ మడుంగులు, విరహము అన్ని మడుంగు లని ఫలితార్థము. నీమీఁదిబాళి ఆతని నట్లేఁచుచున్నది, కావున నీవు అవశ్యము అనుకంపనీయుఁడు, అనుట.— ఈ తాపరూపములచేతనే శ్రీరాములవారికిని ఈభ్రమయే కలిగినది -

'సౌమిత్రే, నను సేవ్యతాం తరుతలం, చణ్డాంశు రుజ్జృమ్భతే;
చణ్డాంశో ర్నిశి కా కథా? రఘుపతే, చన్ద్రోఽయ మున్మీలతి.
వత్సైతద్విదితం కథ న్ను భవతా? ధత్తే కురఙ్గం యతః.
క్వాసి ప్రేయసి హా కురఙ్గనయనే చన్ద్రాననే జానకి?' ప్రసన్నరా.

భ్రాంతిమద్యథాసంఖ్యములు. ఇట ఉన్మాద మనెడి సంచారిభావము చెప్పఁబడినది:—
'విప్రలమ్భమహాపత్తి పరమానన్దాది జన్మాఽన్యస్మి న్యన్యావభాస ఉన్మాదః.' రసగఙ్గా.

తే. మూఁడు కన్నుల వేల్పుతో మోహరించి (8-63)
నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను,
వేయి కన్నుల వేల్పుతో విగ్రహించి
వనిత యిం కేమి గా నున్నవాఁడొ మరుఁడు?' 23

వనిత = ఓబోటీ, మరుఁడు, (పూర్వము), మూ...తోన్ = ముక్కంటితోన్, మోహరించి = ఎదుర్కొని, నేఁడు...దాను = (దగ్ధుఁడై పోయి) దేహము పోఁగొట్టుకొని ఇప్పటికిని ఏ యుపాయమునను మరల దేహమును పొంద లేక యున్నాఁడు; వేయి...తోన్ = ఇంద్రునితో, విగ్రహించి = పోరుపెట్టుకొని, ఇం...డొ - ఇప్పుడు ఆమదనునికిం గలుగఁ దగినచెట్ట ఇంతంత యని చెప్ప నలవి గా దనుట.— కావ్యార్థాపత్త్యలంకారము.

'మూఁడు కన్నుల వేల్పు' శివభవాదినామములం జెప్పక ఈ నామముం జెప్పుట నిప్పుకంటి నుద్ఘాటించుటకు. 'వేయి కన్నులం' జెప్పుట 'మూఁటిచేత శాశ్వత మయిన దేహనాశ మయిన, వేయింటిచే ఏమగును?' అని త్రైరాశికపు లెక్క వేయుటకు. నీవలన మదనదేవుని కంత చెఱుపు కలుగరాదు గాన ఇంద్రు ననుగ్రహింపు మనుట.

చ. చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెన్నఁడున్ (8-64)
వెలలఁడు నంద నోపవన వీథులకై; యట్టు మాళి భాగని

ర్మల శశిరేఖ సేయు నపరాధమునఁ గజదైత్యశాసను
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి, నీదెసఁ గూర్మి యెట్టిదో. 24

కోమలి = ఓకోమ్మా, పాకశాసనుఁడు = ఇంద్రుఁడు ('ఇన్ద్రో మరుత్వాన్ మఘవా బిడౌజాః పాకశాసనః' అమ.) నీ దె...దో = నీ మీఁది మక్కువ ఎంత మిక్కుటమో వచింపఁ దరమా (మితి లేని మక్కువచేత విరహవేదనం బడుచున్నాఁ డనుట - పా. 'నీపయిఁ గూర్మి పెంపు నన్' = నీమీఁది ప్రేమాతిశయమునం జేసి), చిలు...చున్, నందన - ఉపవన = తోఁట ('ఆరామః స్యా దుపవనం కృత్రిమం వన మేవ తత్' అమ.) - వీథులకై = చెట్లచాలునకు, ఎన్నఁడున్, వెలలఁడు = వెడలఁడు (పోఁడు అనుట), అటు = ఆప్రకారమే, (చిలుకలకు వెఱచి నందనమునకుం బోనట్లే), మౌళి... నన్ = కిరీట ప్రదేశమందలి ('మౌళిః కిరీటే ధమ్మిల్లే చూడాయా మనపుంసకమ్' మేది.) నిష్కళంకమైన చంద్రకళ చేసెడు నేరమిచేత, గజదైత్యశాసనున్ = గజాసురసంహర్త యైన శివుని, కొలువఁడు.

ఓ కోమలీ, దేవేంద్రుఁడు నీమీఁది విరాళి తీవరముచేత అయోగతాపమునం బడినవాఁడై చిలుకల కలకలమును చెవులం జిల్లులు వుచ్చునని విన నోల్లక నందనోద్యానవాటికలకుం బోవుట మానినాఁడు. మఱియు, శివశిరంబున నున్న నిష్కళంక చంద్రకళ తన యొడలిం గాల్చు నని వెఱచినవాఁడై కైలాసమునకుం బో నొల్లక శివసేవ మానినాఁడు. (ఆ దీనుని ప్రాణములం గావంగదే యని వేఁడికోలు అభిప్రాయము.)

'చిల్లులు' - నీపలుకులం దలఁచువానికి చిలుకపలుకులు కర్ణశల్యములుగానే యుండు ననుట. చిలుక పలుకులు మనోహరతరంబు లగుటచే విరహోద్దీపకంబులు. చిలుక మదనునికి వాహనము, వియోగికడ చిలుక పలికినచో వానిని వేటాడుటకు మదనుఁడు వచ్చియున్నాఁ డనుట నిశ్చయము; 'కూయునో' 'పల్కునో' - అని పాఠభేదములు - రెండవదానికి పెంపుడుచిలుక లనియు శిక్షితశుకలయిన నానాకామదీపకవాక్యములు వచించు ననియు భా. 'నిర్మల' - పూర్ణచంద్రుఁడు సకళంకుఁడు - ఏకకళ నిష్కళంకము - గావున విరహోద్దీపకతరము. 'అపరాధము' - ఒడలిం గాల్చుట.

['ముఞ్చ త్యేవం హిమకాఘుం, నను రజనికరో? హన్త కిం సోఽపి దాహీ.' ప్రియదర్శిక.
'దయసేయక తిన్ననిమేను వెన్నెలన్ వేఁతురఁటమ్మ?' మను.]

నీకై తన త్రిలోకేశ్వరత్వమునకుం గారణ మయిన శివార్చన మానుకొన్నాఁడు, తచ్ఛివార్చనాఫల మయిన నందనారామవిహారమును వదలుకొన్నాఁడు; అవశ్యనిత్యకర్తవ్యములను మానినాఁడు, రమ్యమును ద్వేషించుచున్నాఁడు, అనుట. నందనవిహార శివసేవా త్యాగములకు 'కోమలి... దో' అను వాక్యార్థము హేతువు గావున వా. హే. కావ్యలింగము. నందనవనసేవా శివారాధన సంబంధ మున్నను లే దనుటచే అసంబంధాతిశయోక్తి.

తే. స్మరశిలీముఖ కుసుమ కేసర పరాగ (8-65)
ధూళి పాళిక చుఱుకించెఁ దూర్పుదిక్కు,
నింతి, వేగన్నులును గానఁ డింద్రుఁ డిపుడు
నీవిలాసంపుఁ బెంపు వర్ణింపఁ దరమె! 25

ఇంతి = ఓదమయంతీ, స్మర...ళిక = మదన బాణము లయిన పువ్వుల యకిరువుల రజమనెడి దుమారంపు సమూహము ('అళి బాణౌ శిలీముఖౌ,' 'కిఞ్జల్కః కేసరోఽస్త్రియామ్,' 'పరాగః కౌసుమం రజః,' 'పాళిః స్త్ర్యశ్ర్యఙ్క పఙ్క్తిషు' అమ.), తూర్పుదిక్కున్ = ప్రాచిని, చుళుకించెన్ = మ్రింగెను; (అందువలన), ఇంద్రుఁడు ... డు;...నీ-విలాసంపుఁ బెంపు = నీ సౌందర్యాతిశయమును,... తరమె = తరము కాదనుట.

నీ సౌందర్య ప్రభావమును వర్ణింపఁదరము గాదు; నీపొందుకై యింద్రుఁడు పడుచున్న పాట్లు వినుము; మదనుఁ డాతనిపైఁ గురియుచున్న పూవుటమ్ముల యకరువుల రజంపుదుమారములో తూర్పుదిక్కెల్ల మునింగి యంధకారబంధురంబై యున్నది; ఆ యంధకారముచేతను, ఆపుప్పొడి కన్నులలో నిండుటచేతను ఇంద్రుఁ డిపుడు వేయికన్నులును ప్రతిబద్ధదర్శనములు కాఁగా దీనుఁడై యున్నాఁడు.

'చుళుకించెన్' - చుళుక మనఁగా చేర-చేరెఁడు. చుళుకించుట యనఁగా చేరెఁడుగాఁ జేసి మ్రింగుట - స్తుతించు ఇత్యాదులవలె నామధాతువు

[' చుళుకిత తమః సిన్ధోః' నై. 19 స. (37) - 'చుళుకః కృతః చుళుకే ధృత్వా పీతః తిమిర సముద్రో యేన తస్య ...చుళుకేన పీతతమస్సిన్ధోః ... చుళుకిత ఇతి తత్కరోతీతి ణ్యన్తాత్ క్తః' నారాయణ టీక. 'చుళుకితః చుళుకీకృతః తమస్సిన్ధుః యేన తథోక్తస్య' మల్లి.

' నయనచులుకనీయః కోఽపి పీయూషరాశిః',

' (తావత్) తావచ్చకోరీ చుళుకయతు చిరం శీతరోచి ర్మరీచీన్.' కంసవధ.

ఇత్యాదిప్రయోగములను బట్టి శబ్దార్థము పరికించునది.] 'కన్నులు గానఁడు' - 'కన్నులు' తృతీయార్థక మనుకొన్నచో ఈవ్యవహారము సమర్థత మగును.

తురీయపాదార్థము పూర్వభాగార్థమునకు కారణము, పూర్వార్ధార్థము తృతీయపాదార్థమునకుం గారణము, కావున వా. హే. కావ్యలింగాలంకారములు. వేగన్నులం గానమి అసంబద్ధము గాన అసంబంధాతిశయోక్తి. తూర్పుదిక్కెల్ల పుప్పొడిలో మునుఁగుట అతిశయోక్తిని మించిన డబ్బుగాన అత్యుక్తి -

'భూరుప నద్భుతమిథ్యా। శూరత్వోదారతాది సాబ గత్యుక్తిన్;
ఓరాజవర్య, నాల్గును । వారాసులు నీ ప్రతాప వహ్నికి నిగిరెన్,
పూరితము లయ్యెఁ గ్రమ్మఱ । నీ రిపు వని తాశ్రు వాహినీ సంతతిచేన్.' అలం.

తే. విరహ తాప ప్రశాంతికై విబుధ పతికి (8-67)
నార్ద్ర పర్యంక విధికిఁ గా నపచయింపఁ
బరుల లేములు వాపంగఁ బాలుపడిన
యమరతరువుల కొదవెఁ బుష్పముల లేమి. 26

పరుల లేములు = ఇతరుల దారిద్ర్యములను, పాపంగన్ = పోఁగొట్టుటకు, పాలు పడిన = కంకణము కట్టుకొనియున్న - అమర తరువులకున్ = దేవవృక్షములకు - (కల్పవృక్షముల కనుట), పుష్పముల లేమి = ప్రసూనాభావము,... విబుధ పతికిన్ = దేవేంద్రునికి, విరహ తాప ప్రశాంతికై = వియోగ తాపము చల్లారుటకై, ఆర్ద్ర పర్యంక విధికిఁ గాన్ = తేమగల పానుపు

యొక్క రచనకోసము ('ఆర్ద్రా నక్షత్రభేదే స్యాత్ స్త్రియాం క్లిన్నే౽భిధేయవత్' మేది. 'పర్యఙ్కః పల్యఙ్కః ఖట్వాయాః సమాః' అమ. పర్యంక మనఁగా మంచము-ఇట లక్షణచేత పాను పు - 'విధి ర్విధానే దైవే చ' అమ.), అపచయింపఁగ = కోసినందువలన ('అపహార స్త్వపచయః' అమ.), ఒదవెఁగ = సంభవించెను.—లేని దరిద్రతను చెప్పుటచే సంబంధాతిశయోక్తి; ఉత్తరార్ధమున ఈవిమ్రాఁకులకు లేమి కలుగుట విరోధము, అది పూర్వార్ధమున అపచయోక్తిచేత పరిహృతము, కావున విరోధాభాసాలంకారము.

'అపచయింపఁగ' - ఆర్ద్రిత తగ్గ కుండుటకై కోసినవెంటనే పాన్పు రచించి రనుట.

మ. వినుమ వైదర్భి భవ ద్వియోగ దవ థూద్వేగంబు వారించుచున్
దినముల్ పుచ్చుచు నున్నవాఁడు విబుధాధీశుండు మందాకినీ
కనకాంభోరుహ నాళ కల్పిత నవాకల్పంబులం జారు నం
దన మందార తరు ప్రవాళమయ చింతారత్న తల్పంబులన్. 27

వైదర్భి = ఓదమయంతీ, వినుము, విబుధాధీశుండు = దేవేంద్రుఁడు, భవ ... బున్ - భవత్ = నీతోడి - వియోగ = ఎడఁబాపుచేత నయిన - దవథు = తాపముయొక్క - ఉద్వేగంబున్ = తీవ్రతను—['టుదు ఉపతాపే'-'ట్విత్తో౽థుచ్' (భావే)-

'కేచి ద్వేపథు మాసేదు, ర్న్యే దవథు ముత్కటం,
సరక్తం వమథుం కేచిద్, భ్రాజథుం న చ కేచన.' భట్టి.],

మందా...బులన్ = మిన్నేటియొక్క ('మన్దాకినీ వియద్గఙ్గా' అమ.) బంగారపుఁ దామరల తూండ్లతో రచింపఁబడిన క్రొత్త (వాఁడని - తడి యాఱని) తొడవులచేతను ('ఆకల్ప వేషౌ నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్' అమ.), చారు...లన్ = అంద మయిన ('సున్దరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్' అమ.)నందనవనమందలి మందారవృక్షములయొక్క చిగుళ్ల వికార మయిన చిగుళ్లచేఁ జేయఁబడిన వైన) ఈవిమానికమునందలి సెజ్జలయందును, వారించుచున్ = తలఁగించుచు, దినములు, పుచ్చుచున్ = కడపుచు, ఉన్నవాఁడు = ఉన్నాఁడు.—దినములు ఇట్లు పుచ్చుట లేకున్నను చెప్పుటచేత సంబంధాతిశయోక్తి.

ఉ. పుష్ప ధనుర్లతా మధుప పుంజ గుణ క్వణనం బొనర్చి వా (8-68)
స్తోష్పతి కర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా!
గీష్పతి యేమి చెప్పె నిటఁ గ్రింద బలారికిఁ గామ విక్రియా
దుష్పథ వృత్తికిన్ మనసు దూర్పమికై బహునీతిశాస్త్రముల్. 28

మనసిజుండు = మన్మథుఁడు, పుష్ప ... బు = తీవవంటి పూవింటి తేఁటి బారు నారి యొక్క మొరయించుటను (టంకారమును), ఒనర్చి = కావించి, వాస్తోష్పతి కర్ణముల్ = ఇంద్రుని చెవులను ('వాస్తోష్పతి స్సురపతిః' అమ.), చెవుడ్పడన్ జేసెన్ =చెవుడుగలవి యగునట్లుగా (గింగు రనునట్లుగా) చేసినాఁడు, అక్కటా = అయ్యో పాపము! గీష్పతి = (ఇంద్ర గురువయిన)బృహస్పతి ('బృహస్పతి స్సురాచార్యో గీష్పతి ర్ధిషణో గురుః' అమ.), ఇటన్ = ఈస్త్రీ లోల్యత విషయములో, క్రిందన్ = ఇంతకు పూర్వము, బలారికిన్ = ఇంద్రునికి ('బలారాతిః శచీ

పతిః' అమ.), కామ ... కిక = కామ వికార మనెడు చెడుమార్గమందు వర్తించుటకు, మనసు దూర్పమికై = మనస్సును ప్రవేశపెట్టకుండుటకై, బహు నీతిశాస్త్రముల్, ఏమి చెప్పెక =

('దణ్డకో నృపతిః కామాత్, క్రోధా చ్చ జనమేజయః,
లోభా దైల స్తు రాజర్షి, ర్వాతాపి ర్హర్షతోఽసురః,
పౌలస్త్యో రాక్షసో మానా, న్మదా ద్దమ్భోద్భవో నృపః,
ప్రయాతా నిధనం హ్యేతే శత్రుషడ్వర్గ మాశ్రితాః.' కామన్ద.

'కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.' భ. గీ.

ఇత్యాది) నీతులు ఎన్నియేని చెప్పినాఁడు గాని అవి సమయమునకు అక్కఱకు రాలేదు.

నీవిలాసము మూలముగా ఇంద్రుఁడు గురూపదేశమునుం గూడ మఱచి కామునికి లోనైనాఁ డని తా. గురూపదేశముకన్న నీసౌందర్యమే బలీయ మాయె నని భా.

'మధుప - క్వణనంబు'—మధుపములు ఝంఝంఝ మ్మని మ్రోయునవి గాన ఆమ్రోఁతయే అల్లెటంకార మనుట. 'చెవుడ్పడక'—టంకారము బలిష్ఠముగాను అవిరతముగాను చేసినాఁ డనుట. 'గీష్పతి - నీతిశాస్త్రముల్'-బృహస్పతి ఇంద్రునిఁగూర్చి చెప్పినట్టి నీతిశాస్త్ర విశేషమునకు నీతిసార మని నామము, అదియే చాణక్యనీతిసంగ్రహమునకు మూలము, ఆనీతిసారము గరుడపురాణములో ఎనిమిదియధ్యాయముల గ్రంథముగా నున్నది. పా. 'ఏమి చెప్పె నఁట'

నీతిశాస్త్రోపదేశరూప మైనపుష్కలకారణ మున్నను ఇంద్రియజయము లేమి విశేషోక్తి.

తే. చెలువ జంభారి యాసకుఁ గొలఁది యేది? **(8-70)**
తా సహస్రాక్షుఁ డై యుండి దైన్యవృత్తి
నభిలషించుచు నున్నవాఁ డాత్మలోనఁ
జంచలం బైన నీకటాక్షాంచలంబు. **29**

... కొలఁది = మితి. ఆత్మలోనక=మనస్సులో, చంచలంబు=స్వభావ చపల మనుట(చపలతాకారణముననే ఆతనిపై స్థిరముగా నెలకొనని దైనను అనుటయు, స్థిర మైన నింక నెంతగా అపేక్షించునో అనుటయు, చంచలతా సౌభాగ్యముచేతనే అపేక్షించుట యని వాస్తవంబును.) కటాక్ష అంచలంబుక=కడకంటి చూడ్కి కొనను ('కటాక్షోఽపాఙ్గదర్శనే' అమ.)- ప్రథమపాదార్థము కడమ పాదములయర్థమునకుం గారణము గావున వా. హే. కావ్యలింగము.

[కటాక్షము నేత్రములో మూఁడవభాగము; ఉదా. (ఛాయ) కర్పూర.—

'యే తయా తీక్ష్ణచలచక్షుస్త్రిభాగదృష్టా! స్తే కామ చన్ద్ర మధు పఞ్చమ మారణీయాః,
యేషు పున ర్నిపతితా సకలాఽపి దృష్టి! ర్వర్తన్తే తే తిలజలాఞ్జలిదానయోగ్యాః.'

'హంసీం కుఙ్కుమ పఙ్క పిఞ్జర తనుం కృత్వా య ద్వాఞ్ఛిత
స్తద్భర్తా కిల చక్రవాకగృహి ణ్యే షేతి మన్యమానః;
ఏత త్తన్మమ దుష్కృతం పరిణతం దుఃఖానాం శిక్షకమ్,
ఏక స్యాఽపి న యాని యేన విషయం దృష్టిత్రిభాగ స్యాపి.'

'దృష్టిత్రిభాగలోభా ర్తిమ్' అని ప్రకృతపద్యమూలమందును - 'దృష్టేః త్రిభాగః తృతీయో భాగః ... కటాక్ష ఇతి భావః' అని మల్లినాథసూరి టీక. దానియంచలము అందులో ఎన్నవభాగమో నుపు

అతిస్వల్పభాగ మన్నమాట. వేయికన్నులు కలవాఁడు ఒకకంటి మూఁడవభాగములో నొకయత్యంత సూక్ష్మాంశము నపేక్షించుట మహాలోభ మని హృదయము.]

క. ఏవేల్పు సోమపీథులు । సేవింతురు, ముఖ్యతనువు శివునకు నేవే (8-71)
ల్పేవేల్పు వెలుఁగులకు గని । యావేలుపు నిను వరింప నాకాంక్షించెన్.

ఏవేల్పున్=ఏ (యగ్ని) దేవుని, సోమ పీథులు = సోమ రస పానము కలవారు - సోమయాగమున సోమరసముం ద్రాగుయజమానులు-సోమయాజు లనుట; ... శివునకు ముఖ్యతనువు-శివుఁడు అష్టమూర్తి – 'భూ తార్క- చన్ద్రి యజ్వానో మూర్తయోఽష్టౌ హి ధూర్జటేః' అను వచనముచేత పంచభూతములును సూర్య చంద్ర యజమానులును శివుని యష్టతనువులు. అందులో 'అగ్ని ర్మూర్ధా దివః కకుద్' 'అగ్ని ర్వై తు ప్రథమో దేవతానామ్' ఇత్యాదిశ్రుతులచేత దేవతాప్రముఖుఁ డగుటచేత అగ్నికి ముఖ్యతనుత్వము. ... — అగ్ని దేవుఁడు నిన్ను వలచియున్నాఁడని తా. ఇచట వేల్పువిశేషణములను అత్యంతమహనీయుఁడు వరణీయతముఁ డని భా.— ఇట అగ్ని యనెడు గమ్యమును అగ్నినామమునం జెప్పక భంగ్యంతరమునం జెప్పుటచేత పర్యాయోక్తాలంకారము. 30

ఉ. స్థాణుని లోచనాంచలము దాపుగఁ దీవ్రత రార్చులన్ నిజ (8-78)
ప్రాణముఁ గొన్న నాఁటి పగ యాత్మఁ దలంచియొ, నీ కటాక్షదృ
క్కోణము ప్రాపున స్మరుఁడు గోల్కొని పంత మెలర్పఁగాఁ గొనెన్
బాణ ద శార్ధ పాతమునఁ బావకు భూరి మనోభిమానమున్. 31

స్మరుఁడు = మన్మథుఁడు, (పూర్వము అగ్ని దేవుఁడు), స్థాణుని లోచన అంచలము = రుద్రునియొక్క ('స్థాణుః కీలే హరే పుమాన్। అస్త్రీ ధ్రువే' మేది.) (నుదుటి) కంటియొక్క కొన, దాపుగన్=అండగా (ముక్కంటి నుదుటికంటిని అండగొని యనుట), తీవ్రతర అర్చులన్=కడు గాటము లయిన('తీవ్రైకాన్త నితాన్తాని గాఢబాఢదృఢాని చ' అమ.)జ్వాలలచేత ('వహ్నే ర్ద్వయో ర్జ్వాలకీలా వర్చి ర్హేతిః శిఖా స్త్రియామ్' అమ.), నిజప్రాణమున్ = తన దైన (మదుని దైన) ఉసురును, కొన్న ... గన్ = హరించిన యప్పటి కసిని, ఆత్మన్ = మనస్సులో, తలంచియో= స్మరించి యేమో (ఇప్పుడు) నీ - కటాక్ష దృక్ కోణము ప్రాపునన్=కడకంటి చూపుయొక్క కొనయొక్క

('కోణో వాద్యప్రభేదే స్యా ద్వీణాదీనాం చ వాదనే
ఏకదేశే గృహాదీనా మశ్రౌ చ లగుడేఽపి చ.' మేది.)

ఆశ్రయముచేత (=ఆసరాచేత), కోల్కొని = బలముచెంది, పంతము ఎలర్పఁగాన్ = ప్రతిజ్ఞ మీఱఁగా, పావకు భూరి (మనః) అభిమానమున్ = అగ్నియొక్క గొప్ప (మనస్సునందలి)యహంకారమును ('గర్వోఽభిమానోఽహంకారః' అమ.), బాణ దశ అర్ధ పాతమునన్ = బాణములు ఐదింటి ప్రయోగముచేత (దశ పది - అందులో అర్ధము ఐదు), కొనెన్ = హరించెను.

పూర్వము అగ్ని దేవుఁడు ముక్కంటిమూఁడవకంటిని ఆసరా చేసికొని మదనుని దహించి ప్రాణము హరించెనుగదా. ఆపగను స్మరించి కాఁబోలు ఇప్పుడు మదనుఁడు ప్రతిజ్ఞ మీఱ నీ కడకంటి చూపుకొనను ఆసరా చేసికొని అగ్నిని బల్లిదుఁడై ఏ నమ్ములతోను పొగరణఁచుచు

న్నాఁడు.—దమయంతీ కటాక్ష వీక్షణముచేత అగ్ని ఆమెనుగూర్చి అత్యంత మదనతాపముం బొంది ప్రాణమును సైఁపలే కున్నాఁ డని భా.— హేతూత్ప్రేక్ష.

'తీవ్రత రార్చులక్'—అగ్నియొక్క అర్చులు ఆఱు నొకటి - 'జ్వాలా జిహ్వుఁ డ'నియు 'సప్తజిహ్వుఁ డ'నియు అగ్నికి నామాంతరములు; ఆ యర్చుల నామములు:—

'కాళీ కరాళీ చ మనోజవా చ సులోహితా చైవ సుధూమ్రవర్ణా

ఉగ్రా ప్రదీప్తా చ కృపీటయోనేః సప్తైవ కీలాః కథితా శ్చ జిహ్వాః.'

ఏడు జ్వాలలతో ఆతఁడు తన్ను పెట్టిన పాటుకన్న నెక్కుడు పాటును అయిదు పూబాణములతో ఆతనిం దాను బెట్టుటయే 'పంత మెలర్చుట.' అతనికి స్థాణునిలోచనాంచలము ప్రాపు, తనకు అబలానేత్రకోణము ప్రాపు అను భేదంబును 'పంతము'లో చేరినదే. తాను పెట్టిన యెక్కుడు పాటేమి యనిన - అతఁడు తన ప్రాణము హరించినాఁడు, తాను ఆతని మానమును హరించినాఁడు:—

'ప్రాణా నపి పరిత్యజ్య మాన మే వాభిరక్షతు,

ప్రాణా స్తరఙ్గచపలా మాన మాచన్ద్రతారకమ్.'

తే. ఉవిద, సోమ రసం బన్న నోకిలించు, (8-74)

నడిచిపడు నాజ్య హోమా మం త్రాహుతులకు,

నిచ్చ సేయఁడు మనములో నిధ్మములకుఁ,

బావకుండు నేఁ డెల్లి నీపై విరాళి. 32

ఉవిద, పావకుండు = అగ్ని, నీపై = నీమీఁది - విరాళిక్ = బాళిచేత, నేఁడు ఎల్లి = నేఁటి ఱేపటిలో, సోమ రసంబు = సోమలతా ద్రవము, అన్నక్ = అనిన (ఆ పేరు విన్న మాత్రానకే), ఓకిలించుక్ = ఓకరించును (రోఁత పడు ననుట), ఆజ్య హోమ మంత్ర ఆహుతులకు = వేలిమి మంత్రములచే హోమము లయిన నేతి వేలుములకు, అడిచి పడుక్ = మండి పడును (వాని నొల్లఁ డనుట), మనములోక్, ఇధ్మములకుక్=సమిధలకు, ('ఇన్ధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్ స్త్రియామ్' అమ.), ఇచ్చ సేయఁడు = కోర్కి వహింపఁడు.

'నీపైవిరాళిక్' - అధరామృతరసమును గ్రోలను మృదుమధురోక్తులు వినను కోమలాంగం బుల నాలింగనంబు సేయను- ఈచెప్పిన కోరికలే ఆ విరాళికి వివరము. ఈవిరాళిచేత పైయాప్సితముల తోడి వైసాదృశ్యదోషంబునంజేసి క్రమముగా సోమరసమును ఆజ్యాహుతులను సమిధలను ఒల్ల మి- నిన్నుఁగోరినట్టి యావేల్పునకు వీని నొసంగుట అన్నము కోరినవానికి సున్నము పెట్టుటగా నున్నది. ఈచెప్పిన సోమరసాదులు ఆతని యాహారము; వానినొల్లమిచేత అన్న ద్వేషావస్థ చెప్పఁబడినది. ఈ యవస్థ ఆముక్తమాల్యదలో పుష్పలాలికావర్ణనలో ని ట్లున్నది:—

'కడి వోదు నా కిమ్మ పడఁతి, యీగేదంగి ననఁ గడివోమి ముందఱికేఁ జూడు.'

మదనబాణపంచకములో అశోక కుసుమంపుఁ గార్యముగా ఈయవస్థ 'కూ డుడిగించు నశోకము' ఇత్యాదికారిక యందుఁ జెప్పఁబడినది. 'ఓకిలించుక్'-అన్న ద్వేషవ్యాధి లక్షణము-సోమరసము ద్రవ ద్రవ్యము గాన అగ్నిలో దానిం బోయుటచే ఓకిలించుటవంటి శబ్దంబు కలుగును. 'అడిచిపడుక్'- ఆజ్యహోమముచే జ్వాల తటాలున నెగయుటయు,ఇధ్మములు వైచిన నొకప్పుడు వెంటనే అంటు కొనక ఉండుటయు, ఒకప్పుడు పొగయుచు మాత్రి ముంచుటయు, అనుభవసిద్ధములు. ఈవిశేష

ములు విరాళివలని యాహారద్వేష చిహ్నములుగా నుపన్యస్తములు. ఈ సోమరసాది ద్వేషరూప కార్యోపన్యాసముచేత తత్కారణ మయిన విరాళియొక్క యుత్కర్షయు దానిచే దమయంతీ సౌభాగ్యాతిశయంబును నిరూపితములు.—నీకై ఇట్టిదురవస్థం జెందినాఁడు, నీవు దయసేయుఁడు, ఈతని వరించి రక్షింపుము, అని ఉపన్యాసహృదయము.—సంబంధాతిశయోక్తి.

తే. తరుణి, యాత్మ ప్రతాప సంతప్తుఁ జేసి (8-72)
'పుష్పనారాచుఁ డగ్నికి బుద్ధి సెప్పె,
'నాత్మవ త్సర్వ భూతాని' యనెడు నీతి
నన్య తాపంబు శిఖి మానునట్లుగాఁగ. 33

ఓతరుణీ, శిఖి = అగ్నిదేవుఁడు ('శిఖావా నాశుశుక్షణిః' అమ.), సర్వ భూతాని = ఎల్ల ప్రాణులును, ఆత్మవత్ =తనవలెనే, అనెడు - నీతిన్ = నీతిచేత (ఆనీతిని స్వానుభవముచేత అగ్నిదేవుఁడు గ్రహించి), అన్య తాపంబు మానునట్లుగాఁగన్ =ఇతరులను వేఁపక యుండుటకై, పుష్ప నారాచుఁడు = పూవుటమ్ములవాఁడు, ఆత్మ ప్రతాప సం తప్తున్ = తన తేజముచేత మెండుగా కాలినవానిని - చేసి (కాలిచి యనుట), అగ్నికిన్, బుద్ధి సెప్పెన్ = సద్వర్తనోపదేశము చేసినాఁడు.— నీతోడి విరహముచే డీల్పడియున్న యగ్నిని కాముఁడు అత్యుత్కటముగా గ్రాఁచుచున్నాఁ డని భా.—ఉత్ప్రేక్ష.

క. కుసుమాయుధు బాణంబులఁ। గసుగంది భవ ద్వియోగ కలుషత నర్చా
వసరంబుల నర్చకు లిడు। కుసుమములకు వెఱచు వహ్ని కువలయనేత్రా.

కువలయ నేత్రా = ఓ కలువ కంటీ, వహ్ని = అగ్నిదేవుఁడు, భవత్ వియోగ కలుషతన్ =నీతోడి యెడఁబాపుచేతఁ గలిగిన (చిత్త) కాలుష్యము కారణంబుగా (వెఱచుటకు విశేషణము), కుసుమాయుధు బాణంబులన్ = మదనుని (పుష్ప) బాణములచేత, కసుగంది = మిక్కిలి వాడినవాఁడై, అర్చా సమయంబులన్ =పూజా వేళలయందు, అర్చకులు = పూజించువారు, ఇడు కుసుమములకున్ = సమర్పించెడు పుష్పములకు సయితము, వెఱచున్ = భయపడును.—పూజా కుసుమములు మదనబాణకుసుమము లని భ్రమపడుటచేత భ్రాంత్యలంకారము. (8-75) 34

ఉ. బాలిక, నీవు హేతువుగ భానుకులాభరణంబు దక్షిణం (8-77)
బేలెడు రాజు ధర్మముల కెల్లను గందువ ధర్మరాజు లో
దాలి మనోభవాగ్నిఁ దనతాలిమి నాహుతిగాఁ గ్రమంబునన్
వేలుచుచున్న వాఁ డభినివిష్ట సుఖైక ఫలాభికాంక్షి యై. 35

ఓబాలికా, నీవు హేతువుగన్ (నిన్ను వలచి), భాను కుల ఆభరణంబు = సూర్యుని వంశమునకు అలంకార మైనవాఁడును (యముఁడు సూర్యపుత్త్రుఁడు గాన నట్లు చెప్పుట), దక్షి...జు= దక్షిణ దిక్కునకు పాలకుఁడు, ధర్మముల కెల్లను=వేదశాస్త్రోక్తవిధుల కన్నిటికిని ['(త్రయీ) ధర్మస్తు తద్విధిః' అమ.] కందువ = సంకేతస్థానమును [మృతుల నెల్ల ధర్మముప్రకారము దండింపవలసినవాఁడు గావున ధర్మముల నెల్ల నెఱింగి జరుపుచున్న వాఁడును], అగు - ధర్మరాజు = యముఁడు ('ధర్మరాజః పితృపతిః' అమ.), అభి ... యై - అభినివిష్ట = (తన మనస్సునకు) తగులుకొన్న

సుఖ=సౌఖ్య మనెడి - ఏక = ముఖ్య మయిన ('ఏకే ము ఖ్యాన్య కేవలాః' అమ.) - ఫల = ప్రయోజనమును - అభికాంక్షి రై = కోరినవాఁడై, లో దాలిన్ = హృదయ కుండములో

('ప్రాగుదక్ప్లవనాం భూమిం కారయే ద్యత్నతో నరః.' మాత్స్య్.
'సర్వాధికారికం కుణ్డం చతురస్రం తు సర్వదమ్.' వసిష్ఠ.
'సహస్రే త్వథ హోతవ్యే కుర్యాత్ కుణ్డం కరాత్మకం,
ద్విహస్త మయుతే త చ్చ లక్షహోమే చతుష్కరమ్.' యామళము.

అని కుండవిధానక్రమము), మనోభవ అగ్నిన్=వలరాచ చిచ్చునందు, తన-తాలిమిన్=ధైర్యమును (ఇంద్రియ నిగ్రహమును), ఆహుతి గాన్ = హవిస్సు గా, క్రమంబునన్=ఓయన, వేలుచుచున్న వాఁడు = హోమము చేయుచున్నాఁడు.

మహనీయుఁడు సూర్యపుత్త్రుఁడు నగు యమధర్మరాజు నీపొందును వరముగాఁ బడయుటకై నిజహృదయకుండములో మదనతాప మనెడి యగ్నిలో తనతాలిమి యనెడి హవిస్సును వేల్చుచున్నాఁడు. ఆతనికి అవర మొసంగుము అనుట. నిన్నుఁ గోరి ధైర్యముం గోలుపోయి వలరాచ కాఁకం బడి దీనుఁ డై యున్నాఁడు; అతని వరించి కావుము అని భా.—రూపకము.

క. చండ జ్వర జర్జరమును । బాండురమును నైన మేను బాలిక, తాల్చెన్
దండధరుఁ డిపుడు సుమనః । కాండౌజః కీర్తి భార కలితుఁడ పోలెన్. 36

ఓ బాలిక, ఇపుడు, దండధరుఁడు = కాలుఁడు ('కాలో దణ్డధరః శ్రాద్ధదేవో వైవస్వతోఽన్తకః' అమ.), సుమ ... పోలెన్ = సుమనః కాండ = పువ్వు బాణునియొక్క ('స్త్రియః సుమనసః పుష్పమ్,' 'కాణ్డోఽస్త్రీ దణ్డ బా ణార్వ వ ర్గావసర వారిషు' అమ.) - ఓజః = ప్రతాపముయొక్కయు ('ఓజో దీప్తా వవష్టమ్భే ప్రకాశబలయో రపి' మేది.) - కీర్తి = యశస్సుయొక్కయు - భార=మొత్తములచే - కలితుఁడ పోలెన్ = ఆవృతుఁడే యనునట్లుగా ('కలిః కామధేనుః'), చండ జ్వర జర్జరమున్ = తీవ్ర మయిన తాపముచే సోలినదియు, పాండురమున్ = పాలినదియు, ఐన - మేను = దేహమును, తాల్చెన్ = ధరించియున్నాఁడు.

జ్వరము ఓజస్సుయొక్క కార్యము, పాండిమ కీర్తికార్యము; ఈక్రమ మున్నందున నిట యథాసంఖ్యాలంకారము ఉత్ప్రేక్షకు అంగ మై యున్నది. ప్రతాపము వేఁడియు కీర్తి తెలుపును అని కవిసమయము. (8-79)

క. బిసరుహాలోచన, సంధ్యా । ఘుసృణ సమాలంభ కర్మ కుతు కారంభ
వ్యసన సముజ్జృంభిత యగు । దెస నేలెడురాజు నిను మదిం గామించెన్.

బిసరుహాలోచన = ఓ సారసాక్షీ, సం ... త - సంధ్యా = సంజయందు - ఘుసృణ = కుంకుమచేతనైన ('కుఙ్కుమం పీతకా వేరం ఘుసృణం కుసుమాత్మకమ్' హారావళి) - సమాలంభ కర్మ = విలేపన వ్యాపారముయొక్క ('సమాలమ్భో విలేపనమ్' అమ.) - కుతుక = కౌతూహలముతోడి - ఆరంభ = ఉపక్రమ మందలి - వ్యసన = ఆసక్తిచేత - సముజ్జృంభిత = విలసిల్లినది (తుదిసంజ కెంజాయచేత కుంకుమపైపూఁతఁ దాల్చినదియుం బోలె కానిపించుచున్నట్టిది), అగు - దెసన్ = పడమటిదిక్కును, ఏలెడు రాజు = పాలించు దొర యగు వరుణుఁడు,

నినుఁ, మదిఁ = మనస్సులో (మన స్సార ననుట), కామించెఁ = వలచియున్నాఁడు.— పర్యాయోక్తాలంకారము. (8-80)

మూలములో పడమర అని తెలుపుటకు 'సాయమ్' శబ్దము ప్రయుక్తము ; ఇందు సాయం ప్రాత రుభయ వాచక మయిన సంధ్యాశబ్దముచేత సందిగ్ధార్థత కనఁబడుచున్నది. కావున 'సాయం ఘుస్సృణ' అని పఠించిన సరిపడును. 'నిను మదిఁ' - 'నిన్ను ధృతిఁ' అని పా. - ధృతిఁ= సంతోషముతో ('ధృతి ర్న్వైష్టౌ స్త్రియాం తుష్టౌ యోగభిద్ ధైర్యధారణే' మేది.) 37

క. మదిరాక్షి, జలధి నశ్వా। వద నోత్థిత మైన హవ్యవాహము పోలెన్
హృదయ స్థాన స్థిత మగు। మదనానల మంబురాజుమద మణఁగించెన్.-38

మదిరాక్షి - మదిర = మదింపఁజేయునదైన (వీనిచేత మదింతురు అని కరణార్థక వ్యు.)- అక్షి = నేత్రములుగలదానా, జలధిఁ = సముద్రమును, అ...ము - అశ్వా = గోడిగయొక్క ('వా మ్యశ్వా బడబా' అమ.) - వదన=ముఖమునుండి ('వ క్త్రాస్య వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్' అమ.) - ఉత్థము = వెలువడునట్టిది - ఐన - హవ్యవాహము=అగ్నియే ('హిరణ్యరేతా హుతభుగ్ దహనో హవ్యవాహనః' అమ. - బడబానలమే)- పోలెఁ = ఎట్లో అట్లే, హృదయ స్థాన స్థితము = మనస్సనెడి ప్రదేశమందు ఉన్నట్టిది - అగు - మదన అనలము = కామ వహ్ని, అంబురాజుఁ = వరుణుని, మద మణఁగించెఁ = పొగ రణఁచెను.—బడబానలము సముద్రుని పీల్చినట్లు కామాగ్ని వరుణుని పీల్చుచున్న దని తా. పడరాని బాములు నీకై పడుచున్నాఁడని భా.

ఉపమాలంకారము.— జలధి బడబానన హవ్యవాహంబులతో వరుణ తద్ధృదయ మదనానలములకు వరుసగా బింబ ప్రతిబింబభావము. ఆహవ్యవాహము నిరంతరము జ్వాల లెగసి సముద్రము నిగుర్చుటయు, మదనాగ్ని నిరంతరము ఉద్దీపిత మగుచు వరుణు నిగుర్చుటయు, లోనగు సామ్య విశేషముల నూహించుకొనవచ్చును. (8-81)

'జలధిఁ మద మణఁగించెఁ' - 'అంబురాజుఁ మద మణఁగించెఁ' అను నీప్రయోగము లందు ద్వికర్మకత్వమును 'క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధము గలచో సంబంధి పదంబు షష్ఠికి ద్వితీయ యగు. ఉ. .... నన్ను నతఁడు చెట్టవట్టినఁ.' అని సీతారామాచార్యులవారు ప్రౌ. వ్యా. లో చూపిన మార్గమున సాధింపవచ్చును.

'అశ్వావదనోత్థిత మైన హవ్యవాహము' — మున్ను ముక్కంటి నుదుటికంటి మంట కాముని దహించి లోకముల నెల్ల భస్మీకరించుచుండఁగా బ్రహ్మ దానిని జ్వాలాముఖి యైన బడబనుగా మార్చి సముద్రమందు ఉంచి దానిముఖమునుండి వెలువడు నయ్యగ్నికి సముద్రోదకమును భోజనముగా ప్రళయకాలమువఱకు నియమించెను. — అని కథ కాళికాపురాణమందు చూ.

'జల' 'హవ్యవాహ' - 'అనల' 'అంబు' — ఇందలి విరోధస్ఫూర్తుల నరయునది. మదనునికి అనలసామ్యము తాపకరణముచేత. (8-83)

తే. తరుణి, తద్భుజ మధ్య మధ్యంబునందు
నవ మృణాళిక దండ ఖండంబు మెఱయుఁ
ద న్మనో మగ్న మదనాస్త్ర తతులచేత
నతుణంబ శతచ్ఛిద్ర మైన భంగి. 39

తరుణి = ఓయువతీ, త... దుఁ - తత్ = ఆవరుణునియొక్క - భుజ మధ్య = ఱొమ్ము యొక్క ('న నా క్రోడం భుజాన్తరమ్' అమ.) - మధ్యంబునందుఁ = నడిమియందు, శైత్యోపచారార్థ మై ధరింపఁబడిన) - నవ...బు - నవ = నూతన మైన (వాడనిది సరస మైనది అనుట) - మృణాళిక దండ = తామరతూఁటికాఁడయొక్క - ఖండంబు = తుండెము, తత్... తఁ = ఆతని హృదయములో ('స్వాన్తం హృన్మానసం మనః' అమ.) నాటుకొన్న కామబాణముల సమూహములచేత, అక్షణంబ = క్షణ వ్యవధాన మయిన లే కుండ (తటాలున ననుట), శతచ్ఛిద్రము = నూఱు (అనేక) రంధ్రములు కలది ('ఛిద్రం నిర్వ్యథనం రోకం రన్ధ్రం శ్వభ్రం వపా సుషిః' అమ.), ఐన భంగిఁ = ఆయెనో అనునట్లుగా, మెఱయుఁ = ఒప్పుచున్నది.

సహజ మయిన బహుచ్ఛిద్రతకు మదనాస్త్రప్రవేశమును హేతువుగా నుత్ప్రేక్షించినందున హేతూత్ప్రేక్ష.

బాణమున కొకరంధ్రము చొప్పున క్షణములోపలనే నూఱుబాణము లయినయెడల అహర్నిశము నాటుకొనుచుండు బాణముల సంఖ్యకు మితి లే దనియు, దానివలన ఆతని మదనబాధ అనిర్వచనీయ మనియు, వస్తువు ధ్వనించుచున్నది. తచ్ఛబ్దార్థపరామర్శనీయము లేమిం జేసి 'అక్షణంబ' అను ముద్రణము మందము; మఱియు వ్రాతపుస్తకములయందును ఇట్టి పరామర్శనీయ శబ్దాభావంబున ఇతరఘట్టంబులందును 'అక్షణంబ' యనియే యున్నవి: చూ. 2 ఆ. (44) వచనము తుదిని. — ఉపచరణ త్వరలో త్రుంచినప్పుడు రంధ్రములం జూడ లే దనియు హృదయమం దుంచియు నుంపకముందే ఇన్నిరంధ్రములు గాన నయ్యె ననియు 'నవ' శబ్దస్వారస్యము.

ద్వితీయ పాదమున 'న ండ'లకు; 'అనునాసికాక్షరయతి:—

'అల్లద్రుతంబునకును మధ్యమానునాసి । కములకును జెల్లు ననునాసికయతు లనఁగ
డాపలను బూర్ణములు గల్గుటరడధలును, । తథదధలును గ్రమంబున దానవారి.' అప్ప.

వ. (*a*) ఈచందంబునం ద్రిలోకతిలకు లగు నా దిశావల్లభులు భవ దాయల్లకభరం బను వెల్లి మునుంగం బాఱుచు నెల్లి నీ స్వయంవర మహామహోత్సవం బని విని తపన సంకాశంబు లైనవిమానంబు లెక్కి, యేతదర్థంబున నిజ శుద్ధాంత కాంతాజనంబు విరహ సంతాప భాజనంబుగా, నిశిత నిస్త్రింశ నీకాశం బగు నాకాశంబు డిగ్గి పాదార్పణానుగ్రహంబున మహీమండలంబు కృతార్థంబుగా, నిప్పుడిప్పురంబున కనతిదూరంబున నున్నవారు. (*b*) యదృచ్ఛాగతుం డైన నన్నుం గనుంగొని నామనంబున సందేశాక్షరంబులు వ్రాసి జంగమ లేఖంబు గావించి నీ సకాశంబునకుం బుత్తెంచిరి **(8-89)**. (*c*) కుసుమశర భిల్ల శర శల్య విశల్యౌషధీ వల్లి వగు నిన్నుం బరిష్వంగంబు సేయను **(8-90)**, (*d*) ననంగ లీలా లహరీ తుషారం బగు నీశరీరంబుసోఁకున ననంగ పరితాపం బపనయింపను **(8-92)**, (*e*) నిష్ప్రీత పీతా దర్పంబు లగు నీయంగంబు లపాంగంబులకు లేపం బొనర్పను **(8-93)**, (*f*) ప్రసవనారాచ శరాసన సాతివిభ్రమ భ్రూ విలాసం బగు నీ

ముఖ శ్రీ సముల్లాసంబునకు నుల్లసిల్లను, (*g*) సుమనఃకోదండ చండాల సంస్పృష్టి దోష దూషితు లగు తమ్ము నీ కటాక్ష విక్షేప సాంద్ర చంద్రాతపాలోకంబుల నభిషేకింపను (8-99), (*h*) భవ చ్చరణ కమల సేవాహిత మహత్త్వంబున మద నాపమృత్యు దేవతవలన నిజప్రాణంబులకుం బరిత్రాణంబు గావింపనుం, దలంచుచున్నవారు. కుశలప్రశ్నపూర్వకంబుగా నా గీర్వాణులు నీకుం జెప్పు మనిన పలుకులు గొన్ని గలవు వాని నాకర్ణింపుము. 40

(*a*) త్రిలోక తిలకులు=(స్వర్గ భూమి పాతాళము లనెడి) మూఁడు అవయవములు గలదైన విశ్వమునకు నుదుటిబొట్టులు (విశ్వమందు శ్రేష్ఠు లనుట). భవత్ ఆయల్లక భరంబు = నీ మీఁది యుత్కంఠయొక్క ('ఔత్సుక్యం రణరణ కోత్కణ్ఠే ఆయల్ల కారతీ । హృల్లేఖోత్కలికే చ' హేమ.) తీవ్రత. వెల్లిన్ = వెల్లువయందు. మునుంగం బాఱుచున్ - (పాఱుధాతువు స్వార్థమం దనుప్రయుక్తము.) ఎల్లి= రేపు. తపన సంకాశంబులు = సూర్యునివలె వెలుంగునవి ('తపనః సవితా రవిః,' 'స్యు రుత్తరపదే త్వమీ । నిభ సంకాశ నీకాశ ప్రతీకాశోపమాదయః' అమ. ఈనిభాదిశబ్దములు ఉత్తరపదము లయినప్పుడుమాత్రమే సదృశవాచకములు.) విమానంబులు=ఆకాశయానంబులు (మింటితేరులు - 'వ్యోమయానం విమానోఽస్త్రీ' అమ.) భాజనంబు = పాత్రము. నిశిత నిస్త్రింశ నీకాశంబు=వాఁడి కత్తివలె మిక్కిలి వెలుంగునది (కత్తివంటి దనుట - 'నిశిత క్ష్ణుత శాతాని తేజితే,' 'ఖడ్గే తు నిస్త్రింశ చన్ద్రహాసాసి రిష్టయః' అమ. - నిస్త్రింశాకాశములకు సామ్యము నైల్యమందు, 'నిస్త్రింశోఽయం సజలజలద వ్యోమ సంకాశ నీలః' ముద్రా. 'నిర్గతః త్రింశదోభ్యోఽఙ్గులిభ్యః' ముప్పది యంగుళులు దాఁటినది అని వ్యు.) మహీమండలంబు = భూవలయము. అ నతి దూరంబునన్ = ఎక్కువ దూరము కాని చోట.

(*b*) యదృచ్ఛా ఆగతుండు = (నా) యిచ్చచొప్పున వచ్చిన (వచ్చుచుండిన) వాఁడను. జంగమ లేఖంబున్ = నడ జాబును [రూపకాలంకారము.] సకాశంబునకున్ = సమీపమునకు. పుత్తెంచిరి = పంపినారు.

(*c*) కుసుమ...ల్లివి - కుసుమశర = పూవుటమ్ములవాఁ డనెడి ('శమ్బరారి ర్మనసిజః కుసుమేషు రనన్యజః' అమ.) - భిల్ల = బోయవానియొక్క ('మూలాశ్లేషాదయో భిల్లాః కథ్యన్తే హ్యన్త్యజాతయః' హలాయుధుఁడు.) - శర = బాణములయొక్క - శల్య = అలుఁగునకు - విశల్య = (అలుఁగును) వెలువరించునట్టి - ఓషధీవల్లివి = మందు తీఁగవు [రూపలంకారము.] పరిష్వంగంబు = ఆలింగనము ('పరిరమ్భః పరిష్వఙ్గః సంశ్లేష ఉపగూహనమ్' అమ.)

(*d*) అనంగ లీలా లహరీ తుషారంబు = మదన విలాసంపుఁ బెనుఁగరుళ్లచేత చల్లనిది ('తుషారః శీతలః శీతః' అమ. 'తరఙ్గే భఙ్గ వీ చ్యూర్మి కలికా మహాతి త్వివా । లహా ర్యుల్లోల కల్లోలాః' హేమ.) అంతరంగ=మనస్సులోని (అంగములలోని - అనియు).

(*e*) నిష్ఠీవిత పీతా దర్పంబులు = త్రోఁగఁబడిన పసుపుయొక్క గర్వము కలవి (పసుపుయొక్క వర్ణగర్వము నణఁచినట్టివి, పసుపుకన్న పసిమిమిసిమికలవి - 'పీతం పాసే హారిద్రాయాం స్త్రియాం గౌరేఽభిధేయవత్' మేది.) అపాంగంబులకున్ = కడకన్నులకు ('అపాఙ్గా నే

త్రయో రస్త్రా' అమ.), లేపంబు ఒనర్పన్ = పూఁతపూసికొనుటకు (కన్నుల నద్దుకొనుటకు - చెమ్మ లారఁ జూచుట కనుట.)

(*f*) ప్రసవ...నకున్ = పుష్పబాణుని విండ్లకంటె ('ధను శ్చాపౌ ధన్వ శరాసన కోదణ్డ కార్ముకమ్' అమ.) ఎక్కుడు శోభగలదైన ('అథ విభ్రమః శోభాయాం సంశయే హావే' హేమ.) కనుబొమల విలసనము కలది.

(*g*) సుమనః...తులు = పూవిల్తుఁ డనెడి చండాలుని తాఁకుడు దోషముచే మైలపడిన వారు. నీ - కటా...లన్ = కడకంటి ప్రసారము లనెడి దట్టంపు ('ఘనం నిరన్తరం సాన్ద్రమ్' అమ.) నెల యెండ (వెన్నెల) దీప్తులచేత, అభిషేకింపన్ = స్నానము చేయించుటకును; ['సుమనః...కింపను'—రూపకాలంకారము.]

(*h*) భవ...నన్ = నీయొక్క పాద కమలముల (సేవా=)దాస్యముచేత (ఆహిత=) ఇయ్యఁబడిన ప్రభావంబునం జేసి. అపమృత్యు... = అపకృష్టమృత్యు. పరిత్రాణంబున్ = రక్షణమును.

క. ఆదిత్యుల మగు మాకును। నీ దోర్లతికాయుగంబు నిర్భర సుఖ వ (8-92)
ర్షోదయ కారణ మై సం।పాదించుం గాక తరుణి, పరివేషంబుల్. **41**

(టీ) తరుణీ, ఆదిత్యులము = సూర్యులము (దేవతలము అనియు - 'ఆదిత్యో భాస్కరే దేవేఽపి' మేది.)...నీ - దోస్ లతికా యుగంబు = బాహు వల్లీ ద్వయము, నిర్భ...మై = మిక్కుట మైన సౌఖ్య మనెడి వానయొక్క ప్రాదుర్భావమునకు హేతు వై, పరివేషంబుల్ = గాలిగుడులను(మాటిమాటికి నని బహువచనస్వారస్యము),సంపాదించుం గాక = కల్పించును గావుత.

సూర్యునిచుట్టును గాలిగుడి ఏర్పడినచో వర్షము కురియుట ప్రసిద్ధము.—

'చాష శిఖి రజత తైల క్షీర జలాభః స్వకాల సంభూతః
అవికలవృత్తః స్నిగ్ధః పరివేషః శివ సుభిక్షకరః.'
'వర్ణే నైకేన యదా బహుళః స్నిగ్ధః క్షురాభ్రకాకీర్ణః
స్వర్తౌ సద్యో వర్షం కరోతి, పీత శ్చ దీప్తార్కః.' బృ. సం.

సూర్యునికి గుడికట్టినచో ఎట్లు వర్షము కలుగునో అట్లు మాకు నీ బాహుద్వయ కృతాలింగనము చేత నిర్భరానందము కలుగును గాక - మమ్ము ఆలింగించి సుఖితులంజేయు మనుట. — అందఱ ననుట రసాభాసము గావున మాలో ఒక్కని నని భా.—శ్లేషోత్థాపితరూపకము.

శా. ఔదాసీన్యము నుజ్జగించి విను వాక్యం బస్మదీయంబు; మి (8-94)
థ్యా దోషం బొక యింత లేమి కఖిలాంతర్యామి త్రైలోక్య మ
ర్యాదా స్థాపకుఁ డంగజుండు గుఱీ; యీ యర్థంబు నిక్కంబు; నీ
పాదాంభోజ రజః ప్రసాదములు మా ప్రాణంబు లబ్జాననా. **42**

అబ్జ ఆననా = కమల ముఖీ ('వ క్త్రాస్య వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్' అమ.), ఔదాసీన్యమున్ = తాటస్థ్యమును (ఉపేక్షను అనుట), ఉజ్జగించి=త్యజించి, అస్మదీయంబు= మాదైన, వాక్యంబు = మాటను, వినుము; మిథ్యా దోషంబు = (మా చెప్పఁ బోవు మాటయందు) అనృత దోషము. ('మృషా మిథ్యా చ వితథే' అమ.), ఒక యింత = ఇంచుక యైనను, లేమి

కిఁ = లేనందులకు, అఖిల అంతర్ యామి = ఎల్లవారికిని అంతఃకరణ నియామకుఁడగు (మనో గతము నెఱింగినవాఁడు అనుట; మనోజుఁ డగుటచేత నిది ఘటిల్లును), త్రై...డు = మూఁడు లోకములయొక్క (అనఁగా త్రైలోక్య ప్రాణులయొక్క) స్థితిని (ఉనికిని) నిలుపువాఁడును (మదనుఁడు మిథునములను ఆవేశించి సంతతుల నుత్పాదన సేయింప కున్న త్రైలోక్యము ప్రాణిశూన్య మగును అని భా.), (అయిన) - అంగజుండు = మన్మథుఁడు (అంతరంగమున జనించినవాఁడు అని వ్యు.), గుఱి = సాక్షి; (ఆమాట యే దనిన,) ఈయర్థంబు = ఈ మాచెప్పఁబోవు విషయము, నిక్కంబు = సారాంశము; మా ప్రాణంబులు, నీ - పాద అంభోజ రజః = నీ చరణ కమల పరాగముయొక్క యనుగ్రహములు (త దధీనము లనుట - తత్ప్రజము మాశిరమునకు సోఁక దేని - అనఁగా నీ పాదసేవ మాకు దొరక దేని మా ప్రాణములు నిలువవు అనుట - 'ప్రసాదోఽను గ్రహే కావ్యగుణే స్వాస్థ్యప్రసత్తిషు' మేది.) - మా మనోగతమునకు సాక్షి యైన మనసిజుఁడు నీ మనస్సులోను ఉన్నాఁడు. కాన మామాట నిజమో అబద్ధమో అతని నడిగి తెలిసికొమ్ము అనుట సాక్షిని పేర్కొన్నందుల భా.

శా. మా దివ్యత్వము నీకు నిత్తు మని సంభావింప సిగ్గయ్యెడిన్; (8-103)
వైదర్భీ, భవదీయ రూప విభ వైశ్వర్యంబు మాభూమియం
దేదీ ? దీనికిఁ బ్రత్యయం బిదియ పో, యే మెల్లనుం గూడి నీ
పాదాంభోజము లాశ్రయించెదము తాత్పర్యంబు సంధిల్లఁగన్. 43

వైదర్భీ= ఓదమయంతీ, నీకున్, మా దివ్యత్వము = మాకుం గల దేవతాభావమును, ఇత్తుము అని, సంభావింపన్ = గౌరవించుటకు (లేక - తలంచుటకు), (మాకు), సిగ్గు అయ్యెడిన్ = సిగ్గుగా నున్నది; (ఏల యన), మా భూమియందున్ = మా లోకమందు, భవ...బు=నీదైన సౌందర్య మనెడి ధనముయొక్క ('విభవో ధన నిర్వృత్త్యోః' హేమ.) విభూతి, ఏదీ = ఎక్కడనున్నది (లే దనుట - అమరయువతులయందు లేదు, వారికన్న నీవే అధికురాలవు కావున వారిభావమును నీ కిచ్చెద మనుట మాకు లజ్జాకరముగా నున్న దని భా.) (స్వర్గమందు నీ సాటి లావణ్యవతి లే దనెడి మామాట నమ్మవేని), దీనికిన్ = అచట నీరూపవిభవైశ్వర్యంబు లేమికి, ప్రత్యయము = తార్కాణము, ఇదియ పో = ఇదే సుమా; (ఏ దనఁగా), ఏము ఎల్లనుం గూడి = మే మందఱము ను గలసి, తాత్పర్యంబు = ఆసక్తి ('తత్పరే ప్రసితాసక్తౌ' అమ.) - సంధిల్లఁగన్ = సమకూడఁగా (ఆసక్తితో ననుట), నీ - పాద అంభోరుహములు = కమలములను, ఆశ్రయించెదము= సేవించెదము (ఇట్టి లావణ్యవతి స్వర్గములో నున్నయెడల మాకు స్వాధీనురాలిని దానిని వదలి నీపాదము లేల కొలిచెదము? లే దనుటకు ఇదియే నిదర్శనము.) నీరూపము దివ్యత్వముకన్న నుత్కృష్టము, కావున దివ్యులము మేము దానికై ని న్నాశ్రయించుచున్నాము, అని తా.

మహాస్రగ్ధర.

త్వ దరాళ భ్రూలతా ద్వంద్వమున మదనుఁ డో తన్వి, ధన్విత్వ మొందెం;
ద్వ దుదంచ న్మందహా సోదయము వనిత కందర్పు జైత్రాస్త్రిఁ జేసెం;
ద్వ దపాంగాలోకన శ్రీ తరుణి, మరుని మత్స్యధ్వజుం గా నొనర్చెం;
ద్వ దధీనం బెల్ల సామర్థ్యము రతిపతికిం దామ్రబింబాధరోష్ఠీ. (8-105) 44

ఓతన్వి = ఓలతాంగీ, మదనుఁడు, త్వ...నక్ - (త్వత్ =) నీ యొక్క కుటిల మయిన ('అరాళః కుటిలే సర్జరసే సుమదద న్తిని' విశ్వ.) బొమ తీవల యుగ్మముచేత, ధన్వితృము = విలుకానితనమును, ఒందెన్ (నీబొమలే ఆతనికి ధనువు లయిన వనుట); వనిత = ఓబోటీ, త్వ ... ము = నీయొక్క ఉద్గమించుచున్న లేనగవు ప్రాదుర్భావములు, కందర్పున్ = మన్మథుని, జైత్ర అస్త్రిన్ = జయశీల మయిన యాయుధము కలవానినిగా, చేసెన్ (నీహాసమే ఆతనికి గెలుపుఁ గైదు వయిన దనుట); (ఓ) తరుణి, త్వ...శ్రీ = నీకడకంటి చూపు సొంపు, మరునిన్ = మదనుని, మత్స్య ధ్వజున్ = చేప సిడము వానినిగా - ఒనర్చెన్ (నీకేఁగంటిచూపే ఆతనికి సిడ మయిన దనుట); తామ్ర బింబాధరోష్ఠీ = ఎఱ్ఱని దొండపండువంటి క్రిం దెదవి కలదానా, రతిపతికిన్ = మదనునికి, ఎల్ల సామర్థ్యమున్ = సకల శక్తియు, త్వ దధీనంబు = నీకు ఆయత్తము.

'ఒందెన్' 'చేసెన్' 'ఒనర్చెన్' — అను నీ పదములచే - ఇంతకు పూర్వ మాతని కుండిన ధను రస్త్ర మత్స్య ధ్వజములు ఇంత ప్రశస్తములు గా వనియు త ద్ధను రస్త్ర మత్స్యములకన్న దమయంతీ భ్రూస్మితాపాంగములు ప్రశస్తము లనియు దమయంతీ సౌందర్యము సాధనముగా మదనుఁడు సాధింపనివారు ఎవ్వరు నుండ రనియు భా. విశ్వైకసుందరి యనుట. — రూపకము.

మహాస్రగ్ధర - 'సతతస్సల్ రాగముల్ విశ్రమయుగళి మహాస్రగ్ధరన్ బ్రహ్మ హస్తిన్.'

శా. నీ లావణ్య పయోబ్ధియందు నలరున్ నేత్రాబ్జముల్, నీ మనో **(8-106)**
జ్ఞాలాపంబులయందుఁ గర్ణములు, నీ యాలింగన ప్రక్రియా
కేళిన్ మేనులు, నీ ముఖాస్వదన సక్తి న్నాలుకల్, మాకు, నో
బాలా, స్వప్నసమాగమంబుల నిశా పర్యంత యామంబులన్. 45

బాలా, మాకున్, నిశా పర్యంత యామంబులన్ = రాత్రుల కడపటి జాములందు, స్వప్న సమాగమంబులన్ = కలలవంటి దశావిశేషములలో (నీతో) కూటములయందు, నేత్రాబ్జముల్ = (మా) కనుఁదమ్ములు, నీ - లావణ్య పయోబ్ధియందున్ = కాంతియను పాలసంద్రమందును (పాల సముద్రమునంత దైన నీకాంతియందు), కర్ణములు = వీనులు, నీ - మనోజ్ఞ ఆలాపంబులయందున్ = మనోహర మయిన పలుకులయందును, మేనులు = దేహములు, నీ - ఆలింగన ప్రక్రియా కేళిన్ = కౌఁగిలింతల ప్రకారములయొక్క ('ప్రక్రియా తూత్పాదనే స్యా దధికారప్రకారయోః' హేమ.) క్రీడయందును, నాలుకల్, నీ - ముఖ ఆస్వదన సక్తిన్ = యధరరసముయొక్క క్రోలుటయందలి యాసక్తియందును, అలరున్ = సంతోషించును.

మేము కేవలము త్వన్మయచిత్తుల మగుటచే వేగుజాములందు మాకు నినుం గూడి నీ రూపముం గని నీపలుకులు విని నినుం గౌఁగిలించి యానందించితి మని స్వప్నమువంటి దశావిశేషములు కలుగుచున్నవి.— దేవతలు అస్వప్నులు గావున వారికి స్వప్నసమాగమము లనఁగా ఉన్మాదావస్థా జనితము లైన కూటము లని లక్షణచే గ్రహింపవలయును. నేత్ర కర్ణ దేహ రస నో క్తిచే మాకు నీవే సకలేంద్రియ తర్పిక వని భా. 'రాత్రులన్' - రాత్రులందు విరహబాధ యధికము, కావున నే అపుడు ధ్యానాతిశయముచేత స్వప్న సమాగమ ప్రాప్తిః—

'సవ్యాపారా మహని న తథా పీడయే ద్విప్రయోగః
శఙ్కే రాత్రౌ గురుతరశుచం నిర్వినోదాం సఖీం తే.' మేఘ.

'కార్యాన్తరితోత్కణ్ఠం । దినం మయా నీత మసతిక్రచ్ఛ్రేణ;
అవినోద దీర్ఘయామా । కథం ను రాత్రి ర్గమయితవ్యా.' విక్రమోర్వ.

వ. అని బృందారక చతుష్టయంబు నీకుం జెప్పు మనెం గావున. 46

బృందారక చతుష్టయంబు = దేవతలు నలువురను ('బృన్దారకా దైవతాని పుంసి వా దేవతాః స్త్రియామ్' అమ.)

క. సుర సార్థ వాచిక ప్ర । స్వరిపాటీ విశద రసన పత్తృఁడ నగు న (8-107)
న్నరవిందపత్త్రి లోచన । చరితార్థునిఁ జేయు కార్యసాఫల్యమునన్. 47

అరవింద పత్త్రి లోచన = తామర రేకులవంటి కన్నులు గలదానా, సుర...డన్ = దేవతల సమూహముయొక్క ('సార్థో వణిక్సమూహే స్యా దపి సఙ్ఘాతమాత్రకే' మేది.) సందేశ వాక్కుయొక్క పంక్తుల వరుసచేత నిర్మలమయిన నాలుక యనెడి ('రసనం ధ్వనితే స్వాదే రసజ్ఞా రాస్నయో రపి' హేమ.) కమ్మ (జాబు) కలవాఁడను (వారిసందేశమును తెచ్చినట్టి వాఁడ ననుట), అగు నన్నున్, కార్య సాఫల్యమునన్ = (నేను విన్నవించిన) కార్యముయొక్క సిద్ధిచేత, చరిత అర్థున్ = కృతార్థునిఁగా, చేయుము.

నేను నీకు దేవతలసందేశమును అప్పగించితిని; నీవు వారికార్యమును నెఱవేర్చి నన్ను ధన్యునిఁ జేయుము. 'సుర...డను'—రూపకాలంకారము. 'అర...న' - ఉపమ.

చ. అమరపతి న్వరించెదవొ, హవ్యవహు న్వరణంబొనర్చెదో, (8-108)
శమనునిఁ జెట్ట వట్టెదవొ, సాగరవల్లభుఁ బెండ్లియాడెదో,
ప్రమదము గౌతుకంబు ననురాగము పెంపును సొంపు మీఱఁగాఁ
గమలదళాక్షి, యొక్కరునిఁ గైకొనుమా, యనుమాన మేటికిన్? 48

హవ్యవహున్ = అగ్నిని ('దహనో హవ్యవాహనః' అమ.) శమనునిన్ = యముని ('శమనో యమరా డ్యమః' అమ.) - చెట్ట పట్టెదవొ = వివాహ మగుదువొ (చెట్ట = చేయి). సాగర వల్లభున్ = వరుణుని. అనుమానము = సందేహము. 'శమనునిఁ జెట్టపట్టెదవొ' - ఇందలి ద్వితీయను గతి 38 వ్యాఖ్యలోఁ గనునది.

వ. అనిన విని యయ్యంబుజాక్షి యక్షిభ్రూవ విక్షేప విభ్రమంబున ననాదరంబు దెల్పుచు నలవ్యాకగా దిగీశ సందేశం బాకర్ణించి (9-1) యా రాజ కుమారున కిట్లనియె (9-2). 49

అక్షి ... నన్ = కన్నులయు కనుబొమ్మలయు ప్రసరణంబుచేతను విలాసముచేతను (అక్షులును భ్రూవులును వాని మొత్తము అక్షిభ్రూవము - అక్షుల విక్షేపంబును భ్రూవుల విభ్రమంబు నని క్రమము.) అలవోకగాన్ = యదృచ్ఛగా. దిగీశ సందేశంబు = దిక్పాలకులయొక్క వాచికమును.

తే. ప్రశ్న మొక్కటి, యొక్కటి ప్రతివచనము; (9-3)
యుక్తి యనుకూలమై యుండదు భయమునకు;

నేను నీ వంశ నామంబు లెవ్వి యనిన,
నెవ్వరినొ ప్రస్తుతించితి వింతతడవు. 50

ప్రతివచనము = ఉత్తరము. యుక్తి = కూడిక. ఉభయమునకుఁ = నాప్రశ్నకును నీ యుత్తరమునకును. అనుకూల మై యుండదు = సరిగా నుండ లేదు (నీవు చెప్పినట్టిది నాప్రశ్నకు ఉత్తరము గా దనుట.) వంశ నామంబులు = కులమును పేరును (ద్వంద్వము).ఇంతతడవు = ఇంత సేపు. (తృతీయపాదమున యతికై 'ఏను' అని ఛేదము.)

క. ఒకచోటఁ బ్రకాశించియు । నొకచోట నిగూఢ యగుచు నొదవించెం గా
తుక లక్ష్మి నీసరస్వతి । ప్రకటయు గూఢయును నగుసరస్వతి వోలెన్. 51

నీ - సరస్వతి = వాక్కు ('సరస్వతీ నదీభేదే గోవాగ్దేవతయో ర్గిరి । స్త్రీరత్నే చాపగాయా ఞ్చ' విశ్వ.), ప్రకటయుఁ = (ఒకచోట) అగపడునదియు (ప్రత్యక్ష మయిన జలప్రవాహము కలదియు), గూఢయునుఁ = (మఱియొకచోట) అగపడనిదియు (అంతర్వాహిని యగుటచేత అప్రత్యక్షజలయును), అగు - సరస్వతి పోలెన్ = సరస్వతీనదివలె, ఒక చోటన్ = 'నీవు ఎటనుండి ఎటకు వచ్చితివో?' ఇత్యాది మదీయప్రశ్న భాగములకు, ప్రకాశించియుఁ = ఉత్తరముగాఁ గనఁబడియు, ఒకచోటన్ = 'నీపే రేమి?' ఇత్యాది మదీయప్రశ్న భాగములకు, నిగూఢ = ఉత్తరముగాఁ గనఁబడనిది, అగుచుఁ, కౌతుక లక్ష్మిన్ = కుతూహల సంపదను (నిండు కోరిక ననుట), ఒదవించెన్ = పుట్టించినది. [సరస్వతీనది అంతర్వాహిని - జలము బయటికి కగపడదు.]—ఉపమాలంకారము. (9-4)

తే. అధికతరు లైనఁ గాని దిశాధిపతులు, (9-5)
కౌతుకము నాకు నీవంశకథలయందె,
దప్పి గొన్నట్టి వారి కా దప్పి దీఱ
సలిలపూరంబు హితవొ? యాజ్యంబు హితవొ? 52

దిశా అధిపతులు = దిక్పాలకులు, అధికతరులు ఐనఁగాని = కడుగొప్పవా రయినప్పటికి, నాకున్, నీవంశకథలయందె = నీకులచరిత్రములందే, కౌతుకము = కోరిక ('కౌతుకం త్వభిలాషే స్యా దుత్సవే నర్మహర్ష యోః' మేది.), (కల దని శేషము;) దప్పి = నీరువట్టు (=తృష్ణ), ... సలిల పూరంబు = నీటి మొత్తము ('పూరో జలసమూహే స్యా ద్వ్రణసంశుద్ధి ఖాద్యయోః.' మేది.), హితవొ = హితమొ ('హిత'మునకు వైకృతము 'హితవు' - రూ. ఇతవు), ఆజ్యంబు = నేయి ...

దిక్పాలురు గొప్పవారే అయినను నాకు వారిచరిత్రమును వినుటకు అభిలాష లేదు; నీ కుల వృత్తాంతము వినుటకే అభిలాష కలదు. నేయి యుత్కృష్టమే అయినను దప్పి గొన్న వారికి మంచి నీళ్లచేత దప్పి తీఱును గాని నేతిచేత తీఱదు.—

ఇట దిక్పాలకథా నలవంశకథా దమయంతీ కౌతుకములకును ఆజ్య జలపూర తృష్ణాతుర పిపాసలకును బింబప్రతిబింబభావము:—దృష్టాంతాలంకారము.

'ఐనఁగాని' - అనుటలో అధికతరులే అని నిశ్చయము లే దనియు నభిప్రాయము. 'కథల యందె' - ఏవార్థకమైన యెకారముచేత దిక్పతులకథలయందు కౌతుకము లే దనుటయు - 'కథల

యందు' అను బహువచనముచేత - నీవంశమును గుఱించి ఎంతయేని చెప్పవలయు ననుట

తెలియుచున్నది. ఆజ్యదృష్టాంతము - ఆజ్య పానము నీరువట్టును హెచ్చించును, ఆశ్లేషికావాల వృత్తాంత శ్రవణము నలవంశ కథా శ్రవణ కౌతుకమును హెచ్చించిన దని భా. (అధికబిరుదులు=పెద్ద చెట్లు, వంశ = కుల మనెడివెదురు - అని కొందఱు స్వారస్యములు చెప్పుదురు.)

వ. ఏను జేసినప్రశ్నంబునకు నుత్తరంబు నీమీఁద నప్పె యున్నయది; యిప్పు డైన నాఋణంబుఁ దీర్చుకొనుము; భవాదృశం బైన నాయకరత్నంబు నేవంశంబు భరించె? నేవర్ణంబులు నీ పుణ్యనామంబునకుం బ్రకాశకంబు లైన యవి (9-6)? యని పరిమితంబుగాఁ బలికి కుండినన రేంద్రనందన యూరకుండు టయు; నన్నిషధమండలాధీశ్వరుండు. 53

భవాదృశంబు = నీవంటిది - ఐన - నాయక రత్నంబును = హారమధ్య మణిని (ముత్తెపుఁ జేరులో నడిమి పెద్దముత్తెమును - నీవంటి యుత్తమనాయకుని అనఁగా ఉత్తమనాయకుని నిన్ను- 'నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణా వపి' మేది.) ఏవంశంబు=ఏ వెదురు (ఏకులము - 'వంశః పుంసి కులే వేణౌ పృష్ఠావయవ వర్గయోః' మేది.), భరించెన్ — 'వెదురున నాయకమణి యగు ముత్తెము పుట్టినట్లు ఏకులములో నాయకోత్తముఁడవు నీవు జన్మించితివి?' అనిప్రశ్న. [వెదురులో ముత్తెములు పుట్టును:—

'కరీన్ద్ర జీమూత వరాహ శఙ్ఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం తు శుక్త్యుద్భవ మేవ భూరి.'
'కర్పూర స్ఫటిక నిభం చిపిటం విషమం చ వేణుజం జ్ఞేయమ్,
శఙ్ఖ తిమి వేణు వారణ వరాహ భుజగాభ్రజా న్యవేధ్యాని,
అమితగుణత్వా చ్చైషా మర్ఘః శాస్త్రే న నిర్దిష్టః.' బృ. సం.

'భవాదృశం...భరించెన్' - ప్రకృతాప్రకృతగత శ్లేష; రాజును కులంబును ప్రకృతములు, ముత్తెంబును వేణువును అప్రకృతములు.] వర్ణంబులు = అక్షరములు. ప్రకాశకంబులు = తెలుపునట్టివి.

ఉ. తామరసాక్షి, వంశకథ దవ్వుల నుండఁగ నిమ్ము; చెప్పఁగాఁ; (9-10)
దేమిటి కన్న, నైజ మగు హీనత గల్గినఁ జెప్ప టొచ్చె; ము
ద్దామత గల్గె నేని యుచితం బయి యుండదు సెప్పికొంట, నేఁ
డీ మెయిఁ బ్రేష్యభావము వహించి నికృష్టత నేఁగుదెంచుటన్. 54

దవ్వులన్ = దూరమున. కాదు = కూడదు. నైజము = తగినది. హీనత = నికృష్టత-దోష మనుట. ఒచ్చెము = అవమానము. ఈమెయిన్ = ఈవిధముగా. ప్రేష్యభావము = కింకరత్వమును ('నియోజ్య కింకర ప్రైష్య భుజిష్య పరిచారకాః' అమ.) నికృష్టతన్ = అధమత్వముతో ('నికృష్ట ప్రతికృష్టార్వ రేఫ యాప్యావ మాధమాః' అమ.) ఏఁగుదెంచుటన్ = వచ్చితిని గావున. ఉద్దామత=గొప్పతనము. ... చెప్పికొంట, ఉచితంబు అయి ఉండదు = తగదు.

తే. ఇంతమాత్రంబు సెప్పెద నెఱిఁగికొనుము, (9-12)
నృపతికన్యవు గడు మాననీయ వగుట,

మైత్రి కలిసేయఁ దగ; దేను మనుజవిభుఁడ,
రాజ వంశ కరీరుండ రాజవదన. 55

రాజవదన = ఓచంద్రముఖీ. మాననీయవు = గౌరవార్హవు. అగుటన్ = కావున. అలిఁకొలఁత. మనుజవిభుఁడన్ = నృపతిని. రాజ వంశ కరీరుండన్ = రాచ (చంద్ర) కుల మనెడి వెదురుయొక్క మొలకను – శ్లిష్టరూపకము.

ఉ. పే రడుగం దలంచెదవొ? భీమతనూభవ, యావిచారముం (9-13)
దూరము సేయు; మెవ్వరికి దోసము తాఁ దనపేరు సెప్పు; టా
చార పరంపరా స్థితికి శాస్త్రము మూలము; శాస్త్ర చోదితా
చార వివేక హీనుఁ డగు జాల్ముని మెత్తురె పండితోత్తముల్? 56

భీమ తనూభవ = భీమ పుత్త్రీ. ఆ...ము=ఆప్రశ్న మాను. ఆచార పరంపరా స్థితికిన్ = మంచి నడవడియొక్క సంప్రదాయపు నిలుకడకు, ...శాస్త్ర...నిన్ = శాస్త్రమందు విధింపఁబడిన మంచి నడివడియొక్క భేదజ్ఞానము లేని మూర్ఖుని ('జాల్మోఽసమీక్ష్యకారీ స్యాత్' అమ.) మెత్తురె = మెచ్చ రనుట;

'ఆత్మనామ గురో ర్నామ నా మాతికృపణస్య చ
ఆయుష్కామో నగృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్య కళత్రయోః.'

'నామానుకీర్తనం పుంసా మాత్మన శ్చ గురోః స్త్రియాః। దిన మేకం హర త్యాయుః.'

అను స్మృతివాక్యములచేత తన పేరు తాను చెప్పఁగూడదు.—కావ్యలింగము.

'ఎవ్వరికిదోసము' = ఎవ్వరికినిన్ దోసము – ఇట సముచ్చయనువర్ణముచే విభక్తినువర్ణమునకును, 'దా' అను సరళముచే సముచ్చయనువర్ణమునకును లోపములు.

వ. అదియునుం గాక. 57

అదియునున్ గాక = 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' బా. వ్యా. సంధి (20).

క. కువలయనేత్ర, సమక్షవ్యవహారంబునకు యుష్మదస్మత్పదముల్
శ్రవణ శ్రావణయోగ్యము లవుచుండఁగఁ బేరు సెప్ప నడుగఁగ నేలా?

కువలయనేత్ర=ఓకలువకంటీ, సమక్ష వ్యవహారంబునకున్=కన్నుల సమీపమున (ప్రత్యక్షమున) ఒండొరులతో మాట లాడుటకు, యుష్మద్ అస్మద్ పదముల్ = నీవు నేను అనుమాటలు, శ్రవణ శ్రావణ యోగ్యములు = వినుటకును వినిపించుటకును (చెప్పుటకు ననుట) తగినవి, అగుచుండఁగన్, పేరు = నామధేయమును, చెప్ప నేల, అడుగఁగ నేల. (9-9) 58

సీ. అని, శారదం బైన వనమయూరము వ్రాలె (9-14)
నహి తాప కారకుం డతఁడు పలుక,
రాజహంసియుఁ బోలె రమణీలలామంబు ,,
పదములం దనురాగ ముదయ మొంద,

సమయోచితంబుగా సారస్య మొప్పారఁ (9-14)
బలికె నిట్లని మహీపాలుతోడ,
నన్వయం బెఱిఁగించి యభిధాన మెఱిఁగింప (9-15)
కునికి మ మ్మాదరించిన తెఱంగె?
తే. యనఘ, మము నీవు వంచింప నభిలషించె;
దేము నేరమొ వంచింప నిపుడు నిన్నుఁ?
బేరు సెప్పిన నీ కనాచార మేని,
మాకు న్యాయంబె నీతోడ మాటలాడ? 59

అని, శారదంబు = శరత్కాలమందు ఉండునది (శరత్కాలముది), అయిన - వన మయూరము వోలెన్ = అడవి నెమలి వలె, అ...డు - అహిత = శత్రువులకు - అపకారకుండు = చెఱుపు చేయువాఁడు [నెమలిపక్షమున - అహి = పాములకు - తాపకారకము (అని అమహత్తుగా మార్చుకొన వలయును) = (భక్షకముగావున) దుఃఖమును కలిగించునది], (అయిన) - అతఁడు = నలమహారాజు, పలుకన్ = వచించినంతట; 'వన' అనుట గృహములందు 'అహి' ప్రసక్తి లేదు గావున. శారద మయూరకేకతోఁ బోల్చుటచేత రాజు చేయునది లేక నిరుత్సాహుఁ డై ఆ యప్రియోత్తరము పల్కె ననియు ఆతనికంఠస్వరము కూడ ఆయుత్తరమందు సొంపేది యుండె ననియు భా. శరత్కాలమందు మయూరము నిరుత్సాహమును అమధురకంఠమును అగును:—

'హరిమయూరవిభ్రమః - ౦చలఁ జెందెఁ, దటిద్విలాసముల్
తారలఁ జేరెఁ, బుష్పిత కదంబ విజృంభణ సప్తపర్ణ నా
నా రుచిర ప్రసూన భజనం బొనరించె, శరత్సమాగమం
బారయ నంబుదాగమ మహానుహిమోన్నతి నాక్రమించినన్.' విక్ర.
'విహాయ వాఞ్ఛా ముదితే మదాత్యయా। దరక్తకణ్ఠస్య రుతే శిఖణ్డినః
శ్రుతిః శ్రయ త్యున్మదహంస నిస్వనం; । గుణాః ప్రియత్వేఽధికృతా న సంస్తవః.' భారవి.
'తనురుహాణి పురో విజితధ్వనే ర్ధవళపక్ష విహఙ్గమ కూజితైః
జగలు రక్షమయేవ శిఖణ్డినః పరిభవోఽరిభవో హి సుదుస్సహః.' మాఘ.
'కేకఁ ద్ర్యవనతగ్రీవ మై రాక యొక్కిం తార్చి... వెత్తిచూపుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ గేకులుండె.' ఆము.

'అహితాపకారకుండు' - శత్రువులకు తాపము కలిగింపవలసినవాఁడు దయిత యైన దమయంతికి అసదుత్తరముచేత తాపము కలిగించునందులకు నిరుత్సాహుండును గద్గదస్వరుండును నై ఉక్తవన మయూరసామ్యముం జెందినాఁ డని భా.—[ఉపమాలంకారము - సాధారణధర్మము శ్లిష్టము.]

రమణీ లలామంబు = రాములకు భూషణ మయిన యాదమయంతి. రాజహంసియుఁ బోలెన్, పదములందున్ = మాటలయందు (హంసీపక్షమున - అడుగులయందు -
'పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయా పదేశయోః
పాద తచ్చిహ్నయోః స్థాన త్రాణయో రఙ్క్వస్తునోః,' విశ్వ.)

అనురాగము = ప్రేముడి (హం. ఎఱుపు) - ఉదయము ఒందఁగా = జనింపఁగా (రాజహంసలకు చరణము లెఱుపు - 'రాజహంసా స్తు తే చఞ్చుచరణై ర్లోహితై స్సితాః' అమ.);

సమయ ఉచితంబుగాఁగా = అవసరమునకుఁ దగినయట్లుగా (హం. అది వచ్చునట్టి శర త్సమయమున వాడుకరైై యున్న ప్రకారముగా), సారస్యము = సరసత ('సారసత్వము=హంసత్వ ము -'చక్రాఙ్గః సారసో హంసః' శబ్దా.), ఒప్పారఁగా=సొంపొంద, మహీపాలుతోడఁగా = రాజు తో, ఇట్లని = వక్ష్యమాణప్రకారంబున, పలికెఁగా = వచించెను;—[ఉపమాలంకారము—సాధా రణధర్మము శ్లిష్టము.] - రాజహంస్యుపమచేత దమయంతి యుత్సాహముతో మధురతరముగా పలి కిన దని భా. హంసలు శరత్కాలమందే మానుషభూములకు వచ్చును గావునను,

['తాం హంసమాలాః శర దీవ గఙ్గామ్ ... ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః.' కుమా.

'శరది హంసరవాః పరుషీకృతస్వర మయూర మయూ రమణీయతామ్' మాఘ.]

అప్పుడు వానికి శోభోత్సాహకంఠమాధుర్యములు వర్ధమానములు గావునను, ఉపమాసంగతి.

అన్వయంబు =వంశము - ఎఱిఁగించి = తెలిపి ('రాజ వంశ కరీరుండ' నని చెప్పినాఁడు గావున), అభిధానము=పేరు ('ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ చ' అమ.)

అనాచారము - 'ఎవ్వరికి దోసము దాఁ దనపేరు సెప్పుట' అని వచించినాఁడు గావున.

తే. అన్యపురుషులతోడ నెయ్యంపు గోష్ఠి, **(9-16)**
యధిప, మముబోఁటి రాజకన్యలకుఁ దగునె?
యది కులాబలాచార సహాస నాస
హాతి సాహస కౌతూహ లావసథము. 60

నెయ్యంపు గోష్ఠి = స్నేహముతోడి సల్లాపము ('గోష్ఠీ సభా సల్లాపయోః స్త్రియామ్' మేది.) అది = ఆగోష్ఠి, కులా ... ము - కుల అబలా = కులస్త్రీల - ఆచార = నడవడితో - సహా ఆసన = ఏకాసనమునం గూర్చుండుటను - అసహా = ఒప్పనట్టి - అతి సాహస = మెనుఁ దెంపరితనమునందలి - కౌతూహల = కౌతుకమునకు - ఆవసథము = ఇల్లు. — పరపురుషుఁడ వగు నీతో సల్లాపము కులాంగనకు నాకును అనాచారము అని యర్థము.— మునికన్యాదులకు తగును గాన అట్టివారిని వ్యావర్తించుటకు 'రాజ' పదము. అన్యపురుషత్వము రాజకన్యాత్వమును ఉత్తరా ర్ధార్థమును గోష్ఠ్యనర్హతకు కారణములు గావున ప. హే. కావ్యలింగములు రెండు; వా. హే. కా వ్యలింగము ఒకటియు. ఇందు 'మముబోఁటి' ఇత్యాదిచే చెప్పిన సామాన్యము విశేష మయిన దమ యంతీవృత్తమునే బోధించును గాన సామాన్య నిబంధనా ప్రస్తుత ప్రసంశయు.

క. తగవే కులకన్యలకును। మగవారలతోడ రూప మహనీయులతో **(9-16)**
మిగులంగఁ దడవు లోపలి। నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ? 61

నయ తత్త్వ నిధీ - నీతి శాస్త్ర రహస్య నిధానమా - నీతిజ్ఞుఁడవు కావున నాపట్ల నీ పర పురుష గోష్ఠ్యనాచారత నీతివిరుద్ధ మని నీకే తెలియు నని భా. లోపలి నగళులలోఁగా = అంతః పురములలో - పెద్దలు లేనిచోట ననుట.— కులకన్యాత్వమును రూపమహనీయత్వమును సల్లాపము తగమికి హేతువులుగాన ప. హే. కావ్యలింగములు. ఇట కులకన్యాసామాన్యవృత్తాంత[illegible] కన్యావిశేష మయిన దమయంతికి అన్వయింపవలయుం గావున సామాన్యనిబంధనా ప్రస్తు[illegible] ఇవి యంగి, అవి యంగములు.

వ. అనిన విని, ప్రతిబందీరచనాచాతుర్యంబును మనంబునం దభినందించుచుఁ బ్రత్యుత్తరంబు వేఱొండు వెదకి పొడగానక లేక యాలోకోత్తర చరిత్రుండు విదర్భరాజపుత్త్రిం గనుంగొని నేత్రాంచలంబుల నలంతి నవ్వు దొలంకాడ ని ట్లనియె (9-17). 62

ఈఘట్టమందు దమయంతి తనయుత్తరములో స్త్రీస్వభావ సులభ మయిన సమయప్రజ్ఞను చక్కఁగా చూపించినది. - ఆ - లోకోత్తర చరిత్రుఁడు = లోకమునకు పై డయిన నడవడి కల వాఁడు - అ లోక సామాన్య చారిత్రుఁ డనుట. ప్రతి...బును - ప్రతిబందీ (లేక - ప్రతిబంధి) = అనిష్టాంతర ప్రసంజక మయిన వాక్యముయొక్క (అట్టివాక్యమును) - రచనా = కల్పించుటయందు (దమయంతికిఁ గల) - చాతుర్యంబుఁ = నేర్పును, అభినందించుచుఁ = మెచ్చుచు ... నేత్ర అంచలంబులఁ = కనుఁ గొనలందు, అలంతి నవ్వు = లే నగవు, తొలంకాడఁ = తొనఁకు చుండఁగా - కొంచెకొంచెము వెలికి వచ్చుచుండఁగా.

సీ. వామాక్షి మాక్షికస్వాదు పేశల మైన (9-17)
పలు కేల యొరులపైఁ బాఱవైవఁ?
జంద్ర సామృత స్నాన పూతం బైన (9-18)
దృగ్విలాసముఁ జేర్పు దివిజులందు.
సఫలంబు సేయు మత్సమధి కాయాసంబు
నేను జెప్పిన కార్య మిచ్ఛగించి;
దేవతాపతి భక్తిఁ దిరముగా మది నిల్పి
ప్రకట కల్యాణ వైభవము నొందు;
తే. వెలఁది నామీఁదఁ గడుఁ గృపా విలసనంబు
నాటి చూచిన చూపు మన్ననయ చాలు;
నాకుఁగా నుద్ధరింపుము నాకవిభుల;
హాస్తములు మోడ్చి వేఁడెద నాదరమున. 63

నలుఁడు ఆమెవాదము నే అంగీకరించినట్లు నటించుచు పల్కుచున్నాఁడు:—వామ అక్షి = ఓ సుందర నేత్రా (ప్రతిబందిం బలికినందునను - అనంగీకారముగా చూచినందునను - ఓకుటిల కటాక్షా అని యేని), మాక్షి...ము - మాక్షిక = (ఒక దినుసు) తేనెవలె (మక్షికలు చేసినట్టి తేనె అని వ్యు. 'ఘధు. క్షౌద్రమ్ మాక్షికాది' అమ.) - స్వాదు = మధురంబును - పేశలము = మృదువును, ఐన - పలుకు = మాటను (ఉపమాలంకారము), ఒరులపైఁ = ఇంద్రాదులకన్న నితరులపైని (సామాన్యులమీఁద), పాఱవైవ నేల = వ్యర్థముగా వినియోగింపకుము; - 'పాఱ వైవఁ' అనుటచే ఇతరశ్రోతల యనర్హత సూచితము (ఇంద్రాద్యన్యతముని వరించెద నని ఒకపల్కు పల్కుదువేని చాలు, 'పెమ్మట అన్యపురుషుఁడను నీపలుకు విన ననర్హుఁడను నగు నాతో భాషింప నక్కఱ యుం

డదు.—'మాక్షిక' ఇత్యాది విశేషణముచే ఇంద్రాదులకన్న నన్యులు నీవచనముల మాధుర్య మా గ్రహ ములను గ్రహింపఁ జాల రనియు భా.—కావ్యలింగము.

చంచ...బు - చంచత్ = (చలించుచున్న) ప్రవహించుచున్న - రస = రాగమనెడి ('శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే రసః' అమ.) - అమృత=సుధయందు - స్నాన= మజ్జనముచేత-పూతంబు = పవిత్రము ('పవిత్రః ప్రయతః పూతః' అమ. - అనురాగామృతములోఁ దొప్పదోఁగుచున్నట్టిది - (ప్రేమామృతమును వర్షించుచున్నట్టిది), అయిన - దృక్ విలాసము=దృష్టి విభ్రమమును, దివిజులందుఁ = దేవతలయందు (వారిలో నొకనిమీఁద), చేర్పుము = ప్రసరింపఁ జేయుము.— 'పూతంబు' - దేవతలను మడిగా సమీపింపవలయుఁ గావున. 'రసామృత' - రూపకము. 'స్వాదు పేశల మ'ని ప్రథమపాదమందును 'స్నానపేశలమ'ని ఇందును పూర్వముద్రితములు. ఈపాదముయొక్క మూలములో 'రసామృత స్నానపవిత్రయా గిరా' అని యుండుటంబట్టి అన వీకృతమునకు బదులుగా పవిత్రపర్యాయ మయిన పూతశబ్దము స్వీకరింపఁబడినది.

ఏను,...ఇచ్ఛగించి = అంగీకరించి (దివిజులం దొకని వరించి), మత్ సమధిక ఆయా సంబుఁ = నా యొక్కడు శ్రమను, సఫలంబు సేయుము = నెఱవేర్పుము.

దేవతాపతిఁ = ఇంద్రుని, భక్తిఁ = భక్తితో, తిరముగాఁ = స్థిరముగా, ...ప్ర... ముఁ - ప్రకట = ప్రసిద్ధమయిన - కల్యాణ = మంగళముయొక్క ('కల్యాణం హేమ్ని మఙ్గళే' హేమ.) - వైభవముఁ = ఐశ్వర్యమును ('విభవో రై మోక్షైశ్వర్యే' మేది.),ఒందుము.

వెలఁది = ఓయింతీ, ... కృపా విలసనంబు = కరుణయొక్క దీప్తిని, నాటి = గ్రుచ్చి, చూచిన చూపు(చేత నయిన) - మన్నన యు = గారవమే, చాలుఁ =నాకుఁ జాలును (నన్ను కరుణతోఁ చూచితివి, నాపై ఇంకను అధికకరుణ గలిగి నా పేరు ఎట్టింగఁ గోరుచున్నావు, నాకు నీయా కరుణాదృష్టియే చాలును,) నాకుఁగాఁ =నామీఁది యా యధిక కరుణచేత, నాకవిభులఁ = త్రిదివేశ్వరులను, ఉద్ధరింపుము = (మద నాపదనుండి) లేపుము; ఆదరమునఁ = గారవముతో, హస్తములు మోడ్చి = అంజలిచేసి, వేఁడెదఁ = ప్రార్థించుచున్నాను.

తే. ఇందుబింబాస్య, నారాక కెదురు సూచు
నయనములు వేయు విరియించి నాకభర్త;
యుదిలకొనుచున్నవా రార్తి నున్నముగురుఁ;
గాల యాపన సేయఁగాఁ గాదు నీకు. 64

ఇందు బింబ ఆస్య = చంద్ర మండలమువంటి ముఖము గలదానా,...విరియించి=వికసింపఁ జేసికొని,...ఉన్న = కడమ. ఆర్తిఁ = (విరహ) పీడచేత ('ఆర్తిః పీడా ధనుఃకోట్యోః' ...) ఉదిలకొనుచున్నవారు = పరితపించుచున్నారు. (కావున), నీకుఁ = నీవు, కాలయాపన = జరుపుడు, సేయఁగాఁ = చేయుట, కాదు = తగదు.—వెంటనే యనుగ్రహింపుము వారి ప్రాణములు నిలువ వనుట.—వా. హే. కావ్యలింగము.

చ. హరిహాయుఁ డేమి యయ్యె నొకొ యా మదనానల తాప వే...
వరుణుఁడు విప్రయోగమున వాడఁడె యింతకు? దండపాణి ...

విరహా భరంబున న్నిగుల వేఁగఁడె? నొవ్వఁడె వీతిహోత్రుఁడుం
బరిసర కేళి కానన సమాగత మంద సమీరణంబులన్? 65

ఆ మదన అనల తాప వేదనన్ = నేను చూచి వచ్చిన మరు చిచ్చు కాఁక దుఃఖముచేత ('వేదనా జ్ఞాన దుఃఖయోః' మేది.), హరిహయుఁడు = ఇంద్రుఁడు ('జమ్భభేదీ హరిహయః స్వారాణ్ణముచిసూదనః' అమ.),... ఇంతకున్ = ఇప్పటికి, ... విప్రయోగమునన్ = నీతోడియెడఁబాపుచేత, వాడఁడె = వడలిపోఁడా. దండపాణి = యముఁడు, తాన్, విరహ భరంబునన్ = విర హాతిశయముచేత ('అతిశయో భరః' అమ.),... వీతిహోత్రుఁడున్ = అగ్నియు ('వీతిహోత్రోఽనలేఽర్కే చ మేది.'), పరి ... లన్ = ఆచుట్టుప్రక్కలనుండు ('పర్యన్తభూః పరిసరః' అమ.) క్రీడా వనమునుండి వచ్చిన సోమరి గాడ్పులచేత, నొవ్వఁడె = బాధపడఁడా (మంద మారుతము అగ్నికి చెలి యయ్యును విరహోద్దీపకము గాన ఇప్పుడు అగ్నిని బాధించు ననుట.)

చతుర్థపాదమున బిందుయతి.

వ. అనిన విదర్భరాజకన్యక యా రాజకుమారున కిట్లనియె. 66

తే. అలఁతి నవ్వు ప్రగల్భ తాహంకరణము, (9-25)
కాదు కా దంట వాచా విగర్హణంబు,
పలుక కుంట తిరస్కార కలన ముద్ర,
గానఁ బ్రత్యుత్తరం బిచ్చుదాన నీకు. 67

అలఁతి నవ్వు = మంద స్మితము, ప్రగల్భతా అహంకరణము = ప్రతిభా గర్వము (నీ మాటలు వినఁగా నవ్వు వచ్చుచున్నది, నవ్వుట ప్రజ్ఞాగర్వ మనిపించుకొనును గావున నవ్వఁగూడదని భా. - రూపకము), కాదు కాదు అంట = నీమాటలు సరి కావు సరి కా వని నిషేధించుట, వాచా విగర్హణంబు = నీమాటలను నిందించుట యగును ('కుత్సా నిన్దా చ గర్హణే' అమ.— కావున నిషేధింపనుం గూడదు - రూపకము), (బదు లాడ కుందునా అనిన), పలుకక ఉంట = ఉత్తరము చెప్పక యుండుట, తిర...ద్ర—తిరస్కార = (నిన్ను) అవమానించుట ('అనాదరః పరిభవః పరీభావ స్తిరస్క్రియా' అమ.) అనెడి - కలన = దోషమునకు - ముద్ర=గుఱుతు (కావున బదు లాడ కుండ రాదు - రూపకము),...ఈహేతువుచేత నీకు ఉత్తరము చెప్పుచున్నాను గాని నీరాయబారము ఉత్తరమునకు అర్హ మేమో గాదు; అని భా.

సీ. అమ రాంగనా సంగ మాభిశోభితుఁ డైన (9-27)
హరి కేల మానుషీ పరిచయంబు?
యారకూట కలాప మర్హ మే కలవాని? (9-28)
కే నర్హ నే నిర్జ రేశ్వరునకు?
కామింతునే యేను నై మాని కాధీశు? (9-29)
హా స్త్రీఁ గామించునే హరిణ రమణి?

నఖిలలోకాధీశుఁ డమరేంద్రుఁ డెక్కడ?
నే నెక్కడ వరాటి నెన్ని చూడ?

తే. నలపతివ్రత నైన యేఁ దలఁప నొరునిఁ (9-31)
దివిరి నిందించి యేఁ బ్రస్తుతించి యేని;
నలిన బిస సూత్రమును బురంధ్రుల తలంపు
సమము, త్రెయ్యును లవ చాపలమున నైన. 68

అమ ... డు = దేవ యువతులతోడి సంభోగములచేత వెలుఁగొందుచున్నవాఁడు, ఐన - హారికిన్ = ఇంద్రునికి
('యమానిలేన్ద్ర చన్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు
శుకాహి కపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు.' అమ.),
మానుషీ పరిచయంబు = నర(జాతి) స్త్రీతోడి చెలిమి, ఏల;

కలవానికిన్ = శ్రీమంతునికి, ఆరకూట కలాపము = ఇత్తడి నగ ('రీతిః స్త్రియా మారకూటో న స్త్రియామ్,' 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అమ.), అర్హామే - తగ దనుట, నిర్జరేశ్వరునకున్ = ఇంద్రునికి, ఏను, అర్హానే = తగ ననుట. (మదీ యానర్హతా కారణంబున ఈయోగము చెల్ల దనుట.)

ఏను, వైమానిక అధీశున్ = దేవేంద్రుని (విమానముచేత సంచరించువారు వైమానికులు దేవతలు - 'వ్యోమయానం విమానోఽస్త్రీ' అమ.), కామింతునే - ఒల్ల ననుట, హరిణ రమణి = పెంటి లేడి, హస్తిన్ = ఏనుఁగును, కామించునే - కామింప దనుట.

అఖిల లోక అధీశుఁడు = ఎల్లలోకములకును పెదొర యయిన, అమరేంద్రుఁడు = దేవ రాజు, ఎక్కడ, ఎన్ని చూడన్ = విచారించి కనఁగా, వరాటిన్ = వరాట (దేశరాజ) కన్యను (గవ్వను అనియు), ఏనేడ - (మా కిరువురకును సమత్వము లేనందున 'వివాద శ్చ వివాహశ్చ సమయో రేవ శోభతే' అనుసూక్తిప్రకారము, మాకూడిక శోభిల్ల దనుట.)

నల పతివ్రతన్ = నలుని సాధ్విని ('సతీ సాధ్వీ పతివ్రతా' అమ.), అయిన - ఏన్ = నేను, తివిరి = బుద్ధిపూర్వకముగా, నిం...ని = తెగడి గాని, ప్రస్తుతించి యేని = పొగడి గాని, ఒరునిన్ = నలునికన్న నితరుని (ఎవ్వనిఁగాని), తలఁపన్ = భావింపను. (ఏల యన) నలిన బిస సూత్రమున్ = తామర తూఁటి (లోని) దారమును, పురంధ్రుల మనంబున్ = కుటింబినుల హృదయమును ('స్యాత్తు కుటుమ్బినీ పురన్ధ్రీ' అమ.), సమము = తుల్యములు; లవ చాపలమున నైనన్ = (అన్యపురుష నిందాస్తుతిరూప మయిన)యే పాటి చాంచల్యముచేత నయినను (బిససూత్ర పక్షమున - ఎంతకొంచెము కదలికచేతనైనను, పురంధ్రీపక్షమున - ఎంతమాత్రము ఇతరుని తలంచినను), త్రెయ్యును = తెగిపోవును.

ఇందు ప్రథమపాదమున విషమాలంకారము; శ్రీమత్తదనర్హారకూటకలాపములతో ఇంద్ర తదనర్హదమయంతులకు బింబప్రతిబింబభావము, కావున ద్వితీయ పాదమున దృష్టాంతాలంకారము; తృతీయమున ప్రతివస్తూపమ; చతుర్థమున విషమము; గీతోత్తరార్ధమున ఉపమాలంకారము; 'తలంప ను'కి 'త్రెయ్యుట' హేతువుగాన వా. హే. కావ్యలింగము.

చ. అటు దగునే సురేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోంగనా (9-28)
విటుఁ డొకమర్త్యభామినికి వేడుక సేయుచు నున్నవాఁడు! వి
స్ఫుట బహురత్న భూషణ విభూషితు లయ్యెడు రాచవారికిన్
గటకట! యారకూట కటకంబు రుచించునొ కాక యొక్కెడన్! 69

అఖిల అప్సరః అంగనా విటుఁడు = ఎల్ల యచ్చర పడఁతుల విటకాఁడు. వేడుక సేయుచున్=కోరికపడుచు. రాచవారికిన్=రాజులకు. ఆరకూట కటకంబు = ఇత్తడి కడియము. 'సురేశ్వర' 'అప్సరస్' శబ్దములచేత గుణోత్కర్ష భా. 'మర్త్య'-గుణన్యూనత భా. దృష్టాంతాలంకారము: సురేశ్వరుఁడు ఆతని మర్త్యభామిన్యభిలాష అనురెంటికిని - రత్నభూషణ భూషితరాజులు ఇత్తడి కడియముకొఱకైన వారియభిలాష అనురెంటితో - బింబప్రతిబింబభావము.

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ తత్పరత నుర్వీనాథ, యే నైషధేం (9-35)
ద్రు నవశ్యంబు వరింతు; నా ధరణినాథుం డాత్మ న న్నొల్లఁ డే,
ననుమానింపక యిత్తు నవ్విభునకుం బ్రాణంబు సద్భక్తిమై
నన లోద్బంధన వారిమజ్జన విధా వ్యాపార పారీణతన్. 70

ఉర్వీనాథ = ఓరాజా, ... తత్పరతన్ = సావధానముగా, వినుమీ;... అనల ... తన్ = అగ్ని (ప్రవేశము) ఉరిఁబోసికొనుట నీట మునుఁగుట అనెడి ప్రకారముల ('విధా విధా ప్రకారే చ' అమ.) ప్రయోగమందు నైపుణ్యముచేత (ఈమూఁడు ఉపాయములలో నొకదాని చేత మృతిఁ జెందెద ననుట.) - నల వరణమో మరణమో అని వికల్పాలంకారము:—
'సమబలవిరోధము వికల్పము; తలలనో చాపములనో వంపుఁడు రాజుల్.' అలం.

తే. అనుచుఁ దీక్ష్ణంబుగా భీమతనయ పలుక, (9-38)
నెలుఁగు వినువేడ్కఁ గోయిల నెగిచినట్లు,
విబుధరాజ ప్రసంగంబు విస్తరించి,
మఱియుఁ బలికింపఁ దలఁచి యమ్మనుజవిభుఁడు. 71

... తీక్ష్ణంబుగాన్ = దృఢముగా, పలుకన్ = పలికినంతట, కోయిలన్ = కోకిలమును, ఎలుఁగు వినువేడ్కన్=దాని కూఁతను వినం గోరికచేత, ఎగిచి నట్లు = (బాలురు లోనగువారు తాము 'కూ ఓ' అని కోకిలవలె కూసి దానిని) రేఁపుటవలె, ఆ - మనుజవిభుఁడు = నరేంద్రుఁడు నలుఁడు, మఱియుఁ బలికింపఁ దలఁచి = దమయంతిని మరల మాటలాడింపఁ గోరి, విబుధరాజ ప్రసంగంబున్ = (ఇంద్రాది) సురాధిపులయొక్క ప్రస్తావమును, విస్తరించి = పెంచి, (79 లో 'పలుకన్' అను క్రియతో నన్వయము.)—ఉపమాలంకారము.

వ. వెండియు దమయంతి నుద్దేశించి. 72

క. నిఱుపేదయింటి కేటికిఁ (9-39)
బఱతెంచు నిధాన ? మటు పఱతెంచెను రే

నిఱుపేద యభాగ్యతఁ దలు
పిఱియఁగ నిడుఁ గాక, చొరఁగ నిచ్చునె దానిన్. 73

నిధానము = నిధి, ... ఏటికిన్ = ఏల, పఱతెంచున్ = పరుగెత్తి వచ్చును. పఱతెంచెన యేని = వచ్చెఁబో (వచ్చినపక్షమున). అభాగ్యతన్ = దౌర్భాగ్యముకతంబున, తలుపు = (తన యింటివాకిటి) కవాటమును, ఇఱియఁగన్ = బిగుతుగా (చొర నేపాటియు సందు లే కుండ), ఇడుఁ గాక = మూయును గాని, దానిన్ = ఆనిక్షేపమును, చొరఁగ నిచ్చునె - ఇంటిలో ప్రవేశింపనీయఁ డనుట. 'అభాగ్యత'ను ప్రథమ చేసి 'నిఱుపేద (యొక్క) యభాగ్యత' అని సమాసముగాఁ గొని 'ఇడున్' 'ఇచ్చునె' అనుక్రియలకు కర్తనుగా చేయుట యొకయన్వయము.

నిఱుపేదయింటికి నిధి రానే రాదు - వచ్చెఁబో, వాఁడు దానిని లోనికి రానీయఁడు.— అని యప్రకృతార్థము; దీనిచేత - నీయింటికి దేవతలు రానేరారు - అట్టివారు వచ్చిరి - వచ్చినను నీవు (నీయభాగ్యతచే) వారి నొల్లకున్నావు - అను ప్రకృతము తెలియ నగుచున్నది; సారూప్య నిబంధనాప్రస్తుతప్రశంస.—'పఱతెంచెనయే' - ఏనిశబ్దాంతస్వరమునకు హల్లుపరముకాఁగా లోపము. పిమ్మటసంధిలో నలోపము.

సీ. ముగ్ధత్వమునఁ జంద్రముఖి పరాఙ్ముఖి వయ్యె (9-40)
దేల, భాగ్యంబు నిన్నెదురుకొనఁగ ?
నమృతాంధసుల నొల్ల నను మానవియుఁ గల్గె ! (9-41)
నీలాగు గంటి మే కాలగతుల ?
యాగాది దుర్లభం బైన దేవత్వంబు
నీ కొల్లఁబా టయ్యె నేఁడు సూడ.
రసయోగమున సువర్ణత్వ మొందుట మేలొ ? (9-42)
యినుము దాఁ దాన యై యునికి మేలొ ?
తే. యకటకట ! సర్వగీర్వాణ మకుట ఘటిత (9-44)
మణి గణ విభాసమాన కోమల పదాబ్జు
సురగణాధీశు నొల్లక నరుని నొకని
నభిలషించెదు ని న్నేమి యనఁగఁ గలదు. 74

ఓ - చంద్రముఖీ; భాగ్యంబు = అదృష్టము, నిన్నున్ ఎదురు కొనఁగన్ = నీకు ఎదురుగా వచ్చుచుండఁగా, (నీవు), ముగ్ధత్వమునన్ = మూఢత్వముచేత ('ముగ్ధః సున్దర మూఢయోః' అమ. - దేవవరణప్రయోజనము నెఱుంగక యని భా.), పరాఙ్ ముఖివి = పెడమరలిన ముఖము కలదానవు, అయ్యెదు ఏల (పెడమోము పెట్టెద వేల - అంగీకరింప వేమి.)

అమృత అంధసులన్ = దేవతలను (అమృతము అన్నముగాఁ గలవారిని - 'భిస్సా స్త్రీ భక్త మన్ధోఽన్న మోదనోఽస్త్రీ స దీదివిః' అమ.), ఒల్లను = కోరను, ...మానవియున్ = మానవజాతి స్త్రీ కూడ (దేవత్వమునకై బహుజన్మముల తపస్సులు చేయుచుందురనుట), కల్గెన్ -

(ఇన్నాళ్లకు అట్టిదానవు నీవు కల్గితి వని యాశ్చర్యము), ఈలాగుల్ = ఈతీరున (మానవి దేవతల నొల్లమిని), కాలగతులన్ = కాలముయొక్క గమనములలో (ఏకాలమం దైనను). ...

యాగ ఆది దుర్లభంబు = జన్మములు లోనగువానిచే సయితము లభింపనిది (ఆదిశబ్దముచేత తపస్సులు యోగములును గ్రాహ్యములు.)

ఒల్లఁబాటు = అనపేక్షణీయము (అక్కఱలేనిది - కోరఁగానిది).

ఇనుము, రసయోగమునన్ = స్పర్శవేధి యను ద్రవ ద్రవ్యముతోడి కూడికచేత (ఆ ద్రవ్యము తనకుఁ దగులుటచేత), సువర్ణత్వము=బంగారుభావమును, ... (నీవు దేవవరణముచే దేవత వగుట మేలుగాని మానవి గానే యుండుట మేలు గాదు - అని భా.)

అకటకట = అయ్యయో! సర్వ...జ్ఞున్ = సకల దేవతల కిరీటములందు ఖచితము లయిన రత్న సమూహములచే వెలుంగుచున్న మృదుల చరణ కమలములు కలవానిని, సుర గణ అధీశున్ = సర్వ దేవ పతిని (ఇంద్రుని), ఒల్లక = కోరక, ...అనఁగన్ కలదు = అన నున్నది.

ద్వితీయపాదమున అసంభవాలంకారము.—

'అమరు నసంభవ మీ య। ర్థమునకు నిష్పత్తిఁ గలుగఁ దరమా యనినన్;
కోమలార, యెవరు తలఁచిరి। సుమములు మెయి నిప్పులట్లు చూడు నటంచున్!' అలం.

తృతీయపాదమున - 'యా గాదిదుర్లభంబు' అనువిశేషణము (అవశ్యాంగీకరణీయ మని) సాభిప్రాయము గాన పరికరాలంకారము. చతుర్థపాదమున - సారూప్యనిబంధనాప్రస్తుతప్రశంస. 'సర్వ...జ్ఞు' - ఈవిశేషణమునకు అవశ్యవరణీయుఁ డని యభిప్రాయము గాన పరికరాలంకారము. అట్లె 'సురగణాధీశు' అను విశేష్యమునను అదే యభిప్రాయము గాన పరికరాంకురము.—

'పరికరము విశేషణమునఁ। బరఁగెడు వ్యంగ్యంబు ప్రకృతవాచ్యాంగము గాన్;
హరియించును మీ తాపము। శిరమున హిమధాముఁ దాల్చు శివుఁడు రయమునన్.
ఆకరణి నే విశేష్యము। సాకూతము గాఁగఁ బరికరాంకుర మలరున్;
ఓకలికి, యెట్లు గెలుచును। నాకుసుమాయుధుఁడు దాఁ బినాకాయుధునిన్?' అలం.

సీ. రజ్జువల్లరిమీఁదఁ బ్రణయంబు గల దేని, (9-46)
యంతరిక్షం బేలు హరి వరించు;
నగ్ని కాహుతి గాఁగ నాత్మఁ గోరెద వేని, (9-47)
జాతవేదుని యదృష్టము ఫలించు;
సలిలప్రవేశంబు సమ్మతించెద వేని, (9-48)
నంబుధీశ్వరుఁడు పుణ్యంబు సేయు;
నెబ్భంగిఁ బ్రాణ ముపేక్షించి తేనియు, (9-49)
వైవస్వతుని కబ్బు వాంఛితంబు;
తే. ఘట్టకుటికాప్రభాతంబు క్రమము నంది (9-51)
దమసహోదరి నీకు నయ్యమరవరుల

నొల్ల ననియును దుదిఁ బొంద కుండరాదు,
సమ్మతింపుము నామాట చలము మాని. 75

నీవు ఏయుపాయముచేతను ఈదేవపతులను తప్పించుకోలేవు అని చెప్పుచున్నాఁడు.—

రజ్జువల్లరి మీఁదన్ = త్రాటి తీఁగ మీఁద ('రజ్జు ర్వేణ్యాం గుణే యోషిత్' మేది.) ఉరితీఁగ మీఁద, ప్రణయంబు = ప్రేమ ('ప్రణయా స్త్వమీ విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణః' అమ.)(రజ్జు...ఏని = ఉరిఁ బోసికొందు వేని), అంతరిక్షుం బేలు హరి = (స్వర్గము ఆకాశే మందున్నదిగాన) ఆకాశనాయకుఁ డైన యింద్రుఁడు, వరించుచున్ = నిన్ను కైకొనుచు.

జాతవేదుని = అగ్నియొక్క ('కృపీటయోని ర్జ్వలనో జాతవేదా స్తనూనపాత్' అమ.)

సలిల = జలమందు. అంబుధీశ్వరుఁడు = సముద్రపతి – వరుణుఁడు.

వైవస్వతునికిన్ = యమునికి ('కాలో దణ్డధరః శ్రాద్ధదేవో వైవస్వతోఽన్తకః' అమ.) వాంఛితంబు = కోరిక.

దమ సహోదరి = దముని తోఁబుట్టువా, నీకున్, ఘట్టకుటికా ప్రభాతంబు క్రమమున్ = (ఎంతరాత్రి యుండఁగా తరలినను) సుంకపుఁ జావడికడనే తెల్లవాఱినది అన్నరీతిని, అంది = పొంది, ఆ యమగ...రాదు, చలము = మచ్చరము.—నీసపాదంబులందు – దేవపతులను తప్పించుకొనుటకై చేయు మరణయత్నమువలన వారిపాలనే పడుట యను ననిష్టము కలుగుట – విషమాలంకారభేదము. ఘట్టకుటీప్రభాతన్యాయము ఎట్టి దనః—

'క్రీత్వా కశ్చి త్పణ్యవస్తూని పుర్యాం। శుల్కం హృత్వా గన్తుకామో నిశాయామ్
తుర్యే యామేఽగచ్ఛ దారాత్ కుమార్గాత్ । గత్వా గత్వా ఘట్టకుట్యాం ప్రభాతమ్.'

తే. ఒల్ల ననుమాట కర్థ మో యుత్పలాక్షి, (9-50)
వలతు ననుమాట గాదు గా వక్రరీతి ?
విధి నిషేధరూపంబు భావించి యున్న,
విధియ యగు వ్యంగ్య వాసనా విలసనమున. 76

... వక్ర రీతిన్ = విపరీతలక్షణచేత. [విపరీతలక్షణ యనఁగా మాటకు వాచ్యార్థవిరుద్ధమైన యర్థము కలుగుట. ఉ. ఎన్నిమాఱులు ఇవలికి తెచ్చినను నిలువక ఒఱలు లేని నేలబావివైపు మరలమరల ప్రాఁకుచున్న శిశువును తల్లి విసుగుచే 'పో, ఆబావిలో పడు, నాయొడిలో నుండకు;' అనుమాటకు 'పోకు, బావిలోపడకు, నాయొడిలోనే యుండుము;' అని యర్థము విపరీతలక్షణచే కలిగినది. అట్లే ఇటను 'ఒల్లను' అను మాటకు 'వలతు' ననియే యర్థమా? యని దమయంతిని చమత్కారముగా నలుఁ డడుగుచున్నాఁడు.—ఒల్లమి సరిగా దనియు వలతువు గాక యనియు భా.]
విధి=విధివచనము,నిషేధ రూపంబున్ = నిషేధవచన రూపమును, భావించి యున్నన్ = పొంది యున్నను, వ్యంగ్య వాసనా విలసనమునన్=వ్యంగ్యార్థ సంబంధ స్ఫూర్తిచేత, విధియ యగున్= విధ్యర్థమునే బోధించును. [వ్యంగ్య మన శబ్దమునకుఁ గల వాచ్యార్థ లక్ష్యార్థములు గాక లక్ష్యార్థప్రయోజనమయిన యర్థము. ఎట్లన – 'గంగలో గొల్లపల్లె యున్నది' అనువాక్యములో గంగలో అన్నమాటకు 'ప్రవాహములో' అని వాచ్యార్థము, 'గంగయొడ్డున' అనునది లక్ష్యార్థము, చలువ పావనత్వము లోనగునవి వ్యంగ్యార్థములు. అట్లే ఒల్ల నను నీనిషేధవచనమునకు వలతు నను

విధియే యర్థమా యని పూర్వవాక్యముతో సంగతి.]—ఉత్తరార్థమున సామాన్యమును పూర్వార్ధమున విశేషమును గాన అర్థాంతరన్యాసము.

వ. ఇవ్విధం బగునేని. 77

సీ. వెలఁది, యైరావత ద్విప కుంభ కుచకుంభ (9-52)
సంభార హారి దధీశ్వరుని వలతో ?
జలజాక్షి, నిఖిల తేజస్వి లోకములకు (9-54)
నగ్రగణ్యుం డైన యనలు వలతో ?
తరుణి, లోకాలోక ధర్మసంస్థాపన (9-56)
ప్రాగల్భ్య నిధి ధర్మరాజు వలతో ?
పల్లవాధర, విధి ప్రథమ సర్గాధ్యక్షు (9-58)
సప్త పాథోనిధి స్వామి వలతో ?

తే. వైభవం బిచ్చగించి, పావనతఁ గోరి,
ధర్మశీలత యర్థించి, నిర్మలత్వ
మాసపడి, వీరి నలువుర యందు నొకని
వేఁడుమా చూచెదను నీ వివేకశక్తి. 78

వెలఁది = ఓతరుణీ, ఐ ... రునిన్ = ఐరావత మనెడి యేనుఁగుయొక్క కుంభస్థలము లనెడి స్తన కలశముల సమున్నతి కల దైన దిక్కుయొక్క దొరను (ఇంద్రు ననుట.—'ఐరావలో ఒభ్రమాత జ్గైరావ ణాభ్రముపల్లభా,' 'దన్తీ దన్తావలో హస్తీ ద్విరదో ఒనేకపో ద్విపః,' 'కుమ్భౌ తు పిణ్డౌ శిరసః,' 'దిశ స్తు కకుభః కాష్ఠా ఆశా శ్చ హరిత శ్చ తాః' అమ.), వలతో= వలతువా ? [రూపకాలంకారము. ఇంద్రుఁ డనుగమ్యమును భంగ్యంతరమునం జెప్పినందున పర్యాయోక్తంబును.]

(ఓ) జలజాక్షి, నిఖి...కున్ = ఎల్ల తేజస్సంపన్నుల సమూహములకు, అగ్రగణ్యుండు= మొదటివాఁడుగా లెక్కింపఁదగినవాఁడు, ఐన - అనలున్ = అగ్నిని...[విశేషణమునకు అత్యంతము వరణార్హుఁ డని భా.]

(ఓ) తరుణి, లోకా...నిధిన్=చక్రవాళపర్వతము పర్యంతము ('లోకాలోక శ్చక్రవాళః' అమ.) వేదోక్తమర్యాదయొక్క ('త్రియా ధర్మ స్తు తద్విధిః' అమ.) నెలకొల్పుటయందలి నేర్పునకు స్థాన మయిన, ధర్మరాజున్ = యముని ... [అత్యంతము వరణార్హుఁ డని విశేషణభావము.]

(ఓ) పల్లవాధర = చిగురువంటి మోవి గలదానా, విధి...క్షున్ =బ్రహ్మయొక్క ('విధి ర్విధానే దైవేఒపి' అమ.) మొదటి సృష్టికి (జలమున కనుట. 'అప ఏవ ససర్జాదౌ' అని మను వచనము - 'సర్గః స్వభావ నిర్మోక్ష నిశ్చ యాధ్యాయ సృష్టిషు' అమ.), సప్త...మి=ఏడు సముద్రముల దొర యైన వరుణుని ... (భావము పైయట్లే. సప్తసముద్రములు 'లవ ణేక్షు సురా సర్పి ర్దధి క్షీర జలార్ణవాః.'- పర్యాయోక్తాలంకారము.)

వైభవంబు = ఐశ్వర్యము, ఇచ్చగించి=కోరి, పావనత = పవిత్రీకరించుదానితనమును,... ధర్మశీలత = ధర్మము స్వభావముగా కలిగియుంటను, అర్థించి = కోరి, నిర్మలత్వము = వైమల్యమును, ఆసపడి=కోరి, వీరి నలువురయందున్ = ఈ నలువురలోపల,...వివేక శక్తిన్ =తారతమ్య గ్రహణ సామర్థ్యమును ... [వైభవాదులతో ఇంద్రాదులకు క్రమాన్వయము గాన యథాసంఖ్యాలంకారము.]

వీరి నలువురయందున్=షష్ఠీసమాసము. ఫలితార్థము సామానాధికరణ్యమే - 'ఈ నలువురయందు'.ననియే యర్థము. వ్యస్తప్రయోగమందు 'సర్వనామ సంఖ్యాబిధా యీా' త్యాదిసూత్రముచే 'వీరు' అని వికల్పముగా ప్రథమయు కలుగును.

తే. అని నృపాలుండు వలుక, హస్తాంక సుప్త (9-60)
కోమలైక కపోలయై యామృగాక్షి
వినియె నొకరీతి, నొకభంగి వినని దయ్యె,
వలచియును నొల్లకయును దద్వాక్యసరణి. 79

... ఆ మృగాక్షి = హరిణలోచన, హ... ల = చేతియొక్క ఒడియందు (అఱచేత నను ట - 'ఉత్సఙ్గ చిహ్నయో రఙ్కః' అమ.) నిద్రించిన (చలింపక యున్నట్టి) ఒక చెక్కిలి కలది (ఈతీరు చింతం దెలుపును), తత్ వాక్య సరణిన్= అతని మాటల పద్ధతిని. - [వలచుట జిజ్ఞాస చేతను, అతనిమాటలు వినం గుతుకముచేతను; ఒల్లమి అప్రియ మగుటచేత. ఇట 'వలచుట' 'విన వలతు' నిత్యాదిస్థలములయందుంబోలె కోరుటగాని, కామించుటగాదు. 'వలచు' నకు 'ఒల్లమి' వ్యతిరేకభావార్థకము.—'వలచి వినియెన్' 'ఒల్లక వినని దయ్యెన్' అని క్రమాన్వయము గాన యథాసంఖ్యాలంకారము.]

వ. చింతాక్రాంత యయి యొక్కింతతడవు తల వంచుకొని విచారించి పదంపడి నిట్టూర్పు నిగిడించి యాయిందువదన యారాజకందర్పునిం గనుంగొని సవిషాదంబుగా నిట్లనియె. (9-61) 80

తడవు = సేపు. పదంపడి = తర్వాత. సవిషాదంబుగాన్ = మనోభంగముతోఁ గూడుకొన్నట్లుగా ('విషాద శ్చేతసో భఙ్గ ఉపాయాభావచిన్తనైః' - తలవంచుటయు నిట్టూర్పులును విషాదానుభావములు.)

ఉ. నీచరితంబు చూడ నతి నిష్ఠుర మయ్యెడు; లోకపాల దు (9-62)
ర్వాచిక సూచి కాంకుర పరంపరఁ దూర్చెదు మాటిమాటికిన్
నాచెవులందు; నీకుఁ దగునా యిటు సేయఁగఁ? దప్పు నంటి; బా
ధాచరణంబు నైజమ గదా తలపోయఁ గృతాంత దూతకున్, 81

... చరితంబు = నడవడి. నిష్ఠురము = క్రూరము. ... లోక...రన్ = దిక్పాలుర పాడు సందేశ మనెడి సూది కొనల బారును. తూర్చెదు = చొప్పించుచున్నావు,...తప్పున్ అంటిన్= పొరఁబాటుగా పలికితిని (నీవు తప్పకుండ తగును అనుట.) తలపోయన్=ఆలోచించి చూడఁగా, కృతాంత దూతకున్ = యమ కింకరునికి ('కృతాన్తో యమ సిద్ధాన్త దైవాకుశలకర్మసు' అమర.)

బాధా చరణంబు = బాధ పెట్టుట, సైజము కదా=సహజమే కదా (యమునికై రాయబారము వచ్చినాఁడు గాన యమదూత యనుట.)

'తూర్చెదు' - సంయోగమందు గురురేఫము లఘు వగును. 'బాధా ఆచరణంబు' అని యేని ఛేదము - ప్లుతయతి.

నిష్ఠుర మగుటకు సూదికొనలం గ్రుచ్చుట కారణము గాన వా. హే. కావ్యలింగము. దుర్వాచిక సూచికాంకుర పరంపర' - రూపకము. తగ దనిమొదట చెప్పి పిమ్మట తనమాట తానే కా దన్నది గావున ఆక్షేపాలంకారము:—

'(1) తనమాట తా నరసి వల । దన నాక్షేపము, (2) నిషేధ మాభాసింపం
గ నదే,(3) నిషేధము వ్యంగ్యం। బును విధి వాచ్యమును గాఁగఁ బొలుపొందు నదే.' అలం.

సీ. ఇదె యెల్లి కల్యాణ మేతెంచుచున్నది, (9-65)
యీ యవాచిక వార్తలిపుడు మాను;
వర్ణింపు నిషధభూవరుని నోపితి వేని,
యీదోష మఖిలంబు నెడలుఁగాని;
యుండు నీ విచ్చోట నూఱట నేఁ డెల్లి, (9-66)
సురల కిప్డేమి వేగిరము వచ్చె?
నలుని రూపచ్ఛాయ దిలకించె నీయందు, ,,
హంస సూపినచిత్ర మాత్మఁ దలఁప;

తే. హస్తములు మోడ్చి వేఁడెద ననఘ, నిన్ను; (9-69)
మాను మిటఁ బట్టి యే నీకు మాన్య నేని,
పాకశాసన ముఖ్య దిక్పాల వర్య
పాణిపీడన కార్య సంప్రార్థనంబు. 82

ఇదె = ఇదిగో - ఎల్లి = రేపు, కల్యాణము = (స్వయంవర) మంగళము ('కల్యాణం కాఞ్చనే శుభే' త్రికా.), ఏతెంచుచున్నది = వచ్చుచున్నది, (కావున), ఈ - అవాచిక వార్తలు = అమంగళ వృత్తాంతములు. ... — వా. హే. కావ్యలింగము.

ఓపితివేని=నేరతువేని,...భూవరుఁ=రాజును; వర్ణింపుము, (వర్ణించిన), ఈదోషము = లోకపాల దుర్వార్త తెచ్చిన తప్పిదము, అఖిలంబుఁ = అంతయును, ఎడలుఁ గాని = తొలఁగును గాక.—వా. హే. కావ్యలింగము.

ఊఱటఁ = విశ్రామార్థము. — వా. హే. కావ్యలింగము.

రూప చ్ఛాయ = ఆకారముయొక్క పోలిక. తిలకించెఁ=అగపడినది. చూపిన చిత్రము= వ్రాసి చూపిన చిత్తరువును. ఏఁ = నేను. మాన్యఁ ఏని = మాననీయురాలను అయినయెడల, ఇటఁబట్టి= ఇప్పటినుండి - ఇకను. పాక...నంబుఁ = ఇంద్రుఁడు మొదలుగాఁగల దిక్పాల వరేణ్యుల. ('ముఖ్య వర్య వరేణ్యాశ్చ' అమ.) వివాహకార్యపు వేఁడుకోలును, మానుము.

క. ఈరీతి నాతలోదరి। సారతర సుధా ర సౌరస ప్రసవ ర సా (9-72)
సార సరసోక్తి సరణి మ। హారాజకుమారునకు నుపాయన మొసఁగెన్.

ఈరీతిన్ = ఈవిధముగా, ఆ - తల ఉదరి = అఱచేతివంటి (పలుచని యనుట) కడుపు గల దైన యా దమయంతి, (ఆ) మహారాజ కుమారునకున్, సార ... సరణిన్ = ఉత్తమోత్తమ మైన యమృత ద్రవముయొక్క అొమ్ముచేత పుట్టింపఁబడిన (ఉరసా జనితః ఔరసః) బిడ్డలును అనఁగా సుధవంటివియు - 'ప్రసవో గర్భమోచనే। ఉత్పాదే స్యా దపత్యేఽపి ఫలేఽపి కుసుమేఽపి చ' మేది.) రాగమును వర్షించుచున్నట్టివియు నైన తియ్యని ('రసో గన్ధరసే స్వాదే' విశ్వ.) మాటలయొక్క ('వ్యాహార ఉక్తి ర్లపితం భాషితం వచనం వచః' అమ.) వరుసను ('సరణిః శ్రేణి వర్త్మనోః' రభ.), ఉపాయనము ఒసఁగెన్ = కానుక పెట్టెను ('ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపదా' అమ.) 83

ఈవిధముగా దమయంతి నలమహారాజునకు అమృతమువంటివియు అనురాగమును వర్షించుచున్నవియు నయిన మధురవచనముల శ్రేణిని కానుక పెట్టెను.—ఈ దీర్ఘసమాసమందు 'ఔరస ప్రసవ' - ఔపమ్యవాచకము. 'ఉక్తిసరణి నుపాయనముచేసెన్'—ఇది (అలంకారసర్వస్వకారాది మతమున పరిణామము,) రసగంగాధరకారమతమున రూపకమే.

ఉ. మైత్రియుఁ బ్రేమయు న్మనసు మచ్చికయు న్మెఱయ, న్వరాట రా
ట్పుత్త్రిక వల్కన; న్నిషధభూపతి దైవత కార్య కల్పనా
సూత్రము దప్ప నీ, కెలమి సొంపు మదిం దలకొల్పి, చిత్రవా
క్చిత్రశిఖండినందనుఁడు చేడియ నల్లనఁ జూచి యి ట్లనున్. (9-73) 84

వరాట రాట్ పుత్త్రిక = విదర్భ రాజ తనూజ,...పల్కనన్ = పలుకఁగా,...చిత్ర వాక్ చిత్రశిఖండినందనుఁడు = అద్భుత మయిన మాటలయందు బృహస్పతి యైన (వాఙ్మాధుర్యమందు బృహస్పతి తుల్యుఁ డయిన - 'జీవ ఆఙ్గిరసో వాచస్పతి శ్చిత్రశిఖణ్డిజః' అమ.) నిషధ భూపతి = నలుఁడు, దై...ము = దేవ కార్య సాధన క్రమమును, తప్ప నీక = చెడ నియ్యక, ఎలమిన్ = వికాసమును, సొంపున్ = సంతోషమును, మదిన్ తలకొల్పి = మనస్సులో వహించి, చేడియన్ = బాలఁతిని (దమయంతిని), అల్లనన్ = మెల్లఁగా,...

'చిత్ర వా క్చిత్రశిఖండినందనుఁడు నిషధభూపతి' - రూపకాలంకారము.

సీ. హరి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నినుఁ గోరి (9-74)
దివికి రావించిన, దిక్కు గలదె ?
సర్వకామద మైన సప్తతంతువున ని, (9-75)
న్నగ్ని గైకొనిన, నే మనఁగఁ గలదు ?
తనయొద్ద నున్న వాతాపితాపనునిచే (9-76)
నిను నార్కి వరముగాఁ గొనిన, నెట్లు ?
కాంక్షించి యడిగినఁ, గామధేనువు నిన్నుఁ (9-77)
ద్యాగంబుగా నీదె యంబుపతికిఁ ?

తే. గాన విను మేను జెప్పిన క్రమము లెస్స; (9-78...83)
యతివ, వరియింపు వేల్పులయందు నొకని;
భక్తి దివిజుల చిత్తంబుఁ బట్టుకున్న,
నంతరాయంబు పుట్టుఁ గార్యముల కెల్ల. 85

హరి = ఇంద్రుఁడు, దివికిన్ = స్వర్గమునకు, రావించినన్ = రప్పించుకొన్నచో, దిక్కు = శరణము...[హరి నీమీఁది గారవముచేత వచ్చి యడుగుట గాని అతనియింటి పెరటిలో నున్నది కల్పవృక్షము, అవలీలగా దాని నడిగి నిముసములో నిన్నుం బడయఁగలఁడు,నీయిచ్ఛతో నతనికిఁ బనిలేదు. అందులకు భంగముం గావించి నిన్నుం గాచువారు లేరు. ఈవిషయమును ఆకళింపక మూర్ఛించుచున్నావు. ఇది సరి గాదు - అని భా. ఇట్లే ఉత్తరత్ర గ్రహింపవలయును.— 'ప్రార్థించి' - ప్ర+అర్థించి - ఉపసర్గయతి - ఇట స్వరమునకు వచ్చినది.]

సర్వ కామ దము = ఎల్ల కోరికలను ఇచ్చునది,...సప్తతంతువునన్ = జన్నమునందు. కలదు = ఉన్నది. [ఇతరులకు అగ్నిముఖముగా చేసినందులకు సర్వఫలముల నిచ్చుయజ్ఞము అగ్నియే స్వయముగాఁ జేసిన మఱి చెప్పవలయునా అని భా. అగ్నిచేతం జిక్కక తప్పించుకోలే వని భా. అగ్నికి జన్నములతో నిత్యసంబంధముగాన అతని కది సులభసాధన మని దాని నతనికిం జెప్పుట.]

వాతాపితాపనుఁడు అగస్త్యులవారు - ఇల్వలభ్రాత యగు వాతాపిరాక్షసుని జీర్ణముచేసి కొన్నవారు; ఆయన దక్షిణదిక్కున నుండువాఁడు గాన దక్షిణదిగధిపతికి ఆర్కికి (అర్కపుత్త్రుఁడైన యమునికి) సమీపస్థుఁడు. ఆయనప్రభావము వింధ్య సంస్తంభన నహుషభంజన సముద్రపాన ములవలన స్పష్టము; ఆయనవలన నిన్ను యముఁడు వర మొందినం దప్పించువారు లే రనుట.

(కామధేనువు వరుణుఁడు చేయుజన్నములందు హవిస్సంపాదనకై తల్లోకమునకుం బోయి యుండిన దని రఘు. ప్రథమ సర్గలో నున్నది; ఆదేవత సముద్రపతికి ఆతనికి సులభురాలు. సముద్ర మ్మా మెకు పుట్టినిల్లే గదా.) అంబుపతికిన్ = వరుణునికి, త్యాగంబుగాన్ = ఈవిగా (జన్నము గిన్న మనుపాటి కష్టమైన లేకుండ కడు సులువుగా నతఁడు నిన్ను కైవసము చేసికొను నని భా.)

క్రమము = విధము, లెస్స = మంచిది, (నీ) భక్తి=సేవ, దివిజుల = వేల్పులయొక్క - చిత్తంబుఁ బట్టకున్నన్ = మనస్సున కెక్కనియెడల, కార్యముల కెల్లన్, అంతరాయంబు = విఘ్నము ('విఘ్నోఽన్తరాయః ప్రత్యూహః' అమ.), పుట్టున్ - నీ నలస్వయంవరము నెఱవేఱ దనుట.

గీతోత్తరార్ధము వరణహేత్వర్థకము గాన వా. హే. కావ్యలింగము.

వ. అని పలికిన నప్రతివిధానంబైన ప్రియావాప్తి విఘాతంబున హృదయంబు గలంగిన. 86

అప్రతివిధానంబు = ప్రతిక్రియ లేనిది - అనివారణీయ మనుట. ప్రియ అవాప్తి విఘాతంబునన్ = (తన) యిష్టమును బడయుటకుం గలిగిన భంగముచేత.

సీ. ప్రవిమ లాక్షి నభోనభ స్యాంబుదములకు (9-84)
నవ వృష్టి ధార లై యవతరిల్లి,
యాకర్ణ దీర్ఘ నేత్రాంభోరుహములకుఁ (9-86)
గమనీయ నాళ భావము భజించి,

లలిత వక్షోజ కుట్మల చుంబనంబున (9-85)
మధుప దంపతుల సామ్యంబు వడసి
కలిత కజ్జలత ముక్తా హార లతలలోఁ (9-85)
హరినీల రత్న నాయకతఁ దాల్చి,

తే. వేఁడి యశ్రులు నిగుడంగ, వెక్కి-వెక్కి, (9-87)
యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల
మృదుల పరిదేవ నాక్షరోన్మిశ్ర మధుర
కంఠ కాకు వికార కాకలిక యలర. 87

లతాంగి, పృథ్వీశుమ్రోలన్ = నలునియెదుట, వేఁడి - యశ్రులు = కన్నీళ్లు—

ప్రవి...కున్ - ప్రవిమల = అత్యంతనిర్మలము లయిన - అక్షి=(ఇరు)గన్నులనెడి - నభస్ నభస్య = శ్రావణ భాద్రపదమాసముల ('నభః ఖం శ్రావణో నభాః,' 'స్యు ర్నభస్యః ప్రౌష్ఠపద భాద్ర భాద్రపదా అపి' అమ.) - అంబుదములకున్=మేఘములకు, నవ వృష్టి ధారలు ఐ = క్రొత్త వర్ష ధారలు గా, అవతరిల్లి = దిగి; (శ్రావణ భాద్రపదమాసములు వర్షర్తువు; అప్పటి మేఘములు ధారాళముగా వర్షించును. దమయంతి నేత్రములు అట్లు బాష్పములను వర్షించిన వనుట. 'నవ'— అప్పుడే కన్నులందు పొడమినవి గావున. 'అవతరిల్లి'—క్రిందికి రాలుటచేత.)— రూపకము.

ఆకర్ణ...కున్ = చెవులవఱకు వాలిక లయిన కన్నులనెడి కమలములకు, క...ము = సాంద్రమయిన తూఁటి తనమును, భజించి=వహించి (కనులనుండి కుచాదులవఱకు కాఁడలవలె తెంపు లే కుండ నగపడి యనుట.) — రూపకాలంకారము.

కలిత కజ్జలతన్ = కూడుకొన్న కాటుక కల వగుటచేత (కాటుకతోఁ గూడిన వగుటచేత ననుట - 'అఞ్జనం కజ్జలమ్' హేమ.), ము...లోన్ = తీఁగలవంటి ముత్తెపుఁబేరులలో, హరి...తన్ = ఇంద్రనీల మణి యగు మధ్యమణిత్వమును ('నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణా వపి' హేమ.) తాల్చి=ధరించి; (బాష్పధారలో ముందు రాలిన బొట్టులే కాటుకం గడిగికొని వచ్చును గావునను అవియే ముందుగా హారమధ్యమందు పడును గావునను వానికి ఇంద్రనీల నాయకమణి సామ్యము తగియున్నది.) — రూపకాలంకారము.

లలిత...నన్ = సుందరములును మొగ్గలవంటివియు నగు పాలిండ్లను ('కుట్మలో కుము ళోఽస్త్రియామ్' అమ.) ముద్దుగొనుటయందు (వానిపై ప్రాలుటయందు), మధుప దంపతుల సామ్యంబు = తుమ్మెద భార్యా పతుల పోలికను ('మధువ్రతో మధుకరో మధులి ణ్మధు పాళినః' 'దమ్పతీ జమ్పతీ జాయాపతీ భార్యాపతీ చ తౌ' అమ.) — ఉపమాలంకారము.

నిగుడంగన్=ఊరలుచుండఁగా, వెక్కి-వెక్కి, మృదు...క=మృదువైన విలాప ('విలాపః పరిదేవనమ్' అమ.)వర్ణముల కలయికచేత మధుర మైన ఎలుఁగుయొక్క భిన్నధ్వని యను మార్పు తోడి ('కాకుః స్త్రియాం వికారో యః శోక భీత్యాదిభి ర్ధ్వనేః' అమ.) సూక్ష్మ మధు రాస్ఫుట ధ్వని ('కాకలీ తు కలే సూక్ష్మే' అమ.), అలరన్ = శోభిల్లునట్లుగా, ('నాకు ఇట్టికష్టము వచ్చినదా!' అను నిట్టి వర్ణములతోడి గద్గదికా మధుర సూక్ష్మ స్వరముతో ననుట), ఏడ్వఁ తొడఁగన్,

సీసపాదములందు బాష్పపతనవర్ణనము క్రమము నతిక్రమింప కున్నది. పూర్వముద్రణాదుల లో తృతీయ చతుర్థపాదములు వ్యత్యాసపడి యున్నవి. మూలమందు ఆరెండును ఒకశ్లోకమునందే ఈముద్రణమందలి క్రమముననే పూర్వోత్తరార్ధములై యున్నవి. ఆ క్రమము నేత్రములు స్తనములు హారనాయకమణి యనునది.

ఈశ్రీనాథపద్యముచే నుద్బోధితులై గావలయు పెద్దనాదులు ఇట్టిఘట్టంబున స్త్రీపరిదేవనమును ఒకరికన్న నొకరు మధురముగా వర్ణించినారు. [చూ. - 'ఆజాబిల్లి వెలుంగు' వసు. 'పాటున కింతు లోర్తురె' మను. 'ఈసునఁబుట్టి' డెందమున, పారిజా.] శ్రీనాథుఁడు చెప్పిన 'మధుర కాకలికను' వీరు వరుసఁగా 'కిన్నరవధూ రాజత్కరాంభోజ కాంభోజీమేళ విపంచి కాకవ సుధాపూరంబు తోరంబుగాఁ' అనియు, 'ఏడ్చెఁ గలస్వనంబుతో' అనియు, 'బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిఁ' అనియు నిజరసికతాధ్వజము లగువర్ణనలం గావించినారు. 'వేఁడియశ్రులు' - ఆనందాశ్రువులు శీతములును దుఃఖాశ్రువులు ఉష్ణములు నగును:—

'ఆనన్ద జ శ్శోకజ మశ్రు బాష్ప స్తయో రశీతం శిశిరో బిభేద,
గఙ్గాసరయ్వో ర్జల ముష్ణత ప్తం హిమాద్రి నిష్యన్ద ఇ వావతీర్ణః.' రఘు. 14 (3)

వ. ఇట్లు గద్గదికా నిరుద్ధ కంఠనాళ యై యబ్బాల యశ్రుకణంబులు కొనగోళ్ల మీటుచుం దల వాంచి యేడ్చుచున్నం గనుంగొని, దివి జోపకార కార్య ప్రయోజన సంస్తంభితం బైన విప్రలంభ వేదనా భరం బప్పు డుద్దీపితం బై భరింపం గొలంది గాక విశ్వంభరావల్లభుండు మనంబున సంక్షోభించి విభ్రాంతుం డై (9-101), తన్ను నుం దన వచ్చిన కార్యంబునుం దన్నుఁ బుత్తెంచిన వేల్పులను మఱచి, యవస్థా వశంబున నుచి తానుచిత వివేకంబు దప్పుటయు, భావనా నిరూఢంబులైన ప్రియా విలాపంబులుగా వితర్కించుచు నిట్లనియె. (9-102) 88

గద్గ . . . ళ - గద్గదికా = ఎలుంగుయొక్క తొట్రుపాటుచేత - నిరుద్ధ = అడ్డగింపఁబడిన - కంఠనాళ = గొంతుక్రోవిగలది. కణంబులు = లేశములను 'స్త్రియాం మాత్రా త్రుటీ పుంసి లవ లేశ క ణాణవః' అమ.), విశ్వంభరా వల్లభుండు = (నల) భూ కాంతుఁడు, దివిజ... బు = దేవతలకు ఉపకారపుఁ బని యనెడి హేతువుచేత ('ప్రయోజనం కార్య హేత్వోః' హేమ.) ఆఁపఁబడినట్టిది. . . . విప్ర . . . బు = వియోగంపు వెతయొక్క పెంపు ('విప్రలమ్భో విప్రయోగః,' 'పీడా బాధా వ్యథా దుఃఖమ్,' 'అతిశయో భరః' అమ.) ఉద్దీపితంబు = వెలిఁగింపఁబడినది (రేఁపఁబడినది.) కొలఁది = వశము. కాక = కానందున. సంక్షోభించి = కలగుండుపడి. విభ్రాంతుఁ డై = భ్రమఁ జెందినవాఁ డై (తబ్బిబ్బు నొంది.) పుత్తెంచిన = పంపిన. అవస్థా వశంబునఁ = అప్పటి భ్రాంతిదశావిశేషంబువలన. ఉచిత అనుచిత వివేకంబు = తగినది తగనిది అను భేదజ్ఞానము. భావనా నిరూఢంబులు = తలంపున నాటుకొనియున్నట్టివి. ప్రియా విలాపంబులు = దయితా పరిదేవనములనుగా, వితర్కించుచుఁ = వికల్పించుచు [తాను భ్రాంతిలోఁ బడినవాఁ డై ఇప్పటి(వాస్తవ)ప్రియా (వాస్తవ)విలాపంబులను పూర్వము తాను భావనలో ననుభవించుచుండిన ప్రియావిలాపంబులనుగా తలంచి - అని భా.]

—* నలుఁడు దమయంతికి తన నామాదికముం జెప్పుట. *—

క. ఏమిటి కేడ్చెద? వాననl తామరసం బెత్తిచూడు తరుణీ నన్నుం (9-103)
కోమల కటాక్ష వీక్షా। దామకమున వీరసేన తనయుని నలునిన్. 89

కోమ ... మునన్ = మృదుల మయిన కడకంటి చూపుల మాలికలచేత (సానుగ్రహ కటాక్షములతో ననుట.) ఇందు భ్రాంతుఁడై దూత్యము మఱచి తాను నలుఁ డని చెప్పుకొన్నాఁడు.

తే. కాంత యశ్రు బిందు చ్యుతి కైతవమునఁ (9-104)
దివిరి బిందు చ్యుతక కేలిఁ దవిలె దీవు,
సారెసారెకు నాదు సంసారమును స
సారముగఁ జేయుచు మసారసార నయన. 90

కాంత=ఓ ప్రాణేశ్వరీ, మసార సార నయన=ఇంద్రనీలములలో శ్రేష్ఠములవంటి - ('నీల మణి ర్మసారః స్యాత్' హారావళి. 'మసారతార' పా. - ఇంద్రనీలములవంటి నల్లగ్రుడ్లు గల - 'తార కార్ష్ణః కనీనికా' అమ.) కన్నులు గలదానా, (నీవు) సారెసారెకున్ = పలుమాఱు, నాదు సంసారమును = నాలోకయాత్రను, ససారముగన్ = సారవంతముగా, చేయుచున్, అశ్రు బిందు చ్యుతి కైతవమునన్ = కన్నీళ్లు విడుచుట యను మిషచేత, తివిరి = పూనికతో, బిందు చ్యుతక కేళిన్ = అనుస్వారముయొక్క విడుపు గల క్రీడయందు (అనుస్వారత్యాగముచేత అర్థాంతరము నొసంగునట్టి కవనమును రచించు క్రీడయందు), తవిలెదు = ఆసక్తురాల వగుచున్నావు; [సంసార (శబ్ద) మందు సున్న తీసి వైచిన ససార (శబ్ద) మగును. — నీవు బాష్పబిందువులను వదలు మిషచేత నాసంసారమునుండి యనుస్వారమును ఎత్తివేసి దానిని ససారము సేయుచున్నావు; అనఁగా నీవు లేనియెడల దుఃఖమయ మగు నాసంసారము నీచే ససార మగు నని భా.] సాపహ్నవోత్ప్రేక్ష. బిందుచ్యుతకమునకు ఉదాహరణము.—

'సా హంసే నాశ్రితా పద్మా లయేన జలదాత్యయే
అర్ణవ స్యాభిసరణే రంహో ముఞ్చతి వాహినీ.'

'హంసేన' 'రంహో' అని బిందుత్యాగము చేసినను శ్లోకమున కర్థము పొసంగును.

వ. (*a*) చెలువ, చెక్కుటద్దంబునం జేయిడి యేల చింతించెద(9-105)? వేటికిం బల్లవపాటలం బైన యధరంబు బీఁట లెగయ వేఁడి నిట్టూర్పు గాడ్పులు నిగిడించెద? వే కతంబున గద్గదిక నొందెద? వే కారణంబున నశ్రుకణంబు లురుల నేడ్చెద? వీ సంతాపంబునకు నేది హేతువు? దప్పు నాడం గదా? యాత్మ నిహ్నవం బపరాధం బాకొ? శుద్ధాంతప్రవేశంబు దోసంబా? దేవదూత్యంబు ప్రత్యవాయంబా? చెప్పుము. సేవకులకుం దప్పు గలదే? కల దేనియుం గిరీట మాణిక్య మయూఖ పుంజంబులఁ జరణ కంజంబుల నివాళించెద, ననుగ్రహింపుము (9-107); (*b*) కృపాదృష్టి దానంబునకు బద్ధముష్టివి గాకుము (9-109); వదనంబు వికా

సించుం గాక; హృదయంబు ప్రసన్నంబు గావలయు; సృక్వ భాగంబుల మంద
హాస లవంబులు గందళించుం గావుత; భ్రూ లతాంచలంబులు లీలా చంచలంబు
లయ్యెడు; నపాంగప్రాంగణంబులం దరంగితంబు లగు కలికి చూపులు నాపయిం
బొలయింపుము (9-111); బాష్ప ధారా వృష్టి వ్యపాయంబున దర హసిత చం
ద్రికాలోకంబు ప్రకాశింపం దగు (9-112); మధుర వచోమృతంబు చెవులకుం
జవి చూపు (9-113); మాలింగనం బపేక్షించెదఁ; గుచంబులకుం బరిచర్య
సేయ నిమ్ము (9-116); జుంబనంబు దయ సేయుము; పయోధర రోత్సేధ శిఖరి
కూటంబున న ఖాంకు రాంక నవ శశాంక రేఖాభ్యుదయంబు ఘటియింపం
జేయ ననుమతింపు (9-117). మని మన్మథోన్మాదంబునం బలికి యా రాజ
మన్మథుండు. 91

(*a*) పల్లవ పాటలంబు = చిగురువలె తెలుపు గలిసిన యెఱుపు గలది ('శ్వేతరక్తస్తు పాటలః' అమ.) బీఁటలు = పగుళ్లు. ఏ కతంబునన్ = ఏమి కారణంబున. తప్పు నాడం గదా = నేనేమియు తప్పుగా పలుకలే దని నాతలంపు గాని, తప్పుగా పలికితినా ? ఆత్మ నిహ్నవంబు = తన్ను దాఁచుకొనుట (పేరు చెప్పమి యనుట.), ప్రత్యవాయంబో = నేరమియా. సేవకులకుం దప్పు గలదే — సేవకులు ఏమి తప్పుచేసినను ప్రభువులు మన్నింపవలయు ననుట (ఇది సామాన్యోక్తి-నాతప్పు మన్నింపవలయు నని ప్రకృతవిశేషపరము - కావున అప్రస్తుతప్రశంస.) కలదేనియున్ = ఉన్న యెడల, (తత్పరిహారార్థము), కిరీ...లన్ = నా కిరీటమందలి పద్మరాగ కిరణ గణముల చేత ('మయూఖా స్త్విట్కర జ్వాలాః' అమ.) నివాళించెదన్ = ఆరతి ఎత్తెదను.

(*b*) బద్ధముష్టివి = పిడికిలి బిగియ ముడఁచికొన్న దానవు (ఇయ్యనిదానవు 'స్యాద్ బద్ధముష్టిః కృపణే కృపాణాదిషు చేష్యతే.') సృక్వ భాగంబులన్ = పెలవి ప్రదేశంబులందు ('ప్రాన్తావోష్ఠస్య సృక్వణీ' అమ.) కందళించుం గావుతన్ = అంకురించుఁ గాక. భ్రూ లతా అంచలంబులు = బొమ తీఁగ యంచులు. అపాంగ ప్రాంగణంబులన్=కడకంటి ముంగిళ్లయందు ('అఙ్గణం చత్వరాజిరే' అమ.) తరంగితంబులు = అలలెత్తుచున్నట్టివి. కలికి = అందంపు. పొలయింపుము = పర్వింపుము. వ్యపాయంబునన్ = తొలఁగుటచేత - దర ... బు = లేనగవు వెన్నెల వెలుఁగు ['బాష్ప ... దగు' - రూపకాలంకారము.] పయో ... నన్ = పాలిండ్ల యున్నతి ('ఉత్సేధః కాయ ఉన్నతిః' అమ.) అనెడి గిరి శృంగముపయిని ('కూటోఽస్త్రీ శిఖరం శృఙ్గమ్' అమ.), నఖ...బు - గోటిమొలకయొక్క గుఱుతనెడి బాల చంద్ర రేఖయొక్క పొడుపును (ఐశ్వర్యమును - నఖక్షతముల ననుట - 'నఖా...బునన్' - రూపలంకారము.)

తే. కొంత తడ విమ్మోధంబున భ్రాంతిఁ బొంది, (9-121)
యంత సంప్రాప్త సంస్కారుఁ డగుచు, నాతఁ
డమర కార్యంబు విచ్ఛిన్న మగుటఁ దలఁచి,
యంతరంగంబులోన నిట్లనుచు నుండె. 92

సంప్రాప్త సంస్కారుఁడు = పొందఁబడిన తెలివిగలవాఁడు. విచ్ఛిన్నము = తెగిపోయినది (భంగపడిన దనుట). అనుచునుండెన్ = తలపోయుచుండెను.

—* దూత్యభంగమునకై నలుఁడు చింతిల్లుట. *—

క. ఏ మని తలఁతు రొకో సు (9-122)
త్రామ ప్రముఖు లగు సుర లెదన్ నిఖి లాంత
ర్యాములు దమకార్యం బే
నీమెయి విభ్రాంతిఁ బొంది యిటు చెఱుచుటకున్ ? 93

నిఖిల అంతర్ యాములు సుత్రామ ప్రముఖులు = ఎల్లవారికిని అంతస్సాక్షు లగు నింద్రాదులు [అంతస్సాక్షు లె ట్లనిన—

'ఆదిత్యచన్ద్రౌ వనలోఽనిల శ్చ ద్యౌ ర్భూమి రాపో హృదయం యమ శ్చ
అహ శ్చ రాత్రి శ్చ ఉభే చ సన్ధ్యే ధర్మ శ్చ జానాతి నరస్య వృత్తమ్.'

కావున తాను జెప్ప కున్నను ఎఱుంగుదు రని భా.] తమకార్యంబు ఏను, ఈ మెయిన్ = ఈవిధముగా, చెఱుచుటకున్ = చెడిచినందులకు, ఎదన్ = హృదయము(ల)లో, ఏ మని తలఁతురొకో.—'అంతర్యాము' - లనుపదము 'తలంచుట'కు హేతువును తెలుపుచున్నది గాన ప. హే. కావ్యలింగము.

క. పేరు ప్రమాద వశంబునఁ। బేరుకొనుట కల్ల యయ్యె; బృందారక కా
ర్యారంభోదయమున కది। యారూఢం బైన విఘ్న మై ఫలియించెన్.

పేరు = నానామమును, ప్రమాద వశంబునన్ = పొరఁబాటున ('ప్రమాదోఽనవధానతా' అమ.), పేరుకొనుట = ఉచ్చరించుట, కల్ల = మోసము. ... అది = పేరు చెప్పుట, బృం ... కున్ = దేవతల కార్యోద్యోగ సిద్ధికి, ఆరూఢంబు = స్థిరము, అయిన - విఘ్న మై ఫలియించెన్ = విఘ్న మయినది. (9-123) 94

ఉ. ఆదిఁ బరోపకార పరు లై చరియించినయట్టి యాంజనే (9-123)
యాదులఁ బోల నైతి; నిపు డక్కట! దైవత కార్య సిద్ధి వి
చ్ఛేదము నొందె! నేమి యని చెప్పుదు నింక నమర్త్య పంక్తి? కు
న్మాదులు సంఘటింపఁగ సమర్థు లె యెందును రాయబారముల్ ? 95

ఆదిన్ = పూర్వకాలములో, పరోపకార పరులు = ఇతరులకు ఉపకరించుటయే ప్రధానముగాఁ గలవారు ('దూ రాసా తో్క్తత్తమాః పరః' అమ.)...దైవత = దేవతలయొక్క.. విచ్ఛేదమున్=భంగమును. అమర్త్య పంక్తికిన్=దేవతల వరుసకు (ఆ నలుగురు దేవతలకును). ఎందున్= ఎచట నైనను, ఉన్మాదులు = భ్రాంతచిత్తులు (ఏ. వ. ఉన్మాది —'ఉన్మాద శ్చిత్తవిభ్రమః' అమ.), రాయబారములు = దూత్యములను, సంఘటింపఁగన్ = నెఱవేర్చుటకు, సమర్థులె=శక్తులా (కా రనుట.)—సామాన్యముచే విశేషసమర్థన మయిన యర్థాంతరన్యాసము.

తే. వగవ నేటికి? నే మన వచ్చు నిపుడు? (9-126)
చేతనా హానిఁ గార్యంబు చిన్నవోయెఁ;
జేతనా హాని దైవంబు చేత వచ్చె;
దైవగతి దాఁట వచ్చునే దేవతలకు? 96

వగవన్ = శోకింప. చేతనా హానిన్ = తెలివి నశించినందున. చిన్నవోయెన్ = భంగ పడినది. దైవంబుచేతన్ = విధికృతముగా. దేవపతికిన్ = దేవేంద్రుని కైనను. ఇంద్రుఁడైనను దాఁటలేఁడు, నేను దాఁటలే నని వేఱ చెప్పవలయునా అని భా.—కారణమాలాలంకారము –
'నయ మగుఁ గారణమాల య। న యథా ప్రాక్ప్రాప్తింత కారణంబుల రచనన్.' అలం.

తే. అని విచారించుచుండె నయ్యవనినాథుఁ; (9-127)
డంతకయ మున్న నలునిఁగా నతని నెఱిఁగి,
యెదురు గద్దియ డిగ్గి, పృథ్వీశతనయ
యవనికాంతరమున నోల మాస గొనియె. 97

పృథ్వీశ తనయ = రాజ కుమారి, అంతకయ మున్న = నలుఁడు ఈతలపోఁత లారంభింపక ముందే. ఎదురు గద్దియ = అతనియెదుర నున్న సింహాసనమునుండి, డిగ్గి = దిగి, యవనికా అంతరమునన్ = తెర లోపల, ఓలము ఆసకొనియెన్ = మఱుఁగు పడెను.

క. ఆనంద బాష్పధారల। వానకుఁ, బులకముల యుద్భవమునకుఁ, దగ న
మ్మానిని గదంబ లతికకుఁ। దా నెచ్చెలి గాఁగ నుండెఁ దదవసరమునన్.

తత్ ఆవసరమునన్ = ఆ సమయమందు. ఆమానిని = మనస్విని,...పులకముల ఉద్భవమునకున్ = గగుర్పాటుయొక్క పొడముటకును,...కదంబ లతికకున్ = కడప తీఁగకు,...నెచ్చెలి కాఁగన్ – సాటిగా నగుట. [కదంబము (నీపము) వానకు పూచును. దానిపువ్వులు గోళాకారములుగా కాయవంటి నడిమిభాగమునుండి కిరణములవలె (సమప్రమాణములుగా) నిగుడునట్టి యకరువులు గలిగియుండును. కవులు పులకితములను వానికిం బోల్తురు. ఈయుపమానము 8 ఆ. 48 లో వచ్చియున్నది. ఇట ఆనందబాష్పధారలకు వానయు పులకపటలికి కదంబపుష్పకేసరములును దమయంతికి కదంబలతికయు నుపమానములు. లతికకు నెచ్చెలికాఁగ నగుటకు లతికవలెనే యని యర్థము; ఉపమ. ఇట అశ్రువు రోమాంచము ననుసాత్త్వికభావములు నలత్వజ్ఞానానందజనితములు వర్ణింపఁబడినవి.] (9-129) 98

## —* దమయంతికై నలునితో చెలి పలుకుట. *—

వ. ఇత్తెఱంగున నమ్మెఱుంగుఁబోఁణి తెరమఱుంగున నుండియు లజ్జావశంబునఁ బలుక నేరక సమయోచితంబు లగు భాషణంబులు చెలికత్తియకుం గఱపి పుత్తేర, నబ్బోటి నిషధ రాజుం జేరి యిట్లనియె. 99

కఱపి = నేర్పి. పుత్తేరన్ = పంపఁగా.

తే. అర్థి సాధారణమునకు నభయ మిత్తు (9-150)
వజ్ర పాతంబు ఘోర మై వచ్చినపుడు;
నతను పూఁదూపులకు భయం బొది యున్న
నాకు నభయంబుఁ గృప సేయ నీకు బరువె? 100

దమయంతీ వాక్యములను చెలి యనువదించుచున్నది.—వజ్ర పాతంబు = వజ్రాయుధపు వ్రేటు (అంతటి మహాపద), ఘోర మై = భయంకర మై, వచ్చినపుడుక్ = వచ్చినను, (దాని నుండి), అర్థి సాధారణమునకుక్ = శరణాగతమాత్రుని కెల్ల, అభయము ఇత్తు = భయము లేమిని ఒసంగుదువు - భయము తీర్చి రక్షింతు వనుట; అతను పూఁ దూపులకుక్ = అనంగుని పూవు టమ్ములకు,... —'మరునివలననుండి అభయ మిమ్ము' అనుటకు 'నన్ను పెండ్లియాడుము' అని భా.

వజ్రపాతంబునుండియు శరణాగతులకు వీరు వా రను భేదము చూడక అభయ మొసంగువాఁడు, దేహహీనుని పూవుబాణములకు వెఱచియున్న యబలకు అభయ మొసంగ నేర్చు నని వేఱె చెప్పవలయునా అని కైముత్యన్యాయముచే నర్థము నిష్పన్న మగుచున్నది కావున కావ్యార్థాపత్తి. 'వజ్రపాత' - ఇంద్రునికి నీవు భయపడవలసినది లే దని హృదయము - ప్రబలాయుధనిహతి యని యాకూతము. 'అతను' (= దేహము లేనివాఁడు) - నీకు బొత్తిగా సరకు సేయఁ దగనివాఁ డని యాకూతము. 'పూఁదూపులు'— దుర్బలాయుధములు అనుట కావున ఇందు పరికరాంకురము ఆకావ్యార్థాపత్తికి అంగమై యున్నది.

ఆ. ఆత్మ కాండకారుఁ డగువసంతునకు నె। య్యంపుఁ జుట్ట మైన యంగభవుని
నిందుమదిఁ దలంపు చండాల జాతిగా;। వానికై యభీతి దాన మొసఁగు.

ఆత్మ కాండ కారుఁడు=తన బాణములను చేయువాఁడు (మదనుని బాణములు పువ్వులు గావున, వసంతుఁడు పువ్వులను ఉత్పాదన సేయు ఋతువు గావునను, ఇట్లనుట– 'వసన్తః పుష్పసమయః' అమ.), నెయ్యంపుఁ జుట్టము = ప్రియ స్నేహితుఁడు, ఐన - అంగభవునిక్ = కాయజుని, చండాలజాతిగాక్, నిండుమదిక్ = నిస్సంశయముగా, తలంపుము; వానికై = వానివలన నుండి (పంచమ్యర్థంబున చతుర్థి)... —బాణములు సేయుట చండాలజాతియొక్క వృత్తి. వసంతుఁడు మదనునికి (పుష్ప)బాణములు సేయువాఁడు గావున చండాలజాతి. వానికి సఖుఁడు గావున మదనుండును చండాలజాతి. చండాలజాతి క్రూరము. కావున మదనునిక్రూరతనుండి నన్నుఁ గావు మనుట.–తన్ను పెండ్లాడు మనుట.— చండాలశబ్దమునకు క్రూరతాధ్వని ప్రసిద్ధము:—

'ఆరబ్ధే రభసా న్మయా ప్రియసఖి, క్రీడాభిసారోత్సవే
చణ్డాల స్తిమి రావగుణ్ఠన పటాక్షేపం విధత్తే విధుః.' సా. ద.
'కామం కన్దర్పచణ్డాలో మయి వామాక్షినిర్దయః,
త్వయి నిర్మత్సరో దిష్ట్యే త్యగ్రామ్యార్థో రసావహః.' స. కం.
'అపూర్వకర్మచణ్డాల మయి ముగ్ధే విముఞ్చ మామ్,
శ్రితాసి చన్దనభ్రాన్త్యా దుర్విపాకం విషద్రుమమ్.' ఉ. రా. చ.

కాండకార తత్సఖత్వములు చండాలత్వహేతువులు–గాన కావ్యలింగము. (9-151) 101

—* నలుఁడు సరకుగొనమి. *—

మ. అనుచున్ సారఘ సార సారణికి నెయ్యంపుం జెలిం బోని తి (9-155)
య్యని వాక్యంబున బోటి భీమసుత మాఱై యేర్పడం బల్కినన్,
మన మాహ్లాదముఁ బొందుచుండఁగను భూనాథుండు గంభీరతన్
వినఁడయ్యెన్ సురరాజ కార్య ఘటనా విఘ్నంబు వాటిల్లుటన్. 102

అనుచున్ = ఇట్లని, బోటి = చెలి, భీమసుత మాఱై = దమయంతీ ప్రతినిధిగా, సారఘ సార సారణికిన్ = తేనెయొక్క (సరఘ లనఁగా తేనెటీఁగలు - వానిచేఁ జేయఁబడినది గాన తేనె సారఘము) శ్రేష్ఠాంశముయొక్క చిఱుతయేటికి ('సారణీ స్వల్పసరిత్' ఓశ్వ.), నెయ్యంపుం జెలిం బోని = ప్రియ సఖి వంటిదైన (అనఁగా మిక్కిలి తోలిక యైన) - తియ్యని వాక్యంబునన్, ఏర్పడన్ = వివరముగా, పల్కినన్ = చెప్పఁగా; ... వాటిల్లుటన్ = సంభవించుటచేత. ... [ఆహ్లాదకర మైనను వినమి విరోధము, సురకార్యవిఘ్నముచే సమాధానము, విరోధాభాసము.]

వ. చెలికత్తెయుం గ్రమ్మఱి దమయంతీసమీపంబునకు వచ్చె నప్పుడు. 103

—* దమయంతి చింతిల్లుట. *—

ఉ. 'నిక్కపుదూత గాని ధరణీపతి ముందఱ నేమి యంటినో
పెక్కులు మాట లేఁ?' యనుచు భీమతనూభవ నెమ్మనంబునన్
స్రుక్కుచు నుండె; నైషధుఁడునుం గడుఁ జింత వహించె విన్ననై,
'యక్కట! దేవకార్య మిటు లాఱడిపోవునె!' యంచు నాత్మలోన్. 104

నిక్కపు = వాస్తవ మయిన. స్రుక్కుచున్ = చింతిల్లుచు. ఆఱడి వోవునె = వ్యర్థమాయెనే. విన్ననై = లజ్జితుఁడై. (9-127)

—* హంసాగమనము. *—

ఉ. ఆసమయంబునం గనక హంసము హంస పథంబు డిగ్గి, యు (9-127)
ద్భాసిత కాంతి నద్దెసలఁ బర్వఁగ నచ్చటి కేఁగుదెంచె, జిం
తా సముపేతులై విగత ధైర్యత నివ్వెఱఁ గంది యున్న యా
రాసుతు రాజకన్య ననురాగ మెలర్పఁగ నుద్ధరింపఁగన్. 105

ఆసమయంబునన్ = అట్లు వారు దిగు లొంది యున్నతఱిని, (పూర్వము వారిదూత యైన) కనక హంసము = పసిఁడి హంస, చింతా సముపేతులు = చింతతో కూడుకొన్నవారు, ఐ, విగత ధైర్యతన్ = పోయిన ధైర్యము కలవారు (అనఁగా ధైర్యము కోలుపోయినవారు) అగుటచేత, నివ్వెఱన్ = పారవశ్యముచేత, కంది = ఆయాసపడి (లేక - నివ్వెఱఁగు = పారవశ్యమును, అంది = పొంది); ఉన్న - ఆ - రా...న్యన్ = నలదమయంతులను, అనురాగము ఎలర్పఁగన్ = ప్రేమ మీఱ, ఉద్ధరింపఁగన్ = రక్షించుటకై, హంస పథంబు = సూర్య మార్గమునుండి (ఆకా

శమునుండి యనుట - 'రవి శ్వేతచ్ఛదౌ హంసౌ' అమ.), ఉద్భాసిత కాంతి = ఉజ్జ్వల మయిన ప్రకాశము, నల్దెసలన్ = నాలుగు దిక్కులందును, పర్వఁగన్ = వ్యాపింపఁగా, అచ్చటికిన్ ఏగుదెంచెన్.

వ. ఏగుదెంచి పూర్వ పరిచయంబున నుర్వీకాంతుని చేతను దమయంతి చేతను సంతోష సంభ్రమ సహితంబుగా నుపలాలనంబు వడసి యమ్మరాళంబు నలున కి ట్లనియె **(9-128).** 106

సంతో ... గాన్ - సంతోష = ఆనందముచేత నయిన - సంభ్రమ = త్వరతోను ('సంభ్రమ స్త్వరా' అమ.) - లేక - తొట్రుపాటుతోను - లేక - ఆదరముతోను ('సంభ్రమ స్సాధ్వసేఽపి స్యా త్సంవే గాదరయో రపి' మేది.) - సహితంబుగాన్ = కూడుకొన్నట్లుగా, ఉపలాలనంబు = బుజ్జగము (గారవ మనుట), వడసి = పొంది, ఆ - మరాళంబు = హంస.

—* హంసకృత సాంత్వనాలాపము. *—

శా. నీ యంతఃకరణంబు నిర్మలము; వర్ణింపంగ శక్యంబె నీ **(9-129)**
భూయస్త్వంబు? జగత్ప్రసిద్ధములు నీ పుణ్యప్రభావంబు; లే
లా యీలాగునఁ జింత నొందెదవు? కార్యావాప్తి యౌఁ గాదటే!
యా యింద్రాదులు నీ నిజం బెఱుఁగరే యబ్జారివంశాగ్రణీ? 107

అబ్జ అరి వంశ అగ్రణీ = చంద్ర కుల శ్రేష్ఠుఁడా, నీ - అంతఃకరణంబు = హృదయము. నిర్మలము = దోష రహితము. భూయస్త్వంబు = గొప్పతనమును. కార్య అవాప్తి = కార్య సిద్ధి, ఔన్ కాదు = అయిన నగును కాకపోయినం బోవును. అటే=ఆశ్చర్యము.

ఉత్తరార్ధమున వా. హే. కావ్యలింగములు.

వ. అని వైదర్భిం గనుంగొని. 108

తే. అమ్మ, దమయంతి, యంతరంగమ్ములోన
మాను సందియ; మీతఁడు మగఁడు నీకు;
నాఁడె దా నానతిచ్చినవాఁడు బ్రహ్మ;
త ద్వచనమున కన్యథాత్వంబు గలదె? 109

అంతరంగమ్ములోనన్ = మనస్సులో. సందియము = సందేహము. అన్యథాత్వంబు = వేఱు విధము - తప్పుట.

వ. అని యయ్యిద్దఱి నుద్దేశించి 'దంపతులకు మేలు గావలయు; నుత్తర కర్మం బవిఘ్నం బగుం గాక; నాకును సరసిజాసను ప్రసాదంబున సకల భూతాంత ర్వర్తనంబులు దెలివిపడి యుండు; నిప్పుడు చింతాభరంబులం గలంగిన మీ యంతరంగంబుల విషాదం బపనయింప వచ్చితిఁ బోయి వచ్చెద.'—నని

సముచితప్రకారంబున నయ్యీరువురచేత ననుజ్ఞాతుండై పతంగపుంగవుం డరిగెఁ దదనంతరంబ. 110

దంపతులకున్ = భార్యాభర్తల రగుమీకు. కావలయును = అగుఁగాక. ఉత్తర కృత్యంబుల = ఇటుపై జరుగవలసిన స్వయంవర వివాహాది కార్యములు, సరసిజాసను ప్రసాదంబునన్ = బ్రహ్మదేవుని యనుగ్రహంబుచేత. స...బులు = ఎల్ల ప్రాణుల చిత్తవృత్తులు. తెలివి పడి = గోచరములై. విషాదంబు = ఖేదమును. అపనయింపన్ = తొలఁగించుటకు. ['తెలివిపడియుండు' ట 'విషాదం బపనయింపవచ్చు' టకు కారణము గావున వా. హే. కావ్యలింగము.] అనుజ్ఞాతుఁడు = వీడు కోలువడసినవాఁడు.

క. కనక మరాళం బీక్రియ। ననుకంపను బుద్ధి సెప్పి యరిగిన వెనుకన్
మనమునఁ జింతాభరములు। జనపతికి విలాసవతికిఁ జయ్యనఁ బొసఁగెన్.

ఈక్రియన్ = ఈవిధముగా, అనుకంపన్ = కనికరముచేత ('కృపా దయాఽనుకమ్పా స్యాత్' అమ.) చయ్యనన్ = వెంటనే.— 'బుద్ధి సెప్పుట' చింతానాశమునకు హేతువు గాన వా. హే. కావ్యలింగము. (9-130) 111

—* నలుని మనశ్శుద్ధి. *—

వ. అప్పుడు నృపాలుండు హేమ మరాళ సాంత్వ నాలాప బలంబున నెట్టకేలకు మనంబునం జేవ దెచ్చుకొని దిక్పాలురం దలంచి నమస్కరించి యిట్లనియె (9-130). 112

హేమ ... బునన్ = బంగారపు ('స్వర్ణం సువర్ణం కనకం హిరణ్యం హేమ హాటకమ్. అమ.) హంసయొక్క యత్యంత మధురము లయిన ('అత్యన్త మధురం సాన్త్వమ్' అమ.) వచనముల ('స్యా దాభాషణ మాలాపః' అమ.) దార్ఢ్యముచేత. ఎట్టకేలకున్ = అతిప్రయాసముచేత, చేవ = ధైర్యము.

ఉ. భావములో నదంభ యగు భక్తికి సంతస మందుఁ డొండెఁ; నొం(9-131)
డే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము, దప్పు గల్గెనే?
నీవిరహానలంబునకు నింకిట నేమియు నోర్వలేఁ జుఁడీ,
దేవతలార, మన్మథుని తీవ్రశరంబులు గాఁడి పాఱఁగన్. 113

(ఓ) దేవతలార, ఒండెన్ = ఒకపక్షమున, భావములోన్ = (నా)యాత్మలో ('భావ స్సత్తా స్వభా వాభిప్రాయ చేష్టాత్మ జన్మసు' అమ.), అదంభ = నిర్వ్యాజము (కపటోఽస్త్రీ వ్యాజ దమ్భోపధయ శ్ఛద్మకైతవే' అమ.),...ఒండేని = ఇంకొకపక్షమున, తప్పు కల్గెనేని = (నాకుం దెలియని) యపరాధము (నాయందు) కలిగినయెడల, (అందులకు) ఇప్పుడే, కడిందిగన్ దండము విధింపుఁడు = ఉగ్ర మయినదండనను చేయుఁడు; (ఏల యిట్లు ప్రార్థించుట యనఁగా -) మన్మథుని - తీవ్ర శరంబులు = వాఁడి బాణములు, (నా హృదయమును), గాఁడి పాఱఁగన్ = గుచ్చి

పోవుటచేత (నాగుండియం జీల్చుకొని తూటుపొడుచుకొని వీఁపునుండి వెడలిపోవుటచేతను), ఇఁక ఇటఁక, ఈవిరహ అనలంబునకుఁ = దమయంతీ వియోగాగ్నికి, ఏమియుఁ = ఇంచుకేనియు, ఓర్వ లేక చుఁడీ = తాళ లేను జుండీ.

'శరంబులు' - వ్రాఁతప్రతులలో ప్రథమాంతముగా నున్నది. వానిలో ఎక్కడను మిక్కుట ముగా తప్పులు గలవు; ఒక నిదర్శనము - దొరకిన వ్రాఁతప్రతు లన్నిట ఈపాదమందే 'దేవతులార' అని యున్నదే గాని 'దేవతలార' అని లేదు. అట్లే 'శరంబులు' అనువ్రాఁత 'శరంబుల' అను టకు బదులుగా ఎక్కియుండె నేని—శరంబులఁ = బాణములచేత, (హృదయములో - హృద యము ద్వారముగా దేహమునందు), గాఁడి = గండి - గోయి, పాఱఁగ = (జిగీషువులు వైరులకోటలను ఫిరంగిగుండ్లతో కూల్చునప్పుడు గండుగండునకును కొంతకొంత గడ్డ కూలి తుదకు పెద్దగండి పడినరీతిగా) బాణబాణమునకు కొంతకొంత కండ ఊడిపడి ఱొమ్మునుండి వీఁపునకు సొరంగము కాఁగా — అని యర్థ మేర్పడును.—పూర్వార్ధమందు వికల్పాలంకారము.

'కర్తనే నీవిరహ' (ఏని + ఈ=ఏనీ) - 'అపిశబ్దేనోలు గ్వా స్యాత్' అని శబ్దానుశాసన మూలసూత్రము; దీని వివరణము:—

'ఏని యనుమాటకడపలఁ । గానంబడు నిత్తుమీఁదఁ గదిసినచోటఁ
బ్రాణములు సంధిఁ గాంచును । బూని వికల్పంబువలనఁ బుణ్యచరిత్రా.' అప్ప.

'ఒండే విధియింపుఁడు' - (ఏని + విధి) - 'విన న్వల తే వినుము' ఇత్యాది ప్రయోగంబులందు హల్లు పర మయినప్పుడు కలిగినట్టివి ఇలోప ద్రుతకార్యములు ఇట గ్రహింపవలయును.

ద్వితీయపాదమందు ఏనిశబ్దయతి:—

'ఏని యను నాంధ్రశబ్దము । తో నదికినపూర్వపదము తుదివ్రాయికి న
చ్చైనను వ్యంజన వర్ణం । బైన రచింపుదురు నిత్యయతు లనుచుఁ గవుల్.' అప్ప.

వ. అనంతరంబ తిరస్కరిణీ తిరోహిత యై యుండి య క్కుండినేంద్రనందన రాజనందనున కి ట్లనియె. 114

తిరస్కరిణీ తిరోహిత = తెరచేత ('ప్రతిసీరా యవనికా స్యా త్తిరస్కరిణీ చ సా.' అ మ.) మఱఁగినట్టిది ('అపిధాన తిరోధాన పిధా నాచ్ఛాదనాని. చ' అమ.)

ఉ. ఓ రజనీక రాన్వయ పయోధి నిశాకర, యేఁ బతివ్రతఁ
గూరిమి మీఱ నొక్కరునిఁ గోరి వరింపఁగ, నున్నవారి కె
వ్వారికి నొగ్గుగాఁ దలఁప వచ్చునె? నిన్ను వరింతు నెల్లి బృం
దారకులున్ నృపాలురును దక్కినవారును జూచుచుండఁగన్. 115

ఓ-రజ...కర=చంద్ర వంశ మనెడిసముద్రమునకు చంద్రుఁడ వైనవాఁడా (దానం బుట్టి దానికి, కీర్త్యాహ్లాదాదులు గలిగించినవాఁడా), పతివ్రతన్ ఏన్ = పతివ్రత నైన నేను, కూరిమి= అనురాగము, ...వరింపఁగన్ = వరించినయెడల, ఉన్న...నె - శేషించినవా రెవరుగాని తమకు నేను కీడొనరించితి నని తలంచుట న్యాయ్యము గాదు, ...ఎల్లి = రేపు, బృందారకులున్ = ఆయింద్రాదిసురులును, నృ...గన్, నిన్ను, వరింతున్ = చెట్టపట్టెదను.

తే. ఎల్లలోకధర్మంబులు నెఱిఁగి యుండి
యేల సేయుదు రమరేంద్రు లీరసంబు ?
నాది వారికి వందనం బాచరించి,
తదనుమతి నిన్ను వరియింతుఁ దథ్య మిదియు. 116

ఈరసంబుక్ = ఈసును - ఈర్ష్యను. వందనంబు = నమస్కారము. తత్ అనుమతిక్ = వారి సెలవుమీఁద. తథ్యము = యథార్థము.

——* నలుని మనశ్శుద్ధికి దేవతలు మెచ్చుకొనుట. *——

మ. అను చన్యోన్యము పెద్దయేనిఁ దడ వేకాంతంబున న్వారు ప్రా
యిన పోక ల్విని చంతరిక్ష గతులై యింతంతటం గాన రా
క నిగూఢాకృతి నున్న దేవతలు దత్కాలంబునన్ రాజ నం
దను నంతర్హితుఁ జేసి, చేరి రతిఁడుం దారు న్నిజస్థానముల్. 117

అనుచున్ = ఈవిధముగా చెప్పుకొనుచు. అన్యోన్యము = ఒండొరులతో. పెద్దయేని తడవు = చాల సేపు. ఏకాంతంబునన్ = ఒంటిపాటున. వారు పోయినపోకల్ = ఆ నల దమయంతులు వర్తించిన వర్తనమును. అంతరిక్ష గతులు = ఆకాశముం బొందినవారు (మింట నున్న వారు.) నిగూఢ ఆకృతిన్ = మఱుఁగుపడిన స్వరూపముతో. అంతర్హితుఁన్ = ఇతరుల కంటికి కానరాని వానినిగా.

తే. నలుని దూతత్వ మిబ్భంగిఁ దెలియఁ జూచి,
త న్మన శ్శుద్ధి కొంది రాత్మల ముదంబుఁ.
దమ్ము నక్కాంత వరియింపఁ దలఁపు లేమి,
ఖేద మందుచు నుండి రింద్రాది సురులు. 118

ఆత్మలక్ = హృదయములలో. తలఁపు లేమిక్ = తలంప నందులకు, ఖేదము = వగ. ఇంద్రాది సురులు - సిద్ధసమాసాంతమందుఁ గావున 'సురులు' అని రూపము.

——* స్వయంవరాగతులు. *——

వ. అనంతరంబ కామరూపం బగు నా సుత్రామాది చతుష్టయం బుపాయాంతరంబున దమయంతి వరియింపం దలంచి, వంచనా నైపుణ్యంబున నల రూపంబులు ధరించి, స్వయంవరకాలంబు ప్రతీక్షించు చుండిరి. నిషధరాజును భోజరాజాధికార పురుష నిర్దిష్టం బైన రమ్య స్థలంబున సపరివారుం డై బృందారకానుమతి వడసి వసియించె. నయ్యవసరంబున. 119

కామ రూపంబు = కోరిక యైన రూపము గలది (ఇష్ట మయిన రూపముం దాల్చునది.) ప్రతీక్షించుచున్ = ఎదురు సూచుచు - వేచి యనుట. భోజ...బు = భీమరాజుయొక్క నియోగిజనులచే చూపఁబడినట్టిది.

మ. చతురంగ ధ్వజినీ సమేతు లగుచుం శస్త్రాస్త్ర విద్యా నిధుల్
రతిరాజ ప్రతిమాన మూర్తులు శర ద్రాకేందు బింబాననుల్
చతు రంభోధి పరీత విశ్వ వసుధా చక్రంబునం గల్గు రా
సుతు లెల్లం జనుదెంచి రవ్విభవముం జూడంగ నెక్కాలమ్మడిన్. 120

అ వ్విభవమున్ = ఆ స్వయంవర వైభవమును, చూడంగన్, శస్త్ర అస్త్ర విద్యానిధుల్ = చేత నతిక్రమడు నాయుధములయు దూరముగా ప్రయోగించు నాయుధములయు (ఇట్లని యమర టీకయందు భరతుని వివరణము.) విద్యలకు నిక్షేపస్థాన మయినవారు (ఆవిద్యలయందు పరిపూర్ణు లనుట), రతిరాజ ప్రతిమాన మూర్తులు = మన్మథునికి సాటి యైన (మన్మథుఁడు సాటిగాఁ గలిగిన అని యేని) రూపము కలవారు (ప్రతీపమేని ఉపమయేని)

('ప్రతిమానం ప్రతిబిమ్బం ప్రతిమా ప్రతియాతనా ప్రతిచ్ఛాయా
ప్రతికృతి రర్చా పుంసి ప్రతినిధి రుప మోపమానం స్యాత్.' అమ.),

శరత్ రాకా ఇందు బింబ ఆననుల్ = శర దృతువునందలి (ఆశ్వయుజ కార్తికిక మాసములు శరదృతువు) పూర్ణిమా చంద్ర మండలమువంటి ముఖము కలవారు (ఉపమ), చతుః ... నన్ = నాలుగు సముద్రములచేత చుట్టుకొనఁబడిన సమస్త భూ వలయంబునందు, కల్గు = ఉన్నట్టి - రాసుతులెల్లన్, చతు...లు = (రథ గజ తురగ పాదాతి మనెడి - 'హ స్త్యశ్వ రథ పాదాతం సేనాఙ్గం స్యా చ్చతుర్విధమ్' అమ.) నాలుగు అవయవములు కల దైన దండుతో ('ధ్వజినీ వాహినీ సేనా' అమ.) కూడుకొన్నవారు, అగుచున్, ఒక్కమ్మడిన్ = ఏకకాలమున, చనుదెంచిరి. 'చతు రం...ఎల్లన్ చనుదెంచిరి'—సంబంధాతిశయోక్తి, అనేక లనుట. (10-1)

తే. రాజవంశజుఁ డై యుండి రానివాఁడు, (10-2)
కామబాణంబులకు గుఱి గానివాఁడు,
సప్త సాగర మధ్య భూ చక్రమునను
నృప కుమారుండు లేఁడు పన్నిదమునకును. 121

రాజ వంశ జుఁడు=రాచ కులమున (జ=) పుట్టినవాఁడు, ...పన్నిదమునకునున్=పందెమున కైనను.—అసంబంధాతిశయోక్తి.

క. కొందఱు తరుణి వరింపం, గొందఱు బలిమిని హరింపఁ, గొందఱు చూడన్,
గొందఱు భూషింపను, నృప । నందను లేతెంచి రుబ్బున న్మహమునకున్.

మహమునకున్ (ఉత్సవమునకు 'మహ ఉద్ధవ ఉత్సవః' అమ.) (10-3) 122

తే. తిలలు పై నెత్తి చల్లిన దిగువఁ బడని (10-5)
యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె.
నఖిల దేశంబులందుండి యవనిపతుఁ
వైభ వాలోకమునకును వచ్చుచుఁ 123

సందడి = జనసంఘము. పెం డ్రోఁవలందుఁ = పెద్ద దారులందు (పెను=పెం-డ్రోఁవాది కార్యము). అవనిపతులు = భూమీశ్వరులు. తిలలు... యంత - విస్తార మనుట - లోకోక్తి:—

'లోకోక్తి కనుకరణ మది । యేఁ; కన్నులు మూసికొని సహింపు మెుక నెలఁ.' అలం.

'అఖిలదేశంబులందుండి' - అతిశయోక్తి - పెక్కుదేశములనుండి యని భా.

క. తఱచగు పెనుసందడిలో। నిఱుకటమునఁ బడ్డనృపతి యీావగ్రహముం
దొలఁగుట యభీప్సితార్థం। బఱచేతికి వచ్చినట్ల యని వెత కుడుచుఁ. 124

తఱచు = దట్టము. పెనుసందడిలోఁ = గొప్పసంఘములో. వగ్రహముఁ = ప్రతిబంధ మును ('అవగ్రహో వృష్టిరోధే ప్రతిబన్ధే గజాళికే' మేది.) అవగ్రహశబ్దమే అనోపసర్గాద్యాక్షర లోపముచేత వగ్రహ మగును - తల్లోపశాస్త్రము:—

'వష్టి వాగురి రల్లోప మవాప్యో రుపసర్గయో
రాపం చైవ హలన్తానాం యథా వాచా నిశా దిశా.'

తొలఁగుట = తప్పించుకొనుట, అభీప్సిత అర్థంబు = కోరినవస్తువు (దమయంతి యనుట), అఱచే తికి వచ్చినట్ల = అబ్బినట్లే (అనుభవమునకు కైవసమై యున్నట్లే), అని, వెత = ఖేదమును, కుడు చుఁ= అనుభవించును. (అభీష్టార్థము) అఱచేతికి వచ్చినట్లే అని లోకోక్తి. (10-5)

తే. వెనుక ముందటి సమ్మర్దములఁ గరంబు (10-6)
దండసిలి మధ్యమున నున్న ధరణివిభుఁడు
యంత్రి సిద్ధార్థ భావంబు నలమికొనియుఁ,
దను నసిద్ధార్థుఁ గా నాత్మఁ దలఁచుచుండు. 125

వెను...లఁ = వెనుకటి సందడిచేతను ముందటి సందడిచేతను, కరంబు = మిక్కిలి, దండసిలి = ఇఱుకుకొని (నలిగి), ... యంత్ర సిద్ధార్థ భావంబుఁ = గానుఁగలోని తెల్లావాల తనమును ('సిద్ధార్థ స్తు పుమాఁ శాక్యసింహే చ సితసర్షపే' విశ్వ.), అలమికొనియుఁ = పొందియును (గానుఁగలోని యావాలవలె నలిఁగియు), తనుఁ, అ సిద్ధ అర్థుఁ గాఁ = తెల్లా వాలు కానివానినిగా (తీఱిన కోరిక గలవాఁడు కానివానినిగా - కోరిక తీఱని వానినిగా), ఆ త్మఁ - తలఁచుఁ - తన కోరిక తీఱునది కా దని ఈనలుఁగుడు శకునముచేతనే తెలిసికొన్నాఁ డనియు భా.— విరోధాభాసాలంకారము.

ఉ. కోటి భుజంగపుంగవులు గొల్వఁగ, వందిజనంబు ముందటం (10-8)
జాటువు లుగ్గడింప, ఫణ సంభృత రత్న దిశా విభాసి యై,
వీటిజనంబు లెల్లఁ దను విస్మయ మొంది కనుంగొనంగఁ, గ
ర్కోటకుఁ డేఁగుదెంచె మద ఘూర్ణిత పాటల నేత్ర పద్ముఁ డై. 126

కర్కోటకుఁడు = కర్కోటకుఁ డను నాగరాజు, మద... డై = కైపుచేత (లేక-గర్వ ముచేత)తిరుగుడువడుచున్న తెలుపు గలసిన యెఱుపు గల కనుఁదమ్ములు కలవాఁ డై, ఫణ...యై= పడగలయందు('స్ఫటాయాం తు ఫణా ద్వయోః' అమ.)తాల్పఁబడిన(ఉన్నట్టి యనుట_అట సహజ

ముగా మొలచినవే) రత్నములచేత దిక్కులను వెలిఁగించుచున్నవాఁడు ఐ, కోటి = కోటిమంది, భుజంగ పుంగవులు = సర్ప శ్రేష్ఠులు ('భుజఙ్గః సర్ప షిఙ్గయోః' హేమ. – 'కోటి...వులు' అని సమాస మైనను గావచ్చును.), కొల్వఁగన్ = బలసి వచ్చుచుండఁగా, వంది జనంబు = స్తుతిపాఠక సమూహము('వన్దినః స్తుతిపాఠకాః' అమ.),ముందటన్ =అగ్ర ప్రదేశమునందు (తన మ్రోల ననుట), చాటువులు = ప్రియస్తుతులను ('చటు చాటు ప్రియప్రాయమ్' హేమ.), ఉగ్గడింపన్ = వచించుచుండఁగా, వీటి జనంబులు ఎల్లన్=ఊరి మనుష్యులు అందఱును, తనున్, విస్మయము అంది= వింత పడి, కనుంగొనంగన్ = చూచుచుండఁగా, ఏఁగుదెంచెన్ = వచ్చెను.

మ. ప్రమ థాధీశ భుజాంతర స్థల ఘన ప్రాలంబహారం బద (10-25)
భ్రి మనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణా పర్యంత మాణిక్య మం
జు మయూ ఖాంకుర పుంజ మంజుల నభస్కుం డై భుజం గాంగనా
సముదాయం బిరువంకఁ బాడఁగ యశ స్సంగీత గాథావళుల్. 127

ప్రమ...బు = ప్రమథులకు దొర యైన శివునియొక్క ('మృత్యుఞ్జయః కృత్తివాసాః పినాకీ ప్రమథాధిపః' అమ.) వక్షఃస్థలమునందలి ('న నా క్రోడం భుజాన్తరమ్' అమ.) గొప్పదైన మెడనుండి తిన్నఁగా వ్రేలు ముత్యాలదండ యైనవాఁడును ('ప్రాలమ్బ మృజు లమ్బి స్యాత్ కణ్ఠాత్' అమ.) ధావళ్య సామ్యముచేత ము త్తెపు దండ యనుట–వాసుకి శివునికి పెక్కువిధముల ఆభరణంబును ఉపకరణంబు నని 5 ఆ. 25 – 26 లో చూ.], అదభ్ర మనోజ్ఞ ఆకృతి = గొప్పదియు ('అదభ్రం బహుళం బహు' అమ.) సుందరము నయిన స్వరూపము కలవాఁడును (నిక్కిలి యొడ్డు పొడుగు గలవాఁడును సుందరుఁడును అనుట, ) ( అయిన ), వాసుకి = ఆ పేరి నాగరాజు ('వాసుకి స్తు సర్పరాజః' అమ.) ఫణా...డై=పడగల తుదలయందలి పద్మరాగముల మనోహరంపు వెలుఁగు మొలకల సమూహములచేత సొంపైన యాకాశము కలవాఁడై, భు...బు= పాఁప చేడియల సంఘము, ఇరు వంకన్ = ఉభయ పార్శ్వములయందును, యశః... ళుల్ = (తన) కీర్తియొక్క పాట లయిన సంస్కృతేతరభాషాకృతులయొక్క ('గాథా శ్లోకః సంస్కృతాన్యభాషాయాం గేయ వృత్తయోః' మేది.) పరంపరలను, పాడఁగన్ = పాడుచుండఁగా, వచ్చెన్.

వ. ఇం ద్రాగ్ని యమ వరుణు లేతెంచిరి; తక్కిన దిక్పాలురు రారైరి; యది యెట్టి దనిన (10-10). 128

సీ. రాజు నొజ్జల మంత్రరక్షాబలంబున (10-11)
రాఁ బొందు గా దయ్యె రాక్షసునకు,
దమయంతితోడి నేత్రస్పర్థ కతమున, (10-12)
నిజవాహనము రామి నిలిచె గాలి,
తనరూపు కైలాసదర్పణంబునఁ జూచి (10-13)
వ్రీడఁ గుబేరుఁ డిల్వెడలఁ డయ్యె,

నర్ధనారీశ్వరుం డగుట నీశానుండు (10-14)
సామేని యంకిలిఁ జాఁగ కుండెఁ,

తే. దాను వహియించు ధాత్రి కెవ్వానిఁ బెట్టి (10-15)
వచ్చు నటు గాన శేషుండు వచ్చు టుడిగె,
ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు (10-16)
దగవు గా దని రాఁ డయ్యెఁ దాత వేల్పు. 129

రాజు ... నన్ = రాజపురోహితుల (రక్షోఘ్న) మంత్రములచే నయిన (నిగ్బంధాదిరూప) రక్షణ బలముచేత, రాక్షసునకున్=నిర్పతికి, రాన్, పొందు గా దయ్యెన్=అనువు పడదాయెను.

గాలి = వాయుదేవుఁడు, దమయంతితోడి - నేత్రస్పర్ధ కతమునన్ = నేత్రములచేతి ద్వేషము కారణముగా, నిజవాహనము = తన వాహనమయినలేడి, రామిన్ = రానందున, నిలిచెన్ = రాకమానినాఁడు [లేడి దృష్టులకును అంగనాదృష్టులకును సామ్యము ప్రసిద్ధము.]

కుబేరుఁడు = ఉత్తరదిగధిపతి [కుత్సిత మయిన బేరము (శరీరము) కలవాఁడు అని వ్యు.], తనరూపును, కైలాస దర్పణంబునన్=కైలాస పర్వత మనెడి యద్దములో [మెఱుఁగెక్కిన వెండిలోను శుద్ధస్ఫటికమందును ప్రతిబింబ మగపడును గావున వెండియును స్ఫటికమును అగు కైలాసమునకు దర్పణముగా నుపయోగము చెప్పఁబడినది.— 'రజతాద్రి స్తు కైలాసోఽష్టాపదః స్ఫటికాచలః' హేమ.]

... వ్రీడన్ = సిగ్గుచేత (సిగ్గు తనవికృతరూపమునకై - 'మన్దాక్షం హ్రీ స్త్రపా వ్రీడా లజ్జా' అమ. — ఈయనకు మూఁడు పాదములు, ఎనిమిది దంతములు, మెల్లకన్ను; ఈకురూపము గౌరీశాపమువలనం గలిగినది.)...

ఈశానుండు = శివుఁడు, అర్ధనారీశ్వరుఁడు = (ఎడమ) సగము (దేహము) స్త్రీ (పార్వతి) గాఁ గల యీశ్వరుఁడు, ...సామేని యంకిలిన్ = సగము దేహంపు నిరోధముచేతను కుడిసగ మగు నీయన ముందటికి నడిచిన ఎడమ సగ మగు పార్వతి వెనుకకు నడచును — ఆ యడ్డగింతచేత నని భా.) చాఁగ కుండెన్ = తరలఁ డాయెను.

ధాత్రికిన్ = భూమికి (భూమి మోచుటకు), ... తాత వేల్పు = తాత యైన దేవుఁడు (బ్రహ్మ), ముదిసి = వయస్సై, ముప్పునన్=వార్ధకమునందు, ...మొగము వేల్పు = మొగము వేల్చుట (ఆశాసూచకముగా మొగమును చిట్లించుట యనుట), తగవు = ఉచితము, ...

వీరు రామికి ఇవి కారణములు గావు, కారణములుగా నుత్ప్రేక్షింపఁబడినవి.— కడమ గొప్పవా రందఱును వచ్చి రని యతిశయోక్తి వ్యంగ్యము.

తే. ఇట్లు త్రైలోక్య వాసులు నేగుదెంచి (10-28)
రమ్యమాహాత్సవమునకు నయ్యవసరమునఁ
బ్రసవసాయక నారాచ పక్ష జాల
మహిత వాతూల తూలాయమాను లగుచు. 130

ప్రస...నులు = పూవు టమ్ములవాని యినుపబాణముల గఱుల సమూహముయొక్క పెను గాలి మొత్తము యొక్క ('వాతూలః పుంసి వాత్యాయా మపి వాతాసహే త్రిషు' అమ.) దూది (పింజల) వంటివారు (మదనాతురులై యనుట – ఆమెయొక్క సౌందర్యాతిశయ శ్రవణ మాత్రమున మదనునికి అతిసులభముగా వశులై వడిగా వచ్చినారని ఉపమాస్వారస్యము – తూల మువలె నాచరించుచున్నవారు తూలాయమానులు.)

వ. (*a*) అప్పుడు కనకమయ రమ్య హర్మ్య నివేశంబులం గ్రథకైశికాధీశ్వరుండు విడియింప నభినవాభ్యాగతులగు మూఁడు లోకంబుల రాజులును విడిసిరి **(10-27).** యా రాజ సమాజంబు గుండిన నగరంబునందుఁ బుండరీకాక్షు జఠరంబునందు భువనత్రయంబును, గుంభసంభవు హస్తాంభోరుహంబునందు నంభోధి చతుష్టయంబును, బంచాక్షరంబునందుఁ బరమేశ్వరుండునుంబోలె, నసంబాధంబై యుండె **(10-30).** (*b*) నానా విచిత్ర చిత్రంబులగు పుర భవన భిత్తి భాగంబులతోడి ప్రతిస్పర్ధంబోలె నాకాశభాగంబు మూర్ధాభిషిక్త మకుట రత్న ప్రభాభారంబులచేతఁ గిర్మీరితం బయ్యె **(10-31).** నమ్మహోత్సవాడంబరం బవలోకింప నంబరంబునఁ బీతాంబర **(10-50)** త్ర్యంబకులు దేవతా కదంబంబులు గొలువఁ గొల్వుండిరి. (*c*) కందళిత హృదయారవిందంబైన సనక సనందనాది యోగీంద్ర బృందంబును మందపాల బక దాల్భ్య రైభ్యక భరద్వాజ గౌతమ ప్రభృతి మహర్షి సందోహంబును దగిన నెలవులనుండి విలోకించుచుండె. సముత్తుంగ మంగళ మృదు మృదంగ నినాద భంగీతరంగిత సంగీత ప్రసంగంబై విబుధ వారాంగనా జనంబు నభోరంగంబునఁ బ్రవర్తించె. వెండియు; 131

(*a*) కన...లన్ = బంగారుతో చేయఁబడిన రమణీయపు మేడలగు విడుదులయందు (నివేశః శిబిరం షణ్డే' అమ.) క్రథకైశిక = విదర్భ. విడియింపన్ = బస చేయింపఁగా. అభినవ అభ్యాగతులు=క్రొత్తగా వచ్చినవారు. సమాజంబు=సమూహము (పశువుల గుంపైనచో సమజ మనంబడును.) పుండ...దున్ = తెల్లదామరఁవంటి నేత్రములు కలవాఁడయిన నారాయణుని ('దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దో గరుడధ్వజః' అమ.) పొట్టలో. ('జఠరో న స్త్రియాం కుక్షౌ బద్ధ కక్కటయో స్త్రిషు' మేది.), భువన త్రయంబును = ముల్లోకములును [విశ్వ మెల్ల పుండరీకాక్షుని గర్భమం దున్న దనుటకు –

'కి మధిక మత్ర బ్రూమో మహిమానం వారిధేర్హరి ర్యత్ర
అజ్ఞాత ఏవ శేతే కుక్షౌ నిక్షిప్య సకల భువనాని.'

తాను మన్ను తిన లేదని శ్రీకృష్ణులవారు నోరు తెఱచి తల్లికి విశ్వముం జూపిన కథ ప్రసిద్ధము:–

'య ద్యేవం తర్హి వ్యాదేహీ త్యుక్తః స భగవాన్ హరిః
వ్యాద త్తావ్యాహతైశ్వర్యః క్రీడా మనుజ బాలకః.

సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః
సాద్రిద్వీపాబ్ధి భూగోళం సవాయ్వగ్నీన్దుతారకమ్.
జ్యోతిశ్చక్రం జ్వల త్తేజో వివరాణి రసాతలమ్
వైకారికా ణీన్ద్రియాణి మనోమాత్రా గుణా స్త్రయః.
ఏత ద్విచిత్రం సహ జీవకాల స్వభావ కర్మాశయ లిఙ్గ భేదమ్
సూనో స్తనౌ వీక్ష్య విదారితాస్యే వ్రజం సహాత్మాన మవాప శఙ్కామ్.' భా.

కుంభ...దుక్ = అగస్త్యుని కర కమలమందు, అంభోధి చతుష్టయంబును=నాలుగు సముద్రములు (నాల్గు దిక్కులందుండు నాల్గు నని భా.), పంచాక్షరంబునందుక్ = పంచాక్షరీమంత్రంబునందు, పరమేశ్వరుండునుక్... = పరమశివుండును, పోలెక్ = ఉన్నరీతిగా, అసంబాధంబు = ఇఱుకటము లేనిది. ['ఆరాజ...ఉండెక్' - ఈవాక్యమందు ఉపమలు స్ఫుటములు. ఆనగరము మహావిశాల మని తా. మూఁడు లోకంబుల రాజ తత్పరివార సమూహము నగరములో ఎక్కడనో ఇమిడి పోయె నని భా. అందువం జేసి అధికాలంకారంబునుం గలదు:—

'అధి కాధారముకన్నను । నధికం బాధేయ మైన నధికం బమరుక్
అధి కాధేయముకన్నను । నధికం బాధార మైన నధికంబ యగుక్.' అలం.]

(b) ఆకాశభాగంబు, నానా విచిత్ర చిత్రంబులు = పెక్కులును ('నానాఽనేకోభయార్థయోః' అమ.) అబ్బురములు నయిన చిత్తరువులు గలవి ('ఆలేఖ్యాశ్చర్యయోః శ్చిత్రమ్' అమ.), అగు-పుర భిత్తి భాగంబులతోడి=ఊరిలోని గోడల ప్రదేశంబులతో నయిన ('భిత్తిః స్త్రీ కుడ్యమ్' అమ.) - ప్రతిస్పర్ధం బోలెక్=పోటిచేతనో యనునట్లుగా, మూర్ధ...చేతక్=భూపతులయొక్క ('మూర్ధాభిషిక్తో భూపాలే మన్త్రిణి క్షత్త్రియేఽపి చ' అమ.) కిరీటములయందలి ('అథ మకుటం కిరీటం పున్నపుంసకమ్' అమ.) మణుల కాంతుల మొత్తములచేత, కిర్మీరితంబు = నానావర్ణములు గలది, అయ్యెక్ [కారణము గానిది పోటి కారణముగా సంభావింపఁబడినందున హేతూత్ప్రేక్షాలంకారము.] ఆడంబరంబుక్ = విజృంభణమును. అవలోకింపక్ = చూచుటకు,అంబరంబునక్= ఆకాశమందు ('అమ్బరం నద్వయో ర్వ్యోమ్ని సుగన్ధ వ్యన్తర వస్త్రయోః' మేది.), పీతాంబర త్ర్యంబకులు = హరి హరులు. కదంబంబులు = సమూహములు ('కదమ్బం నికురమ్బే స్యా న్నీపసర్షపయోః పుమాక్' మేది.) కందళిత హృదయ అరవిందంబు = (ఆనందంపు) మొలక లెత్తిన ('కన్దళం త్రిషు కపాలేఽప్యుపరాగే నవాఙ్కురే' మేది.) మనః పద్మము కలదైన - సనక...బు= సనకుఁడు సనందనుఁడు లోనగు యోగీశ్వరుల సమూహము (సనక సనందనులు బ్రహ్మయొక్క మానసపుత్త్రిలు.) ప్రభృతి = మొదలయిన. సందోహంబు = సమూహము. నెలవులక్ = స్థానములందు. విలోకించుచుక్ = చూచుచు. విబుధ వారాంగనా జనంబు = దేవ గణికా సమూహము ('వారస్త్రీ గణికా వేశ్యా' అమ.), నభో రంగంబునక్ = ఆకాశ మనెడి నాట్యస్థానమందు ('రఙ్గో నా రాగే నృత్య రణక్షితౌ' మేది.) సము...బై - మిక్కిలి యున్నత మైన (హెచ్చు శ్రుతిలోనున్న) మంగళకరము లయిన మంజుల మయిన మద్దెళ ధ్వనుల ప్రకారములచేత అల లెత్తినట్టి సంగీతగోష్ఠి కల దై, ప్రవర్తించెక్.—

చ. మగువలు భూమిపాలురకు మాటికి మాటికి వైచు కుంచెల (11-4)
న్నెగసిన మారు తౌఘములు నిర్భర సౌరభ సంప్రదాయ మిం

పుగ నధివాసధూపములఁ బ్రోది యొనర్చుచు నిచ్చె నర్చనల్
గగనమున న్మహోత్సవముఁ గన్గొన వచ్చిన దేవపంక్తికిన్. 132

మగువలు=స్త్రీలు, భూమి...లన్ = రాజులకు మాటిమాటికి వీచునట్టి చామరలవలన, నెగసిన మారుత ఓఘములు = లేచిన గాలి సమూహములు ('ఓఘో వృన్దేఽమ్భసాం రయే' అమ.), గగనమునన్ = ఆకాశమునందు, మహో...కిన్, నిర్భర సౌరభ సంప్రదాయము = గాఢమయిన పరిమళముయొక్క పారంపర్యాచారమును, ఇంపుగన్ = చక్కఁగా, అధివాస ధూపములన్ = వాసనార్థమయిన ధూపములచేత, ప్రోది యొనర్చుచున్ = పోషించుచు, ఇచ్చెన్=కావించెను. (కర్త మారుతౌఘములు.)— రాజులకు వేడియ లిడిన వింజామరలగాలి మహోత్సవముం గనుటకు వచ్చి మింట నున్న దేవతలకు దివ్యపరిమళార్పణాచారమును అధివాసధూపములచే నెఱవేర్చి పూజ సల్పినది. గమ్యోత్ప్రేక్ష.

తే. అల్లనల్లన వీచె మంచాంతరములఁ (11-5)
జంచ దవనీంద్ర చయ చంద్ర చంద నాను
లేప నైపథ్య కుసుమ మాలా పరాగ
గంధ వహ మైన చల్లని గంధవహము. 133

మంచ అంతరములన్ = మంచెల నడుమ, చంచత్...మైన = వ్యాపించుచున్న ('గంధ' విశేషణము) రాజ సమూహముయొక్క కర్పూర చందనములయు ('అథ కర్పూర మస్త్రియాం। ఘనసార శ్చన్ద్ర సంజ్ఞః' అమ.) మైపూఁత యనెడి యలంకారముయొక్కయు ('నేపథ్యం తు ప్రసాధనే') పూల దండల పుప్పొడియొక్కయు పరిమళమునకు మోపరియైన, చల్లని - గంధవహము= గాలి, అల్లనన్ = మెల్లఁగా, వీచెన్ = ప్రసరించుచుండెను.—యమకము.

సీ. పైపై మహైశ్వర్య పర్యుత్సుకంబులై (10-40)
తనమీఁద నృపుల నేత్రములు వ్రాల,
నలినాప్తు సన్నిధి నక్షత్రములు వ్రాలె (10-39)
రాజులు దనమ్రోలఁ బ్రభలఁ దొఱఁగ,
నఖిల లోక మనోజ్ఞమై యొప్పు తన మూర్తి (10-41)
చిత్తసంభవు నైన సిగ్గుపఱుపఁ,
దన ప్రాభవము దేవతాకోటి నైనను
బాణిపద్మములు మోడ్పంగఁ జేయ,
తే. వలపు మిగులఁ, బతింవరా వరణ యోగ్య
రమ్య శృంగార కలితుఁడై రాజవీథి
నల్ల నేతెంచి యొక్క సింహాసనంబు
నధివసించెను నలుఁడు మంచాగ్రభూమి. 134

పై పైన్ = మఱియు మఱియు, మహా...లై - మహాత్ = మెంపయిన - ఆశ్చర్య = వింతచేత - సముత్సుకంబులు ఐ = కుతూహలము కల వై,... నేత్రములు=కన్నులు (చూపులు.)

నలినాప్తు = సూర్యునియొక్క (నలిన = తామరకు - ఆప్తుఁడు = చుట్టము) మ్రోలన్ = ఎదుట, తోఁలఁగన్ = కోలుపోవు చుండఁగా.

చిత్తసంభవున్ = మన్మథుని.

ప్రాభవము = శివి. కోటిన్ = సమూహమును. పాణి పద్మములు = కేలుఁ దామరలు.

వలపు = (దమయంతి మీఁది) యనురాగము. వరిం...డై = వగని వరించుదానికి (వరించనట్టిది) వరించుటకు తగిన మనోహరమయిన సింగారముతో ('శృఙ్గారః సురతే నాట్యరసే చ గజ మణ్డనే' - ఇచట లక్షణచేత మండనమాత్ర మర్థము) కూడుకొన్న వాఁ డై. మంచ అగ్ర భూమిన్ =మంచె మీఁది ప్రదేశమును...అధివసించెన్ = ఎక్కి కూర్చుండెను.

ద్వితీయ తృతీయ పాదములందు ఉపమ. చతుర్థమందు 'వినను' అనుటచే 'ఇతరులమాట చెప్పవలయునా' అని అర్థము వచ్చుచున్నది గాన కావ్యార్థాపత్తి ధ్వని.

'సింహాసనంబు నధివసించెన్' - 'వస' ధాతువు 'అధి' పూర్వకమైనచో సకర్మకమగును, వసత్యాధారమే కర్మ యగును, కావున 'సింహాసనమునం దధివసించె' ననుట యశాస్త్రీయము.

తే. కదిసి పరిపాటి మణిమంచకములమీఁద, (10-18)
రాకుమారకు లై యున్న నాకవిభులు
నలుని యమకంబు లై యునికిఁ దెలియఁ, జూచి,
తారు నవ్వేళ నల రూప ధారు లైరి. 135

(నలుని పిమ్మట ఇంద్రాదులు స్వయంవరశాలకు వచ్చి రని చెప్పుచున్నాఁడు:—) కదిసి = నలుని దఱిసి (అతనిప్రక్కను అతనితో ఏకపంక్తిగా), పరిపాటిన్ = వరుసగా (ఇంద్రాగ్ని యమ వరుణ క్రమమున), మణి మంచకముల మీఁదన్ = రతనాల మంచెల మీఁదను, రాకుమారకు లై = రాజకుమారులు గా,ఉన్న = వచ్చి యున్నట్టి - నాకవిభులు = స్వర్గపతులు (ఇంద్రాదులు), నలుని యమకంబులు ఐ = నలునికి కేవల సదృశులు గా, ఉనికి = ఉండుట, తెలియన్= అగపడునట్లు [తమ్ము ఒక్కొక్కనిని నలుఁడే యని చూపఱు గ్రహించునట్లు అనుట - పద్యాదులలో యమకములకు అర్థభేదమే గాని రూపభేదము లేదు.—తల్లక్షణాది:—

'సమవర్ణయుగాధిక మై । యమరిన నియమంబు యమక మగుఁ గృతులందున్.'

'యో యః పశ్యతి తన్నేత్రే రుచిరే వనజాయతే,
తస్య త స్యాన్య నేత్రేషు రుచి రేవ న జాయతే'

కావున రూపభేద మేమియు లేకుండ నని భా.], తారున్=తాము కూడ, అవ్వేళన్=ఆసమయమందు, నల రూప ధారులు=నల రూపమును దాల్చినవారు, ఐరి (నలభ్రమచేత నైనను తమలో నొకని దమయంతి వరించుఁగాక యని యడియాస గొని యిట్లు చేయుట.)

ఉ. ఈసకలంబునం గల మహీపతి వర్గము నున్న నుండ నీ, (10-24)
యీసభ నొప్పె నప్డు నిషధాధిపుచేతఁ జతుర్దిగీశ చ్ఛ్రే;

వాసవ లోక దివ్య వనవాటిక సర్వనగాఢ్య యయ్యు ను
ద్భాసిత లక్ష్మి నొందున కదా యల కల్పక పంచకంబుచేన్. 136

ఈ సకలంబునన్=ఈ ప్రపంచమునం దంతటను - కల = ఉన్నట్టి (ప్రపంచ మంతటినుండి వచ్చి యచ్చట నున్నట్టి) - మహీపతి వర్గమున్=రాజ సమూహ మెల్ల, 'వర్గమున్' - ఈద్రుతము సముచ్చయ మువర్ణము - లేదా - 'ఈ'యను 'నిచ్చు' ధాతువునకు కర్మ. ఉన్నన్ ఉండనీ=ఉన్న నుండును గాక; అప్పుడు ఆసభ, నిషధాధిపుచేతన్ = నలునిచేతను, చతు ర్దిగీశిచేన్ = దిక్పాల చతుష్టయముచేతను [చతుర్ణాం దిగీశానాం సమాహారః చతుర్ది గీశీ - నలుగురు దిగీశుల మొత్తము చతుర్దిగీశి], ఒప్పెన్ = శోభావిశేషవంత మై యుండెను ; వాసవ లోక దివ్య వన వాటిక = ఇంద్ర లోకమందలి నందన వన రాజి, సర్వ నగ ఆఢ్య = ఎల్ల చెట్లచేతను దొడ్డది ('శైల వృక్షౌ నగా వగౌ,' 'ఇభ్య ఆఢ్యో ధనీ' అమ.), అయ్యున్, అల కల్పక పంచకంబుచేన్ = ఆ (ప్రసిద్ధ లయిన) యయిదు కల్పవృక్షములచేతను.

['పఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతకః
సన్తానః కల్పవృక్ష శ్చ పుంసి వా హరిచన్దనమ్.' అమ.],

ఉద్భాసిత లక్ష్మిన్=వెలుంగుచున్న శోభను, ఒందున్ అ కదా= అవశ్యముగా పొందును గదా. [అకారము ఏవార్థకము - దానిని 'పంచకంబుచేన్' అనుపదముతో 'పంచకంబుచే న =' పంచ కంబుచేతనే - అని యన్వయించుకొనవలయును.]

ఇతరవృక్షములకును కల్పవృక్షములకును ఎంత తారతమ్యమో అంత తారతమ్యము కడమ రాజులకును పంచనలికిని ఉండెను. నందనారామము ఇతరవృక్షములచేత శోభించి అందులకు లెక్క లేని మడుంగులు కల్పవృక్షములచేత శోభించినట్లు, స్వయంవరశాలయు కడమరాజులచే శోభించి అందులకు లెక్కలేనిమడుంగులు నలపంచకముచే శోభించె నని భా. 'ఉన్న నుండ నీ' అనుటచే పంచ నలి ముందఱ వారు కొఱగా కుండి రని భా. ఒప్పుటయు ఉద్భాసితలక్ష్మి నొందుటయు నను నొక ధర్మము భిన్నవాక్యములలో భిన్నశబ్దోపాత్త మగుటచేత ప్రతివస్తూపమాలంకారము.

వ. ఇవ్విధంబున సుమేరు భూధర కూట సన్నిభంబు లగు హాటక మంచకం బుల మీఁదఁ (10-66) గర్కోటకవాసుకి ప్రభృతు లగు పాతాళ భువనవాసు లును మేధాతిథి ప్రధాను లగు వసుధాలోక వాస్తవ్యులును పాకశాసన పరేత రాజ ముఖ్యు లగు త్రివిష్టప నిలయులును సుఖోపవిష్టు లై యుండుటఁ గనుంగొని, సంతుష్టాంతరంగుం డై, భీమభూపతి తనడెందంబులోన 'నీయున్న యందఱు బృం దారక సంకీర్తనీయ చరిత్రులు, వీరి కుల శీల వృత్త విభవంబు లెఱింగి వర్ణించి దమయంతికిం జూపి చెప్పం (10-67) దై్రలోక్యజనని నిత్యప్రగల్భవాచాల భగవతి భారతీదేవి దక్కం దక్కినవారు నేర.' రని విచారించి, యమ్మహాదేవి నిట్లని ప్రస్తుతించె.

... సుమే...లు = మేరు పర్వత శిఖర తుల్యములు ('మేరు స్సుమేరు ర్హేమాద్రిః,' 'కూటోఽస్త్రీ శిఖరం శృఙ్గమ్' అమ.) హాటక = బంగారపు. ['సుమేరు...కంబుల'—ఉపమ.]

భువన = లోక. మేధాతిథి = ఒకానొక రాజు - ప్రధానులు=ప్రధానుఁడుగాఁ గలవారు (మేధాతిథి ప్రభృతు లనుట.) వసుధా లోక వాస్తవ్యులు = భూ లోక నివాసులు. త్రివిష్టప నిలయులు = దేవతలు (త్రివిష్టప=స్వర్గము - నిలయులు=నివాసముగాఁ గలవారు). సుఖ ఉపవిష్టులు = సుఖముగా కూర్చున్నవారు. డెందంబు లోపల = హృదయము లోపల. బృందారక సంకీర్తనీయ చరిత్రులు = దేవతలచే కొనియాడంబడం దగిన చరిత్రలవారు (దేవతలకన్న శ్రేష్ఠు లనుట.) కుల శీల వృత్త విభవంబులు = వంశ స్వభావ చరిత్రంబుల యతిశయంబులను. నిత్య ప్రగల్భ వాచాల = ఎప్పుడును ప్రతిభావతియు వాగ్మినియు నయిన, భగవతి =

('ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇ తీఙ్గనా.'

అని చెప్పఁబడిన) షడైశ్వర్యములు కలది, భారతీ దేవి = సరస్వతీదేవత.

## —* భీమరాజు సరస్వతిని ప్రార్థించుట. *—

### దండకము.

(*a*) జయ జయ జనయిత్రి, కల్యాణ సంధాత్రి, గాన్ధర్వ విద్యాకళా కణ్ఠనాళాం, త్రివేదీవళీం సార సాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్లస ద్వృత్తరఙ్గా **(10-73)**, మనేకాభిచార క్రియా హోమ ధూమావళీ మేచ కాథర్వ ణామ్నాయ రోమావళిం **(10-74)**, కల్ప శిక్షా శిరాకల్ప సాక్షా చ్చరిత్రాం నిరుక్త ప్రియోక్తిం **(10-75)**, భుజద్వంద్వతా మశ్నువానేన సంశోభితాం ఛన్దసా జాతి వృత్త ప్రభేద ప్రభిన్నేన **(10-76)**, విద్యామయీం త్వాం భజే.

(*b*) భగవతి, గుణ దీర్ఘ భావోద్భవాం సంతతిం సందధానం మహాశబ్ద నిష్పాదక వ్యాక్రియా శాస్త్ర కాఞ్చీకలాపం కటీమణ్డలే బిభ్రతీం **(10-77)**, జ్యోతిషా హారదణ్డేన తారోదయ స్ఫూర్తి విద్యోతమానేన విభ్రాజితా **(10-78)**, మార్తప తూనురాగాన్వితాభ్యా ముభాభ్యాం చ పూర్వోత్తరాభ్యాం మహాదర్శనాభ్యాం ప్రతిష్ఠాపితోష్ఠ ప్రవాళాం **(10-79)**,

పర బ్రహ్మ కర్మార్థ భేదా ద్విధాయ ద్విధా స్వం శరీరం ప్రతిష్ఠాం పరాం ప్రాప్తయా చారు మీమాంసయా మాంసలే నోరుయుగ్మేన సమ్యక్పరాచ్ఛాదనం లాలయన్తీం **(10-80)**, ముహుః పత్త్రిదానే గుణాన్విత పూగాసకృత్ఖణ్డన ప్రౌఢి మాఢౌకమానేన దన్తాత్మనా తర్కతన్త్రేణ కామ ప్యభిఖ్యాం ముఖే ఖ్యాపయన్తీం**(10-82)**, ధ్రువం దేవి వన్దేతమాం త్వా మహమ్.

(*c*) ద్రుహిణ గృహిణి, మత్స్య పద్మాది సంలక్షితం పాణిపద్మం త్వదీయం పురాణమ్ **(10-83)**, శిర స్త్రావకం నిర్మలం ధర్మశాస్త్రమ్ **(10-84)**, దలాభ్యాం

భ్రువా వోంక్రియా మన్త్రరాజస్య, తద్బిన్దునా చిత్రకం ఫాలభాగే తదర్ధేన్దునా తే విరిఞ్చి ద్విపఞ్చీ కల క్వాణనా కోణ చాపం ప్రణిన్యే స్వయమ్ (10-85).

(*d*) భవతు మమ సదా శుభం భారతి, త్వత్ప్రసాదా దసాధారణా త్సత్క్రి పాధారభూతం ప్రభూతమ్. నమ స్సోమ సిద్ధాన్త కాన్తాననాయై, నమ శ్శూన్య వాదాత్మ మధ్యాన్వితాయై, సువిజ్ఞాన సామన్త్య హృత్పఙ్కజాయై, నమస్తే స్తు సాకారతా సిద్ధిభూమ్నే (10-87), నమస్తేఽస్తు కైవల్య కల్యాణ సీమ్నే, నమ స్సర్వ గీర్వాణ చూడామణి శ్రేణి శోణ ప్రభా జాల బాలాతప స్మేర పాదామ్బుజాయై, నమస్తే శరణ్యే, నమస్తే వరేణ్యే, నమ శ్శర్మదాయై, నమో నర్మదాయై, నమ శ్శాశ్వతాయై,నమో విశ్రుతాయై,నమ శ్శారదాయై, నమ స్తే నమ స్తే నమః.138

(*a*) జనయిత్రి = ఓతల్లీ, కల్యాణ సంధాత్రి = మంగళము సమకూర్చుదానా, జయ = సర్వోత్కృష్టురాలవుగా నుండుము. గాన్ధర్వ విద్యా కళా కణ్ఠ నాళామ్ = సంగీత విద్య యనెడి శిల్పమే గొంతుక్రోవిగా కలదానవు, త్రి వేదీ వళీమ్ = మూఁడు వేదముల సమాహారమే (కడుపు మీఁది) ముడుఁతలు గాఁ గల దానవు, సార...రజ్గామ్ = శ్రేష్ఠ మయిన కవిత్వముయొక్క తనివిచేత చేయఁబడిన చూపుఁ గరుల్లు (కరుళ్లవంటి చూపులు) గలదానవు, అనే...లిం = పెక్కు లయిన (అభిచార =) హింసాకర్మ లయిన ('హింసాక ర్మాభిచారః స్యాత్ 'అమ.) కృత్యల యందలి వేల్మి పొగలచే నల్లనిదియు (ఆథర్వణ=) అథర్వమునిప్రోక్తమును ఐన వేదమే ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః' అమ.) నూఁగారుగాఁ గలదానవు, కల్ప... త్రామ్ - కల్ప=కర్మకాండయు - శిక్షా = అకారాదివర్ణ స్థాన ప్రయత్నాది బోధక మయిన వేదాంగమునందలి - అక్షర = అకారాది వర్ణములే - అకల్ప = తొడవులును - సాక్షాత్ = ప్రత్యక్షమయిన - చరిత్రామ్ = చరిత్రమునుం గాఁ గలదానవు (ఆమెయొక్క చరిత్ర ఇతరులకు ఉపదేశభూత మయినదిగావున అది శిక్షాగ్రంథముగా చెప్పఁబడినది), నిరుక్త = వేదార్థములను నిర్వచించు వేదాంగమయిన (నిరుక్త) విద్యయే - ప్రియ ఉక్తిమ్ = ప్రియ భాషితముగాఁ గలదానవు, భుజ ద్వన్ద్వతామ్ = బాహు యుగళ భావమును, అశ్నువానేన = పొందినదియు - జాతి ... న - జాతి = మాత్రావృత్త రూపము లయిన యార్యాదులును - వృత్త=అక్షరసంఖ్యాతము లయిన యుక్థాదులును - అనెడు - ప్రభేద = ప్రకారములచేత - ప్రభిన్నేన=(రెండు) తెఱంగులు చెందినదియు - నైన-ఛన్దసా = పద్యలక్షణముచేత - సంశోభితామ్ = దీపించుచున్న దానవును, [జాతియు వృత్తము నని ఛందస్సు రెండు తెఱంగులు, ఆరెండును సరస్వతికి బాహువులై యున్న వని భా.] - ఇట్టిదానవై - విద్యామయీమ్ = విద్యాస్వరూప మయిన, త్వాం = నిన్ను, భజే = సేవించుచున్నాను.

(*b*) భగవతి = ఓదేవీ, గుణ ... వామ్ - (వ్యాకరణ శాస్త్ర పక్షమున) గుణ = అదేఙ్ రూప మయిన గుణములవలనను - దీర్ఘ = రెండుమాత్రల పరిమాణముగల దీర్ఘములవలనను - భావ =భావప్రత్యయము లయిన ఘఞాదులవలనను - ఉద్భవామ్ = పుట్టువు కల దైన - సంతతిమ్ = సుబంత తిఙంత రూప శబ్ద సమూహమును - (కాంచీపక్షమున - గుణ = దారముయొక్క - దీర్ఘ భావ = నిడుద తనమువలనమఱియు - ఉద్భవాం=పుట్టున దైన - సంతతిమ్=(శింజిత) పరంపరను

(కాంచి నిడుద మైనకొలఁదిని కింకిణులు ఎక్కువ-గానిచే శబ్దసంతతియు నెక్కువగా నుండును) - సందధానం = సమకూర్చునదియు - మహా శబ్ద నిష్పాదకమ్ = గొప్ప దయిన శబ్దప్రపంచమును నిర్మించునదియు (మెండయిన ధ్వనిని నిర్మించుచున్నదియు - మిక్కుటముగా మెూయునదియు)- నయిన - వ్యాక్రియా శాస్త్ర=శబ్ద వ్యుత్పాదనశాస్త్రమే - కాఞ్చీ కలాపమ్=మొలత్రాడనెడి యాభరణముగా - కటీ మణ్డలే = మొల చుట్టును - బిభ్రతీమ్ = ధరించినదానవును, తా ... న- తారా = (అశ్విన్యాది) నక్షత్రముల యొక్క - ఉదయ = పొడుపు చేతను - స్ఫూర్తి = మెఱు యుటచేతను - విభ్రాజమానేన = ప్రకాశించుచున్నదైన, జ్యోతిషా=జ్యోతిశ్శాస్త్రమే యనెడి - తార = మౌక్తిక శుద్ధిచేత ('తారో ముక్తాదిసంశుద్ధౌ') - ఉత్ అయ = ఉద్గత మయిన శుభము గలదైన ('అయః శుభావహోవిధిః' అమ.) - స్ఫూర్తి = మెఱయుటచేత - విద్యోతమానేన= ప్రకాశించుచున్న - హార దణ్డేన=ముత్యాల సరముతో (జ్యోతిశ్శాస్త్రము ముత్తెసరముగాఁగలిగి), విభ్రాజితామ్ = వెలుంగుచున్నదానవును, ఆత్మ...భ్యామ్ - (శాస్త్రపరముగా) - ఆత్మ = తన తన - పక్ష = ప్రతిజ్ఞాతమందు - అనురాగ = అభిమానముతో (ఓష్ఠపరముగా - తనతన పార్శ్వ మందు ఎఱుపుతో) - అన్వితాభ్యామ్ = కూడుకొన్నట్టి - ఉభాభ్యామ్=రెండయిన - పూర్వ ఉత్తరాభ్యామ్=పూర్వపక్షమును ఉత్తరపక్షము ననెడి - మహాదర్శనాభ్యామ్=గొప్పశాస్త్రము లతో (ఓష్ఠపరముగా - క్రిందిదియు మీఁదిదియు మిక్కిలి దర్శనీయములును అయినవానితో) ప్రతిష్ఠాపిత = చేయఁబడిన - ఓష్ఠ ప్రవాళామ్ = చిగుళ్లవంటి పెదవులు కలదానవును,

పర...ధాత్ - పరబ్రహ్మ = పరమాత్మయే - అర్థ = ప్రతిపాద్యము - కర్మ అర్థ = కర్మ యే ప్రతిపాద్యము - అనెడి - భేదాత్ = వేఱిమిచేత - స్వం శరీరమ్ = తన స్వరూపమును - ద్విధా విధాయ = (పూర్వమీమాంసయు ఉత్తరమీమాంసయు అని) రెండుగా చేసికొని - పరామ్ = ఉత్కృష్ట మయిన - ప్రతిష్ఠామ్ = నిలుకడను - ప్రాప్తయా = పొందినదైన - చారు మీమాంసయా = అందంపు మీమాంసా శాస్త్ర మనెడి - మాంసలేన = పుష్ట మయిన - ఊరు యుగ్మేన = తొడల ద్వయముచేత - సమ్యక్ = చక్కఁగా - పర = ప్రతివాదులయొక్క - ఆచ్ఛాదనమ్ = తిరస్కారమును (ఊరు పరముగా - పర = ఉత్కృష్ట మయిన - ఆచ్ఛాదనమ్= వస్త్రమును) - లాలయన్తీమ్ = అంగీకరించినదానవును, ముహుః = మాటిమాటికి - పత్త్రిదానే= (శాస్త్రపరముగా) - పత్త్రిక నిచ్చుటయందు అనఁగా పక్షావలంబనమందు (దంతపరముగా - తాం బూల దళములను కొఱుకుటయందు 'దానం గజమదే త్యాగే పాలన చ్ఛేద శుద్ధిషు' మేది.) — గుణ ...ఢిమ్ - గుణ = ప్రతిభాదిగుణములతో - అన్విత = కూడుకొన్న వాదులయొక్క - పూగ = సముదాయమును ('పూగః క్రముక బృన్దయోః' అమ.) - అసకృత్ = పలుమాఱు - ఖణ్డన = ఓడించుటయందు - ప్రౌఢిమ్ = నేర్పును (దంతపరముగా గుణాన్విత=రసాఢ్య మైన - పూగ = పోఁకలను - అసకృత్ - ఖణ్డన = కొఱుకుటయందు - ప్రౌఢిమ్ = శక్తిని) - ఆధోకమానేన = పొందుచున్న-దన్తాత్మనా = దంతరూపమయిన - తర్క తన్త్రేణ = తర్కశాస్త్రముచేత

['తన్త్రం కుటుమ్బకృత్యే స్యా త్సిద్ధాన్తే చౌషధోత్తమే
ప్రధానే తన్తువాయే చ శాస్త్రభేదే పరిచ్ఛదే...' మేది.]-

కామపి = అనిర్వచనీయమైన - అభిఖ్యామ్ = శోభను ('అభిఖ్యా నామ శోభయోః' అమ.) - ముఖే=వక్త్రమందు - ఖ్యాపయన్తీమ్=ప్రకటించుచున్నదానవును, అగు - త్వామ్=నిన్ను, దేవి=

దేవీ, అహమ్ = నేను, వన్దేతమామ్=మిక్కిలి స్తుతించుచున్నాను ('వది అభివాదన స్తుతోః' -

(c) ద్రుహిణ గృహిణి = బ్రహ్మదేవుని యిల్లాలా ('ధాతాఽబ్జయోని ర్ద్రుహిణో విరిఞ్చి - కమలాసనః' అమ.), మత్స్య...తమ్ = మత్స్యపురాణము పద్మపురాణము లోనగు పదియునెనిమిది పేర్కొనఁబడినదైన - పురాణమ్ = పంచలక్షణము ('పురాణం పఞ్చ లక్షణమ్' అమ.

('సర్గ శ్చ ప్రతి సర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్.' అమ. అధిః

మత్స్య...తమ్ = మత్స్యరేఖ పద్మరేఖ లోనగు (వానిచే) గుఱుతుగలదైన - త్వదీయం పదపద్మమ్ = నీహస్తకమలము; నిర్మలం ధర్మ శాస్త్రమ్ = పరిశుద్ధ మయిన స్మృతి ('ధర్మశాస్త్రం తు వై స్మృతిః' మను.) - తావకమ్ = నీదయిన - నిర్మలమ్=పరిశుద్ధమైన - శిరః = మూర్ధ - ఓంక్రియా మన్త్రిరాజస్య=మంత్రశ్రేష్ఠమైన ప్రణవముయొక్క ('ఓంకార ప్రణవౌ సమౌ' అమః దళాభ్యామ్ = (దేవనాగరలిపింబట్టి చెప్పుచున్నాఁడు) ఇరుఖండములచేత - భ్రువౌ = కనుబొలును - తద్బిన్దునా = దానియనుస్వారముచేత - ఫాలభాగే = లలాటప్రదేశమందు - చిత్రకమ్ = తిలకమును ('చిత్రకం తిలకే నా తు వ్యాఘ్రభి చ్ఛఞ్చపాతిషు' మేది.) - త దర్ధేన్దునా = దాని యర్ధచంద్రునిచేత (అర్ధచంద్రాకార మయినభాగముచేత) - విపఞ్చ్యా = వీణయొక్క ('వీణా తు వల్లకీ విపఞ్చీ' అమ.) - కల = అవ్యక్తమధురమయిన - క్వాణనా = వాయించుట కైన - కోణ = కొడు పయిన ('కోణో వీణాది వాదనమ్' అమ.) - చాపమ్ = వింటిని - విరిఞ్చిః= బ్రహ్మ - స్వయమ్ = స్వయముగా - ప్రణిన్యే = చేసినాఁడు.

(d) భారతి=ఓసరస్వతీ, అసాధారణాత్ = అసామాన్య మయిన - త్వత్ ప్రసాదాత్ = నీ యనుగ్రహమువలన - మమ = నాకు - సత్ కృపా ఆధార భూతమ్ = ఉత్కృష్ట మయిన నీకరుణయే ఆధారముగాఁ గలదైన - ప్రభూతమ్ = మెండయిన - శుభమ్ = మంగళము - భవతు = అగును గాక. సోమసిద్ధాన్తకాన్త ఆననాయై = సోమ సిద్ధాంతమే అనఁగా - కాపాలిక దర్శనమే (చంద్రునియొక్క అఖండరూపమే) సుందర మయిన ముఖము గాఁగల దానికి, తే=నీకు, నమః= నమస్కారము, శూన్యతావాద ఆత్మ మధ్య అన్వితాయై = శూన్యమే ఆత్మ యనెడి మాధ్యమిక బౌద్ధులవాదమే (నిఃస్వరూపతావాదమే - నాస్తివాదమే - లే దనుటయే) తనయొక్క (నడుము యొక్క) స్వరూపముగాఁగల (శూన్య...త్మ = సన్నపాటియనుట) నడుముతో కూడుకొన్నదానికి - నమః; సు విజ్ఞాన సామస్త్య = నిరాకార విజ్ఞానమాత్రముయొక్క సాకల్యమే ఆత్మ యనెడి యోగాచారమతమే [మంచి(=అర్థ విశిష్ట మయిన) సకలజ్ఞానము గలదైన] హృత్ పఙ్కజాయై = హృదయ కమలముగాఁ గలదానికి - తే - నమః. సాకారతాసిద్ధి భూమ్నే - సాకారతా= (జ్ఞానములు నీలపీతాద్యాకారములు కలిగియుండుట సాకారత - ఇది సౌత్రాంతికుల మతము) సాకారతయొక్క నిష్పత్తియొక్క (శోభనాకారత్వ ప్రాప్తియొక్క) అతిశయమై యున్న దానికి - తే - నమః - అస్తు=కలుగుఁగాక (నిన్ను నమస్కరించుచున్నా ననుట), కైవల్య = మోక్షము (అనఁగా తాను కేవల పర మాత్మగా నుండుట) అనెడి - కల్యాణ = మంగళమునకు సీమ్నే =ప్రదేశ మయినదానికి (కైవల్యము నొసంగుదానికి)...సర్వ...యై = ఎల్ల దేవతల శిఖా రత్నముల వరుసల యొఱ్ఱని కాంతి సమూహము లనెడి (బాల ఆతప = ) లే యెండచేత ప్రకాశించుచున్న (వికసించిన యనియు) చరణ సరోజములు కలదానికి..., శరణ్యే = రక్షణకో

క్షేమయినదానా (రక్షించుదానా)..., వరేణ్యే=సర్వోత్కృష్టురాలా..., శర్మదాయై = సుఖమ్ము దానికి..., నర్మ దాయై = క్రీడ నొసంగుదానికి..., శాశ్వతాయై= నిత్యమైనదానికి..., శ్రుతాయై = ప్రసిద్ధురాలికి..., శారదాయై = సరస్వతికి...

ఇందు రూపకములు శ్లిష్టములును అశ్లిష్టములును గలవు, సుబోధములు. దండకలక్షణము:— అప్పకవి ఒకసూర్యగణముపైఁ గాని, ఆదినుండియే గాని ఇచ్చ వచ్చి నన్ని తగణములు దండక లక్షణముగా చెప్పినాఁడు. అది యిట సరిపడ లేదు. గంగాదాసుఁడు ఛందోమంజరియందు నయుగము ప ఏడు రేఫములు చండవృష్టిప్రపాతనామక దండక పాదముగాఁ జెప్పినాఁడు:— 'యది నయుగళం తత స్సప్త రేఫా స్తదా చణ్డవృష్టిప్రపాతో భవే ద్దణ్డకః.' ఇట రేఫసంఖ్య తప్ప కడమ లక్షణము సరిపడియున్నది. చతుర్థపాదమందు లక్షణ ఘటనార్థమై 'సదా' శబ్దము పూర్వ ముద్రణాదులలో లేనిది చేర్పఁబడినది.

వ. అని ప్రస్తుతించిన. 139

—* భారతి సాక్షాత్కరించుట *—

మ. జగతీనాథుని ముందట న్నిలిచె సాక్షాత్కారముం బొంది యా
జగ దేక స్తవనీయ శారద శరచ్చంద్రాత పాలోకము
న్నగవుం దేటయు దివ్య దేహ రుచియుః సమ్మేళనం బొంది చె
ల్వాగు చుండఁగ గరుణా పరాయణత న య్యాస్థాన మధ్యంబునన్. 140

ఆ జగత్ ఏక స్తవనీయ = లోకములకు ప్రధానముగా పొగడఁదగిన దైన యా - శారద= సరస్వతీదేవి, శరత్ చంద్ర ఆతప ఆలోకముక = శరత్కాల చంద్రుని వెలుఁగువలె ప్రసన్నమైన (విశద మైన - సానుగ్రహమైన యనియు) చూపును. ('శరచ్చంద్రాతపమువలె ప్రసన్నమైన యాలోకము'అని విగ్రహించి మధ్యమపదలోపిసమాసము చేసికొనవలయును-శరచ్చంద్రికవంటి బోల్చుట చేత పూర్ణానుగ్రహమును వెదచల్లుచున్న దని భా.), నగవుం దేటయుఁ = (మంద) హాస నైర్మల్యంబును, దివ్యదేహ రుచియుః = ఉత్తమ మయిన దేహ కాంతియు, సమ్మేళనః పొంది (లేక - సమ్మేళనంబు ఒంది) = కూడి యొప్పమై, చెల్వాగు చుండఁగ = సొంపారు చుండఁగా, కరుణా పరాయణతః = కృపా తత్పరతచేత, ఆ యాస్థాన మధ్యంబునః = ఆ సభ నడుమను, సాక్షాత్కారముః పొంది-ప్రత్యక్షమై, నిలిచెః.— ఈ యాలోకాదులు శ్వేతము లని ప్రసిద్ధము:

'శుభ్రాణి భారతీ ధర్మ శే షేశ తరు శేర్ణవః...
రేణుః కేతక ఖర్జూర్యోః కటాక్షా హాస భస్మనీ.' కా. క. ల.

—* ఆశ్వాసాంతము *—

శా. లాటీ చిత్త సరో మరాళ, కుకురీ లావణ్య లోలాత్మ, క
ర్ణాటీ నృత్త్య కళా విలోకన సమారంభ ప్రియంభావుకా,
భోటీ నేత్ర చకోర చంద్ర, మగధీ పుష్పాస్త్ర, చోళీ కుచా
ఘాట స్థాపిత మన్మ థాంక, కుహళీ గాఢాంకపాళి ప్రియా. 141

లాటీ చిత్త సరః మరాళ = లాటదేశస్త్రీల మనస్సనెడి కొలనికి హంస వైన వాఁడా (తనిని వారు అనురాగముతో తలపోయు చుందు రనుట - రూపకము), కుకురీ లావణ్య లోల

ఆత్మ = కుకుర దేశస్త్రీల జగమెఱుంగునందు ఆసగలదైన ('లోల శ్చల సతృష్ణయోః' అమ.) - హృదయము కలవాఁడా ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.) - కుకురయువతుల లావణ్యమును మెచ్చినవాఁ డనుట), కర్ణా...కా=కర్ణాటాంగనల నాట్యమందలి నేర్పును చూచుట యనెడి వ్యాపారముచేత ప్రియుఁడ వగుచున్నవాఁడా, భోటీ...౦ద్ర=భోట దేశాంగనల।కన్ను లనెడి వెన్నెల పులుఁగులకు చంద్రుఁడ వయిన వాఁడా (రూపకము), మగధీ పుష్పాస్త్ర = మగధయువతులకు మదనుఁడా (రూపకము), చోళీ...౦క=చోళస్త్రీల పాలిండ్ల యొక్క ప్రాంతములందు ('అఘాట।స్తు ఘటో౽వధిః। అన్తేఽవసానం సీమా చ మర్యాదాఽపి చ సీమని' హేమ.) ఉంపఁబడిన (నఖక్షతాది) మదన చిహ్నములు కలవాఁడా, కుహ ... యా = కుహాళవనితలయొక్క - బిగు వయిన ('గాఢ బాఢ దృఢాని చ' అమ.) కవుంగిలింత ('అఙ్కపా పరీరమ్భే ధాత్రీ వేదికయోః స్త్రియామ్.' మేది.) ప్రియముగాఁ గలవాఁడా; (సింగమంత్రీ).

క. మందార మంజరీ మక। రంద సుధా మాధురీ ధురా ధుర్య వచ
స్సందర్భ, రూప రేఖా। కందర్పా, పాండ్యరాజ గజ పంచాస్యా. 142

మందా...ర్భ - దేవవృక్షముయొక్క పూరెమ్మల తేనెయొక్కయు అమృతముయొక్కయు మాధుర్యముయొక్క (ధూః=) భారముయొక్క మోపరులైన మాటల కూర్పు కలవాఁడా (అతి మధురభాషీ యనుట), రూప రేఖా కందర్పా = ఆకార విలాసములయందు మన్మథుఁడా (రూపకము), పాండ్య...పాండ్యరా జనెడి యేనుఁగునకు సింహమా (రూపకము.)

మాలిని.

వర చరణ సరోజ ధ్యాన నిష్ఠా గరిష్ఠా,
ధరణి భర దిధీ క్షాధఃకృ తాహార్య వర్యా,
తరుణ కమల నేత్రా, తల్లమాంబా సుపుత్రా,
విరహిత మద శంకా, వీరనారాయణాంకా. 143

వర...ష్ఠా = శివుని పాదకమలముల ధ్యానమందలి రూఢిచే మిక్కిలి యుత్కృష్టుఁడా, ధర...ర్యా - భూమియొక్క భారమును వహించు కోరికయందు క్రిందివిగాఁ జేయఁబడినట్టి పర్వతశ్రేష్ఠములు కలవాఁడా (కులపర్వతములకన్న దృఢముగా భూభారమును వహించువాఁడా-భూమిని చక్కఁగా పాలించువాఁడా యనుట), తరుణ కమల నేత్రా = వికసిల్లిన తామరల వంటి నేత్రములు కలవాఁడా, ... విరహిత మద శంకా = త్యజింపఁబడిన గర్వము భయమును కలవాఁడా (భయ గర్వములు లేనివాఁడా యనుట), వీరనారాయణ అంకా = వీరనారాయణ (వీరులలో నారాయణుఁడు) అనెడు బిరుదు కలవాఁడా (ఇది వేమరాజుల బిరుదు).

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర
సకల విద్యాసనాథ శ్రీనాథప్రణీతం బైనశృంగారనైషధ
కావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

గద్యార్థము ప్రథమాశ్వాసాంతమునం బోలె.

---